తదనంతరమున తమనెళవునకును దారి నడచి రాగాను।
ముదమున శ్రీహరి ముకుందయచునును మొగిబల్కుచు నడవగను॥

మహిషము జచ్చెను నాళంభీయను మహారణ్య మధ్యమున।
సహచరు లందరు త్రవ్వుచు గుంటను సమాధినిడిరి ముదమున॥

శిలనొక్కటినట స్థాపన జేసియు సిందూరంబును బూసి।
మలమోచనమగు పేరునుబెట్టిరి మసోబయనియును వెలసి॥ ౧౨౮.

అళకాపురిలో నలుగురుజేరగ నచ్చటి ప్రజలునుగూడి।
మెలగుచు వచ్చిరి యెదుర్కొనుటకై మేలనుచును గొనియాడి॥

శ్రీమాన్ విచిత్ర శతావధాని, విద్వచ్ఛిరోమణి మహాభాగవత సలక్షణ కృష్ణ యజుర్వేద ఘనపాఠి, హరిదాస బాళేగద్దెకట్టె,
శ్రీమాన్ లక్ష్మణాచార్య కృత కృతిప్రశంస.

శ్లో॥ గ్రథితేయం బాలకృష్ణదాసేన లలితైః పదైః।
భక్తమాలా విష్ణుభక్త చిత్రచారిత్ర బోధినీ। ౧॥
మహాకవి కృత గ్రంథప్రౌఢీమానం శ్రయత్యహో।
ఇతి శ్రీభగవద్గీతా లక్ష్మణార్యోఽనుమన్యతే॥ ౨॥

ముక్తబాయి యొక పెనము కెఱకు నటు ముదమునతా బోవగను।
సక్తచిత్తుడై విసోబసాటియు సరగుననటు వచ్చుచును॥ ౧౩౧.

ఎటుబోయెదవని యడుగగనామెయు నిటకుమ్మరి గృహమునను।
పటుతరమగు నొకపెనము దెచ్చుటకు బరతెంచెద ననగాను॥ ౧౩౨.

యతిపుత్రులరై యుండేమీకును నవనిజాతి లేదనుచు।
అతులితముగనా మంటిపాత్రయును నయగ లభింపదనుచు॥

---

*గ్రోటిక - గ్రామము.

కరముల నామెను గొట్టుచునప్పుడు కణగి కుమ్మరిని గనుచు।
ఇరవుగ ముక్తకు కుండల నీయకు మిచ్చిన చెరుపగు ననుచు॥౧౩౪.
అప్పుపైకమును నిమ్మని యడిగెద నాలస్యము లేకయును।
ఒప్పుగ కుమ్మరి భయంబు నొందుచు నూరకుండె నయ్యెడను॥౧౩౫.
కుమ్మరి యింటికి ముక్తాబాయియు గోడున నేడ్చుచు చనగన్।
సమ్మతియగునొక పాత్రంబిమ్మన సరగ లేదు పొమ్మనగన్॥ ౧౩౬.
ముద్దియ యింటికి మళ్ళెను మనమున ముదము లేక నయ్యెడను।
సద్దుజేయుచును రోదన చేయగ సరగవచ్చె జ్ఞానుడును॥ ౧౩౭.
ఏమి హేతువని యడుగగ నామెయు నెరిగించెను సంగతియు।
ప్రేమను నతడనె నట్టుల జేయుము పెంపుగ వీపుననని యు॥ ౧౩౮.
అనుచు బల్కుచును జ్ఞానదేవుడును నగ్ని వేల్చె యోగముచే।
ఘనముగ కండ్లను ముక్కున నోటను కనబడి జ్వాలలు పొలిచె॥
నేలబరుండుచు జ్ఞానుడు వీపున నెరినట్టుల జేయుమను।
మేలని యనుచును ముక్తాబాయియు చాలజేసె నట్టులను॥ ౧౪౦.
యోగాగ్నినియా జ్ఞానదేవుడును నూహను శాంతిగ చేసెన్।
వేగమె కాంక్షను నివృత్తినాథుడు వెలయ భుజింపను దరిసెన్॥
హరికర్పించియు నందరుగలసియు నారగించు చుండగను।
వెరచి విసోబా వెలుపల నుండియు వింతనంత జూచుచును॥౧౪౧.
అనుతాపముతో హరిహరి యనుచును నతిపాపుడ నేననుచు।
వినుతి యొనర్చుచు వచ్చెను శరణని వే ప్రసాద మిమ్మనుచు॥ ౧౪౩.
ఖేచరుడాయని కఠినోక్తిగ మరి క్రియ జ్ఞానుడు బలుకగను।
వాచక మిట్టుల వచ్చిన వెనుకను వాడు తెలివి బొందిమును॥౧౪౪.
బలవంతంబుగ ప్రసాదమతనిది భక్షించెను నెయ్యమున।
కలిమిని నీవే గతియని యాతని కాళ్ళబట్టి శరణమన॥ ౧౪౫.
కృపగల దృష్టిని జ్ఞానుడు చూడగ కృతార్థుడయ్యె పిదపను।
విపులజ్ఞానియై విసోబ సాటియు విసోబ ఖేచరు డనను॥ ౧౪౬.

జ్ఞానదేవుడును చేసినమహిమలు ఘనప్రసిద్ధి నొందగను।
వీనులవినుచును వచ్చుచునుండిరి వీహితసేవ జేయుచును॥ ౧౪౬.

---

సిద్ధయోగియగు చాంగదేవుడును శ్రీగోదా తీరమున।
ఇద్ధరబుట్టి పురందరాంశమున నెలమిని గారాబమున॥ ౧౪౭.
నవ్య సమాధిని నుండెవేయియును నన్నూరేండ్లీ ధరను।
భవ్యశిష్యులను నాతడుంచుకొని బహుతీర్థము లరయుచును।
జ్ఞానదేవుని ఘనమగు మహిమల గారాబముతో వినుచు।
మానుగజ్ఞానము నర్థించుటకై మనసునతా నటుదలచు॥ ౧౫౦.
బిలిచిశిష్యులం దొక్కని నప్పుడు పెంపుగ యోచనజేయు
వలగొని పత్రిక ముందుగబంపుట వసుధను మేలగునని యు॥ ౧౫౧.
కాకిత మొక్కటి కలమునందుకొని ఘనపత్రిక వ్రాయుటకు।
జోకను నతనికి చిరంజీవియని నూటికి వ్రాసిన మనకు॥ ౧౫౨.
ఆచార్యత్వం బబ్బదతనికని యాలోచించుచు మదిని।
ప్రాచీనుండగు తీర్థరూపుడని బలుకగ దగదతనికిని॥ ౧౫౩.
ఏమియు దోపక కాకితంబునను నేమియు వ్రాయకమడిచె।
నేమము తోడను శిష్యునకిచ్చుచు చెలిమి నలకపురికని చె॥ ౧౫౪.
జ్ఞానదేవు సత్కారములనిమ్మని ఖండితముగ జెప్పగను।
వీనుల వినియా శిష్యుడువెళ్ళెను విహితుడు జ్ఞానుకడకును॥ ౧౫౫.
చీటిని బంపెను చాంగదేవుడని చేతులనిడ జ్ఞానుండు।
వాటంబగునటు విప్పిచూడగను వట్టిపత్రిక గనుచుండు॥ ౧౫౬.
విశేష కాలము వ్యర్థముగానే విభూతి నుండెను ననుచు।
అశేష సిద్ధులు నాత్మప్రాప్తిని నందజేయవని తలచు॥ ౧౫౭.
కాకిత మొక్కటి చేతనందుకొని కరుణను పత్రికవ్రాసె।
ప్రాకటంబుగను పరబ్రహ్మమే పరిపూర్ణంబై వెలసె॥ ౧౫౮.

చైతన్యమునకు చిన్నపెద్దలను సంజ్ఞలిలను లేవనియు।
వైతర్క్యంబుగ నింతయంతయని వచింపగాదగ దనియు॥ ౧౫౯.
మేఘవర్జితపు గగనము దృష్టికి మేరలేక యున్నట్లు।
రాఘవుడెచ్చట సచ్చిత్సుఖమై రంజిలు గనుగొనునట్లు॥ ౧౬౦.
ఇట్టియాత్మను నవిద్యమాయలును నెరుగనీక చేయగను।
బెట్టిదంబుగా భ్రమయు జీవునకు పెరుగజేయును విద్యయును॥౧౬౧.
విశ్వబీజమై యుండెడివస్తువు వెలసియున్న దీయెడను।
శశ్వదస్వతంత్ర వివేకంబున సరగచూడు మార్గమును॥ ౧౬౨.
ఈవిధముగనా పత్రికవ్రాసియు నిచ్చెను చారుని కడను।
సేవకుడప్పుడు చాంగదేవునకు జేర్చెదాని నయమునను॥ ౧౬౩.
పత్రిక చూడగ భావములోపల పరతత్వము భాసిల్లె।
చిత్రంబిదియని చాంగుడుజ్ఞానుని సేవింపగ విలసిల్లె॥ ౧౬౪.
వ్యాఘ్రము నెక్కియు పాముచౌకుతో వచ్చుచుండె చాంగుడును।
శీఘ్రముగానొక శిష్యుని బంపెను చెపుమని దావచ్చుటను॥ ౧౬౫.
జ్ఞానదేవుడొక యడ్డగోడపై తానటు కూర్చుండగను।
వీనులకింపుగ చారుడుజెప్పెను వెలయనతని రాకయును॥ ౧౬౬.
యోగశ్రేష్ఠు నెదుర్కొనుటకుగా నాగిగోడను చనుమనిన।
వేగముగానది చాంగునివద్దను వెళ్ళెను సఫలముగానన॥ ౧౬౭.
గోడమీదనా జ్ఞానదేవుడును కూర్చుండగ జూచుచును।
వేడుక లలరగ సిగ్గున చాంగుడు విడిచిదిగెను వ్యాఘ్రమును॥
అచేతనంబగు గోడను నడపిన యమలుడు జ్ఞానునిముందు।
సచేతనంబగు వ్యాఘ్రము నడపుట చతురము గాదని గందు॥
సాగిల బడుచును దండముబెట్టగ సరగలేపె జ్ఞానుడును।
బాగుగ నిరువురు నటనొకవృక్షము ప్రక్కను కూర్చుండుచును॥
కొన్నిమాటలను బల్కుచునిద్దరు గూడియింటి కేగగను।
పన్నుగముక్తా బాయియునప్పుడు వడిస్నానము చేయగను॥ ౧౭౧.

జూచుచు చాంగుడు మళ్ళిపోవగను నూటిగనన సావాయును।
కాచెడిచెట్టై యుండియు గురువును గనలేదిందాకయును॥ ౧౭౨.

అదివిని చాంగుడు దగ్గరకరిగియు ననువున మ్రొక్కుచునడిగెన్।
విదితంబిదినీ కెట్టులనయ్యెను వేగమెచెపుమని యడిగెన్॥ ౧౭౩.

మానిని యనెనే స్నానము చేయగ మరలివెళ్ళితివి నీవు।
బూనినయెడలను గురువాశ్రయణము పుటుకవికృతి గనబోవు॥

గోసమూహములు కారడవులలో గురుతుగ తిరుగుచు నుండు।
వేసెడి బట్టలు లేకయుండినను వికారములు లేకుండు॥ ౧౭౫.

అటులనెనేనును పశుసమానయని యరయనుంటివి యెడను।
పటుతరముగ నపూర్ణజ్ఞానము బట్టకుంటివని యనెను॥ ౧౭౬.

యోగివరుండీ వాక్యంబులవిని యూహను జ్ఞానుని యెడను।
సాగిలబడియును సచ్చరణంబుల సరగుననటు బట్టగను॥ ౧౭౭.

కృపగల దృష్టిని కరముశిరముపై గీల్కొని జ్ఞానుండుంచెన్।
అపార కరుణను తారక మంత్రము నతనికి నుపదేశించెన్॥ ౧౭౮.

భగవదనుభవము పొందియునాతడు ప్రపత్తినిష్ఠను నుండెన్।
అగణిత సుఖమును బొందుచు నాతడు నతివిశ్రాంతిని నుండెన్॥

జ్ఞానదేవుడును కరుణను జనులకు గావించుచు హరిభక్తిన్।
మానుగ పండరి యాత్రకువెళ్ళియు మాధవుగాంచెను సక్తిన్॥

నామదేవుతోడను గూడుకొనుచు నయముగ యాత్రలజేసెన్।
ప్రేమతోడ హరి పాటలబాడుచు పెంపుగాను తగపెలసెన్॥౧౮౧.

జగదుద్ధారణ జేసివెలింగెను సద్గురు జ్ఞానుండిలను।
సొగసు చరిత్రము చదివిన వినినను సుఖము గల్గునిద్ధరను॥ ౧౮౨.

ఇలలో శ్రీహరి దాసదాసులకు నిష్ట దాసదాసుడగు।
వెలసిన దాసుడు బాలకృష్ణుని విహిత కరుణచేయదగు॥ ౧౮౩.

---

## కూ ర్మ దా సు చ రి త్ర ము.

ప్రతిష్ఠానియను పట్టణమునగల బ్రాహ్మణ దంపతులకును।
సుతుడుబుట్టె కరచరణహీనుడై సుందరముగ వెలయగను॥ ౧.
దరిద్ర దశచే తల్లడిల్లుచును తలిదండ్రులు బాలకుని।
బరువని దలపక పెంచిరి యప్పుడు ప్రజబిలచిరి కూర్ముడని॥ ౨.
పెద్దగబెరుగగ భగవద్భక్తియు పెరుగుచుండెను తనకును।
సద్దులేక తగు వయస్సురాగా సలిపిరి యుపనయనమును॥ ౩.
హరినామంబును నాతడుబల్కుచు నంగహీనుడై యుండగా।
పురజనులందరు భోజన మతనికి పొందుగ నడుపుచు నుండగా॥ ౪.
కొంతకాలమున కవ్వల వచ్చిరి కొందరు హరి దాసులును।
పంతము తోడను పండరికరుగుచు పాడుచు కథ జేయగను॥ ౫.
విని హరికథలును కూర్మదాసుడును వెళ్ళగోరె పండరికి।
మనమునప్రీతియు నారాయణుపై మఱిమఱి గల్గెనతనికి॥ ౬.
హరిదాసుల గని యార్తినిబలికెను నచటికి వచ్చెద ననుచు।
పరుసను వారలు కరచరణంబులు విరహితుడగుటను గనుచు॥ ౭.
నిండుగ ద్రవ్యము నీకుండినయెడ నీరజనాభుని సేవగా।
పండరి యందున బొందెదవనుచును పదపడి వెళ్ళిరి త్రోవగా॥ ౮.
కూర్మదాసుడును దుఃఖముతోడను కూర్చుండియు మనమునను।
వేర్మిని పండరి కరుగకజన్మము వెలయదు పుణ్యంబునను॥ ౯.
నరక వ్యథలను బొందుచునెప్పుడు తిరుగుచు బహుయోనులను।
అరమరలేక దేహంబిప్పుడు నవచితముగ గలిగెనను॥ ౧౦.
తరుణోపాయము దప్పినయెడలను దారియేది లేదనుచు।
గురుతుగ కూర్ముడు దోగాడుచుమరి కోసుదూర మటుచనుచు॥ ౧౧.
అస్తమయానమగు పర్యంతంబును నాయాసమున చనగను।
స్వస్థంబగునటు చూచెనచ్చటను వరమారుతి కోవెలను॥ ౧౨.

ఆకలి దప్పుల తొందరబొందుచు హరిశ్రీ కృష్ణా యనుచు।
పోకడ లేకయు పొంతను జేరితీ పూర్ణదయా కరయనుచు॥ ౧౩.
తల్లివి తండ్రివి దైవము నీవని తానటు ప్రార్థింపగను।
ఉల్లమలరగను వచ్చెనుప్రియమున నురగశయను డటుగాను॥
విప్రవేషమున వ్యాపారంబును విపులముగా చేయుతరిన్।
అప్రమేయుడగు హరియునడిగెను నలసినీవు బోవుతరిన్॥ ౧౪.
కులము నామమును జెప్పుమటన్నను కూర్ముడు దెలిపింపంగన్।
చలమున శ్రీహరి చక్కనయ్యెనని సంగము దొరికెను బాగన్॥ ౧౬.
బలికెను కూర్ముడు పదకరయుతునకు పాదహీనునగు నాకున్।
తెలివినిపొందిక యెట్లగుమరియును దెలుపుము నామము నాకున్॥
భగవంతుండును బలికెనునప్పుడు పరార్థముగనే నేను।
అగణిత ద్రవ్యము నార్జనజేసియు నప్పునప్పు లిచ్చుచును॥ ౧౮.
వ్యాపారము జేయుచు నూరూరొక వారము దిరుగుచునుందు।
ఏపారగనొక కోసుదూరమే నెలమిని నడుచుచునుందు॥ ౧౯.
దారిని నడిచెడు దీనులకెల్లను దప్పియు నాకలిదీర్చి।
భూరిదుకాణము పండరియందున పొత్తున గొప్పగనునిచి॥ ౨౦.
మెల్లమెల్లగను దారినడుచుచును మేలిమి వ్యాపారమును।
సల్లిలతంబుగతగ పండరికిని చనుచుందుదు నీయెడను॥ ౨౧.
విదితపరచెతన నామము ఖిస్తి విఠోబా వర్తకుడనియు।
సదయుడవగునీ సహవాసంబును చక్కగ గలిగెనుమరియు॥ ౨౨.
పండరిపురమున ప్రబలభక్తులును పాటింతురు హరిపేరున్।
నిండుప్రేమతో నీవటుబోవగ నిజమగు సాధన మమరున్॥ ౨౩.
అన్నముతానే వండిపెట్టిమరి యతనికి తాతినిపించెన్।
చెన్నుమీరనీ రీతిగజేయగ చెలగి యతడు నిద్రించెన్॥ ౨౪.
ఉదయముకాగా నుత్తమశ్లోకుడు నొప్పుగ మార్గముజూపెన్।
కుదురుగ హరియును అంతర్ధానము కూర్మిని బొందుచునొప్పెన్॥

కూర్మదాసుడును వెళ్ళుచునుండెను కోసుదవ్వు ప్రతిదినము।
పేర్మిని శ్రీహరి యిట్టిసేవలను పెంపుగజేసెను గనుము॥ ౨౬.
అడవుల యందును క్రొత్తపల్లెలను హరిదాసునకై జేయు।
పుడమిల హళమను గ్రామమునందును పొందుగజేర్చెను హరియు॥
ఏడుకోసుల దూరపుగ్రామమది యిలపండరి పురమునకు।
కూడిరియచ్చట హరిదాసులుతగ గుంపుగనట కరుగుటకు॥ ౨౮.
కనుగొనివారల కూర్మదాసుడును కనికరమున దానడుగు।
పనిబడియెచటికి బోయెదరనగను పండరిపురి కన చెలగు॥ ౨౯.
అనుచునువారలు జెప్పగకూర్ముడు నడిగెను వారింగనుచు।
బెనగొనియచ్చట విశేషమేమన ఘనయుత్సవ మటననుచు॥ ౩౦.
కార్తికశుద్ధైకాదశి యందును గరుడగమను దర్శనము।
పూర్తిగ జరుగును ప్రాణికోటులును బొందుచుంద్రు హరి పదము॥
ఈవచనంబును కూర్మదాసువిని యేమియొనర్చుదు ననుచు।
పోపుటకచటికి నెట్లగునుప్రొద్దు బోడవక ముందుగననుచు॥ ౩౨.
పదములులేకయు బోవుటకెట్లగు పండరినాథా యనుచు।
వదలని ప్రేమను వారిజనాభుని వదిరమ్మని తాదలచు॥ ౩౩.
నిరూపణంబును బంపెవారిచే నిక్కంబుగ నాదినము।
పరాత్పరుడ శ్రీపాండురంగహరి బహు దూరమునను గనుము॥ ౩౪.
పైటనుపురమున నున్నాడనునే ప్రయాసతో లహళకును।
నీటుగ వచ్చియు రేపటి దినమున నినుగనుగొన నెట్లగును॥ ౩౫.
కరచరణంబులు లేకయు బుట్టితి కావుననే నడుచుటకు।
ఇరవొందగనే యేడుదినంబులు నెలమిని బట్టునునాకు॥ ౩౬.
నిను సేవింపగ, నీరజనాభుడ నీవిందాకను వచ్చి।
కనులపండువుగ దర్శనమిచ్చియు కటాక్షమొసగుము మెచ్చి॥ ౩౭.
నిరుపంబిట్టుల కూర్ముడు బంపెను నెనరున హరికడకపుడు।
గరిమెను వారలు గైకొనివెళ్ళిరి కంజాక్షుని గుడికపుడు॥ ౩౮.

ప్రేమను శ్రీహరి పాటలు బాడుచు పెంపుగ ప్రదక్షిణమును।
రామా విఠ్ఠల రంగాయనుచును రాజిలతిరిగి పురమును॥ ౩౯.
మహాద్వారమున మంటపమందును మహనీయుడు నామడును।
విహారయుతుడై శ్రీహరిమహిమల విన్నవించు చుండెమును॥ ౪౦.
మాధవకృష్ణా మురారి యచ్యుత మధుసూదన హరియనుచు।
శ్రీధర కేశవ ముకుంద నరహరి శ్రితజన పోషకయనుచు॥ ౪౧.
నామోచ్చారణ మందరుచేయగ నయమగు ప్రేమనునుండగ।
కామజనకుడటు భక్తులజూచుచు కరుణవెలయతగ నుండగ॥ ౪౨.
ఈసమయంబున యాత్రాపరులట కెలమిని వచ్చిరి గనుము।
వేసరిల్లకయ పండరినాథుని విగ్రహమును గనిరి సుము॥ ౪౩.
చరణమ్ములపై శిరములనుంచియు సలిపిరి యాలింగనము।
సురుచిర ముఖమును జూడగవారును సూటిగబొందిరి సుఖము॥
దేవానీముఖ దృష్టిని జనులకు తీరు తాపమీ యెడలగ।
భావాతీతము బ్రహ్మసుఖంబును బయలై తగ విలసిల్లగ॥ ౪౪.
ఈవిధముగనా యాత్రాజనులును నెలమిని నుతిజేయుచును।
సావధానముగ కూర్మదాసుని సద్భావము జెప్పగను॥ ౪౬.
వినినమాత్రమున విఠ్ఠలరంగడు వీకలేచె తానపుడు।
అనువుగ నాముని జ్ఞానదేవుగని యప్పుడెబిలిచెను తోడు॥ ౪౭.
సాదరముగ తన హృదయభావమును చనువున వారికిజెప్పి।
పాదచారియై బోవ దొడంగెను భక్తుని జూడగనొప్పి॥ ౪౮.
తోడనునిరువురు గూడిరాగనట తోటనుగని మార్గమున।
వేడుకతో హరి దాహము గైకొన వెళ్ళెదనని త్వరితమున॥ ౪౯.
భక్తులనిరువుర బైటనుంచితా పరుగిడె తోటకులోన।
సక్తిగనచ్చట సావత మాలిని సరగజూచె ప్రేమమున॥ ౫౦.
పదపడినాతడు భావములోపల పండరినాథు నిడుచును।
చెదరక వెలుపలి చూపులేకదా జెందెపరవశ భావమును॥ ౫౧.

హరి తనకరముల నతనిశిరంబును నదుముచుండ నవ్వేళన్।
గురుతుతెలిసికొని కన్నులరెంటిని కూర్మిని తెరచెను మెల్లన్॥౫౨.
శ్యామలసుందర సుకుమారుండగు సర్వేశ్వరు డాగనుచు।
కోమలతులసీ మాల కిరీటపు ధామము గలవాడగుచు॥ ౫౩.
దివ్యవిగ్రహ దీప్తుండగుచును తేజరిల్లు చున్నపుడు।
భవ్యుడు సావతమాలి గాంచుచును బ్రహ్మసుఖంబున నెగడు॥౫౪.
శ్రీచరణములకు సాగిలిమ్రొక్కియు స్థిరముగ కూర్చుండుమనెన్।
*వాచఉచుండై యర్చించెదనన వనజాయత నేత్రుడనెన్॥ ౫౫.
పూజవడయుటకు సమయముకాదిది పొదిగికొనిరి దొంగలును।
ఓజతోడనను దాచుమిప్పుడిట నుచితంబగు తలమునను॥ ౫౬.
సావతవినియది శ్రీహరి నీవును సర్వవ్యాపిగ నుండన్।
నీవుదాగుటకు స్థానముదోపదు నిక్కంబుగనా యండన్॥ ౫౭.
పనిబడదనె హరి బ్రహ్మజ్ఞానము పరగుచోటు చూపుమనన్।
వినియది సావత కత్తి నందుకొని తనకడుపును చీలుకొనెన్॥౫౮.
హృదయ గృహంబున నుండుమనంగను హృషీకేశుడును నపుడు।
సదయుతుచేరెను నందులోపలను సమరసముగ భక్తుండు॥ ౫౯.
పొట్టమీద తగ బట్టగట్టుకొని పూర్ణానందు డగుచును।
దిట్టముగానిను విఠ్ఠల, విడువను తెలియుము లయమువరకును॥౬౦.
భగవంతుండును పలుకదొడంగెను బద్ధుడగుచు హృదయమున।
తెగగోసియు మరి తావునిచ్చితివి ధీరుడవై దేహమున॥ ౬౧.
ఉపకారమునకు ప్రత్యుపకారం బుచితంబుగ జేయుటకు।
నెపంబెద్దియును చూడనిచ్చుటను నెరిసత్యము పలుకుటకు॥ ౬౨.
భగవంతుండును సావతమాలియు బహుంతర మోదముతోను।
నిగమవాక్యముల నిట్టులబలుకుచు నిరుపమముగ నుండమును॥
గోపికయొక్కతె పెరుగునమ్ముకొని గోకులమందుండగను।
ఏపుమీరదా పెరుగోపెరుగని యెలమిబోవునన్యోడను॥ ౬౪.

---

*వాచరుచు - దీనవృత్తిని యాచించు.

వెన్నుడ దామోదర కృష్ణాయని విపుల ధ్వనిజేయుచును।
పన్నుగ బోవగకృష్ణుజూపుమని పడతి యొకతె యడుగగను॥ ౧౫.
గంపను దింపగ కృష్ణుడువచ్చెను కడవనుండితానపుడు।
సొంపుగనచ్చటి జనులందరుబహు చోద్యమొందగానపుడు॥ ౧౬.
అతులిత కార్యము లాచరించుచును నచ్యుతుడుండునుగనుక।
వితత వింతయే భక్తునికడుపున వెలసి యుండుటయుచనక॥ ౧౭.
వనమునకావల నుండిన నాముడు వనజాక్షుడురాకుండఁ।
మనసున దుఃఖము గొనుచు నెచ్చటికి మాధవుడేగెనొ జూడఁ॥ ౧౮.
తోటను హరికిని తొందరయేమో తోచదనుచు తాదలచెఁ।
మాటిమాటికిని దుఃఖముజూపుచు మనసునను కలవరించెఁ॥ ౧౯.
వనములోపలికి వెళ్ళియు వెదకెను వారిజనాభు నచటను।
ఘనుడగు సావత కూర్చుండగదా గనియాతని పదములను॥ ౨౦.
గట్టిగబట్టుకొనియు గోవిందుని కన్నులకును జూపుమను।
ఎట్టకేలకును నేడ్చుచు నుండగ నేపున సావతయటను॥ ౨౧.
భగవదనుభవ పరుడై మేనిని భావింపక దానుండఁ।
సొగసగుచిహ్నము జూచి నాముడును జొచ్చెహరి యితనియందఁ॥
అనువర్తనుడై యున్నవాడనుచు నప్పుడుగన్గొని తాను।
ఘనుడగు శ్రీహరి చింతనజేయుచు కరుణజూడు నాయెడను॥ ౨౩.
ఇష్టమునీకును నెట్లయ్యెనొకొ యీ సావతమాలికడఁ।
తుష్టిగనుండుట కేమినోచె చతుర్భుజుడని తాపొగడఁ॥ ౨౪.
సుందర ముఖమును చక్కగజూపుము సొంపుగాను బలుకుమని।
తొందరబొందుచు దీనతబల్కగ దురితహరుడు దీనిగని॥ ౨౫.
కరుణను బలికెను సావతమాలీ కడుపున వర్తించుచును।
నిరుపమ ప్రేమను నాముడుజూపగ నెరికరుణించు కొఱకును॥ ౨౬.
వెలుపలికిని నే వచ్చురీతిగా విశదపరచు నీవిపుడు।
పలుకుల సావత మాలిచాలవిని బలికెనాము గనియపుడు॥ ౨౭.

పండరినాథుడు ప్రబలప్రేమ నీపై నిడుకొని తానుండు।
ఖండితముగనీ కిప్పుడుదర్శన కాంక్షదీర్చు నాతండు॥ ౭౯.
పుణ్యరాశిచే పూర్వజన్మమున మొగిజేసిన ఫలమిదియు।
గణ్యత వెన్నుడు విహితుడై యుండుట కడుమేలుగదా యనియు॥
బలుకుచు సావత కడుపుమీదగల బట్టనపుడు తీయగను।
వెలుపలవచ్చెను పాండురంగడును విహితనాముడు గనగను॥ ౮౦.
భగవత్పదముల బాగుగ బట్టగ పండరిపతి బెంపారు।
ప్రగల్భుడగుచును పీతాంబరమున బాగదుడిచె కన్నీరు॥ ౮౧.
ఇంతవ్యసనమును నేలపొందితన నేమిసేయుదును నిటను।
సంతసమున నీసొగసుమోమునే చక్కగ గనలేకయును॥ ౮౨.
మహోత్తరంబగు మోహము గల్గును మనసు తపించుటచేతఁ।
విహితుండగు నిను గానని యెడలను వెత్తినగుదు నేనంతఁ॥ ౮౩.
జననీ జనకులు చుట్టమునీవె సర్వేశ్వర హరియనుచు।
వినుపింపంగను విఠ్ఠలరంగడు విని యాజ్ఞానుని జూచు॥ ౮౪.
నవ్వుచు జెప్పెను ముప్పురమిప్పుడు నడచెద మచటికిననుచు।
అవ్వలనుండెడు కూర్మదాసునెడ కందరు వెళ్ళిరిమనుచు॥ ౮౫.
అతిత్వరతో హరివెళ్ళగ కూర్మున కైనశుభ శకునములకు।
సతత సంతసము గొన హరి వెళ్ళగ సాగిమ్రొక్కె పదములకు॥ ౮౬.
భక్తుడు కూర్ముడు శ్రీహరి కృపకును పరమానందము జెందెఁ।
సక్తిగ శ్రీహరి చరణకమలముల చక్కబట్టి ముదమొందెఁ॥ ౮౭.
అచిత్తువలె సాగిల బడియుండగ హరితన కరములలేపెఁ।
విచారమొందక వరములనడుగుము వేగనిత్తునని జెప్పెఁ॥ ౮౮.
ఈవచనము విని కూర్ముడు ముదమున నెప్పుడుతన తావుననే।
సేవనీయుడై యుండవలయునని జెప్పెను హరియట్టులనే॥ ౮౯.
అడిగిన వరమును నప్పుడెయిచ్చియు హరివెళ్ళియు తామెచ్చెఁ।
విడువక రంగడు తనరూపంబట వెలయనపుడు గాన్పించెఁ॥ ౯౦.

ఆషాఢంబున కార్తీకంబున హరి యుత్సవమటు కాగా।
ఘోషముతోతగ వర్ధిలజనులును గొబ్బున వత్తురుబాగా॥ ౯౧.
పావన చరిత శ్రవణపఠనచే పవిత్రులగుదురు మెండు।
భావము నుంచును హరిభక్తులయెడ బాలకృష్ణదాసుండు॥ ౯౨.

---

రాకాకుమ్మరి చరిత్రము.

సారతమంబగు పండరిపురమున సతతని వాసుండగుచు।
నారాయణుపై నిశ్చలభక్తియు నయముగ గల్గియు మనుచు॥ ౧.
కులాల వృత్తిని కుండలజేయుచు గూడియుండె దాసతిని।
విలాసముగనట నతనికి నామము వెలసియుండె రాక యని॥ ౨.
భార్యను బంకాయనుచును బిలచిరి బాలిక వంకాయనుచు।
కార్యంబగునటు సంసారంబును గడపిరి ధర్మంబనుచు॥ 3.
కుండలనింటను జేసిచేసి మరి గుంపుగ నచ్చటనుంచగ।
మెండుగనొక కుండను మార్జాలము మెలగియు కూనలనుంచగ॥ ౪.
మేతకువెళ్ళగ మార్జాలంబును మించి గనక కూనలను।
చేతభాండములతోడ కూనలను జేర్చి యావమున నితను॥ ౫.
అగ్గిని బెట్టగా నావము లోపల నామార్జాలంబపుడు।
దిగ్గున గూయుచు దుఃఖము నొందుచు తిరుగుచు నిట్టటునుండు॥ ౬.
కూనల గానక గజిబిజినొందుట గురిజూచుచు కుమ్మరియు।
మేనుమరచితా గ్రమ్మగుచునచ్చట మెలగుచుండి దామరియు॥ ౭.
భార్యను బిలచియు పలికెను నప్పుడు పదపడి కూనలనేను।
కార్యకరంబుగ జూడక యుంచితి ఘనయావములోపలను॥ ౮.
మహామోసమిటు వచ్చెను మనకును మరేమిజేయుద మనుచు।
అహాయనంగను నాసతియేడ్చుచు నవనిబడెను హాయనుచు॥ ౯.
భార్యయు పతియును భగవంతుని మది భావించుచు నాదినము।
ఆర్యవంద్య శ్రీపాండురంగనీ యమల పదమె గతివినుము॥ ౧౦.

మును పాండవులను లాక్షాగృహమున బ్రోచిన కరణిని మరియు।
ఘనుడగు ప్రహ్లాదుని వహ్నివలనను కాచినకైవడి గనియు॥ ౧౧.
పిల్లికూనలను బ్రతికించుట యిది పెద్దకార్యమే నీకు।
సల్లలితంబుగ హరి, తొలగించుము సరగున పాపముమాకు॥ ౧౨.
అనుచు వేడగను నాతని భార్యయు నార్తినియనె పతితోను।
మనలప్రార్థనకు ముడుపుగట్టినను మంచిదగుననిబలుకగను॥ ౧౩.
మంచిదనుచు నాభక్తుండప్పుడు మార్జాలపు కూనలను।
కొంచమైనను కొదవలేకశ్రీ గోవిందుడు బ్రోచినను॥ ౧౪.
సంసారంబును విడిచెద నేనని శరణుజొచ్చితాహరికి।
హింసా కర్మము బొందకుండునటు లీశ బ్రోవుమని పలికి॥ ౧౫.
పండరినాథుని భక్తిని దలచుచు పడియుండిరి దంపతులు।
ఖండితంబుగా నన్నపానముల గానక మూడు దినములు॥ ౧౬.
ఆవమునందలి యగ్నియారగా నచ్చట కుండల నెల్లన్।
సావధానముగ నొక్కటొక్కటిగ చక్కదీయ విలసిల్లన్॥ ౧౭.
ఆవేళకునా మార్జాలంబును నమితధ్వని జేయగను।
దేవాధీశుని కృపచేకూనలు దిగ్గునకూతలిడగను॥ ౧౮.
దుముకుచు పోయెను కూనల కడకును తొందరగా పిల్లియును।
అమరికతోడను విష్ణుభక్తుడును నాతని భార్య వడిగను॥ ౧౯.
శ్రీహరి కరుణను జెందితిమనుచును చెలగిరి యానందమున।
బాహుళ్యంబుగ జనులటపొగడిరి పండరినాథు పురమున॥ ౨౦.
పతియు సతినిగని పలికెను మనకును ప్రార్థనయును సమకూరెన్।
హితపరులగుచును సంసారంబును నికపై విడువగ గోరెన్॥ ౨౧.
ఇటులం బలుకుచు నింటనునుండెడి నెల్లపదార్థంబులను।
చటులతరంబుగ బ్రాహ్మణజనులకు సంతసమున నిచ్చుచును॥ ౨౨.
గృహకృత్యంబుల విడుచుచుగోచిని క్రియతో చేకొనయటను।
సహచరియగు తన సతినిగూడుకొని శరణనె విష్ణువునకును॥ ౨౩.

ఘన కాననమున కాష్ఠచయంబుల గట్టుక శిరమున నుని పి।
అనువుగ వానిని నంగడివీధిని నమ్ముచు పైకము జేర్చి॥ ౨౪.
భక్తికి తాముసుపొందుపఱచుకొని పురాణపురుషు దలచుచు।
సక్తిగ నతిధికి సత్కారంబును సలుపు నెప్పుడటు మనుచు॥ ౨౫.
గుడ్డలవెదకును కౌపీనముకై కుట్రపువారి తెరువునన్।
అడ్డము లేకను బట్టచింపులను నటుగొన వారు మువసున్॥ ౨౬.
బిడాలముకై సంసారంబును విడిచితి పేటికి నీవు।
చెడిపడి యంగడి వీధులనుండెడు చెడుగుడ్డలనేరెదవు॥ ౨౭.
మంచిది పలుకని, రాకా యెంచుచు మహీసురు లెంగిలి యాకులను।
అంచితముగ తనకౌపీనముగా నప్పుడు ధరించుకొనెను। ౨౮.
ఈవిధంబుగా నతివిరక్తిచే నిరువురు నటనుండగను।
భావగమ్యమున పాండురంగడును పరమకృపనుజూపగను॥ ౨౯.
ఒకదినమాతని పుత్రియు నదిలో నుచితముగా మునుగగను।
అకలంకయునగు నాముని పుత్రియు నటు గుడ్డలు వుతుకగను॥ ౩౦.
ఉతికెడిచినుకులు వంకామీదను నూర్జితముగ బడుచుండన్।
సతితో కొంచెము తొలుకొమ్మనుచు సరగ జెప్పి తానుండన్॥ ౩౧.
మానస పూజయు ముగిసినవెనుకను మరివస్త్రముతుకుమనన్।
బూనుకనాముని పుత్రియుబల్కెను పుణ్యావతివినీవుగనన్॥ ౩౨.
కుమ్మరివృత్తిని శీలంబెందుకు కోరిక నీతండ్రియును।
సమ్మతముగ నాపిల్లికూనలకు సంసారము విడిచెమును॥ ౩౩.
కామిక భక్తుడు కష్టమునిచ్చెను కంజాక్షునకని యనగా।
ఆమెయు బల్కెను హరివిగ్రహమున కన్నము తినజేయంగా॥ ౩౪.
కష్టముగాదా హరికని మేమిటు కమలేశుని చింతించి।
పుష్టిగ కాష్ఠము చేకొని యడవిని తుష్టిగ విక్రయపరచి॥ ౩౫.
జీవనమునకయి చక్కబెట్టుకొని చెలగుచునుండెదమనుచు।
బోవదొడంగెను వంకానాముని పుత్రియు నచ్చటనునుచు॥ ౩౬.

బట్టలలుముకొని పోవుచునింటికి భక్తిని తన తండ్రిగని।
దిట్టముగానా వంకా పలుకుల దెలియజెప్ప నతడువిని॥ ౩౮.

నామదేవుడును వెళ్ళుచునప్పుడు నారాయణు గుడికడకు।
ప్రేమను శ్రీహరి ప్రార్థనజేయుచు ప్రీతినతనితో బలుకు॥ ౩౯.

రాకాకుమ్మరి భక్తిగొలిచె నిను రక్తి విరక్తిని గనుచు।
జోకను జెప్పుము పాండురంగయన సొంపుగ విఠలుడు మనుచు॥

వైరాగ్యంబున విఖ్యాతుండై వరుసనుండు వాడతడు।
నైరాపేక్షత జూపెద నీకని నయమున రమ్మనె తోడు॥ ౪౦.

శ్రీరుక్మిణితో చనియరణ్యమును జేరి యచట ముగ్గురును।
తీరుగ రెండవ జామున దగ్గర వారలు బోవుచు నటను॥ ౪౧.

భక్తుడు రాకా సతియును, పుత్రియు పరికించుచు కాష్టముల।
సక్తినిదెచ్చుచు నుంచుచు నొకయెడ సమిధల ముట్టకనోరుల॥

అడవిని జీవుల హత్యకు వెరచియు నతిజాగ్రత నడచుచును।
పుడమిని కట్టెల కరములనెత్తియు పొసగగట్టు చుండగను॥ ౪౩.

కానరాక యటు పాండురంగడును కమలజయును నాముడును।
మానుగజూచుచు నుండగనాముడు మగువరుక్మిణి గనుచును॥ ౪౪.

ఎద్ది యేనియిట నిచ్చిచూచినను నితని గుణము దెలియునన।
సద్దులేకతన చేతి కంకణము సరగనుంచె కాష్టమున॥ ౪౫.

రాకాభక్తుడు కంకణమచ్చట రంజిల్లగ దాజూచి।
వీకనుపరుగిడి తనదు భార్యకును విహితంబుగ జూపించు॥ ౪౬.

అతివిఘ్నంబని పురుషుడు జెప్పగ నగునని సతి బలుకుచును।
క్షితిలో సిద్ధిని జూపెను శ్రీహరి చెరుచుటకొఱకు మనలను॥ ౪౭.

ప్రపంచ మమతలు పనిబడవనుచును పండరిరంగని పదము।
చపలతలేకను శరణుబొందగను సడలుచోద్య మిదిగనుము॥ ౪౮.

హేమకంకణం బేమిటికనుచును నిచ్ఛలేక బోవగను।
నాముడు గన్గొని శ్రీహరినప్పుడు నయదర్శన మియ్యమను॥ ౪౯.

చతుర్భుజంబుల తోడను హరి యటు చక్కగాను బ్రకటించెన్।
నుతులను జేయుచు రాకాభక్తుడు నోముఫలమని నుతించెన్॥ ౫౦.
ఆశీర్వాదము వాంఛకు జేసియు హరియును వెళ్ళెను పిదపన్।
పాశవిముక్తుల పాదధూళియగు బాలకృష్ణుడును దలపన్॥ ౫౧.

---

## గోరాకుమ్మరి చరిత్రము.

తరడోకియనెడు పేరునవెలసిటు ధరనొక గ్రామంబుండెన్।
నిరుపమభక్తుడు గోరాకుమ్మరి నివసించుచు నటనుండెన్॥ ౧.
ఆసన శయ్యా భోజనములలో హరిచింతన జేయుచును।
వేసరిల్లకను గృహస్థుడగుచును విఠలుని మది దలచుచును॥ ౨.
వినుచును కనుచును వివిధేంద్రియముల విషయ విహారములందు।
నెనరున శ్రీహరి నెక్కడజూచుచు నిష్ఠమరిగి చెన్నొందు॥ 3.
నీరు దెచ్చుటకు నంగణమందును నిజసుతునిడి భార్యయును।
భారముగల భాండముగొని పోవగ బాలుండాడుచు నటను॥ ౪.
కుండల జేయుట కొఱకును మన్నును గోరాద్రొక్కుచు నుండన్।
పండరినాథుని భావమునందును పాటించుచు తానుండన్॥ ౫.
వెలుపలి వృత్తుల గురుతెరుగకడా విమలబోధ నుండగను।
పలుమరు నాడుచు బాలుడు నాతని పదముల కడరాగాను॥ ౬.
విశుద్ధ భావము హరివ్యాపకమును విమలమతిని గనుచుండ।
శిశువును గోరా యపుడు మంటితో చేరద్రొక్కె గనకుండ॥ ౭.
కుండెడు నీళ్ళను నైకొని భార్యయు కుదురుగ దెచ్చియునుంచి॥
నిండుప్రేమతో సతివయు శిశువును నెనరున పేరిడి బిలిచి॥ ౮.
పలుమరు బిలిచియు బాలుని గానక పతినిజూచి యిట్లనియెన్।
వెలుపల బాలుని విడిచి జలమునకు వెళ్ళితి నేనిపు డనియెన్॥ ౯.
తిరిగివచ్చి నే తనయుని గానక దీనత నొందెద ననుచు।
అఱచుచు జెప్పియు నాతడువినుటకు నలవిగాక హరిగొలుచు॥౧౦.

మంటిని జూడగ మాంసము నెత్తురు మలయుటగని సుదతియును।
కంటనీరుతో గొట్టుకొనెనుదా కడుపురొమ్ము నటుగాను॥ ౧౧
పెనిమిటినింగని నీవును బాలుని పిసుకుమంట ద్రొక్కితివి।
పనిబడిబూడిదె జేసితివింటిని ప్రాణము విడిచెదనుభువి॥ ౧౨.
అఱచుచు జెప్పగ నాక్రందముతో నతనికి స్మృతి యటవచ్చె।
చిరునవ్వున హరి నామదినుండగ జెడిపితివు కొఱవచ్చె॥ ౧౩.
అనుచుబల్కుచు నతికోపంబున నతివను కడువడి జూచె।
మునుకొని చక్రపు దండమెత్తుకొని మోదుటకై తాలేచె। ౧౪.
భయమున భార్యయు బలికెనునప్పుడు పండరిపతి యానసుమి।
నయముగ నను ముట్టిన పక్షంబున, నాతిపలుకు విని పేర్మి॥ ౧౫.
చక్రదండమును గోరాభక్తుడు సరగక్రింద బడవేసె।
ప్రక్రమమునదా శ్రీహరి భజనను పటుతరముగ నటుజేసె॥ ౧౬.
పరిపరి విధముల భువినిజనంబులు బహునిందలు జేయగను।
గురితో గోరా నిర్మలుడగుచును గోవిందు భజింపగను॥ ౧౭.
నారియు తనపతి పదప్రక్షాళనమును నయముగ జేయుకొఱకును।
వారినందుకొని వచ్చుట గనుగొని వాసిగ గోరాతనను॥ ౧౮.
ముట్టవలవదని యాజ్ఞాపింపగ మురిపెము వదలియు సతియు।
ఎట్టకేలకును సంసారముకై యేమొనరింపుదు ననియు॥ ౧౯.
అనుచు నేడ్చుచును నతిదుఃఖముతో ననియెను పెనిమిటికపుడు।
పనిబడి సుతుకై ప్రాణనాథనే బలికితి తెలియకనాడు॥ ౨౦.
మన్నన జేసియు గైకొనవలయును మానుము కోపమనగను।
పన్నుగ గోరా హరిపైయానను బట్టివదల నెన్నడును॥ ౨౧.
పశ్చిమ దిక్కున భాస్కరుడుదయము బరువడి నైనను నేను।
నిశ్చయమెన్నడు వదలను నానను నిఖిలేశ్వరు పైగాను॥ ౨౨.
సతియును నదివిని బహుదుఃఖముతో సంతానము వడయుటకు।
గతికై మరియొక పెండ్లిని జేసెద ఘనకులము వర్ధిలుటకు॥ ౨౩

అనుచు దలంచుచు తనపుట్టింటికి నప్పుడు వెళ్ళియు నొప్పన్।
తనకును భర్తకు జరిగినసంగతి తలిదండ్రులకును జెప్పన్॥ ౨౪.
వంశము నిలుపుటకై నేనిచటికి వచ్చితి తమ చెంతకును।
సంశయ మొందక చెలియలి నిమ్మని సమ్మతముగ నడుగగను॥ ౨౫.
సవతి యుండగను సుదతుల కెవ్వరు చనువున నియ్యరనుచును।
సవిచారణచే నేనిటువచ్చితి సరిగొను మనవి ననుచును॥ ౨౬.
కరుణను నిరువురు సమ్మతిబొందిరి కడపటి పుత్రిక నియ్యన్।
వెరపున విప్రులు వివాహ లగ్నము వెంబడి బెట్టిరి వెలయన్॥ ౨౭.
సాహిత్యంబును సమకూర్చుకొనుచు సలిపిరి వైవాహికము।
శ్రీహరి మంగళ శుభగీతంబుల జెప్పిరి విప్రులు శుభము॥ ౨౮.
చతుర్ధ దినమున సకల బంధువులు సదనములకు జేరగను।
హితుడగు నల్లుని తోడ మామయును నిటులబలికె ముదమునను॥
కనిష్ఠపుత్రిక జ్యేష్ఠపుత్రికను గైకొంటివి యిటునీవు।
వనితలనిద్దర వంచనలేకను వరుస క్రమంబున బ్రోవు॥ ౩౦.
సమభావముచే జూడుము నీవును సతులపోరు నితరులును।
కొమరొప్పగనటు జూచిన యెడలను గొందురు పరిహాసమును॥
విజ్ఞాపనమును వేరైనడచిన విఠలుడు హరి యానయనెన్।
ప్రజ్ఞాయుతుడై గోరా భక్తుడు బహుమోదము తానుగొనెన్॥
భగవత్కృపయును బాగుగ నుండిన బంధములును దొలగునవె।
విగతకామునిగ శ్రీహరిజేయును విషయ దోషముల గనవె॥ 33.
ఇటులందలచుచు గృహమునకరిగెను నిరువురు భార్యలతోను।
చటులతరంబుగ సకలవస్తువులు సమముగ నిరువురకిడును॥ 3౪.
కాపుర మిట్టుల జరుపగనొకయెడ గనితన జ్యేష్ఠసతియనె।
ఏపున వంశము వృద్ధిజెందుటకు నిచ్చితి నాచెల్లియనె॥ 3౫.
గైకొనుమని తా నడుగగ గోరా గారాబముతోననియెన్।
సాఫల్యంబుగ నీజనకుడు మిము సమముగ గన్గొనుమనియెన్॥ 3౬.

ఆనబెట్టినా కాతడుబలికెను నలహేతువచే నేను।
పూనిక నంటను ప్రాణముబోయిన మొగిమిమ్ముల ననగాను॥ ౩౭.

వనితలిద్దరును వినిమదిబొందిరి వ్యసనంబధికము గాను।
చనువున రాత్రిరి వేళను కడపటి సతియు వెళ్ళి పతికడను॥ ౩౮.

నిదురనున్న తన భర్తకరంబుల నెరిరొమ్మున నుంచుకొనన్।
కుదురుగ మేల్కొని యనుతాపముచే గోరాగని శోకమునన్॥

భగవదాజ్ఞకును వ్యతిరేకంబుగ బ్రవర్తింప దోషమని।
విగత భయుండై స్తంభంబునకును వేగకత్తి కట్టుకొని॥ ౪౦.

సతినంటిన హస్తంబులనుచును సరగబట్టి తాగోసెన్।
గతభయుడై హరినామమునుదువుచు ఘనమోహము నెడబాసెన్॥

ఉదయముకాగా వచ్చికన్గొనిరి యుత్తమసతు లయ్యెడను।
ఉదరముగొట్టుచు రోదనజేయుచు నుర్విని బ్రతుకెట్లికను॥ ౪౨.

సిరిమోక్షంబులు శ్రీధరుడగుటను చింతకుపని లేదనుచు।
గురితోగోరా భక్తుడు జెప్పగ గుణగ్రాహ్యంబని మనుచు॥ ౪౩.

ఉత్సవ సమయము వచ్చుకాలమున నుచిత పండరికి మెల్లన్।
సత్సహవాసము చేకొనిగోరా సతులు గూడుకొని వెళ్ళన్॥ ౪౪.

గుడిమంటపమున కీర్తననాముడు గొప్పగ జేయుచునుండన్।
తడయక హరియట నాడుచునుండెను ధరభక్తులు గనుచుండన్॥

అతిమధురంబై హరిపేరలరగ నందరు చేతులనెత్తి।
హితులై గొట్టిరి చప్పట్లచ్చట నిష్ఠను గోరాభక్తి॥ ౪౬.

హరికృష్ణాయని యార్తినివేడగ నప్పుడెవచ్చె కరములు।
చిరతరమోదము చేకొనిరందరు శ్రేష్ఠునిగనుగొని ఘనులు॥ ౪౭.

ఆసమయంబున జ్యేష్ఠపత్నియును నంజలి హస్తముతోడన్।
వాసవ సన్నుత, నాకొమారునిట వాంఛనీయమని వేడన్॥ ౪౮.

బాలుండప్పుడు భక్తబృందమున బాడుచు నాడుచు రాగన్।
తాలిమి తల్లియుగనె తనపుత్రుని తగుసంతసమున వేగన్॥ ౪౯.

మేదిని రుక్మిణి వారల ముద్వర మిగులఁబ్రేమ గన్గొని యెర్౯।
ఈదినంబు మొదలాఁపయు దీరెను నెనసియుండు మికనని యెర్౯॥ ౫౦.
ప్రియమును మోదము బొందిరిభక్తులు ప్రియుడగు హరిచర్యలను॥
భయమున భక్తుల బంటుగ నిలిచెను బాలకృష్ణుఁడీ యిలను॥ ౫౧.

---

## కబీరుదాసుచరిత్రము.

శ్రీహరి యాజ్ఞను శుకునియంశమటు శిశువై శుక్తిక యందు।
వాహినియగు శ్రీభాగీరథిలో వర్షబిందువుల సందు॥ ౧.
గగనము నుండియు నీటంబండగను కాశీపట్టణమందు।
ప్రగుణంబుగనటు మణికర్ణిక యెడ ప్రవహింపంగని ముందు॥ ౨.
దూదేకులలో కమాలుడనునొక తురకవాడు నచటుండి।
పాడుగనట నూలుతుకుచు శుక్తిక౯ పరగ తానుగనుచుండి॥ ౩.
రొమ్ములోతు నీళ్ళను దా వెళ్లుచు రూఢిగ శుక్తిం బట్టుకొని।
సొమ్మసిల్లగను గట్టుకువచ్చుచు శుక్తిని తెఱచి యందుగని॥ ౪.
సుందర బాలుని సులక్షణంబుతో సుఖముగ నుండం జూచి।
పొందుచు మోదము యింటికి వెళ్ళియు పుణ్యశాలి సతి బిలచి॥ ౫.
పుత్రవాంఛ బహుకాలంబుగనిటు పొందియు నుంటిమి మనము।
చిత్రంబగునటు మన మనోరథము చేకూరెను యీదినము॥ ౬.
రామజపము జేసెటి యాబాలుని రమణికి నిచ్చెను నతడు।
ప్రేమను బాలుని భార్యయందుకొని పేనిమి స్తన్య మిచుచుండు॥ ౭.
బాలుని కొఱకై స్తన్యపానమటు బహుచల్లంబుగ వచ్చె౯।
వాలుగ తల్లియు దినమును బాలుని వర్ధిల్లగ పోషించె౯॥ ౮.
కమాలుడప్పుడు బాలుని నామము కబీరనియు దా బెట్టె౯।
రఘునాథు తిరునామము బాలుడు రంజిల నుడువుచు నుండె౯॥ ౯.
పురజను లందరు జూచియు బాలుని పూర్ణభక్తుడగు ననుచు।
గురుతర సుకృతముల్ మాతాపితృలు కోరియు జేసిరి యనుచు॥ ౧౦.

భక్తశిరోమణి బాలుడయ్యెనని పలుకుచు నుండిరి జనులు।
వ్యక్తపర్వమును కొమరుడు బొందగ వరుసను తలిదండ్రులు॥ ౧౧.
కులవృత్తియునగు బట్టలనేయుట గురితో నేర్పింపగను।
మెళుకుల నెవ్వియు నెరుగక బాలుడు మెలగె మౌనియై తగను॥
తల్లియు మెల్లగ శిక్షజేయుచును తనయునకును నేర్పించి।
సల్లలితంబుగ నొకయెడనూలును సతియుదెచ్చి ముందుంచి॥ ౧౩.
బట్టనేయమని కొడుకునకుజెప్పి బైటికి నామెయు వెళ్లన్।
దిట్టంబగు శ్రీరామ భజనచే దెలియకుండె మేనెల్లన్॥ ౧౪.
కనులు మూయబడి దేహవిస్మృతియు గానంబడి యచటుండన్।
కనుగొని తల్లియు దెబ్బను వేసెను కబీరు వీపున చూడన్॥ ౧౫.
దేహస్మృతితో బట్టను నప్పుడు తెలివితోడ నేయగను।
శ్రీహరి తిరిగియు ధ్యానమునందును చేర, మరచె దేహమును॥ ౧౬.
ధ్యానంబునకును పరతంత్రుండై తగులంబడెనని జూచి।
సానందంబుగ రాముడె వచ్చియు చక్కగ బట్టను నేసి॥ ౧౭.
కబీరునప్పుడు దేహస్మృతికిని కరుణతోడ రప్పించన్।
ప్రబల ముదముతో గాంచెను ముందర బట్టనంతయును వరుసన్॥
మడతవేసి యాబట్టను తల్లికి మానుగనిచ్చె కబీరు।
తడవులేకతా తిరిగియునిచ్చుచు తల్లిజెప్పె బాజారు॥ ౧౯.
గొనిపోవుచు నట నమ్మి పైకమును గురుతుగ తెమ్మనగాను।
చనెను కబీరుడు యంగడి వీధిని చంకనిడియు వస్త్రమును॥ ౨౦.
ఒకప్రక్కను దా కూర్చుండుచు మరి యుచితవస్త్రమును ముందు।
ప్రకటంబగునటు జనులుజూడగా భక్తుడుంచి యిరవొందు॥ ౨౧.
శ్రీరఘు రాముని భజనజేయుచును చిత్తమువేరై యుండన్।
చీరపైనతగు గిరాకియెవ్వరు చేయకుండిరటు జూడన్॥ ౨౨.
అమితంబగు వెల వస్త్రంబనుచును నందరరిగి రడుగకను।
కమల దళాక్షుని కరములు తగిలిన ఘనచేలము గనుకాను॥ ౨౩.

కబీరుడిదిగని ప్రొద్దు గ్రుంకగనె కైని చేల మందుకొని।
ప్రబలకోపమటు తల్లిజేయునని బాటను నొకగృహముగని॥ ౨౪.
అందునవెళ్లుచు కూర్చుండియుమరి హరినిస్మరించుచు నుండగ।
పొందుగ రాముడు వేదవిప్రువలె పోయెనునా కబీరునెదగ॥ ౨౫.
శీతాకాలము వస్త్రములేకను జెందుదు బాధలనేను।
సాదరముగతగు వస్త్రంబొక్కటి సరగున నిమ్మనగాను॥ ౨౬.
సగమువస్త్రమును చించి కబీరుడు సరగనిచ్చె విప్రునకు।
సగుణుడగుచు హరి వస్త్రముచేకొని చనెను దారినటుబాగు॥ ౨౭.
పరిక్షించుటకు రాముడు తిరిగియు ఫకీరు వేషముతోను।
గురుతుగ వచ్చియు వస్త్రము నిమ్మని కోరియు నిలుచుండుచును॥
నిరాకారుడై ఖుదాయుండగను నీవెటు హరిగొలిచెదవు।
పరాకుసేయక కబీరుడనియెను భగవంతుని యానెళవు। ౨౯.
కరిగిన ఘృతము పోలికనుండును ఘనత నిరాకారంబు।
ధరలో కరుగని ఘృతమువలెనగును తలపడి యాసగుణంబు॥ ౩౦.
కరిగియుండినను కరగకుండినను కలదె భిన్నము నేతికిని।
తెరువుగనటులనె యవ్యక్తంబగు తేజమె భక్తుల కైని॥ ౩౧.
వ్యక్తరూపమై యాకారమునకు వచ్చెననుచు జెప్పగను।
సక్తిగ ఫకీరు నిరుత్తరుండై సరగనడిగె వస్త్రమును॥ ౩౨.
సగమువస్త్రమును కబీరుడప్పుడు వగవక నిడి యాతనికి।
విగతమోహుడై యుపాధిలేకను విష్ణుభజనలో మరిగి॥ ౩౩.
ఉండగ వెళ్ళెను రాముడు విప్రుడై యొగికబీరు గృహమునకు।
దండిగ ధ్వనితో కబీరు తల్లిని తాను బిలచె వెలపలకు॥ ౩౪.
ఆమెకుజెప్పెను కబీరుచేసిన యఖిల వ్యవహారములు।
నేమముతో నొక విజనగృహంబున నిలిచియుండు నిర్యోడల॥ ౩౫.
వనితయు జెప్పెను కబీరుడింటికి వచ్చిననే గొట్టెదను।
ఇనకుల తిలకుం డందుకుజెప్పెను యిపుడురాడు యింటికొను॥ ౩౬.

ఏకాంతంబున నుండును యాతడు నెలమి నీకు జూపెదను।
సాకాంతను హరి జెప్పుచు నామెతో చనుదెంచెను నయ్యెడను॥
దూరనుండి కబీరుని జూపెను తోడనామె కొమరుగని।
నారక దగ్గిర వెళ్ళిచూడగను వాక్కునామె యనగగని॥ ౩౮.
ఓరి కబీరుడ వస్త్రమెచటనని యొప్పుగ తానడుగగను।
శ్రీరఘు రాముని పైన కబీరుడు చిత్తము తగ నుంచుచును॥ ౩౯.
బహిరంగంబును దెలియక నాతడు పరతంత్రత నుండుచును।
ఇహమున మౌనియై యుండగ తల్లియు యీత బద్ధ నందుకొను॥
దెబ్బలవేసెను కబీరుపైనను తిట్టుచు కోపముతోను।
తబ్బిబ్బుగనవి శ్రీరఘురాముని తనువుపైన బడగాను॥ ౪౧.
చాలు శిక్షనిక క్షమింపుమనుచును సర్వేశ్వరుడనుచును।
వీలుగ చూపియు వాతలు తగతన వీపుపైన నుండగను॥ ౪౨.
అప్పుడె విడిచియు విప్రరూపమును యఖిలేశుడు నిజరూపు।
మెప్పుగ దాల్చెను ధనుర్బాణములు మేఘకాంతి మేనొప్పు॥ ౪౩.
కర్ణకుండలము విశాలవక్షము కంఠ కౌస్తుభమణి తోను।
స్వర్ణకాంతితో వెలసిన సీతా సమేతుడగుచు నయ్యెడను॥ ౪౪.
ప్రకటింపగనా కబీరుడప్పుడు భవ్యచక్షువులదెరచి।
సొగసగురూపును జూచి ప్రేమచే సుస్థిరమతియై వెలసి॥ ౪౫.
బహు పర్యాయముల్ నమస్కారముల భక్తితోడ దాజేయు।
సహజ దాస్యమును నేత్రాంజలులతో చక్కగసలుపంగనియు॥ ౪౬.
భగవంతుండనె నీవునాగితివి పరీక్షకనియును జెప్పి।
తగిలియుందునే నెడబాయకనిను థరభజించుననునొప్పి॥ ౪౭.
ఆతనితల్లిని గని నీభాగ్యం బమితమయ్యె తగగనుము।
హామగనను నీహృదయమునందును బాగుగను నిలుపుకొనుము॥
అనుచును జెప్పుచు శ్రీరఘురాముం డంతర్ధానము నొందెన్।
మనమున మోదము ముప్పిరిగొనగను మానినికొడుకును చెంతన్॥

జేర్చియు ముద్దిడి యాలింగనమును జేసికొనుచు తా జెప్పె।
నేర్చితివీవును రాముని భజనను నీలవర్ణు యారూపు॥ ౫౦.
నీవల్లననే జూచితినిప్పుడు నిందు ప్రేమ గాంచితిని।
భావశుద్ధితో యింటికి రమ్మని బట్టిదెచ్చె తల్లిగని॥ ౫౧.
స్వస్థమనసుతో రామచింతనము సలుపుచుండి రయ్యేడను।
నిస్తరంగ సముద్రమువలెనే నెమ్మదితో నుండగను॥ ౫౨.
సులక్షణంబగు పడుచును దెచ్చుచు సొరది పెండ్లి సేయగను।
విలక్షణంబగు గృహస్థుడగుచును వెలసియుండె కబీరుడును॥ ౫౩.
తల్లియు పిదపను కొడుకునభిష్టము తరుచుగాగ నడవగను।
సల్లలితంబుగ రామభజనను సలుపుచుండును దినమును॥ ౫౪.
శ్రీరఘురాముని కృపచేజ్ఞానము చేకూరెను యామెకును।
ధీరత్వముచే కలిమిలేములను దెలియక దానుండెమును॥ ౫౫.
పతివ్రతదాలగు భార్యను గూడియు భక్తు కబీరుండుండగ।
హితుడగుపుత్రుడు జన్మించెను వారిలను ప్రేమగొనియాదర॥ ౫౬.
పదిరెండవయా దివసమునందును బంధువులటు గూడుకొని।
ముదమున బిలచిరి కమాలు యనుచును ముద్దుకొమరు తాముగని॥
దినదినమునకా బాలుడుపెరిగెను దివ్య సుగుణముల వెలసి।
అనువుగ తండ్రియు జెప్పిన కవితల నాతడు పాఠము జేసి॥ ౫౮.
వైరాగ్యంబును శుచిత్వ శీలముల్ వర్ధిల్లంగొని యతడు।
విరాజమానుడై గానము జేయుచు విపుల జ్ఞానియైయుండు॥౫౯.
బాల పర్వమున నుండుచు నొకయెడ భక్తినడుగు తండ్రిగని।
వీలుగనాకును ద్వారకజోవను విపులేచ్ఛయు గలిగెనని॥ ౬౦.
అనుజ్ఞయిచ్చిన వెళ్ళెదననుచును నంజలితో మ్రొక్కగను।
ఘనమోదముతో వెళ్ళవచ్చునని కబిరనె కొడుకునకును॥ ౬౧.
చిన్నతనంబున యాత్రచింతనిటు జేయుట హరి కృప యనుచు।
ప్రసన్నగ తండ్రియు ననుజ్ఞనియ్యగ పాదంబుల పైబడుచు॥ ౬౨.

వెడలెనుకాశీ పట్టణముండియు వినుతి జేయుచును హరిని।
పుడమిని యాతం డుత్తమాన్నమును పొసగకోర డియ్యమని॥
ధనికుల యిండ్లను తాజొరకుండును దారిబోవు చుండగను।
చనువుజేతురటు పురజనులందరు చక్కనికృతుల వినుచును॥ ౬౪.
నారదువలెనే యహర్నిశముహరి నామంబును జెప్పుటచె।
కోరుచు నుందురు నాతనిజూడను గురుతుగ జనులటు మెచ్చ॥ ౬౫.
ఒక్కొకదినమొక గ్రామమునిడికొని యుచితజనులు బంపగను।
చక్కగ జేరెను ద్వారక పురమును సాధుసుతు కమాలుడును॥ ౬౬.
అనుతాపముతో తీర్థస్నానము నరమరలేకను జేసి।
నెనరున ద్వాదశ యూర్ధ్వపుండ్రముల నిండుప్రేమతో వేసి॥ ౬౭.
గుడిలో వెళ్ళుచు కృష్ణచరణముల గురుతుగ దండముబెట్టి।
తడవులేకనా విగ్రహమునుగని ధ్యానములో నిలబెట్టి॥ ౬౮.
నుతులం జేయుచు గానము బాడుచు నూతన కవితలజెప్పు।
హితుడై యచ్చట నాలుగు మాసము లింపుగనుండుచు నొప్పు॥ ౬౯.
హరికి నమస్కృతి బెట్టుచు వెడలెను నచటనుండి యింటికిని।
చిరతరముగదా రాముని భజనను జేయుచునడిచె దారిని॥ ౭౦.
వేడుకతోనిటు బోవగవణిజుడు విష్ణుదాసుడను వాడు।
కూడియు నితరుల నెదురుగ వచ్చియు గొనిచనితన గృహముండు॥
మన్ననజేయగ కమాలుదాసుడు మానుగ నటభక్షించి।
కొన్నికీర్తనల రాత్రికాలమున గురుతుగ గానముజేసి॥ ౭౨.
వినుపింపంగను విపులజనంబులు వేడుక నాలోకించగ।
ఘనముద మొరదుచు వణిజుండప్పుడు గారాబముతో వెలుచగ॥ ౭౩.
ద్రవ్యరాసులను కమాలుదాసుడు తగులముట్టడని తలచి।
దివ్యంబగునొక మాణిక్యంబును నయముతోడ ముందుంచి॥ ౭౪.
పదములమ్రొక్కుచు నంగీకారము బాగుగ జేయుండనియు।
విదిత పరచెనది రాత్రికాలమున వెలుతురునిచ్చును ననియు॥ ౭౫.

గైకొను మనుచును జెప్పగ వినుకొని కమాలుడయ్యెడ ననెను।
జోకను నేనిది చేకొని బోయిన సుఖమియ్యదు తండ్రికను॥ ౭౬.
కోపము జేసును నాపై యాతడు గురిగల రత్నంబులును।
ఏపున నాకును రాళ్ళసమానమై యెపుడు దోచుచుండగను॥ ౭౭.
ప్రయాసయెందుకు దీనికొంటివని పలికియు వలదనగాను।
క్రియావిశేషము దెలియక వణిజుడు ప్రియమున బొలుండటను॥ ౭౮.
పరుండి యుండగ నాతనిగోచికి బాగుగ గట్టెను మణిని।
తెరంగెరుంగక కమాలుదాసుడు తెల్లవార మేలుకొని॥ ౭౯.
దారి నడుచుచును యిల్లు చేరియటు తండ్రికి దండంబిడును।
పారజూచి యా ముడిని గోచికిని భయమున తండ్రిని గనుచును॥
వణిజుని తోడను జరిగిన సంగతి వరుసతోడ జెప్పగను।
అణుకువ లేకను కబీరు మూర్ఛను నవనిపైని బడుచును॥ ౮౧.
కొంచెము ప్రొద్దుకు తిరిగి లేవగను కోరివచ్చి భార్యయును।
అంచిత సంగతి యేమియనుచుతగ నామెయు నట నడుగగను॥ ౮౨.
కబీరుడప్పుడు పుత్రుని యెదురుగ కానకుండగను తరిమి।
ప్రబలకోపమును బొందుచు నాతడు భార్యనుగని బలుకుసుమి॥
ఈదినమందున మనవంశముతగ నేపున నిటు మునిగెసుము।
మేదిని కమాలు హరిని బాడుచును మించి మణిని దెచ్చెసుము॥ ౮౪.
విక్రయ పరచెను రామనామమును విపులంబగు దుఃఖమును।
అక్రమమనుచును పొందగ వలసెను నపచారము జరిగెననుచు॥ ౮౫.
ఇదియు వినుంగొని కమాలుదాసుం డేగెను వర్తకు నెడను।
కుదురుగ రత్నము తిరిగియునిచ్చుచు కోరివచ్చె తిరుగాను॥ ౮౬.
తలిదండ్రులకును వందనమొసగుచు తనయుడు సంగతి చెప్పగా।
సలలిత మతులై తలిదండ్రిద్దరు సంతోషించిరి యొప్పగా॥ ౮౭.
నిరుపాధికుడగు కొమరుని గాంచుచు నిండుమోదమున నుండెగా।
చిరతరముగనే రాముని భజనను జేయుచు తండ్రియు నిగుడెగా॥

ఒకయెడ సాధులు తీర్థాటనచే నుఱుయాత్రల చేయుచును।
అకలంకుండగు కబీరు గృహమున ననేకులటు రాగాను॥ ౮౯.
జాము రాత్రియై యుండగనప్పుడు సద్భక్తుడు ముద మొంది।
ప్రేమను వారలు కూర్చుండగనటు ప్రియమాటల నిరవొంది॥౯౦.
ఏకాంతంబున భార్యవద్దకును నేగి కబీరుం డపుడు।
సాకాంక్షను మన యింటికి వచ్చిరి సాధుజనులుతగ నేడు॥ ౯౧.
వారలకన్నము బెట్టవలయునను వాంఛ యున్నదని యనగన్।
తీరుగ భార్యయు భాండము లోపల తిలయంతన్నము లేకన్॥౯౨.
ఇరుగు పొరుగునే నడిగననియ్యరు యేమిసేతునని మరియు।
కరముల డబ్బును చూచి కోమటియు ఖరీదుకిచ్చుచు వెలయు॥౯౩.
చేతుల డబ్బును లేకుండంగను చేయుము దొంగతనంబు।
సాధుల కొఱకిది యపచారంబై జరగబడదు నిరతంబు॥ ౯౪.
కొడుకును నీవును దొంగతనంబుగ కోమటి యింటికి వెళ్ళి।
తడవులేకనటు పప్పును బియ్యము తగు సామగ్రిని విలసిల్లి॥ ౯౫.
దెచ్చితి వేనియు సాధుజనులకును తీర్చెద వంటను త్వరగా।
మచ్చికతోనిటు భోజనమిడుదము మహినివార్లకును బాగా॥౯౬॥
కబీరుడందుకు సమ్మతించుచును కమాలునటు గూడుకొని।
సొబగున వారలు శస్త్రములందియు జొచ్చిరొక్క యంగడిని॥౯౭.
నిద్రితుడగుచును కోమటి యుండగ నిండిన చీకటి రేయిన్।
ఛిద్రము గోడకు కన్నము వేసియు జేసిరియా యిరువురయిన్॥
బైటనె యుండుచు కబీరు, కొడుకును ప్రవేశించమనె లోను।
సాటిగ నీవును కార్యసాధనము సలుపుము వేగముగాను॥ ౯౯.
ఇదివిని కొమరుడు లోపల దూరియు నెలమిజూచె ద్రవ్యమును।
విదితంబుగ బహు వస్త్రభూషలును వెలసియుండె తగనటను॥౧౦౦.
ఇదిమనకెందుకు యనుచు దుఃఖమున ఇంకొక యర బోవగను।
కుదురుగనచ్చట పప్పుబియ్యమును కోరిన దినుసుండగను॥ ౧౦౧.

సాదుజనులకును తగుసామగ్రిని సత్పుత్రుడు తీసికొని।
పాదుగతండ్రికి నందియ్యంగను బట్టి మూట గట్టుకొని॥ ౧౦౨.
కించనొందుచును తండ్రియుబల్కెను క్రియతోడను మనమిపుడు।
సంచరించుచును యింటికి వెళ్ళిన సౌఖ్యమెపుడు గాకుండు॥ ౧౦౩.
ఇతర దొంగలీ చిద్రము దూరియు నిష్టవస్తు గొని చనిరన్।
సతతము మనకును పాపము వచ్చును సత్వహానియగు పైనన్॥౧౦౪.
నిదురను బోయెటి మనుజును లేపియు నెరిబోవుట మంచిదనన్।
హితపరుడైయా కమాలు లోపల నేగి నరుని లెమ్మనుయనన్॥ ౧౦౫.
అతడు మెలుకువ కాగను జెప్పెను యరయదొంగ లిరువురము।
ఈతరి దొంగిలి సామగ్రిని తగ నేగెద మియ్యెడ గనుము॥ ౧౦౬.
పదిలపరచుకో నీదుసొమ్మునని పరుగిడి ఛిద్రంబునకు।
కుదురుగ నందున దూరివెలికిచనె కోరియు నాభీవరకు॥ ౧౦౭.
ఇంతను కోమటి లోపల బట్టెను నీతని చరణంబులను।
పంతముతోడను కమాలుడిదిగని ప్రార్థించెను తండ్రి మును॥౧౦౮.
కోమటి వచ్చియు పదముల బట్టెను కూడుదు రితరులు నిటను।
వేమరు మనలను దొంగలమనుచును విపరీతము జేతురను॥ ౧౦౯.
సాదు జనులకును భక్షణ యంతయు సంపూర్ణము నియవలెను।
పాదుగ నిందుకు నాతలనటుకుచు పారిపొమ్ము నీవికను॥ ౧౧౦.
మాయమమతలను నీసమయంబున మనసున నుంచినయెడలన్।
బాయక మనకును సత్వహానియగు భాగవతులు నియ్యెడలన్॥౧౧౧.
దొంగలమనుచును మనలను దెలిసిన తొలగి వెళ్ళెదరు సుమ్ము।
*అంగదయనకను శిరమును నఱుకుము నలశాంతిని గైకొనుము॥
ఇటులం జెప్పగ కబీరుడందుకు యేపున సంతోషించి।
పటుతరముగదా శస్త్రముచేతను బాలకు శిరసును గోసి॥ ౧౧౩.
సామగ్రియును శిరమును చేకొని చక్కవచ్చితన గృహము।
నేమము తోడను జరిగినసంగతి నెలతకు తగ జెప్పెసుము॥ ౧౧౪.

---

*అంగద - ఆపద.

సతియును కొమరుని శిరమును గాంచుచు సాధులకై దేహమును।
పదిలపరచుకొని యుంటివా కొడుకా పరమాత్ముని దలచుచును॥
వంశోద్ధారణ జేసితివీవును వసుధను వచ్చినవెనుకఁ।
సంసారంబున నుండియు ముక్తిని చక్కగగొంటివి వేగఁ॥ ౧౧౬.
అనుచు జెప్పుచును దుఃఖితురాలై యటుయొక మూలనుదాచి।
ఘనమగు ధైర్యము తోడను వంటను గజిబిజి నొందక జేసి॥ ౧౧౭.
పిండివంటలన్నము సాధువులకు బెట్టెనుతగు భోజనము।
దండి సుదినమిది సాధులసేవయు తలపడె నాకీదినము॥ ౧౧౮.
అనుచు జెప్పుచును సంతోషముతో నందరికిడె నాసనము।
వినమితుడగుచును కబీరు సాధుల విపులసేవ నుండెనుము॥ ౧౧౯.
అరుణోదయమున సాధులు లేచుచు హరిస్మరణను తగజేసి।
గురుతుగ వెళ్ళిరి స్నానము కొఱకై గోవిందాయని వెలసి॥ ౧౨౦.
ఇటు యిట్లుండగ కోమటియింటను యితర జనులు వినునటుల।
పటుతరముగదా శంఖధ్వనులను బాగుజేసె నయ్యెడల॥ ౧౨౧.
ఇరుగు పొరుగునట నుండు జనంబులు నింటను వచ్చియు చూడఁ।
శిరము లేనియా దేహముగనిరటు జెప్పగురుతు లేకుండఁ॥ ౧౨౨.
దొంగ శిరస్సును వేరొకదొంగయే దురుసుగ నఱికియు వెళ్ళెఁ।
అంగలార్చుచేలని కోమటికిని యన్యులు జెప్పిరిమెల్లఁ॥ ౧౨౩.
ద్రవ్యము నిడికొని యొంటరియగుచును తానుపరుండట తగదు।
భవ్యంబగు యీద్రవ్యముచేతను బలుపద్రవమును గలదు॥ ౧౨౪.
అనర్థమునకును నధిష్ఠానమగు నరయగ ద్రవ్యంబిలలో।
సునిశ్చితంబుగ నాత్మఘాతకును సూటిమూలమగు ధరలో॥ ౧౨౫.
వచ్చిన దొంగలు ద్రవ్యమునంటక పరసామగ్రినె గొనిరి।
సచ్చరితులరగు సాధులె యుందురు సౌఖ్యమయ్యెనని యనిరి॥
కోమటివెళ్ళుచు రాజువద్దకును కోరితెలిపె సంగతిని।
వేమరునాతడు విచారింపకను విపులశూలమున నవని॥ ౧౨౬.

దొంగశరీరము వేయుండనుచును తోడనాజ్ఞ నియ్యగను।
గొంగకనప్పుడు కమాలుమేనును కూర్మిసంధి దాటిలోను॥ ౧౨౮.
శూలమునాటియు కమాలుమేనును సూటిగనిడి రందునను।
పీలుగ దొంగల కిదియశిక్షయని వినుపించిరి భటులటను॥ ౧౨౯.
కబీరునింటికి వచ్చినసాధులు గంగాస్నానము జేసికొని।
సొబగున వారలు నూర్ధ్వపుండ్రముల నూటిగనటు వేసికొని॥ ౧౩౦.
అనుజ్ఞ గైకొని కబీరువద్దను నరుగుటకై యుండగను।
వినమిత యగుచును కబీరు భార్యయు వెలుపలకును వచ్చుచును॥
కన్నీరొలుకగ జెప్పెను వార్లకు కరుణనుంచు నాయెడను।
పన్నుగ తిరిగియు చూచుటనెపుడని భర్తని దండంబిడును॥ ౧౩౨.
భార్యయు భర్తయు నిరువురువారితొ పదపడియటు వెళ్ళంగన్।
కార్యకరంబుగ శూలమునందును కళేబరము నుండంగన్॥ ౧౩౩.
శిరసు లేనియా మేనుంజూచుచు జెంది వింత వారలును।
గురుతుగ నచ్చట నిలుచుండుచు తగ గూడియుండిరి మేలుగను॥
ఆసమయంబున ప్రేతహస్తము లంజలిజెను సాధులకు।
జూచుచు వారలు నాశ్చర్యముతో నుడియు ప్రాణమిదివరకు॥ ౧౩౫.
ఎటులనుంచెనీ ప్రేతశరీరము యేకారణ మిందుకనన్।
పటుతరముగనా కబీరుడనియెను భక్తుడీత డిలలోనన్॥ ౧౩౬.
మీకు నమస్కృతి చేయుట కొఱకై మెలగియుంచె ప్రాణములు।
జోకను నాతని సంకల్పంబును జూపెనుతగ నియ్యెడల॥ ౧౩౭.
సాదువులందుకు తస్కరుడెవడని సాహసమున నడుగగను।
పాదుగ దెలిపెను కబీరుడప్పుడు పదపడి వృత్తాంతమును॥ ౧౩౮.
అందుకు వారలు నన్నుముమేమును నడగకుండ గానుండన్।
యెందుకు కొడుకును హతముజేసితివి యిలనుత్తముడై యుండన్॥
శిరసును తెమ్మని కబీరుభార్యకు జెప్పగనామెయు దెచ్చెన్।
కరములనొక్కడు శూలమునుండియు కమాలుమేనును దించెన్॥

క్రిందికి దీయుచు నేలపై నినిడి క్రియను శిరము చేర్చగను।
అందంబగునటు కమాలులేచెను నాశ్చర్యమును బొందగ॥
సాదుజనులకును కమాలుడప్పుడు సలిపె దండము ప్రీతిగను।
పాదచారులై వారలు వెళ్ళిరి బహు దీవెనలిచ్చుచును॥ ౧౪౨.
కాశిక్షేత్రము నుండుజనంబులు కబిరుభక్తు పొగడిరటు।
వాసిగనాతడు సుతునిబిలుచుగొని వచ్చెసతితో నింటికటు॥ ౧౪౩.

---

ఒకయెడ కబీరుడంగడివీధిని సురుగానము జేయుచును।
ప్రకటంబుగ శ్రీరామునికీర్తియు బైలుపరచుచుండగను॥ ౧౪౪.
ఇల్లాలొక్కతె యింటనునుండుచు యెలమి పిండి విసరగను।
ఉల్లాసంబును వదలి కబీరుం డొసగ బైటనుండుచును॥ ౧౪౫.
అపరిమితంబుగ రోదన జేయగ నచ్చట నడచెటి జనులు।
నెపమున వింతను బొందుచునడిగిరి నెరిరోదనకును నిటులు॥
కారణమేమొ జెప్పుమనంగను కలిమనుజులు వారలని।
తేరిచూడకను మరుమాటాడక తెగనేడ్చుచు నుండగని॥ ౧౪౬.
నిపటునిరంజను డనునొకభక్తుడు నెనరున నటుబోవుచును।
కపట రహితుడై యేడ్పెందుకుయని కబీరునడుగ నప్పుడును॥౧౪౭.
ఉత్తరవిచ్చెను ప్రాకృతజనము లుచితతెలివి దెల్పరని।
బొత్తిగ వార్లతో పలుకకయుంటిని పూర్ణజ్ఞాని వీవుయని॥ ౧౪౮.
విసుర్రాయితో పిండివిసరగను వేయు ధాన్యమంతయును।
ప్రచురంబుగనని పొడియైపోతవి భవచక్రంబున నేను॥ ౧౫౦.
తగిలుండుటచే నశ్యమగుటయును తప్పదనుచు వెరగొంది।
మిగులరోదనము జేసితిననగను మేలుప్రీతి నతడొంది॥ ౧౫౧.
ప్రత్యుత్తరముగ నిపటు బలికెనటు భాగవతులు భువిలోను।
సత్యముగాతగు నాధారంబును చక్క విడువకుండినను॥ ౧౫౨.

భయములేదు తగు నాధారంబును బట్టకుండు యాజలు।
క్రియతో భవచక్రంబున పిండిగ క్రిందుగ బడుదురు వార్లు॥ ౧౪౩.
కూటి సమీపపు ధాన్యంబులుమరి కూడిపిండి గానటుల।
పాటవముగ శ్రీరాముని చింతన బట్టువారి కియ్యెడల॥ ౧౪౪.
కాలచక్రమిక కష్టము బెట్టదు ఘనవిరాగ మొందుచును।
మేలగుశాంతియు దాంతి క్షమలునీ మేనున నిమిడుండగను॥౧౪౫.
కలనుగల్లు భయమునకును వ్యర్థము కన్నీరుతో నేడ్చెదవు।
తలపడి శోకము విడువుమటంచును తగినవార్తలను నుడువు॥
ఇదివిని కబీరు ముదముతో నిపటున కిడుచును దండంబపుడు।
కుదురుగ నిద్దరు నాడుచు పాడుచు కోరియు వెళ్ళిరి నాడు॥ ౧౪౭.
తనగృహంబునకు కబీరువచ్చుచు ధర హరిగుణ వాదమును।
అనువుగ జేయుచు కాలమునాతడు నతిముదమున జరపగను॥
ఒకయెడ తనలో నూహించుచుతగ నొప్పగ సంసారమున।
అకళంకులురై యుండువారలిటు యాచార్యుని గనకున్న॥ ౧౪౯.
ప్రేత సమానులు యనియును మరియును ప్రియసతి లేకుండినను।
నీతిని దప్పక ప్రపంచకార్యము నెరిజేయుట పొందదను॥ ౧౫౦.
బాలురులేనటి యిల్లు వ్యర్థమగు పరికించియు చూడగను।
వీలుగ నిటులనె గురువును చేయని విహితనరుడు వ్యర్థమను॥ ౧౫౧.
ఇటుజింతించుచు సన్యాసియునగు నిల రామానందుని నే।
పటుతరంబుగా నాశ్రయించెదను భవతరణమునకు నే॥ ౧౫౨.
అనుచును జెప్పుచు నొకదినమందును నాచార్యుని కడకేగి।
చనువుగ దూరము నుండుచు నాతడు సలిపె నమస్కృతి మెలగి॥
నీదుకృపకు నే పాత్రుడ నగునటు నెనరుంచుము నాయెడను।
ఆదరముగ నా కుపదేశంబును ననుగ్రహింపుము తగను॥ ౧౫౪.
అందులకును రామానందుండనె యవింధ్యవంశము నందు।
పొందుగ బుట్టుటచే నుపదేశము పొందుపడదు నీకిందు॥ ౧౫౫.

ఇదివిని కబీరు డతిదీనుడనే నెలమిని మీపదమంచె।
కుదురుగ నిశ్చయ ముంచుటచేతను కొనగూర్చును యింపొందె॥
నమస్కరించుచు నిటులం జెప్పుచు నమ్రతచనె నింటికిని।
సుమహితుడగుచును గురుచరణంబులు సోకు నుపాయ మెట్టులని॥
తనలోచింతన జేసియు నొకయెడ తలపడి రామానందుండు।
పునీతగంగకు స్నానముకొఱకై పోవుదారి కబీరుడు॥ ౧౬౮.
సోపానములను ముసుకిడి బట్టతో నూటిపరుండెను తాను।
ఏపారగనా రామానందుం డెలమిచీక టుండగను॥ ౧౬౯.
గంగకువెళ్ళను స్నానము కొఱకై కబీరు తలను చరణముల।
ఇంగితమెరుగక బెట్టుచు చెప్పెను యెవరినొ ద్రొక్కితి య్యెడల॥
అనుతాపముతో రామరామయని యతడుజెప్పి వెళ్ళగను।
చనువున లేచియు కబీరు డప్పుడు స్వామీ, కృప గంటినను॥ ౧౭౦.
అనాయాసముగ మీచరణంబులు నమరెనాపై యీదినము।
పునీతమగు శ్రీ రామమంత్రమును పొసగశ్రవణ మయ్యెసుము॥
అనేకజన్మల సుకృతమునేడే యవని ఫలించెను నాకు।
వినీతుడగుచును నమస్కృతులదా విహితంబుగ బెట్టెతగు॥ ౧౭౩.
అపరిమితంబగు యానందముతో నాడదొడంగెను యతడు।
చపలతలేకను గురునిగంటినని సరినుతిజేసెను నాడు॥ ౧౭౪.
వింతనొందుచును రామానందుడు విపుల మోదమును బొంది।
ఎంతోదుర్లభు డిట్టిపురుషుడని యెలమి బలికె యురవొంది॥
నేమములెల్లను ముగించుకొనుచును నెనరున చనె యాశ్రమము।
ప్రేమను నాతని పరీక్ష జేయను ప్రియమొందుచు నుండెనుము॥
కొన్నిదినంబులు జరగ కబీరుడు గోవిందుని బాడుచును।
పన్నుగనంగడి వీథిని వచ్చెను పరవశభావంబునను॥ ౧౭౭.
కన్నిరొలుకగ గానన్నృత్యములు కౌతుకముగ దాసలుపు।
పన్నుగ శ్రీగురు రామానందుని పదముబట్టె నియమంబు॥ ౧౭౮.

కొఁరతలెవ్వియును లేవుతనకునని గురుభజనను నుండగను।
సురుచిరమగునీ వాక్యసరళివిని మాటిగ రామానందుడును॥౧౭౯.
క్రోధమునొంఁదిన వానివలెనెదా కోరియడిగె తానపుడు।
నాదుశిష్యుడవని నీవనెదవు నరహరి మంత్రము నెపుడు॥ ౧౮౦.
నీకుపదేశించితి సాక్షులెవ్వరని నెనరున నిటు జెప్పుచును।
జోకను పాదుక లందియువేసెను సూటి కబీరుని తలను॥ ౧౮౧.
దెబ్బతగులగనె రక్తము కారెను తిర సంతోషము బొందె।
దబ్బరలేకను చెప్పెకబీరుడు ధరను గురుడు మేలొందె॥ ౧౮౨.
అప్పుడు చేసిన యుపదేశంబును నతిరహస్యమై యుండెన్।
ఇప్పుడు నలుగురు జూడగపాదుక లెలమితలను నుంచబడెన్॥
భూతములైదును సాక్షియుంచిమీ పునితపదము బట్టితిని।
పాదుగ మీరల యుపదేశమునకు ప్రభువుహరియె సాక్షియని॥
ఇటులం జెప్పగ రామానందుం డేవున కృపదా జూపి।
పటుతరప్రేమను శిరమున చెయినిడి పరునిమంత్రమును జెప్పె॥౧౮౬.
అనుగ్రహింపగ సత్యానందము యాకబీరుడును బొందెన్।
ఘనముద మొందుచు రామ విభునిపై కవితబాడి యిరవొందెన్॥
అమితఖ్యాతియు లోకమునందును నమరెనటు కబీరునకు।
కుమతులకును తగ కుటిలత్వముచే క్రోధంబును కలుగుటకు॥౧౮౭.
ఏకాంతంబగు ప్రదేశమందును యెలమినిందకులు గూడి।
ఆకాంతును యాకబీరుదాసున కమితకష్టమొన గూడి॥ ౧౮౮.
వచ్చు మార్గమును నూహించియు మరి వ్రాసిజాబు లయ్యెడల।
సచ్చరితుండగు కబీరుదాసుని సరినామము బెట్టియిల॥ ౧౮౯.
ఉత్సవమొక్కటి రాముని కొఱకై యూహింపంబడె యనుచు।
సత్సమాగమము కోరి సాదులకు సంగతి తెలియంబరచు॥ ౧౯౦.
దినమును నొక్కటి నియమించియు మరి దెలియవ్రాసి జాబులను।
అనువుగ సాధుల వాసస్థలముల కంపిరి మనజులతోను॥ ౧౯౧.

హరిద్వారము బృందావనమును అయోధ్య ద్వారకపురిలో।
గురిగలక్షేత్రపు బైరాగులకును గొని వారిచ్చిరి యిలలో॥౧౯౨.
క్షేత్రవాసులగు సాధువులందరు చీటి కబీరు వ్రాసెనని।
నేత్రోత్సవముగ భక్తునిచూచుట నెరి కర్తవ్యంబుయని॥ ౧౯౩.
నియమించిన యాదినమును దప్పక నిఖిల సాధులు కాశికిని।
ప్రియులై వచ్చుచు కబీరు వద్దకు బెట్టిరి దండమతనికిని॥ ౧౯౪.
సంతోషముతో కబీరు వార్లకు సలిపె నమస్కృతులటను।
విందానంబుగ నమితసాధువులు వేంచేయుట సుదినమను॥ ౧౯౫.
కుజనులు జేసిన క్రియయని దెలియక గోవిందుని కరుణయను।
సుజనులజూడగ కబీరుదాసుడు సుఖతర ముదమొందెమును॥
శ్రీరఘురాముడు కుటిలుల మనసులు చిందరబడు యత్నమును।
కోరి కబీరుని కొరతను దీర్చను గొప్పపనిని చేసెమును॥ ౧౯౭.
సాధుజనులుతగ వచ్చి దిగిరియటు శతసహస్ర సంఖ్యకును।
గీతము బాడుచు కృష్ణుని నామము క్రియతోడను జెప్పుచును॥
రాముండనంత కబీర్లరూపుల రంజిలదాల్చెను నపుడు।
ప్రేమను వచ్చిన సాధుజనంబుల పెంపగుసేవను నుండు॥ ౧౯౯.
అతియుల్లాసము కలిగె రామునకు హరిభక్తుల సేవలను।
హితుడై కొందర విచారించు నటు యిచ్చునడుగు వస్తువును॥౨౦౦.
చరణక్షాళన కొన్నిసాధులకు చక్కగ జేయుచు నుండు।
సరసనుకొందర జేయించునుదా స్నానంబును నాతండు॥ ౨౦౧.
చందన మిచ్చుచు నొకయెడనుండును చేతులదా ముకుళించి।
వందన మిడుచును నొకయెడ పదముల వరుసను పిసుకును వెలసి॥
సాధులపాదుకల్ మోయునునొకయెడ సలుపుగానముకొందరెడన్
పాడుగ భోజన మిచ్చుచు కొందర పరుండజేయు కొందరటన్॥
గుడుగుడినింపును భంగుజేయుచును కోరువార్ల కిచుచుండు।
విడెములనిచ్చును కొందరకచ్చట వినితవార్త జెపుచుండు॥ ౨౦౪.

తులసీమాలల వేసి కొందరికి తుష్టిపరచు పూజలచే।
విలసితముగ కస్తూరి తిలకముల విధితో బెట్టుచువెలసె॥ ౨౦౫.

భూషణ వస్త్రముల్ కొందరకిచ్చుచు భోజన సామగ్రిచ్చు।
ఆశనునొకయెడ యేకాంతంబున నాత్మజ్ఞానము జెపుచు॥ ౨౦౬.

భోజన పజ్త్తిని నన్నంబిడుచును పునితనీరు ద్రాగించు।
భాజినములనిడి విసురుచునుండును పడకలవేయును మనుపు॥ ౨౦౭.

కొందరి మేనుల చక్కనొత్తుచును కోరినిద్ర సాధనమై।
పొందుగవేయును చామర ములదా పునితసాధులకు నిజమై॥

వ్యాపకుడగుయా భగవంతుండును వాసిసేవ జేసెమును।
ప్రాపుగ భక్తుని కార్యము కొఱకై ప్రకటితరూపు గొనుచును॥

మూడుదినంబులు నిట్టిసేవలో మోదపరచి తగనుండి।
వేడుకతోడను వస్త్రధనంబుల విపులంబుగ నిచుచుండి॥ ౨౧౦.

అందర నయ్యెడ సాగనంపుచును నదృశ్యుడయ్యె రాముండు।
పొందుచు దుర్జను లనుతాపంబును భువి కబీరునకు నేడు॥ ౨౧౧.

చెడుపును చేయం దలచిన నదియె చేరదెచ్చె కీర్తియును।
విడుపక రాముడు గాపాడెను యని విశ్వసించి వారలును॥ ౨౧౨.

కబీరు వద్దకు వచ్చి శరణుయని కాళ్ళను తగబట్టగను।
సొబగున వార్లకు రామ మంత్రమును సూటిగజెప్పుచు నటను॥

ఉపదేశించుచు భక్తిమార్గమున నుండజేసె వారలను।
ఎపుడు కబీరుడు రామునికరుణను నెంచి తృప్తినుండెమును॥ ౨౧౪.

---

ఒకయెడ రేయిని సాధుజనంబులు నుచితయాత్ర జేయుచును।
అకళంకుండగు కబీరునింటికి యందరు గనిరాగాను॥ ౨౧౫.

భార్యయు భర్తయు నిరువురువారల పాద వందన మొనరించి।
కార్యకరంబుగ కూర్చుండనియును కరుణతోడ ప్రార్థించి॥ ౨౧౬.

సతినింగాంచుచు పతియటు బలికెను సాహిత్యము వారలకు।
కుదురుగ నిప్పుట యుక్తంబనగను కుంఠితయై సతిబలుకు॥ ౨౧౭.
తిలయంతన్నము యింటను లేకను దీనత్వముచే మనము।
తలమల బడుచును నుపవాసంబుగ తనివినుండ నేడుసుము॥ ౨౧౮.
ఇరుగు పొరుగునను నప్పునడిగినను నియ్యకనుందురు యెవరు।
గురుతుగ కోమటి నడిగివత్తునని కోరివెళ్ళె బాజారు॥ ౨౧౯.
రామనామమును నుడువుచు నొక్కతె రాత్రియందు వెళ్ళగను।
సామగ్రియుగల దుకాణమొక్కటె సరగున గనె వనితయును॥
సతియును వెళ్లుచు నడిగె కోమటిని సాధులువచ్చిరింటికిని।
హితపరుడగుచును సామగ్రిని మరి యిచ్చితేని వార్లకని॥ ౨౨౧.
ద్రవ్యము దెచ్చియు ముట్టజేసెదను తప్పననుచు జెప్పగను।
భవ్యుడు గాకను పేరూరేమని పణతినడిగె నాతడును॥ ౨౨౨.
సతియనె కబీరు కాంతనగుదునే సాధులింటికి వచ్చిరని।
హితసామగ్రిని నియ్యమనుచునట నెలమివేడె కోమటిని॥ ౨౨౩.
సుందర ముఖమును జూచి కోమటియు సొక్కెను కామాతురుడై।
అందముతోనా మనోరథంబును నబ్బజేయుము నేడె॥ ౨౨౪.
పప్పును బియ్యము వస్త్రభూషలను బంగారమునిచ్చెదను।
ఒప్పుగకోరికె దీర్చనియెడలను నూరక నరుగనగాను॥ ౨౨౫.
సతియును దలచెను తనలోతానే సాదులకన్నమిడ కున్న।
సత్యహానియగు మరియొకచోటను సామగ్రిని నేగాన॥ ౨౨౬.
విధినిషేధములు లౌకికులకే విధించబడెనని దలచి।
కుదురుగ శ్రీహరి చరణంబులనే కోరియుబట్టిన మనిషి॥ ౨౨౭.
చూడగ వలవదు ధర్మాధర్మముల్ సూక్ష్మదృష్టి నుండుటచే।
ఈడుగ భరతుడు తల్లిమాటలను యింపొందక విడుచుటచె॥
శ్రీరఘురాముని చెంతను జేరెను శ్రీయుతు ప్రహ్లాదుండు।
నీరస బుద్ధిని తండ్రిని విడిచియు నీరజాక్షు గనుచుండు॥ ౨౨౯.

గురునుల్లంఘన జేసెను బలియును కోరియు వామనుకొఱకై।
వెరువక తలిదండ్రితరులనందర విడిచిరి గోపికల్ హరికై॥ ౨౩౦.
ఈవిధముండుట తలచియు సతియును ఈశ్వరునిపై భావమును।
సావధయగుచును నుంచిజెప్పెను సామగ్రిమ్ము ముందుగను॥
నీమనోర్కెలెతగ దీర్చెద వెనుకను నేతిరిగిపుడె వచ్చెదను।
పాదుగ సాదువు లుపవసించుచు పండుకొందు రనగాను॥ ౨౩౨.
ఇందుకు కోమటి ప్రమాణమిమ్మని యింపుగ తానడుగగను।
సందియమొందక సత్యముజేసియు సామగ్రిని దెచ్చెమును॥
ఇంటికిరాగనె సాదుజనంబులు నిమ్మని సాహిత్యంబు।
వంటను తామే చేసికొనుటకును వల్లనగును నిరతంబు॥ ౨౩౪.
అటులగాకయని సాహిత్యంబును నామెవారికియ్యగను।
పటుతరముగనే వంటనుజేయుచు భక్షించిరి సాధులును॥ ౨౩౫.
పిమ్మట సతియును భర్తను జూచుచు పిలిచెను యేకాంతమున।
నమ్మిక యిచ్చుచు కోమటికిని నే నానావస్తువు లీవుగన॥ ౨౩౬.
దెచ్చితి నిప్పుడు కోమటి కోరికె దీర్చవలయు నందునకై।
సచ్చరితుడవగు నీదుయనుజ్ఞను చక్కనడిగెదను బాగై॥ ౨౩౭.
వెళ్ళెద ననగను కబీరుడందుకు విశేషమయ్యెను యనుచు।
ఉల్లమలరగను వణిజుడుజేసిన యుపకారము మేలనుచు॥ ౨౩౮.
సంత జనులకై దేహమునమ్ముట సంతోషంబయ్యెనని।
ఇంత రేయిలో నొంటరియగుచును యెటు చనుదువు బురదగని॥
అనుచు జెప్పుచును సతిని మోసికొని యతడె దెచ్చె నంగడికి।
ఘనముద మొందుచు సాధులకన్నము కలిగెగదాయని మరిగి॥
సతిని క్రిందవిడి కోమటికోరికె సంకోచింపక దీర్చు।
హితులగు సాధుల సేవజేయుటకు యింటికి నే గెద దురుసు॥ ౨౪౧.
జెప్పి వెళ్ళగను కబీరుభార్యయు చేరెను కోమటి యెడను।
ఒప్పుగ నాతడు దారిజూచుచును నుండుసమయ మందునను॥ ౨౪౨.

కోమటి యామెను చూచిన మాత్రమె గురుతర మోదమునొందె।
నేమము తోడను వర్షముగురిసెను నిండు బురద చెన్నొందెII ౨౪౩.
ఎటుల వచ్చితివి కాళ్ళకు బురదయు నెంతయు నంటక నుండన్।
పటుతరముగనా కబీరుభార్యయు బలికెనతడు వినుచుండన్II ౨౪౪.
సాధుజనులుబహు సంతోషించిరి సామగ్రిని నిచ్చుటచె।
పాడుగ పుణ్యము నీకె ఘటించెను పరితృప్తిని బొందుటచెII ౨౪౫.
నీవిటుజేసిన యుపకారమునకు నే నెంతయిడిన జాలదని।
భావశుద్ధితో పతివ్రతనగుటచె పతియాజ్ఞను నడుగగనిII ౨౪౬.
భర్తయె నన్నిటు మోసియు దెచ్చెను బహు సంతోషముతోను।
కర్తయగుచు నీ మనోభీష్టమును కార్యకరిగ జేయమనుII ౨౪౭.
ఇదివిని కోమటి యనుతాపముతో యీ నరదేహము నొందె।
విదితంబుగనే సార్థకమెద్దియు వెతికి జేయలేనైతిII ౨౪౮.
ఎనబైనాలుగు లక్షయోనులను నెలమి దిరిగి యపచితమై।
మనుజశరీరము నొంది విషయముల మరిగి యుంటిని నిజమైII
తులసీ వనమును తెగనరికినగతి దోషము కలిగెను నాకు।
ఇలను కబీరుడు భగవద్భక్తికి యింపొందుచు నుండతగుII ౨౫౦.
భోగ దానమునకై సతి నిచ్చెటి పురుషు నెచట గనలేదు।
సాకల్యంబుగ ప్రతివతరాలగు సతినితల్లివలె దలతుII ౨౫౧.
నమస్కరించుచు నామెకునప్పుడు నన్ను క్షమింపుము నీవు।
కొమరొప్పగనే తప్పుజేసితిని కుటిలత నిడితినితగవుII ౨౫౨.
బాలకుడనునే కబీరునెడగొని పదములపై వేయమనన్।
వీలుగ సతియును బలికెనప్పుడటు విమల రాము కృపనుగనన్II
అనుతాపంబును కలిగెను నీకును యఖిలపాప మరిగెనను।
ఘనభవరోగము వెళ్ళెననుచు తగ కబీరుకడ దెచ్చెనునుII ౨౫౪.
కోమటి యప్పుడు యభిమానంబుల కుదురుగాను తావిడిచి।
నేమము తోడను నమస్కరించెను నిండుప్రీతితో వెలసిII ౨౫౫.

కరుణా కరుడై యాలింగనమును కబీరుడతనికి జేయు।
చిరతరముగ శ్రీ రామునిభజనలో జేర్చెనతని మేలయ్యు॥ ౨౫౬.
కబీరువద్దకు నామదేవుడును జ్ఞానదేవుడును రాగ।
ప్రబలప్రేమచే వందనమిడుచును బహుమోదము నొందంగ॥
నామదేవుడనె యాత్రజేయుచును నానాస్థలముల గనుచు।
సేమమలరగను నినుగాంచితిమిటు చెలగెను మోదంబనుచు॥
ఏకనిష్ఠచే నందరుగూడుచు నీశుకరుణ పొగడిరటు।
జోకను నాముడు పండరి రమ్మని నూటినడిగె కబిరునటు॥ ౨౫౭.
కబీరుడందుకు నామోదించగ జ్ఞానదేవ నామునితో।
సొబగున వారలు కృపనుంచుండని సూచనజేయుచు దయతో॥
ఇతరతీర్థముల కేగిరివారలు నీశుదలచి కబీరుడును।
కుతుకముతో కొన్నిదినముల పిదప కోరివెళ్ళె యాత్రకును॥
పండరికరుగుచు పాండురంగనికి భక్తితోడ సేవించి।
నిండుప్రేమతో నామదేవునికి నివృత్తి జ్ఞానుని జూచి॥ ౨౬౦.
ఇతరులు భక్తుల నటుసేవించియు నింపుగ రామేశ్వరము।
హితపరుడగుచును వెళ్ళుచు జనులకు నీశుకథల జెప్పనుము॥
ఒకదినమందును నొకనగరినిదా నొప్పుగ దిగుచుండుచును।
సకలురు వినునటు హరికీర్తనతగ సానందముగ చేయగను॥ ౨౬౪.
వినుచుండెడియా లోకులలోనిరు విప్రులు తత్వ, జీవుడని।
ఘనమోదముచే మనసుకరగబడి కబీరునకును శరణుయని॥ ౨౬౪.
దండముబెట్టగ శుద్ధభావమును ధరణిసురులు బొందిరని।
అండజవాహను భక్తు కబీరుడు ననుగ్రహించె వార్లకని॥ ౨౬౫.
వెనుక కబీరుడు రామేశ్వరమును వేడుకలలరగ వెళ్ళి।
అనువుగ కాశీ జేరెనాతడును నమితప్రేమ విలసిల్లి॥ ౨౬౬.
జీవుడు తత్వుడు బంధువిప్రులచె జెందిరి యాంక్షను నపుడు।
కేవల నిందితు లగుచును బహుగా క్షారశిక్ష నొందిరటు॥ ౨౬౭.

కుజనులనేకులు తొందరబెట్టిన గురుపదములె గతియనని।
నిజభావముచే కుటుంబములతో నిలిచియుండ వారగని॥ ౨౮౯.
ఇతరబ్రాహ్మణులు భోజనాదులను నిడకుందురు వార్లకును।
సతతము నిట్టుల కొంతకాలమటు జరగబడుచు నుండగను॥ ౨౯౦.
ఒకని కుమారుడు వయసును బొందెను యొకనికూతు రెవ్వనము।
ప్రకటంబుగనటు బొందుకాలమై పాటించెను నాదినము॥ ౨౯౧.
వారలిరువురకు వధూవరులునటు వరుస జిక్కకుండుటచే।
కోరుచు నిరువురు కబీరువద్దకు గూడియువచ్చిరి క్రియచె॥ ౨౯౨.
నమస్కరించుచు జరిగినసంగతి నమ్రులగుచు జెప్పగను।
కొమరొప్పగ నా యుపదేశంబును గొనగను నిట్లయ్యెనను॥ ౨౯౩.
ఇద్దరిలోపల సంబంధంబును నిరవుగ జేయుండనియు।
పద్దుగమీరలు పరమపదంబును బాగుగ పొందెదరనియు॥ ౨౯౪.
ఇటుల కబీరుడు జెప్పగ వారలు యేపున నంజలిజేసి।
పటుతర కృపయని వారలిండ్లకును బరతెంచిరి తగ వెలసి॥ ౨౯౫.
వివాహలగ్నము సామగ్రియుమరి వీలుగాను తగజేర్చి।
నివేశమునసుతు నుపనయనంబును నిగుడగ నట నెరవేర్చి॥ ౨౯౬.
మరుదినమందున పెండ్లిజేయుటకు మహినిశ్చయపరచంగన్।
పురవాసులురగు విప్రులు వచ్చుచు పొందుగనడిగిరి నలుకన్॥
బంధులు లేకను వివాహమెట్టుల పదపడి జేసెదరనగన్।
ఇంతియు కొమరుడు నింటనుంటచే నెలమిని జేతుము బాగన్॥
పశుపక్షులవలె మాకు జాతితో పనిలేదని చెప్పగనె।
విశదమయ్యెనటు విప్రులకప్పుడు వీరలు భగవత్కృపనె॥ ౨౯౯.
కోరినవార్లని బ్రాహ్మణులందరు గూడియు నాంతును దీసి।
వారలె పిల్లల నిచ్చిపెండ్లియును వరుసను సలిపిరి మించి॥ ౩౦౦.
కర్మమార్గముల చెడపగూడదని కలుపుకొనిరి జాతినను।
నిర్మలురగు తత్వజ్ఞుజీవుడునిది నిజగురుని క్రియయనుచును॥ ౩౦౧.

వారణాశికిని వచ్చియుగురునకు వందనమిడ్డి జెప్పెనట|
నేరుగతమకును జరిగినవృత్తాంతము నిత్యమంగళ మగునట్టు॥ ౫౫.
ఆనందించుచు కబీరుడందుకు నాశిషలను జేయగను|
సానందనముతో వార్తలుమళ్ళియును వరగజేరిరి గృహాంబులను॥

కాశీపట్టణమందొక వణిజుడు కాపురముండె ధనికుండు|
వాసిగనతనికి నయిదుపుత్రులును వసుధను ఖ్యాతియుచుండు॥
లావణ్యముగల భార్యయునుండును లక్షణయుక్త బంధువులు|
సేవకజనులును సంపత్తియుమరి సిద్ధమగుచు విలసిల్లు॥ ౫౬.
కొంతకాలమున శరీరమందును గురుతర రోగముగలిగెను|
పొందుగపూర్వపు కర్మవశంబున పురుగులు మేనునమెలగెను॥
నలుప్రక్కలలో దుర్గంధంబును నరులోర్చకయుండిరటు|
ఇల్లలోగలిగిన వైద్యవిశేషము లేపునజరుగుచు నుండు॥ ౫౭.
నవగ్రహంబుల్లు దారుణమగుటచె నరదేవతులం బిలిచి॥
వివరంబగునట్లు జపహోమంబుల విపులంబుగ తగజేసి॥ ౫౮.
కులదేవతలటు క్షోభించిరియని గురుతుగ వాటికిమ్రొక్కి|
మలారియనునొక దేవతకునుమరి మహితపూజలను నిక్కి॥ ౫౯.
సప్తశతిగ్రంథ పారాయణమును చక్కగనటు జేయుచును|
గుప్తదానముల బహుగాజేయుచు కోరిసూర్య పూజయును॥ ౬౦.
సలుపుచునుండిరి గాయత్రీజప సంపుటిజేయుచు మరియు|
బలువుగరుద్రుని యభిషేకంబును బాగుగజేసిరి గనియు॥ ౬౧.
గణపతిజపమును కాలభైరవుని ఘనపూజల జేసిరటు|
దినదినమునకును క్రియలజేసినను దిగకుండెను వ్యాధియటు॥ ౬౨.
అధికాధికమై వ్యాధిపెరుగుటయు నావర్తకుడటు గాంచి|
కుదురుగ బిలుచుచు బంధువర్గముల కోరికెదెల్పెను వలసి॥ ౬౩.

భాగీరథిలో నాదుశరీరము బడవేయుడు మీరలును।
రాగమునాపై యుంచకుమికపై రట్టయ్యెను వ్యాధియును॥ ౨౯౪.
విపరీతంబగు కర్మంబునునే విపులంబుగ జేయుటచె।
నెపమునవ్యాధియు సంభవమయ్యెనునే చచ్చుట తగివెలసె॥
ఇటులంజెప్పగ బంధువులందరు యేడ్చిరియటు బహుగాను।
పటుతరముగనటు గంగయొద్దునకు బట్టివెళ్ళిరి వణిజును॥ ౨౯౫.
అమితజనంబులు చూచుటకొఱకై యచటికివచ్చిరి యపుడు।
గొమరొప్పగనా బంధువులందదు కుండలదెచ్చిరి నాడు॥ ౨౯౬.
వణిజునికాళ్ళకు రెండుకుండలును వరుసను తలకును రెండున్।
అణుకువతోడను గట్టియుంచతగ నటనొకడగు భూసురుడున్॥
కబీరుశిష్యుడు పద్మనాభుడును గంగకరిగె నయ్యెడను।
సొబగునహంతను బూనినసంగతి సూటిగనట వినుచును॥
వణిజుసమీపము వచ్చియునాతడు వచనముజెప్ప దొడంగు।
అనువుగనీవును ప్రాణత్యాగము నవనిజేయ పాపమగు॥ 300.
ఎనభైనాలుగు లక్షలయోనుల నెలమితిరిగి తిరిగియును।
మనకునువచ్చెను నవచితమగునటు మనుజతనువు నియ్యెడను॥
ఇందుననీవును నాత్మహంతకును నిష్టముజేసితి వేని।
పంతముతోడను భవనరకమునిను పట్టువిడువ దెప్పుడని॥ 3౦౨.
మనుజశరీరము వచ్చినవెనుకను మాధవుని భజించవలెన్।
జననమరణములు నందునబోవును సత్యంబున నిలువవలెన్॥ 3౦3.
వినుకొని వణిజుడు జెప్పెనుపాయముల్ విధిని యెన్నిజేసినను।
దినమును వ్యాధియు పెరుగుచువచ్చెను దెప్పరమొందితి గనను॥
భరింపజాలక భాగీరథిలో బడుటబాగు దలచితిని।
నిరంతరంబును దుఃఖబాధలను నేసహించ నేరనని॥ 3౦౫.
వినుకొని జెప్పెను పద్మనాభుడును విహితోపాయమొకటుండు।
అనుసంధింపక దానిని మీరలు నలసితిరందరు నిపుడు॥ 3౦౬.

రామరామ శ్రీరామాయనుచును రంజిలజెప్పిన యెడలన్।
సామజ వరదుని కృపచే వ్యాధియు చక్కనగును నిర్యోడలన్॥
వేదపురాణము జపములు తపములు విధినారంభింపగను।
పాదుగ రాముని నామముజెప్పక పనిబడకుండిలలోను॥ ౩౦౭.
హరినామమునకు విముఖులై వేల్పుల యనేకముగ గొలచినను।
బోరిబోరియాత్రల జేసిననైనను పొందరు సుఖమించుకను॥ ౩౦౮.
శ్రీరఘురాముని ధ్యానమువిడిచియు చేతురు యోగసాధనము।
భూరత్నాన్నము గోదానంబులు *పాలియు వ్యర్థమగునుసుమీ॥
వచ్చినజనులకు పద్మనాభుడును వాసిగజెప్పెను పిదపన్।
పక్షముతోడను త్రివారములునిటు పలుకుడి నామంబొప్పన్॥
భవరోగంబును నశించుననుచును భక్తుండటుచెప్పగను॥
సవినయముగనా జనులు రామయని సలిపిరి ఘోషంబటను॥ ౩౧౨.
వణిజుండప్పుడు రామనామమును వరుసతోడ జెప్పగను।
ఘనమగురోగం బుపశమమయ్యెను గనుచుండగ లోకులును॥
వ్యాధిగ్రస్తులునైన యితరులకు వ్యాధులు నిరసనమయ్యెన్॥ ౩౧౪.
సాదరముగ యా నామమనుటచే సౌఖ్యమునొందిరి చయ్యన్॥
వణిజుడులేచియు పద్మనాభునకు వందనమును తగజేసెన్।
గుణయుక్తుండని యితరజనులచే కొనియాడంబడి వెలసెన్॥ ౩౧౫.
అనేకులచ్చట రామునిభజనను నవలంబించిరి తగను।
వినీతుడగుచును వర్తకుడప్పుడు వెళ్ళెతనగృహమునకును॥ ౩౧౬.
కొందరుదెల్పిరి కబీరునకుయీ గురుతరమగు సంగతిని।
పంతముతోడను బిలిచెనురమ్మని పద్మనాభు ముందుగని॥ ౩౧౭.
మూడుసారులును పలుకుటెందుకను మూలరామనామమును।
కూడినభక్తిని యొకసారనినను కుదురుగ బంధము విడును॥ ౩౧౮.
వాలాకోటి రామునిభజనచే వాల్మీకుడు తానయ్యెన్।
కాలాంతరమున రామాయణమను గ్రంథమతనిచే నయ్యెన్॥

---

*పాలియు - బలిహరణము.

నూరుకోట్ల యాగ్రంథము శంభుడు నుడువియు తగ చేకొనుచు
ప్రారంభమునను స్వర్గము మర్త్యము పాతాళములకు పంచు॥
మూడులోకముల పంచగమిగిలెను ముఖ్యంబొక శ్లోకంబు।
గూడియు ముప్పది రెండక్షరములు గురుతుగ శ్లోకము నొప్పు॥
మూడులోకముల బంచెనునప్పుడు ముప్పది యక్షరములను।
వీడకనప్పుడు రెండక్షరముల విధిని నిలుపుకొనె తాను॥ 3౨౨.
సముద్రమథనపు కాలమునందున జనియించె మహావిషము।
కోమరొప్పగనది మూడులోకముల కోరిదహించెను వినుము॥
ఆసమయంబున చంద్రశేఖరుం డావిషమును మ్రింగుచును।
వానిగ రామా యని జెప్పగనే వరుస శీతమయ్యెమును॥ 3౨౮.
ఈవిధముండగ నొక్కసారియే యిలనామము నుడివినను।
భావశుద్ధిచే సకలార్థంబులు భవ్యమగునని దెలిపెమును॥ 3౨౯.

---

కాంతయు పుత్రునితోడనుండినను కబీర్ విరక్తుడై యుండు।
శాంతియు దాంతియు సద్భక్తియుదా సలుపుచు నెప్పుడు నుండు॥
అయుతదశంబగు సాధుపులొకయెడ హరినామము బాడుచును।
నియతులై ద్వాదశ పుండ్రములిడికొని నెరతులసీ మాలలను॥
మెడను వేసికొని కాశీనగరము మెలగివచ్చి యడిగిరటు।
పుడమినిమాకును భోజనమొసగెటి పుణ్యులుందురే యిట్టు॥
కుజనులుకొందరు కబీరుడిచ్చును కోరినయన్నం బనుచు।
ప్రజకును దెలుపగ సత్యంబనుచును భాగవతులు తగవినుచు॥
సీతారామా యనుచును జెప్పచు చేరిరియాతని యిల్లు।
పాడుగనడిగని కబీరువారల పదములబడి విలసిల్లు॥ 33౦.
సాధులు జెప్పిరి తీర్థాటనమును సలుపుచు మేమందరము।
వీధులదిరుగుచు కాశీపురమున వేంచేయగ గనిమమ్ము॥ 33౧.

అచ్చటకొందరు జెప్పిరినీవును నన్నదాన మిడుదువని।
హెచ్చినప్రీతిని వేంచేసితిమన నిడియు కబీరువినుకొని॥ ౩౩౨.
మంచిదియనుచును తులసిదాసుడను మహిపవర్తకు డొకడుండు।
అంచితముగతా నతనెడకేగుచు నార్తినిజెప్పుచు నుండు॥ ౩౩౩.
సాధుజనంబులు భోజనమునకై చనుదెంచిరి నాగృహము।
లేదనకుండను సాహిత్యంబును లెక్కతోడ నాకిమ్ము॥ ౩౩౪.
ఇదివినియతడనె నున్నత్తుండై యిచ్చెద సాహిత్యంబు।
కుదురుగభార్యను భోగదానముగ కూరిమినిమ్మా దినంబు॥ ౩౩౫.
సమ్మతివచనము కబీరుడిచ్చుచు సాహిత్యంబును దెచ్చె।
నెమ్మదితోడను సాధుజనులకును నెనరునపూర్తిగ నిచ్చె॥ ౩౩౬.
సాధువులందరు తృప్తినిబొందిరి సంతసించి కబీరుడును।
హేతులేకనే సాధులసేవయు నీశుకృపను దొరికెనను॥ ౩౩౭.
సాయంకాలము కాగనెభార్యతో సరగునజెప్పెను పతియు।
చేయందగనగు పనియును నీవును చేయవలెను నేడనియు॥ ౩౩౮.
విలసిత తులసీ దాసునకును నిను విక్రయించితి రేయికిని।
మెలగియు నీవతనిష్టపూర్తిని మిగతలేక జేయుమని॥ ౩౩౯.
సాదుజనులకును నిచ్చినతడుతగు సామగ్రిని నీదినము।
పాదుగనీవును సంకోచింపక పాలించుము వాక్యసుము॥ ౩౪౦.
వనితయునందుకు సంతోషింపగ వామచేయి బట్టుకొని।
అనఘు కబీరుడు వెంబడిదెచ్చెను నలవణిజుని గృహముగని॥ ౩౪౧.
సాహుకారుడా సమయమునందును సౌఖ్యంబగు మంచమును।
బాహుళ్యంబుగ నలంకరించియు పన్నీర్ పువులుంచుచును॥ ౩౪౨.
వసనచందన తాంబూలంబుల వరుసతోడ నుంచుకొని।
విశేషవాంఛతో దారిజూచుచును వెలసియుండ తానుగని॥ ౩౪౩.
సతినిగూడుకొని కబీరుడరిగెను సరగ వణిజుగృహమునను।
హితముగనేటికి భోగదానమును నిమ్మువణిజున కనుచును॥ ౩౪౪.

సతినివిడిచియటు కబీరు వచ్చెను సరగున తన గృహమునకు।
పతితుండగుయా వణిజుని గాంచుచు భాగ్యశాలి తగ బలుకు॥ ౩౮౪.
అపారమయ్యెను నీదుపకారము యన్నమిడితివి సాధులకు।
కృపావిశేషము చేయుటచేతను క్రియయుగలిగె తగమాకు॥ ౩౮౬.
విషయేచ్ఛయు నీకైనందుననే వేంచేసితి యిష్టమును।
సుషిమముతోడను చేసికొనుమనుచు సూటిబాడె పాటలను॥
కామాతురుడై వణిజుండామెను గాఢాలింగించుటకు।
సామాన్యంబగు స్త్రీయనిదలచుచు చనెను సమీపంబునకు॥ ౩౮౭.
దీపమునుంగని పతంగమందుపై దిగ్భ్రమగొని బడునటుల।
పాపరూపుడగు వణిజుండామెను పట్టబోవు నయ్యెడల॥ ౩౮౯.
రఘురాముండును కొత్వాల్ రూపును రంజిలచేకొని యపుడు।
అఘహరంబునగు ధనుర్బాణములు నల తల్వార్ చెయినుండు॥
ప్రసన్నుడగుచును కోపముతోడను బలికెను వణిజునితోను।
అసమానంబగు పాపకర్మమును నరయక జేసెద విటను॥ ౩౯౧.
చాపబాణమున నినునేనిప్పుడు చంపెదనని జెప్పగను।
నీపున వణిజుడు గజగజవణకుచు యిలనపరాధినైతినను। ౩౯౨.
అడిగిన ధనమును నిచ్చెదనీకును నరసిబోవు ప్రాణముల।
ఇడుముల బడుచును రాముని కాళ్ళను యింపుగబడె నయ్యెడల॥
ధాతువయెచ్చటి దచ్చటనిలిచెను దశరథరాముని గనను।
పాదుగ రాముడు నతనింజూచుచు పలికె నోరి, నీవు వినుము॥ ౩౯౩.
కబీరు భార్యయు నాదుభగినియగు కాళ్ళకు దండమిడుమనెన్।
అబలకు వణిజుడు దండంబిడుచును యన్యాయము నావలనన్॥ ౩౯౪
జరగంబడినది గావుననీవును క్షమించి గృహమేగుమనెన్।
గురుతుగ రాముడు వణిజుని గాంచుచు కొంటెతనముమానుమనెన్
ధనమదముననిటు మరవవద్దు నిను ధరజాగ్రత నుండుమని।
అనుతాపముతో కబీరుచరణము లందజేరు సత్యమని॥ ౩౯౫.

కబీరుభార్యను పిలుచుకొనేగియు కబీరునింటను విడిచి।
ప్రబలక్రీడలను జూపి రాముడును ప్రసన్నవచనె నటు వెలసి॥ ౩౫౮.
సతినిజూచియా కబీరుడనియెను సాహుకారు కడనుండి।
హితమును జేయక వచ్చితివెందుకు యింతశీఘ్రమున నిగుడి॥ ౩౫౯.
పతివ్రతజెప్పెను కొత్వాలచ్చట ప్రకటమగుచు కోమటిని।
అతులిత శిక్షను జేసినన్నునిటు యతడుదెచ్చి విడిచెనని॥ ౩౬౦.
కోపయుక్తుడై కబీరువినుకొని కొత్వాలింటికి నరిగి।
బాపురె యనుచును కేకవేయగను భయమున కొత్వాల్ కలగి॥
వాకిలి తెరచుచు వెలుపల వచ్చియు వందనమిడె కబీరునకు।
జోకనునతనికి కబీరుడనియెను సుఖమగు భోగము కొఱకు॥ ౩౬౨.
తులసి వణిజునకు నాసతినియ్యగ తొందరెందు కిడితివటు।
ఇలలోనాతడు సాధులకన్నము నెలమిని నిచ్చెను నేడు॥ ౩౬౩.
పతివాక్యమునకు నడ్డములేకనా భార్యయుండె తగనటను।
ఎదురుగ వచ్చుచు నేకాంతంబున నెటుజేతువు శిక్షయును॥ ౩౬౪.
ఇదివిని కొత్వా లాశ్చర్యముతో నేమియుదోచక యుండి।
కుదురుగ వచనము జెప్పెను పిమ్మట కోమటి నేగనకుండి॥ ౩౬౫.
ఏవిధసంగతి నాకును దెలియదు యీశునిసాక్షిగ నేను।
భావంబందున నుంచితినేనియు భ్రంశమగును నాకన్ను॥ ౩౬౬.
శ్రీహరిభక్తుడవై తగునీకునే చెప్పనెడల నన్నృతంబు।
బాహుళ్యంబగు రవరవనరకము బడుదును నేనునిజంబు॥ ౩౬౭.
కబీరుడిదివిని రాముని చర్యగా కనబడు నిదియని తలచి।
సొబగున కృపచే భక్తరక్షణము నూటిజేసె నని యెంచి॥ ౩౬౮.
తులసీవణిజుని గృహమున కేగియు దురుసుగననె యాతనితో।
ఇలలో శ్రీరఘురాముడు దర్శన మిచ్చెను నీకును దయతో॥ ౩౬౯.
అనేకసాధనల్ జేసెడివారల కగుపడకుండును నతడు।
అనాయాసముగ జూడబడెనునీ యపారభాగ్యము నేడు॥ ౩౭౦.

ఫలించెననగను తులసీవణిజుడు బట్టె కబిరుపదములను।
కళంకయుక్తుడ, వ్యభిచార్యుడ, నను గాచితి వీవియ్యెడను॥ ౩౭౧.
విషభక్షణచే ప్రాణరక్షణము విహితంబగు నట్లయ్యెఁ।
*సుషిమరాతిని గట్టుకొనియుదధిని నూటిగ నీదినయట్లయ్యెఁ॥
అనుతాపముతో నిటులంజెప్పుచు హరిభజనను రతిగలిగెఁ।
ఘనపాపంబుల బారదోలుచును కరివరుసేవను వెలిగెఁ॥ ౩౭౩.
కబీరుడింటికి వచ్చియు రాముని ఘనచింతన జేయుచును।
ప్రబలభక్తితో భజన జేయుచును భార్యతోడ నుండెమును॥ ౩౭౪.
మహితప్రభావం బగు నీచరితము మరాటిభాష నుండగను।
విహితంబగునటు బాలకృష్ణుడిల విన్నపించె తెనుగునను॥ ౩౭౫.

---

జగమిత్రుని చరిత్రము.

జగమిత్రుండను నామాంకితమున జన్మించెను నొక ద్విజుడు।
ప్రగుణంపరలీవై జనమనునొక పట్టణంబు నందుండు॥ ౧.
భిక్షమెత్తుకొను ధాన్యమువల్లనే ప్రీతినిబొందుచు నుండు।
కుక్షిభరంబును కుటుంబపోషణ కుదురుగజేయుచు నుండు॥ ౨.
శ్రీహరి భక్తిని సలుపుచు మరియును చేయుచుండు హరికథయు।
మోహంబునుతన మనసుననుంచక మురరిపుధ్యానము జేయు॥ ౩.
అనేకులాతని నాదరించుచును హరికథలెప్పుడు వినుచు।
ధనాధిపతులును పుణ్యవంతుడని తలచుచునుండిరి మనుచు॥ ౪.
ప్రతిష్ఠగలుగగ కొందరు కుటిలులు పాటించిరి వైరమును।
కుతర్కపరులగు దుర్జనులందరు గూడి యొక్కమాపునను॥ ౫.
భక్తుడు నిద్రను బొందగ నింటికి పరగ నగ్ని బెట్టగను।
సక్తతలేచియు గన్గొనెనప్పుడు సతి సుత సహోదరులును॥ ౬.
అంతట నగ్నియు నావరించుకొని యాతండుండగ జూచెఁ।
పంతముతోడను పండరినాథుని భక్తితోడ దా బిలిచెఁ॥ ౭.

---

*సుషిమ = చల్లనిది.

అనాథరక్షక యాపద్బాంధవ హరిగోవిందా యనుచు।
వినీతుడగుచును రమ్మని వేడగ విఠలరంగడును వినుచు॥ ౯.
సుదర్శనంబును చేతనందుకొని నూటి నతనిరక్షించెన్।
కుదురుగ వీధిని నుండెడి విహితులు గూడిరి భయమును బాపెన్॥
బైటిచూపునకు భక్తుడు నగ్నిని బాధింపంబడె ననుచు।
పాటింపుచు పరితాపముబొందుచు ప్రజలందరు నటుగనుచు॥ ౧౦.
సూర్యోదయమున నగ్నియంతయును నూటిగ చల్లారగను।
కార్యార్థంబుగ జనులుగూడుకొని కలిసివచ్చిర య్యెడను॥ ౧౧.
బూడిదె బొగ్గులు నగపడకుండగ పుణ్యాత్ముడు హరిబాడెన్।
వేడుకతోగని విఠలరంగని విమలమహిమ గొనియాడెన్॥ ౧౨.
కుంతీసుతులను లాక్షాగృహమున గురుతుగ బ్రోచెను హరియు।
వింతగాగనిపు డీదినంబునను వీరల గాచెను గనియు॥ ౧౩.
అనుచు బలుకుచును నానందంబున నందరు చనిరిండ్లకును।
మనమున భక్తుడు మాధవుకృపకును మరిమరి దండమిడియెను॥ ౧౪.
కొందరు సుజనులు గూడియున్నప్పుడు కొంచెము భూమినాతనికి।
పొందుగనిచ్చిన పుణ్యంబగునని మొగిదెల్పిరి భక్తునికి॥ ౧౫.
భక్తుడు బలికెను భిక్షాటనచే బలురక్షణ జరగగను।
సక్తిగ భూమిని నైకొన్నను మరి సమకూరును బంధమును॥ ౧౬.
విశ్వకుటుంబినై విహితరక్షణను విఠలుడు దగజేయగను।
నశ్వరమగునీ యాశల బడుటయు నాశకరంబనగాను॥ ౧౭.
విహిత గృహస్థులు బల్కిరి యప్పుడు విత్తిన ఫలమంతయును।
సహచరులగుచును జేర్చియిచ్చెదము *రహి గొనుమని వేడుచును॥
దానముచేసిరి ధర్మంబనుచును ధరణీ సురునకు నపుడు।
మానుగ మాన్యము జగమిత్రుండును మన్ననగొని సుఖముండు॥
ఆవిధముననా భూమియు విప్రుని యధీనముగనుండగను।
భావహీనుడగు మ్లేచ్ఛాధిపతియు వచ్చి మచ్చరంబునను॥ ౨౦.

*రహి - కోర్కె.

భూమి లెక్కలను గని జగమిత్రుని భూమిని జప్తిగ జేయఁగ।
వేమరు తురకకు పురజనులందరు విజ్ఞాపనమును జేయఁగ॥ ౨౧.

ఇచ్చను మేమిల నిచ్చితి మతనికి నిహపర సాధనమనుచు।
హెచ్చిన కృపతో నాతని భూమిని నెలమి వేడి రిమ్మనుచు॥ ౨౨.

ఆతడు వినకయ పరివారముతో హరిభక్తుని గృహమునకు।
ఖ్యాతిని వెళ్ళుచు వ్యాఘ్రమునొక్కటి గరిమె తెమ్ము నాకొఅకు॥

పెండ్లిప్రతిష్ఠకు దెచ్చినయెడనే బెలుచనిత్తు భూమినను।
కండ్లకునింపుగ గనపరచని యెడ కనుము భూమిదొరకదను॥ ౨౪.

మంచిదియని జగమిత్రుడు వెళ్ళెను మహదారణ్యమునకును।
మించినయార్తిని మాధవ కేశవ మేలునొసంగు మనుచును॥ ౨౫.

జిల్లేదారుడు చూడంగోరెను చెన్నొందగ వ్యాఘ్రమును।
సల్లలితంబుగ కార్యసాధనము సలుపుము హరి రంగయను॥ ౨౬.

వేడుకొనంగను వ్యాఘ్రరూపుడై విష్ణువె యరుదెంచెమును।
జాడ తెలిసికొని శ్రీహరికప్పుడు సరగ బెట్టె దండమును॥ ౨౭.

ఈశుడు బలికెను నంగవస్త్రమును నెలమిగట్టి నామెడను।
అశను నీవును నూరిలోపలికి నతివడిగొని పొమ్మటను॥ ౨౮.

సద్భావముచే నుతించిభక్తుడు శరీర పులకము తోడఁగ।
ఉద్భవమగునా వ్యాఘ్రమునాతడు నొప్పుగ గట్టెను జూడఁగ॥ ౨౯.

ఊరికిముందర వ్యాఘ్రమురాగా హుంకారము నది జేయఁగ।
నారులు పురుషులు నందరు బెదరున నడవజాలకను డాయఁగ॥ ౩౦.

గోడల నెక్కియు మేడల నెక్కియు గురితో జూచిరి పులిని।
జాడనుభయమున పురజనులందరు సరగవేయ వాకిటిని॥ ౩౧.

జగమిత్రుండును పులినిబట్టుకొని చెయ్యనవచ్చుచు నుండఁగ।
అగణిత జనంబు లాశ్చర్యంబుల నందుచు వారలు నుండఁగ॥ ౩౨.

భక్తుని కొఱకై భగవంతుడె పులి భంగివచ్చెనని గనుచు।
సక్తిగ కొందరు బల్కుచునుండిరి సర్వేశ్వరు కృపయనుచు॥ ౩౩.

జనులును జిల్లెదారుని గృహమున సరగజెపిరి పులిరాకగా।
మనసున భయమున నింటివాకిటిని మానుగనేసిరి గనుకగా॥ ౩౪.
కోటవాకిటను భక్తుడు వచ్చుచు కూర్చుండెను పులితోడగా।
పాటవముగనా కోటకు బోవ నుపాయముగానక యుండగా॥ ౩౫.
పులియొకగర్జన చేయగ నప్పుడు పురివాకిలి క్రిందబడగా।
కలతలనొందక కోటనుదూరెను కరమాతడు పులితోడగా॥ ౩౬.
ప్రజల భయంబును బాపెను భక్తుడు పద్మదళాక్షుండనుచు।
సుజనుడు జిల్లెదారునితోడను సుఖముగగొను పులిననుచు॥ ౩౭.
భయమునవాకిలి బీగమువేసెను భార్యనుకూడి యతడును।
నయముగబల్కెను భక్తుండతనికి నారాయణుడె యనుచును॥ ౩౮.
దురుసుగ తపములు వ్రతములుజేసిన దొరకని దేవుడీతడగు।
వెరపున నీవును వాకిలినెందుకు వేసితివి తీయకడగు॥ ౩౯.
చంద్రునికన్నను శీతలత్వమును సరినొందిన వాడగును।
ఇంద్రలోకమున నుండునమృతమును నిచ్ఛచేయు వాడగును॥ ౪౦.
చూడగరమ్మని జెప్పగభక్తుడు నూటిగపులి గర్జించెగా।
జాడగపట్టును వదలుకొనుటకును సరగతానె యత్నించెగా॥ ౪౧.
జగమిత్రుండును శిరమునుబుణుకుచు శాంతము జేయుచునుండెగా।
భగవంతుండును భక్తాధీనుగ పదపడిలీలను నుండెగా॥ ౪౨.
ఆసమయంబున జిల్లేదారుని *యతివ భయము నొందుచును।
వేసరిల్లకను భర్తనుజూచుచు వెలుపల వెళ్ళుమనుచును॥ ౪౩.
సుతులును నేనును చనిపోదుముమరి నూటిగనిటనీ కోఱకు।
గతమయ్యెనునీ మేనును జరచే కాలునిపురి జొచ్చుటకు॥ ౪౪.
బ్రతికించుము మము నీవొకండవె ప్రసాదమగుచును పులికి।
పతితోనిట్లని సతియును జెప్పగ ప్రజలందరువిని యులికి॥ ౪౫.
జిల్లెదారుడును వాకిలితీసియు జేసెనమస్కృతి భక్తునికి।
వెల్లడిగాగను పులినితీసికొని వెళ్ళుముసరగ నడవికి॥ ౪౬.

---

*అతివ - స్త్రీ

తెలియక జేసితి తప్పుక్షమింపుము దీనునిబ్రోవగ జూడు।
సలలిత జగతికి మిత్రుడవీవని సత్యంబయ్యెను నేడు॥ ౪౭.
అనుచు బలుకగా భక్తుండప్పుడ యావ్యాఘ్రముతో తాను।
వనమునకరుగగ కంజదళాక్షుడు వడినిజూపి ప్రేమమును॥ ౪౮.
శ్యామల సుందర సుకుమారుండై చక్కనిరూపము జూపన్।
ప్రేమాలహరిని పులకితాంగుడై ప్రియభక్తుడు పూజింపన్॥ ౪౯.
అంతర్ధానము శ్రీహరిబొందగ నార్తితోడ నిలుజేరెన్।
పంతంబునహరి దాసదాసుడై బాలకృష్ణ దాసమరెన్॥ ౫౦.

---

## జోగాపరమానందుని చరిత్రము.

బారసియనునొక పట్టణముండును పశ్చిమదేశమునందు।
నూరిజనులవలె శ్రీహరిగొల్చుచు జోగాపరమానందు॥ ౧.
డుండెను నచ్చట విప్రశ్రేష్టుండూర్జిత భక్తుండగుచు।
పుండరీక నేత్రునిభజించుచును పొందుగ భిక్షమడుగుచు॥ ౨.
కుటుంబరక్షణ గావించుచుదా కుటిలులతో జేరకయు।
పటుతరమగు నాశాపాశములను భావములోన నిడకయు॥ ౩.
ప్రాతస్స్నానము జేసియునాతడు పండరిపతి విగ్రహము।
నీతిని షోడశ పూజలుసేయుచు నిత్యము †నతి జేయుసుము॥ ౪.
భగవద్గీతా శ్లోకంబొకటిని బాగుగ జెప్పుచు తాను।
విగతమోహుడై సాగిలబడుచును వెలయగ దండంబిడును॥ ౫.
ఈవిధమునతా నేడువందలగు నెలమిశ్లోకములకెల్లన్।
భావశుద్ధిచే ప్రణతులజేయుచు భక్షణజేయును మెల్లన్॥ ౬.
ప్రత్యహమునుదన పూజనుదప్పక పరమానందముతోడన్।
నిత్యము నియమము లటుల సలుపుచును నెనరుననుండెనుచూడన్॥
ఒకదినంబునను వ్యవహారికులు నొగివచ్చిరి కోవెలకు।
ప్రకటంబుగనటు బసచేసియుమరి భక్తుని చూచుటకొఱకు॥ ౮.

---

†నతి - నమస్కారము.

మేదినియంతయు తడితోమెలగెను మించి వానగురియగను।
పాదుగ నచ్చట విప్రుడు నిష్ఠను ప్రణతిజేయుచుండగను॥ ౯.
విరక్తుడనుచును వ్యవహారికులు విశేష కనికరమొంది।
సరగున వారొక పీతాంబరమును చక్కనీయ నింపొంది॥ ౧౦.
జోగావద్దకు వారలువచ్చియు సొంపుగ నుతిజేయుచును।
బాగానీవును పీతాంబరమును వడిగట్టుకొనుమనగను॥ ౧౧.
మందబుద్ధినిల మరిగినవారము మన్ననచే వస్త్రమును।
అందంబుగనీ వంగీకారం బనువుగ జేయుమనగను॥ ౧౨.
ఆతడుబలికెను హరిదయాళుడా నరయుచు నిటు మాకొఱకు।
పాతవస్త్రములు పొట్టకునన్నము భక్షణమిదునిదివరకు॥ ౧౩.
పరమతృప్తినిం బొందియుమేమును భజనపరులమై యుండఁగ।
జరి పీతాంబర మెందుకు మాకును స్వామికినిమ్మని వేడఁగ॥ ౧౪.
వ్యవహారికులు మాటనువినకను వలువగట్టి వెళ్ళగను।
భువినాభక్తుడు పీతాంబరమును బురదను తాకుననుచును॥ ౧౫.
పూర్వమువలెదా ప్రణతులజేయను బూనడయ్యె నతడపుడు।
ఓర్వకుండగను వస్త్రలోభమున నుచితనిష్ఠ విడుచుండు॥ ౧౬.
ఆకలిచే, తానలసటజెందగ నంతరించె నేమమును।
ప్రాకటముగతా దుఃఖమునొందుచు పరితపించె మనమునను॥ ౧౭.
పీతాంబరమే వచ్చెను నాకును పెద్దవైరి నేడిటను।
గీతప్రణతుల చెరచెను నాకును క్రియయేమున్నది యికను॥ ౧౮.
భక్షణచేయుట బాగుకాదనియు బైటికివచ్చియు తాను।
దక్షుడనైనే దేహదండనము దాల్పగవలయు ననుచును॥ ౧౯.
అడవికిజనినే నగ్నిమధ్యమున నమల తపసు చేయుదునా।
జడమతిగాకయు జ్ఞానవిస్నానము సలుపుచు నటునుండుదునా॥
అన్నోదకముల నల్పముగైకొన కనుతాపము నొందుదునా।
పన్నుగ నగ్నిని ప్రజ్వలించిమరి బాగుగనందు బడుదునా॥ ౨౧.

ఈవిధమునతా యత్నముసేయగ నేతెంచె కృషీవలుడు।
బోవుచుండె రెండెడ్ల గట్టుకొని భూమిదున్నుకొన నాడు॥ ౨౨.
భక్తుడు వానిం బిలచియు బలికెను పట్టుగుడ్డ కీడుగను।
రక్తిగ నెడ్లను రెంటినియ్యుమనె రమ్యముతోడ తనకును॥ ౨౩.
వృషభముకన్నను వస్త్రముధరలో వెలద్విగుణం బుండుట చె।
కృషీవలుడుమది కుదురుపరచుకొని గీల్కొని వృషభములిచ్చె॥
పీతాంబరమును భక్తుండిచ్చియు పేరుచు కాళ్ళనుకాడిన్।
చేతులనీవును బట్టికట్టుమని చెప్పెను కాపునకు వడిన్॥ ౨౪.
అట్టులజేసియు కాపువెళ్ళగను నా రెండును పరుగులిడెన్।
మిట్టపల్లములు ముండ్లురాళ్ళపై నట్టిటునీడ్చుచు నుండెన్॥ ౨౬.
శరీరమంతయు ఛిన్నాభిన్నము ఝర్ఝరమయ్యెను నపుడు।
ధరాతలంబున నెడ్లుదిరుగగను దారినిగానక నాడు॥ ౨౭.
ఆసమయంబున హరికృష్ణాయని యచ్యుతు నామముజెప్పెన్।
దాసునికాలకీ దేహదండనము తగునుతగుననుచు జెప్పెన్॥ ౨౮.
కంఠగతంబై ప్రాణములుండగ కరుణానిధియగు హరియు।
కుంఠుడుగాకను కాలుకట్లనటు కూర్మివిడిచి తుడుచుటయు॥ ౨౯.
సాహసముగనీ వెల్లకార్యముల సలుపుచునుంటివి నాకై।
దేహదండనము నేలజేసితివి తిరముగుతప్పులు లేకై॥ ౩౦.
అనుచునుబలుకుచు హరిదాబోవగ నాతడు గృహమున కేగెన్।
పనిబడిభక్తుల పాదధూళికిని బాలకృష్ణుడిల తిరిగెన్॥ ౩౧.

---

## నరహరి చరిత్రము.

పురమగుపండరి నరహరియనుచును పుణ్యశీలు డొకడుండు।
హరుని సేవయందతి తత్పరుడై యగసాలుండై యుండు॥ ౧.
ప్రాతఃకాలము భీమానదిలో పదపడి స్నానముజేయు।
వీతరాగుడై సాంబునిగుడికిని వెళ్ళుచు పూజలసేయు॥ ౨.

పండరిపురమున వాసము జేసియు పాండురంగని గనకను।
ఖండితముగనట విష్ణుగోపురము కండ్లను జూడక యిలను॥ ౩.
మల్లికార్జున దేవునిగొలచుచు మరియొకదేవుని గనక।
సల్లలితంబుగ సత్యశీలుడై సలిపెను భక్తిని కడక॥ ౪.
ఇతడిటులుండగ నాపురమునకొక డేతెంచెను వర్తకుడు।
సుతులబడయకను చింతనొందుచును సూటిగ హరిగనుచుండు॥
ప్రార్థనజేసెను పాండురంగనికి పరమదయానిధి రంగ।
వార్థికదశలో వంశము బాగుగ వర్ధిల జేయుము పొంగ॥ ౬.
వచ్చువర్షమున కుమారునొక్కని వంశముకొఱకిచ్చినను।
హెచ్చుమణులతో కటిసూత్రంబును నేర్పడ జేసియిడుదును॥ ౭.
అనుచు జెప్పుచును స్వదేశమునకై యాతడు నటువెళ్ళగను।
మనసు తలపునకు మారుగాకనటు మరు సంవత్సరమునను॥ ౮.
భగవత్కృపచే పుత్రుని గాంచియు పరితృప్తిని బొందుచును।
వగవక ప్రార్థన చెల్లించుటకై వచ్చె పండరికడకును॥ ౯.
పండరినాథుని పూజించియుమరి వడినడిగెను నర్చకుల।
మెండుగ కాంచన కటిసూత్రంబును దండి హరికి జేయనిల॥ ౧౦.
కంసలవానిం దెలియ జూపమన గారాబముతో వారు।
సంసారికుడు నరహరి సలుపును సత్యవంతుడన్నారు॥ ౧౧.
ఆభరణంబును నాతడునేర్పున నరసి జేయునని యనగన్।
శోభస్కరమని వణిజుడు వచ్చెను సూటిగ హరికడ వడిగన్॥ ౧౨.
కనకరత్నముల నాతనికిచ్చెను కటిసూత్రము హరికొఱకు।
అనువుగ శ్రీహరి కటికి దగినయట్లరసి చక్కజేయుటకు॥ ౧౩.
నరహరి వానిని గైకొని చేతను నారాయణు కటికొలతన్।
పరగున దెమ్మని చెప్పిపంపగను చనె వణిజుడు గుడిపొంతన్॥ ౧౪.
కోరిన కొలతను దెచ్చియిచ్చెతగ గురితో నరహరికటను।
మీరిన మణులను కనకము గూర్చియు మేలగు కటిసూత్రమును॥

చాతుర్యముతో నొనర్చి యిచ్చెను సరగనరహరి యతనికి।
పాదుగ వణిజుడు పూజాద్రవ్యము బాగుపరచుకొని గుడికి॥ ౧౬.
వెళ్ళుచునచ్చట నభిషేకంబును విఠలరంగనికి జేసి।
ఎల్లపూజలను నేమరకుండగ హెచ్చుప్రేమతో జేసి॥ ౧౭.
కటిసూత్రంబును కృష్ణమూర్తికిని కట్టంబోవగ నదియు।
పటుతరంబుగను పట్టకుంటచె వచ్చియు నరహరి గనియు॥ ౧౮.
వర్తమానమును దెలియపరచగను వదలుగ, నగసాగించెన్।
వర్తకునకుదా నొప్పజెప్పగను వణిజుడు తానేదెచ్చెన్॥ ౧౯.
కటిదేశంబున వేయబోవనది కడుపెద్దదిగా నుండన్।
మిటమిట జూచుచు మళ్ళిదెచ్చెనటు మెలగుచు నరహరియండన్॥
కురుచగ జేయుచు నగసాలుండును గొనిపొమ్మని తానిచ్చెన్।
మురిపెముతోడను వర్తకముఖ్యుడు మూర్తికి తానర్పించెన్॥ ౨౧.
సరిపడనందున తిరిగివచ్చెతా చనువున నరహరికడను।
గురినేజేసిన కైంకర్యంబును కొనసాగియు నుండుటకు॥ ౨౨.
చక్కజేసికటి సూత్రంబిమ్మని శమమునునాతడు వేడన్।
మక్కువతో సాగించియియ్యగను మళ్ళిదెచ్చె హరియండన్॥ ౨౩.
వదలైనందున మరలవచ్చియును పలసివేడె నరహరినే।
చెదరకనీవే గుడికివచ్చినీ చేతులతో వేయుమనే॥ ౨౪.
శంకరుడేనా శ్రేష్ఠదేవుడని సరగున నరహరి యనియు।
వంకలేకనే మరియొకదేవుని వాంఛ గనని వ్రతమనియు॥ ౨౫.
అనేక విధముల వణిజుడువేడగ నాతడీయ కొనకుండన్।
వినీతుడగుచును మూర్తిని జూడక వేయుము నగ, చేతోడన్॥
వణిజుండిట్లని నరహరికనులను వలసిమూసె వస్త్రమున।
చనువునచేతిని బట్టుకొనుచుహరి సన్నిధికేగె ప్రియమున॥ ౨౬.
పాణితలముచే నరహరిముట్టగ పండరిపతి విగ్రహము।
మానుగ గనెతన భావమువలెనె మహాదేవుని రూపము॥ ౨౭.

పంచవదనములు పన్నగభూషలు పదిహస్తంబుల తోడన్।
మించిన జటయును మృగచర్మంబును మేనున బూడిదె యుండన్॥
తను భావించిన దేవుండనుకొని తానేత్రంబుల దెరువన్।
కనుగొనె నప్పుడు పీతాంబరమును కరములు కటిపై నిలువన్॥ ౩౦.
శ్యామల తనువును సుందరమూర్తియు శంఖచక్ర మకుటమును।
కామిత గదయును వైజయంతియును ఘనకాంచన హారమును॥ ౩౧.
సమచరణంబుల నిలిచియుండగను చక్కజూచె రూపమును।
భ్రమజెందితినని నరహరి పిదపను పరగమూసె గన్నులను॥ ౩౨.
చేతులతోడను స్పర్శింపగ మరి శివునిరూపమే గాంచెన్।
ప్రీతిగకనులను జూడగనచ్చట వెన్నునిదగ సేవించెన్॥ ౩౩.
ఈవింతను గని నేత్రాచ్ఛాదన మిలమీదను దగనునిచెన్।
భావించుచు శ్రీపండరిరంగని పరంధాముడని గొలిచెన్॥ ౩౪.
అనుతాపంబున శ్రీహరిపదముల నరమరలేకను గనుచు।
వినతులజేసెను విశ్వవ్యాపక విఠలరంగ హరి యనుచు॥ ౩౫.
భక్తుల మాయయు ప్రతిహతమగుటకు పనిబూనితి విటునీవు।
ముక్తినొందుటకు మేలగుజ్ఞానము ముదమున నిచ్చితివీవు॥ ౩౬.
భేదజ్ఞానమును పొందియుంటినే పెంపారగ భవభంగ।
శోధన జేయగ శివుడవునీవే సొంపుగ విఠలరంగ॥ ౩౭.
జయజయ కేశవ శ్రీహరికృష్ణా శంకర శ్రీశివ నామా।
భయములేకనిను బొందితిశరణము బాగుగబ్రోవుము రామా॥
అనుచునుసన్నుతు లాతడుసేయగ హరియు బ్రసన్నుండగుచు।
పునరపి భేదము లేకుండుటకై పొందుగజేసితి ననుచు॥ ౩౮.
సత్యము వదలక చేసినతపములు సర్వేశ్వరు నను జెందు।
వ్యత్యయమిందున లేదని దెలుపుచు వహించె నగ కటియందు। ౪౦.
శ్రీహరిమూర్తికి సరిపడియుండగ చెలగె ముదము పణిజునకు।
బాహుళ్యంబుగ ప్రేమను నరహరి బహుసంతసమున చొక్క॥ ౪౧.

పరితృప్తినియటు వెళ్ళిరిరువురును పదపడి తమయిండ్లకును।
పరిపూర్ణులరగు భక్తుల దాసుడు బాలకృష్ణు డీయిలను॥ ౪౨.

## జనాబాయి చరిత్రము.

యాత్రార్థంబొక వత్సరంబునను నమితజనంబులు గూడఁగ।
క్షేత్రంబగునా పండరిపురమున శ్రీపండరిపతి జూడఁగ॥ ౧.
బాలికయొక్కతె వచ్చెనచ్చటికి భక్తిని తలిదండ్రులతో।
మేలిమిగా శ్రీహరి సేవించియు మెల్లగనసె వారలతో॥ ౨.
ఇచటనుండు మీరింటికేగుడని యిష్టముతో జెప్పగను।
అచటిజనంబులు నాశ్చర్యముతో నని రేడేడలదియును॥ 3.
భగవంతునిపై ప్రేమనుబొందెను బాగుగ తలిదండ్రులును।
వగచుచు వెళ్ళిరి విడిచికన్యకను వాసిగ గుడిలోపలను॥ ౨.
కన్యనొక్కతిని గాంచియు నాముదు కటాక్షంబుతో నడుగు।
అన్యులు చుట్టము లేరేనికిట నలవారలు నెటకరుగు॥ ౫.
నామమేమియని నాముందుడగగ నయముగ బాలతియునని యెఁ।
ప్రేమముగలిగిన పాండురంగఁడె పితయు మాత నాకని యెఁ॥ ౬.
జనాబాయియని చెప్పుచునుందురు చెలగిన నానామమును।
ఘనుడగు రంగఁడు దప్ప మరెవ్వరు గలుగరు బందులనగను॥ ౭.
కన్యచేతులను బట్టియు నాముడు కరుణనరిగె గృహమునకు।
కన్నతల్లియగు గోణాయీకిని గారాబముతో బలుకు॥ ౮.
దైన్యముతోనీ బాలికయాత్రను తలిదండ్రుల విడనాడె।
హైన్యము లేకయు మన్నన జేయుచు నరసియు రక్షణజూడె॥ ౯.
గోణాబాయియు కృపచే కన్యను గురుతుగ గృహకృత్యముల।
పూని చేయుటకు నియమింపంగను పుణ్యంబనుచు సుశీల॥ ౧౦.
భాగవతాంఘ్రిని బట్టిన దాసియై పనులెల్లను జేయుచును।
జాగు సేయకను భగవత్కథలను చక్కనిభక్తిని వినును॥ ౧౧.

శ్రీహరినామము నుడువుచు నెప్పుడు చిన్నది తగ పెరుగగను।
మోహముతో దన మాతయుపితయును ముఖ్యుడునాముడనియును॥
ఇదియిట్లుండగ నాముండొక రేయిని నింటను నిద్రితుడై।
పదపడియుండగ వర్షముగురియగ ప్రబలపు గాలియు తోడై॥ ౧౩.
బడుచుండగనా భక్తునియింటికి పైకప్పటు దొలగంగా।
కడిమిని శ్రీహరి సుదర్శనంబును కరుణను బంపెను వేగా॥ ౧౪.
సుదర్శనంబును చక్కజేసెతగ సుఖతరముగ గృహమును।
కుదురుగ వర్షము గృహములోపలను కురియకుండ జేయగను॥
విజయరంగడా నామునియింటికి వెనుకవచ్చె మెల్లగను।
సుజనమనోహరు డింటిపయి నెక్కి *సుదను సదురుచుండగను॥
నిదురనుండి మేల్కనియా నాముడు నిలిచివచ్చి చూడగను।
అదరుచు వెలిగెడు పండరినాథుని హరిపీతాంబరు గనెను॥ ౧౭.
అతిదీనుండై శ్రీహరిపదముల నాతడు బట్టుచు ననియెా।
పతితపావన నీవీగృహముపై పనిబూనినదేమనియెా॥ ౧౮.
శ్రీహరిబల్కెను సంస్కృతివృత్తుల చేరక నీవును మరచి।
మోహమమతలను మానినకతమున ముదమున మేలునుదలచి॥౧౯.
కప్పనంతయును చక్కజేయుచును కనుగొను చుంటిని నేను।
గొప్పనిందలను జేయుచుండునీ గోణాయీ నాయెడను॥ ౨౦.
గోణాయీవిని శ్రీహరిపదముల కుదురుగ దండంబిడును।
జనాబాయియా సమయంబునహరి చరమాంగము దుడుచుచును॥
కృపాసాగరా కొరతలదీర్పను కృష్ణావిఠ్ఠల నీవు।
అపారదయతో నిజాంగముగ మమ్మరసియు రక్షించెదవు॥ ౨౨.
ఆసమయంబున హరియునుబల్కెను నాకలొందితీ వనియు।
వెసరిల్లకయ నన్నముతిందుము వేయుమనుచు బలుకుటయు॥ ౨౩.
తెలెలోనుంచియు గైకొనియన్నము తెచ్చెనుగోణాయ్ యటను।
అలయకవుత్రిల గూడియునాముం డన్నముదినె హరితోను॥ ౨౪.

---

*సుద = అగ్రము.

జనాబాయినిం బిలువకయుండగ సలిపెనామె హరి స్మరణ।
అనాథనగున న్నారసిచూడుము హరి శ్రీవెంకటరమణ॥ ౨౫.
భక్తరక్షకా పరదేసిని నే బడితిని నీవిటుగనియు।
రక్తిగననుతగ వదలుట బాడియె రమేశ జూడుము వినియు॥ ౨౬.
విలపించుచు దన గుడిసెను నుండుగ విఠలుడు గనె తనలోను।
పలుమరు వినుచును భక్షణ చేయక బాగు లేదనెయన్నమును॥ ౨౭.
విడుచుచు లేవగ నామదేవుడును విఠలరంగ హరి నీవు।
కడగిన పత్నిని జనాబాయినిం గలపని హేతువ నీవు॥ ౨౮.
కొరతను నొందితివని దాజెప్పగ గోణాబాయియు నపుడు।
సరగున శ్రీహరి ప్రసాదమంతయు జనాబాయి కిచ్చనిడు॥ ౨౯.
హరిప్రసాదమని యామెయందుకొని యటునొక తెలె యెందుంచెన్
చిరతర ప్రేమను శ్రీహరిరాకను చెలిమినిజూచుచు నిలిచెన్॥ ౩౦
పండరిపతి నామునితో పిదపను పరుండియుండె పడకపై।
నిండునిద్ర నాముడు బొందగ హరి నిగ్గివచ్చి జనిగదిపై॥ ౩౧.
ఆకలియైనది యన్నమిమ్మనుచు నడుగగ నామెయుబలికెన్।
ఓకమలేశా నీకన్నము నెట నొగిదెత్తుననుచు నులికెన్॥ ౩౨.
నీయుచ్ఛిష్టమె నాకిచ్చెనుమును నేమముతో గోణాయి।
పాయకదానినే నీకుబెట్టుటయు బాగా, కపటోపాయి॥ ౩౩.
కృపాసాగరా గోవిందాహరి కృష్ణా సదయుడ వీవు।
ఏపారగనా వంకకువచ్చితి వేమియిత్తునని నుడువు॥ ౩౪.
విఠలుడు వినియా యుచ్ఛిష్టాన్నమె విహితంబుగ తెమ్మనగన్।
కఠినతలేకను దెచ్చుచు నామెయు కమలేశుని ముందిడగన్॥ ౩౫.
నాయుచ్ఛిష్టమునే భుజింపగా నాకుకొంఅత లేదనుచు।
బాయక జనితో భోజనమప్పుడు పాదుగజేసెను మనుచు॥ ౩౬.
కరముల గడిగియు శయనమునొందగ సరగలేచె తల్లియును।
వెఱవక జెప్పెను కొడుకునకప్పుడు విఠలుని సచ్చరితలను॥ ౩౭.

నామదుఁడు వినియా తల్లిమాటలను నయముగ వచించెనపుడు॥
సేమమునొందిన జనాబాయిదా చిరతర భక్తిని నుండు॥ ౩౯.
భావశుద్ధిగని పండరినాథుడు పరుగిడి చనెనా చోటన్।
సేవక వత్సలుడగు హరి యనుచును చెవినివినమె యీమాటన్॥
ప్రేమానందము బొందినచిన్నది ప్రియురాలయ్యెను హరికి।
సామాన్యంబుగ జెప్పనువలవదు శబరి సమానము కలికి॥ ౪౦.
విహరించుటచే వెంచేసెనుహరి వింతేమిందున నంగన్।
ప్రహసనముగనీ పలుకులనన్నియు బాగుగ హరివిని మెలగన్॥ ౪౧.
వేగమె నామదుని వద్దకు వచ్చియు విశ్రమించి యుండగను।
బాగుగరాతిరి మూడవ జామున పండరిపతి లేచియును॥ ౪౨.
జనాబాయి వసియించెడు గుడిసెకు సరగున వచ్చియు మరియు।
వినీతుడై లేలెమ్మని జెప్పియు విసురురాయి ముందిడియు॥ ౪౩.
పిండివిసిరెదను పాటలు బాడుము పిడికిట రాబట్టుచును।
నిండుప్రేమతో నటులనెజనీయు నెరయబట్టె తిరుగలును॥ ౪౪.
తలవెంద్రుకలను సవరించుకొనుచు తాకి కేలు రాతిపయి।
సలలితముగనా శ్రీహరి భక్తుల సల్లాపము చెప్పటకయి॥ ౪౫.
విష్ణుదాసుడై వెలసిన నామదుడు విమలతండ్రి నాకిటను।
కృష్ణుని భక్తుడు నివృత్తినాథుడు కృపను జ్ఞానదేవుడును॥ ౪౬.
సోదరులనినే జెప్పెద తల్లియు సొంపుగరాజాయీ యనుచు।
మేదిని గోరా మేనమామ యగు మిగుల సావతయునను చు॥ ౪౭.
బందుగులగుదురు భక్తినివీరలు భగవంతుని తమవశము।
పొందుపరచుకొని ప్రబల చర్యలను భువిజేసిరి వారసుము॥ ౪౮.
ఎంతనిజెప్పెదు నిలలోనామదుం డేగెను యాత్రకునను చు।
పంతముతో మృత పశుపును లేపెను ప్రబల హస్తిపురినంచు॥ ౪౯.
నాగనాథుగుడి నపసవ్యంబుగ నయముగ జేసెను భువిని।
బాగుగ శ్రీహరి లీలలనేకము బలపడ జూపెనవనిని॥ ౫౦.

జ్ఞానదేవుఁడును మహిషముఖముచే ఘనవేదము జెప్పించెన్।
మానుగ గోరాకుమ్మరి పుత్రుని మంటిలోన ద్రొక్కించెన్॥ ౫౧.

శ్రీహరి యానకు చేతులరెంటిని ఛేదించియు నటుపిదపన్।
మోహన రంగఁడు కరములనిచ్చియు ముద్దుబాలునటు లేపెన్॥ ౫౨.

సావత మాలియు కడుపును జీరియు సర్వేశ్వరునందుంచెన్।
పావన నాముని భక్తినిగన్గొని పండరిపతి వెలివచ్చెన్॥ ౫౩.

భక్తకబీరుఁడు బట్టలనేయఁగ భగవంతుండును నేసెన్।
రక్తిగ రాముఁడు తనదు దర్శనము రంజిల్లఁగ గనజేసెన్॥ ౫౪.

శ్రీహరి చర్యల శృతిశాస్త్రంబులు చెప్పఁగ జాలవటంచు।
మోహముతోడను పులకితాంగుఁడై ముద్దియ బాడుచు మించు॥ ౫౫.

పాటలశబ్దము గోణాయ్ వినుచును బరతెంచెను తామనుచు।
సాటిగ కూలికి మనిషినుంచుటకు సరియగునే మనకనుచు॥ ౫౬.

ప్రత్యుత్తరమును బలుకకుండఁగను బట్టెకఱ్ఱ హస్తమున।
ప్రత్యయముగతగు విత్తనమియ్యక పరులు వీసరిరిటు గాన॥ ౫౭.

నీకును దెలియదె మనసంసారము నెరి దుర్బలమగుననుచు।
శోకను నిటులం జెప్పుచుగొట్టఁగ నూటితగిలె హరికనుచు॥ ౫౮.

జనాబాయిదా జెప్పినప్పుడును సర్వేశ్వరు దనతోడన్।
వినీతుఁడగుచును పిండివిసరెనన వినియా నాముఁడు గూడన్॥ ౫౯.

తల్లికిజెప్పెను దామోదరుఁడే తగజనాబాయి తోడన్।
ఉల్లమలరఁగను విసురుచునుండెను యుత్తమురాలై యుండన్॥ ౬౦.

శ్రీహరినిటుదన స్వాధీనంబుగ జేసికొనియెనని బలుకన్।
స్నేహము భయమున మళ్ళినుతల్లియు శ్రీహరిగొట్టితి నలుకన్॥ ౬౧.

సంసారముకయి సంకటపడుచును సర్వేశ్వరు గొట్టితిని।
హింసాయుతమగు సంసారంబును నెపుడు దగ్ధమగునుయని॥ ౬౨.

సుకుమారుండును శ్యామలరూపుఁడు సుందర విగ్రహుహరిని।
అకలంకులునా నాకనివాసుల కందని ఘనుగొట్టిని॥ ౬౩.

అనుతాపముతో సదనములోపల నామెయు కూర్చుండగను।
జనాబాయియు హరియు గూడుకొని చక్కవిసిరి పిండియును॥ ౬౪.
ఒకస్థలంబున నెత్తియుంచగా నుదయమయ్యె నరుణుండు।
పకపకనవ్వుచు శ్రీహరి జనితో బల్కుచు మాటలనుండు॥ ౬౫.
జనియును బల్కెను శౌరి ముకుందా సర్వేశ్వర గుడియందు।
నినుగానకయా ద్విజవరులందరు నెరిశోధించుటయందు॥ ౬౬.
కలకయు నొందుచు నుందురు వారలు కావున నిప్పుడెనీవు।
నిలయంబునకును నేగుటబాగగు నీరజనాభుడ బ్రోవు॥ ౬౭.
త్వరబడి విఠలుడు మణిహారంబును తానటువిడిచియు మెల్లన।
మరపున జనబాయీ మురికిగుడ్డనటు మాధవుండు కొనివెళ్ళన॥
ఆలయంబునను నఖిలభక్తులును నారతులియ్యగ నపుడు।
నీలపుజేరును హరిమెడగానక నీచవస్త్రముగని నాడు॥ ౬౯.
వింతనొందుచును బ్రాహ్మణ జనమును విచిత్రమిదియని యనుచు।
పంతముతోడను నిశ్చయమెరుగక భద్రమె తాళములనుచు॥ ౭౦.
వేసిన విధమున నవియునుండగని విడివస్త్రంబెవరిదను।
మాసినగుడ్డను నొక్కడుతీసియు మహి పరిశోధించగను॥ ౭౧.
జనాబాయిగని జనులుబల్కగను చనిరి దానిగృహమునకు।
అనేకదూషణ లామెనుజేయుచు నడుగగ నిజమునుబలుకు॥ ౭౨.
మాలనెరుగనని యామెయుబల్కెను మాధవుండు సాక్షిగను।
వీలుగ కన్నులు పోవుగాకయను విభుని మాలదీసినను॥ ౭౩.
పూజాచార్యులు పరిశోధించిరి భువిని బడినవస్త్రముల।
వేజాడగనా శ్రీహరి హారము వెతుక దొరికె నయ్యెడల॥ ౭౪.
దామోదరు ఘన దివ్యహారమును తథ్యముజని దొంగిలితె।
భూమిసురులునటు బట్టికట్టిరి పాలతి శిక్షలో బడితె॥ ౭౫.
ఇనుప శూలమం దామెను వేయుట కీడ్చిరట్లు నదికడకు।
అనువుగ నామెయు హరిసర్వేశ్వర యాదరింపుమని బలుకు॥ ౭౬

కృపాసాగరా కరుణానిధి శ్రీ కృష్ణకృపాళో యనియు।
అపార కరుణను కాపాడుమున న్నవని నెవరు లేరనియు॥ ౭౭.
అనుచుబలుకగా నచ్యుతుకృపచే నాశూలము నీరయ్యెన్।
వినుతుల జేసిరి వివిధ జనంబులు విచిత్రమును గననయ్యెన్॥ ౭౮.
పండరినాథుని బహుకృపయేయని బలికిరెల్ల రయ్యెడను।
నిండిన ప్రేమను శ్రీహరి నామము నిఖిలజనులు పొగడగను॥ ౭౯.
జనాబాయియటు వెళ్ళెనింటికిని సర్వేశ్వరు దలచుచును।
వినీతయగుచును నామదేవునే వేగౌరవ పరచుచును॥ ౮౦.
ఇంటికిజనిదా నుండెనొక్కనా డీశుబాడె కై తలను।
ఒంటిగ వానిని శ్రీహరివ్రాయుచు నుండెను గుడిలోపలను॥ ౮౧.
జ్ఞానదేవుడును చూడవచ్చెనటు గారవమున హరికడకు।
మానుగ శ్రీహరి వ్రాయుచుండగని మదిని వింతతో మ్రొక్కు॥ ౮౨.
వాసుదేవ శ్రీవిఠలరంగా వ్రాయు టేమి జెప్పుమన।
దాసి జనాబాయ్ చేసిన పద్యముల్ తరలి వ్రాయుచుంటినన॥ ౮౩.
తమస్తోత్ర్యంబును తామే వ్రాయుట తగునే యీభువియందు।
విమల కరముచే వ్రాయుట నినుగని వింతబుట్టె నాకిందు॥ ౮౪.
విఠలుడు జెప్పెను జనీ పద్యములు వినవిన నింపైయుండెన్।
శఠముగాకనది మిగుల మధురమగు సాహిత్యముగా నుండెన్॥ ౮౫.
వ్రాయుచుంటినని విఠ్ఠలరంగడు వచ్చె నాముగృహమునకు।
బాయక జ్ఞానుడు నితరభక్తులును పాడుగ వచ్చిరి యటకు॥ ౮౬.
అందర గనుగొని నాముడు సలిపెను నధికముగా వందనము।
పొందుగగూర్చొని హరి, జనాబాయ్ పొలతి బిలిచికొనిరమ్ము॥ ౮౭.
అనుచు విఠలుడు బలుక జనాబాయ్ యపుడెవచ్చి దండమిడు।
చనువున రంగడు జెప్పెజనింగని సరి నీపద్యము లెవడు॥ ౮౮.
చదివిన వానికి గలుగునిహంబున సర్వసంపదలనుచును।
సదయుడు జెప్పియు ముచ్చట లాడియు చనెదా గుడికిని యటను॥


వసిష్ఠుడు.
మచ్ఛింద్రనాథుడు.

శ్రీహరిజేసిన చిత్రలీలవిన చెవులకునింపై యుండు
బాహుళ్యంబుగ రచియించెనుభువి బాలకృష్ణదాసుండు॥ ౯౧.

## మత్స్యేంద్ర గోరక్షకుల చరిత్రములు.

శంకరుండుతన సతినిగూడుకొని సాగర తీరమునందు
పొంకముతో శ్రీరాముని తలపగ *పురికొని సతి హరుముందు॥ ౧.
స్వామినీవ్వై యుండగ నెవరిని స్మరియించెదవని యడుగఁగా।
కామదహనుడనె రాముని రూపము గరిమె స్మరించెద ననఁగా॥ ౨.
అతడెకర్తయగు నఖిలాండంబుల కావిధాతకును నాథుఁడా।
సతతానందుఁడు చిద్ఘనరూపుఁడు శాంతి స్వరూపుఁడు సిరుఁడా॥ ౩.
అతనినామమే యతిపావనమై యమరినదని జెప్పగను।
పతిచరణములకు మ్రొక్కియురాముని పరతత్వము దెల్పుమను॥
జెప్పుమనంగను శంకరుడప్పుడు జీవగోప్యతత్వమును।
ఒప్పుగ జెప్పుచు ప్రొద్దు బుచ్చుగను నుదధి సమీపంబునను॥ ౫.
గట్టువద్దనొక గర్భిణి మత్స్యము గాంచుచు వారిద్దరను।
గుట్టుననుండగ నందలి పిండము గోప్యంబెల్ల వినుచును॥ ౬.
ఉదరమునుండియు పిండము వెలుపల నుద్భవమయ్యెను పిదపఁగా।
సదమల నామము మత్స్యేంద్రుండని జగమంతయు తనుజెప్పఁగా॥ ౭.
శంకరమూర్తికి సామ్యుండగుచును సర్వార్థంబుల నెరిగెఁగా।
పొంకముతోడను బహువిరాగియై బోధపరుండై వెలిగెఁగా॥ ౮.
కాయమమతలను బొందకయెప్పుడు కిడు తారక బ్రహ్మమున।
పాయక పగలును రాత్రియు మనసును పట్టునట్లజేసె గన॥ ౯.
స్వేచ్ఛ విహారత సకల తీర్థముల సేవించుచు నీభువిని।
నేచ్ఛను భుక్తిని భిక్షాటనచె నెనరున జరుపుకొనమని॥ ౧౦.
ఉదాస వృత్తిని వర్తించుచుదా పదియు రెండు వర్షములు।
సదానందుడై చనెనొక పురమున చక్కవీధిని పిలసిల్లు॥ ౧౧.

---

*పురికొని = హెచ్చరిక దెచ్చుకొని.

వర్తకునింటికి వచ్చిముందుగా వాంఛను భిక్షమునడుగన్।
కర్తయగుగృహిణి కరముల దెచ్చెను కాంక్షను భిక్షమువేగన్॥౧౨.
సుందరంబుగా నుండురూపమును జూచియు సతి మోదించెన్।
తొందర బొందక దెచ్చినభిక్షము దురుసుగ జోలెనునుంచెన్॥౧౩.
నమస్కరించుచు నమ్రభావమున నాతిజూచి యిట్లనియె।
కమలనేత్రములు కాంచన దేహము కలిగిన మీరెవరనియె॥ ౧౪.
శిరిసంపత్తులు చక్కగ గలిగియు శిశువులు లేదనెతనకు।
బురిగొనిపుత్రుల నొందుప్రసాదము పొందుగ నిమ్మనిబలుకు॥ ౧౫.
అలమత్స్యేంద్రుడు మంత్రవిభూతిని నతివెకు నిచ్చుచుజెప్పెన్।
పొలతిరో నీకును పుత్రుడుబట్టును పూర్ణకళాంశం బొప్పన్॥ ౧౬.
యితరులకెవ్వరి కెరుకజేయకని యేర్పడ జెప్పియు మరియు।
సతతానందుడు స్వేచ్ఛవిహారుడు చనియెనాతండది గొనియు॥౧౭.
సుదతియు పిదపను చేకొని వచ్చెను సుగుణ విభూతిని కైలో।
చెదరిన మనసున స్నేహితురాలిని చేరబిలచి తనగదిలో॥ ౧౮.
భిక్షుకుడొక్కడు పూర్ణవిగ్రహుడు పెంపుగ నింటికి వచ్చెన్।
పక్షము తోడను పుత్రులులేరన పరగముఖంబును చూచెన్॥ ౧౯.
మంత్రవిభూతి నొసంగియునాకిక మంచిసుతుడు బుట్టుననెన్।
తంత్రవాదియొ దెలియుటెట్లుమరి ధరనాతని శక్తిననెన్॥ ౨౦.
స్నేహితురాలును చెప్పెనప్పుడటు చేకొనకు విభూతియును।
మోహకరంబుగ మచ్చిక జేయుచు మోసపరతురు జోగులును॥౨౧.
పగటిని స్త్రీలను కుక్కలజేయుచు పరగ రేయిని స్త్రీలుగను।
నిగుడి భోగముల బొందుచువారితో నెనరుచరింతు రీయలను॥౨౨.
ప్రసాదమనుచును గైకొనవలదది పారవేయు మనగాను।
విసర్జించెనల వర్తకుభార్యయు విభూతితా పాయ్యిలోను॥ ౨౩.
కోడలికత్తకు కలహమొనర్తురు కుత్సిత జనులివ్విడను।
వాడకనామెయు మంత్ర విభూతిని వదలె వనితమాటలను॥ ౨౪.

ద్వాదశ వత్సరములు దిరుగుచుభువి తపసివచ్చె తిరిగియును।
వేదితముగనా వర్తకునింటికి వేగమె తాభిక్షుకును॥ ౨౫.
వెలుపలనుండగ వర్తకునుభార్యయు వేగవచ్చె భిక్షుకుతో।
నిలిచియు జెప్పెను మత్స్యేంద్రుండును నెనరువిభూతిని గురితో॥
మును నేనిచ్చితి మంచిపుత్రునిక ముదమొందగ గనుటకును।
అనువుగ పుత్రుని నాకుజూపుమిట నవలోకింతు నపగను॥ ౨౭.
వెలవెలబోవుచు వర్తకుభార్యయు వేరుబలుక లేకుండక।
బలికెను తపసియు మంత్రవిభూతిని బారవేసితివెయండక॥ ౨౮.
శాపభీతిచే వగచుచునామెయు సరగ నతనితోననెను।
ఏపుమీర నాకొకచెలిజెప్పిన యెలమిమాటచే నేను॥ ౨౯.
విశ్వసింపకను పొయిలో వేసితి విభూతి మహిమననుచును।
నశ్వరమగునా పూర్వకర్మములు నాశము జేసెను నన్ను॥ ౩౦.
పరమదయాకర పరబుద్ధిని నే ఫలము విడిచితిననగాను।
వరదానంబును వ్యర్థమయ్యెనని వాసి నతడు జెప్పుచును॥ ౩౧.
బూడిదె రాశిని బోసినచోటును పోసగ చూపుమనగవిని।
వేడుక బైటికివచ్చి పెంటనటు వెలయ వనిత జూపగని॥ ౩౨.
పంటచేలకై బహుదినములుగా పెంటచేర్చబడి యుండక।
వెంటనె మత్స్యేంద్రుండడిగని వేగపైని నెరుచుండక॥ ౩౩.
ఆలఖు యనుచును శబ్దము వేయగ నాదేశను నొకధ్వనియు।
వీలుగ బుట్టగ వసుమతి జనములు విపుల పెంటదీయుటయు॥ ౩౪.
ద్వాదశవత్సర బాలుడందునను తపమును జేయుచు నుండక।
సాదువేశమున సుందరరూపుడు సర్వసుగుణుడటనుండక॥ ౩౫.
మేనిమీద మన్నంకటబాలుడు మెలగి యుండుటంజూచి।
మానుగనందరు నాశ్చర్యంబును మరిమరి బొందిరి కొలిచి॥ ౩౬.
తపస్వియప్పుడు దగ్గర రాగను తనయుడు కనుదెరచుచును।
నెపములేక సాష్టాంగనమస్కృతి నెనరునజేసె నతడును॥ ౩౭.

చేతను పుత్రుని కరము బట్టుకొని ప్రీతిని బోవగ నెత్నించెన్।
పాతరలాడుచు వణిజుడు వినితా పరుగులిడుచు నటువచ్చెన్॥ ౩౮.
భార్యనుగూడియు ప్రణతుల జేయగ పరగ జెప్పె తపసియును।
ఆర్యపూజ్యుడగు మరియొకపుత్రుం డతివకు బుట్టుననియును॥ ౩౯.
పిదపను తపసియు బోవవాడంగెను ప్రియపుత్రునితో నటను।
కుదురుగ నామను బెట్టె తపస్వియు గోరక్షుకుడని యిలను॥ ౪౦.
కొన్ని దినంబులు గడవగ గురువును గోరక్షుకు డడిగెమును।
మన్ననతో తనకుపదేశంబును మానుగ జేయుమనుచును॥ ౪౧.
గురుడు జెప్పె శుశ్రూషనుజేసిన గురుతుజూపెదను నీకు।
పరిక్షజేయక పెద్దలు భువిలో బ్రహ్మము దెలుపరొరులకు॥ ౪౨.
సేవాతత్పరు డగుచునుశిష్యుడు జేసెను శుశ్రూషలను।
భావార్థముతో తిరుగగ గనిరటు పట్టణ మొకటి నెదుటను॥ ౪౩.
వృక్షము క్రిందను వేంచేసియు పురి వెలినుండెను నొకయెడను।
భిక్ష దెచ్చుటకు పోయి రమ్మనుచు ప్రియశిష్యుని వేడగను॥ ౪౪.
పురవీథిని గోరక్షుకుడరుగుచు పాసగ భిక్షమడుగగను।
ధరణీసురు సతి యొక్కతె బెట్టెను ధవళాన్నము గారెలును॥ ౪౫.
అతడు సంతసముతోడ వెళ్ళగా నచటి జనులు గనుగొనుచు।
సతతము తృప్తిని బొందువాడనియు సద్వృత్తిని గని మనుచు॥
గోరక్షుకుడా వడలునన్నమును గురువున కర్పింపగను।
తీరినప్రేమను భక్షణ జేయుచు తెలిపెను శిష్యునికటను॥ ౪౬.
మధుర రసముతో గూడియునున్నవి మహినీ వడలును నాకు।
విధితో రేపును దెచ్చిపెట్టుమని వీలుగనవె శిష్యునకు॥ ౪౭.
అటులను జేసెదనని తగ జెప్పుచు నరుణోదయమున లేచెన్।
చటులతరంబుగ స్నానము జేసియు చంకను జోలెను పూన్చెన్॥
నిన్నటిద్విజవరు నింటికె వెళ్ళియు నెరినడిగెను భిక్షమును।
ఎన్నకగా నా గారెలనిమ్మని యీప్సితమున నడుగగను॥ ౫౦.

గృహిణియు బల్కెను గోవిందునికై గృహమున నిన్నను నేను।
మహీసురులందర మన్నన జేయుచు మరియిడితిని గారెలను॥ ౫౧.
ఈదినంబునను భక్ష్యంబులనే నింటచేయ లేదనుచు।
పాదుగ దెచ్చిన ధాన్యము చేకొని బాగుగ పొమ్మనె గనుచు॥ ౫౨.
ఉద్ధురమగు ధనధాన్యంబులతో నొప్పగ గొననని యతడు।
సిద్ధిరిద్ధి చాతుర్విధముక్తులు చేరవచ్చినను గురుడు॥ ౫౩.
చక్షులజూడం డిచ్ఛాపూర్తిని చక్కగ జేయుట కొఱకు।
భక్షణ చేయను వడలను వేగమె భామిని యొసగుమునాకు॥ ౫౪.
వనితయు బలికెను వేషధారుడై వాసియన్నమును గోరు।
శునకంబున కన్నము బెట్టిననది నూటిగ దినమును గోరు॥ ౫౫.
ఈసామ్యంబున నీతడు తిరిగియు నింటజొచ్చెనని పలుక౯।
వేసారకనే శునకంబునకును విహీనుడగుదును గనుక౯॥ ౫౬.
వడలను దీయక వెళ్ళను నేనని వాంఛను నాతడు బలుకు।
గడుసుగ సతియనె హటము జేసినను కలుగని సొమ్మెటు దొరకు॥
భ్రంశమునొందక కాంతయు నడిగెను పరగనతని నేత్రముల।
సంశయమొందక నిచ్చెదననుచును సాదువు దెమ్మనె వడల॥ ౫౮.
వనితయు వినియీ వ్యర్థ వచనముల వదరుటేల యని జెప్ప౯।
కనుగ్రుడ్డును గోరక్షకుడొసగెను కరమున తీసియు నొప్ప౯॥
అదరుచు బెదరుచు వనితయు నాతని యక్షిరక్తమును దుడిచె౯।
పదములమ్రొక్కగ భయపడ వలదని బలికె తపస్వియు మెచ్చ౯॥
క్రోధము లేకయు శాంతత్వముతో గురువరుని భజించుచును।
వేధనొందకను మహాసిద్ధులను వెలయదలచకుండగను॥ ౬౧.
విప్రుని భార్యయు వేగమె యింటను విసురుచు పిండినినపుడు।
క్షిప్రతరంబుగ చేసియు వడలను చేతులనిచ్చియు నెగడు॥ ౬౨.
ఎవ్వరితోడను చెప్పవలవదని యేపున నటు మ్రొక్కగను।
భవ్యుడు గోరక్షకుడు ముదంబున బట్టగట్టె కన్నులను॥ ౬౩.

ఆచార్యునికడ కేగుదెంచిమరి యారగింపుమని జెప్పెఁ।
ఆచారముగల శిష్యుని గనుగొని యాలస్యంబెటు లొప్పెఁ॥ ౬౪.
గారెలకొఱకై గోరక్షకుడును కంటెనిచ్చినాననగఁ।
గోరక్షకుగని రెండవ కంటెని గురువరుడిమ్మని యడుగఁ॥ ౬౫.
అటులను జేసెద ననుచు జెప్పిదా నప్పుడె యానేత్రమును।
పటుతరముగదా నెత్తియొసంగెను పరమగురుని చేతులను॥ ౬౬.
అతిమోదముతో నాచార్యుండును నమలనేత్రముల నిచ్చెఁ।
కృతకృత్యుండని తారక మంత్రము క్రియతోనుపదేశించెఁ॥ ౬౭.
భక్షణ జేసియు పిదపశిష్యునకు ప్రసాదమును దానీయఁ।
దక్షులగుచు మరి తిరుగుచునుండిరి ధరలో నిరువురు డాయఁ॥
కొన్నిదినంబులు గూడియుండియును గురుమత్స్యేంద్రుడు తిరిగె।
వన్నెగనొకడై తీర్థాటనచే పరగ ద్వీపమున కరిగె॥ ౬౯.
సచ్ఛిష్యుండును సకల తీర్థముల చక్కగజూచుచు మరియు।
కుచ్ఛితజనులను కుదురు పరచుచును గోవిందా హరియనియు॥ ౭౦.
శ్రీహరి యంశజుడైనకతంబున చేతనకోట్లను మెల్లఁ।
సాహసమునదా చక్కబెట్టుచును సద్గురుగన విలసిల్లఁ॥ ౭౧.
కృపణుడు ధనమును గోల్పోయినయెడ కృంగి కుంఠితుడగును।
నెపములేకయా గోరక్షకుడును నిర్మలగురుని వెదకును॥ ౭౨.
దేశము దిరుగగ కానిపనాథుడు దెలిపెను సద్గురునునికిఁ।
ఆశతోడతా నడచుచుగురుతుగ నరుగుదెంచె నొకపురికిఁ॥ ౭౩.
జోవుచునుండగ భిక్షాటనకయి పున్నమచంద్రుని బోలు।
పూవుబోణియగు పొలతుకయొక్కతె శివినినట విలసిల్లు॥ ౭౪.
కాంతిని వెలసిన ఘనసౌందర్యము కలిగినమేనున నీవు।
దాంతినిముందుగ జోవవిఘ్నమున నెంతయు దగులుకొనెదవు॥ ౭౫.
స్త్రీరాజ్యంబున సాధుజోగులను శీఘ్రమెచంపుదురటను।
పేరిమితోనా ప్రభుత్వమంతయు ప్రేమలరాణిది యగును॥ ౭౬.

సత్యవచనమును జెప్పితినిప్పుడు చనవలదచటికనగను।
వ్యత్యయంబు గోరక్షకుడెన్నక వలయుచు చనుటకునటను॥ ౭౭.
మనమున దలచెను మత్స్యేంద్రుండా మహిత పట్నముననుండు।
అనువుగ తాచని చూడవలయునను నాశయముగల దనుచుండు॥౭౮.
అటనొక వృక్షము క్రిందను జూచెను నాటగాండ్ర కొందరను।
పటుతర సంతసమంది వారితో బలికెను దానిట్టులను॥ ౭౯.
మీరలెచ్చటికి నేగెదరనగను మిక్కిలి శోకముతోను।
వారలు ప్రేమలరాణి వసించెడు పట్టణమున కేగగను॥ ౮౦.
పగటి వేషములు వేయుచు మేమును బహు నర్తన సలుపుదుము।
మిగుల వ్యాధిచే మృదంగవాద్యుడు మెలగుచునున్నాడుసుము॥
మనసునక్లేశము నొందితిమనుచును మహాతపసితో జెప్పన్।
విని మృదంగవాద్యముచేయుదునని విహితంబుగ తానొప్పన్॥ ౮౨.
అనుచు మృదంగము నాతడు గైకొని యచ్చెరువుగ వాయింపన్।
తనివిని బొందిరి వారలు మిక్కిలి ధ్వని మధురము కల్పింపన్॥ ౮౩.
ఆతరి వారలు తోడ్కొని వెళ్ళిరి యా ప్రేమళ పురమునకు।
ప్రీతిని గోరక్షకుడును పోయెను ప్రియ గురువరు గాంచుటకు॥౮౪.
గోరక్షకుడును గొప్పతనంబును గోరక వారల గూడి।
చేరియుండి యటు సేవలజేయుచు చేరె వారి గొనియాడి॥ ౮౫.
పగటివేషగాం డ్రచ్చటనాడగ బహుప్రేమముతో నటకు।
మగువయైనయా ప్రేమళరాణియు మత్స్యేంద్రుడు జూచుటకు॥
వచ్చియుండగా గోరక్షకుడును వారలు సంతోషింపన్।
మెచ్చిచూడగను మృదంగవాద్యము మేలుగ దావాయింపన్॥ ౮౭.
ఆవాద్యంబున గోరక్షకుడిట కరుదెంచెనునని బలుకన్।
భావములోపల ప్రేమళరాణియు పరికించుచు తానులుకన్॥ ౮౮.
ప్రేమలరాణియు తద్ధ్వని వినితన ప్రియపతి గని తాననియెన్।
ఏమారకయా మృదంగ ఘోషము నెలమి నీవువినుమనియెన్॥

అలమత్స్యేంద్రుఁడు తనశిష్యుండిట కరుగుదెంచినాఁడనుచు।
వెల్లయగ నాడెడి వేషగాండ్రలో వెదకియు ననువుగఁజూచు॥ ౯౦.
శిష్యుని గురుతుల చక్కఁగ కనుఁగొని చెప్పెను తనదుసతికిని।
శిష్యుండికపై నన్ను వదలఁడిది సిద్ధము నీవుగనుమని॥ ౯౧.
ఆసనమునుడిగి యప్పుడె శిష్యుని నాలింగనమును జేయఁ।
వేసరిల్లకను చేతిమృదంగము వేగ క్రిందబడవేయఁ॥ ౯౨.
సలిపెను దండము సాష్టాంగంబుగ సద్గురునాథునకపుడు।
మలయుచు, నిరువురు నేకాంతంబున మానుగనుండిరి నాఁడు॥ ౯౩.
మచ్చెపు దొరయనె సేవించియుమరి మహిని తీర్థములనెల్లఁ।
వచ్చితి నిచటికి ప్రేమలరాణియు వలనువేసె నిర్యోడలఁ॥ ౯౪.
రాజభోగముల రంజిలజెందగ రమ్యత జేసెను నన్ను।
భోజన శయనముల్ సలుపుచునుండగ పుత్రుగంటి నామెకును॥
నీదురాకనే నెదురుజూచుచును నిజమామెకు దెలుపగను।
పాడుగ నిచటికి వచ్చుసాదులను బట్టించంపునామెయును॥ ౯౬.
నీవిచ్చోటికి నెటులవచ్చితన నెనరున నాతండనియెఁ।
దేవస్థలముల తీర్థంబులగని తిరుగుచు వచ్చితి ననియెఁ॥ ౯౭.
కనుటకునినునే వెతుకుచునుండగ కానీపుండును జెప్పెఁ।
పనిబడి వెతుకుచు నీకయి వచ్చితి భవ్యంబగుచును నొప్పెఁ॥ ౯౮.
గోరక్షకుడిటు పలుకుచుండగా గురువర్యుడు వినుచుండెఁ।
మీరిన ప్రేమను గురుశుశ్రూషను మేలుగజేయుచునుండెఁ॥ ౯౯.
ప్రేమళరాణియు బహువ్యసనముతో బెంపొందెను తానపుడు।
సోమశేఖరుని సముడగు తనపతి సుఖశిష్యుని గనుచుండు॥ ౧౦౦.
ప్రియుడగుభర్తకు జూపెనామెయును ప్రేమాధిక్యము మిగుల।
నయమగు యోచన లామెయు జేసెను నాథుని వదలని యటుల॥
ఏకాంతంబున మత్స్యేంద్రుండును నెలమినుండు దినమునను।
సాకాంక్షను గోరక్షకుడప్పుడు చనబలికెను గురుతోను॥ ౧౦౨.

కాలము వృధగా గడపితిమిట్టుల కార్యకరంబును దొలగ।
వీలుగ రాజ్యము విడిచియు మనమును వెళ్ళుద ముత్తరదిశగ॥౧౦౩.
అతడును బలికెను నతిసౌఖ్యంబై యమరినదీ దేశంబు।
హితమగు స్వర్గంబున వసియించిన నింపొందదు సౌఖ్యంబు॥ ౧౦౪.
బాలు విడిచినే బోవుటకెట్లగు బద్ధుడనైతి ననంగన్।
కాల నిరీక్షణ జేయుచు గోరఖు కష్టంబున నుండంగన్॥ ౧౦౫.
చిరకాలంబిటు జరుగుచునుండగ చెలగుచు నొకమాపునను।
పురుషుడు భార్యయు పట్టెమంచమున పుత్రుతోడ నుండగను॥
కడుపునొప్పితో కొమరుండప్పుడు ఘనరోదన చేయంగన్।
తడవు లేకయా తండ్రిలేచియును తనయునేమియని యడుగన్॥ ౧౦౬.
మలవిసర్జనము జేయుటకొఱకై మంచము దిగ విడుపుమనన్।
చలములేక గోరక్షకు బిలువగ సరగున నతడేమియనన్॥ ౧౦౭.
మీననాథుడును మలవిసర్జనము వెలపున జేసిన పిదపన్।
మానుగనిచటికి గైకొని రమ్మని మహిని శిష్యునకు జెప్పన్॥ ౧౦౮.
కొమరుబట్టుకొని యాతడు వెళ్ళియు కూర్చుండగ నియమించెన్।
కొమరొప్పగనటు మల విసర్జనమె గోరిచేయ నియమించెన్॥ ౧౧౦.
జలవిసర్జనము చేసిన యెడలను శ్రవముల గోసెదననగన్।
వెలవెలబోవుచు తండ్రివద్దకును వేగమె గొనిపొమ్మనగన్॥ ౧౧౧.
గోరక్షకుడును కొమరుని దెచ్చియు కూర్మినిడియె మంచమున।
మీరినప్రేమను గురుని పడకలో మెలకువతో సుతునిడిన॥ ౧౧౨.
పిదపను పుత్రుడు పడక మీదనే కదియ విడిచె మలజలము।
విదితమయ్యె దుర్గంధంబంతట వెనుకలేచె గురుడుసుము॥ ౧౧౩.
గోరక్షకుతో జెప్పెను పుత్రుని గొబ్బున కడుగుమనుచును।
ధీరత్వముతో కొమరుని గైకొని దిగ్గున నదికరుగుచును॥ ౧౧౪.
బాలుని చేతుల బట్టిబండపై చాలాగొట్టుచున్నపుడు।
వీలుగ ప్రాణము వెళ్ళగ రక్తము వెంటనె కడిగెను గనుడు॥ ౧౧౫.

అస్థులు మాంసము నటుబడవేసియు నాచర్మము నుతుకుచును।
స్వస్థత శ్రీగురు కడకు దెచ్చియును సరగ నెండవేయగను॥ ౧౧౬.
గురుడును శిష్యుని బిలిచియు నడిగెను కుమారుదెచ్చుట ననియు।
మరుగున నుతికియు నెండించితినని మరల శిష్యుండనుటయు॥ ౧౧౭.
సతిపతులిద్దరు వినియాసంగతి చనుదెంచిరి యాబైటన్।
హితపుత్రుని చర్మంబును జూచియు నిలను మూర్ఛజెందిరటన్॥
తిరిగిలేచితన శిష్యునికన్గొని తెలివినొంది తానవెను।
పరిపూర్ణంబగు కళతో గూడిన భద్రసుతుని చంపగను॥ ౧౧౯.
బాడియె నీకును, పుత్రుని నాకును పాముగజూపిన యెడలన్।
నేడిటు మహిలో ప్రబల శిష్యుడని నిన్నుదలతు నియ్యెడలన్॥ ౧౨౦.
ఈవచనము గోరక్షుండువిని యెలమిని జూపెను మహిమన్।
ఆవిధబాలుర నష్టోత్తరశత మచ్చుటజూపెను గరిమన్॥ ౧౨౧.
ఈమహిమనుగని మత్స్యేంద్రుండును హెచ్చినమోదము నొందన్
ప్రేమళరాణియు గోరక్షునుగని బెట్టె దండమిం పొందన్॥ ౧౨౨.
సహిత విద్యలను మరుగుపరచి యిటు మహినాసుతు నియ్యుమనన్।
సహనము తోడను నాతండిచ్చెను స్వపుత్రకుని యామెగనన్॥
సప్తశిశువులును శతబాలకులును సకలురుచూడగ నచటన్।
గుప్తమునొందిరి యాగోరక్షుని గొప్పమహిమనటు గనుటన్॥
పిదపనుశిష్యుడు సదాచార్యునకు బెట్టెను దండము నపుడు।
ముదముననిరువుర మిచ్చుటనుండక మొగిబోవుట మేలిపుడు॥
సదమలశిష్యుని పలుకువిననియెడ సలుపు విపర్యయమనుచు।
మదిమత్స్యేంద్రుడు సమ్మతితోడను మహిషిని ప్రేమళగనుచు॥
గోరక్షుకుడును బిలిచెనురమ్మని †గొడవను బోయెదమనగన్।
ఘోరక్లేశము నొందుచు ప్రేమళ గుణవతియును గుప్తముగనన్॥
సువర్ణకణికల జోలెనుంచిసతి సూటిగ పతికిని మ్రొక్కన్।
భువిలోనినునడ బాసియు నుసురుల బొందినుందునే చక్కన్॥

†గొడవ = ఆపద.

సతియీవిధమున జెప్పుచునుండగ పతివిని మత్స్యేంద్రుడును।
అతిదుఃఖముతో గృహమును విడిచియు నటుచనె శిష్యునితోను॥
పురమును విడిచియు నరణ్యమందును బోవుచుతా నుండగను।
వెరవేమైనను గలదో దారిని విహితంబుగ జెప్పుమను॥ ౧౩౦.
గోరక్షుడును గురుగని బల్కెను ఘోర విరాగంబునను।
సారపదార్థము లన్నివిడిచియటు చనగను భయమేమిలను॥ ౧౩౧.
అనుచుజెప్పగా మత్స్యేంద్రుండును నతిభీతిని బోవుచును।
మునుకొనినడచుచు స్వచ్ఛోదకపు కొలనుప్రీతిని జూచుచును॥
కొలనుగట్టునను జోలెనుబెట్టియు గురితో శౌచంబునకు।
వెలయగ భీతిని చూచుచు బోయెడు వెరపేటికి గురువునకు॥ ౧౩౩.
అనుచు దలంచుచు నాతనజోలెను నపుడువిచ్చి జూడగను।
ఘనభారంబగు కాంచనంబులను గ్రక్కునజూచి యతడును॥ ౧౩౪.
దారా ధనములపై కాంక్షనుమది దండిగనిడె గురుడనుచు।
భారవహంబగు స్త్రీని విడిచియును బంగారము చేకొనుచు॥ ౧౩౫.
విడిపించుట యిది యుత్తమమనుచును వేసెనీట బంగరును।
గడుసురాళ్ళను గురువరుజోలెను గ్రక్కుననిడె బదులుగను॥
శౌచముచేయుచు మత్స్యేంద్రుండును చంకజోలె నుంచుచును।
*ప్రాచియరణ్యము బోవుచునుండగ వగపుగలదె యనగాను॥
భయము దొలగెనని శిష్యుడుజెప్పెను పద్మసరసు విడువగనె।
నయముగ గురుడును జోలెను చూడగ నందు రాళ్ళతానుగనె॥
దారిఖర్చుకై దెచ్చిన ద్రవ్యము తనకొరులకు లేకిచ్చెన్।
పారవేయుటయు బాడియెనీకన బండను సుతు శౌచించెన్॥ ౧౩౯.
శిలయంతయునటు స్వర్ణమయంబై చెలగి యుండ గురుజూచి।
పులకిత గాత్రుడై భువి మత్స్యేంద్రుడు పొందెను వింతయుమించి॥
గోరఖుబల్కెను గురుచరణంబుల గొప్ప ప్రతాంబనుచు।
మీరిన ప్రేమతో మ్రొక్కెను సద్గురు మేలగు పదముల మనుచు॥

---

*ప్రాచి = మాలిన్యము.

తనదుగురుతు మత్స్యేంద్రుడు దెలిసియు తరలెను నిర్భయుడగుచు।
అనువుగశిష్యుని యద్భుతమహిమల నవనిదెలుపు కొఱకనుచు॥
ఇటులంజేసితి ననిదాజెప్పుచు నిచ్చనేగి రిరువురిలన్।
పటుతరంబుగా జెప్పెనీకథను బాలకృష్ణ దాసుడిలన్॥ ౧౪౩.

## చోఖామేళుని చరిత్రము.

అంత్యకులమున నవతరించె నీయవని చోఖామేళుడు।
పంతముతోడా భార్యనుగూడియు పండరిపురముననుండు॥ ౧.
అంత్యజుడైనను నవని నందరను నాత్మతుల్యముగ జూచు।
అంత్యవిచారణ గలిగి సత్యమును హరిభక్తిని గడుమించు॥ ౨.
హరివాసరమున నచ్యుత వ్రతమును నలసట లేకను జేయున్।
మురరిపు కీర్తన ముచ్చటతోవిను ముకుంద నామము గొనియున్॥
పారకను గైకొని చిమ్ముచు గుడివెలి పురప్రదక్షిణ మటను।
పరువుగ సతితో భగవద్భక్తుల బహుసేవల చేయుచును॥ ౪.
ఈనిష్ఠనుగని హరితనదర్శన మిచ్చుచుండు నపుడపుడు।
మానుగనొకయెడ కృష్ణుడు చోఖ్యా మందిరంబునకరుగుడు॥ ౫.
ఏకాదశియై యుండుట చేతను నిమ్మనె నుపహారమును।
చోకామేళుడు వినిసతితోడ హృషీకేశు హరికొఱకును॥ ౬.
తగిన పదార్థము దెచ్చియొసగుమన తథాస్తనుచు కడుత్వరతో
పొగయింటకిదా బోవుచు పెరుగును పొసగదెచ్చె మీగడతో॥ ౭.
ప్రేమతోడనిడు పెరుగును శ్రీహరి ప్రియముతోడ భక్షించెన్।
నామకులంబుల నేమియు చూడక నరహరి భుజించి లేచెన్॥ ౮.
భూమిని కొంచెము పెరుగు బడంగను భువిపీతాంబర మంటన్।
ప్రేమనుభక్తుడు శ్రీహరి పదముల ప్రియమున మ్రొక్కుచు వెంటన్॥
యదుకుల తిలకా యచ్యుతకృష్ణా యత్నమునన్ మరుదినము।
అతులిత ద్వాదశి తీర్థప్రసాదము లారగింప నిటు రమ్ము॥ ౧౦.

సదమల వాక్యము శ్రీహరివినితా సన్మతించి పోవంగన్।
విదితమయ్యెనది విప్రునికొకనికి వెలుపల నుండియు గనగన్॥ ౧౧.
సంతాపముచే శ్రీహరి గుడికిని సరగ వెళ్ళిచూడగను।
వింతగాగహరి పీతాంబరమున వెలసెను నటు దధియును॥ ౧౨.
అతిశయమొందుచు నేకాంతంబున నచ్చటి ద్విజులకు జెప్పె।
పతితుడు చోఖామేళుడు గుడికిని పలుమరు వచ్చును చూపె॥ ౧౩.
ఊరికి వెలుపల వెళ్లునట్లుగా నుపాయమును జేయుదయన్।
కూరిమి నంత్యజు డచ్యుతు ముట్టుట కూడదు ఘోరంబనియెన్॥
ద్విజులును వ్రాసియు పత్రికనొక్కటి దివానుగారికొసగుడు।
కుజనుడు తురకల పదుగుర గనుగొని కోరి చోఖున్ దెమ్మనుడు॥
అంత్యజు వీధికి వారేతెంచియు నానతి నతనికిదెలుపన్।
వింతనొందుచును భక్తుడు బలికెను విఠలు వచ్చునని పిదపన్॥౧౬.
విందునకనియును నేనువచ్చుటకు వీలుగాదనియు బలికి।
సందియమొందక భార్యను వంటను సరగచేయుమన కలికి॥ ౧౭.
ఆమంత్రణమును హరికిచ్చితినే యది మరచితివా యనగన్।
సామంతులు చోఖామేళునీడ్చిరి సక్రోధముతో వెలిగన్॥ ౧౮.
దివాను వద్దకు తాడనజేయుచు దెచ్చిరి చోఖామేళున్।
సవాలు వేసెను చోఖామేళుడు సలుపుచు నటుదండములున్॥౧౯.
పిలిచిన దేటికి నను తండ్రీయన బలికె దివానుండపుడు।
బలవంతముగా బ్రాహ్మణులందరు పత్రికదెచ్చిరి యిపుడు॥ ౨౦.
అంత్యజుండు శ్రీహరి యాలయమున కరుగుదెంచి రాత్రులలో।
పంతము తోడను పూజలుసలుపును పలుకుచుండు నట గుడిలో॥
జాతిధర్మమునకు విరోధముగా సన్నిధికరుగుట తగునా।
భీతిని భక్తుడు బలికె రంగడె పిలుచుట యతనికి తగునా॥ ౨౨.
నీచుడనేనని యెంత జెప్పినను నెనరున నతడువినకను।
సూచన వచ్చి గృహంబున కూర్చొని సుఖముగ తినును గనుకను॥

నాయపరాధం బించుకలేదిట నయోపాయమేమనను।
బాయనిభక్తికి యాకలినొందును పరగ గనడు జాతియును॥ ౨౪.

సర్వదేహముల యాత్మయొక్కటియె సకలేంద్రియముల జాలన్।
నిర్వహించుచును నిష్కళంకుడై నిర్వికారుడగు గోలన్॥ ౨౫.

ద్విజుడంత్యజుడను భంగిని నడవగ తెలియు దోష రహితమని।
కుజనుడు ద్విజుడును గంగను మునగగ నిజము దోషరహితమని॥

అటువలె శ్రీహరికవిత్రతయును నంటనుచు జెప్పగను।
పటురోషముతో బల్కె దివానుడు పరమ తత్వబోధమును॥ ౨౬.

జెప్పుట నీకును సిగ్గులేదా దెచ్చె రెండెద్లన్।
ఒప్పుగ చోఖ్యా కాళ్ళను క గట్టి విలసిల్లన్॥ ౨౮.

ఘటులకు జెప్పె దివానుండితనికి యెదుపరకు।
పటుతరముగా నీడ్చిన వెనుకను నకడకు॥ ౨౯.

ఇరగని చోఖ్యా శ్రీహరిభజనను నిప్పా చెన్।
పనపడి యచ్యుత కృష్ణకృపాళో పరంధామ ॥ 30

అతినీచుడనై బుట్టితినిలనని యాహేతువచే నే
పతితుడనీతో నుండుట నేరము పరగగుడికి వెలినుండ

తగయుండును నాహీనస్థితికిని తగులజూచి యిటునన్న।
పగపక శ్రోత్రము విఠలరామా వాసుదేవ యనగాను॥

అలవిఠ్ఠలుడును వచ్చియచ్చటికి నతిత్వరబట్టె యుగమును
తెలివిలేక తా తరమగొట్టమనె దివానుడవు డెద్దులను॥ 33

ఏదేవుండటు లడ్డమువచ్చునో యెవ్వడజూచెద మనియు।
వాదుగ భటులా యెడ్లను తరిమిరి బహువేగముగా మరియు॥ 34

ఎంతగొట్టినను నెద్దులు జరగక యిలనాటిన గతినుండన్।
వింతతోడనచ్చటి జనంబును వెలయగజూచుచు నుండన్॥ 35

సోకామేళుని సతితోగొందరు సూచించిరి పతిస్థితిని।
సాకాంతనుసతి నేగమె వచ్చెను చనువున పతి నచటగని॥ 36

శ్రీ

శ్రీమతేరామానుజాయనమః.

భగవన్నిర్హేతుక కటాక్షముచే ప్రాప్యభూమినిపొందిన
భక్తశిరోమణుల చరితలను దెలుపు

# భక్తమాల.

ఇది

మహారాష్ట్రభాషయందు మహీపతిబావాయను
భక్తశ్రేష్ఠునివలన రచింపబడిన
భక్తవిజయము, సంతవిజయము, భక్తలీలామృతము, సంత
లీలామృతమను గ్రంథములను క్రోడీకరించి,

వె. బాలకృష్ణ మొదల్యారిచే

తెనుగున
తోహరా కవితలగా రచింపబడిన పదిసంచికలలో నిది

మూడవ సంచిక.

చెన్నపురి, మవుంటురోడ్,
"కమర్షియల్ ముద్రాక్షరశాలయందు"
ముద్రింపించి ప్రకటింపఁబడెను.

౧౯౦౦వ సంవత్సరం జూన్ నెల.

శ్రీమాన్ విచిత్ర శతావధాని, విద్వన్మణీ మహాభాగవత సలక్షణ
కృష్ణ యజుర్వేద ఘనపాఠి, హరిదాస బాళిగద్దెకట్టి,
శ్రీమాన్ లక్ష్మణాచార్య కృత కృతిప్రశంస.

---

శ్లో॥ గ్రథితేయం బాలకృష్ణదాసేన లలితైః పదైః।
భక్తమాలా విష్ణుభక్త చిత్రచారిత్ర బోధినీ। ౧॥
మహాకవి కృత గ్రంథప్రౌఢిమానం శ్రయత్యహా।
ఇతి శ్రీభగవద్గీతా లక్ష్మణార్యోఽనుమన్యతే॥ ౨॥

అంతిమప్రక్కయందుండు విజ్ఞాపనమును చిత్తగించవలెను.



జనార్దనస్వామి　　దత్తాత్రేయుడు.　　ఏకనాథుడు

రొమ్ము గొట్టుకొని యచటికిరాగా రుక్మిణిపతినటు గనిరే।
సొమ్మసిల్లగను భక్తుల కంటికి సూటిగ హరి కనబడిరే॥ ౩౭.
హరి సమ్ముఖమున నామెనిలువబడి యంజలి హస్తము తోడన్।
నెరిపేదలమై యుదరపోషణము నిత్యభృతిని గనుచుండన్॥ ౩౮.
బలిమినిభోజన పఙ్క్తికివచ్చుచు పతి గుడిలోనికి గొనుచు।
కలహచేష్టలను కలుగ జేసియీ గతిని తెచ్చితివి యనుచు॥ ౩౯.
భక్తవత్సలత బొందిన నీవును ప్రకటింపుము రూపమును।
సక్తిని నాపతి చావకుండగను సలుపు ముపాయంబిటను॥ ౪౦.
ఇదివిని హరితన శ్రీకరరూపము నింపుగ జూపెను తాను।
చతుర్భుజములును సుందరరూపును సచ్చిహ్నంబుల తోను॥ ౪౧.
మకరకుండలము మకుట హారములు మానుగ పీతాంబరము।
సకలాలంకృత శోభితుడగుచును చక్రి కానబడెను సుము॥ ౪౨.
గగనమునందును కనబడు మెరుపుల కనులుచెదరు నట్టులను।
సొగసురూపమును చూడగ నరులకు సూటిగ చెదరె కనులును॥
హరియదృశ్యుడై యటుబోవగ జను లాశ్చర్యము బొందగను।
చిరతర భక్తుని చరణబంధముల జిలేదారు విడువగను॥ ౪౪.
అందరు దండము లాత్రిగ బెట్టిరి హరిని గంటి మేమనుచు।
పొందుగచోఖా బోయెనింటికిని పురుషోత్తము కృపయనుచు॥
అదిమొదలాతడు కొవెలకరిగె నిరాటంకంబు గనుండు।
పదపడిభక్తుల పాదధూళియగు బాలకృష్ణ దాసుండు॥ ౪౫.

---

## ఏకనాథు చరిత్రము.

భానుదాసుడను విప్రునకొక సుతు పైఠను పురముననుండెన్।
వానినామమటు చక్రపాణియని వరుసపిలువ బడుచుండెన్॥ ౧.
సూర్యనారాయణుడను పేరను సుపుత్రుడొక్కడు వెలసెన్।
భార్యరుక్మిణియు పుణ్యవతియునై బరగగ నాతని గలసెన్॥ ౨.

వీరలిరుపురకు బుట్టెను కొమరుడు విశ్వోద్ధారకు డగుచు।
సారతముండై యేకనాథుడని జనములు బిలువంగనుచు॥ 3.
బాలత్వంబున తల్లిదండ్రులును పరమున కేతేరగని।
తాలిమి తోడను బ్రతిపాలించెను తాతయు నాబాలకుని॥ ౪.
చిన్నవయస్సున బాలుర గూడియు శిలల హరిగ పూజించు।
పన్నుగ శ్రీహరిభక్తులు జేసెడి ప్రబల గానమును వినుచు॥ ౫.
నిండుప్రేమతో పాటల బాడును నిలుచుండిన నడచినను।
పండరినాథా పద్మనాభుడా పాండురంగ గనుమనును॥ ౬.
కట్టెపుల్లలను కరముల గైకొని కట్టుచింపు గుడ్డలను।
బట్టుకొనుచు నిది పతాకమనుచును పండరికిని బోదునను॥ ౭.
శిశువైయుండియు శ్రీహరి చింతన జేయగని పితామహుడు।
వశుడై తండ్రికి వరమిచ్చెనుహరి వంశమందు బుట్టనుడు॥ ౮.
వరదానముచే వచ్చెపౌత్రుడని వాంఛను జేయుచునటను।
అరమరలేకయ యుపనయనంబును నారవయేట సలిపెను॥ ౯.
కులగురుండు జెప్పిన కర్మంబుల కూర్మితోడ దాజేయు।
సలిలము గూడను సేవింపడుతా స్నానంబును జేయకయు॥ ౧౦.
అధ్యయనంబును వర్జింపకయే యతనికి కడువేగమున।
అధ్యపు విద్యలు సులభంబుగ విశదంబయ్యెను నెయ్యమున॥ ౧౧.
చిత్తము తొందర జెందనివాడై శ్రీవైష్ణవు డగుచును।
ఎత్తరిప్రాప్తంబెది యానోయది యీశు ననుగ్రహమనును॥ ౧౨.
ప్రీతియునతనికి పొందంబడియెను పెంపురామ నామమున।
నీతిశాస్త్రముల యుచితార్థంబులు నిగుడిజెప్పు నరులువిన॥ ౧3.
పౌరాణికులు నాశ్చర్యంబును బహుగా పొందిరి వినియు।
సారాసార వివేకజ్ఞుండని సకల జనంబులు గనియు॥ ౧౪.
ఏకనాథుడును నేగి వారిగని యేసంశయ మడిగినను।
జోకగనెవ్వరు దీర్తురనంగను సూచనసిరి వారలును॥ ౧౫.

సంసారికుడు ము_క్తిని జెందడు సద్గురు జెందకజగతి।
కంసరిపుండే యాచార్యుండై కలుగజేయు తాసుగతి॥ ౧౬.
ఈవచనమువిని యతిత్వరితుండై యేకనాథ నాముండు।
సేవజేసినే సద్గురునెప్పుడు జెందెదనో యనుచుండు॥ ౧౭.
అతివ్యాకులుడై యొకమాపునదా హరిభజనను జేయగను।
ద్వితీయ్యజామున ధ్వనియువినంబడె దివిపై వాక్యముగాను॥ ౧౮.
శ్రీదత్త్రాత్రయు శిష్యుండగుచును శ్రీజనార్దనుం డుండు।
పాదుగదేవ గిరిగడేయనునా పట్టణముండును వినుడు॥ ౧౯.
అతనింజూడు మటంచును జెప్పగ నాకర్ణించియు వెనుక।
కుతుకము తోడను నరిగెను నప్పుడు యితరుల కెరుకబరుపక॥ ౨౦.
ఐదామడగల దూరపుయూరున నలయకొకడై జేరుచును।
మోదము తోడను జెప్పిపంపెనట ముందుగ తనరాకడను॥ ౨౧.
జనార్దనుండును తడయక వచ్చెను సరగున వాకిటి కడకు।
సునీతుడగునొక వైష్ణవునింగని సుఖముగలిగె గురువునకు॥ ౨౨.
ఏకనాథుడును సాగిల బడుచును నెలమిని దండంబునిడు।
జోకతోడ నను పుణ్యుజేయమని సూటిగ బలుకుచునుండు॥ ౨౩.
శరణాగతుడను చేరితినీపద సరసిజముల నేనిపుడు।
శిరమున కరములు జేర్చిబ్రోవుమా శ్రీగురు రాయావినుడు॥ ౨౪.
ఆసయు తృష్ణయు ననివారములై యతిబాధల నొందితిని।
వేసరిల్లకయ వచ్చితినీయెడ వేగబ్రోవు సమ్మతిని॥ ౨౫.
అనుతాపముతో బ్రమ్గినవాడని యాచార్యుడు ముదమొంది।
వినయముతోడను గృహములోపలను వెళ్ళుమనెను ప్రియమొంది॥
ధృవుడును నారదు గనుగొనినట్టుల ధృతిగొని శిష్యుండటను।
భవహరుడగు శ్రీయాచార్యుని గని పారదోలె మమతలను॥ ౨౭.
ఎక్కువ తక్కువ లేమియుచూడక యెల్లసేవలను జేయన్।
జొక్కుచు నెప్పుడు నాచార్యునిపద సుఖతర సేవను వెలయన్॥ ౨౮.

అరుణోదయమున నాతడు లేచియు హరిస్మరణంబును జేయు।
పరుసను శౌచము ముగిసిన వెనుకను వాస్తుపూజలను జేయు॥ ౨౯.
గురుడు లేచినను శౌచంబున కైగొనిపోవును నుదకమును।
చరణక్షాళన జేసెడి చోటను చక్కవేయు పీఠమును॥ ౩౦.
ఉపకరణములగు పాత్రలనెల్లను నుజ్జ్వలమగునటు తోముఁ।
నెపమున మృత్తిక నూష్ణోదకముల నెనరుననిడు నడుగకముఁ॥ ౩౧.
పూజాద్రవ్యము పుష్పము తులసియు పొందుగ దెచ్చియునుంచు।
ఓజను గురునకు స్నానపు విధులను నొనరగ తాజేయించు॥ ౩౨.
ఆచార్యుండును శ్రీహరి విగ్రహ యారాధనమున నుండఁ।
శ్రీచందనమును ధూపహారతుల జేర్చియుంచు తానండఁ॥ ౩౩.
ధ్యానము జేయుచు శ్రీగురుడుండిన తన్మూర్తినె గనుచుండు।
బూనియు శ్రీగురు నుచ్ఛిష్టంబును పొందుగదా దినుచుండు॥ ౩౪.
విడెముల నిచ్చుచు నుమిపాత్రంబును వేగదెచ్చి యిడియపుడు।
పడుకొని యుండిన గురుచరణంబుల బట్టియు పిసుకుచునుండు॥ ౩౫.
ఎట్టివేళలం దేమారక తా నేర్పడి సేవలొనర్చు।
గట్టిగ జన్మము గడచు వరకును ఘనగురు భక్తినినుంచు॥ ౩౬.
లక్షణయుక్తంబుగ లెక్కలనిడె లాలితమతితో దెలిసి।
పక్షపాతమిటు లేక ప్రపంచము పరమార్థముగా గలిసి॥ ౩౭.
ఏకనాథునటు లడిగెనుగురుడును నిటనుంటివి మావద్దఁ।
సాకిన బంధువు లెచ్చటనుందురు సరగదెల్పుమీ మీదఁ॥ ౩౮.
పైటనుందురని యేకనాథుడనె పరగ తాత యవ్వయును।
దీటుగ తల్లియు తండ్రియునాకును తీరిరి పసితనముననును॥ ౩౯.
వారల తలపున నుంచక నేనిటు వచ్చితి పాపము తొలగు।
గోరక నీదగు సేవయె జపమగు గురునామమె తలపునగు॥ ౪౦.
వికల్పమెద్దియు నాకు లేకయె వే వచ్చితి నిటననుచు।
ప్రకటంబుగనీ యుచ్ఛిష్టంబె బ్రహ్మారసంబనె మనుచు॥ ౪౧.

జ్ఞానేశ్వరియను గ్రంథముగురుడును గరిమెతోడ చదువుచును।
దానాధ్యయనము లైనవెనుకను తాభక్షణ జేయుచును॥ ౪౨.
రాజ్యవిషయమగు రాచకార్యముల రాజువద్ద దానేయు।
పూజ్యమానమగు నుద్యోగంబును పొసగజేయు తగమరియు॥ ౪౩.
కాలంబిట్టుల గడపగనృపునకు కడువిరోధి వచ్చుచును।
వీలుగరాజును ముట్టడివేయగ విభుడుగురుని బిలువగను॥ ౪౪.
సేవకుబంపగ జనార్దనుండును శ్రీశుధ్యానమున నుండ౯।
నావుడు యేకుండాతని లేపక యతనివస్త్రము లటుండ౯॥ ౪౫.
తానెవేసికొని వెళ్ళెసవారిపై ధరానాథు దొరకడకు।
సేనతోడ పొమ్మనియనె నరపతి *సెరగు మిగుల దొలగుటకు॥
ఆజ్ఞను చేకొని యధికసేనతో నలపరచక్ర భయంబుగ౯।
ప్రాజ్ఞతననంచియు చేరెనింటికిని ప్రాపుగగొనెను జయంబుగ౯॥ ౪౬.
గురునివస్త్రముల కొయ్యనుంచి దా గురుసేవల నుండగను।
హరిపరతంత్రుడై దేహము మరచిన యాచార్యుడు లేచుచును॥ ౪౭.
తిరువారాధన చేసిభుజించియు ధీరుడుతా నిద్రించె౯।
జరిగినసంగతి యేమియుదెలియక శయనించుచునటు మించె౯॥
లేచిన వెనుకను లాంఛనయుక్తుడై లేఖలక్షణము తోడ౯।
ప్రాచుర్యంబుగ కొలువునుగొల్వను పరగనేగు నృపుచూడ౯॥ ౫౦.
సమీపమున నృపుచేరనునిచిదా శాలుజోడులను నిచ్చె౯।
కొమరొప్పంగను శత్రుజయమునకు గురుతుగ బిరుదుల నిచ్చె౯॥
జనార్దనుండిది జూచుచునప్పుడు చతురతనెది బలుకకను।
వినీతుడై యంగీకరించియును వేంచేయుచు గృహమునను॥ ౫౨.
తలచుచుతనలో నేకనాథుడీ ధరదీనికి హేతువని।
సలలితముగనా శిష్యునడుగగా సరగమౌన ముండగని॥ ౫౩.
జేసితివేమో తెలుపుమనంగను చెప్పెను కతయంతయును।
భాసురముగనా గురుడునవ్వగను బట్టెపదను శిష్యుడును॥ ౫౪.

---

*సెరగు - ఆపద.

కొంతకాలమిటు గడపిన పిదపను గురుడిమ్మనె లెక్కలను।
సందియ మొందక చూడ వచ్చునని చక్కజేర్చె పద్దులను॥ ౫౫.
పద్దులనెల్లను బాగుగఁజూడగ పైసయొకటి కొఱతయ్యెఁ।
సద్దులేకనే సరిజూచుచుమరి చాలరాతి రటులయ్యెఁ॥ ౫౬.
అకస్మాత్తుగా పద్దందగనే యందులకను మోదించెఁ।
ప్రకటితముగ గురుగని యదేమన పద్దు కథను దెలిపించెఁ॥ ౫౭.
పైసయొక్కటియు పొరపాటయ్యెను పాదుగ జిక్కెనునదియు।
వేసరిల్ల కానందించితినని వినితుడగుచు చెప్పుటయు॥ ౫౮.
ఉత్తమ గురుడనె నిట్టులహరిపై నుంచినయెడ చిత్తమును।
తత్తరబడకయ సంసారంబును దాటవచ్చు ననగాను॥ ౫౯.
ఏకనాథుడును కలమునుంచె నట్లేపున గురువరునెడను।
పోకడలేకను నాదుభావమును పొందియున్న దట్లయను॥ ౬౦.
తారకమంత్రము గురుడుజెప్పుచును తలను హస్తముంచుచును।
కారుణ్యముతో నుపదేశించియు కటాక్షించె బాగుగను॥ ౬౧.
సేవారతుడై యేకనాథుడును శ్రీగురు శౌచస్థలము।
భావపూర్ణుడై శుద్ధపరచుచును పరగ్రముగ్గు వేయుసుము॥ ౬౨.
కొన్నిదినంబులు గడచిన పిదపను గురుడువింత బొందుచును।
ఎన్నికగానే హాలాలుఖోరుం డిటులం జేయడనుచును॥ ౬౩.
ఏకనాథునడిగెను శౌచపునా యేకాంత స్థలమందు।
జోకను నచ్చట కడిగిముగ్గులను సొగసుగ నిడిరెవరిందు॥ ౬౪.
సేవానిష్ఠను నేకనాథుడును జేసితినేనన గురుడు।
నీవికనాకును సేవజేయకుము నేనురుణస్థుడ ననుడు॥ ౬౫.
దత్తాత్రేయుని దర్శనమితనికి దరిగొని జూపగవలయు।
సత్తామాతృడు శిష్యప్రభావము చక్కజూచు నతడనియు:॥ ౬౬.
ప్రతిగురువారము బోవుచునుండును పర్వతమొకటట నుండఁ।
అతిస్వచ్ఛంబై యుండుతటాకం బగ్రభాగ మందుండఁ॥ ౬౭.

కదళీ కేతకి చంపక *కుజములు కడురమ్యముగా నుండు।
ఉదయముకాగా బోయియచటికిని నొసగనీట గ్రుంకులిడు॥ ౬౮.

పార్థివలింగముల్ పదినూర్లనుదా బరువులేక జేయుచును।
తీర్థవిధులతో నర్చనజేసియు దేవపూజ ముగియగను॥ ౬౯.

దత్తాత్రేయుడు దర్శనమిచ్చుచు తలపోయుచు నచ్చోటన్।
చిత్తోపరమంబగు భాషణంబుల జేయుచునటు తానుండన్॥ ౭౦.

ఉత్తమశిష్యుం డేకనాథునకు నుచితవరము లిచ్చునని।
చిత్తంబుననిడి జనార్దనుండును శిష్యునితా బిలుచుకొని॥ ౭౧.

గురుడును శిష్యుని కరము బట్టుకొని గురుతుగ గిరిపైదెచ్చు
మరువేషంబున దత్తాత్రేయుడు మనకును దర్శనమిచ్చు॥ ౭౨.

మనోవికల్పము మానియు నీవును మన్నింపందగు నతని।
ఘన పవిత్రతకు స్నానముజేసియు కడునాతో నుండమని॥ ౭౩.

బలుకుచు నిట్టుల ప్రాతస్నానము బాగుగనటు జేయుచును।
అలయకలింగాల్ వేయిజేసిదా నపుడొనర్చె పూజలను॥ ౭౪.

పిదప మనస్సున దత్తాత్రేయుని ప్రియరూపము చింతింపన్।
సదమలుడును నొక మలంగురూపున చక్కవచ్చెనటు లొప్పన్॥

జనార్దనుండును జేసె నమస్కృతి సద్గురు చరణంబులకు।
వినీతుడగుచును మాటలతనితో వేడుకలలరగ బలుకు॥ ౭౬.

బ్రహ్మరసంబున బరగిరిరువురును భావాతీతులు నగుచు।
బ్రహ్మసామ్యతను పూర్తిగూడుకొని భగవదనుభవ పరులగుచు॥

అతిమోదంబగు నాత్మచర్చయును ననువుగజేయుచు నుండన్।
హతభయుడగుచును నేకనాథుడును నాలకించియట నుండన్॥ ౭౮.

శ్వానమొక్కటి దత్తాత్రేయునితో చనుదెంచెను వెంబడిని।
సానికె నొక్కటి నాతడందుకొని జనార్దనుని తానుగని॥ ౭౯.

పాత్రనిండుగను పాలుబితుకుమనె పరగశునక స్తనమందు।
సూత్రధారవలె శిష్యుడుపితీకెను శునక స్తనముల యందు॥ ౮౦.

---

*కుజములు - వృక్షములు.

దానిం దెచ్చుచు గురుని నెదుట నిడ దత్తుడు కరపాత్రమున।
బూనం గైకొని చేతను గలపగ మానితాన్న మందుగన॥ ౮౧.

అతిమధురంబై యుండగ నిద్దరు నదిభక్షణ చేయుచును।
వితతపాత్రలో చేతుల గడిగిరి వెలయగ నిద్దరు నటను॥ ౮౨.

జనార్ధనుండును జెప్పె నేకునకు సరోవరంబున నీవు।
ఘనపాత్రంబును గడిగి తెమ్మనగ కడుగ నతడు కొనిపోవు॥ ౮౩.

గురునుచ్ఛిష్టమె గంగా నశ్రద కోరియు సాధకులకును।
అరుదుగాగ నీప్రపంచంబునను నదృష్టవంతు ననుచును॥ ౮౪.

గురుప్రసాదమును భుజించి పాత్రను గురుతుగ కడిగియు దెచ్చెన్।
వెరువక బోడగని జనార్ధనుండును వేగురునకు తెలిపించెన్॥ ౮౫.

దరిసెనమతనకి తామేయిచ్చుచు తరింపజేయుమని జెప్పెన్।
తరింపవచ్చును యేకనాథు భువి దత్తాత్రేయుండనె నొప్పెన్॥ ౮౬.

భాగవతార్థము బైయలుపరచిమరి పరుడు రాము చరితంబు।
జాగు సేయకయు మరాటిభాషను జనులకు తెలుపు నిజంబు॥ ౮౭.

అనుచుం జెప్పుచు నప్పుడె రూపును నగుపడ జేసెను నటను।
మునిచంద్రుండును శ్యామల సుందర మూర్తి షడ్భుజంబులును॥

విశాల నయనుడు విశ్వమండనుడు విమలంబుగ ప్రకటింపన్।
సుశీలు డేకుడు చరణంబుల దా నూటిగ బట్టుచు నొప్పెన్॥ ౮౯.

తనహస్తంబుల దత్తాత్రేయుడు తాకుచు నాతని తలను।
అనువుగ నంతర్ధానుండయ్యెను నాశ్చర్యము బొందగను॥ ౯౦.

జనార్ధనుండా యేకనాథుతో చనెను గృహంబున కపుడు।
వినీతు డేకుడు దత్తుని కరుణను విహితము పొందుచునపుడు॥ ౯౧.

---

గురుసేవసుదా గురితో జేయుచు కుతూహలంబున నుండన్।
పరమగురుండగు దత్తుని ధ్యానను బలముగ నొకనాడ నుండన్।

జనార్దనుండును చనుదెంచగ నటు సరగనతడు దండమిడెన్।
ఘనుడగు గురువరు డేకనాథునిఁ గనుగొనియట ననుచుండెన్॥
హరికృపచేతను నాత్మజ్ఞానము నందితివేనియు నీవు।
వెరవక శ్రీహరి సగుణభక్తిలో వెలసియుండవలె నీవు॥ ౯౪.
యోగబలంబున నెగర నేర్చినను నొప్పదు హరినిగనుటకు।
వేగమె తాను దిగంబరుడైనను విష్ణునరుదు గాంచుటకు॥ ౯౫.
దేవగిరికినటు తూర్పు దిక్కునను తిరుమల సమగిరియొకటి।
సేవనీయమై సులభాయనియును జేరియుండు తగునట్టి॥ ౯౬.
సూర్యతీర్థమను సరోవరంబున సూటిగ స్నానముజేసి।
ఆర్యసమ్మతంబైన స్థలంబున నాసనమును తగవేసి॥ ౯౭.
సాధన జేసిన సాక్షాత్కారము సమకూరును తగనీకు।
మాధవుడగునా పండరినాథుని భక్తిని ధ్యానించుటకు॥ ౯౮.
ఏకాగ్రంబును నేర్పరించుకొని యెవరితోడ బలుకకయు।
శాకాపత్రము లచ్చట జిక్కిన చనువున భక్షణచేయు॥ ౯౯.
హరిధ్యానంబున నుండిన గందువు నపూర్వముగ నొకటినటన్।
సరగున నాకును జెప్పుమటంచును జనార్దనుడు జెప్పెనటన్॥ ౧౦౦.
పరమానందము బొందుచు శిష్యుడు బైలుదేరె తానపుడు।
సరగున వెళ్ళెను సులభాద్రికి తగ సద్గురు ననుమతినతడు॥ ౧౦౧.
భక్తిని శ్రీహరి పాదంబులపై బాగుగ తానుంచుచును।
సక్తచిత్తుడై చేర్చెను మనసును సర్వేశ్వరు రూపునను॥ ౧౦౨.
పొందక యుండగ బాహ్యదృష్టితో భుజంగ మొక్కటియటను।
చిందరనొందక మేనుచుట్టుకొని శిరసున ఫణముంచుచును॥ ౧౦౩.
శీతోష్ణంబుల చేరనియ్యకయు జెచ్చెర నటు గాపాడున్।
పాదుగ వృత్తులు వెలియగు నప్పుడు ఫణియును వెళ్ళుచునుండున్॥
దేహ విస్మృతియు నొందిన కతమున తెలియకుండె నాతనికి।
సహానముగానిటు జరుగుచునుండెను చక్కగనురగము మరిగి॥

గిరిక్రిందను నొక గ్రామము లోపల క్రియతోఁ గాఁ పొకఁడుండెన్।
హరిదాసులపై నతిప్రేమనుదా నమరగ జేయుచు నుండెన్॥ ౧౦౬.
శుద్ధాచరణము శాంతవృత్తియును సుఖముగ గలిగియునుండు।
శ్రద్ధాయుతుఁడై సాధుపూజలను సలుపుచుండు నెపుడతఁడు॥ ౧౦౭.
ఏకనాథునకు ననుదినమును తా నేపున దుగ్ధము నిచ్చు।
జోకతోనతఁడు చేకొనుచుండును శుద్ధభావమును గనుచు॥ ౧౦౮.
పాతివ్రత్యము బొందిన యాతని భార్యయొక్క దినమునను।
ప్రాతస్స్నాతయై భర్తకు దెచ్చెను భక్షణకొఱకు కన్నమును॥ ౧౦౯.
నేటిదినంబున నిటు శీఘ్రముగా నెరివచ్చుట కేమియని।
పాటవముగ తన భర్త యడుగగను బహురాత్రిని మేలుకొని॥౧౧౦.
పిండిని విసరియు రొట్టెలజేసియు పెంపుగనిటు దెచ్చితినే।
నిండుపాత్రయగు దుగ్ధముగిరిపై నెనరున మునికీయమనే॥ ౧౧౧.
అటులనె కానిమ్మనుచును కాపును నటు స్నానము జేయుచును।
పటుతరముగ హరి స్మరణజేసికొని పాలుతోడ వచ్చుచును॥ ౧౧౨.
ధ్యానగ్రస్తుఁడై తపసియునుండగ తత్సన్నిధి కరుగగను।
మానుగ ఫణిచే చుట్టబడినయా మహీసురునిగని తాను॥ ౧౧౩.
భయమొందుచుదా గట్టిగ నఱచెను ఫణియును విడువకయుండెన్।
దయతోఁ గాపును పాండురంగయా తపసిఁబ్రోవు మనుచుండెన్॥
నరహరి రంగా నారాయణయని నలుగడలను బిలుచుచును।
నెరిననుతాపము నొందుచునటనే నిలిచి యుండె మరితాను॥౧౧౪.
మెల్లగ తపసియు మౌనము విడువగ మీఱి ఫణియు విడిపోయెన్।
ప్రల్లదముగనే తపసియు నడిగెను బహుధ్వని యిటు యేమనియెన్॥
కాపగుడనె నీధ్యాన సమయమున ఘనసర్పము చుట్టుకొనెన్।
ప్రాపుగ నీవును జుట్టబడితివని బహుధ్వనియటు జేసితినే॥ ౧౧౫.
[illegible] యేకుడు ప్రేమను జూపుచు నీశ దయాళో యనుచు।
[illegible] భారము హరిపై నుంచుచు ప్రార్థన జేసెను మనుచు॥౧౧౬.

శేషశయన హరి జగదాకారుడ శ్రీశ కృపానిధి యనుచు।
పోషకర్తవై నీకృపనాపై పొందుపరచితీ వనుచు॥ ౧౧౯

సకల జగములకు సాక్షిరూపుడవు సదా జ్ఞానానందుడవు।
ప్రకటముగా సద్భక్తుల కోరికకై పరగ సగుణ మొందుదువు॥౧౨౦.

చతుర్భుజంబులు శ్రీకౌస్తుభమును సర్వాలంకారములు।
హిత విగ్రహమగు రూపము నాకోరి కింపుజూపి విలసిల్లు॥ ౧౨౧.

శ్రీశుడు వినియా సర్వాలంకృత చిన్మయ విగ్రహు డగుచు।
కేశబంధనము కౌస్తుభ మణియును కిరీటమును ధరియించు॥ ౧౨౨.

చతుర్బాహుడై శంఖచక్రములు శార్ఙ్గము గదయును గలుగన్।
అతులిత పీతాంబరుడై యచ్చట హరియు ప్రసన్నుడుకాగన్॥౧౨౩.

దివ్యతేజమగు దినకరు దీప్తిని దిగుబాటుగ జేయుట చెన్।
నవ్యమిదేమని యేకనాథుడును నయముగ కన్నుల దెరిచెన్॥ ౧౨౪.

శ్రీహరి రంగని సాక్షాత్కారము చిరతర ప్రేమను జూచెన్।
మోహాతిశయపు మానస పూజల ముకుందు నతడర్చించెన్॥౧౨౫.

కోరిన విధమున కరుణించితివని గోవిందా హరియనుచు।
సారతరంబగు పదముల బట్టగ చనియెను శ్రీహరి మనుచు॥ ౧౨౬.

కృష్ణునిగని యాకాపువాడపుడు కృతకృత్యుడనైతి ననెన్।
విష్ణురూపుడవు పాలుద్రాగుమని విన్నపించి తానుమనెన్॥ ౧౨౭.

శుద్ధభావమును జూచి యేకుడును సుఖముగ దుగ్ధము గొనియెన్।
సిద్ధచిత్తమున జనార్దనునియెడ చేరుటకును తలపయ్యెన్॥ ౧౨౮.

గిరికి నమస్కృతి గావించుచుమరి క్రియగురు పజ్జకువచ్చెన్।
చరణము బట్టగ హరిని జూచెనని జనార్దనుండును దలచెన్॥౧౨౯.

---

ఒక దివసంబున నేకనాథుగని యుచితంబుగ గురుపలుకు।
ప్రకటంబగునా కాశీక్షేత్రమును బాగుగ బోదగుమనకు॥ ౧౩౦

అనుచును సేవక జనులను చేకొని యశ్వంబులతో చనుచు।
ఘనుడగు శ్రీహరి బాడుచు నాడుచు గ్రామాదుల తగగడచు॥
పట్టణ మొక్కటి యుండెను దారిని వరచంద్రం భట్టనుచు।
గట్టినిష్ఠతో నుండగ నచటికి ఘనులేగిరి తగుననుచు॥ ౧౩౨.
భాగవతంబున విధి నారదునకు బయలుజేయు శ్లోకముల।
బాగుగ వీరలు వ్యాఖ్యానింపగ బలిసె చనువు నయ్యెడల॥ ౧౩౩.
క్రమ యుపాసనయు కర్మజ్ఞానము గలిగి వారి కుండగను।
సమరస భావము సలుపగ నచ్చట చంద్రభటుడు వీరలను॥ ౧౩౪.
విడువం జాలక వచ్చె వారితో వే కాశికి బోవుటకు।
ఎడనెడ భక్తుల యోగుల గాంచుచు నేతెంచిరి నాసికకు॥ ౧౩౫.
గోదావరిలో గ్రుంకిడి పిదపను గురితోగని రాముని దర్శి।
వేదాంతార్థము చతుశ్శ్లోకికిని వివరించెను నేర్పుడటర్శి॥ ౧౩౬.
పండితులందరు బహుమన్నించిరి పరమబోధ తెలిపిరని।
నిండుప్రేమతో చంద్రంభటుబహు నిరతులైరై చదువగని॥ ౧౩౭.
త్ర్యంబకమునకును వచ్చి సవ్యమై తిరిగియునటు బ్రహ్మగిరిం।
డంబుమీరగను కుశావర్తిలో డాయుచు గ్రుంకిడి దారిం॥ ౧౩౮.
త్రిపురారినిగని యాస్థలంబులో త్రిదివసములు నుండుచును।
నెపంబులేకయు మళ్ళిరింటికిని నియమ కాశి వదలుచును॥ ౧౩౯.
దేవగిరికి నరుదెంచిన పిమ్మట ద్విజులకు భోజనమిడియు।
జీవాధారంబగు హరినామము చెదరక మదిలోనిడియు॥ ౧౪౦.
చంద్రంభట్టుం డచ్చటనుండెను జనార్దనుని గూడుకొని।
తంద్రరహితమగు బ్రహ్మరసంబును తానుద్రాగి నెమ్మదిని॥ ౧౪౧.
బోధరూపుడై మేను విడువగని పుణ్యశరీరము నటను।
సాధారణముగ నానగంబుపై సమాధి యుత మయ్యెమును॥ ౧౪౨.
ఇప్పటికిని నటన నేక మహిమల నెల్లవారు గందురిలం।
తప్పక యిదియా గురునికరుణయని తగ నెన్నుదు రయ్యెడలం॥

ఏకాంతముగా నొక్కదినంబున నేకునిగురుడటు బిలువఁగ।
జోకనుశిష్యుడు చరణములిడుకొని స్తుతిజేసెను గురుసేవఁగ॥౧౪౪.
జయ జనార్దనా జరామరణసం జాతంబెది లేకుండఁగ।
ప్రియ బంధుండవు మోక్ష దాతవును పెంపుగ నీవగుచుండఁగ॥
శృతులకునందని షడ్గుణ పూర్తితో సిద్ధరూపుడగు నిన్ను।
విధియును దెలియక వంచన జేసెను వే గోవత్సంబులను॥ ౧౪౬.
గోవత్సంబుల గోప బాలకుల గోరి జేసితి వపుడు।
భావశుద్ధితో నుతులను జేసెను బ్రహ్మాయు వచ్చుచు నపుడు॥ ౧౪౭.
నీదుసత్తచే నింద్రియపఙ్క్తులు నెల్లచలించుచు నుండు।
పాదుగనినువిన పదార్థమెద్దియు పరిపాటింపదు మెండు॥ ౧౪౮.
ఆస్తవమునువిని యాచార్యుండును నతిమోదము నొందుచును।
ఖ్యాస్తవముగనిక చూచిరావలయు వరతీర్థము లన్నియును॥౧౪౯.
సాదులసేవయు సచ్ఛ్రవణంబును సమకూరును కడువేగ।
పాదుగ నందున యోగక్షేమము బలతరమగు నటువెలుగ॥ ౧౫౦.
శోకము హర్షము నేకనాథునకు చొప్పదెయ్యను నటువినగఁ।
జోకతోడ గురుచరణసేవయును సూక్ష్మంబగుటయు కనగఁ॥౧౫౧.
ఆచార్యాజ్ఞను ననుసరించుటయు నవస్యమని జెప్పగను।
వాచాతీతుడు జనార్దనుండును వరుసను శిష్యునితోను॥ ౧౫౨.
భక్షణ చేసియు బైలుదేరిరటు పాదచారు లిరువురును।
అక్షయ కీర్తిని నేకనాథుడును నమరగురుడు గోరుచును॥ ౧౫౩.
సాగనంపుటకు జనార్దనుండును చాలాదవ్వేగ గని।
శ్రీగురు నాథుని పదముబట్టుకొని వేగనేడ్చె నిలువమని॥ ౧౫౪.
గురుడేడ్చుచు గాఢాలింగనము గొప్పగ జేయుచునపెను।
స్థిరతనీవె నా జీవప్రాణములు చిరనీ యాత్మ నేనెయను॥ ౧౫౫.
ఏకనాథుడా యాచార్యునకును హెచ్చుభక్తి దండమిడు।
ప్రాకటముగ గురు విగ్రహమును మది బట్టి యేగె నలనాడు॥ ౧౫౬.

పైటనుపురమున పితామహుండును పౌత్రుగనక క్లేశమున।
పాటవముగ నాపురమెల్లనునట బహుశోధించెచు గాన॥ ౧౫౭.
జాడదొరకకయ చేయుటేమియని చాలచింత జేయుచును।
గూడుచు పండితులుండు చోటలను గురిమనుమని యడుగగను॥
వారలు జెప్పిరి యొకశాస్త్రజ్ఞుడు వచ్చియుండె దానిచటన్।
చేరియతనితో శాస్త్రచర్చలను చెప్పుచుండె కొమరుడటన్॥ ౧౫౯.
బదరీ వనమున కరిగెద ననుచును పండితుడపు డనుచుండెన్।
వదలకనతనితో వెళ్ళిన సంగతి విదితను గాదను చుండెన్॥ ౧౬౦.
ఉత్తరమతనికి వ్రాసిన యెడలను నుచితంబుగ దెలియునన।
తత్తర బడుచును పత్రిక బంపెను తాతయు పండితుడుగన॥ ౧౬౧.
ఆపత్రంబును నాతనికందగ నతిఖేదము నొందుచును।
ప్రాపుగనాతడు తిరిగియువ్రాసెను ప్రబల దేవగిరిలోను॥ ౧౬౨.
జనార్ధనునికడ చేరియుండునని చనియచ్చట వెదకుమను।
వినీతుడైతా వర్తమానమును విదిత పరచి వ్రాయగను॥ ౧౬౩.
పైటను పురమున పండితు లిదిగని పరగదేవ గిరికరిగి।
మేటిజనార్ధను జూచియడుగగను మేలనియతడనె తిరిగి॥ ౧౬౪.
ఏకనాథు డిదివరకును నన్నిటు యెడబగండు సేవరతిన్।
ప్రాకట స్థలముల యాత్ర జేయుమని బంపితి నేనే విరతిన్॥ ౧౬౫.
ఆతని విషయమై యేయొక చింతయు నపని బొంద పనిలేదు।
తాతకు పత్రము తానేవ్రాసిత త్సంగతి దెలిపెడు నుందు॥ ౧౬౬.
*ప్రతిష్ఠానమున కా పత్రికకొని పండితుడరిగెను నపుడు।
హితవుగసంగతి దెలుపుచు పత్రిక నిచ్చెనపుడు వడినతడు॥ ౧౬౭.
అవ్వాయు తాతయు నతిముదమొందుచు నతనికిడిరి చక్కెరయు।
దవ్వానియెన్నక దేవగరికిని తామేవెళ్ళిరి మరియు॥ ౧౬౮.
జనార్ధనునకు జెప్పిరివారలు సంగతి మొదలంతయును।
వినితుడాతడు వారలనుంచెను వెరవకొక నెలవరకును॥ ౧౬౯

*ప్రతిష్ఠానమనునది పైటనుపురమునకు పేరు.

ఏకనాథుడును హరి యంశంబున నిల బుట్టెను తగననుచు।
జోకను నాతని సుగుణములన్నియు సూటిగ జెప్పెను మనుచు॥
కొత్త బట్టలను ఖర్చులకిచ్చుచు కోరిచీటి వ్రాసెనటు।
అత్తరిశిష్యుని కొఱకై యాతడు యాత్రను చాలించినటు॥ ౧౬౧.
పత్రమునీకును మట్టినతోడనె పయినపడునీ చోటునకు।
భద్రము తోడను శీఘ్రము చేరుము పైటను పట్టణమునకు॥ ౧౬౨.
అనుచును వ్రాయుచు ముసలివాండ్రగని యఖిలయాత్రఁజేయుచును।
మనుమడు వచ్చును వెదకుచునుండుము మార్గము శోధించు మను॥
కాకితమేకుడు జూచిన యెడలను కదలడు మరి యెచటికిని।
సాకల్యంబుగ స్వగ్రామంబును చను మనగను వారువిని॥ ౧౬౪.
ముదమొందుచు తమ యూరిని జేరిరి ముసలివాండ్రు తామపుడు।
విదితమయ్యెనా పైటనుపురమున వేగమె సంగతినాడు॥ ౧౬౫.
ఏకనాథుడును నెల్లయాత్రలను నింపుగ తాజేయుచును।
ప్రాకటముగ గంగోత్తరి మొదలగు భవ్యక్షేత్రముల గనును॥
బదరీవనమును బృందావనమును ప్రయాగ కోసలములను।
మధురా ద్వారక ముఖ్యస్థలముల మహిలోదా జూచుచును॥ ౧౬౬.
గోదావరికిని వచ్చుచు నచ్చట గురితో పైటను పురము।
సాదులగాంచుచు స్నానముజేసియు శర్వాణిని జూచెనుము॥౧౬౭.
యామద్వయమగు సమయమునందును నచటభిక్షమడుగగను।
ఏమిదొరికెనో యదియమృతంబని యెంచుచు భక్షించుచును॥౧౬౮.
నారీనరులటు గూడి యెవడవని నయముతోడ నడుగగను।
వారికి బదులుగ వార్తజెప్పకయు నూరకుండ కొందరును॥ ౧౭౦.
ఏకనాథుడై యుండవచ్చునని యెంచి యతని తాతకును।
ప్రాకటముగనటు జెప్పగ సతితో బరతెంచెను వృద్ధుడును॥ ౧౭౧.
మనసులోనదా దండముబెట్టెను మనుమడు వారలకపుడు।
చనుదెంచుటకై చింతింపంగను కనులనీరు బడుచుండు॥ ౧౭౨.

వృద్ధులిద్దరును బోవగ వలదని వేపత్రిక చూపించఁ౯।
సిద్ధంబుగ శ్రీగురుప్రాలును దా శీఘ్రమెగాంచుచు పెలుచఁ౯॥ ౧౮౩.
తలపై నిడుకొని యాపత్రికయును తాగూర్చుండెను యటను।
కులజులింటికిని రమ్మని బిలిచిన కోరిచనడు తానెటను॥ ౧౮౪.
మేదినిపై తా మౌనముదాల్చియు మేలుగనట కూర్చుండఁ౯।
సాదుండనుచును మన్నన జనములు సలుపుచు మరికొందరటఁ౯॥
అచ్చోటుననే యతనికి భోజన మర్పణజేయుచు నుండఁ౯।
విచ్చల విడిదా బయలున నచ్చట వెలసి దినత్రయ ముండఁ౯॥ ౧౮౬.
శీతోష్ణంబుల చెందక సకలము శ్రీహరి మయమనియుండు।
సాధుపురుషులటు చప్పర మొక్కటి చక్కవేయ నందుండు॥ ౧౮౭.
శ్రీహరిభజనను జేయుచునచ్చట చెలగి యుండె నేకుడును।
బాహుళ్యంబగు మన్ననజేసిరి ప్రజలును భక్తుడనుచును॥ ౧౮౮.
కవిత్వరచనయు గానవిద్యయును గలిగెను శ్రీహరికృపను।
వివిధంబగునటు శ్రీహరికీర్తన వినుపించును జనులకును॥ ౧౮౯.
అనేకప్రజలును వచ్చిరియటకును హరికథ వినుటకుగాను।
వినీతులగుచును నచ్చట గట్టిరి విశాలగేహము తగను॥ ౧౯౦.
భావికనరులును భోజనమిడుదురు బ్రాహ్మణ జనులకునటను।
నావృదువృద్ధులు నచట నెజేరిరి నయానుకూల్య మనుచును॥ ౧౯౧.
హరిదినములలో నహర్నిశంబును హరినామమె నటజరుగు।
పరువకాలముల భోజనమెప్పుడు బాహుళ్యంబుగ మెలగు॥ ౧౯౨.
వణిజుడొక్కడటు చేయునుత్సవము వరకృష్ణాష్టమి లోను।
ఆణుకువనిదివిని జనార్ధనుండును నట్టివచ్చె నెనరునను॥ ౧౯౩.
ద్వారపాలుడై త్రిశూలమిడుకొని దత్తాత్రేయుం డుండఁ౯।
వారకకనుగొని జనార్ధనుండును వందనమిడి నిలుచుండఁ౯॥ ౧౯౪.
దత్తుండేకుని దగ్గర మానవ తనువున వచ్చియుజెప్పెఁ౯।
ఇత్తరిసద్గురు జనార్ధనుండును నేగుదెంచెనని దెలిపెఁ౯॥ ౧౯౫.

దండములిడుచును వచ్చె నేకుడును తద్వాక్యముతా వినుచు।
నిండుప్రేమ నిరు చేతుల నిడుకొని నిజగురునింటికి దెచ్చు॥ ౧౯౬.
ప్రియమోదంబున బల్కుచునుండిరి పెద్దతడవు నిరువురును।
క్రియతో నుత్సవ సమయమునందును కృష్ణభజన జరుపుచును॥
విప్రజనులకును భోజనమిచ్చుచు విశేష సంభ్రమముగను।
అప్రమేయుడగు హరిగుణకీర్తన యనవరతము జరగగను॥ ౧౯౮.
అతివినీతుడై గురుసేవనుదా నహర్నిశము చేయగను।
మతిలో తృప్తిని బొంది జనార్దను పురలిబోవ దలచగను॥ ౧౯౯.
అవ్వయు తాతయు నేతెంచుచునటు లవనిపంశా వృద్ధికిని।
దవ్వనకయ తగుసతిని జేసికొని తనయుల గనవలె భువిని॥ ౨౦౦.
వివాహ మేకునకును నిటజేసిన విశేష సుకృతంబనగా।
భవాపహుండగు గురుడు శిష్యుగని భార్యను చేకొమ్మనగా॥
ఏకనాథుడును వచియించెను నపు డెటుల నేమ మటులగును।
సాకల్యంబుగ జనార్దనుండును చనె పిదప గృహమునకును॥ ౨౦౨.
అవ్వయు తాతయు కన్యక కొఱకై యటనిటు బహు వెదకగను।
దవ్వననుండెడి గ్రామంబుననొక ధరామరసుత యుండగను॥ ౨౦౩.
వరుని విచారణ యామెకు తండ్రియు వరుసను జేయుచునుండగా।
గురుతర ఘటితము గూడక నాతడు గొప్ప చింతతో నుండగా॥
శ్రీహరి యాతని స్వప్నమందునను జెప్పెను కన్యకసుతగు।
బాహుళ్యంబగు పైటనుపురమున భర్తు డేకునకు నొసగు॥ ౨౦౫.
సరియలంకృతిని జేసి యియ్యమని స్వప్నము గాంచిన జాడగా।
అరుణోదయమున లేచి వేగముగ నత్యాశ్చర్యముతోడగా॥ ౨౦౬.
భార్యకు జెప్పుచు నేగుదెంచెనా పైటనుపురికిని తాను।
ధైర్యము తోడుత నేకునింటికిని తలపడి దావచ్చుచును॥ ౨౦౭.
వృద్ధులనిద్దర గాంచుచు నచ్చట వేంచేసిన పని జెప్పగా।
సిద్ధము శ్రీహరితానె చేసెనని చెలగి పురోహితుడొప్పగా॥ ౨౦౮.

జాతక రీతిగ సకల ఘటితములు సరిపడె దంపతులకును।
తాతయునిదిగని దిననిశ్చయమును తత్కాలము జేయగను॥ ౨౦౯.
పోకలనిచ్చుచు పిల్లతండ్రికిని భోజనమును తాబెట్టె।
సాకల్యంబుగ కళ్యాణమునకు సరంజాముదెత్తునిటె॥ ౨౧౦.
క్షేత్రమునందును చేయు వివాహము శ్రేష్ఠంబని జెప్పుచును।
ఆత్రములేకయ సాహిత్యంబును నతడు సిద్ధపరుపగను॥ ౨౧౧.
అవ్వయు తాతయు నఖిలబంధువుల నామంత్రింపుచు నటను।
దవ్వగనుండెడి చుట్టలనందర త్వరితము రప్పించుచును॥ ౨౧౨.
సాహిత్యంబును చేసి యిరువురును సంబంధులునటుగూడి।
బాహుళ్యంబుగ వధూవరులకై బ్రాహ్మణులందరు బాడి॥ ౨౧౩.
సావధానయని జేసిరిపెండ్లిని సకల జనులుగని మెచ్చ।
శ్రీవత్సుండగు శేషశయనుడే జేర్చును సుఖముల హెచ్చ॥
అనుచుజెప్పుచును నష్టకవర్గము హరిపై బాడుచు నపుడు।
ఘనముగ పెండ్లిని కులజులు గూడియు గావించిరి యానాడు॥
ఉద్ధవుడనునొక బంధువు వచ్చెను నొగి నేకుని పెండ్లికిని।
శ్రద్ధనునీతడు సేయదొడంగెను సకలసేవలతనికిని॥ ౨౧౬.
ఈతడు దప్పగ నితరజనంబులు నేగిరి తమగృహములకు।
ప్రీతిభార్యయగు గిరిజాదేవియు పెంపు జేయు పురుషునకు॥ ౨౧౭.
అవ్వతాతలకు ననుగుణ్యంబుగ నామెయు కుదురుగనడచు।
నివ్వటిలంగను సువిశేషంబని నెనరున వారలుగనుచు॥ ౨౧౮.
అన్నదానమటు నపరిమితంబుగ నయాచితంబుగ జరుగు।
అన్నిజాతులకు నన్నముబెట్టును హరిస్వరూపులని చెలగు॥ ౨౧౯.
పండరినాథుని భవ్యమూర్తికిని బాగుగ పూజలసలుపు।
పిండుప్రీతితో రెండవ జామున నెనగున భక్తిని జరుపు॥ ౨౨౦.
మూడవ జామున భాగవతంబును ముదమలరగ దాజెప్ప
కూడుచు భక్తుల రాత్రికాలమున కుదురుగ కీర్తనసలుపు॥ ౨౨౧.

అఖిలజనంబులు వినుటకును వర్తు రనుదినమును తగనచట।
సుఖముగ నిట్టుల జరుగగ వృద్ధులు *సురపురమున కరిగిరట॥
కొన్ని దినంబులు గడవగ నేకుడు గురుడగు జనార్దనుండు।
పన్నుగ దేహము విడిచెననియువిని పరగ నుద్ధవుని గనుడు॥
జనార్దనునియా జన్మపు తిథియును షష్టి ఫల్గుని వద్యయగు।
దినమగు నాతిథి దత్తునను గ్రహ దీక్షనొందు దివసమగు॥ ౨౨౪.
నాకుపదేశము నాతిథియందే నయముగ నాతడు జేసెన్।
ప్రాకటముగ దా నాతిథియందే పరమ పదము వెంచేసెన్॥ ౨౨౫.
సంతర్పణ నేజేయ దలంచితి సమకూర్చుము ద్రవ్యముల।
కొంత ద్రవ్యమును నుద్ధవు చేతను గూడియుండ నటు తగుల॥ ౨౨౬.
అప్పంతీసెనటు లేడుశతంబులు నాచార్యుని పేరునను।
ఒప్పుగ నటనొక వర్తకునకుదా నుచిత పత్రమిచ్చుచును॥ ౨౨౭.
సమారంభముగ సకలోత్సవముల సలిపిరి దినములు మూడు।
ప్రమేయమగునటు బ్రాహ్మణ భక్షణ బహుళంబుగ నగుచుండు॥
హరికీర్తనయును జరుగును రాత్రుల నందరు సంతోషింపన్।
గురుతుగ మాధవ పూజయు జరుగును గురునారాధన యొప్పన్॥
కొన్ని దినంబులు గడవగ వణిజుడు కోరివచ్చె రూకలకు।
ఎన్ని కలేకయు నప్పుడీసి మరి యేల జేసె ఖర్చులకు॥ ౨౩౦.
స్నాన సంధ్యలను నేకనాథుడును సలుపుచునుండగ నపుడు।
ఆన యున్నదనె నన్నముదిన నా యప్పునుదీర్పక యిపుడు॥ ౨౩౧.
వర్తకుడీవిధ వార్తను జెప్పుచు వరుసవెళ్ళె నింటికిని।
కర్తహరియనియు నేకుడాదినము కరము తడుపకుండెగని॥ ౨౩౨.
వచ్చిన యతిథుల కన్నంబిడి యుప వాసుడయ్యె సతితోడన్।
హెచ్చు ప్రయత్నము ద్రవ్యంబునకై యిలనుద్ధవుడీ జాడన్॥
ఎటుల జేసినను ద్రవ్యమందకయు నిల దుఃఖితుడై యుండు।
పటుతరముగ నా శ్రీహరి యుద్ధవు భవ్యరూపమున నపుడు॥ ౨౩౪.

*సురపురము = పరలోకము.

జామురాత్రిలో వర్తకునింటికి చనువున దావచ్చుచును।
వేమరు వాకిలి గొట్టగ వచ్చెను వెలికిని యటు వణిజుడును॥ ౨౩౫.

పైకముదెచ్చితి తీసికొనియుమరి పత్రమిమ్ము దయతోను।
జోకను కోమటి రేపటికడ నే చేకొనియెద ననగాను॥ ౨౩౬.

ఇంతపనికిగా నేకనాధునకు నేల యాన నిడితివను।
పొంతపరచుకొని ద్రవ్యమునీయెడ నూటి పత్రమియ్యమను॥ ౨౩౭.

కోమటి వెళ్లుచు లెఖ్ఖను దెచ్చుచు గొణుగుచు రకమందుకొను।
నేమముతో జమకట్టి పత్రమును నిక్కమిచ్చి పొమ్మనెను॥ ౨౩౮.

పండరినాధుడు పత్రముదెచ్చియు వతనగ్రంథమున నునిచెగ।
ఖండితముగ కోపమునొందితినని కలతను కోమటివచ్చెగ॥ ౨౩౯.

ప్రాతఃకాలము నరిగియు నేకుని భవనమునకు దానపుడు।
ప్రీతిని పదముల బట్టి స్వామి, నే నీతిలేని కఠినుండు॥ ౨౪౦.

తొందరబెట్టితి క్షమింపు పైకము తొలిదిన ముద్ధవుడొసగెగ।
పొందె నేకుడును విననాశ్చర్యము భూరిమహిమ హరియొసగెగ॥

భగవంతునిదీ యపారకృపయని పారణ జేసెను పిదపగ।
సొగసుగ నీవును హరిని గంటివని నొగి కోమటి గని చెప్పగ॥

ప్రాకటముగనా కోమటి వెళ్ళెను బహుముదమొందుచు నపుడు।
ఏకునిసతి యుద్ధవుడును జేసిరి యేపున భక్షణమపుడు॥ ౨౪౩.

---

ఏకనాధు నద్భుతమహిమలునట నిలను బ్రసిద్ధియగుటకు।
జోకను హరియొక విప్రరూపున నూటిగ నుండెను నటకు॥ ౨౪౪.

వెనుక పార్శ్వమున తాళమందుకొని వేయుచుండు కీర్తనలో।
ఘనమాధుర్యము కీర్తనయందును కలుగజేయు తగనిలలో॥

ప్రజలువినుటకై పరుగిడి వత్తురు బహుదూరంబుననుండి।
నిజమగునాతని ప్రఖ్యాతియు మరి నిండె యెల్లెడల గనుండి॥ ౨౪౬.

పండరిపురమున బ్రాహ్మణుడొక్కడు బహుతపస్సు నొనరించెన్।
పండుగయగునటు పాండురంగని ప్రసన్నతకు చింతించెన్॥ ౨౪౭.

కొన్నియబ్దములు గడచిన పిదపను గురితో లక్ష్మీయు నాడు।
చిన్నికొమరితై యాతనికలలో చెప్ప, నతడు వినుచుండు॥ ౨౪౮.

ప్రతిష్ఠానమున భక్తుడు యేకుని భావశుద్ధి హరిగనుచు।
సతతము భగవత్ కీర్తన చేయగ సరిగ తాళమిడుకొనుచు॥

విప్ర వేషమున వెంబడియుండును వీఠలుండనునామమున।
అప్రయాసతో నచటికినేగిన హరి దర్శనమొసగునన॥ ౨౫౦.

అతివిస్మితుడై పైటను బోవుచు నడిగెను విఠలుని యటను।
హితుడగునాతని బోడగనగానె యెలమి పదను బట్టెమును॥

చతుర్భుజంబులు సుందర తనువును శ్యామలమగు రూపమును।
అతులితముగనా పండరినాథుం డతనికి దాజూపుచును॥ ౨౫౨.

అంతర్ధానము హరితానొందగ నత్యాశ్చర్యముతోను।
ఎంతధన్యుడో యేకనాథుడని యెలమిని గొనియాడగను॥ ౨౫౩.

ఏకనాథుడిది విని ప్రేమముతో నీశుని సౌలభ్యమును।
ప్రాకటముగదా బొగడుచునప్పుడు ప్రమోదమును బొందెవిను॥

దాసజనులకై తానొకదాసుని ధన్యవేషమును బొందు।
వాసిగ శ్రీహరి చర్యలనన్నియు వచించుచుండెను ముందు॥ ౨౫౫.

ద్వాదశాబ్దములు తానుండియుమరి తద్రూపంబును విడిచెన్।
మేదిని జనములు కష్టమిత్తురని మెలగియు తానటుజేసెన్॥ ౨౫౬.

---

ఒకకాలంబున నుద్ధవుడడిగెను యోస్వామి భాగవతము।
సకల జనంబులు నెరుగజెప్పుడని చనువున వేడెనుసుమ్ము॥ ౨౫౭.

ఆర్తినిగాంచుచు నటులనె జెప్పుట కారంభించె నతడును।
పూర్తిగ భక్తిని గలిగి జనంబులు పొసగపత్రుు వినుటకును॥

పండరినాథుడు విప్రవేషమున ప్రకటమయ్యె నచ్చోటన్।
కొండికాడునై కేశవుడనుచును గురుతుచెప్పుచును నోటన్॥
శ్రీభాగవతము వినుటకిచ్చటికి చేరితినిటు ప్రీతిగను।
ప్రాభవముగనీ సేవలనుండుట భవ్యంబని దలచెదను॥ ౨౬౦.
ఏకనాథుడును వినియప్పుడుతా నిచ్ఛపూర్తినుండుమనె।
వికను శ్రీహరి దాసులతిరువడి విమలంబగు రక్షయనె॥ ౨౬౧.
శ్రవణకాలమున కేశవుడచ్చట శ్రద్ధాయుతుడై యుండు।
అవిశంకలదా నర్థసందులను నంగిచ్చుచు వినుచుండు॥ ౨౬౨.
శ్రవణార్థులరగు క్షేత్రవాసులకు సద్భక్తియు జనియించెన్।
సవినయ శాంతియు క్షాంతియు దాంతియు సద్విరక్తి గలిగించెన్॥
సత్యవచనమునె జెప్పెదరెప్పుడు సద్ధర్మము జరుపుచును।
నిత్యముశ్రీహరి భవ్యనామమునె నెనరునజెప్పెదరటను॥ ౨౬౪.
నిశీవేళలో శ్రీహరికీర్తన నిండారగనటు జరగన్।
విశేష జనములు వైదికవిప్రులు విందురుకథలను బాగన్॥ ౨౬౫.
ద్వేష బుద్ధితో ద్విజవరులేకుని తిట్టదొడగిరయ్యెడల।
వైషమ్యంబగు వృత్తులమాన్పగ వదలి కామకర్మముల॥ ౨౬౬.
భక్తిమార్గమే బహుశ్రేష్టంబని ప్రజలువిడిరి కర్మముల।
రక్తిగవైదిక జీవనమంతయు రయమునచనె ద్విజులకిల॥ ౨౬౭.
ఇంతయు గనుగొని యయ్యేకనాథు నిలను ద్విజులు గడు దూరన్।
పంతముతోదా సహించిచెప్పును భాగవతార్థము మీరన్॥ ౨౬౮.
అచటికి వచ్చిన యఖిలజనంబుల కన్నమిడును లేదనక।
ఉచిత పదార్థము లెవ్వియునైనను నొప్పుగనిచ్చును కడక॥ ౨౬౯.
ఒక్కవత్సరము వర్షముగురిసెను నూర్జితముగ నేడహాముల్।
చక్కగధాన్యము లింటనుండినను చిక్కకుండె యింధనముల్॥
నిశీవేళలో నలుగురువిప్రులు నిండుగనాకలి గొనుచు।
సుశీలురగుచును వచ్చుచు నాకలు సూటిగ నేకువిగను ము॥ ౨౭౧.

అన్నార్తులునగు నవనిసురులగని యపుడె సతికినేకుడనె।
విన్నాణంబుగ వంటవండిమరి విప్రులకును బెట్టుమనె॥ ౨౭౨.
కట్టెలులేవని సతియన, గృహమిటు కాష్టంబుల గట్టుటచె।
పట్టినదంతయు గైకొనుమన, సతి బహువిళంబమని నిలిచె॥ ౨౭౩.
ఇదివినియేకుం డాతనిమంచము నేపున చీలిచి యిచ్చెౕ।
కుదురుగ వండియు సతియాద్విజులకు కూర్మిని భుజియింపించెౕ॥
దీవించిరి యా ద్విజవరులందరు దీర్ఘకాలముండుమని।
ఈవిధ సేతల నేకనాథుడును నెలమి జేయుచుండగని॥ ౨౭౪.
తల్లిశ్రాద్ధము కొఱకై విప్రుల తవిలి బిలిచె భక్షణకు।
సల్లలితంబుగ వచ్చెదమనుచును చనిరటు స్నానంబునకు॥ ౨౭౫.
తననేమంబుల జరిపి యేకుడును దారిజూచె విప్రులకు।
మనన శీలురగు ముగ్గురు తురకలు మహాత్ముత్తుచే తలకు॥ ౨౭౬.
ఫకీరులగుచును బరతెంచియు మరి భడీణ మిమ్మనగాను।
ప్రకారయుక్తుడై యేకనాథుడును పరగదెచ్చె నన్నమును॥
పదార్థమంతయు బాగుగబెట్టగ భక్షించిరివారలును।
ఖుద్దానీకుబహు కళ్యాణంబుగ కోర్కెలొసగుననగాను॥ ౨౭౭.
స్నానముజేసియు వచ్చినవిప్రులు చనగ గనిరి తురకలను।
దానము తురకలకిచ్చిన సంగతి తాముసు గురుతెరుగుచును॥
భవిష్కారమును బెట్టిరి విప్రులు భ్రష్టుడవైతివి యనియు।
సవినయమగునటు జేసెనమస్కృతి చక్కగ నేకుడు గనియు॥
సర్వభూతముల శ్రీహరి యుండగ చక్కనిడితి నన్నమును।
నిర్వహించుచును వేరొక వంటను నెరవేర్చితిననగాను॥ ౨౮౦.
ద్విజులు గూడుకొని ధర్మాధిపతికి తెలియజేయగానపుడు।
నిజముగ నీచము బొందెనుయనుచును నిలిపె నాంతుతోనతడు॥
బహుగా నేకుడు ప్రార్థింపంగను బ్రాహ్మణులనిరయ్యెడను।
సహనముతోడను సాత్వికాత్ముల చక్కబిలువు నేడికను॥ ౨౮౨.

అటులనె జేసెద ననుచుపితరులను నావహించె నేకుడును।
చటులతరంబుగ ముగ్గురు పితరులు చనుదెంచిరటగనగను॥ ౭౯.
వేదఘోషములు వారలుజేయగ విప్రులు వినుచుండిరటన్।
ఖేదము లజ్జయు నాశ్చర్యంబును క్రియతో బొందిరి చూడన్॥
ఆరగించుచును పితరులునప్పుడు నంతర్ధానమొందగను।
తీరుగ పౌరులు జూచుచు వెళ్ళిరి తిరిగియు తమయిండ్లకును॥

---

అవనీసురుడొక డాగ్రామంబున నంబపూజ సేయగను।
ప్రవిమలశుద్ధిని గాంచుచు నంబయు ప్రసన్నంబుకాగాను॥ ౮౦.
కవిత్వస్ఫూర్తికి కృష్ణదాసుడును గారాబముతో వేడన్।
అవిరుద్ధంబుగ వరమునిచ్చుచును నామెవెళ్ళె తనజాడన్॥ ౮౯.
శ్రీరఘునాథుని చరితమునందును చెలగి యుద్ధకాండమును।
కోరియు నాతడు *ఒవీలజేసెను కుశలత ప్రాకృతమునను॥

కొందరు విప్రులు కృష్ణదాసునటు కొనియాడిరి యేకునెడ।
మందస్మితుడై యేకుడు నుర్విని మహాత్ము లెందరొజూడ॥ ౮౧.
ద్వేషములేకయు తెలియ బలుకగను ద్విజులు వెళ్ళిరయ్యెడను।
దోషరహితముగ కృష్ణదాసుడును దొడ్డ కృతిని జేయగను॥
గ్రంథము పూర్తిగ గాకుండగనే గనెనొక దృష్టాంతమును।
సంధిని రేపే ప్రాణ మెడలునని సరగ నంబ జెప్పగను॥ ౮౩.
ఇదివిని యాతడు తొందర బొందుచు నెటులను కృతినెరవేరు।
నిదానమెట్లని యాలోచించియు నెనరున యేకుని జేరు॥ ౮౪.
ఎదురుగ వెళ్ళుచు మర్యాదలచే నేకుడు సన్మానించెన్।
కుదురుగ నాతం డంబయు దెలిపిన గురుతతనికి వినిపించెన్॥
మిగిలిన గ్రంథము పూర్తిజేయుమని మిక్కుటముగ తావేడన్।
సుగుణుండేకుడు గ్రంథమునంతయు సూటిగ పారంజూడన్॥

---

*మహారాష్ట్రమందు గీతపద్యము పోలికెనుండు "ఓవి" యను కవనము.

నీవె గ్రంధమును శబ్దస్ఫూర్తితో నెరిపూర్తిగ జేయుమనె।
చావునొందవి కృతిని పూర్తిగా సలుపువరకు నుంచుమనె॥ ౨౯౭.
కృష్ణదాసుడును గ్రంధమునిచటనె క్రియతో లిఖియింతునని।
విష్ణుభక్తుడగు నేకుడు బలికెను వెళ్లుము నీ యింటికినె॥ ౨౯౮.
నీదు గృహంబున నుండి వ్రాయుము నెరి కాలుడు వచ్చినను।
పాదుగనే నటు వచ్చుచు మరియును ఫలమొనర్తు కోర్కెలను॥
గృహమున కేగియు గ్రంధమువ్రాయుచు కృష్ణదాసు డటనుండన్।
సహనము తోడను చేరెను కాలుడు సరగ నుసురుగొన జాడన్॥
మరుదినమందును మూడవ జామున మానుగ కాలుడురాగన్।
అరమర లేకయు నేకుడు దాసున కడ్డము వచ్చియు వేగన్॥ ౩౦౧.
దేహము చుట్టును చేతుల ద్రిప్పుచు ధీరుడు కాలుని గనుచు।
సాహసముగ పదునొక దివసములు సజీవు డగునన వినుచు॥
ఆజ్ఞను శిరమున కాలుడు గైకొని యపుడె వెళ్ళె తనత్రోవన్।
ప్రాజ్ఞు డేకునిది ప్రబల మయ్యెనట ప్రజలందరు గనబోవన్॥ ౩౦౩.
దశమ దినంబున ముగిసెను గ్రంధము తదియారాధన జేసెన్।
కుశలత దాసుడు మరుదినమందును కూరిమి స్నానము జేసెన్॥
నిత్య నేమముల గడవం జేయగ నిర్యాణ సమయమునకు।
సత్యవంతు డేకుడు పుష్పాలతో చనె నాతని గృహమునకు॥ ౩౦౫.
కృష్ణ దాసుడును గురిదప్పకదా క్రియతోడను దివిజేరెన్।
విష్ణు భక్తునకు నిట్టి మహిమలును వెలయుచు జగమున మీరెన్॥

---

కన్నడ దేశపు వణిజుడు కృష్ణుని ఘన యారాధన కోఱకు।
పన్నుగ నతడొక పాండురంగని భవ్యపు మూర్తిని తనేకు॥ ౩౦౭.
జేయింపంగను చిరు నవ్వొలగల శ్రీ ముఖమును గలదగుచు॥
బాయని కళతో సుప్రసన్నమై భవ్య రూపముం గనుచు॥ ౩౦౮.

ప్రాణ ప్రతిష్ఠయు విప్ర భోజనము బాగుచేయ బూనగను।
మానుగ రేయిని నిద్రనుండగా మాధవుండు కలలోను॥ ౩౧౮.
ఏకనాథుడను భక్త శిరోమణి యెపుడు నుండు పైఠనులో।
ప్రాకటముగ నీ మూర్తిని నొసగుము భవ్యం బతనికి నిలలో॥
చెప్పిన చొప్పున జేయకుండినను జెందు కష్టమిాకనగన్।
మెప్పుగ నాతడు మేలు కొనంగను మించి వింత బొందంగన్॥
తెల్లవారగను తొందర తోడను ద్విజులందర రాబిలచి।
సల్లలితంబుగ జెప్పెవారితో స్వప్న సంగతిని దలచి॥ ౩౧౨.
దెలియ బలికిరటు ధరణి దేవతలు త్రిరాత్రముల లోపలను।
కలియవచ్చి హరి మరియొక సారిని కలలో జెప్ప నటులను॥
మూర్తి నాతనికె చెల్లించెదమని ముఖ్యులు కొందరనగను।
వార్తను వినుకొని వణిజుం డుండెను వచ్చిమూడవ రేయినను॥
మునుపటివలెనే శ్రీహరి కలలో మోద మలరగను బలుకు।
అనుపమ మిదియని వణిజుడు తర్లెను నాపైఠను పురమునకు॥
దివ్యదేశమున తాజేరియు మరి ద్విజుల బాధ నోర్చుచును।
సవ్యంబుగ చని యేకనాథునటు చక్కజూచె గృహమునను॥ ౩౧౬.
దండము బెట్టుచు తెలియ బలికెదా తన వృత్తాంతము నంతన్।
పండరి నాథుని సుందరమూర్తిని పదపడి యుంచెను ముందన్॥
ముదముతోడ నా యేకనాథుడా మూర్తిని తగ నెత్తికొనెన్।
హృదయ సంపుటిని యుంచియు కన్నుల నుదకంబును తానుగొనెన్॥
సచ్చిదాత్మకుడ వికలరంగా సరసపు దయతో నింపు।
వచ్చితివీవును నాయెడ వాంఛను వరభాగ్యం బేమందు॥ ౩౧౯.
అనుచు జెప్పుచును నఖిల పదార్థము లపుడే సిద్ధముచేయన్।
అనువుగ సుద్ధవు నాజ్ఞాపించెను నట జ్యోతిష్కుల నరయన్॥ ౩౨౦.
పిలువనంపి మరి ప్రాణప్రతిష్ఠను వెనుమూర్తికి జేయుటకు।
సలలితముగతగు ముహూర్తముంచియు సరియగు దివసంబునకు॥

అభిషేకంబును నర్చన పూజల నటుజేసిరి మూర్తికిని।
ప్రభతో నచ్చట ప్రాణ ప్రతిష్ఠను బ్రాహ్మణులును జేయగని॥
పక్వంబులగు నన్నము బెట్టిరి బహుగా నైవేద్యములు।
వక్కాణించుచు నేకనాథుడును వరుసతోడ జూడనిల॥ ౩౨౩.
నవనీతంబును నాతడందుకొని నరహరి నోట నిడుచును।
భవహర నీవును గోకులమందును పరగ తినవె వెన్నయును॥ ౩౨౪.
నే జూడగ నీవిపుడు దినినప్రజ నెరిగా నమ్ముదు రనగన్।
ఓజతోడ హరి నవ్వు ముకంబున నొప్పుగ భక్షింపంగన్॥ ౩౨౫.
శ్రీ హరిభక్తులు జయ జయ యనుచును చే చప్పట్లును గొట్టన్।
మోహాధిక్యత మంగళ హారతి మురహరునకు నిడి వెంటన్॥ ౩౨౬.
ద్వితీయ యామము బ్రాహ్మణ భక్షణ దిట్టంబుగ జేయించెన్।
సతతము నందరు సంతోషింపగ సరగున వణిజుడు లేచెన్॥ ౩౨౭.
ఏకనాథునకు దండము బెట్టుచు నేపున వణిజుండనెను।
జోకను నేనొక రుక్మిణి మూర్తిని సూటిగ నటు జేసెదను॥ ౩౨౮.
మూర్తీ కరుడగు పాండురంగని ముదమున మీరటు దెచ్చి।
కీర్తిగ పెండ్లిని చేయించియు నటు క్రియను తిరిగి రాదలచి॥
ఆజ్ఞ్య నియ్యమని యడుగగ నేకుడు నటులనె గా నిమ్మనియెన్।
ప్రాజ్ఞ్యను వణిజుడు బోవుచు నూరును ప్రతిమెను బాగుగ జేయన్॥
ఏకనాథునకు నెరుక జేయగను నీతడు పరివారముతో।
ప్రాకటముగ నా పాండురంగని పల్లకినుంచి ముదముతో॥
మేళవాద్య ఘోషములను వెళ్ళిరి మిగుల జనము మోదించెన్।
వేళను జేరగ వర్తకు డచటను వెస నెదుర్కొనుచు వచ్చెన్॥
వచ్చిన వారికి వందన మొసగుచు వైభవముగ వారలను।
సచ్చరితుండై జేర్చె నింటిలో సారసాత్మునితోను॥ ౩౩౩.
వరునికి కట్నము లధికము నిచ్చియు వరుస ముహూర్తమునందు।
నెరవేరించిరి కళ్యాణంబును హరికి రుక్మిణికి పొందు॥ ౩౩౪.

మహోత్సవంబున నేకనాథుడును మాధవు చరితలజెప్పగా।
బహు మోదముతో వినుచుండిరి యటు ప్రజల నేకులిల నొప్పగా॥

వస్త్ర ధనంబుల వరుసగ నిచ్చెను వధువరులకు వ_ర్తకుడు।
విస్తృతముగ నొక నెలదాకనునటు వెలసి మళ్ళై నేకుండు॥ ౩౩౬.

వెంబడి వచ్చిన వారల కెల్లను విహిత వస్త్రముల నిచ్చెగా।
*పంబుచు నేకుడు బహుమోదముతో పరగ పైటనుకు వచ్చెగా॥

పండరి నాథుని రుక్మాబాయిని భద్రపరచి తనయింటగా।
నిండు ప్రేమతో విప్రుల కన్నము నెరియేకుడు బెట్టైనటగా॥ ౩౩౮.

---

పుట్టిన మొదలుగ పండరి పురమును పొడగానక యుండంగగా।
బెట్టిదముగ శ్రీ పాండురంగడె ప్రియుడై వచ్చె గనంగగా॥ ౩౩౯.

అనుచు దలంచుచు నుద్ధవు బిలుచుచు ననె నేకాంతంబునను।
ఘనమగు పండరి కరుగవలెనను కంజాక్షుని జూతునను॥ ౩౪౦.

తోవకు వలసిన వస్తువులెల్లను దురుసుగ చేయుమనగను।
భావశుద్ధితో జేసె నుద్ధవుడు బహు సంభారం బటను॥ ౩౪౧.

ఉద్ధవు నింటను నుండజేసితా నొప్పగ పరికరములతో।
సద్ధర్మముతో పండరి పురికై చనుదెంచెను తనసతితో॥ ౩౪౨.

ఊరూరను దా వెళ్ళగనచ్చట నూరి జనులు నందరును।
కోరికతో మర్యాదల జేయుచు గోవిందుని కథవినుచును॥ ౩౪౩.

బహుమానంబుల భ_క్తిని సలుపుచు ప్రమోదమున నుండిరటగా।
సహానముతో హరినామము బాడుచు సరగ నడిచె నేకుడటగా॥

చాలా భ_క్తిని నడచుచు కృష్ణా సారస నేత్రయనుచును।
మేలుగ జేరెను పండరి పురికిని మిగుల ప్రేమ బొందగను॥

హరి స్వప్నంబున నాజ్ఞ యియ్యగను నర్చకు లెదురేగి రటగా।
పరివారముతో పతాకశోభను ప్రవేశించె పురికినటగా॥ ౩౪౬.

---

*పంబుచు – సూర్యు.

చంద్ర భాగలో మునుగుచు శ్రీహరి సన్నిధికిని దానేగన్।
ఇంద్ర పూజ్యుడగు విఠలరంగని నెలమిని జూచెను వేగన్॥ ౩౪౭.
ప్రేమ విహ్వాలుడు బాష్పాకులుడై ప్రియమున పదములబట్టి।
సామజ వరదుని స్తోత్రము జేయుచు సమరస భావముగిట్టి॥
భావ శుద్ధితో నాలింగనమును బాగుగాను జేసికొనెన్।
సేవ ధురంధరుడగుచు మూర్తిని చిత్తమందు నిలుపుకొనెన్॥
సన్నిధి ప్రదక్షిణంబును జేసెను చక్కగ పండరిపురిని।
పన్నుగ నచ్చట బ్రాహ్మణులందర భక్షణకును బిలుచుకొని॥
మూడవ జామున మురరిపునామము మోదంబున నుడువుచును।
వేడుకలలరగ భక్షణజేసిరి విప్రులంద రయ్యేడను॥ ౩౫౧.
ఏకనాథగురు మహిత కీర్తియును నెల్లెడలను వర్ధిల్లన్।
జోకను హరికథ జెప్పుమటంచును సుజనులు విన నయ్యేడలన్॥
అటులనే జేసెదనని యారేయిని నారంభించెను కథయు।
నిటల తటంబున నంజలి జేయుచు నిలిచెను సన్నిధి గనియు॥
శ్రోతయు వక్తయు జనార్ధనుండని నూటిగ రంగని గనుచు।
చేతులతో చప్పట్లను గొట్టుచు శ్రీధర మాధవ యనుచు॥ ౩౫౪.
కేశవాచ్యుతా గోవిందా హరి కృష్ణముకుందా యనుచు।
పేశలముగదా వందన మొసగుచు ప్రీతిగ నారంభించు॥ ౩౫౫.
భానుదాసు సచ్చరిత్రమును దా ప్రారంభించెను నపుడు।
మానుగ నదియును వినువారలకతి మాధుర్యంబై యుండు॥
పండరి శ్లాఘ్యత జేసి యుదయమున బైలుదేరె పైటనుకు।
నిండు ప్రేమతో విఠలుని రూపును నేర్పున మనసుంచి తగు॥
స్వగ్రామమునకు సమీపమందును సౌఖ్యంబుగ రాగాను।
అగ్రముగా నటు పురజనులందరు నతని నెదుర్కొన గాను॥ ౩౫౭.
ఉద్ధవుడేకుని పదముల బట్టెను నుచిత భక్తితో నపుడు।
సిద్ధగురుండును లేపియునాతని జేర్చెను కౌగిటనాడు॥ ౩౫౮.

విభవముతోడను నింటికివచ్చియు విఠలునిగని సేవించెన్।
శుభమౌనట్టుల విప్రజనములకు సుఖభక్షణ చేయించెన్॥ 3౬౦.

---

ప్రతిష్ఠానమున పరమహంసుడై బ్రాహ్మణు డొక్కండుండు।
అతివిరక్తుడై యరిషడ్వర్గము నరసిజయించియు నుండు॥ 3౬౧.
ఎల్లెడలందున శ్రీహరిభావము నెపుడనుంచును నతడు।
ఉల్లములలరగ చరాచరములకు నుర్విని నన్నిటికతడు॥ 3౬౨.
దండముబెట్టుచు తగ్గుహెచ్చులను తాజూడకయే తుదకు।
పండితజనులకు పామరజనులకు మెండగు చండాళులకు॥ 3౬3.
ఏనుగ దోమయు గుఱ్ఱము గాడిదె యెలుకమొదలు మృగములకు।
మానుగ నాతడు నమస్కరించును మహిని బడుచు తాకడకు॥
ఏకనాథు శ్రీహరికీర్తనకును నెప్పుడు వచ్చుచు నుండు।
జోకతోడనిటు జరగగ నొకయెడ నూటిగ నది కడనుండు॥ 3౬౫.
స్నానముజేయగ నదిలోగాడిదె చచ్చినదియు వచ్చెనటన్।
దానింగాంచుచు దీర్ఘంబుగదా దండము బెట్టెను నచటన్॥ 3౬౬.
విప్రులు దానిం గాంచుచు నప్పుడు విచిత్రమని నవ్వుచును।
ఆప్రమత్తుడగు యతివరునింగని యందరచ్చట గూడుచును॥ 3౬౭.
చచ్చినగాడిదె నీటినిరాగను సలిపితేల దండమని।
సచ్చిదాత్మయట నుండనందునను సలుపుదండ మెవరికని॥ 3౬౮.
సర్వము హరియని జూచుచునుండెడి సత్పురుషుండవు నీవు।
నిర్వాహకమగు గాడిదె బ్రతికిన నీభావార్థము తెరువు॥ 3౬౯.
సత్య ప్రతీతి జూపితి వేనియు సాధువనుచు దలతుమనన్।
ప్రత్యయముగ తా బలుకక యతియును భగవంతుని తనలోనన్॥
పరమపురుష యో పండరినాథా పడిపోయిన ఖరమునకు।
వెరవక జేసిన వందనంబును విఫలం జేయని యడుగు॥ 3౭౧.

ఇంతలోన నది యూపిరి విడుచుచు నెలమిలేచె నటనుండి।
పంతము తోడను బ్రాహ్మణులందరు బహుతర వింతను గూడి॥
దండము బెట్టిరి తపస్వి కప్పుడు తమకు తాము బలుకుచును।
పండితు డేకుడు జ్ఞానము జెప్పును పామరులకు నిచ్చటను॥ 323.
ఇట్టి మహిమలను నాతడు జేయుట నిలనుగాన మెచటనుచు।
దిట్టముతో ననుచుండ నేకుడా దెస స్నానమున కరుగుచు॥
తీర్థపాదుడును దండము బెట్టగ దీర్ఘదండ మేకుడును।
సార్థంబుగ తానుంచుచు మహిమను చవిజూపితి వియ్యోడను॥
యోగ విఘ్నమును నీదినంబునను నొప్ప య్యోను తగజూడన్।
ఈగతి కలి నతి వికల్పులగుదురీ యిలను మనుజులును జూడన్॥
కామంబులనే కోరుచునుందురు కలుషీకృతులై ధరను।
సేమము లేకయు చావు వచ్చినను చేరవచ్చి నీ కడను॥ 324.
బాగు చేయమని కష్టమొనర్తురు బాహుళ్యంబగు నలుకన్।
బాగుగ సిద్ధుల విని యోగించిన ప్రచుర మహిమ విడునగన్॥
పరమహంసుడును పర్యాలోచన బాగుగ జేయుచు తాను।
సరగున తనకును పరమపదముకై సమాధి నిమ్మనగాను॥ 325.
ఏకనాథుడట నుప్పరవారల నేపునదా బిలుచుచును।
ప్రాకటమగునటు పల్లముత్రవ్వగ పరమహంసు డందునను॥ 3౮౦.
విదేహుడగుచును వేంచేయంగను విహిత పూజలను సలిపి।
నిదానముగనే మంటిని గప్పుచు నెనరున యేకుడుచనె మొప్పి॥
పురముననుండెడి బ్రాహ్మణులందరు పొందుగ వినుచునుదీని।
దురితంబిదియని శివాలయమునకు కరమేకుని బిలిచికొని॥ 3౮౨.
జీవితుడగుచును యతివరుడుండగ జేసితివి సమాధియును।
భావ రహితముగ చంపుటచేతను బ్రహ్మహత్య నీ కగును॥ 3౮3.
విపర్యయంబగు కర్మలనీవును వెరువక జేయుట వలనన్।
నెపమున నీకును భవిష్కారమును నెరినుంచితి మికదీనన్॥ 3౮౪.

వివరంబగునటు నీదుష్కర్మము విష్ణువు మెచ్చిన యెడలన్।
భవునిముందు పాషాణ నందియును బడలక మేత దినునిలన్॥ ౩౮౫.
కాని యెడల నిటుకర్మ భోగమును కలుగును నీకని జెప్పన్।
దీనుం డేకుడు బ్రాహ్మణ జనులకు దీర్ఘదండమిడె నొప్పన్॥ ౩౮౬.
గోడవంటి మూఢుడ మందుడ గొప్పశాస్త్ర మెరుగనని।
వేడుక తోడను వృషభము వద్దకు వెళ్ళి బల్కె దానిగని॥ ౩౮౭.
ఈదినమున నీయనుమతి యతికిని నెలమి సమాధి నిడితిని।
పాదుగదోషము లేకుండినయెడ ప్రజలిచ్చెదు మేతగని॥ ౩౮౮.
తినవలెననుచును దీర్ఘదండమును దీనతదానుంచగను।
చనువున నందియు నాలికెచాపుచు చక్కదినెను మేతయును॥
మోదంబిదియని గాంచుచు ద్విజులును ముందున నేకుని గనుచు।
ఈదినంబులో నుంచిన యాంత్యము నెలమిలేదు నీకనుచు॥ ౩౯౦.
చమత్కారమును చూపించుటచే సమ్మతి నొందితి మనగన్।
నమస్కరించుచు ద్విజులకందరకు నమ్రుడై యేకుడు వెలిగన్॥
ద్విజవరుపదముల తీర్థమహిమయె దిక్కైయుండును నాకు।
సుజనులునగు మీచరణప్రభావమే సుఖసిద్ధులొసగు మాకు॥
ఇదివిని బ్రాహ్మణు లేకనాథుని నింపుగనటు పొగడుచును।
కుదురుగబోవగ నేకనాథుడును కోరుచు నింటికరిగెను॥ ౩౯౩.
క్షేత్రవాసులగు నితరజనులకిది చెవినిబడగ గొనియాడన్।
ఆత్రము తోడను నరుగుదెంచిరా హరుని యాలయముజూడన్॥
బసవమూర్తిగని బెట్టిరి తిరిగియు భవిష్కార మేకునకు।
బిసతో నేకుని పిలువబంపుచును పెంపుగ బలికిరిపెక్కు॥ ౩౯౫.
శ్రీపాదునినటు చంపుట చేతను చేరెను హత్యయునీకు।
ప్రాపుగ మేమును నందియు జేసిన ప్రతీతి కనకుండుటకు॥ ౩౯౬.
ఇప్పుడు దెచ్చిన యీలాడూలను యిచ్చట నందియు దినినన్।
ఒప్పగు మాకును మేలగు నీకును నొసగగ నటుగాకున్నన్॥ ౩౯౭.

అందరు జెప్పగ నాంతట యుండునని ననుగ్రహమని యేకుడును।
ముందు గనియా నంది విగ్రహమును మురిపెముతో నిట్టులను॥
ఓబసవేశ్వర యుమారమణుచే నొప్పిదమైతివి నీవు।
బాబూ యిట్టుల నిత్యము మేతను భక్షణమెటు చేయుదువు॥ ౩౯౯.
పుర నివాసులగు ప్రజలనేకులును నరిగెదరిట నిందులకు।
గురుతుగ వారల కోర్కెల దీర్చను గొప్పమహిమ జూపుటకు॥
ఎల్లజనంబు లెరుంగునట్లుగా నెలమియుక్తి జేసికొని।
తెల్లంబుగనీ ప్రభావమిచ్చట తెలియ జేయు మనగ విని॥ ౪౦౧.
వృషభము లేచియు నూపిరి విడిచియు వేగమె తిరిగ నట్టిట్టు।
కృషిచే దుముకుచు గంగ గట్టునను క్రియతో నుండెనుపట్టు॥ ౪౦౨.
అవనీ సురులును నతిముదమొందుచు నాశ్చర్యముతో జూచి।
కువలయమునకిది ముందు కాలమున గురుతు వచ్చునని యెంచి॥
పండరి నాథుని రక్షణబొందెను బలపడి యేకుండనియు।
మెండుగ నుతులను జేయుచు వారలు మెల్లగ నేగిరి గనియు॥ ౪౦౪.
ఇప్పటికిని నీ ప్రతీతి యచ్చట నేపున గానగ వచ్చు।
మెప్పుగ నేకుడు వాసముచేయుచు మెలగిన పురమున మించు॥

---

అళకావతికిని యొకదినమందును నరుగుదెంచె నేకుడును।
కలిగి యుండెనటు జ్ఞానదేవుని ఘన సమాధి చూడగను॥ ౪౦౬.
కలలో వచ్చియు జ్ఞానదేవుడును గారవమున వచియించున్।
బలతరమగునా చెట్టువ్రేళ్ళకు ప్రక్కసమాధి నశించున్॥ ౪౦౭.
వానిని వేరొక మార్గముబోవగ వాసి జేయుమని యడుగన్।
ఆనడిరేయిని నేకుడుమేల్కొని యమరగ నుదయము కాగన్॥
ఆజ్ఞప్రకారమే యచ్చటి వృక్షపు నడుగు వేరునటు దీసెన్।
ప్రాజ్ఞుడగుచు నాసమాధినప్పుడు పదిలంబగునటు జేసెన్॥ ౪౦౯.

అనేక జనులకు నచ్చట నేకుడు హరికథయును వినిపింపఁ।
పునీతులగుటకు నచ్చట జేరగ భక్తరహితమై యొప్పఁ॥ ౪౧౦.
పండరినాథుడు బెట్టి దుకాణము ప్రబలపు వర్తకుడగుచు।
నిండుప్రీతితో నఖిల వస్తువుల నేర్పున నందరకిచ్చు॥ ౪౧౧.
వలయు వస్తువుల వెలను మరుదినము వాంఛను దీసెదననియు।
మెలగుచు జెప్పుచు మరుదినమందున మించి యదృశ్యుడై వెలయు॥
హరి విలాసమని యేకుడు బల్కుచు నచ్చటనుండియు వెడలెఁ।
పురమగు పైటను జేరెను పిమ్మట పొందు మహిమ విలసిల్లెఁ॥౪౧౩.

---

జ్ఞానేశ్వరమను గ్రంథంబొక్కటి కలిగియుండె పూర్వమున।
నానా విధమగు వ్రాతతప్పులును సేనా యుండెను గాన॥ ౪౧౪.
జ్ఞానదేవుడును చేసిన గ్రంథపు కవిత్వమేకుని వల్లఁ।
మానుగ శోధన చేయంబడియెను మహిని మంచి యర్థములఁ॥
సకల జనులువిని యానందింపగ చదువుట కారంభింపఁ।
ప్రకటంబుగ నొక ద్విజుకేశవుడను భక్తుడుద్ధవుడు నొప్పఁ॥౪౧౬.
ముఖ్య శ్రోతలు మనసు ధరించిరి ముఖ్యార్థంబుల గనుచు।
సఖ్యము తోడను నితర జనంబులు చక్కగ దానిని వినుచు॥౪౧౭.
సమాప్తమయ్యెను గ్రంథము చదువుట చనియెదననె కేశవుడు।
ప్రమేయ సారుడు నాతని బొమ్మనె బహుయనుతాపము నెగడు॥

---

అనామికుడొకడు పైటనుపురమున హరిభక్తుండై యుండఁ।
దినమును సతితో కథ వినుటకునై చనునేకుని గృహమందఁ॥
ఏకనాథుడును నుదయ కాలమున నేటికి స్నానము చేయఁ।
బోకనుబోవగ దారి నంత్యజుడు చొప్పుగ నూడ్చును డాయఁ॥
హరి రూపుండని యంత్యజు డాతని కతిప్రీతిని దండమిడు।
గురుతని భక్తియు సేవా కాంక్షయు కోరియు-గునటు వినుడు॥

ఒకయెడ శ్రీహరి విశ్వరూపమును నొగి నేకుడు వర్ణింపన్।
ప్రకటంబుగనా యంత్యజుడప్పుడు భక్తిని నడిగెను నొప్పన్॥
†సవ్యసాచికిని శ్రీహరి తన నిజ స్వరూపమును జూపునెడ।
ఎవ్విధముననా రూపున నెచ్చట నిమిడితి నేనట్టియెడ॥ ౪౨౩.
ఇదివిని యేకుడు హరిరూపంబున నేకమగుచు నుంటివనన్।
కుదురుగ నంత్యజు మనసున నిలిపెను గోవిందుని రూపమునన్॥
నామ రూపముల నేమియు గానక నారాయణ విభువందు।
ప్రేమ భావమును బొందు పరచుకొని పెంపున దా తెలివొందు॥
బహిస్ఫురణమును తానటు కూడగ బ్రహ్మరూపు డేకుడని।
బహుంతర ప్రేమను భావమతనిపై బట్టియుండె వాడుగని॥ ౪౨౮.
ఆతనిదర్శన మప్పుడప్పుడును నమరుటకై యంత్యజుడు।
వదలుచు తననిజ స్థానంబప్పుడు వచ్చిచేరె నదియొద్దు॥ ౪౨౭.
స్నానము కొఱకై యేకుడు రాగను సరిదర్శన మటనగును।
మానుగ సతిపతు లిరువురటుండగ మానిని యనె పతితోను॥
ఏకనాథుడును హరిరూపుండని నిలను బ్రసిద్ధత నొందె।
ప్రాకటమగునటు భోజనమతనికి భక్తి బెట్ట నిరవొందె॥ ౪౨౯.
ఆమంత్రణమును నాతనికిమ్మని యామెయు నటుజెప్పగను।
నేమంబలరగ వచ్చెను యేకుడు చేయుస్నానపు దరియును॥ ౪౩౦.
ఏకాంతము మాలవాడుగాంచుచు నిటు విన్నపమొనరించెన్।
సాకల్యంబుగ తనసతిజెప్పిన సద్వాక్యము దెలిపించెన్॥ ౪౩౧.
ఏకనాథుడును నంత్యజుభావము నెరుగుచు మరిదాజెప్పె।
శ్రీకర గురుకృప నీమనోరథము చేకూడగ నిలనొప్పె॥ ౪౩౨.
అనామికుండును ముదమున నేగెను నాతనిసతి గనుటకును।
పునీతుడేకుడు జెప్పిన వార్తల పొసగ దెలిపె నామెకును॥ ౪౩౩.
సతి ముదమొందుచు దుర్బలురైనను *సాహిత్యంబును జేర్చె।
అతి వినయంబును నార్తియు గలుగుచు నవసరమును దాజూచె॥

---

†సవ్యసాచి – అర్జునుడు. *సాహిత్యము – సామగ్రి.

ద్వారమునందును తులసీ వనమును ధౌత పటము శుచితోడన్।
శ్రీరఘు రాముని నామమిరువురును జెపుదురు ప్రీతిని నిగుడన్॥
ఒకహరిదినమున నిరువురు గూడియు నొప్పుగ హరికథ వినుచు।
నికరద్వాదశి నింటికి వచ్చుచు నెలతయు పతినింగనుచు॥ ౪౩౬.
ఈదినముననా యేకనాథుమన యింటికి భోజనమునకు।
పాదుగ మనకును పిలిపించుటకును భవ్యంబగునని బలుకు॥ ౪౩౭.
మంచిది యనుచును గంగయొద్దనకు మాలడువెళ్లుచు నటను।
అంచితముగ నేకుడు స్నానంబున కచటికి విచ్చేయగను॥ ౪౩౮.
అతివినయముతో ననామికుండును నవనిని దండంబిడుచు।
ప్రతిపత్తిని తా నాతని పిలిచెను భక్షణమొనర్చుటకును॥ ౪౩౯.
హీనజాతినై యున్నకతంబున నిల సందియ మొందెదను।
మానుగ మనవిని విందువా కోపము మదినిడుదువా నెరుగనను॥
ప్రేమతోడ నయ్యేకనాథుడును పెంపుగ జూచుచు ననియెన్।
సేమమలర నీ ప్రేమభావమును శ్రీహరికిని నిరవయ్యెన్॥ ౪౪౧.
వేద పురాణము చదివిన విప్రులు విముఖులు సద్భక్తికిని।
ఆదరమొందక వెలసియుందురటు నంత్యజు వీరందరికిని॥ ౪౪౨.
అచ్యుతు భక్తిని యనుసరించినను నధికుండగుచును వెలయు।
ప్రచ్యుతముగనే బైటి యలంకృతుల్ పనిబడకుండును మరియు॥
భాగవతంబున నుండిన శ్లోకము బలికెనతని కేకుండు।
ఆగమ సూక్తికి నర్థము జెప్పగ నాలకించె నొకద్విజుడు॥ ౪౪౪.
కొంతసేపులో గుంపు గూడుకొని క్రోధులగుచు ద్విజులుగని।
పంతముతోడను దుర్భాషలతో బాధించి రయ్యేకుని॥ ౪౪౫.
శృత్యర్థంబుల నంత్యజాతికిని జెప్పితీవు నిర్వేదను।
సత్యంబుగ నధ్యవసాయమునకు చాలునె నంత్యజుడిలను॥ ౪౪౬.
చేయరాని పని చేయుట చేతను చేకురు పాపంబిలను।
ప్రాయశ్చిత్త దోషము బొందెను నీకని బ్రాహ్మణులును బల్కగను॥

నాధుడు వారికి నమస్కరించుచు నమ్రుడగుచు బల్కగను।
మాధవ భక్తుండైన మనుష్యుడు మాలం డెట్టుల నగును॥ ౪౪౮.
అల్పుండైనను ననామికునిదగు నాతడు నిలలేడనుచు।
స్వల్పుడుగాడీ సుజ్ఞానమునకు సదధికారి యితడనుచు॥ ౪౪౯.
భావశుద్ధిచే భజనపరుండై భక్తిని నవలంబించెన్।
శ్రీవల్లభు తన స్వాధీనంబుగ జేసికొనుచు దామించెన్॥ ౪౫౦.
ఆర్తిని గాంచుచు జెప్పితి నతనికి నంచితమగు నర్థమును।
ధూర్తత లేదిటు కాగల పనులను దురుసుచేయు డనగాను॥ ౪౫౧.
గంగజలంబున బ్రాహ్మణులేకుని కరమిడికొని బోవుచును।
పొంగుచు నతనికి ప్రాయశ్చిత్తము బూనజేసి రీయిలను॥ ౪౫౨.
అనామికుండును దీనింగాంచుచు నతివ్యాకులుడై వెళ్ళెన్।
వినీతుడగుచును సతితోసంగతి వివరించుచు విలపిల్లెన్॥ ౪౫౩.
వార్తలనాతో బల్కెనేకుడని విచ్చిద్విజులు గుంపుగను।
పూర్తిగ నతనికి ప్రాయశ్చిత్తము బురికొల్పిరి వారలును॥ ౪౫౪.
ఇదివిని కాంతయు నతిదుఃఖితయై యిలబడి యేడ్వదొడంగెన్।
పతియుగనుంగొని యేకనాథుడును పరమకృపాళుడు వెలిగెన్॥
దీనులకొఱకై జెప్పినరీతిని తీరముజేయు నెంతైన।
నేనేయచటికి వెళ్ళియుపిదపను నిలకడ నెరిగెదపైన॥ ౪౫౬.
ఆతడుమనలకై యతికష్టముల ననుభవింప, గను నెడలన్।
భూతలమున మనముండ జాలమిక పొరివిడుతుము ప్రాణములన్॥
ఇటులంజెప్పుచు గంగకువెళ్ళియు నేకునిగని దండమిడెన్।
నిటలాంజలుడై భోజనమునకును తనరున రమ్మని వేడెన్॥ ౪౫౮.
శుద్ధభావమును జూచి యేకుడును నూటిగ చెప్పెను గనుచు।
పద్ధతి చొప్పున పూజజేసికొని బరతెంచెద నేననుచు॥ ౪౫౯.
సంతోషించుచు ననామికుండును సరగవెళ్ళె గృహామునకు।
ఎంతోముదమున సతితోవంటల నేర్పడజేసెను కడకు॥ ౪౬౧.

నాధుడుబల్కిన మాటల ద్విజులును నయముగనటు వినియనిరి।
క్రోధతనిప్పుడె ప్రాయశ్చిత్తము గురిగజేయబడి మీరి॥
అందరు జూడగ నంత్యజుడొసగిన యామంత్రణ గైకొనియెన్।
పంతంబుగకుల భ్రిష్టాకారము ప్రాపుజేయుటకు నయ్యెన్॥ ౪౬౨.
ఏమైన ర్తమని యందరు గూడియు నేకాంతము వారలును।
సేమమలర, కనుబెట్టియుండి, రటు చెదరక నట్టెటుగను॥ ౪౬౩.
అనామికుని యన్నంబును దినుచును నాతడుండగను మనము।
సునిశ్చితంబుగ బట్టుకొనెదమని నూటిగ బల్కిరిసుమ్ము॥ ౪౬౪.
ఏకనాధుడును నింటికి వెళ్లుచు నీశుని నర్చించుచును।
జోకను రెండవ జామున జెప్పెను నూటిగ భాగవతమును॥ ౪౬౫.
భోజన వేళను బ్రాహ్మణజనులను పొసగంగను బిలువగను।
ఓజను వచ్చెను నేకునియింటికి నొగినా యనామికుడును॥ ౪౬౬.
పాకంబంతయు పూర్తిగనయ్యెను బరతెంచితి బిలుచుటకు।
ఏకుడు బల్కెను నిప్పుడె వచ్చెద నేగుము నీగృహమునకు॥ ౪౬౭.
వెనుక నేకుడును ద్విజుల గూడుకొని వెలసియు తనగృహమందు।
తినగూర్చుండెను నాహ్లాదముతో ద్విజులందరు గనముందు॥ ౪౬౮.
మాలని గృహమున నేకునిరూపున మాధవుడును ప్రకటించెన్।
తాళిమితోనటు పతి భార్యలచే తనచరణము గడిగించెన్॥ ౪౬౯.
సేవించుచునా పాదజలములను జేసి దండమిరువురును।
భావశుద్ధితో సన్మానంబును బహుగా జేయుచునటను॥ ౪౭౦.
చేసిన వంటను విస్తరయందును చెలిమిని నుంచిరి యపుడు।
వాసిగ నాతడు భక్షణ జేయుచు వరకృప జూచుచునుండు॥ ౪౭౧.
ఆసమయంబున విప్రుండొక్కం డటువచ్చియు తాజూడన్।
వేసరిల్లకను నేకుడు తినగని విపులక్రోధము తోడన్॥ ౪౭౨.
బిరబిర వెళ్ళిరి యనేకవిప్రులు బిరుసున నేకునిగృహము।
అరసిచూడగను నచ్చట నేకుడు నార్తిని భుజియించెనుము॥ ౪౭౩.

అచ్చట విప్రులు కొందరునేగిరి యంత్యజు గృహంబునకును।
సచ్చరిత్రుఁడా యేకుండచ్చట చక్కఁగ భక్షింపగను॥ ౪౭౪.

ఇక్కడనేకుం డక్కడనేకుం డెట్లుండును నిరుయెడలన్।
మక్కువ తోడను విప్రులందరును మహాశ్చర్యమొందిరిలన్॥ ౪౭౫.

ఏమియు దోపక యిటునటు దిరుగుచు నిరుజాములు వారుండన్।
ప్రేమను విఠలుఁడు భక్షణ జేసెను పెంపు భక్ష్యములతోడన్॥ ౪౭౬.

చేతుల గడిగియు విడెముల నియ్యఁగ చేకొన హరి ప్రియమునను।
ప్రీతిని పదములబట్టిరి యతనికి పెంపుతోడ నిరువురును॥ ౪౭౭.

భావ హీనులము భక్తిహీనులము పతితులగుదు మెపుడు।
సేవ హీనులము జాతిహీనులము సేమంబెది లేకుండు॥ ౪౭౮.

మాయెడనార్తిని పూర్తిఁ జేసితివి మహి ధన్యుఁడవగుదువను।
నేయముతోడను నాగృహమంతయు నేడు పవిత్రమయ్యెనను॥

అనుచు జెప్పగను నాశ్వాసంబుల నఖిలేశ్వరుఁడిచ్చుచును।
ఒనరగ నచటనే యంతర్ధానము నొందెను శ్రీహరి మున్ను॥ ౪౮౦.

వెనుక ననామికు లుచ్ఛిష్టంబును వీలుగ నటుదినిరపుడు।
సునిశ్చితంబగు నానందంబును సూటిగ బొందిరి నాడు॥ ౪౮౧.

ద్విజులందరునటు మాంత్రికుఁడగునని తెలియదు భ్రష్టునంతుయని।
కుజనులై జెప్పుచు తమతమ గృహముల గూడి చోద్యమనిరిగని॥

---

ప్రతిష్ఠానిలో బ్రాహ్మణుఁడొక్కఁడు ప్రఖ్యాతిగ తానుండెన్।
సతియును పుత్రులు సంసారముతో చక్కనిమాన్యత నుండెన్॥

ప్రారబ్ధముచే పొందెనాతఁడును పరసవేదియటు గనుఁడు।
సార తరంబగు సంపతిమాన్యత సౌభాగ్యముతోనుండు॥ ౪౮౪.

కొంత కాలమటు గడచినపిదపను కొడుకులు సతిమృతినొందన్।
పంతముతోడను నుదాసవృత్తిచే భగిరథిచన నిరవొందన్॥ ౪౮౫.

పరసవేదినిం బెట్టు బెచటనని పర్యాలోచించుచును।
గరిమెను నేకుని యింటికి వచ్చియు గాంచియతని యొంటిగను॥
నమస్కరించుచు యాత్ర కేగుచును నమ్రత బలికెను నాడు।
అమలపు వస్తువు నాయెడనున్నది యదినీవుంచుము నేడు॥ ౪౮౭.
వేడుకొనంగా నేకనాథుడును వేగ సమ్మతింపగను।
జాడను విప్రుం డావస్తువనటు సరగనతని కియ్యగను॥ ౪౮౮.
ఏకుడు బల్కెను పాషాణమువలె నెలమినున్న దేమనగన్।
ప్రాకటముగనది స్పర్శవేదియని బలికెను విప్రుడు వేగన్॥ ౪౮౯.
మరియు జెప్పెదా మహాయాత్రనే మహిలో జేసిన మీదన్।
గరిమను నాకిమ్మనగను నేకుడు కనియిదె పీఠముక్రిందన్॥ ౪౯౦.
ఏకనాథుని యాజ్ఞను గైకొని యెలమి ద్విజుడు వెళ్ళగను।
జోకను మరిచెను పరసవేదిని సొత్తనిగన కేకుడును॥ ౪౯౧.
ప్రాప్య భూమినిం బొందినవారికి పయిడి మట్టి సమమగును।
ఏపుమీరనా యేకుడు మరచెను నిలనా పరసను తాను॥ ౪౯౨.
ఒకవత్సరమటు యాత్రజేసికొని యొనరవచ్చె విప్రుడును।
ప్రకటంబుగనా యేకనాథునకు భక్తినేగి మ్రొక్కుచును॥ ౪౯౩.
యాత్ర సంగతిని నింతయునతనికి నరయగ తెలియంజెప్పి।
క్షేత్రంబగునీ పైటను పురమున చేరితినని దానొప్పి॥ ౪౯౪.
గడియలు నాలుగు కూర్చుండియు నటు గైకొనుటకు పరసమును।
ఎడరున నతనికి నేమియు జెప్పక నేకుడు మరిచుండగను॥ ౪౯౫.
ప్రథమ దినంబని పోయెను విప్రుడు పదపడి మరుదినమందు।
కుదురుగ వచ్చుచు నేకునినడిగెను గురి పరసను నిమ్మందు॥ ౪౯౬.
చిరయాలోచన జేసి యేకుడును జెప్పెను నెటనుంచితినే।
విరళించెను యావిప్రుండప్పుడు విపులపీట క్రిందుగనే॥ ౪౯౭.
ఏకుడు పీటను నెత్తిచూడగను నేమియునట లేకుండన్।
ప్రాకటముగ దా జెప్పెను సంగను బడె నిర్భాగ్యము తోడన్॥ ౪౯౮.

అతివ్యాకులుడై యదివిని నేనిట కరగితి *పరసంబునకు।
సతియును పుత్రులు వచ్చిన వెనుకను చనె బంధంబులు తనకు॥

ఏకనాథువీని యాతని నిడుగొని యేతెంచెను నదికనుచు।
ప్రాకటముగనా నిర్మాల్యంబును పయసున వేసిరి యనుచు॥ ౫౦౦.

గంగయందుగల గడుసు రాళ్ళను కరములతా దెచ్చుచును।
పొంగుగ నీవొక పరసవేదినిం బూనుకొనిన పిమ్మటను॥ ౫౦౧.

మిగిలినవానిని గంగనుంచెదను మేలుభద్రమగు నట్లు।
సుగమమనుచునొక పరసవేదిని సూటిగ గొనెద్విజుడట్లు॥ ౫౦౨.

పిదపను నేకుడు బారవేసెనా పెంపునీట పరసలను।
కుదురుగ గంగను స్నానముజేయుచు కోరిచనె గృహమునకును॥

ఏకనాథు మహదైశ్వర్యంబును నెవరికి గొనియాడనగు।
సాకల్యంబుగ జగదుద్ధారణ సలుపవచ్చి నాతడగు॥ ౫౦౪.

---

అరుణోదయమున నేకుడు లేచుచు, నరుగును శౌచంబునకు।
కరమొప్పగదా కాళ్ళను ముఖమును కడుగును మరియటు బాగు॥

గంగకు వెళ్ళియు స్నానము జేసియు గరిమెను నర్ఘ్యంబిడుచు।
రంగుగ నింటికి వచ్చిన పిదపను రంగవిఠలు పూజించు॥ ౫౦౬.

పూజావిధిదా జేయుచు వెనుకను పురాణముల నటుజెప్పగా।
సౌజన్యులకును సదావర్తియటు చక్కగనిచ్చుచు నొప్పగా॥ ౫౦౭.

పితౄతర్పణమును జేయుచు ద్విజులకు పెంపుగ పూజలచేయు।
వితృప్తుడగుచును ద్విజపద జలముల విప్రులకన్నం బిడియు॥ ౫౦౮.

ఘనభక్తుండగు నేకనాథుడును గతిగ వెనుక భుజియించు।
చనువున నాల్గవ జాముభాగవత సద్గ్రంథము జెప్పించు॥ ౫౦౯.

ముదమున సాయంకాలముతొజను మొగి గంగకు సంధ్యకును।
సదనంబున కేతెంచి హరికథల చక్కగబాడును తాను॥ ౫౧౦.

---

*పరస - ఇనుమును బంగారు చేయువస్తువు.

భావికభక్తులు బహుగా వత్తురు భగవత్కథ వినుటకును।
గోవిందుని గుణకీర్తనజేయుచు గోరిగడుపు యామమును॥ ౫౧౧.
అర్చన పూజన లార్తిని జేయుచు హరినామము తాజెపును।
ఖర్చులకిందుల భగవంతుండును కరుణతోడ నిచ్చుమును॥ ౫౧౨.
నిర్భరత్వమున నాతండుండగ నీరజనాభుం డపుడు।
*అర్భకునివలె వచ్చెను నేకుని యమలసన్నిధిని నతడు॥ ౫౧౩.
నమస్కరించుచు నీసేవలనే నమసితముగ జేయుటకు।
కొమరొప్పగ నిటువచ్చితి భక్తియు నమరుగాతయని నాకు॥ ౫౧౪.
జీతంబడుగను నన్నము కొఱకై సేవల జేసెద ననుచు।
ప్రీతిని సాదుల సంగంబగునని వేవచ్చితి నిటు మనుచు॥ ౫౧౫.
ఏకుండూరును పేరునడుగగను నింపుగ హరియును జెప్పె।
చేకొని యెక్కడనైననుండుదును శ్రీఖండ్యా పేరొప్పె॥ ౫౧౬.
దారాసుతులెడ నాశలెవ్వియును ధరను నాకు లేవనుచు।
తీరుగ ఋగ్వేదశాఖ తనదని ధీరుడు జెప్పెను గనుచు॥ ౫౧౭.
ఏకుడు బల్కెను నన్నవస్త్రముల నేపునకై కొనుమనుచు।
జోకను సేవల జేయక నెప్పుడు సుఖముండుదును తగననుచు॥ ౫౧౮.
శ్రీహరి బల్కెను శరీరమంతను చెలగి శక్తియున్నదను।
ఊహను నిచ్చట నూరకుండినను నుచితము కాదని జెపును॥ ౫౧౯.
నరశరీరమిది నశ్వరంబగును హరిభక్తుల సేవలచే
పరమసుఖంబును బొందవచ్చునని పరుగిడివచ్చితి హెచ్చె॥ ౫౨౦.
ప్రతిదినమందును ప్రొద్దుబొడువగను పాత్రపరికరములెల్లన్।
అతిమోదంబున కడుగుచు జిమ్ముచు నలరనేయు విలసిల్లన్॥ ౫౨౧.
పూజ కొఱకునై పువ్వులు నీరును పొందుగ దానటుదెచ్చు।
సౌజన్యంబుగ చందన మంచును సరిదీపము వెలిగించు॥ ౫౨౨.
వంట గృహంబున నుండెడి పనులను వాసిగ నాతడు నేయు।
ఇంటింటనుదా గ్రామస్థులచే హెచ్చుగ శ్లాఘన వెలయు॥ ౫౨౩.

---

*అర్భకుడు – అల్పుడు.

ద్వాదశ వర్షము లిటులం జరగగ ద్వారకపురి ద్విజుడొకడు।
సాదువృత్తిగా హరిబ్రసన్నతకు సలిపె తపస్సును నతడు॥ ప. ౨౪.
బహువత్సరములు శ్రమజేయంగను పరుని సేవకాకుండు।
విహితంబనుచును నుపవాసంబును విధినిజేసె తానపుడు॥ ప. ౨౫.
శ్రీహరి పత్నియు స్వప్నమునందును జెప్పెను నాతనికటను।
దేహము విడువకు పైటనుపురమున ద్విజుడేకుని గృహమునను॥
శ్రీఖండ్యాయను నామమునచ్చట శ్రీకృష్ణుడు ధరియించెఁ।
ఆఖండలనుతు సేవల జేయుచు నతిసౌఖ్యము వెలయించెఁ॥ ప. ౨౬.
వినియా విప్రుడు పైటనుపురికిని వేగమె నటువచ్చుచును।
మనుచును గౌతమి స్నానముచేయగ మాధవుడతని గనుచును॥
ఒంటరినైనే నుచిత స్థలమున నొప్పిదముగ నుండగను।
జంటతనంబును జేసెరుక్మిణియు చనవలసియు వచ్చెనను॥ ప. ౨౭.
అనుచు జెప్పుచును కావడి నీటిని ననువుగ నింటికిదెచ్చెఁ।
నునువుగ సానెను శ్రీగంధంబును నూరుచు నాతడు వెలసెఁ॥
ఇంతలోన ద్విజుడేగుదెంచెనటు నేకనాథు గృహమునకు।
సంతసించుచును జేసె నమస్కృతి సద్భక్తుడు విప్రునకు॥ ప. ౩౧.
ఆసనమియ్యగ నతివినయంబున నటువచ్చిన కార్యముచు।
వేసరిల్లకను వందనమొసగుచు విశదపరచె విప్రుడును॥ ప. ౩౨.
ద్విజుడై హరియును శ్రీఖండ్యాయను ధీరుడు నీగృహమునను।
నిజసేవలదా జేయును నాతని నెనరున నిటు బిలువమను॥ ప. ౩౩.
ఏకుడు బల్కెను హరిశ్రీకృష్ణుం డెల్లెడ నుండుననంగఁ।
జోకను విప్రుడు హరిశ్రీరూపమె సుఖతరమగు తనకనగఁ॥ ప. ౩౪.
ఉద్ధవునింగని యేకుండడిగెను నొగి శ్రీఖండ్యా యెచట।
శ్రద్ధను నతడనె శ్రీగంధంబును చనువున తీయునునిచట॥ ప. ౩౫.
ఇదివిని యేకుం డావిప్రునితో నేగె పూజగృహమునకు।
కుమరుగ నచ్చట కృష్ణరూపమున నెదుటను గనపడె తనకు॥ ప. ౩౬.

కిరీట కుండల కౌస్తుభ మాలయు కేయూరంబులతోను।
కరచరణంబుల కంకణమందెలు కటి పీతాంబరములను॥ ౫౩౭.

శోభమానమగు సుందర రూపున సుఖముగ హరి ప్రకటింపన్।
ప్రాభవమగు చూట్కుల నతనిపై పరగనుంచి వెలయింపన్॥ ౫౩౮.

అనుతాపముతో హరి కృష్ణాయని యంజలిహస్తుడగుచును।
సునిశ్చితంబుగ దీనుని కొఱకై పనులజేసితి య్యెడను॥ ౫౩౯.

అపారమగునీ యమలమహిమలను నల శేషుడు బ్రహ్మయును।
విపులంబుగ తగవర్ణించుటకును వీలుపడదు మరియును॥ ౫౪౦.

ఎంతవాడనే నీశదయాళో హెచ్చున నినువర్ణింపన్।
పంతమునాకై పావన బిరుదును బైలుపరచితివి యొప్పన్॥ ౫౪౧.

అనుచు జెప్పుచును ప్రియమోదముతో ననేకదండంబులిడు।
చనువున శ్రీహరి జెప్పెనతనికిని చనిన కాలమున నాడు॥ ౫౪౨.

విఠలుని పేరున నుంటిని నీయెడ వేయుచు ధృతి తాళముల।
పటుతరముగనే కేశవు పేరున భాగవతము వింటినిల॥ ౫౪౩.

ద్వాదశ వర్షము లిటముందుంటిని తదుపరి రెండవమారు।
పాదుగనటులనె యుండియిప్పుడును ద్వాదశవర్షముల్ మీరు॥

అనుచుజెప్పుచును నంతర్ధానము నప్పుడనొందెను హరియు।
వినుతుండగుచును వచ్చిన విప్రుడు వెరచుచు దండంబిడియు॥

సమీపమున హరి యుండగ నేకుడు సత్కరింపకుంటినను।
రమాకాంతు చర్యలగని విప్రుని రమ్మనె భుజించుటకును॥ ౫౪౬.

ఒకరిని నొక్కరు పొగడ్తజేయుచు నుచితాహారము గొనిరి।
సకల జనులు విని శ్రీహరి కృపయని సంతసించిరటు మీరి॥ ౫౪౭.

---

ఒకకాలంబున నేకనాథుడును నొప్పుగ కీర్తనజేయన్।
సకలజాతులగు జనములు నచ్చట చక్కవచ్చి వినివెలయన్॥ ౫౪౮.

ఆనందముతో నచ్యుతరంగా హరికృష్ణాయని యనుచు।
మేనుల మరచియు హరిమరులొందుచు మిగుల ప్రేమతో గనుచు॥
దొంగలు నలుగురు ద్వారలి వచ్చుచు తోచబడక యుండిరటన్।
పొంగుగ హరికథ బాగుగవినుచును బోయిరి పరులిండ్లకటన్॥
దొంగలు మాత్రము తెలియక నెవరికి దూరియుండిర య్యెడను।
సంగములేదని తలుపులు, బెట్టను సరగ నుద్ధవుండటను॥ ౫౫౧.
గిరిజబాయి తన యర్ర ల్లోనిద్రను గీల్కొనుటకు దావెళ్ళెన్।
గురినినుద్ధవుడు నిద్రకులోనై గోరివెళ్ళె దా మెల్లన్॥ ౫౫౨.
ఏకనాథుడును నలసట జెందక నీశుని స్మరణను నుండె।
వీకను నచ్చట కూర్చుండియుమరి విష్ణునామమనుచుండె॥ ౫౫౩.
చోరులు గృహమున దూరిరి యప్పుడు వారికి నగుపడకుండన్।
ద్వారముల్ దెలియక తల్లడ బడుచును తల దెబ్బలు బడుచుండన్॥
దీపమునుండుట తెలియక వారలు తిరుగుచు నాగృహమంతన్।
ఏపుమీరగను నేకనాథుడును నెలమి నుండఘారంతన్॥ ౫౫౫.
కనులు దెలియబడి కపటము విడుచుచు కాళ్ళకు దండమునిడుచు।
అనుతాపముతో నతని నుతింపగ నాతడు దొంగల గనుచు॥౫౫౬.
ఎవరని యడుగగ వారలు బల్కిరి యిలల్లో దొంగలమనుచు।
అవిచారణచే నిచటికి రాగను నంధులమైతిమి యనుచు॥ ౫౫౭.
దేవరవారల చూచుటచేతను దీరెను దుర్బుద్ధులును।
భావశుద్ధిమే మందితిమనగను బలికెను నేకుండటను॥ ౫౫౮.
బహుప్రయాసలను పొందితిరనుచును బట్టుకొనుచు వారలను।
గృహమునసుండెడి కొటారములదా క్రియతో జూపుచుతాను॥
ధాన్యద్రవ్యముల గ్గైకొనవచ్చును తరుచుగాగ మీరనగన్।
శూన్యవృత్తులై యన్నమె వారలు నూటిగ కావలెననగన్॥ ౫౬౦.
ఇదివినియేకుం డప్పుడెలేపెను నిల్లాలిని మరితాను।
సదయతనన్నము జేయుమనుచును సతితోపతి జెప్పగను॥ ౫౬౧.

భార్యయు దండను బెట్టుచు పతికిని పాకము త్వరగ నొనర్చెన్।
కార్యముగా నన్నముహారలతో కడు విస్తరి వడ్డించెన్॥ ౫౬౨.

నాధుడు దొంగల నలుగుర బిలిచియు నమ్రత భోజనమిడియె।
క్రోధము లేకను భక్షణ జేసిరి గురిగా భోజ్యములనియె॥ ౫౬౩.

సంసారీకులు చుట్టరికముల సన్మానించెడు క్రియను।
శంసించుచు శ్రీయేకుడు వారికి సలిపె విశేషాన్నమును॥ ౫౬౪.

ప్రసాద తీర్థము బొందిన దొంగలు పద్మలోచనుని భక్తిన్।
పొసగగ బొందుచు భవ్యగుణంబుల పొందిరి పదమను రక్తిన్॥

---

అనామికుండొక డాయూరను కడు నరసియు నుదరము కొఱకు।
దినమును ధాన్యము నితరుల యిండ్లను తెచ్చు దొంగిలి మెరకు॥

ఇట్టుల జేయగ నొకకాలంబున నిల నధికారులు బట్టి।
కొట్టుచు వానిని కావలి నుంచిరి గొలుసు బేడీలనుగిట్టి॥ ౫౬౭.

అన్నము లేకయు నతి శోషణమును ననామికుడును బొందన్।
పన్నుగ వాడును పారిపోడనుచు పగల్చిరి బేడీలంతన్॥ ౫౬౮.

చీకటి రాగనె చోరుడు తనలో చింతనజేసెను నాడు।
సాకల్యంబుగ బేడీలూడితె చనుటయె బాగైయుండు॥ ౫౬

వినను బోవగ నలవిగాకద్దా నతివ్యసనంబును నొందన్।
వైనతేయు వాహను కధ వినబడె వరుసను నామూపందన్॥ ౫౭౦.

మెల్లగ దేకుచు నాతడు వెళ్ళెను మేలగు కధ జరుగునెడన్।
సల్లలితంబుగ జూచెనేకునటు సర్వేశ్వరుతగ బాడన్॥ ౫౭౧.

అంగణమందును నాతండుండగ హరికధ యటు ముగియగను।
పొంగుగనటుగా బోయిరి శ్రోతలు పొగడి రేకు గుణములను॥

ఉద్ధవశిష్యుడు వాకిలి వేసియు నుచిత శయ్య జేరగను।
శ్రద్ధగ నాధుడు శ్రీహరి స్మరణను సరగనుదా జేయుచును॥ ౫౭౩.

అంగణమందును జూచుచునుండగ నచ్చట గనె నొకమనుజున్।
వెంగలి యనుచును వెళ్ళి సమీపము వేగమె యడిగెను మనుజున్॥
చెప్పుటకును దా శక్యము లేకయు చేతుల సౌజ్ఞను జూపెన్।
దెప్పరమేకుడు గృహమున భార్యను తెరువున నప్పుడె లేపె॥ ౫౮౫.
క్షుత్తువ్యాధిచే మనయంగణమున శూద్రుడొకడు జేరెననుచు।
పొత్తుగనన్నము బెట్టవలయునని పొందుగనిట నీవికను॥ ౫౮౬.
వందనమొసగుచు వెళ్ళెను భార్యయు వంటయింటికిని నపుడు।
అందముగా చేసెను వంటకమును నాతనికిని తానపుడు॥ ౫౮౭.
క్షీరము శర్కర నన్నమునప్పుడు జేర్చిదెచ్చె పతియెదుట।
తీరుగ నాతడు దొంగకునిడియెను తీసికొనుచు దానచట॥ ౫౮౮.
అన్నశోషయని యతడు గనుంగొని యల్పాహారము నిచ్చెన్।
తిన్నగ చోరుడు తినినవెనకదా తీర్థము త్రాగుట కిచ్చెన్॥ ౫౮౯.
చోరుడు వెనకను జెప్పెనుమెల్లన నూటిగతన సంగతియు।
ధీరుడు భక్తుడు దానిని వినియతి తీరధైర్యము జెప్పుటయు॥ ౫౯౦.
శక్తిదేహమున చేరువరకుతగ సౌఖ్యంబుగ నిటనుండు।
రక్తిగనన్నము రేయుం బగలును రమ్యముతో తినుచుండు॥ ౫౯౧.
ఊరార్చుచునటు వస్త్రమునిచ్చుచు నొగి శయ్య పరుండుమని।
సారార్థుండగు నేకుడుదయమున సలిపెను కర్మములన్ని॥ ౫౯౨.
గ్రామాధికారి కడకునంపె నరు గరిమెతోడ తెలుపుటకు।
నేమము దప్పుచు నొక్కడు చలివిడి నెరివచ్చెను తానిటకు॥ ౫౯౩.
అధికారియుమరి యతనికిదెలిపెను నగునిష్టము చొప్పునను।
చతురత తోడను నుంచవచ్చునని సరిజెప్పుచు పంపెమును॥ ౫౯౪.
కొన్నిదినంబులు గడచిన పిదపను కూడెపటుత దేహమున।
ఎన్నికతోడను హరికథ వినగను హేయగుణము తొలగగన॥
అంత్యజునింటను నుంచుకొనియెనని యవనిసురులు నిందలను।
చింత్యముజేయుచు నిత్యము నేకుని చెడుగ పలుకుచుండగను॥

ఒక్కదినంబున నేకుడు గంగకు నొనరబోవు చుండగను।
అక్కడ వేగమే బ్రహ్మరక్షసుడు నశ్వర్ధమున నుండుచును॥ ౫౫౭.

క్రిందికి వచ్చియు కరములమోగిడ్చి క్రియనుబలికె నేకునితో।
ఒందములోబడి బ్రహ్మద్వేషమున బడితీ పుట్టుక నెంతో॥ ౫౫౮.

దేవరవారల దర్శనముననే దివినిచేరెదను మరియు।
భావశుద్ధితో బ్రాహ్మణ భుక్తము బహుగా జేసితివనియు॥ ౫౫౯.

ఇదియును గాకయు నవామికునకు నిడితివన్న మొక రాత్రిన్।
కుదురుగ సుకృతముల్ రెండును నీయెడ కూడియున్నవి ధాత్రిన్॥

ఈసుకృతంబుల నొక్కటి నాకును నిచ్చిన యెడలను మరియు।
వాసిగ జన్మము నుద్ధరింపబడు వచ్చును నీకును కీర్తియు॥ ౫౬౧.

[illegible] చేకుడు యిష్టానిష్టము లెరుగను నే నిభువిని।
[illegible] చెప్పున నీవె కోరుము వేగమిత్తు సత్యమని॥ ౫౬౨.

[illegible]బట్ట బ్రహ్మరక్షసుడు నవామికుని రక్షించెన్।
ఈతరి సాధింప బడు పుణ్యము నిమ్మని తగ నడుగుటచేన్॥ ౫౬౩.

[illegible] నుదకము దుకొని నయపుణ్యము నర్పించెన్।
పాదుగ నుదకము రాక్షసు కరమున బడగనె యూర్ధ్వము లేచెన్॥

నిందలు జేసిన నరులందరుమరి నేలను వేసిరి తలలన్।
కొందరు భక్తులు కొనియాడిరిమది గురి నేకుని చరితములన్॥

---

భక్తులు కొందరు భాగవతార్థము బైలు పరచు నొకకృతిని।
[illegible] నగను నేకుడు చనువుతోడ తానువిని॥ ౫౬౬.

[illegible] సెమరాటిన్।
[illegible] ధాటిన్॥

[illegible] దాచదు వ్రచును।
[illegible]

మణికర్ణికలో స్నానము జేసియు మాధవ నామము జెపుచు।
వెనగొని ద్వాదశ పుండ్రంబులదా ప్రియముతోడ బెట్టుకొనుచు॥
భాగవతంబును పారాయణముగ పఠియింపగ తగనచట౯।
వేగమె వచ్చిరి యిద్దరుమహాంతులు విద్యార్థులు తగుచోట౯॥ ౬౦౦.
గ్రంథంబేమని యాతనినడుగగ గారవమున ద్విజుడనియె౯।
మంథరభరు కథ భాగవతంబిది మహాపురాణం బనియె౯॥ ౬౦౧.
ఇదివిని వారలు నేగిరి *తమితో నిల తమ గురునికడకును।
విదిత పరచిరటు భాగవతార్థము వినిన రీతి నంతయును॥ ౬౦౨.
భాగవతంబును ప్రాకృత భాషను పదటీకా జేసినను।
నాగరికమై సంస్కృతగ్రంథము నరుల్ చదువరన, గురుడును॥
జూచిపలికెనటు శిష్యాహంకారుండగు చూడుమందుచే నతని।
సూచన జేసియు తోకొనిరమ్మని చొప్పననె వారిగని॥ ౬౦౪.
వేగమెవెళ్లుచు శిష్యవర్గములు విప్రుదెచ్చి విడువగను।
సాగిల బడుచును దండము బెట్టెను సరగున నావిప్రుడును॥ ౬౦౫.
యతివరుడడిగెను నెవరీగ్రంథము నలర జేసిరనగాను।
హితుడై జెప్పెను విప్రుడాతనికి నేకనాథుడీయిలను॥ ౬౦౬.
గురుకృపచేతను కలిగెనతనికిని గొప్పకవిత స్ఫూర్తియును।
పరుల హితముకై భాగవతార్థము ప్రకటించె మరాటిననుు॥ ౬౦౭.
అందున రెండధ్యాయంబులతగ నజ్ఞుడనగు నిటునేను।
పొందుగ వ్రాసియు పఠన జేయుచును బూనియుంటినియ్యెడను॥
ఇదివిని యతివరు డీతనిమీదను నేమితప్పులేదనియు।
కొదువగాక గ్రామాధికారికిని కోరిదెల్పియటు మరియు॥ ౬౦౯.
తగినశిక్ష నిటు లేకనాథునకు తలపడి చేయగవలయు।
వగవక యిట్టుల బల్కుచునప్పుడు వ్రాసెను పత్రము మరియు॥
విద్యార్థులతో వేగమెపొమ్మని విన్నవించె జాబులతో।
ప్రద్యోతంబుగ వారలు జేరిరి పైటనుపురమును జతతో॥ ౬౧౧.

*తమి – వలపు.

గ్రామాధికారి కొాక పత్రంబును కరమరుదుగ నిచ్చిరట౯।
నేమము తోడను ననేక విప్రులు నెనరునగూడిరి యచట౯॥ ౬౧౨.
తగని కర్మముల జేయగ నేకుడు ధర్మాధికారికిది వచ్చె౯।
నిగమార్థంబుల నెల్లజనులకును నెపము లేక తెలిపించె౯॥ ౬౧౩.
ధర్మాధికారియు జెప్పచునిట్టుల తద్విద్యార్థులకనియె౯।
మర్మములేకయు మీారలేకునితో మాటలాడుడని యనియె౯॥
వారలు వినియా యేకునింటికిని వచ్చిరి విప్రులతోను।
తీరుగ నేకుడు మర్యాదలతా దీర్చెను ముదమొందుచును॥ ౬౧౫.
యతిపతి వ్రాసిన పత్రమునిచ్చిరి యరయుచు నాథునకపుడు।
వితతిని నేకుడు సదాశివుడు నను విహితతరమ్మనె గనుడు॥ ౬౧౬.
ఉద్ధవునింగని సకల కార్యముల నున్నరీతి జరుపుమనె।
శ్రద్ధను పెద్దల సేవగలుగునని సరగ వెడలె నట్లుగనె॥ ౬౧౭.
కోపము తోడను విద్యార్థులునటు కోరిరాగ నయ్యెడను।
ప్రాపుగనేకుని చూపు మాత్రమున పరమశాంతి బొందగను॥
వెడలెను యేకుం డొంటరిగానె విశ్వనాథు సేవలకు।
తడవులేకనే విద్యార్థులతో నడచె కాశీపురమునకు॥ ౬౧౯.
విద్యార్థులుతగ వెళ్లుచు యతికడ వినయనతుల నొసగుచును।
విద్యావంతుం డేకునిమేమును వెంచేపించితి మిటను॥ ౬౨౦.
ఏమి యాజ్ఞయని యడుగగ యతియును నేకునినట వెలిగాను।
నేమము తోడను నుండజేయమని నెగడు భిక్షుకు వెనుకను॥ ౬౨౧.
విచారింతమని యతీపతి వెళ్ళెను వేగమె దాభిక్షుకును।
ప్రచయము లేకను నేకనాధుడును బసచేసెను వెలిగాను॥ ౬౨౨.
భిక్ష చేసి శ్రీపాదతీర్థుడును పెంపుగ వచ్చెను యటకు।
శిక్ష జేయమని జెప్పెనపుడు తన శిష్యుల త్రిశతంబులకు॥ ౬౨౩
ఏకుడు జేసిన యపరాధమునకు నిందరైదు దెబ్బలను।
జోకను నొకడొాక డుంచవలయును సూటిగ కోలగొానుచును॥

యతివరుడిచ్చిన యాజ్ఞప్రకారమె యందరు శిష్యులు నటను।
అతనిని గొట్టిన బ్రహ్మహత్యయును నగునని మదినెంచుచును॥
చింతించుచునట నేగిరి యేకుడు చేరియుండు నాస్థలము।
వింతగ నాతడు కృష్ణమూర్తివలె వెలిగె వారలకు సుమ్ము॥ ౬౨౬.
వందన మొసగుచు వారలుబలికిరి వచ్చితివి మమురక్షింపన్।
సుందర వదనుడ శ్రీశదయాళో సుఖరూపుండవు నొప్పన్॥ ౬౨౭.
యతియాజ్ఞకు సరియగునటు జేసిన యనర్థమగుగద యనియు।
మతినూహించుచు వారలుండగా యతితోనొక డిట్లనియు॥ ౬౨౮.
దేవర, యాజ్ఞను దప్పుచుశిష్యులు దీర్ఘదండముల నిడిరి।
కేవలమనుచిత మనగనుయతియును క్రియతో కృద్ధతమీరి॥ ౬౨౯.
మంత్రవశ్యముల నేర్చుకొనుచునిటు మహిజనులను మోహించు।
తంత్రంబిదినా యాశ్వాసంబును తగులనీయ దగదనుచు॥ ౬౩౦.
భాగవతార్థము ప్రాకృతమందును ప్రబలము జేసినవాని।
డాగిలిముఖమును చూడగూడదని వేగమె తెరవేయగని॥ ౬౩౧.
కొందరు శిష్యులు గురునకుజెప్పిరి గొప్పగనేకుని మహిమన్।
సందియమున యతి వశ్యతంత్రుడని చక్కనుండె తెర గరిమన్॥
ఏకనాథుడును యతివరు ముందర నేతెంచియు కూర్చుండెన్।
సాకల్యంబుగ తెరలోపలనే చక్కగ యతివరుడుండెన్॥ ౬౩౩.
వాదములోనే వరిష్ఠుడగుచుచు వసించెదను కాశిపురిన్।
వాదము చేయక నిను శిక్షించెద వరసగ గన్నదగును పురిన్॥ ౬౩౪.
అభిమానముతో గూడిన వార్తల నాలకించి యేకుండు। [డు॥
సుభగుండగుచును శాంతియు దయయును సూటిగ కొనియనుచుం
స్వాములు మీరలు సర్వశ్రేష్ఠులు సరగ దండముల నిడుదు।
నేనుము తోడను నడచివచ్చితిని నేబది యామడలిందు॥ ౬౩౬.
ఆజ్ఞరీతిగను నిటు నేవచ్చితి ననాథ దీనుడనగుచు।
ప్రాజ్ఞులు మీరలు తెరనుతీసి యిటు భవ్యసేవ నిమ్మనుచు॥ ౬౩౭.

భావహీనుడను భక్తిహీనుడును పఠనలేదు శాస్త్రముల।
సేవకుడనునా యుపచారంబుల చెలగి క్షమింపు మియ్యెడల॥ ౬౩౯.
భాగవతేకాదశ స్కంధంబును పరగ జేసితి మరాటిఁ।
*ఆగడమగునటు విూహృదయంబున నగుపడి యుండినధాటిఁ॥
మణికర్ణికలో మునుంచ వచ్చునని మానుగ జెప్పగ యతియు।
గొణగుచు మెల్లన కోపమునాతడు నణచుకొనుచు నటుమరియు॥
మదనజనకు కృపకునుపాత్రుండై మరగిశివాడని యనుచు।
కుదురుగ తెరదా దీసి చూడగను గోవిందుం డగపడుచు॥ ౬౪౧.
భాగవతంబున ప్రేమ భావమున బాదరాయణి జెప్పినటు।
వేగమె శ్రీహరి కృష్ణుని రూపును వెలయగ జూచెనునతడు॥ ౬౪౨.
అనుతాపముతో యతియును లేచియు నప్పుడెనటు దండమిడెఁ।
వినతుండగుచును నేకుడు లేపుచు విప్రరూపుడై నిగుడెఁ॥ ౬౪౩.
జయజయశబ్దము జేయుచు యతియును సలుపగ నటు దండమును।
నయమున నేకుడు నారాయణయని నమ్రతనిడె దండమును॥ ౬౪౪.
యతివర నీకిది యనుచితముచును నతినైచ్యము తాబొందఁ।
కుతుకముతోడను విచ్చెను యతియును గురుగ్రంథము తనయొద్దఁ॥
ఒకశ్లోకంబున కర్థము జెప్పెను నొప్పగ నట నేకుడును।
అకలంకంబై యబాధితంబై యమరెననుచు జెప్పెడును॥ ౬౪౬.
గ్రంథము పూర్తిగ కొఱత లేకయును గావింపుండని జెప్పఁ।
సంధితమున నేకుడు గ్రంథంబును సలిపెను పూర్తిగ నొప్పఁ॥
ఆరుమాసములు నుండెను కాశిని నతిప్రీతిగ నిందుకని।
గారవంబుతో సన్న్యాసియు నటు కడు సాహిత్య మొసగగని॥ ౬౪౮.
భక్తుల కిమ్మతంబుగ నుండుటచె భావికజనములు గనుచు।
రక్తిగ వినుచును నానందించిరి రామ రసాయన మనుచు॥ ౬౪౯.
యతివరుడప్పుడు శ్లాఘ్యత జేయుచు నమితోత్సవ మొసగుటకు।
హితుడై ద్విజులను చేరబిలిచియును నెలమి జెప్పె వారలకు॥ ౬౫౦.

*ఆగడము - అపహాస్యము.

పండితులందరు కోపము నొందుచు ప్రాకృత భాగవతంబు।
నెందుగ మేమును నొప్పమెన్నడును మేలుగాదు సతతంబు॥౬౪౧.
మణికర్ణికలో ముంచుట గ్రంథము మాకును మేలగుగాను।
గణనను జెప్పెను యతియును వారికి కంజాక్షుని కళతోను॥౬౪౨.
గ్రంథము జేసెను నేకనాథుడును క్రమపూజలు సల్పుటచే।
మంధరధరు కృపమెలగును మీకును మహిని శుభము నందుటచే॥
పండితులందరు వంచన తోడను ప్రబల గ్రంథమును గొనుచు।
దండి గంగలో ముంచిరిదానిని దయయించుక లేకంచు॥ ౬౪౪.
ఉభయహస్తముల తోడను వెలుపల నొప్పగ గొనె గంగయును।
అభినవమగునటు మనుజులందరును నతి విస్మిత మొందగను॥ ౬౪౫.
జయజయశబ్దము చేయగ భక్తులు సరగున లేచెను యతియు।
నయమున దుముకుచు నీటనందుకొని నవ్యగ్రంథమును మరియు॥
పండితులెడదా నంచుచు జెప్పెను భాగీరథి గాపాడె।
పండరినాథుని భక్తుండేకుని ప్రబంధము శోధింపబడె॥ ౬౪౭.
అని జెప్పుచు నందరిని బిలుచుకొని యరిగెను యేకుని కడకు।
వినుతియు జేసెను నేకుడు వారికి వేపండితులందరకు॥ ౬౪౮.
బలికిరి వారలు భాగవతంబును భాగీరథి బడవేయ।
సలలిత గంగయు తనదు హస్తమున చక్కనెత్తి తగవెలయ॥
ఏనుగపై నెక్కించియు మిమ్మును నిల నూరేగింతుమన।
మానుగ నేకుండ నుచితమిగియని మహిని తనకు వలవదన॥ ౬౫౦.
తిన్నగ సన్యాసియు పండితులును తిరసన్మాన మొందుమటన।
విన్నపింప గ్రంథంబున కేకుడు వేడుకొసగు మనెను నటన॥ ౬౫౧.
స్వాములు మీరల చరణ రజస్సుగ సంస్థితముగ నుండునను।
నేమము తోడను నెన్నడునాకీ నెళవు తగదని యనగను॥ ౬౫౨.
సాహిత్యంబుల సిద్ధపరచుకొని సలిపిరి యట నుత్సవము।
కాహళ ఘోషముల్ ఘనముగ జెలగగ కరిపైనిడి గ్రంథమ్ము॥౬౫౩.

మృదంగములతో శ్రీహరి నామము మేలుగనటు బాడుచును।
మదినుప్పొంగుచు కాశిని జుట్టిరి మనుజు లనేకులతోను॥ ౬౬౪.

సప్తదినంబులు జేసి యుత్సవము సరసాన్నంబు లిడుచును।
తృప్తిగ నందరు జేరిరి మఠమును దేవుబాడి రందరును॥ ౬౬౫.

గ్రంథపూజయును నెల్లరు గూడియు గారాబముతో జేయఁగ।
మంథరధరు గొనియాడుచు నేకుడు మరి హరికీర్తన జేయఁగ॥

ఆచ్చటి జనములు నతిమోదంబున హరిగుణ కీర్తన వినిరి।
సచ్చరితుండని సర్వజనంబులు సరగ నతని పొగడిరి॥ ౬౬౭.

ఏకనాథుని భాగవతంబును నెలమిని పండితులటను।
సాకల్యంబుగ ప్రతులనువ్రాసియు చదువుచుండి రయ్యెడను॥ ౬౬౮.

యతివరునొద్దను నాజ్ఞదీసికొని యాతడు చనె పైటనుకు।
హితపరుడగుచును దాసోపంతుయను నీశభక్తుని గనిబాగు॥

హరిశ్రీకృష్ణుని జయంతియందున నతనిబిలిచె పైటనుకు।
గురుతుగ జెప్పియు ననుజ్ఞగైకొని కోరినడచె గృహమునకు॥ ౬౭౦.

ఇంటికి రాగా ననేకభక్తులు నెదుర్కొనుట కేగిరటు।
జంటను శ్రీహరి నామము నుడువుచు చనిరి ముదముతోడనటు॥

గోకులాష్టమియు రాగా నుత్సవ కూటము బహు చేరెమును।
జోకను దాసోపంతును వచ్చెను నూటి శిబికె నెక్కుచును॥ ౬౭౨.

ద్వారమునందును దత్తాత్రేయుని తాగనుగొనుచు భయమున।
వారక నతనికి నమస్కరించుచు వచ్చెను నేకు గృహమున॥ ౬౭౩.

అతిమర్యాదల నేకుడు జేసెను నాసత్పురుషున కపుడు।
కుతుకముతో నుత్సవమును కాగా కోరివెళ్ళె తగనతడు॥ ౬౭౪.

---

ఒకదిన మేకుడు గౌతమిస్నానము నొసగజేసి తారాగఁగ।
ప్రకటంబుగనొక యవనుడు దారిని పైబడి తానుమియంగఁ॥

ఏకునియంగము పైనిబడంగా నెలమి తిరిగియు గంగకు।
జోకను నరుగియు స్నానము జేయుచు నూటివచ్చె గృహామునకు॥

క్రోధంబతనికి కొంచెము లేకయు గురుకరుణను తురకకయిన్।
వేధను నాతడు దుర్గతి జెందక విఠలహరి కావు పయిన్॥ ౬౭౭.

పండరినాథుని ప్రార్థనజేసియు ప్రసాదమును తాబూని।
నిండుప్రేమతో తురకగృహమునకు నెరినేకుడు రానుగని॥ ౬౭౮.

వినయము తోడను తానుదెచ్చిన విహిత ప్రసాదంబులను।
పనిబడి విస్తరనుంచి యందులో పదార్థముల నుంచగను॥ ౬౭౯.

అనుతాపముతో యవనుడు బలికెను నన్యాయము జేసితిని।
ఘనసున్మత్తుడ నీచుడ ఖలుడను గాన నుమ్మివేసితిని॥ ౬౮౦.

జేసిన తప్పును క్షమింపు మనుచును జేసెను నతి యాతనికి।
వాసిగ నేకుడు వానిలేపిమరి వరుసను జెప్పెనాతనికి॥ ౬౮౧.

దోషము నీకును తెలియకుండగా దూట్చుకొనెనని తలంచి।
శేషశయనుని ప్రసాదంబుననిటు చెరుపు దోషమని యెంచి॥ ౬౮౨.

అన్నము దెచ్చితి ననుతాపంబును నమరియుండె నినుజూచి।
పన్నగ నీకును పాపముబోవును ప్రసాదమును తినుమించి॥ ౬౮౩

అనుచును జెప్పుచు నేకుడు వెళ్ళెను ననువుగ తనగృహమునకు।
నెనరున నాతని పౌరసమూహము నింద్య వచనముల బలుకు॥

---

ఒకదినమేకుడు గంగకుచనియెను నొంటరి మధ్యాహ్నమున।
అకలంకంబుగ సంధ్యవార్చుకొని యతడువెళ్ళె మార్గమున॥

వైశాఖంబున యుష్ణాధిక్యము వర్ధకమై తగనుండెన్।
*కైశికమలరగ నటనొకబాలుడు గట్టిగ నేడ్చుచునుండెన్॥ ౬౮౬.

చిత్తద్రవమున నేకనాథుడును శిశువునెత్తికొని నడచెన్।
ఉత్తరీయమున శిశుకన్నీరును నుపచారముతో తుడిచెన్॥ ౬౮౭.

---

*కైశికము - వెంట్రుకల సముదాయము.

గృహమెక్కడయని యడుగగ బాలుడు క్రియను చేయిజూపగను।
బహుప్రేమను గొని పోయెను నేకుడు బాలుడు చూపురీతిగను॥
దారి నాశిశువు తల్లియురాగా తనయుని నటక్రిందనిడెన్।
ప్పారి వచ్చి తనబాలు నెత్తికొని భక్తునకును దండమిడెన్॥ ౧౮౯.
మాదిగెదగుటచే మరియును గంగకు మరలివెళ్ళి యేకుడును।
పాదుగ స్నానము జేసియు తడితో బసకు వచ్చె తానటను॥ ౧౯౦.
విదితము గాకుండెను నీసంగతి విప్రవరులకయ్యెడను।
పదపడి శ్రీహరి పాండురంగడును బైలుపరచెనయ్యెడను॥ ౧౯౧.
త్రియంబకంబున వసించియుండెను ద్విజవరుడట నొక్కండు।
భయంకరంబగు పెద్దవ్యాధిచే బహు బాధల బడుచుండు॥ ౧౯౨.
చంద్రమౌళికిని చిరతర తపమును సలుపజేసె విరలుండు।
ఇంద్ర వినతుడగు సాంబమూర్తియును నింపొందియు నొకనాడు॥
కలలోబోవగ బ్రాహ్మణుండుగని కనికరమున నుతియించెన్।
ఫలితుడు హరుడనె నేకనాథుడను బాపడుపైటను నిలిచెన్॥
భక్తిపూర్ణుడై యుండియు నొకయెడ బాలుడొకడు నదికడను।
రిక్తుడు మాదిగె కులజుండౌడను రేవున తపింపగాను॥ ౧౯౫.
వటి యిసుకలో నల్లాడంగను నేకుడతని నెత్తుకొని।
సూటిగ బాలుని జేర్చెతల్లితో సుకృతమనియు దలచుకొని॥ ౧౯౬.
అట్టిపుణ్యమును నీకతడిచ్చిన నారోగ్యము నొందెదవు।
గట్టిగ నీవును బోవుమచ్చటికి ఘనపుణ్యము బొందెదవు॥ ౧౯౭.
అనుచు జెప్పగను ద్విజుడు మేలుకొని యాశ్చర్యంబును బొంది।
పనిబడి ప్రొద్దున పైలుజేరియును పైటనుపురమును జెంది॥ ౧౯౮.
ఏకునిగృహం బడుగగనాతం డేటికరిగెనని జెప్పెన్।
వీకను వచ్చెను బ్రాహ్మణుడేటికి విప్రులు నేకుని జూపెన్॥ ౧౯౯.
నదిలోదిగి నాతనికడ నేగుచు నమ్రుడగుచు మొక్కుచును।
విదిత పరచెతన సంగతినంతయు విశ్వనాథు కృపతోను॥ ౨౦౦.

కలలో జెప్పిన వాక్యములన్నియు కరుణ నతడు విని యున్నిలన్।
సలలితముగనే పుట్టిన మొదలుగ సలిపిన సుకృతము లెల్లన్॥ ౨౦౧.
నియమముతో నేనిచ్చెదనీకై నెఱపుకోర్కె దీరగను।
నయముగ ద్విజుడనె సుకృతములన్నియు నాకును వలవదనియును॥
బాలుని బ్రోచిన పుణ్యము మాత్రమె బట్టెద తానని యనగన్।
మేలని బల్కుచు మహీసురులందరు మిగుల జూచుచుండంగన్॥
ఉదకపూర్వముగ దారబోసె నతడుచితంబుగ పుణ్యమును।
కుదురుగ విప్రుని కుష్ఠురోగమును గురుతులేకయే చనెను॥ ౨౦౪.

---

భగవద్భక్తులు నొకయెడ బ్రీతిని బలికిరిగని యేకునకు।
నిగమసార నీ భాగవతంబును నెనరున జెప్పుము మాకు॥ ౨౦౫.
ఇదివిని యేకుం డామోదించియు నిష్టముగను చెప్పుటకు।
కుదురుగ నారంభించగ నచ్చట కూడిరి జనులు వినుటకు॥ ౨౦౬.
గంగాభవాని పడుచు రూపమున కనికరముగ వినుటకును।
పొంగుగ భూషణ వస్త్రంబులతో పుణ్యశీలయు నరుగును॥ ౨౦౭.
సాధుని ముందర నామెయు కూర్చొని నారాయణు కథ వినుచు।
మాధవు చరితము మేలు మేలనియు మహా దానందముగనుచు॥ ౨౦౮.
భక్తిరహస్యంబగు సంగతివిన బాష్పములుకు కనులందు।
ముక్తికాంతవలె మోహము జేయును ముకుందు చరణములందు॥
చెడు గుణములతో కొందరు శ్రోతలు చెలగియుండి రయ్యెడను।
విడువక కన్నుల నామె మోముపై వెలయనుంచి వారలును॥ ౨౧౦.
వనిత యెవ్వరో యీగ్రామంబున వాసము జేచట ననుచును।
నెనరున కథయును చాలింపంగను నెలత తోడ చనగాను॥ ౨౧౧.
గంగాభవాని యువతి వేషమున గౌతమి నది దూరగను।
సంగము గాకను గట్టున నుండిరి సతికొఱకై వారలును॥ ౨౧౨.

మరలి వచ్చుటయు లేకుండంగని మానిని గంగయె యనుచు।
సరగున వారలు చనిరి యిండ్లకును గురి ననుతాపము గొనుచు॥
మరుదివసంబున నేకుని కథకును మానిని రాకుండగను।
వెరువక యేకుం డితరుల గనుగొని వెలదియేల రాదనెను॥ ౨౧౪.
వికల్పచిత్తులు నేకుని ముందర వేంచేసిరి తగులుగను।
ప్రకటిత పాపులు తామటుజేసిన పనిని దెలిపితగనటను॥ ౨౧౫.
నమస్కరించగ నాథుడు జెప్పెను నారాయణు కృపచేతన్।
విమల గంగయును దర్శనమిచ్చుట వేడుకయ్యె మీచెంతన్॥౨౧౬.
దురితములెల్లను తొలగెను మీకును దొరకొని శ్రీహరిభజన।
గరిమెను జేయుడీ కమలనాభుడును కరుణ జేయుమీపైన॥
సంశయ చిత్తులు గాకను మీరలు శ్రవణము చేయుండికను।
భ్రంశ మొందకను పదవి జెందెదరు భక్తిగుణము లందుచును॥
వారలకిట్టుల వాక్యము జెప్పియు వరుసను భాగవతంబు।
సారతరంబుగ నర్థముజెప్పగ జనులును వినిరి దినంబు॥ ౨౧౯.

---

ఏకనాథుని యింటికిని ప్రక్కను నెలమిద్విజుం డొకడుండెన్।
ప్రాకటముగదా ప్రక్కనుండినను భావశుద్ధి లేకుండెన్॥ ౨౨౦.
నాథుని గృహమున కెన్నడుంబోవడు నరహరికథ వినడతడు।
బాధకమగునని గౌతమిస్నానము పదపడి చేయం డెపుడు॥ ౨౨౧.
సంధ్య జపంబుల చేయ డెన్నడును సలుపుకుటుంబ పోషణము।
నింద్యుండయ్యును నేకుడు కరుణచె నెనరున తానొకదినము॥౨౨౨.
వీధిని వెళ్ళగ నాతడు గలిసెను వినతుండై యేకుడును।
సాధుమార్గమున వందన పరుడై సరగనడిగె తానటను॥ ౨౨౩.
కొడుకులు కూతురు గలరే యనుచును కుటుంబ రక్షణ మెట్లనగన్।
పుడమి దేవుడును బలికె నేకునకు పుత్రి కూతురు లుండంగన్॥

వణిజుని యడనే నుందుచాకిరికి వాడును సంబళమిచ్చు।
ఘన సంసారమునీ క్రమమున నిటు గడుపుచుందు నేనెచ్చు॥ ౭౨౫.
నాథుండప్పుడు బలికె నతనితో నచ్చియడిగెద నొకటనగ।
వేధనునాతడు భయమున నేమియు వేరుబలుక కుండంగ॥
విహితుడై యేకుడు హానితో బలికె విత్తమేమి నేనడుగ।
సహజముగా హరికీర్తన వినుటకు సావధానమున బాగ॥ ౭౨౬.
కొంత విరామము గలుగజేసికొని కోరి కథకు రమ్మనగ।
పంతముతో నా ద్విజుడును బలికెను పరగ ప్రొద్దు లేదనగ॥ ౭౨౭.
సహస్రనామ శ్లోకంబులలో చక్కగ జెప్పెద నొకటి।
విహితముతో నే వ్రాసియిత్తునని వెంట వ్రాసె చేబట్టి॥ ౭౨౮.
అతనికినిచ్చుచు తనదు చేతితో నతని మేను తుడువగను।
పదపడియతనికి బుద్ధితిరిగియును పఠనచేసె శ్లోకమును॥ ౭౩౦.
మరుదినమందును మరియొకశ్లోకము మహీసురు డిమ్మనగాను।
వెరవక నేకుడు వ్రాసియు నిచ్చెను విదితంబుగ శ్లోకమును॥ ౭౩౧.
కొన్ని దినంబులు గడవగ పూర్తిగ కోరి చదివె శ్లోకములన్।
పన్నుగ పిదపను భగవంతునిపై భక్తిజనించెను మెల్లన్॥ ౭౩౨.
ప్రాతఃకాలము స్నానముజేసియు పఠించునామము నతడు।
పాదుగ వచ్చును నేకుని కడకును పాదములకు దండమిడు॥
వెనకను బోవును వ్యవహారమునకు విశేష వార్తలు లేకన్।
కనికరముగనిటు కాలము జరపగ కాలుడు వచ్చెను జోకన్॥ ౭౩౪.
అంతిమ దశలో మాటలాడకను నతివిస్మృతియును నొందెన్।
బంధువులందరు ప్రాయశ్చిత్తము వగ చేయుట కిరవొందన్॥ ౭౩౫.
సహస్రనామము జెప్పద్విడంగెను సాధ్యంబుగ నాద్విజుడు।
ప్రహర్షులగుచును విష్ణుదూతలటు ప్రకటన మయ్యిరి గనుడు॥ ౭౩౬.
సన్మానముతో శ్రీహరి దూతలు సరిజేర్చిరి పరగతికి।
ఉన్ముఖులై ప్రజ బొగడిరిగురునిది యుపకృతి యనియింతటికి॥ ౭౩౭.

ఏకనాథునకు పుత్రుండొక్కఁడు యిరు కూతులు గలిగుండఁగ।
దాఁగొని పుత్రికలిచ్చెనతండును తత్సమీప యూరండఁగ॥ ౭౩౮.
హరియను పుత్రుడు పండితఘనుఁడై యవనిని వెలయుచునుండెఁగ।
గురుతుగ సంస్కృత గ్రంథములందును గుణగ్రాహియైయుండెఁగ॥
ఆరు శాస్త్రముల నైపుణ్యంబును నతనికి బహుగ గలిగుండు।
నేరప్రజ్ఞుడని బలుకుచునుండిరి ద్విజులు కొందరచటుండు॥ ౭౪౦.
పితృ కృతములగు ప్రాకృతగ్రంథముల్ పెంపు జేయకుండుచును।
పుత్రుడు తండ్రిని పరాన్నవర్జన పొందు వలదని యనగను॥ ౭౪౧.
ఏకనాథుం డామోదింపమి నెలమి నతనికొమరుండు।
వీకవేగ దా కాశీపురికిని విహిత తండ్రిగనుచుండు॥ ౭౪౨.
హరిపండితునకు పుత్రులు ముప్పురు నందున మూడవవాడుఁగ।
తీరముగ తాతకు తగిన పనులను తలచుగ జేయుచునుండుఁగ॥
వాని నింటిలో వదలియు భార్యతో వారణాశికిని వెళ్ళెఁగ।
మానుగ కాశిని యనేక పండితుల్ మరిగిరతని కయ్యెడలఁగ॥౭౪౪.
ఏకుడు మనమని నింటనిడుకొనుచు నీశుభక్తి పొందించఁగ।
గ్రాకటముగతా గోబాయని పౌత్రుని నామమునుంచఁగ॥ ౭౪౫.
పదువుశాస్త్రముల చక్కనేర్పియు సత్సేవల నుంచుకొనఁగ।
వెదరక యేకుడు పౌత్రునితలపై చెయిబెట్టెను నెయ్యమునఁగ॥
జ్ఞానభక్తులును గలిగిన పిమ్మట ఘనవైరాగ్యము నొందెఁగ।
మూనుగ నచ్చటి జనులందరు మరి మహిత ముదము చెలువొందఁగ॥
మనలో నేకుడు తలచెను పిదపను తనయుడు కాశీపురిని।
[illegible] కర్మల చేయుటయుండె భ్రమగొని తానుండునని॥ ౭౪౮.
[illegible]యాని సుతు దెచ్చి యింటిలో తానుమేను విడుచుటయె।
[illegible] నుచును కాశికి బోవుచు సుతుని యింటికిని చనియె॥
పుత్రు డచ్చట తండ్రిని చూడగ పొందుగ సన్మానించెఁగ।
[illegible] లుగ మేలు ప్రేమ [illegible]॥ ౭౫౦.

భోజనాదులను బెట్టి యతనికిని పొంపుపరచి యటనునిచెఁ।
ఓజను చేరెను ప్రజల కూటమియు నొసగ నేకు సేవించఁ॥ ౭౫౧.
మఠమందుండిన మహాంతు యతియును మర్యాదను శిష్యులతో।
కఠినుడుగాకను యేకనాథునిం గనుటకు వచ్చెనుదయతో॥ ౭౫౨.
వచ్చినవార్లకు నేకనాథుడును వరుసనుంచె దండముల।
సచ్చరితుండై క్షేమ పలుకులను సరగ జెప్పె నయ్యెడల॥ ౭౫౩.
కొన్నిదినంబులు నటుదా గడుపుచు కొడుకునిగని యొకదినము।
ఎన్నికగా నా యాయువుచెల్లెను నిలనుండను బహుదినము॥ ౭౫౪.
ఇంటికి వచ్చుట నీకుయుక్తమన నింపుగ సుతుడును జెప్పు।
అంటకయుండుము ప్రాకృతగ్రంథము లవని విడుపరాన్నంబు॥ ౭౫౫.
ఇట్టులనుండిన వచ్చెద ననగను నేకుడు నామోదించు।
దిట్టతరంబగు శ్రీహరి భక్తిచే దేవునిపై భరముంచు॥ ౭౫౬.
హరిపండితుడును నిద్దరకొడుకుల నచ్చట నేనుంచుచును।
పురమగు పైటను బోవుటకునుదా బూనె తండ్రితోడుగను॥
సుకముగ నందరు చేరగ నింటను సుజనులు ముదమొందిరటు।
అకలంకంబగు హరికథ వినుటకు నరసి హేతునుంచిరటు॥ ౭౫౭.
అంగణమందును ప్రజలు గూడుకొని హరికథ వినవచ్చినను।
పొంగుచు హరిపండితు సంస్కృత పురాణముల నయ్యెడను॥ ౭౫౮.
జెప్పగ నేకుడు వినుచుండెను జనుల్ జెందకుండిరి రుచియుఁ।
తప్పక నిత్యము పురాణ శ్లోకముల్ తనయుం డర్థముజేయుఁ॥ ౭౬౦.
శ్రవణము చేసెటి జనులును తగ్గిరి చనువులేక యేకుడును।
వివరంబుగనే భగవద్భక్తియు వెలితి యయ్యెననుచును॥ ౭౬౧.
ఊరకుండగను నాయూరందును నొకధనికుడు ద్విజుడుండెఁ।
కోరియు సుతులును లేకనతని సతి గొప్పచింత కలిగుండెఁ॥
సంతానమునే నొందితి నేనియు సహస్రద్విజుల తినుపింతుఁ।
పంతముతోనిటు ప్రార్థన జేయగ పాండురంగ డిచ్చెసుతుఁ॥ ౭౬౩.

పిదపనామెకును పెనిమిటి చావగ పేదరికము వచ్చుటయు।
ముదిమియు నామెకు చేరెను వెనకను మోహమమత హెచ్చుగయ్యె॥
చేతికష్టమున నీరు మోయుచును చెలగిపెంచె తనకొడుకున్।
పాడుగ వ్యసనము నొందుచునుండును ప్రార్థన చెల్లించుటకున్॥
వీలుగాక నటు గడిపెనుకాలము విహిత ద్రవ్యము లేకుండన్।
పాలుమారకను పెద్దలనడుగగ బలికిరి వారచటుండన్॥ ౨౧౬.
వసుధను పామర శతద్విజులకును వైదికి యొకద్విజు శ్రేష్ఠుడుగు।
కుసిగల శతవైదికుల కన్నను గొప్ప నొక పండితుడగు॥ ౨౧౭.
పండిత జ్ఞానులు నూటికన్నను పరుడగునొక యనుష్ఠాత।
నిండుగ వీరల నూటికి పెద్దగు నెరి శమ దమ నిర్ణీత॥ ౨౧౮.
వీరి శతంబున కొకహరిభక్తుడు వీలుగ నధికంబగును।
నేరుగ నతనికి శాంతిగుణంబులు నిండియుండు మేలుగను॥ ౨౧౯.
శత్రులు మిత్రులు సమమని దలచును సర్వము హరియని గనును।
పుత్రుని ప్రార్థన చెల్లింపగదగు భోజన మతనికిడినను॥ ౨౨౦.
అట్టిపురుషుడిటు నేకుండగునని నచటి వారలనగాను।
బెట్టిదముగనే పరమమోదమును పెంపుజేసి యామెయును॥ ౨౨౧.
సంకట మొందక సాహిత్యంబును చక్కపరచి దావెనకన్।
పొంకము తోడను నేకునిగృహమును పోయెను నామెయు వేగన్॥
ఏకాంతముగని యేకునిగాంచుచు నెలమిబిలిచె భక్తుణకు।
సాకాంతను తనప్రార్థన విషయపుసంగతి దెలిపెనుబాగు॥ ౨౨౩.
సహస్ర విప్రులు చేయు భోజనము సౌకర్యంబుగ మీరు।
సహిష్ణులగుచును భక్షించిన యెడ సరిప్రార్థన నెరవేరు॥ ౨౨౪.
ఏకుడువీని తన పుత్రునడుగుమన నేగెనామె యతనికడన్।
ఆకర్షింపుచును జెప్పెను హరితో నామె సంగతిని నిగుడన్॥ ౨౨౫.
హరిపండితుడా సంగతి వినికొని యతిక్రోధముతో నుడివె।
నెజ నేర్చుచునా తండ్రి యాత్రలను నెట్టె పరాన్నము నువ్వే॥

ఏకుడు రాడని యామెకు జెప్పగ నెంతో దుఃఖ మొందుచును।
ఏకను తిరిగియు నేకనాథు నేడ వేంచేసియు జెప్పెమును॥ ౭౭౭.
హరిపండితుడును నామోదించడు యరయగ నెటు లౌననగా।
కరుణను నేకుడు పుత్రుని వద్దకు గరిమెను వెళ్ళెను వేగా॥ ౭౭౮.
ఏమని కొమరుడు యిష్టమునడుగగ నేకుండార్తిని బలుకు।
నేమముతో నాముద్దియ మునివియు నెనరున సఫలంబగుటకు॥
ఆరగించుటయు సుకృతంబగు నది యామెకు ప్రియమని జెప్ప।
వారణాశినీ విచ్చిన వాక్కున వచ్చితినిటకని సుతు జెప్ప॥ ౭౮౦.
నాథుడు బల్కెను నీవేవంటను నాతి యింట జేసినను।
పాదుగ మనమటు వెళ్ళి యిరువురును భక్షింతుము కొరగాను॥
సుతుడును నందుకు సమ్మతింపగను సూటిగవచ్చియు తనచోట।
హితవున బ్రాహ్మణి బిలిచియు జెప్పెను నిరవొందగ సుతుమాట॥
అందుకు బలికెను నామెయు నధిరస యప్పళంబులను మునుపె।
పొందుగ జేసితి భక్షణకవియును పొసగ బెట్టుటకు నొప్పె॥ ౭౮౩.
ఏకనాథుం డామెనుగని బలికెను నిరువురు తినగూర్చుండగా।
ఏకను నీవును వడ్డన చేయుము విహితంబగునని యనుటా॥ ౭౮౪.
అతి మోదముతో నింటికి వెళ్ళెను నా బ్రాహ్మణి గృహమందు।
పదపడి సకల పదార్థములదా పదిలపరచుకొని ముందు॥ ౭౮౫.
మరుదినమందును నేకునింటికిని మరవక వచ్చియు హరిని।
వెరపున బిలిచికొనేగె నింటికిని వెలయజూపె సామగ్రిని॥
స్నానము జేసియు వంటను వండెను చక్కగ హరిపండితుడు।
మానుగ నేకుడు పిలువక ముందె మానినియిలు చనుచుండు॥ ౭౮౭.
ఉదకంబిచ్చెను బ్రాహ్మణి యప్పుడె యుచిత స్నానము జేసి।
కుదురుగ నేకుడు నిత్యనేమముల కోరి జేసి యటు వెలసి॥ ౭౮౮.
వైశ్వదేవులకు హరిపండితుడును వరుస జేసె పూజలను।
ఈశ్వర ప్రీతిని నాతండప్పుడు నిరు విస్తరలుంచుచును॥ ౭౮౯.

అన్నము కూరలు నితర పదార్థము లనువుగ నేతిని వడ్డించన్।
పన్నుగ నేకుడు బ్రాహ్మణి నచటికి స్వాదుగ రమ్మనె వరుసన్॥౭౯౦.
సంకల్పంబును జెప్పిన పిదపను జనార్దనుడు భోక్తయని।
పొంకముతోడను బ్రాహ్మణి చేతిని పోయించెను నుదకమని॥౭౯౧.
పిమ్మట గూర్చుండుచు తానటను బ్రియరంగని ధ్యానించి।
సొమ్మసిల్లగను నైవేద్యంబును నూటిగ నటుచూపించి॥ ౭౯౨.
ఆపోశనమును హస్తమునందును నందుకొనియుదా వెనకన్।
ప్రాపుగ తండ్రియు తనయుడుగూడియు భక్షింపుచు నుండంగన్॥
ఒనరగ బ్రాహ్మణి భక్ష్యభోజ్యముల నొప్పుగ నట వడ్డించె।
కనికరమొందక సుతుడు కోపమున కరకరయనె దంతముచె॥
ఏకనాథుడును భోజనమంతయు నిష్టముతోడను భక్షించు।
ప్రాకటముగ నా బ్రాహ్మణిబలికెను బహుకృప జూపితివనుచు॥౭౯౪.
మనోరథంబును పూర్తిజేసితివి మనసానందము నొందన్।
అనాథనాథా భాగవతోత్తమ యరసి తీర్చితివి కొరతన్॥ ౭౯౬.
హరిపండితుడును నట్టివేళలో నణచుకొనెను కోపమును।
గురుతుగ భక్షణ జేసిన పిదపను కొడుకునకనె దండ్రియును॥౭౯౭.
ఎంగిలి యాకుల తీసివేయుమన నెత్తెనువాటిని హరియు।
నింగుచునప్పుడు తండ్రివిస్తరను నెనరున నెత్తగమరియు॥ ౭౯౮.
వేరొక విస్తర యుండగ క్రిందుగ వీలుగ దానిందీసెన్।
మారువిస్తరయు నటనుండంగని మానుగ దానిం దీసెన్॥ ౭౯౯.
ఒకవిస్తరి క్రిందొకవిస్తరిదా నుండజూచె నటువెయ్యిన్।
అకలంకంబని హరిపండితునకు నాశ్చర్యంబది యయ్యెన్॥ ౮౦౦.
చేతులగడిగియు యేకనాథనే జేసెద దండంబిపుడు।
సాధన లెరుగక మహాదపచారము సలిపితి బహుగానపుడు॥ ౮౦౧.
పరమభక్తియును బ్రహ్మజ్ఞానము బాగుగనొందిన నీకు।
అరమరలేకను నట్టిజేసితిని యపమర్యాదలు పెక్కు॥ ౮౦౨.

హరి యంశజుఁడవై యవని బ్రసిద్ధత నమరినవాఁడవు నీవు।
షడ్రసాన్నభోజన ప్రాకృత గ్రంథము బట్టవచ్చునిక నీవు॥ ౯౭౩.
కరుణనుంచి నను కటాక్షింపుమని కాళ్ళనతఁడు బడఁగాను।
బురిగొని యేకుఁడు లేపుచు నప్పుడు పుత్రుఁ గౌగిలించుచును॥ ౯౭౪.
తమలము తానటు గైకొని వెళ్ళెను తనయునితో తనయింట్లో।
క్రమమున వేసెను బ్రాహ్మణి యప్పుడు గంగలోన విస్తరలు॥ ౯౭౫.
విస్తరలంగని యూరుజనంబులు వినుకొని పొగడిరి యేకున్।
నిస్తరంగ సముద్రమున్నగతిగ నిలకడయ్యె నేకునకున్॥ ౯౭౬.

---

గోదాతీరపు గ్రామంబుననొక *కులకర్ణి ద్విజుఁడుండెన్।
సోదర సతియును బాలుర నేకుల సంతానము తగనుండెన్॥ ౯౭౭.
దరిద్ర దశచే తల్లడబడుచును దైన్యత తా గొనియుండెన్।
గురుతుగ సుతుఁగనె గావఁబ యేనుచును కులజులుగని పేరునిడెన్॥
మూగవాఁడునై పెరుగుచునుండగ ముదముతోడ తలిదండ్రుల్।
బాగుగ జేసిరి వ్రతబంధంబును పలుకఁడు హరినామంబుల్॥ ౯౭౮.
పాప కర్మమున పుట్టె పుత్రుఁడని బాపఁడు శోకము నొందెన్।
ఏపున నుత్తర కాలము బ్రతుకుట యెట్లగునని భ్రమజెందెన్॥ ౯౮౦.
సమారాధన మొకదినమందున సలిపెనింట విప్రులకున్।
ప్రమోదముగ దా భక్ష్యభోజ్యముల ప్రాపుజేసె వారలకు॥ ౯౮౧.
మూగబాలకుఁడు మరిమరి వాటిని ముఖ్యంబుగ తినుచుండెన్।
బాగుగ పొట్టయు నిండిన వెనుకను బసగొని యటు దానుండెన్॥
మరుదినమందును భక్ష్యములిమ్మని మాతనుగని తా వేడెన్।
గురుతుగ నుట్టిని బెట్టియునుంచిన కొండొకటిని చేతినిడెన్॥
మూఁడవ దినమున భక్ష్యముకై బాలుఁడు ముదమున దానిని వేఁగెన్।
నేడది లేదని తల్లియు జెప్పగ నేలబడేడ్వ దొడంగెన్॥ ౯౮౪.
అన్నముతినకను నతిరోదనమును నా బాలుండటు జేయు।
తిన్నగ తల్లియు తంత్రము జేయుచు తెచ్చెను రొటను పురియు॥

*కులకర్ణి — గ్రామకర్ణం

ఏకునివద్దకు బాలునితోడను నేగుదెంచి యాదినము।
జోకను నాతని చరణంబులకును చొప్పున నిడి వందనము॥ ౮౧౬.
పిల్లగాడు దండము బెట్టంగను ప్రీతిగ తల్లియు ననియెా।
ఉల్లమలర గైకొను నాపుత్రుని యొప్పుగ నీయెడ ననియెా॥౮౧౭.
నవవర్షంబుల బాలుండైనను నాలుకచే బలుకడిల।
వివరంబుగ తా భక్ష్యభోజ్యముల వీలుగోరు నియ్యెడల॥ ౮౧౮.
నీదు దయాళము నెరిగి నేనునిటు నెరి పుత్రుని దెచ్చితిని।
పాదుగ వీనిం బ్రోవుమటంచును పలుమారును వేడగని॥ ౮౧౯.
ఏకనాథుడును గిరిజాబాయిని యేర్పడ బిలిచియు నాడు।
వీకను బాలుని యుంచుచు నీవును విహితంబుగ గాపాడు॥ ౮౨౦.
పెనిమిటి యాజ్ఞను చేకొని యామెయు బెట్టెను యన్నంబపుడే।
కనుగొని బాలుని తల్లియు నప్పుడు ఘనముదమున గొనియాడే॥
గావజి తల్లియు నేకుని యాజ్ఞను గ్రామము చేరియు పతిని।
భావశుద్ధితో గని యేకునకును బాలుని నేనిచ్చితిని॥ ౮౨౨.
ఉత్తమమయ్యెను యుచితపుణ్యమున నొనరదొరికె నాయిల్లు।
చిత్తమురంజిల జేయుద మనుచును చెపుచుండెను యిల్లాలు॥
ఇచ్చట నేకుడు నాబాలకునకు నిచ్చెను తగు వస్త్రములు।
విచ్చల విడియా బాలుండచ్చట వీధులనాడుచు మరులు॥ ౮౨౪.
అపూర్వ యప్పము లధిరసాదులును నపుడప్పుడు దినుచుండు।
అపార సుఖమును బాలుడు పొందుచు నమ్మతంద్రుల గనకుండు॥
ఒకదినమేకుడు నరసిబాలకుని యొంటిగ పూజాగృహమున।
నికటంబు బిలిచియు రామాయనిదా నెరినామము జెప్పుమన॥
నోరు దెరచికను నాతండుండగ నోరు తెరువుమని యనుచు।
పేరు జెప్పుమ తన్నుంజూపియు పిన్న డేకనాథనుచు॥ ౮౨౭.
ఒప్పుగ జెప్పగ నేనామమునె యుపదేశముదా జేసె।
ఎప్పుడు దీనినె జపము సేయమని యిచ్చెను మాలనువేసె॥౮౨౮.

ఆటల విడిచెను నాదిన మొదలుగ నఖండ నామము బూనెఁ।
నోటను మరియొక పలుకును జెప్పడు నోటి రుచియు బోవగనెఁ॥
పలుకురాని యా బాలుని వృత్తిని పరులందరు జూచుచును।
తెలిసికొనిరి యేకునిమహిమయిదని, తలిదండ్రులు రాగాను॥
పిన్నడు వారల తెరవుకు బోకను ప్రియనామము నుడువగను।
ఉన్నత ముదమున వారును వెళ్ళిరి, యుచితకాల మేగగను॥౪౩౧.
ఒకదినమందున నేకనాథుడును యొసగి ధ్యానమందుండఁ।
ప్రకటమయ్యె శ్రీరామచంద్రుడును ప్రణుతిజేసె నేకుడటఁ॥ ౪౩౨.
ఓదయాళయని విపుల స్తోత్రము లొనరగ దాజేయగను।
పాడుగ బల్కెను రామచంద్రుడును ప్రాకృత గ్రంథముగాను॥
శ్రీరామాయణ సత్కథనంతయు శ్రీవాల్మీకి రచనవలెఁ।
పారవారమగు మహారాష్ట్రంబున ప్రకటింపను జేయవలెఁ॥ ౪౩౪.
ఆయుర్దాయము లేదని యేకుడు నరసియు నట జెప్పగను।
బాయక నీవును ప్రాతఃకర్మల ప్రబలంబుగ జేయకను॥ ౪౩౫.
సేమంబలరగ నాదు చరిత్రము జెప్పమనుచు దా దెలిపి।
ప్రేమంబగునీ ప్రాకృత వచనము ప్రీతియయ్యెనని జెప్పి॥ ౪౩౬.
అంతర్ధానము నొందగ రాముం డారంభించె నేకుడును।
గ్రంథము జెప్పుచు ప్రతి దినంబునను గానమున వినుపించుచును॥
శ్రీరఘునాథుని దివ్యచరిత్రను జెప్పెను కాండల నయిదు।
ధీరతరంబుగ యుద్ధకాండమును తేటగ జెప్పె త్రిపాదు॥ ౪౩౮.
చతుర్థ భాగము జెప్పునంతలో చనుకాలము దానెరిగి।
అతులితముగనే నచ్చటి వారిని యాలోచింప వారెరిగి॥ ౪౩౯.
వెనకటి దినముల కృష్ణదాసునటు వెళ్ళనియక నిలిపితివి।
ఎనిమిదియుమూడు దివసములాతని నిలనుండగ జేసితివి॥ ౪౪౦.
ఆవిధముననే గ్రంథసమాప్తిని యరమరలేక జేయమనఁ।
సవినయముగనటు జెప్పె నేకుడును సరసముగాదది గానఁ॥ ౪౪౧.

కాలుని వంచన జేసి గ్రంథమును గడుపుట సరిశాదికను।
మేలుగ గావజి పూర్తిగ జేసును మిగిలిన గ్రంథంబికను॥ ౨౮౨.
ఇటులనిజెప్పుచు నప్పుడు బిలిచెను ఇష్టంబున గావజినిఁ।
నిటలతటంబున నేకుడు కరముల నిలిపినతని చేతికినిఁ॥ ౨౮౩.
కలమును నిచ్చుచు వ్రాయమనుచుచా కాకితమొక్కటి నిచ్చెఁ।
తెలివిని నామడి తేట కవిత్వము తెలియగ వ్రాయుము నిచ్చెఁ॥
కటాక్ష వీక్షణ గలిగిన మాత్రమె గావజి వ్రాయ దొడంగెఁ।
నిటలము నందున విశాలబుద్ధియు నెనరు మించగను గలిగెఁ॥
ఒకయధ్యాయము వ్రాసెను గావజి యొప్పుగ నది వినుపించఁ।
సకల జనంబులు వినుకొని యప్పుడు చక్కనున్నదని మెచ్చెఁ॥
గావజి పిమ్మట యుద్ధాయుత్తర కాండల పూర్తిగ జేసెఁ।
భావశుద్ధితో బల్కిర నేకులు భళీభళీయని వెలసెఁ॥ ౨౮౭
పంచమి ఫాల్గున రాత్రి నేకుడును భక్తిని కీర్తన జరిపెఁ।
పంచె ప్రసాదము పురజనులకుమరి ప్రాభవ మొప్పగ జెప్పెఁ॥
ప్రయాణమయ్యే దినము రేపగును ప్రాతస్నానము జేసి।
ప్రియమున రమ్మనె ప్రజలనాతడును ప్రేమ భావమున గలసి॥ ౨౮౯.
ఇదివిని యందరు తెల్లవారగను నేగిరి యేకుని యిల్లుఁ।
మదిలో క్లేశము నొంద యేకుడును మానుగనట్టు మూర్ఛిల్లెఁ॥
కుటిలులు కొందరు గూడి జెప్పిరటు కొమరు మిగుల యేకుడును।
పటుతరముగనే బాధల బొందుచు ప్రాణంబును విడిచినను॥ ౨౯౧.
అందరివలెనే యీతండగు మరి యాధిక్యం బేమనుచు।
నందు బొందునను చెప్పదొడంగిరి సార్థిక్యము లేదనుచు॥ ౨౯౨
కొందరు సుగుణులు కూడియచ్చటను కొనియాడుచు తగ నేకుఁ।
అంధము తోడను యనంతలీలల నవని జూపితివి మాకుఁ॥ ౨౯౩.
పదుగురివలెనే ప్రాణము విడుచుట పనిబడునేయని జెప్పెఁ।
నిగురబోయి లేచినయటు లేకుడు నిక్షమేల్కొని తగనొప్పె॥ ౨౯౪

ఉద్ధవునింగని యుదకము దెమ్మని యుచిత స్నానము జేసెన్।
సిద్ధంబుగ శ్రీ తిరుమణ్ కాప్పును నేమంబుగ దావేసెన్॥ ౮౫౬.
ద్వాదశ పుండ్రము ధరించి పిదపను తారక మంత్రము జెప్పి।
పాడుగ శ్రీహరి పాండురంగయని బాడుచు పిదపను యొప్పి॥
తాళ వీణెలను చేతనందుకొని తగ్గె విఠలహరి యనుచు।
వేళనందరును నేగిరి గంగకు విశ్వేశ్వర హరియనుచు॥ ౮౫౭.
అడుగడుగున శ్రీయేకనాథుని నవని జనులు పూజించన్।
ఉడుగక తులసీమాల గంధపొడి యూర్జితముగ వేయించన్॥
గంగయొడ్డునకు కుదురుగజేరిరి గ్రామవాసు లేకుడును।
పొంగుగ నచ్చట కూర్చుండనుచును బురికొల్పెను నాతడును॥
హరి కీర్తనదా నారంభించెను నందరువిని ముదమొంద।
గురుతరముగనీ కలికాలంబున గోవిందుని తగబొంద॥ ౮౬౦.
నామముకన్నను వేరు సాధనను నడవదు యెరుగుమునిందు।
నేమము తోడను నెల్లభూతముల నిండుదయను యుంపొందు॥
లోక హితమునకు నేవచ్చితినిల లోనుండెడి చిత్తునునె।
శోకము వదలియు శ్రీహరి భజనను శుద్ధమదిని జేయుమనె॥ ౮౬౨.
ధర్మమార్గములు దప్పినపుడునీ ధరలోబుట్టెద గనుడు।
మర్మము యిది మీమనముల నుంచుచు మాధవు బాడుండెప్పుడు॥
సర్వభూతముల హరిభావనయె చక్కటి భక్తియునగును।
నిర్వహించుతగ నిట్టిభక్తులను నీరజనాభు డెప్పుడును॥ ౮౬౪.
శాంతియు దయయును చక్కనుండవలె సర్వభూతముల యెడ్డను।
దాంతినొందిమరి ధర్మపద్ధతిని దప్పవలవ దెయ్యెడను॥ ౮౬౫.
వేదము జెప్పిన విధియె దొడ్డది విరోధమెది లేకుండన్।
సాదరముండుడి జెప్పుటనిదియె సావధానముగ నుండన్॥ ౮౬౬.
విశ్వమంత గోవిందునిమయమని విఖ్యాతంబుగ నెరిగి।
నశ్వరమగునిల నింద్యభేదముల నయముగ లేకనెమరిగి॥ ౮౬౭.

సుకముండుండని జెప్పె నేకుడును సుస్థిరముగ నావేళ।
ప్రకటంబగునటు బాడిరి నామము పాండురంగ హరివిఠల॥౮౬౮.
హారతులిచ్చెను యేకుండప్పుడు హరికిని రుకుమాయికిని।
వారక హరియె జనార్ధనుండని వరసనిచ్చె నారతిని॥ ౮౬౯.
జయజనార్ధన జయజనార్ధన జానకిరమణ దయాళో।
నయముగ నీవే సర్వమునగుచును నానా భూతంబులలో॥ ౮౭౦.
భిన్నభిన్నమై తోఁచియు మరియు నభిన్నమగుదువు నీవుఁ।
ఉన్నతజ్యోతికి నుజ్వలజ్యోతివై యుందువు యెక్కడవీవుఁ॥౮౭౧.
చూడగ చూడగ చూచెటిదానినె చూచునటుల తగజేయుఁ।
వేడుకగానటు పూర్ణబోధమై వేరుగాకనెటు వెలయుఁ॥ ౮౭౨.
అభావ భావన మటులనెదోలంగె నభినవమగు నారతినిఁ।
సుభగుండేకుడు జెప్పుచునప్పుడు సూటిద్రిప్పె నారతినిఁ॥ ౮౭౩.
నేలనుబడుచును దండంబిడియెను నిఖిల జనంబులకపుడు।
తాళిమిజేసిన యపచారంబుల దయతో మన్నింపుండు॥ ౮౭౪.
అనుచును జెప్పుచు నట్టెలేచితా హరిగోవిందా యనుచు।
మనుజులనందర మాధవ నామము మానుగ జెప్పుండనుచు॥౮౭౫.
అందరప్పుడును హరినామంబును నార్తిని జెప్పదొడంగఁ।
పొందుగ నప్పుడు బోవుచుగంగలో బొడ్డులోతు నటురాగఁ॥
నిలుచుండుచుహరి నారాయణయని నేలవిడిచె దేహమును।
పలుమరు దివిజులు పుష్పవృష్టినిం బహుగురిపించిరి యటను॥౮౭౭.
దహన క్రియలను తప్పకజేసెను తండ్రికిని కొడుకపుడుఁ।
మహాశోకమున మనుజు లాపురిని మరలొందిరి తగియపుడుఁ॥
దహన స్థలమున తులసీ వృక్షము-ధరగనె నశ్వర్థముతో।
ఇహమున నవియును నిప్పటికున్నవి యిష్టఫలమునిడు గురితో॥
అశ్వర్థంబును తులసీ చెట్టును నమర్చి బృందావనమునను।
విశ్వమయుని కృప యాయశ్వర్థము వెలయు తులసి సమముగను॥

ఏకనాథు శ్రీపాదుకలచ్చట నెలమి యుంచిరయ్యెడను।
జోకను భక్తులు సేవించు చుమరి సుఖమును జెందెదరిలను॥ ౮౮౧.
ఏకనాథు శ్రీచరితమునంతయు నెవరైనను వినునెడల౯।
సాకల్యంబుగ దురితములన్నియు చను, నరకము జెందరిల౯॥
పండరినాథుడు తానైయుండియు పలుకజేసె తగనిదియు।
పండుగయగునది భక్తులచెవులకుపామరు నేనేమనియు॥ ౮౮౩.
బుధజనులందరి భక్తినిసలుపుచు భువిలో బెనగియునుండు।
పదపడి వారికి బాలకృష్ణుడును పాదసేవలోనుండు॥ ౮౮౪.

---

## సమర్థ రామదాసు చరిత్రము.

గోదావరి నది కైదుకోసులను గురుజాంబ క్షేత్రమున।
పాదుగ శ్రీహరి భక్తుండగుచును బొపదుండె నెయ్యమున॥ ౧.
నామము సూర్యాజిపంతని యందురు నాతియతనికి రాణువని।
సేమంబుగతా కులకర్ణీయునై శీలము దయ గీలుకొని॥ ౨.
మధ్యాహ్నంబున వచ్చిన వానికి మానుగ నన్నంబిడును।
సధ్యానుండై సూర్యోపాసన సలుపుచుండు దినమును॥ ౩.
ప్రాతస్స్నాతయై యర్ఘ్యముువిడిచియు ప్రాఙ్ముఖుడై భానునకు।
ప్రీతిని పూజల జేసియు దండముల్ పెంపుగనిడు దాపెక్కు॥ ౪.
ఈవిధమున పది రెండేండ్లును యిలను తపసు చేయగను।
సావయరూపుడై సూర్యుండప్పుడు సరగజూపె రూపమును॥ ౫.
అనేకవిధముల స్తోత్రముజేసియు నడిగె పుత్రు నిదానమును।
మనోరథంబున భార్యయునడిగెను మంచి పుత్రుడగుటయును॥ ౬.
కుపుత్రునొక్కని గాంచుటకన్నను గొడ్రాలే బాగనును।
చపలత యగునన జెప్పెనినుడు యిరు సత్పుత్రుల గందువను॥ ౭.
లోకికుండై యొక్కడుండునటు లక్ష్మినాథుపై నొకడు।
-ోకను భక్తుడై సహజదాస్యమును సూటిగ పొందియునుండు॥ ౮.

ఆదిత్యుండీ విధమున జెప్పియు నంతర్ధానము నొందెన్।
సాదరముగ కొంతకాలంబునకు సతియునచట చూలొందెన్॥ ౯.
పదినెలకాగనె పుత్రునిగనగను పతియును సంతోషించెన్।
నిదానముగనటు జాతము మొదలగు నెరికర్మల జేయించెన్॥ ౧౦.
సూర్యునికృపచే సకల సంపదలు సూటిగనటు గలిగుండెన్।
ఆర్యులు మెచ్చగ గంగాధరునకు నబ్బెను నైదవ యేడున్॥ ౧౧.
ఉపనయనంబును జేసిన వెనకను నొనరజేసి పెండ్లియును।
నెపము లేకతగు విద్యలనెల్లను నేర్పించిరి కొడుకునకు॥ ౧౨.
ఇంతలో సతీయు మరియొకచూలును నేర్పడ తగగాంచగను।
సంతస మొందగ సుఖముగగనెనొక సత్పుత్రుని పదినెలను॥ ౧౩.
బారసాలనటు జేసిన పిదపను బాగుగ నాదరుగూడి।
నారాయణయ్యని నామమునుంచిరి నయగుణములతో బొగడి॥ ౧౪.
సతియు పతికిగని జెప్పెనప్పుడును సంతోషము తగమెరయ।
మితియగు పుచ్ఛము శిశువునకున్నది మేలు జూడుమనెడాయ॥ ౧౫.
భాను వాక్యముల దలచుచునప్పుడు బాలు మారుతి యంశభవుడన్।
మానుగనిట్టుల బలుకుచు పతియును మహిదెలుపకు మనినేగున్॥
దినదినమునకును బాలుడు పెరుగుచు దివ్యతేజుడై యుండెన్। [డా
మనసున మోదము జనకుడుగొనుచును మహితయశముగను చుం
ఇంటను బాలుడు నుండకబహుళగా నెప్పుడు బైటనే యాడున్।
కొంటెతనంబున నెగురుచునుండును కోరి వృక్షముల గూడున్॥
పంచవయస్సున బాలుని విద్యకు పంతులుదగ్గర విడువన్।
అంచితముగనే యొకవత్సరమున నఖిలవిద్యలను నుడువన్॥ ౧౯.
ఏడవ యేటను నుపనయనంబును నేర్పడతగ జేయగను।
వేడుక లలరగ వేదాధ్యయనము విపులంబుగ చదివెమను॥ ౨౦.
పెద్దకొడుకగు గంగాధరుడును ప్రియరాముని గొలుచుచును।
సద్దులేకదా లౌకికంబును సలుపుచు నటనుండగను॥ ౨౧.

శ్రీరఘురాముడు సేవ జూపగను చెన్నుగ మోదము నొంది।
పరవశుడగుచును కన్నీరొలుకగ భావశుద్ధిని జెంది॥ ౨౨.
నిలుచుండగ నటు రాముడు బలికెను నెనరు కృపను దాగొనుచు।
ఇలలో రామా రామదాసవని యెలమి జెప్పి దాచనుచు॥ ౨౩.
కామరోషములు కరిగిపోయెనటు కరుణయు భూతములందు।
ప్రేమభావమును పొందంబడియెను ప్రీతియు రామునియందు ॥౨౪.
పరమార్థములో చిత్తమునుంచెను ప్రపంచమున దేహమిడి।
నిరసనజేసెను భవభయమంతయు నేను నీవను వ్యక్తసుడి॥
రామునికృపచే పారందోలెను రమ్యగుణంబులు వెలుగన్।
వేసారక శ్రీరామమయంబను విశ్వము నంతయువీక్షన్॥ ౨౬.
మరియొకబాలుడు చెట్లను ధుముకుచు బహుచేష్టల దా సేయన్।
గురిగొని తల్లియు చేరబిలిచి మరి కొంటెతనము వలదనియెన్॥
చదువు మరచితివి జూడ వెప్పుడును సంసారంబుననీవు।
కుదురు గుణంబుల గైకొని యెప్పుడు గూడుము సుజనులనీవు॥ ౨౮.
ఇదివిని బాలుడు చీకటి యరలో నేగుచునొక కుదురందు।
విదితుడు గాకను కూర్చుండగ నటు వెదకి తల్లి రోదనొందు॥ ౨౯.
సూర్యాజి వినుచును సుతుని వెదకుటకు సూటిగ మనుజులబనిచెన్।
ఆర్యుడు బాలుని యెటుయిటు గానక నలసి తల్లి తగనొచ్చెన్॥ ౩౦.
మరుదినమునదా ధాన్యముకొఱకై మానిని కుదు రెడరాగా।
వెఱపక నచ్చట బాలుంగనుగొని వేగమె నెత్తియుపైగా॥ ౩౧.
సలిపితి వేమన బాలుడు జెప్పెను సంసారికులనేను।
ఇలలో జూడ సహింపననుచును నింపుగ నటు జెప్పగను॥ ౩౨.
తల్లియు నవ్వుచు తండ్రికి జెప్పగ తదుపరి ముదమొందుచును।
పిల్లగాడిటుల పెద్దబెరిగినను పెనుజాణుడు తగనగును॥ ౩౩.
తనయుండడిగెను తల్లిని యప్పుడు తగుజాణత యేదనుచు।
వనితయు జెప్పెను విశేష ధాన్యముల్ వాసిగ సంపాదించు॥ ౩౪.

ఇంటికి దెచ్చిన నది జ్ఞానత్వము యెల్లజనులు జేతురను।
బంటుతనంబున వినుచు బోయెనొక బావిగట్టునుండుచును॥ ౩౫.
ధాన్యపుమూట యొకటటు బడియుండగ తలపై దాని గొనుచును।
మాన్యతనది నదు మోతకు మించగ మనుజులు వెనుదగులగను॥
బాలుడు దెచ్చిన బరువును గాంచుచు భ్రమను జెందిరటువారు।
వీలుగ మోతను గృహామునసుంచుచు వేగమె తల్లిని జేరు॥ ౩౬.
ధాన్యాంబరమును దెచ్చితిననగను దవిలి వచ్చి మనుజులును।
దైన్యము తోడను నడిగితీసికొని తర్లగ వారయ్యెడను॥ ౩౭.
మునుపటి వలెనే మూటయుంచెనటు మోదమలర తల్లిగని।
ఛనువున పతికిని జెప్పెను భార్యయు సత్పుత్రుండౌ నితని॥ ౩౮.
వివాహమిప్పుడె సలుపుట మేలని విచారించి బాలికను।
నవీనవస్త్రముల్ నిఖిల పదార్థముల్ నయముగ జేర్చియు నటను॥
సుముహూర్తంబున వధూ వరులను సూక్తిగ పీటలనునిచి।
క్షోమరొప్పగ నటు బ్రాహ్మణ జనులును కూడియుండ జేయించి॥
మంటప శాలను వాద్యఘోషములు మానుగనటు చెలగగను।
జంటను విప్రులు జెప్పిరి మంగళ జయశుభాష్టకములను॥ ౪౧.
వధూవరులకును మధ్యగా తెరను వాసిగనటు వేయుచును।
నిదానముగనే సావధానయని నెరిజెప్పిరి విప్రులును॥
ఉపాధ్యాయులను వరుడుజూచుచును నొనరగ నడిగెనునపుడు।
అపార శబ్దము సావధానయని యనుచు నెందుకో జెపుడు॥ ౪౪.
బావమరదులటు కొందరుండుచును బలికిరపుడు వరునకును।
సేవ నిబంధన సంకెళ్లును యిక జెందంబడును నీకును॥ ౪౫.
అందునగూర్పియు జాగ్రతనొందను నమరజెప్పి రిటుద్విజులు।
పొందుగ నిదివిని పెండ్లికుమారుడు పొందెను యనుతాపములు॥
శ్రీరఘురాముని యపుడె దలంచుచు చెలగి కాపుమనుచును।
వైరులనుచు నూహించెను తనలో వరుసను తలిదండ్రులను॥ ౪౬.

చెప్పక యెవరికి పరుగిడి యప్పుడు చేరెనడవి వేగమున।
అప్పుడె బంధువు లాతని వెంబడి యడుగిడి వెళ్ళిరిగాన॥ ౪౮.
తల్లియు తండ్రియు తనయుని గానక తల్లిరి యటువెదకుచును।
ప్రల్లదముగ బహుదుఃఖితులయ్యిరి బంధువర్గములు నటును॥ ౪౯.
తురగంబులపై సవార్లనంపిరి తోలుకొనియు రమ్మనుచు।
పరుసను వారలు మళ్ళివచ్చిరటు వరుడు దొరక లేదనుచు॥ ౫౦.
తల్లిదండ్రులటు తల్లడబడగను తనయుడు గంగాధరుడు।
మెల్లగ జెప్పెను మారుతి యంశుడు మెచ్చుడు సంసృతిగనుడు॥ ౫౧.
వివాహ యత్నము చేయకుండినను వెళ్లకుండు నడవికిని।
భవాబ్ధి నొందక గృహమును విడువక బట్టియుండు తేటగొని॥ ౫౨.
ఉద్ధరించు నతడనేక నరులను నుటు విక్రమ క్రియలెల్లన।
సిద్ధగురుండై చేయుచునుండును శిష్యులజేయు నెల్లెడలన॥ ౫౩.
ఆతని కొఱకై యవస్థబొందకు డనుచు నతడు జెప్పగను।
గతభయులగుచును తల్లియు దండ్రియు కనికర మొందిరి మున్ను॥
నారాయణుడపుడేగె నడవికిని నరులను గూడక వెలిగన।
తీరుగ పక్షియు నురి వెలపలదా తెగవిడి చనుక్రియనేగన॥ ౫౫.
చెడ్డమృగంబులు చేరియుండినను జెందడు భయమింతయును।
బొడ్డున తానొక మొలతాడును మరి బూనియు కౌపీనమును॥ ౫౬.
ప్రపంచ బుద్ధిని వదలుకొనుచుతా పరమార్థము గనుటకును।
నెపముతోడదా నారాయణయని నిట్టూర్పులు విడుచుచును॥ ౫౭.
మారుతిరాయుని మనమున దలచుచు మానక జేసెను స్తుతిని।
మీరగ జేసిన నాంజనేయుడును మేలు బలుక కుండగని॥ ౫౮.
దేహమునందలి యాశను వదలిన దేవుని గనదగుననియు।
సాహసముగ నటు చెట్టు తీగెలను సరగున తెంపుచు మరియు॥ ౫౯.
పాదములను గట్టియు వ్రేలాడెను పాదప శాఖను జూడన।
సాదరముగ హనుమంతుని దలచుచు సరగున రమ్మని వేడన॥ ౬౦.

శ్రీరాముడు నిజధామమేగ నిను జేసెను తనదాసుగను।
పారావార కృపాళ్లో భక్తుల పాలిటి సఖుడవు యిలను॥ ౬౧.
మారుతి రాయా మాతాపిత్రులు మహిని నీవె యని నేను।
కోరితి నీవిటు గురితో రానెడ కొట్టిచంపెదను ‡మేను॥ ౬౨.
అనుచును బహునుతులాతడు సేయగ నమరె కరుణ మారుతికిఁ।
దినకరు దీప్తిని తేజరిల్లుచును తెలియబడును భక్తునికిఁ॥ ౬౩.
కాలిని గట్టిన త్రీగెల విప్పుచు కౌగిలించుకొనె భక్తిఁ।
మేలుగ భక్తుని మారుతియప్పుడు మేనుదుడిచె యనురక్తిఁ॥ ౬౪.
ఆంజనేయుం డప్పుడు బలికెను నాయాసం బేలయని।
*సాంజలి హస్తుండై పంచవటీకిని సరగున నరుగుదముయని। ౬౫.
నాయంశంబున నీవుబుట్టితివి నయముగ రాముడు నీకు।
చేయంబూనును సకల హితంబులు సిద్ధదర్శనమగు మనకు॥ ౬౬.
చెప్పుచు నిట్టుల దారి నడచుచును జేరి పంచవటీ యెడను।
మెప్పుగనచ్చట భక్తులు భజనను మేలు బాడిరయ్యెడను॥ ౬౭.
సాయంకాలము జేరియుండిరట జనులు మిగుల తగనుండఁ।
నేయంబుగమరి నడిరాత్ర్యందున నిలవకుండిరి గుడియందఁ॥ ౬౮.
ఏకాంతముగని యిరువురు వెళ్ళిరి యింపుగ రాముని గుడియు।
జోకతోడ నటు శ్రీరఘురాముని సువ్యక్తంబుగ గనియు॥ ౬౯.
ధనసును బాణము నలంకారమును తగిన కిరీటము మెరయ।
దినకరుదీప్తిని తిరస్కరించునటు దివ్యకాంతియు వెలయ॥ ౭౦.
కటకము కంకణ పీతాంబరమును కౌస్తుభమాలయు వెలుగఁ।
కటిసూత్రంబును నూపురంబులును ఘల్లని తగ మ్రోయంగఁ॥ ౭౧.
శోభను గూడిన సుందరరూపును సూటిగ గని మారుతియు।
ప్రాభవ మొప్పగ పదములబడియెను ప్రాపుగ రాముడు గనియు॥
వెంబడి యొక్కని దెచ్చుచునిచ్చట వేంచేసిన దేమియన।
డంబముతో మారుతియనె నీతడు డాలుగ నాయంశమున॥ ౭౩.

---

*సాంజలి - చెయిపట్టుకొని. ‡మేను - శరీరము.

మేదిని బుట్టెను మీకృపజూపుము మేలుజేయ తగుదీవు।
సాదరముగనీ పదముల నాతడు చక్కమ్రొక్కె తగబ్రోవు॥ ౭౫.
భక్తుడు దేవుడు పలికిన పలుకులు బడియెను బాలుని చెవిని।
సక్తిగ రాముని స్వరూపమునుదా చక్షుల గానకుండగని॥ ౭౬.
ఇదియేమని యా బాలుడు మారుతి నెరి కారణమడుగగను।
సదయుడు శ్రీగురు చేతుల తలపై చక్కనిడని హేతువను॥ ౭౭.
రూపము దృష్టికి కనబడకుండును రుజువుగ నటుజెప్పుచును।
ఏపున రాముని గని మారుతియనె నెలమి నుపదేశించమను॥ ౭౮.
శ్రీరఘురాముడు చేతుల బాలుని శిరమున తగనుంచుచును।
తారకమంత్రము జెప్పగనప్పుడె తారకనాథుని గనెను॥ ౭౯.
ఆనందంబున నాతండుండగ నరసిగనుచు రాముడనె।
సానందుండై రామదాసుడని జనులు పొగడ నుండుమనె॥ ౮౦.
చేయుచు బహుగా శిష్యవర్గమును శ్రీకరమగు నామముచే।
బాయక వశ్యము చేయుమటంచును భక్తియందు నియమించె॥
మన్నింపంబడు వస్త్రంబొక్కటి మహినే తగనిచ్చెదను।
ఎన్నికతోనే నరణ్యమునకును నేగిన సమయంబునను॥ ౮౨.
బూనిన వస్త్రంబని బాలునకిడె పొసగు దీక్ష యిదియగును।
దీనింగైకొని హితము సలుపుమన దెలిపె రామదాసుడును॥ ౮౩.
నిన్నువిడిచినే బోవుట నెటులగు నీరజనాభా యనియు।
చెన్నుమీరనీ స్వరూపరూపముల్ జేరి వదలుటెట్లనియు॥ ౮౪.
సగుణరూపునకు సర్వసేవలను సలుపుట శిరవగు నాకు।
ప్రగుణంబుగనిను భక్తినిబాడుచు బాయకనుండుట బాగు॥ ౮౫.
దీనులబంధుడ వనునీబిరుదును తెలిపితివిటు నాయెడను।
నేనునీయెడను నుండుటసరియగు నెరయదోచు నామనము॥ ౮౬.
సీతాపతియును జెప్పెనపుడునే చెదరకుండు నీయెడను।
ప్రీతిని ధ్యానము సేయు సమయమున ప్రేమతోడ వచ్చెదను॥ ౮౭.

శ్రీరఘురాముడు జెప్పియున్నిట్లని శ్రీయాంజనేయు గనుచు।
వారక యాతని వాంఛితార్థముల వంచింపక యిమ్మనుచు॥ ౮౭.
జెప్పుచు రాముడు బంపగ వారలు చేరిరి టాకిలియూరు।
మెప్పుగ మారుతిరాముని చరితము మేలుగ జెప్పంగోరు॥ ౮౮.
హనుమంతుని శ్రీకావ్యంబనదగు నారామాయణమటను।
అనువుగ చదువుచు రేయిని దాసుడు నరసి జెప్ప జనులకును॥
కొన్నిదినములిటు గడిపిన పిదపను కూర్మిని హనుమంతుండున్।
సన్నుతులొందగ రామదాసుచె చనియె సేతువునకతడున్॥ ౯౦.
పోవుసమయమున దాసునకనియెను పూజవేళలో నేను।
భావబంధమున వచ్చెద తలచిన భయపడకని బలుకుచును॥ ౯౧.
పంచవటీకిని పంచక్రోశమున బరగిన టాకిలియూరు।
అంచితముగనే యఖిలపండితు లచటికరుగు చుండుదురు॥ ౯౨.
రామదాసుడును కీర్తన జేయగ రమ్యముతో విందురటన్।
ప్రేమభక్తినటు బాగుగ జూచియు ప్రియులై పొగడిరి నోటన్॥ ౯౩.
వారిలోననొక ఉద్ధవుడనుచును వచ్చె శరణు జొచ్చుచును।
వైరాగ్యంబును భక్తియు జ్ఞానము వానికుండగనుచును॥ ౯౪.
రామదాసుడును ననుగ్రహించెను రామకరుణాపాత్రుడని।
నేమముదప్పక శిష్యుడు సేవల నెరజేసెను తానుగని॥ ౯౫.
మారుతి మూర్తిని జేసియు దాసుడు మానుగ నట స్థాపించెన్।
వారక నచ్చట నభిషేకంబుల వర్ధిల్లగ జేయించెన్॥ ౯౬.
మారుతి యచ్చట మూర్తికరుడై మహిమలనేకము జూపెన్।
సారతరంబుగ ననేకద్విజులకు సంతర్పణమును సలిపెన్॥ ౯౭.
ఉద్ధవు తోడను దాసుడు బలికెను నుదయమునందున లేచి।
సద్ధర్మంబుగ స్నానము జేసియు సలుపుము పూజలనెంచి॥ ౯౮.
అక్షయ పాత్రను భిక్షముగొనుచును నతిథికన్న మిడుచును।
పక్షముతో నరుల్ ప్రార్థించినయెడ పరులకుపదేశించుచును॥

యుండుమటంచును జెప్పియు పిదపను సుచితంబుగ నిశివేళన్।
కొండొక నరునకు కనబడకుండగ గోర యరణ్యము వెళ్ళన్॥ ౧౦౦.
దక్షిణ దిక్కున తిరుగుచు బహుగా దరిగానక గ్రామముల।
పక్షము తోడను భక్షించునుదా ఫలము కందమూలములు॥ ౧౦౧.
పిశాచ వృత్తిని పొందుగ చేకొని బెణకదు సన్మానముల।
నిశాకాలముల నొకడై యటవిని నిలుచును మృగమధ్యముల॥౧౦౨.
నడచుచునుండగ రాముడె నాథుడు నాదుధనంబని దలచు।
తడవు లేకమరి రాముడె తల్లియు తండ్రియు నత డేయనుచు॥ ౧౦౩.
గురుడును రాముడె మిత్రుడు బంధువు కులదేవుండును నతడె।
పరరఘురాముడె నాకులగోత్రముల్ వానివినా లేడొకడె। ౧౦౪.
ఈవిధమునతా గానము జేయుచు నేగె కృష్ణతీరమును।
నావుడు సిద్ధులు యెన్నివచ్చినను నరకమనుచు విడుచుచును॥
శ్రీవైకుంఠము కైలాసంబుల చింతన జేయక తాను।
భావ్యంబగునా మోక్షపదంబును భావింపకనటు తాను॥ ౧౦౫.
మాహారనునొక క్షేత్రమునందును మానుగవచ్చియు నటను।
బాహ్యంబగు పూజను జేసెను బలయుతు మారుతి యటను॥ ౧౦౬.
ప్రసన్నుడగుచును పదమూడక్షర ప్రబల మంత్రమును జెప్పి।
విసుకక సార్ధ త్రికోటినామమును విశదజపంబును జెప్పి॥ ౧౦౭.
మారుతి కోవగ మహాత్తపస్సును మహిని జేసె దాసుండు।
ధీరుడై యిట్టుల తపస్సుజేయగ దేవస్త్రీలగని మెండు॥ ౧౦౮.
పాకశాసనుని పనియిది యనుచును బాగునెరిగె దాసుండు।
నాకలోకమున కేనువత్తునని నతీవెలబంపెను గనుడు॥ ౧౧౦.
భయమొకించుకను బొందక దాసుడు భావన హరిపై నుండన్।
నయముగ రాముడె సర్వంబనుటయు నాదుధర్మమని నిగుడన్॥
రాముడె దేవుడు రాముడె నియమము రాముడె భవత్రిశమహారుడు।
రాముడె ధ్యానము రాముడె సత్యము రాముడె చూపగుగనుడు॥

రాముడె యాత్మయు రాముని గాంచెద రాముడె తోడ్తెల్లెడలన్।
రాముడె బ్రహ్మము రాముడె సర్వము రాముడు వినలేదియ్యెడలన్॥
ఈవిధనిశ్చయమున తానుండగ యిలనంగన లాడుచును।
సావధానముగ చేరవచ్చిమరి సలిపిరి కనుసైగలను॥ ౧౧౪.
రామదాసుడును జూచుచునప్పుడు రావలదనె తనయెడను।
కోమలహృదయుడు పినాకపాణిని గొల్చెనుతగ కాముడును॥౧౧౫.
శుకబ్రహ్మమును నూటిగమీరలు సొక్కజేయనటు బూనన్।
అకలంకుండగు నతనిపలుకుల కందక జేసెను గానన్॥ ౧౧౬.
తుచ్ఛులు మీరలు దూరముండుడన తోచక కడు లజ్జితులై।
వచ్చిన దారిని వెళ్ళిరి యప్పుడు వారు తగ పరాజితులై॥ ౧౧౭.
దాసుండచ్చట తపస్సుచేయగ ద్వాదశవత్సరమయ్యెన్।
ఆసను రాముని యమలరూపమును నటుదాగానండయ్యెన్॥౧౧౮.
మారుతిరాయుని మనసునదలపగ మానక వచ్చెను నతడు।
కోరుచు జెప్పెను శ్రీరఘురాముని కోమల రూపుగన నిపుడు॥౧౧౯.
మించె జపము మూడున్నరకోటికి మేలుగలుగ లేదనగన్।
ఉచితముగననె నాంజనేయుడును నమితప్రేమతో బాగన్॥ ౧౨౦.
కొనియాడుచు మరి సాధన బుద్ధిని కూర్మి విడువుమియ్యెడను।
అనుతాపముచే రాముని కరుణను నందుదువని పలుకగను॥ ౧౨౧.
దాసుండటులనే జేసెద ననగను దాటెను మారుతి పిదపన్।
వాసిగనప్పుడు రామదాసుడును వరకవితల దాజెప్పెన్॥ ౧౨౨.
శ్రీరఘురామా చిత్తవిదూరా చేయుము కృపనాయెడను।
కోరదు నామది యితరము నెద్దియు గురుతుచూడు నన్నికను॥
అరిషడ్వర్గములణచుము తంత్రీ యాశ్రితులుడనుయో రామ।
పరిపాటిగ నాకచల భజనలో ప్రౌఢిగ జేయుము రామ॥ ౧౨౪.
భ్రమిత మనసునకు హితముం దెలియదు పరమకఠినమగు రామ।
తిమిరంబగు యీదేహమునందును తెగదుబుద్ధియో రామ॥ ౧౨౫.

శ్రీ

శ్రీమతేరామానుజాయనమః.

భగవన్నిర్హేతుక కటాక్షముచే ప్రాప్యభూమినిపొందిన

భక్తశిరోమణుల చరితలనుదెలుపు

# భక్తమాల.

ఇది

మహారాష్ట్ర భాషయందు మహీపతిబావాయను

భక్తశ్రేష్ఠునివలన రచింపబడిన

భక్తవిజయము, సంతవిజయము, భక్తలీలామృతము, సంత

లీలామృతము గ్రంథములను క్రోడీకరించి,

వె. బాలకృష్ణ మొదల్యారి చే

తెనుగున

తోహారా కవితలగా రచింపబడిన పదిసంచికలలో నిది

నాల్గవ సంచిక.

చెన్నపురి, మవుంటురోడ్,

"కమర్షియల్ ముద్రాక్షరశాలయందు"

ముద్రింపించి ప్రకటింపఁబడెను.

౧౯౦౦ంవ సంవత్సరం జూలై నెల.

శ్రీమద్విచిత్ర శతావధాని, విద్వన్మణీమహాభాగవత సలక్షణ
కృష్ణ యజుర్వేద ఘనపాఠి,హరిదాస బాళేగడ్డెకట్టె,
శ్రీమాన్ లక్ష్మణాచార్య కృత కృతిప్రశంస.

---

శ్లో॥ గ్రథితేయం బాలకృష్ణదాసేన లలితైః పదైః।
భక్తమాలా విష్ణుభక్త చిత్రచారిత్రబోధినీ। ౧॥
మహాకవి కృత గ్రంథప్రౌఢీమానం శ్రయత్యహో।
ఇతి శ్రీభగవద్గీతా లక్ష్మణార్యోఽనుమన్యతే॥ ౨॥

ఉపరతి సుఖమును కోరితి నీయెడ నొవర నొసగుమో రామ।
కృపతో నను నీకై జేసికొనుము క్రియ శరణ్యుడవు రామ॥ ౧౨౬.
నిమిష నిమిషమును రామరూపమునె నిలుపుము నామనసునను।
సమీపముందువు సర్వకాలముల సరసనునది నే గనను॥ ౧౨౭.
నేనను భావము నాయందుంటచె నేను పతితుడను రామ।
మానుగ నీవే పావనుడగుటచె మన్నింపందగు రామ॥ ౧౨౮.
పతితపావనా జానకిజీవనా పరగ ద్రిప్ప నామనసుఁ।
నిదానముగ నాజ్ఞానగర్వమును నివర్తిజేయుండనుచుఁ॥ ౧౨౯.
ఇది విని రాముండప్పుడె వచ్చుచు నేమియిష్ట మడుగమనఁ।
ముదమున దాసుడు మ్రొక్కుచుపలికెను ముఖ్యమునినుమరవకనఁ॥
అనుతాపముతో సాంబమూర్తి నిను యహర్నిశము తలచుగతిఁ।
వెను పావుడ నీనామము వాక్కున వేర్కొనుండ జేయుమదిఁ॥౧౩౧.
ఇదియకాని మరియిచ్ఛ లేదునా కిందుకు నీయానసుమి।
సదమలుడగు శ్రీరాముడు వినుచును సంతోషించుచు కూర్మి॥
దివ్యజ్ఞానము తేటగజెప్పుచు దెలిపెనతని కిరవుగను।
భవ్యులగుచు తగు ప్రజలు వచ్చినను పరగ నుపదేశించమను॥౧౩౩.
పురముల దాపున భిక్షాటనచే పొసగ నుండవలయునను।
అరమర లేకను జెప్పుచు నిట్టుల నట్టెవెళ్ళె రాముడును॥ ౧౩౪.
వనమధ్యంబున దాసుడు *తుష్టుడై వనమృగముల జూచుచును।
ఘనభువి యాసనమంటపమును నాకసమగునటు జేసికొను॥ ౧౩౫.
ప్రాతస్నాతయై భిక్షకొఱకుదా బరతెంచును గ్రామమును।
ప్రీతిని జయరఘు వీరత్వరయని పిలుచును పదియిండ్లెడను॥ ౧౩౬.
వారలిడిన ధాన్యంబును దానటు వరుస దెచ్చు నడవికిని।
మీరి యెవరితో బలుకకుంటచే వెఱ్ఱియందు రీభువిని॥ ౧౩౭.
భిక్షను దెచ్చిన ధాన్యంబునుదా పిండిజేయు రాతిపయిఁ।
పక్షము తోడను పిసుకుచు నీళ్లతో పత్రంబుల నునిచిపయిఁ॥౧౩౮.

*తుష్టి-తృప్తి.

ప్రదీపాగ్నిలో బడవేయు చుమరి పాకముకాగనె దాని।
కుదురుగ గైకొని యాకులనుంచుచు కోరిదెచ్చు నీరుగని॥ ౧౩౯.

దొప్పలొనుంచుచు శ్రీరామునకును తొలియర్పణ జేయుచును।
ఒప్పుగ భక్షణ చేయును పిదపను నుచిత నామంబనుచును॥ ౧౪౦.

---

ఈవిధస్థితిలో నుండగ నొకయెడ నిలపతి యటు వేటకును।
*ఏవగించునటు శివాజియను వాడెలమివచ్చె నయ్యెడను॥ ౧౪౧.

అడవిమృగంబుల నాతడుగొట్టగ నవియును నభయంబనుచు।
విడువక దాసుని వెనుకకురాగను వేంచేయుండిటననుచు॥
ఘోర మృగంబుల మధ్యంబునదా కూర్చుండెను దాసుడును।
వారక నరపతి దాసుని గాంచుచు వాంఛను నిలువంబడెను॥౧౪౨.
సమీపమునకును పోలేకనుదా చపలత మృగభీతుండై।
సమాధానముగ మంత్రిని గనియనె సైన్యము గొనువెనకుండై॥
సాయంకాలము వరకును నిలుచుచు నను నెడ నరపతియిల్లు।
బాయక కృష్ణా ప్రవాహామందును పత్రంబులు విలసిల్లు॥ ౧౪౩.
ఉదకము నుండియు వాటిని దీసియు నుచితంబుగ చదవగను।
హితమగు పద్యము లర్థగౌరవము నెలమియుండ జూచుచును॥
దాసుని కవితలె దరిగొని వచ్చెను ధన్యుడనని దలచుచును।
వేసారక తన గృహామునుజేరియు విధితో మరుదినమునను॥ ౧౪౪.
ప్రాతస్నాతుడై చనియెను దాసుని భవ్య దర్శనంబునకు।
మోదమలర మృగమధ్యంబునగనె ముందుగ దాసుని బాగు॥
సమీపించుటకు సమయము కాదని చనెతన గృహామాదినము।
ప్రమేయమిదిగా ప్రొద్దున లేచియు పరగ బోవు ననుదినము॥౧౪౫
కొన్నిదినంబులు జరుగగ నిట్టుల కూడిమంత్రు లయ్యెడను।
పన్నుచు వారలు బహుగా జెప్పిరి పలుకుల నరపతికిటను॥ ౧౪౬

---

*ఏవగించు - అసంహ్యాపడు,

రాజ్య భారమును నడపుట క్షత్రియ రమ్యగుణముకాగాను।
పూజ్యుడు గానియా యడవి పురుషుని పోయిచూడ తగదుగను॥
అతని కవిత్వము ప్రీతిమైయున్నను నవనిని సద్గ్రంథముల।
కుతూహలంబుగ తెలియపర చెదము గొప్ప యర్థమున్నటుల॥
సాధుండగుచును నింటికి వచ్చినచక్కగ మన్నన కర్హుడగు।
వీధుల దాటుచు నరపతి బోవుట వీలుగాదు తగమనకు॥ ౧౫౩.
ఇదివిని నృపవరు డేమియు జెప్పక నిష్టసిద్ధికిరవాందుర్।
సదయుడు శ్రీగురు దర్శనమునకును చనుచో నొకదినమందుర్॥
సేవకులందర దూరము నుంచుచు చేరెను దాసుని కడను।
భావశుద్ధితో నరపతి కెదురుగ బరతెంచెను దాసుడును॥ ౧౫౫.
అవలోకింపుచు నరపతి యుండగ నాంజనేయునిం గనెను।
ప్రవిమల సేవల దాసుడు జేసెను భక్తిని మారుతి కటను॥ ౧౫౬.
అధిక కాంతిచే కనులు మూయబడె నవనీపతి చూడగను।
విధితో తిరిగియు కన్నులు తెరువగ వెలసె దాసు డొకడటను॥
బద్ధాంజలుడై భువి నిలుచుండుచు బాష్పములొలుకుచు నుండర్।
శుద్ధాత్ముండని దాసుడు రమ్మని సురతముగను చెయ్యూదర్॥ ౧౫౮.
నరపతి వచ్చియు నేలం బడుచును నాయపరాధములన్ని।
గురుతుగ చూడక చేకొన వలయును క్రుంగితి తాపాగ్నికిని।౧౫౯.
ఇదిగని దాసుడు లెమ్మని జెప్పగ నెలమి నతడు నిలిచికొని।
పతితుండనునే పావనుడగునటు పరికింపుమన దాసువిని॥ ౧౬౦.
పారమార్థికము పృథ్వీపత్యము బహువిరుద్ధమై యుండు।
సారతముండగు గురుని గాంచుట చక్కగాదు భువిమెండు॥ ౧౬౧.
భోగంబులనే బొందుమనంగను పొసగ బలికెనా నృపుడు।
సాగునట్టియీ సర్వరాజ్యము స్వామిదియై తగియుండు॥ ౧౬౨.
మీరలు జెప్పెడి యాజ్ఞను తగనే మీరకుండు నెల్లపుడు।
సారతరంబుగ శరణొందితినే సద్గురుడా కృపజూడు॥ ౧౬౩.

శాంత పురుషుడని దాసుడు గాంచుచు స్నానమాడి రమ్మనియెన్
భ్రాంతుడు గాకను నృపుడు మోదమున భవ్యస్నానము జేయన్॥
నీటను గ్రుంకిడి తడి బట్టలతో నిగుడివచ్చె నెయ్యమున।
బాటను వనమున ఫలపుష్పంబుల పరగగొనుచు పత్రమున॥ ౧౬౫.
నిడుకొని చొప్పను నీరునింపుకొని నెపములేక గురుకడను।
బిడియము తోడను దెచ్చియుంచియు భీతినుండు ముందరను॥౧౬౬.
గురుడును ద్వాదశ దండంబులునటు కోరి యుంచుమని వేడున్।
గురుతుగ నృపుడును తనుమనధనములు గురువునదని నందమిడున్
పాదుక శిరమున నుంచుమటంచును బల్కుచు కూర్చుండగను।
సాదరముగ శ్రీదాసుండుంచెను సత్కారముల నృపుతలను॥ ౧౬౭.
చెవులం జెప్పుచు నామమంత్రమును చిత్తమలర యర్థమును।
సవినయమగునటు భూతకోట్లకును సలుపుము దయ నెప్పుడును
సాదుల గాంచిన శరణు జేయుము సర్వేశుని పూజయును।
సాదుగ జేయుము హరిదిన వ్రతమును పరగజేయు భక్తిగను। ౧౬౮.
ప్రతిదినమును మారుతి మూర్తినితగు భక్తిని సేవించుచును।
హితపరుడగుచును నుండుమటంచును [illegible] గురుడు వెల్వడెను
ఆజ్ఞప్రమాణంబనుచును భూపతి యమల శ్రీగురు పదములు
ప్రాజ్ఞను నిడుకొని జలముల కడిగెను బాగుగ్రోలె తీర్థముల॥
పూలహారముల మెడను వేయుచును పూజించెను గురునతని।
మేలుగ గురుడును నమృతఫలంబును [illegible]
ఉచ్ఛిష్టంబగు ఫలమును నచ్చట నొగి నరపతి [illegible]కొనుచు।
హెచ్చిన ప్రీతిని తీని [illegible] ప్రసాదంబును
గురుపరు గన్గొని పలికెనప్పుడటు గురుతర రాజ్యంబెల్లన్।
వెలి[illegible] [illegible] నన్నిడి [illegible]॥ ౧౬౯.
నీదు [illegible] జేయుచు [illegible]
సాదుగ [illegible]

రాజ్యము నాదే నాకీ౦అ కీవారాజ్యమేలు మిటుబాగ।
పూజ్యుడ వైతివి వెళ్లుము నగరము ప్రొద్దుగ్రుంకుటకు లోగ॥౧౬౮.
గురువాక్యముతా నడ్డబెట్టుటకు కోరికె లేకను నృపుడు।
వెఱచుచు మెల్లన దండముబెట్టుచు వెళ్లదొడగె దానపుడు॥ ౧౬౯.
సేనల తోడను చేరెను నగరము జెప్పెరి జనులయ్యెడను।
బూనె ననుగ్రహ మవనీ పతియును పొందుగ దాసుని యెడను॥
మరుదినమున గురు దర్శనమునకును మానుగ చనె భూపతియు।
వరుసను దెచ్చెను సర్వ వస్తువుల వలసియుండు తగునయ్యు॥ ౧౭౦.
దినదినమిటులనే ధరణీనాథుడు దెచ్చియిచ్చు సంపతిని।
వినమితులగుచున పురజను లందరు వేంచేతురు యటవిని॥ ౧౭౧.
ఇదిగని దాసుడు యేహ్యాంబనుచును యింకొక వనమును వెళ్ళెన్।
సదయుండగుచును శిష్యుడు శ్రీగురు సందర్శనకై మెల్లన్॥ ౧౭౨.
వనమును వెతుకుచు తొందర నొందగ వరదుడు దొరకకయుండన్।
దినములు మూడును చనెననటు వనమున తినిత్రాగుట లేకుండన్॥
ఆయాసముతో నమరియుండగను నాచార్యుడు గనిమెచ్చి।
సాయాసము తన కేమిలేకనటు సరగున నృపుకడ వచ్చి॥ ౧౭౪.
ధరను దర్శన మియ్యగ నరపతి దండంబిడి తగనపుడు।
పరిపరివిధముల పూజనుసేయుచు ప్రార్థనజేసెను నాడు॥ ౧౭౫.
గురుదర్శనమును కోరెదనిత్యము గురుతుగనిమ్మని యడుగన్।
తిరముగ గురుడును దెల్పెనప్పుడును తీర్థప్రవాహిని లోగన్॥
బోయెడి పత్రముల్ గైకొని నీవును పొసగచదువు దినదినమున్।
బాయకనన్నే జూచుచుండుదువు మానస పూజను దినమున్॥౧౭౮.
దినదినమునునే దర్శనమిచ్చెద తెల్లవారు నప్పుడును।
చెనగొని యింటికి బొమ్మని చెప్పెను ప్రేమను గురుడును నృపును॥
మహిపతి వెళ్ళిన పిదపను దాసుడు మహూళియను సంగమున।
విహరించుచును దావచ్చెను మెల్లన వేడుకనట గ్రామమున॥ ౧౭౯.

పిశాచవృత్తిని యవలంబించుచు భిక్షాటన జేయుచును।
విశాల తరువుల పైగా నెగురుచు విహిత క్రీడసలుపగను॥ ౧౫౦.

బాలుర వెంబడి తగిలి వచ్చుచును బలుకూతల గూయగను।
వీలుగ నీతడు చెట్లపై నెగురుచు వేయురాళ్ళు వారెడను॥ ౧౫౧.

కొంతకాలమిటు గడిపిన పిదపను గురిగొని బాలుర వృత్తిఁ।
పంతముతోడను బాలుర గూడియు పాతరలాడును రక్తిఁ॥౧౫౨.

---

ఒకదినమున నదిగట్టున గిలకలనొసగనాడ బాలురతో।
అకలంకుండగు రామదాసునకునది దగిలెను వేగముతో॥ ౧౫౩.

నొసటనుండి రక్తంబునుగారగ నొప్పితోడ దాసుడును।
వెసతో నచటను మూర్ఛనొందుక్రియ విపుల సమాధిని తాను॥
భూమిని బడగను బాలురందరును బోయెనుతగు ప్రాణమని।
క్షేమము నొందక నితరులెరిగినను శిక్షార్హుల మగుదుమని॥ ౧౫౪.

ఎవరికి జెప్పక నచ్చటి యిసుకను నేర్పడ తవ్విరి గుంటఁ।
భువిలో బెట్టిరి పీనుగు యనుచును పొందుగ బాలురనాటఁ॥౧౫౫.

బాలురందరును పోయిరి యిండ్లకు ప్రభువగు నవనీపతియు।
వీలుగ వచ్చెను వనమును గురువును వెదకియు గానక మరియు॥
సవార్లనంపెను నలుదిక్కులకును చక్కగ జూడుండనుచు।
జవానులప్పుడు చేరవచ్చియటు సందుసందును దూరుచు॥ ౧౫౭.

గ్రామమునందును వారలు వచ్చియు గ్రక్కున నటు వెదకుచును।
రామదాసు డెచ్చటయని యడుగగ రంజిలజెప్పిరి యటను॥౧౫౮.

కొన్నిదినంబుల క్రిందట నాతడు గూడెను బాలురతోను।
పన్నుగనిప్పుడు నెచ్చటనరిగెనొ పరగ మాకు దెలియదను॥
వినుకొని వారలు వీలుగ నచ్చట విహరించుచు తగనుండఁ।
అనువున గ్రామస్థులు బాలుర తగ నరయగ బిలిచిరు వినుఁడఁ॥

దాసుని సుద్దియు దెల్పుమటన్నను తథ్యాజైపకుండగని।
వాసిలేకనటు గజగజవణుకగ వంకకుదెచ్చియు నొకని॥ ౨౦౨.

జరిగిన సంగతి జెప్పుమని యొకడు చనువుజేసి తానడుగన్।
మురిపెముతో నాబాలుడు జెప్పెను మొత్తసంగతిని బాగన్॥

ఇదివిని యానరు డితరుల కందరి కెరుగదెల్పవారలును।
మదిలో భయమును మిగుల బొందుచును మహిపతి శిక్షింపునను॥

ఏమిచేయుద మని యటుగూడియు నెంచుచు వారుండగను।
భూమినాధుని గురువగు నాతని పూడ్చినట్టి స్థలమునను॥ ౨౦౫.

అందరమేగియు పీనుగుదీసియు నటుదహనము చేసినను।
తొందర రాదని యొక్కడు జెప్పగ తోచినయోచన క్రియను॥

పిల్లగాని వెంబడిగొని బోవుచు పీనుగు పూడ్చిన చోటన్।
మెల్లగ యిసుకను దీయగ దాసుడు మెలగ కలగ కుండెనటన్॥

ఇతరుల హస్తము లతనిపైని బడ నింతనుదా లేచుచును।
పదవడి దుముకుచు బోయె నడవికిని ప్రజలు జూచుచుండగను॥

ఏడు దినంబులు సమాధి యుతుడై యెలమి నచటనుండగను।
చూడ జాలకను నరపతి చుట్టెను సూటిగ వనమంతయును॥ ౨౦౯.

అన్నపానముల నతడుచేకొనక నతిఖిన్నత నుండగను।
తిన్నగ దాసుడు తర్లివచ్చుచును తీర నిలిచె ముందుగను॥ ౨౧౦.

అతిమోదముతో రాజు పూజలను నాచార్యునకును జేసెన్।
పదపడి వంటను పొందుగజేసియు భక్షణచేసిరి లెస్సన్॥ ౨౧౧.

నగరము రమ్మని నృపుడడుగగదా నాకిష్టంబగు నపుడు।
వగవక వచ్చెద నిప్పుడు బొమ్మన వరుసను వెళ్ళెను నృపుడు ॥

---

జయరాముండను కృష్ణభక్తుడటు చర్యలు దాసుని వినుచున్।
ప్రియుడై వచ్చుచు నమ్రతబలికెను ప్రేమానందము గనుచున్॥

మీరలు నార్యులు భక్తిపూర్ణులు మీసాంగత్యము నేను
కోరుచు వచ్చితి కృపతోనను చేకొనుమని తగవేడగను॥ ౨౧౪.

రామదాసుడును సేమంబలరగ రమ్మని నాతని గూడి।
ప్రేమ భావమున భగవద్గుణముల ప్రియమున జెప్పుచునుండి॥౨౧౫.

పదియిండ్లనుగా భిక్షాటనమును పరగజేసి దాసుండు
కొదవగాక నటుదెచ్చిన యన్నము గుడుతు రిరువురును మెండు॥

వనమృగంబులను తప్పమరెవ్వరు వచ్చుటకును లేకుండఁ।
సెనరున యిద్దరె నచ్చటనుండగ నిలిచిదాసు డొకనాటఁ॥ ౨౧౭.

సహస్ర బ్రాహ్మణ సంతర్పణమును సరగజేయ వలయునన।
విహితుండగుచును జయరాముండును వేగబిలువ విప్రులన॥

దాసుడు వెళ్ళెను తత్సమీపమున తగులనుండు గ్రామములఁ।
హాసిగ సహస్రద్విజుల భోజనము పరుసజేతునని వార్లఁ॥ ౨౧౯.

ఆమంత్రణమును నియ్యగ విప్రులు నడవిప్రదేశ మేగగను।
నేమంబున యా జయరాముండును నిగుడిపంక్తి వేయుచును॥౨౨౦.

సిద్ధిని యాతడు వినియోగింపగ సిద్ధమయ్యె సకలమును।
సద్దులేకనట యారగించి మరి చనిరి ద్విజులు వెయ్యటను॥ ౨౨౧.

దాసుడు విప్రుల పూజలజేసియు దారినంపగను వారు।
వేసరిల్లకను యెల్లగ్రామముల విఖ్యాతించిరితీరు॥ ౨౨౨.

---

జయరాముడుచనె చేకొనియాజ్ఞను శరణాగతి గానటకు।
నయముగ దత్తుడు నాపికు డొక్కడునడచెను దాసునికడకు

ఉపదేశము నే జేయననంగను నూరక సేవల జేతునన
ఎపుడిచ్చటనే యుండునదైనను యింపగునని దాసుడన॥ ౨౨౪.

సేవల జేయుచు దత్తుండుండుచు శ్రీరాముని చింతించు।
భావశుద్ధితో భిక్షాటనమున బహుగా పండినిదెచ్చు॥ ౨౨౫.

పాకము దాసుడు చేయగదానిం భక్షించుదు రిరువురును।
జోకను దత్తున కుపదేశంబును వీకజేసె నొకయెడను॥ ౨౨౬.
ఈవిధముండగ నగరున నృపవరు డిచ్ఛయించె గురు గననుl
భావమునందిది కనుగొని దాసుడు ప్రయాణ మయ్యెను నటను॥
దత్తుడువెంబడిరాగ జోలెతో తరలెరాము దలచుచును।
సత్తారాయను పట్నంబునకును చనుచునుండి రిరువురును॥ ౨౨౭.
శ్రీరామునియా గుణచేష్టితముల చింతించుచు బాడుచును।
పారావారపు బ్రహ్మానందము పరగబొంది దాసుడును॥ ౨౨౯.
ఈవిధమున యానగర సమీపము నిరువురు తగరాగాను।
బావినిజూచుచు దాసుడు స్నానము బాగుగనటు జేయగను॥
ఫలితమైన నొక జొన్నచేనుగని పల్కె దత్తుడు గురువునకు।
వలసియు నాలుగు కంకులదెచ్చెద వరుసను భక్షణమునకు॥ ౨౩౧.
గురుడు వినుంగొని బలికెను మనకును కూడదు యీపనియనుచు।
సరగున నగరము చేరెదమచ్చట సామగ్రిని గొనుమనుచు॥ ౨౩౨.
తెంప వలవదని తెలియబలికినను తెంపె దత్తు కంకులను।
సొంపగు చేనుకు కావలివారలు సూటిగవచ్చిరి యటను॥ ౨౩౩.
తడతడ దెబ్బలు గొట్టిరి యప్పుడు దత్తుపైన తగవారు।
విడవక దాసుని చాబుకుతోడను వీపున గొట్టిరి *తనరు॥ ౨౩౪.
ధ్యానస్థునిపై దెబ్బలువేయగ తాకగాంచి నవ్వంగ।
మానుగ కాపులు ముందుగ పూజను మసోబ దేవునికిడకగ॥ ౨౩౫.
ఎంగిలి యైనను ధాన్యము పెరగదు యేల నవ్వెదీ వనుచు।
భంగపడితిమని చనిరి వారలును భక్తుని గొట్టితిమనుచు॥ ౨౩౬.
ఖిన్నుడై యేడ్చుచు దత్తుండుండగ ఖేదమొందక దాసుండు।
తిన్నగనడిగెను యేడుపెందుకని దీనత పలికె దత్తుండు॥ ౨౩౭.
నేరము నాపై యుండగ దెబ్బలు నీకుదగిలె నియ్యెడను।
వారించుటకును వల్లగాకనే వనిత క్రియను నుంటినను॥ ౨౩౮.

*తనరు-ఒప్పు.

దాసుడు వినుకొని జెప్పెనప్పుడును తనరుక్లేశ మెందుకను।
వాసుదేవు భక్తులు లెక్కించరు వరమానవ మానమును॥ ౧౭౯.
దెబ్బల గొట్టిన దలచరు తమకని దీనత నొందరు పుడమి।
దబ్బరమాటల దలచరెప్పుడును ధర హరి దాసులుసుమ్మి॥ ౧౮౦.
శిరిసంపత్తుల దొంగలు గొనినను జేయరెత్నము వాటికని।
తిరమగుప్రీతిని రాముని గొలుచుచు తీరుగనుందురు భువిని॥ ౧౮౧.
కంకుల దినుటయు సుఖమనియుంటివి కఠినంబగు దెబ్బలచే।
పొంకముతోడను దుఃఖము గంటివి పొసగ రెంటిదొలగించె॥
వైరాగ్యంబును చేకొనవలయును వర్ధిలు రాముని కృపయు।
ధీరత సంగతి జెప్పకు నృపుతో తెలియుమాజ్ఞ నాదయ్యా॥ ౧౮౩.
అనుచును జెప్పుచునచ్చట నడవగ నవనీపతి సేనలతో।
చనువున శ్రీగురు చూడంగోరియు చనుదెంచెను మార్గముతో॥
దూరమునందును దాసుని జూడగ దుమికె శిబికెపై నుంచి।
తీరుగ దండము గురువున కిడుచును తెగువ నతని యందుంచి॥
వింజామరములు నరపతి వేయుచు వేదెచ్చెను నగరమును।
సంజాతంబగు సకలవాద్యముల్ సారంబుగ మ్రోయగను॥ ౧౮౬.
అష్టప్రధానులు నవనీగురులును నటువెంబడిరాగాను।
కష్టములేకను రాజునడచుచును గరిమనేగి గేహమును॥ ౧౮౭.
తనసింహాసనమున గురునాథుని తాగూర్చుండం జేసెన్।
అనువుగ బ్రహ్మానందము నొందుచు నమితవంట జేయించెన్॥ ౧౮౮.
స్నానముజేయుచు బ్రాహ్మణులందరు చనిరటు భోజనమునకు।
మానుగ గాంచిరి విస్తరలందును మహిత పదార్థముల్ పెక్కు॥
శ్రీగురు స్వామికి స్నానము కొఱకై చేర్చిరి యుష్ణోదకము।
బాగుగ నృపుడును దేహముకడుగగ ప్రక్కవాత గనె సుమ్ము॥
ఇదియేమనగను గురుడుజెప్పెనటు యేమియు లేదనిజెపుచున్।
మదిలో కించను నరపతినిడుకొని మానుగ నీరాడించున్॥ ౧౯౧.

ఆచార్యునకును నున్నతాసనము నచటను దావేయుచును।
ప్రాచీనంబగు రీతిని సేవల పాదజలము గ్రోలుచును॥ ౧౫౨.
భక్ష్యభోజ్యములు పక్వాన్నంబుల బహువర్ధన చేయించెన్।
లక్ష్యంబుగ ద్విజులను కూర్చుండను లాలితముగ నియమించెన్॥
రామార్పణమని యాపోశనమును రామదాసు గైకొనగన్।
ప్రేమాస్పదులై బ్రాహ్మణులందరు ప్రీతిని గుడిచిరి బాగన్॥ ౧౫౪.
గురువరు నెంగిలి పత్రము దెచ్చియు కోరి నృపుడు కూర్చుండెన్।
గరిమను దత్తుని కూడబిలిచికొని *కణగి విస్తరొక్కటిడెన్॥ ౧౫౫.
అన్నము భక్ష్యములటు వడ్డింపగ నరసి దత్తుగని నృపుడు।
పన్నుగ గురుపై వాతకు హేతువ పరగదెలుపుమన నతడు॥ ౧౫౬.
శ్రీగురు డాజ్ఞయు చేసెను నాకును చెప్పవలవ దెవరికని।
వేగిరపడి నేనాజ్ఞను మీరను విధిగాదది యెవరికిని॥ ౧౫౭.
రాజువినుంగొని యన్నముదినననె రయముగ జెప్పని యెడను।
వ్యాజంబగునని వంచినతలతో వచింపకుండె దత్తుడును॥ ౧౫౮.
జెప్పవలయునని నరపతియడుగగ జెప్పె సంగతి నంతయును।
తప్పకబంపెను సవార్లనప్పుడు తవిలి కాపుల బిలువను॥ ౧౫౯.
ఆరగించి నృపు దత్తునితోడను నాచార్యుని కడజేరెన్।
శ్రీరఘురాముని కీర్తన వినినను సేమంబగు ననిమీరెన్॥ ౧౬౦.
తాళమృదంగపు సుస్వరములతో ధ్వనులు బహుచెలంగగను।
వీలుగ దాసుడు రాముని చరితల విన్నపింప లేచుచును॥ ౧౬౧.
రారా రామా రారా రామా రాముడె ఘనకారణుడు।
నీరుగజేయును నేనునాయను నిందితభావముగనుడు॥ ౧౬౨.
సారముకెల్లను సారమురాముడె సద్భక్తియు వాని యెడన్।
కోరియు జేసిన కృపచేరాముడు కూడువారి మనసందన్॥ ౧౬౩.
కల్పతరువును చింతామణియును కామధేను లిలలోను।
అల్పములగుచును నుండును చూడుడి యలరాముని గొలిచినను॥

---

*కణగి=గొప్పతనముగ.

ఈవిధమునదా కీర్తనజేసెను యింపయ్యెను నందరకు।
సేవను నుండుచు యానందముతో చెలగెను నరపతిబాగు॥ ౧౮౫.

కీర్తనముగిసిన వెనక నరపతికి క్రియతోడను మంత్రియును।
ఆర్తినిబొందుచు కాపులందరును నంగణమున జేరిరను॥ ౧౮౬.

ఇదివిని దాసుడు వారల నిచ్చట నెలమితోడ దెమ్మనగ౯।
తుదకును నరపతిమంత్రికి జెప్పగ తోలుకొనుచు నటురాగ౯॥
*కంపమొందగను కట్టబడినయా కాపులనటుజూచుచును।
ఇంపుగ దాసుడు బలికెను నృపునకు నెలమిని పాశంబులను॥ ౧౮౭.

విప్పంజేసియు వస్త్రభూషముల వెలగలవిగ నిమ్మనుచు।
గొప్పగవారల కొనియాడుచుమరి గురుదక్షిణ తనకనుచు॥ ౧౮౮.

ఇనాము భూమిగవారి నేలను నియ్యుమనగ నరపతియు।
సునీతిమతులగు దేవరిమేనుపై చొప్పగ దెబ్బలనిడియు॥ ౧౯౦.

అపచారంబుల జేసిన వారల కటుజేయుట యెట్టులను।
కృపతో దాసుడు సహానము నాకును క్రియనుండుట గనుటకును॥
శోధన జేయుటకొఱకై వారలు జూచిరి యింతియకాని।
పాదుగవారల శిక్షకులోగను బట్టికొట్ట తగదుయని॥ ౧౯౧.

ఆచార్యుండన నవనీపతియును నాజ్ఞవిధము జేయింప౯।
ఆచరించి పూజలను దాసునకు నఖిలజనంబులు సలుప౯॥ ౧౯౩.

మూడు దినంబులటుండెను దాసుడు ముచ్చటతో వెలయుచును।
కూడి దత్తునటు నడిరేయందును కోరి చనె నరణ్యమును॥ ౧౯౪.

తెల్లవారగను ధరణీపతియటు తెగువలేచి చూడగను।
ఎల్లవస్తువు లచటనేయుండగ నెచటగనక గురువరును॥ ౧౯౫.

సేనలతోడను చేరెనరణ్యము శివ్వాడీనరపతియు।
మానుగనచ్చట గురునింగనియెను మహితయశస్సును గొనియు॥
పూజలనెల్లను జేయగ గురుడనె పోవలె నేపంచవటీ।
ఓజను నిట్లన నవనీపతియనె నొనరవచ్చెద నేగట్టి॥ ౧౯౬.

*కంపము-భయము.

రాజ్యము తమదై రంజిలుచుండగ రథ తురంగములతోను।
పూజ్యంబగునటు పోయెద మనగను పొంకముతోడ గురుడును॥
ప్రజాపాలనము సేయుము నీవును, పాల్కి లెందుకు నాకు।
నిజానందము నారఘురాముడే నెరిసుఖంబులను నొసగు॥ ౧౭౯.
భూనాథుండనె పుణ్యస్థలముల భూరిదాన మొసగుటకు।
మాన ఘనతకై ప్రథానిబంపెద మహి గజ తురగములటకు॥ ౧౮౦.
ఇదివిని దాసుడు నీయిష్టంబని యెలమిని నుండగ నృపుడు।
పదముల బడుచును ప్రశ్న యొక్కటికి బదులు త్తర మిమ్మనుడు॥
పురవాసులు మరి పండితు లితరులు పొందుగ నడిగిరినన్ను।
వరుసను మీరలు యేవర్ణులురని వాంఛ దెలియ మనుచును॥ ౧౮౧.
ఇదివిని నవ్వుచు దాసుడు బలికెను యెహ్వామనక వానరులౕ।
కుదురుగ రాముడు సాంగత్యముగొనె కోతినగుదు నేనునిలౕ॥
నాదు సంపతియు సీతాపతియగు నాకులగోత్రము లత డౕ।
మాతయు తండ్రియు నన్నలు తమ్ములు మరియునాకు రాముండౕ॥
జాతివర్గమును చేరననంగను సరగ నృపుడు మ్రొక్కుచును।
ప్రీతిని నతనికి సేవకజనులను బెంపారగ నిచ్చుచును॥ ౧౮౫.
సవార్ల వెంబడి ద్రవ్యముబహుగా సద్గార్లను దాబంపి।
నవీన పాల్కియు గజతురగంబుల నయగురు వాజ్ఞలో నిలిపి॥ ౧౮౬
ప్రయాణ పరచెను పంచవటికిని బాగుగాను సద్గురుని।
దయాసముద్రుని దర్శనమునదా తనివి తీరకను బూని॥ ౧౮౭.
ఆమెడవరకును నవనీపతియును నాచార్యుని వెంబడిలి।
వేమారక నే సాగనంపుటకు వెళ్ళగనృపుతల్లడిలి॥ ౧౮౮.
కన్నీ రొలుకుచు విడువజాలకను ఘనతాపముతోనుండౕ।
ఉన్నతకృపతో దాసుడనెను నే నుందు నెపుడునీయండౕ॥ ౧౮౯
మనసునకించను మానుమనినృపుని మళ్ళజేసె నాథుడు।
పనిబడి వెళ్ళుచు దాసుడు చేరెను పంచవటి నియలనాడు॥ ౧౯౦.

అనేకజనులును యాత్రాపరులై యాతనితో చేరిరటు।
దినమును వారికి దివ్యాన్నములను తెంపున వండియుబెట్టు॥ ౨౯౧.
దాసుడుమాత్రము భిక్షాన్నమునే తప్పక నిత్యము తినును।
వాసిగ నిట్టుల వచ్చియు రాముని వనజాక్షునిగనుటయును॥ ౨౯౨.
తదియారాధన తత్పరుడగుచును ద్రవ్యమెల్ల వ్రయపరచు।
కుదురుగ దాసుడు బాలురతోనటు కోరియాట లనుమించు॥
విల్లునందుగొని మంటిగుండ్లతో వృక్షములం దాకులను।
సల్లలితంబుగ గురితో గొట్టగ చక్కగ క్రిందంబడును॥ ౨౯౪.
వినోదమొందుచు నుండగ నొకయెడ విహంగమొకటి వెనకుండన్।
అనువుగ దానిం జూడక గొట్టగ యాకుతోడ క్రిందబడెన్॥
దీనిం గాంచుచు దాసుడు పక్షిని తెలియక కొట్టితిననుచు।
మానుగ నచ్చట మహీసురులందర మంచితనంబున బిలుచు॥ ౨౯౫.
క్షేత్రవాసులై యుండుమీరలిటు జేతురు సత్కర్మములు।
పాత్రంబగు యీపక్షిని మీరలు బ్రతికించిన, నే మిముల॥ ౨౯౬.
కొనియాడుచు మరి కోరిన ధనమును గురితో నిచ్చెదమీకు।
నెనరున కీర్తియు నెల్లెడలందున నే జేయించెద మీకు॥ ౨౯౭.
సుకృతము గలుగును మీకును,నాకును సుడియు దోషమునుబోవు।
ప్రకృతమునందును ద్విజులగుమీచే ప్రబలకార్యమిది సువ్వు॥
ద్విజులు బల్కిరటు పక్షియుజచ్చెను తిరిగి యుసురు రాదనుచు।
విజితులు మీరలు శ్రీరఘురాముని విమలచరిత్రల జెపుచు॥ ౩౦౦.
ఉందురు గనుకను వానికరుణచే నొసగ శిలయునాతిగను।
పొందుగ మారుతి విభీషణాదులు పొసగిరి చిరజీవిగను॥ ౩౦౧.
అట్టిరామునిక్ చింతనజేసియు నాపక్షిని లేపుమన।
ఘట్టిగ దాసుడు ఘనరామునిచే కానిపని యునేమియన॥ ౩౦౨.
వచ్చినపక్షిని బట్టి రామ యని జలమునతుడిచెను శిరమున్।
విచ్చలడియటు యెగర దొడంగెను విహంగంబునా దినమున్॥

ఇదిగని యందరు రామాయనగనె యెటుల నెగరె పక్షియని।
ముదమున దాసు మహానుభావుడని మురిపెముతోవనిరిగని॥

---

దాసుడు పిమ్మట త్రియంబకేశుని దర్శనమునకును వెళ్ళెన్।
మాసంబొక్కటి దానటనుండియు మరియు పంచవటికి మళ్ళెన్॥
రామక్షేత్రపు బ్రాహ్మణ జనులకు రమ్యభోజన మిచ్చుచును।
కామముదీరగ కొన్నిమాసములు గడిపె నచటబాగాను॥ ౩౦౬.
దశరథరాముని దివ్యనామమున దగులు ప్రయోజనమెల్లన్।
విశద కీర్తనల ప్రజలకెల్లనటు వెలయజెప్పి విలసిల్లన్॥ ౩౦౭.
ఆదినముననే యగణితవాద్యము లంబర మంతయు నిండన్।
పాదుగ దాసుడు బోవుట కొరకును బైలుదేరె ప్రజగూడన్॥
చేరగ టాకిలి గ్రామంబుననటు శిష్యు డుద్ధవుడువచ్చెన్।
తీరుగ నాతడు దీర్ఘదండమును తేటగ నిడెగురుమెచ్చన్॥ ౩౦౯.
ఆంజనేయునియమల సన్నిధిని నందరుజేరి యునటను।
ప్రాంజలుడగుచును దాసుండచ్చట పరగబెట్టె దండమును॥ ౩౧౦.
భోజన యత్నము బ్రాహ్మణులకుదాపొందుపరచి తగపిదపన్।
ఓజను నచ్చట భిక్షనుదెచ్చెను నొగిదాసుడు ధరజూపన్॥ ౩౧౧.
అందరు భక్షణ చేసిన పిదపను నలదాసుడు భక్షించెన్।
సందియమొందక మారుతిసన్నిధి చక్కజేరియటునిలిచెన్॥ ౩౧౨.
అనేక జనములు నచ్చటనుండగ హరికీర్తన దాజరుపు।
మనుకొని రాముని నామమె ముఖమున మనసున నాతనిరూపు॥
మరులొందించుచు రాముని నెప్పుడు మనుజులార తలపండి।
నిరతము నాతడు నెల్లెడలందున నిబిడియుండుగానండి॥ ౩౧౪.
ఒక్కడె యొక్కడై లోకనాయకుడైయూర్ధ్వాధములందెల్లన్।
చక్కపూర్ణుడై సకలముతానై సౌఖ్యంబుగ విలసిల్లన్॥ ౩౧౫.

అనుదినమును శ్రీరాముని మీరలు నార్తినిభజియించండి।
ఘనవిఘ్నంబులు రానియ్యకమరి ఘనహనుమంతుని గనుడి॥ ३౧౬.
ఇటులం జేసిన దురితముల్ దొలగును నిష్టసుఖము చేకూరున్।
పటుతర రాముని కృప గలిగియు హరి పదవియునటు సమకూరున్॥
ఈవిధకీర్తన దాసుడు జేసియు నేగెనుజన్మపుభూమి।
భావములోపల మాతృపితృలను బాగుచూడ తగినుమ్మీ॥ ३౧౭.
ఊరికి వెలుపల తాదిగియుండియు నొనర బనిచె సేవకుల।
వారక గ్రామపు పటేలు కర్ణము వరుస బిలువుమనెనిటుల॥ ३౧౮.
చారులువెళ్లుచు రాజగురుండగు సదయురామ దాసుండు।
వారకమిమ్మను బిలువనంపెమము వరుసతోడ నటురండు॥
పటేలుకర్ణము పురోహితునితో బైలుదేరి యటురాగన్।
పటాటోపమును బహుగా జూచుచు భయపడుచునుతమలోగన్॥
దండముబెట్టగ దాసుడువారల దైన్యతతగ బోడగాంచి।
నిండినప్రేమను నాతడువారల నెరిమాటలనోరార్చి॥ ३౨౨.
ఆసనమందును నుండగ నప్పుడు నలపురోహితుకనుబట్టెన్।
దాసుండీ తడుసూర్యాజికొమరుడు తప్పగాదనియనబట్టెన్॥ ३౨३.
తల్లిదండ్రులను తొలిదెత్తునన దాసుడనెను ద్విజునకును।
నల్లలితంబుగ వారలనేనె సరగవెళ్ళి జూచెదను॥ ३౨౪.
ఇచ్చటవారల రమ్మని బిలుచుట కిష్టమునొందననుచును।
ముచ్చటలాడుచు పితృనిగేహము ముదమున నడచెనుమున్ను॥
అంగణమందును దాసుడుబోవుచు నచట పితను గనియపుడు।
పొంగుగతండ్రికి నమస్కారమును పొసగజేసె దాసుండు॥ ३౨౬.
ఆలింగనమును నాశ్చర్యముతో నపుడుజేసె తండ్రియును।
మేలుకలిగెనని మహానందమున మిగుల నిమగ్నుడగుచును॥ ३౨౭.
తల్లియు నప్పుడు చేరరాగనటు దాసుడు దండముబెట్టెన్।
ఉల్లంబలరగ నుంచెను కొమరుని నొప్పగ రొమ్మునయట్టెన్॥

నేత్ర జలంబులు కొమరునిపైబడి నిమగ్నుడై బలుకకను।
గాత్ర పులకముల గొనిదా పిదపను గనియుచెప్పె కొడుకుకును॥
వివాహమందును వైరాగ్యముగొని విడిచియరిగితివి నన్ను।
భవాబ్ధితరణో పాయము గైకొని బాసితీవు మమ్ములను॥ ౩౩౦.
అటవిని తిరుగుచు రాముని దాసువై యట్టివచ్చితీవనగ।
పటుతరముగనే బల్కెను దాసుడు భ్రాంతి నిరసనముకాగ॥ ౩౩౧.
సర్వకాలముల సంసారంబున సౌఖ్యంబించుక లేదు।
గర్వము కామము యభిమానంబును గలిగియుండునవి వలదు॥
పుట్టుటదుఃఖము చచ్చుటదుఃఖము భూతకోటికి తగవెల్లన్।
దట్టముగా నటుచనువునుంచకుము దారాపుత్రులయెడలన్॥ ౩౩౩.
స్వహితంబునకై రాముని భక్తిని సౌఖ్యముతో చేయఁవలెన్।
బహుతర యాశల ఛేదించియుమరి పరునిశరణమొందవలెన్॥
ప్రేమయు రామునిపైన నుంచినను ప్రియుడాతడు సుఖమిచ్చున్।
నేమముతోడను నితరమునంతయు నెరియవిద్య, శ్రమనిచ్చున్॥
శ్రీరఘురాముని సద్భక్తియుమరి జేయుచుండు మనుజులును।
వారేనాకును విశ్రమకరులును వందనీయు లగుదురను॥ ౩౩౬.
మాతాపితృలా పలుకుల వినుకొని మహిత తుష్టి తగజెంది।
సీతాపతి కృప నాకులమంతయు స్థిరసుద్ధరతను జెందె॥ ౩౩౭.
భోజనమునకై దాసుండప్పుడు పొందుపరచె నచ్చటను।
ఓజను బంధువు లితర విప్రులును నొప్పుగ దినుచుండగను॥ ౩౩౮.
దాసుడు భిక్షను దెచ్చుకొనియునటు తానుదినెను వారలతో।
వాసముచేసి త్రిదినములు సతార వచ్చె జననిజనకులతో॥ ౩౩౯.
తల్లిని దండ్రిని భ్రాతను కరిపై తరుచుగాగ నెక్కించెన్।
మెల్లగ నగరము చేరగన్నృపుడును మేలుగనెదురుగ వచ్చెన్॥ ౩౪౦.
వందనమిడుచును నుచితప్రేమతో వరుసదెచ్చె తన గృహమున్।
పొందుగ గురువును సింహాసనమున పూజించెను బహు విధమున్॥

తల్లిదండ్రులను ధరణినాథునకు దాసుడు జూపగ నపుడు।
ఉల్లము లలరగ సుచిత్రప్రేమతో నుంచెను దండము నృపుడు॥
కొనియాడుచు తన గురుని తల్లికిని కోర్కెదీర ధనమిచ్చెన్।
అనువుగ బ్రాహ్మణ భోజనమప్పుడు నంచితముగ చేయించెన్॥
శ్రీరఘురాముని దివ్యచరితలను జెప్పెను దాసుడు దినము।
తీరని యానందముచే నందరు *తిమ్మనసుండిరి ముదము॥ ౩౪౪.
కొన్ని దినములట నుండియు దాసుడు కోరెను దాబోవుటకు।
మన్నించెను నృపు డతని బంధువుల మర్యాదలతో పెక్కు॥ ౩౪౫.
వారలేగి రటు స్వస్థానమునకు వరుసను తృప్తినిబొంది।
వారక దాసుడు దత్తునితోడను వచ్చెను వనమింపొంది॥ ౩౪౬.
గాతిరివేళను రామదాసుడును రంజిల్లుచు బోవగను।
పాడుగ నరపతి ప్రొద్దున గురుగన భక్తినిబోవగ నటను॥ ౩౪౭.
తానిచ్చిన యా ద్రవ్యమంతయును తలపడి యటు బడియుండన్।
మానుగ వ్యసనము మిక్కిలి పొందియు మది తలచెను చని చూడన్॥
దాసుం డడవిని దశరథ రాముని ధ్యానించుచు నిర్భరతన్।
భాసిలుచుండెను భయకరమృగముల పజ్తినివిగత భ్రమతన్॥



మహాపాళిలోనొక బ్రాహ్మణుడుండెను మదినతుర గురుతులను।
ఇహమున జేయక యిష్టరీతినటు యింటింటను దిరుగుచును॥ ౩౫౦.
ధనము దొరకనటి హేతువుచేతను దాంపత్యము లేకుండెన్।
పెనగొని బ్రాహ్మణ భోజనమునకును బిలువక బోవుచునుండెన్॥
సరవాన్నంబును చక్కగ దొరికిన సంతోషముదా జెందున్।
దొరకని దినమున నెల్లెడ దిరుగుచు దుఃఖము బహుగానొందున్॥
రామదాసుకై విప్ర భోజనము రాజుచేయు దినమునను।
హేమూరక నీవిప్రుండప్పుడు వేంచేయుచు బహుదినెను॥ ౩౫౩.

---
*బాగు.

ఈరుచిగాంచుచు తలచెనుతనలో నిలను దాసు జేరినను।
మారులేక యిటు యిష్టాన్నంబులు మనకుదొరుకు బహుగాను॥
అనుచు దలంచుచు నప్పుడు వెళ్ళెను నలరామదాసు కడను।
చనువుగాని బహుక్రూర మృగంబుల సరగున దాజూచుచును॥
దగ్గరబోవను ధీరతలేకను దైన్యతతోనుండగను।
గ్రగ్గునదాసుడు జూచుచు రమ్మనె చక్కగ భయ మొందకను॥ ౩౫౬.
దగ్గరవచ్చుచు దండముబెట్టగ దాసుడు యెవరనియడుగన్।
గ్రమ్మగ్గినవాడను నన్నములేకను మహిని కష్టమొందంగన్॥ ౩౫౭.
బాపడనేనిటు బంధువులెవ్వరు ప్రాపుగలే రీభువిని।
దాపుగనిను నేజేరి కృతార్థత ధరగనుటకు వచ్చితిని॥ ౩౫౮.
సత్సంగముచే నన్నవస్త్రములు చక్కగజరుగును ననుచు।
ఉత్సాహముతో వచ్చితినిటకును యుర్వీబంధము లేదంచు॥ ౩౫౯.
దాసుడు వినుకొని తలచెను తనలో తత్పరమార్థముగానన్।
వీసమంతయును తలంపునుంచక విప్రుడు వచ్చెను దీనన్॥ ౩౬౦.
పైగాపైగా లౌకికంబుల బహు సంపాదించినను।
భోగాతురులై సద్భావంబును బొందకుందు రిద్యోడను॥ ౩౬౧.
దర్మాధర్మముల్ దెలియక జనులీ ధరణిని యుందురు బహుగా।
కర్మాకర్మముల్ కాంక్షను చేయుచు కలతనొంది బద్ధులుగా॥
ఇట్టివార్లకు నుపదేశంబును నెపుడుజేయ తగదనియు।
పట్టినభావం బిదియై యున్నను బాపని చూచెద మనియు॥ ౩౬౩.
వర్షబిందువులు నన్ని స్థానముల వాసిగ బడురీతిగను।
హర్షముతోడను నుపదేశంబును నతనికిత్తు ననుచును॥ ౩౬౪.
స్నానముజేసియు రమ్మని జెప్పగ సరగనరిగె బాపడును।
మానుగ నీటిలోమునిగి వచ్చుచును మంచిపువుల గోయుచును॥
మాలగట్టుకొని మెల్లగనడచెను మహి రామదాసుకడను।
నేలంబడుచును దండంబిడియెను నెరిపద్ధతి చొప్పునను॥ ౩౬౬.

ఉపదేశంబును జేసెనుదాసుడు నొప్పగునటు నాతనికి।
అపుడే శిష్యుడు గురునికంఠమున హారమువేసెను పెనగి॥ ౩౬౭.
ఇంతలో దత్తుడు భిక్షమెత్తికొని యెలమిధాన్య మటుదెచ్చెఁ।
సంతసమొందుచు రొట్టెలజేసియు సద్గురు శిష్యులకిచ్చెఁ॥ ౩౬౮.
దాసుడు దత్తుడు చక్కగ దినగను తడమాడుచు ద్విజుడుండెఁ।
ఆసమయంబున నవనీపతియును నటువచ్చుచు దండమిడెఁ॥ ౩౬౯.
నరపతి దెచ్చెను నైవేద్యంబుగ నానావిధ వస్తువుల।
గురుడును కొద్దిగశిష్యుల కిచ్చియు కోతులకిడెదా మిగుల॥ ౩౭౦.
తానటుజేసిన రొట్టెను కొంచెము ధరణిపతికి నియ్యగను।
మానుగదానిని మహాప్రసాదమని మనుకొని భక్షింపగను॥ ౩౭౧.
బాపడు చూచుచు బొందెను తనలో బహుగా వింతనునటను।
ప్రాపుగరొట్టెను నృపుడు యెట్లుదినె జహుమధురపు ద్రవ్యమును॥
కోతుల కొరకై దాసుడు వేసెను గురితో నాకిడ దయ్యెఁ।
చాతుర్యంబై చెలగియున్నదని సరసమనుచు తాననియెఁ॥ ౩౭౩.
ఇంతలో దాసుడు రాజు నరుగుమన యీబాపడు దాసునితో।
పంతముతోడను నుండెను నచ్చట బహుతరమగు దుఃఖముతో॥
మరుదిన భిక్షకు దాసుడు దత్తుడు మానుగనటు బోవగను।
బరతెంచెను యావిప్రుడు వెంబడి పదపడి వారలతోను। ౩౭౪.
వనమునుండుమని దాసుడుచెప్పగ వలదనె నటుమ్రొగ భీతిఁ।
బెనగొని వచ్చుచు లజ్జనువారితో భిక్షమడిగి యీరీతిఁ॥ ౩౭౬.
వ్యసనముతోడను తిరిగియువచ్చెను వారును వెంబడి రాగఁ।
బసగొనిదాసుడు పిండిని రొట్టెల బాగుగ జేసియువేగఁ॥ ౩౭౭.
ఇద్దరు శిష్యులకిచ్చియు దాసుడు నింపుగనటు భక్షించెఁ।
పద్దుగ విప్రుడు బహుదుఃఖముచె భక్షణమును దాచేసెఁ॥ ౩౭౮.
మూడవ దినమున గురుకడవచ్చియు ముందుగ నిలుచుండుచును।
జూడగ నిచ్చట మనోరంజనము చూపున కంటదు తగను॥ ౩౭౯.

వేరొక గ్రామము వెళ్ళెదననగను శిశద పరచె దాసుడును।
వారక నీవటనరిగి తేనియు వచ్చిబోవుచుం డిటను॥ ౩౮౦.
ఇదివిని యాతండేగెను గ్రామము నిష్టభక్షణము కొఱకు।
కుదురుగ తిరుగగ నటనొకగేస్తుడు గురూప దేశ మొందుటకు॥
ద్విజులతో గురువుకు తదియారాధన తీరుగ జేయుటగనుచు।
నిజపత్నిని యాద్విజుకూర్చుండుచు నిండారంగను దినుచు॥ ౩౮౨.
ఈసాదువునే గురువుగ జేసిన నిష్టంబగు భక్షణయుఁ।
వాసిగ దొరుకును యనుచుదలంచుచు వచ్చెసాధు సన్నిధియుఁ॥
దండము బెట్టగ సాదువుబలికెను తగుపని యిట నేమనియు।
వెండియు నతడనె యొంటి బ్రాహ్మణుడ విపుల శ్రమను నేగొనియు॥
రామదాసునిఁ గురువుజేసికొని రంజింపక నామనను।
నేమముతో మీ చరణాశ్రయమును నెనరున బొందందలచు॥
వచ్చితి నన, సాదువనెను యొకనికి వలసియం కితముగుచును।
మెచ్చదులోకము మరియొక గురువును మీఱిచేయ దలపగను॥
తల్లిదుర్బలము నొంది యుండినను తనయుడు మరియొక వనితఁ।
ఉల్లంబలరగ తల్లిగజేయను నొప్పనె లోకము చిరతఁ॥
ముందటి గురువును మానుకొనుచుదా మోదంబున మరియొకరఁ।
సుందరముగ జేయుట నిరుతంద్రుల సుతుడగు లోకముమీఱఁ॥
దాసుని సంగను దుర్లభమైనను తథ్యంబగు మంత్రమును।
వేసారక నీ మనసున నుంచుచు విహరింపుము వీధులను॥ ౩౮౯.
గురువును విడిచియు మరియొక గురువును కోరగూడ దనియనగఁ।
తిరముగ నాతడు దండముబెట్టుచు ధీరత పదముల బడగఁ॥ ౩౯౦.
సాదువు వలదని జెప్పగ ద్విజుడును సమపదేశ మొందకను।
పాదముపవలను యనియు దండమిడ పరగ సాదువనెమున్న॥
దాసుని మంత్రము తిరిగి యిచ్చి మరి తర్లిరమ్మని జెప్పగను।
వాసిగ వనమును వేంచేసియు నా వరదాసుని గానకను॥ ౩౯౨.

అనేకదినములు తిరుగగ దాసుం డతని కగుపడె నొకదినము।
మనివి జేసెనటు దాసునిగాంచుచు మరియొక గురుగొంటిసుము॥
మంత్రము మరలను దీసికొనుమనియు మానుగ నతడనగాను।
తంత్రములేకను దాసుడు బలికెను ధరసచ్ఛిష్యునీవలెను॥ ౩౯౮.
చూడలేదు నాకేమి యవగుణము చూచితివని యడుగగను।
వాడును బలికెను నీపరమార్థము వసుధకతిననము నాకగును॥
ఇదివినిదాసుం డాతనినోటను నుదకము పుకలింపించెన్।
ఒదిగియు బాపడు యుమియగనందును నొగిమంత్రము వెలివచ్చెన్॥
పదమూడక్షర పత్రియు భూమిని బాగుండగ దాజూచి।
చెదరక నీవును మరియొక గురువును జేసికొమ్మని సెలవిచ్చి॥
పొమ్మని జెప్పగ ద్విజుడు సాదువుని పొంతజేరి తగమరియు।
సొమ్మసిల్లగను జరిగినసంగతి సూటిగ జెప్పగ వినియు॥ ౩౯౯.
అమిత విరాగియై యడవుల దిరుగుచు నతిభక్తిని హరిదలచున్।
కమల లోచనుని గాంచుచు నెప్పుడు ఘనానందమున మించున్॥
అనఘుండగు శ్రీరామదాసుని యంకితమును యటువిడిచి।
నెనరున నాయెడవచ్చితి నీవును నేనుచేర్చ నినువలసి॥ ౪౦౦.
మంత్రాక్షరముల మాఱ్చుంజేసిన మహానుభావునికన్నన్।
సంత్రాణులు మరిలేరి జగతిని సరిగాదని వెళ్ళుమనన్॥ ౪౦౧.
ఇరుదెసలందున నేమియు గానక యేహ్యామొందెను ద్విజుడున్।
చిరతర జిహ్వాచాపల్యంబును జెందవలదు ముముక్షువుడున్॥ ౪౦౨.

---

దాసుండడవిని వసించియుండగ దారినినడచిరి జనులు।
వాసిగ వారల నడిగెనుదాసుడు వలసిబోవు మీరెటులు॥ ౪౦౩.
పండరి యాత్రకు బోయెదమనుచును బలుకుచు మరియును వారు।
నిండారగ శ్రీపండరిపతిగను నేత్రోత్సవమును గోరు॥ ౪౦౪.

వైరాగ్యముతో వనము నుండెదవు వచ్చిచూడు నీవటను।
సారాంశంబుగ కరము జఘనముల చక్కనుంచుమూర్తియును॥
భక్తజనంబుల బ్రోచుచు నెప్పుడు పాండురంగ డటనుండు।
సక్తులై యాతనిచూచిన యెడలను సౌఖ్యము మేలై యుండు॥
ఇదివిని దాసుడు వారికి బలికెను నిలను నాకు రాముండె।
అతడె దేవుడు నతడే కులగురు నతడె సర్వము చూడబడె॥ ౪౦౭.
అన్యము నెద్దియు కోరదు నామది యతని తప్ప మరియొకని।
పుణ్యంబనుచును బోయిచూచుటకు బురికొల్పదు మనసువిని॥౪౦౮.
అనుచు జెప్పుచును నయోధ్యధీశా యాంజనేయ జయవరదా।
కనుగొందును నినుకనులపండువుగ కరుణాకర రఘునాథా॥ ౪౦౯.
ఇదివినివారలు యేకనిష్ఠుడై యెలమినుండు వాడనుచు।
పదపడి వెళ్ళిరిపండరి పురమునకు మరుదినమితరుల గనుచు॥ ౪౧౦.
విఠలరంగని చూడనచ్చటికి వేంచేయుండనగాను।
కఠినమగును మది శ్రీరఘురాముని గానకుందు నే నటను॥ ౪౧౧.
వచ్చినవారలు జెప్పిరి యప్పుడు వ్యాపకుడగు రాముడును।
సచ్చిత్సుఖునిక జ్ఞానదృష్టిచే సరగున గననగుననను॥ ౪౧౨.
దాసుడు బల్కెను రాముని భజనయె ధ్యానజ్ఞానమగునిలను
వాసిగ రాముని వర్ణించినయెడ వచ్చువిదేహస్థితియును॥ ౪౧౩.
సహజముగానే తన్మయలయ్యము చక్కగనగు నియ్యెడను।
ఇహమున రాముని రూపము నాయెడ నేపున నుజ్వలమగును॥
గతియగునాకును జానకిజీవుని ఘననామం బెల్లపుడు।
ఇదియెసుఖం బౌనిలలో నాకును నితరమెరుగనే నెపుడు॥ ౪౧౪.
నిశ్చయమిదియని నాతడు జెప్పగ నిందువింత బొందుచును।
పశ్చిమ దిశకును వారలు వెళ్ళిరి పండరిపతిగనుటకును॥ ౪౧౫.
ద్విజరూపంబును దాల్చియువిఠలుడు *దీకొన వచ్చె దాసుకడక।
నిజముగనాకలిగొన్న వానివలె నెలమినడిగె నన్నమటక॥ ౪౧౬.

*దీకొను-యెదుర్కొను.

అటులనె నిచ్చెదననుచు జెప్పుచును నప్పుడె నీరాడించెఁ।
పటుతరముగనే విస్తరయందును భక్ష్యంబునువడ్డించెఁ॥ ౪౧౯.
అతిముదమున నందరును గూడుకొని యప్పుడు భక్షించిరటఁ।
ధృతిగొనిద్విజుడును కరముల గడిగియు తిరముగనటుగూర్చుండఁ॥
ఎక్కడివారని దాసుండడుగగ నెలమిని శ్రీహరిజెప్పె।
నిక్కంబుగనే పండరివాసిని నెరి కుటుంబమున నొప్పె॥ ౪౨౦.
భిక్షాటన చేబ్రతుకుచునుండుదు పేదలు యజమానులను।
*విక్షావముగను వచ్చుచునుండుదు వేంచేపింతు పురమును॥ ౪౨౧.
నీదుసమానపు యజమానునినే నెక్కడచూడను మరియు।
పాదుగనీవును పండరివచ్చిన భవ్యంబగునీకనియు॥ ౪౨౨.
ఇదివిని దాసుడు రామునివినినా కిష్టపడరు మరియొకరు।
అదిగని హరియనె యాంజనేయుడు నటుండి రామునిజీవు॥ ౪౨౩.
వినుకొని దాసుడు కలతమనసుచే వేగబోవుటకు తలచెఁ।
అనువుగ దత్తుని బిలిచియు జోలెను నాతనికిచ్చియులేచెఁ॥ ౪౨౪.
ద్విజుడు వారితో దారినడచుచును దినమును భిక్షాన్నమును।
గుజగుజదినుచును సంబాళింపుచుగొని చనెపురంబునకును॥ ౪౨౫.
దాసునికాళ్ళకు ముల్లొత్తగ హరి తానెచేత దీయుచును।
వేసారక తగవచ్చిరిపండరి విఖ్యాతం బగునట్లుగను॥ ౪౨౬.
చరాచరంబుల పాండురంగునే జనులటుగను చుండుచును।
సరాళముగతగు వందనమిడుతురు సకలనరుల కయ్యెడను॥
అనేకక్షేత్రము లిలలోనుండిన నభిమానము విడిపించె।
ఘనక్షేత్రం బిదికలివైకుంఠమని కనిదాసుడు సెలవిచ్చె॥ ౪౨౭.
ద్విజవరు డప్పుడువెళ్ళి వత్తునని తెలిపించియు తాఁబోయెఁ।
సుజనులకూటమి జూచుచు దాసుడు సొక్కియేమి గనడయ్యెఁ॥
దత్తునిగాంచుచు ద్విజుడెక్కడయన తల్లిపోయెననగాను।
మెత్తనజూచుచు మఱపించును హరి పొత్తుగ దెచ్చెను యిటను॥

*విక్షావము–గ్రాచుట.

గరుడ టెక్కెమును గాంచుచు రాగను హరిదాసుల కూటమును।
హరివిఠ్ఠలయను నమిత ఘోషమును నాలకించి రాగాను॥ ౪౩౧.
రాముని పై కడురమ్యతనొందుచు రామరామ రమ్మనుచు।
ప్రేమభావ మటు ప్రజ్వలింపగను ప్రీతిని బొందుచు పిలుచు॥౪౩౨.
నిన్ను వినాగా పాడెద రెవరిటు నీవునేను నదిమాన్పు।
పన్నగనీవును దర్శన మియ్యుము భద్రగిరిశ యనిజెప్పు॥ ౪౩౩.
తాళవాద్యముల నామఘోషముల తనివిదీర గాంచుచును।
మేలుమేలనుచు నానందంబును మిగులనొంది పొగడుచును॥౪౩౪.
సాధులకెల్లను నమస్కరించుచు సరగున గనె మారుతిని।
పాదుగ మ్రొక్కియు సాష్టాంగంబుగ భక్తిబలికె నిట్టులని॥౪ ౩౫.
సీతారాముం డెటుబోయెనో మరి జేరి తీవునిచ్చటను।
నాతోపలుకుచు పండరినాధుడు నన్ను దెచ్చె నియ్యెడను॥ ౪౩౬.
అంజనీసుతు డప్పుడు బలికెను నయోధ్య రాముడు భువిని।
సంజాతుండై యనేకసుకృతముల్ సలిపి త్రిపాద్విభూతిని॥ ౪౩౭.
పొయ్యేసమయము జూచుచు నేనును పొందుగ నడిగితినతని।
చయ్యెన నినుమరి నెపుడుజూతునిటు సాదరతక యనగవిని॥
సీతాపతి తగ జెప్పెనునాకును శ్రీకృష్ణా వతారమున।
ప్రీతిని దర్శనమిచ్చెద ననిచనె పిదపను వైకుంఠమున॥ ౪౩౮.
సేతుబంధరా మేశ్వరమున నే చిరకాలము నుండుచును।
సీతారాముని చింతనచేయగ చేరెనారద మునియును॥ ౪౪౦.
శ్రీరఘురాముని దర్శనమెపుడౌ చెపుమనినే నడుగగను।
వారక నన్నుఁ యాత్రదిరుగుమని వరుసజెప్పి వెళ్ళగను॥ ౪౪౧.
దేశయాత్రలను జేయుచుద్వారక దివ్యపురము జూడగను।
ఆశనుకాంచనపుర లంకయెనని, నటవచ్చుట నెట్లగును॥ ౪౪౨.
తోకతో పురమును జుట్టంబోవగ తొలిమునియగునారదుడు।
జోకనరిగియనె బలరాముండును సుఖపాలకుడైయుండు ౪౪౩.

ద్వారకపురియగు లంకగాదనియు తాఁచెప్పగ మరినేను।
కోరుచు రామునినామం బీతడు గొనుచెట్లని తలచుచును॥ ౪౪౪.

ఉపవనమున కేతెంచుచునచ్చట నూడబీకి వృక్షముల।
కపటము లేకనె కావలి వారల కడువడి గొట్టితినేల॥ ౪౪౫.

బలరాముండను పేరువిడువవలె పాడుగ నటుగాకున్నఁ।
సలలితముగతగు సైన్యముతోడను సలుపు యుద్ధమునుతిన్నఁ॥
ఈరీతిగనే జెప్పగవారలు నేగితెలుప కృష్ణుకడఁ।
తీరుగ నాతడు గరుడుని బిలుచుచు తిన్నగబలికెను జూడఁ॥

వానరుడొక్కఁడు వచ్చెను పురికిని వాసిగనీవునునతని।
మానము తోడను బిలిచి రమ్మనగ మహివచ్చియు నన్నుగని॥
బలరాముండును కృష్ణమూర్తియును బిలువ నంపిరనగాను।
సలలితముగనే నాతని చెంపను చయ్యన గొట్టగ నటను॥ ౪౪౯.

దెబ్బకు మూర్ఛిలి తిరిగిలేచియు దిగ్గున వెళ్ళెను పురిలోను।
గొబ్బునదెలిపెను కృష్ణమూర్తికిని గురి సంగతి నంతయును॥ ౪౫౦.
ప్రద్యుమ్నునిగని బలికెను కృష్ణుడు ప్రబలసేనను గొనుచును।
విధ్యుక్తంబుగ గట్టి వానరుని వేదెమ్మని బలుకగను॥ ౪౫౧.
అనేకసేనతో నాతడు రాగను నందర జుట్టి తోకను।
బెనగొనిమింటను గిరగిరద్రిప్పగ పెద్దధ్వనుల వేయగను॥ ౪౫౨.
శ్రీహరిగనుగొని చెప్పెగరుడునితో శీఘ్రంబుగ వానరుని।
సాహసముగ నటకేగియతని నిటు సరగ రాము బిలిచెనని॥ ౪౫౩.

విన్నపించుచును విహితపరచుకొని వే బిలిచియురమ్మనగ।
మన్నింపుము నను మాధవకృష్ణ మరినేఁబోయిన నటుగా॥ ౪౫౪.
కోపము తోడను గొట్టిచంపు నను కొంచెపు కోతి కాదనగ।
ప్రాపుగ నప్పుడు కృష్ణుడుబల్కెను పరగ రామభక్తునిగ॥ ౪౫౫.
దెలియుము నాతని ధీరుడు మారుతి దివ్యజ్ఞానియు హరిదాసు।
మెలయుచు రాముని మాట వినంగను మిగులనమ్రుండై వచ్చు॥

వినియునటులనే జేసెదననుచును వినతాసుతు వచ్చుచును।
పనితరముగనా వైనతేయుడనె వరుడు రాముడు బిలిచెనను॥ ౪౫౭.
ఇదివినగానే దండము బెట్టుచు యిష్టముతో నిరువురును।
పదపడి దారిని వచ్చుచునుండగ వరుడు కృష్ణు ద్వారకను॥ ౪౫౮.
సత్యభామ నటుపిలిచియు జెప్పెను సరిసీతారూపమును।
ప్రత్యక్షంబుగ పొందుపరచుకొని బాగుగ రమ్మనగాను॥ ౪౫౯.
అనేకసొమ్ముల నామెధరించియు నాతని కడరాగాను।
*మనితము సీతాదేవియు కాదన మరల జేయు టేమియను॥ ౪౬౦.
నీవును పదియారువేల స్త్రీలును నెనరున రుక్మిణికడను।
బోవుచు వేడిన బూనునామెయును పొసగ సీతరూపమును॥ ౪౬౧.
ఇదివిని వారలునటులనె జేయగ నెలమివచ్చె రుక్మిణియు।
పదపడి కృష్ణుడు రాముడు కాగనె భామిని సీతకుసరియయ్యె॥
ఏకాసనమున నిరువురుండగను నిల బలుడును లక్ష్మణుగ।
జోకను యాదవుల్ వానరులగుచును సొగసుగజూపింపంగ॥
ఆసమయంబున నేను బోవగను నల రాముని జూచుచును।
వేసరిల్లకను దండములిడితిని విపులానందముతోను॥ ౪౬౪.
శ్రీరఘురాముడు బలికెనప్పుడును జెప్పితి నీకును మునుపు।
తీరుగ కృష్ణుని యవతారంబున తేటగ జూపెదరూపు॥ ౪౬౫.
అదియును సఫలంబయ్యెను నిప్పుడు నవతారపు లీలలలో।
పదపడి వేరొక భావనుంచకుము పరతత్వంబొకటిలలో॥ ౪౬౬.
జెప్పియు నిట్టుల కృష్ణరూపమును చేకొనియెను రాముడును।
అప్పటినుండియు రామకృష్ణులను నర్చనజేయుచు నుండుదును॥
ఈకథ జెప్పుచు నాంజనేయుడును నేమి బల్కకుండగను।
ప్రాకటముగ నా రామదాసుడును బరతెంచె మంటపమును॥ ౪౬౮.
ఎదురున చూడగ పాండురంగడును నిటికెలపై నిలుచుండి।
పదపడియుండగ దాసుడు జూచుచు బద్ధాంజలుడై యుండి॥ ౪౬౯.

---

*మెరుగబడినది.

చాపబాణములు నెచ్చటికేగెను సర్వేశ్వర రఘునాథా।
ప్రాపుగ సరయును నయోధ్యయెచ్చట పరగవెళ్ళె మన్నాథా॥
వానరసేనకు మారుతియొక్కడె వరుసను నున్నాడిటను।
జానకియెచ్చటి కలసివెళ్ళెనో చక్కగదెలుపు మనియును॥ ౪౭౧.
ఆర్తిని జెప్పుచు కన్నీరొలుకగ హరియాసంకల్పమును।
పూర్తి జేయుటకు దాసునికొఱకై పొందె రామరూపమును॥
సరయూనదియును నయోధ్యపురియును చక్కగ నటుశోభిల్లెఁ।
ఆరుదగు వానరు లమరియుండగని యతిమోదము విలసిల్లెఁ॥
అనేకభంగుల రామదాసుడును హరిస్తోత్యము నటుజేసెఁ।
పనిబడి కొందరి భక్తుల కండ్లకు పరగరాముడె కనుపించెఁ॥ ౪౭౪.
ఇదిగని వారలుదాసునికై హరి యిలనురూపు మార్చెనని।
అతిముదమొందుచు దాసుని పొగడుచు నటురాముని రూపుగని॥
మునుపటివలెనే విఠలరూపమును మోదముతో గనునటుల।
చనువున నీవును శ్రీరఘురాముని సలుపు స్తోత్రముమిగుల॥ ౪౭౬.
అందుకు దాసుడు నటులనెజేయగ హరివిఠలుగ విలసిల్లెఁ।
పొందిరి భక్తులు పూర్ణానందము పుణ్యుడు దాసుడనిరెల్లఁ॥
కథనుజెప్పుమని కంజదళాక్షుడు గారాబముతో బలుకఁ।
ముదమున దాసుడు మంటపమందును మురుపు నగవుతోరాగఁ॥
అంతరంగమును నమరిన భక్తులు నచ్చట గూర్చుండగను।
పంతముతోడను రామదాసుడును పలుకదొడగె వార్లకును॥
సాదు పురుషులిటు రాముని మీలో చక్కగ గను వారలును।
వేదవేద్యులై భక్తినిష్ఠ తగ వెలసి మీర లుండగను॥ ౪౮౦.
వనములయందే వాంఛను దిరుగుచు వనచరములతోనుండి।
ఘనపురాణముల జ్ఞానశాస్త్రముల గని పఠి యింపకనుంటి॥ ౪౮౧.
సంగీతంబును సాహిత్యంబును చక్కగ నెరుగను నేను।
రంగుగ సభలో సారాసారపు రమ్యవార్త నెరుగనను॥ ౪౮౨.

వేదాంతార్థము తాళస్వరముల విరళమెరుగ నే ననుచు।
సాధారణ పశు సమాన హీనుని సాక్షియగును హరియనుచు॥
అతినైచ్యంబును నిటుదాగొనుచును నారంభించెను కథయుఁ।
పతితపావనుని భవ్యనామమును బాడియాడుచును కూయుఁ॥
కలియుగమందును శ్రీహరినామమె కాంక్షిత మీజనులకును।
తొలి యజామిళుడు గణికాస్త్రీయును *తొర నేగిరి హరిపదమును॥
వాలాకోళి యనునొక బోయెయు వాల్మీకుడను మునియయ్యెఁ।
తాళిమిలేకను తారకమంత్రము తరింపజేసె ధరనెయ్యెఁ॥ ౪౮౬.
మంత్రంబులలో మూలమంత్రమై మహిని రామ మంత్రమగు।
యంత్రతంత్రము లిదివిన యిలలో ననుసంధింప నేమియగు॥
సారతమంబగు రామనామమును జపంబుచేసిన యెడలఁ।
పారములేని భవాబ్ధి దాటి హరి పదమొందెద రియ్యెడలఁ॥ ౪౮౮.
అనిబహు భంగుల హరికథజెప్పగ నానందించిరి యటను।
చనువున హారతినిచ్చిరి హరికిని జనులు విఠలయనగాను॥ ౪౮౯.
ఏడుదినంబులు నచ్చట నుండుచు నేగిరి గోపాపురికి।
బాడుచు నాడుచు భక్తులు కృష్ణుని ప్రబల క్రీడలను మెలగి
దాసుడు వారల జూచుచు తనలో తరుచగు నానందమున।
వాసిగ పండరి తిరిగివచ్చెను వర్ధిల్లుత్సవమునుగాన॥ ౪౯౦.
హరి రథోత్సవమప్పుడు జూచుచు నందరేగ దలచగను।
వెరవక దాసుడు నర్ధరాత్రిలో వెళ్ళెసన్నిధి కడకును॥ ౪౯౨.
బీగంబప్పుడు క్రింద బడంగను బిడియ పడక లోచనుచు।
బాగుగ శ్రీహరి పండరినాథుని భవ్యరూపు నటుగనుచు॥ ౪౯౩.
చరణంబులకును దండము బెట్టుచు సన్నిధి ముందుగ నిలిచి।
వెరపులేక దా వేంచేయుటకై వేగమె శలవును వలసి॥ ౪౯౪.
అడుగగ విఠలుడు తిరిగియెప్పుడటు యరయుచు వచ్చెదవనగ।
కడుముద మొందుచు దాసుడుబలికెను కారణమందున కీవెగా॥

---

*శీఘ్రము.

బాపడవైనను పండరిదెచితివి పాండురంగా కృపాళో।
తాపమనుచు నాకాళ్ళను ముల్లును దయను దీసితివి యిలలో॥
సజ్జనావళిని చక్కజూపితివి సర్వేశ్వర గోవింద।
ముజ్జగములనీ ప్రేమ మహిమయును ముగియజెప్ప కాదుగద॥
వారల కూటమి వల్లను నబ్బెను సారతరంబగు సుఖము।
తీరుగ నినునే నడిగెద నొక్కటి తెరువుతోడ నాకిమ్ము॥ ౪౯౮.
శ్రీవత్సంబును నుంచినక్రియ నను శ్రీధర, మరువగవలదు।
దేవా, నీకాళ్ళిటికెల పైనను తేటనుంచు గతి సరుదు॥ ౪౯౯.
ఇదివిని విఠలుడు నీవద్దనునే నెపుడు మరవకుందు నను।
కదురుగ దాసుడు రుక్మిణినింగని కోరినడచె మార్గమును॥ ౫౦౦.
దారినడచుచును రామమయంబని తనలో తా జెప్పుచును।
వేరులేక మరియిచ్చట నచ్చట విష్ణుమయంబు యనుచును॥ ౫౦౧.
ఏకరీతిగా నెచ్చట రాముడె యేర్పడియున్నా డనియు।
జోకను తలచుచు నానందంబున సూటిచేరె మహాళియు॥౫౦౨.
అవనీనాథుడు గురునిరాకవిని యపుడె వచ్చెచూచుటకు।
సవినయముగ తా పూజల సలిపెను సక్తిగ నాచార్యునకు॥ ౫౦౩.
ఆచార్యుండొక మాసమువరకును నటుచని యుండగనితడు।
*వాచవిలేకను ఫలహారముతో వరుసనుండె యానృపుడు॥ ౫౦౪.
ఎచ్చటి కేగితీరన దాసుండనె నెలమి పండరిపురమునకు।
సచ్చరితుండగు విఠలరంగడె చనుదెంచెను బిలుచుటకు॥ ౫౦౫.
ఉపవాసంబుగ నుండెద వీవని నొప్పగ వచ్చితి శీఘ్రమును।
నెపమెన్నక గృహమేగి పారణను నెలమిజేయమనె గురుడును॥
ఉపవాసము నీవేలయుంటివిటు యుచితముగాదని యనుచు।
చపలతలేకను యాత్రజరిగెనన చనె భూపతి గృహమనుచు॥ ౫౦౬.

---

*వాచవి నోటిరుచి.

ఆదినముఃలలో నరంగుజీబుషా యలరాజ్యము గెలుచుచును।
పాదుగబంపెను జిలేదారునటు పరగ మహౌాళి యూరుకును॥
అచ్చటివనమున దాసుడుదిరుగగ నరయుచు జిలెదారుండు।
హెచ్చగు విల్లంబుల నందుకొనియు నేతెంచెను యొకనాడు॥
విల్లంబులతో నాడుచు గురుతుల వేయరాక నుండగను।
మెల్లగ దాసుడు వచ్చిచూపుచును మెలగవేసి గురుతులను॥ ౫౧౦.
శరమును విడిచియు చేతినిదానికి చయ్యన బట్టగవలెయుం।
తిరముగనిదియే ధీరత్వంబని దెల్పగ యవనుడు మరియుం॥౫౧౧.
అసాధ్య మదియని జెప్పగదాసుడు నటు జేసెదే ననియనగ।
వెసతో యవనుడు విల్లును యీడ్చియు వేగశరము వేయంగ॥
దాసుం డెగురుచు దెచ్చెనుచేతిలో దానిబట్టుకొని యపుడు।
నీసరియెవరును జేయరిచటయని నెనరున ననెయవనుండు॥ ౫౧౩.
దాసుం డనియెను శూరుడు శరమును దాటజేయు దూరమున।
వాసిగజెప్పుచు విల్లంబులతో వేసెను యొకవృక్షమున॥౫౧౪.
శరమువెళ్ళినా చెట్టునువిరుచుచు చాలాదూరముగాను।
అరమరలేకను యవనుడు జూచుచు నాశ్చర్యమునొందుచును॥
భూమండలమును పూర్తిగగెలుతువు పుణ్యుడవని చెప్పగను।
క్షేమంబలరగ జిలేదారునకు చెప్పెదాసుడటుగాను॥ ౫౧౬.
సర్వఘటంబుల చేరియుండునది చైతన్యంబే గనుక।
ఉర్విని తురకలు హిందూవులతో నొప్పచునుందురు కనగ॥ ౫౧౭.
ఈశుడు తురకల సృష్టించెనుయని హిందులు చోరసృష్టియని।
పేశలముగ మీ కురాను యందును పెనగి వ్రాయబడినదని॥
ద్వేషబుద్ధిచే తల్లడబడుదురు తిరసద్భావము లేక।
వేషభాషలటు వేరైయున్నను విహితమెవరికి నిగాక॥ ౫౧౯.
వైరభావమును విషయాసక్తియు వాంఛతోడ జేయుచును।
కోరక విడుతురు స్వహితమంతయు గురు జ్ఞానము లేకయును॥

ఇదివిని యవనుడు కాళ్ళనుబడుచును నిష్టమేమొ యడుగుమను।
బదులనె దాసుడు మనయాటనునిట పాడయ్యును యీచేను॥
కాపువానికిని భూమియినాముగ కాకితమును వ్రాయమనుఁ।
ఏపుమీర యా యవనుండటులనె యిచ్చె యినామా చేనుఁ॥

---

యవనుండేగెను నటుపైదాసుం డటనొక గ్రామముచేరఁ।
సవినయముగ హరికీర్తనజేయగ జనులకు భక్తియునమరెఁ॥ ౫౨౩.
పాదాశ్రయమును వారలుజేయగ పరగజెప్పనామమును।
వేదతుల్యమని దాసుని కవితల వేగవ్రాసి పఠింపగను॥ ౫౨౪.
నామమహిమలను నచ్చటజెప్పుచు ననఘువెళ్ళె షాపురము।
ప్రేమను గ్రామాధిపతి పుత్రియు పెనగివచ్చె నటుసుమ్ము॥ ౫౨౫.
పరమార్థమునే గోరివచ్చితన భావశుద్ధి నింగనుచు।
తరలక తారక మంత్రము జెప్పెను దాసుడు ప్రేమనుమనుచు॥
కొన్నిదినంబు లుండుచు నచ్చట కోరివెళ్ళెనడవికిని।
పన్నుగశిష్యులు వెదకుచు వచ్చిరి భక్తిపూజ లొనర్పగని॥ ౫౨౭.
సిరపురమను నొకగ్రామము నందును చేసెను భిక్షాటనయు।
హరికథజెప్పెను యారేయినియట ననేకులును తగవినియు॥
అనుతాపంబును బొందుచు వారలు నతనిపదము బట్టగను।
అనువుగ నచ్చట కులకర్ణమునకు యంబజి యనుపుత్రుడును॥
మతిభ్రంశంబున తొందర నొందగ మాతాపితృ లిరువురును।
హితవున కొడుకును చేతబట్టుకొని యేగియు నిడిదండమును॥
కొడుకును దాసునికాళ్ళను వేయుచు కొమరుడు మీవాడనుచు।
విడిచితిమీతని మీచరణముకడ వెలయగ చేకొండనుచు॥ ౫౩౧.
ఇదివినిదాసుడు భూతావరణము నితనికినిటుదగిలెనని।
సదయుడు సద్గురునామ ముండగను సరగబోవు భూతమని॥ ౫౩౨.

పంచాక్షరిచే పంచభూతముల బారదోలెదరు ఘనులు।
అంచితముగ పరిశుద్ధత నొందియు నాత్మానుభవపరులు॥ ॥౩౩.
ఇటులం బలుకుచు నైదుశ్లోకముల నెలమిజెప్పగా నపుడు।
బట్టెను కాళ్లను నంబజీయునటు భావశుద్ధియును నెగడు॥ ॥౩౪.
మనోభ్రంశములు మానియు సేవను మరిగెను తగ నంబాజి।
కనుగొని వెళ్ళిరి తండ్రియు తల్లియు కడుమోదమునటు గాంచి॥
దాసుడంబజికి నుపదేశించెను తారకమంత్రము నిలను।
వాసిగగలిగెను విరాగభక్తియు వసుధను విజ్ఞానమును॥ ॥౩౬.
సకలార్థంబుల చక్కగ నెరిగియు స్వరరాగము తాళమును।
ప్రకటిత కవితల గురుడును జెప్పగ బాగుగాను వ్రాయుమును॥
సేవను నెప్పుడు సాదరుడగుచును శిష్యుడచట నుండగను।
*దేవనమున దాసుడరణ్యమునకు తీరుగతా వెళ్ళగను॥ ॥౩౮.
ఆకాబాయియు నచటికేగుటకు నాశతోడ యత్నించున్।
రాకూడదుయని దాసుడు జెప్పెను రసముగాని వనమనుచున్॥
అనువుగనామెయు తనుమనధనముల నాచార్యార్పణమనియు
వినుతిజేసె నటువచ్చెదననుచును వెంబడె యడవికిననియు॥ ॥౪౦.
ఇదిగనిదాసుం డున్మత్తుని వలె నెలమిజేసె చర్యలను।
పదుగురకును నీసొమ్మునంతయును పంచిపెట్టు మనగాను॥ ॥౪౧.
ఆకాబాయీ యటులనె జేసియు యాక్షణమందును తాను।
పోకడలేకను బట్టెనుదాసుని పూజిత చరణంబులను॥ ॥౪౨.
అటువెనుకను శ్రీదాసుడు శిష్యులు నరణ్యమున కేగుటయు।
ఇటనట శిష్యులు నేగుచువనమున నెల్లపనుల సేయుటయు॥ ॥౪౩.
బావిగట్టు నటు కూర్చుండెను తగ పరితృప్తిని దాసుండు।
తావి గలుగువట వృక్షంబచ్చట తగిన శాఖలతో నుండు॥ ॥౪౪.
ఇదిగనిదాసుడు నూతి ప్రక్కనటు యెగయుకొమ్మ గొట్టినను।
పదుగురికిని నిర్మలమగునట్టుల బావియుండు యెప్పుడును॥

*దేవనము-క్రీడ.

అనుచుం జెప్పుచు కొమ్మనుగొట్టుట కాజ్ఞనిడగ శిష్యులలో।
అనువుగ నంబాజీయును వెళ్ళెను నచటనుండు గ్రామములో॥
కొడవలి దెచ్చెను, యింతలోశిష్యులు కోరినంటచేయగను।
అడుగున కొమ్మకు రామదాసుడును హరిచింతన నుండగను॥౫౮౭.
త్రాడును గట్టుచు చెట్టునెక్కుచును దాసునిగని యంబాజి।
వేడికొనెను నటుజరుగుమటంచును వృక్షపుకొమ్మను గాంచి॥
దాసుడు బలికెను కుశలత్వంబును తలపడి చూపుమునీవు।
వాసిగవినుకొని శిష్యుడు తనలో వలచుచు గొట్టంబోవు॥ ౫౮౯.
ఆచార్యునిపై కొమ్మబడినయెడ నదిగని యోర్వను నేను।
ప్రాచుర్యముగా నాదుఃఖమునకు పరికింపను నేనిలను॥ ౫౯౦.
తలచుచు నిట్టుల తఱచెను కొమ్మను తానుండుచు కొమ్మపయిన్।
బలమున బడియెను కొమ్మయు క్రిందను బావిని శిష్యుడు బడియెన్॥
కొమ్మబడెను నటు దాసుని ప్రక్కను కొలనున నీరధికముగాన్।
దిమ్మరుచుండగ సకలశిష్యులును తేఱిచూచిరటు వెలిగాన్॥ ౫౯౨.
అన్నముసిద్ధమై యమరిన దనుచును నాక బాయిచెప్పగను।
వన్నుగ దాసుడు భోజనమునకై వదపడి తాలేవగను॥ ౫౯౩.
శివాజి రాజా వేళరాగ నటు శ్రీగురునాథుండతని।
నవరించుకొనుచు భక్షణ చేయను సరగున కూర్చుండుమని॥౫౯౪.
పలుకగ నృపుడు మహాప్రసాదమని బాగుగ కూర్చుండగను।
బలయుతుడంబజి చెట్టునుండియటు బావిలోపడి మునిగెను॥
అనుచును బలికెడి యాకాబాయికి నరయగ దాసుండనును।
పనిబడికొంచెపు దూరము బోయెను పరగ వచ్చును వెనకను॥
అన్నంబిడుమని యాచార్యుండన నటులజేసె నామెయును।
తిన్నగ దాసుడు చెప్పెనప్పుడటు ధీరత శిష్యులకిలను॥ ౫౯౭.
నాలుగు కాష్టముల్ నదిప్రవాహమున నడితిజేరి రాగాను।
వాలుగ నుడిలో పట్టుబడిన నటు పరిపరిత్రోవల చనును॥ ౫౯౮.

జన్మము వరకును తోడునెవ్వరును చక్కగ నుండరు భువిని।
సన్మానముతో సాకిన తల్లియు చనిపోవును కాలుగని॥ ౫౫౯.
వేదోక్తముచే వైవాహికమై వెలసినట్టి భార్యయును।
†ఏదెడుపతి చన వైధవ్యంబును నెలమిపొందు నివ్యోడను॥ ౫౬౦.
ఇతర బంధువు లెవరికినెవ్వరు నేర్పడి యుండరు జగతి।
సతతంబిటులని చక్కదలంచుచు సర్వేశ్వరు నెంచుమది॥ ౫౬౧.
సంపదవైభవ సరసపదార్థముల్ చాలుగ నుండే వరకు।
కంపము లేకను నాదినాదియని కఠిన కాలము గని మ్రగ్గు॥ ౫౬౨.
నాలుగు దినముల రుణానుబంధము నావుడంబజీ యెవడు।
మేలుగ రాముని మనమున దలచుచు మించు ఖేదమునువీడు॥ ౫౬౩.
ఈవిధమున నాదాసుడు జెప్పుచు నెలమినిదా భక్షించెను।
భావబంధమున శిష్యులనందర పదపడి యటు తినిపించెను॥ ౫౬౪.
గురుమహిమను తగ గాంచుచు నరపతి గురిగ వెళ్ళె నగరమును।
సరగున దాసుడు మరియొక యడవికి చనె నొకరికి దెలియకను ॥
ఆరుదినంబులు నటుయిటు దిరుగుచు నచట దాసు డుండగను।
ఊరునుండు యా నరులు దాసుపై యొప్పని కథలనగాను॥
ఏడవదిన మాబావిగట్టునను నేగె రామదాసుడును।
పాడుచు శ్రీరఘురాముని నామము పరగనరిగి శిష్యులును॥ ౫౬౭.
సేవలనచ్చట సేయుచునుండగ శ్రీదాసుడు ధ్యానమున।
భావంబేకమై కూర్చుండెనునట పాకిపూర్తి యయ్యెగన॥ ౫౬౮.
నరపతి వచ్చుచు పూజలజేసెను నయమున శ్రీగురువునకు।
సరగున నాకుల వేసి వాటిలో సాదముంచి రందరకు॥ ౫౬౯.
అప్పుడు దాసుండేగి నూతికడ నంబాజిని పిలువగను।
చప్పుడు వినబడ కల్యాణాయని సరగ గురుడు రమ్మనును॥ ౫౭౦.
జలము నుండి వచ్చియుకూర్చుండెను నిలనంబజి భక్షణకు।
ఇలపతియును యాశిష్యవర్గమును యెంతోముద మొందుటకు॥

---

†ఏదెడు-పోషించువాడు.

అందరు భక్షణ జేసిన వెనకను యవనిపతియు నరుగగను।
పొందుగ దాసుడు మరియొక యడవికి పోయెను శిష్యులతోను॥
అనఘు నంబజిని కళ్యాణుండని యందరు బిలిచిరి యపుడు।
ఘనుడు దాసుడును షాపురగ్రామము గరిమెను నేగెనునాడు॥
దాసబోధమను గ్రంథము రామ దాసుచేసె నచ్చటను।
వాసిగ కళ్యాణుడు చదువగను వచ్చివిందురు ప్రజలును॥ ౫౧౪.
శ్రీహరి భక్తియువైరాగ్యంబును చేకూరును నదివినినన్।
మోహకూపమున మునుగువార్లకది ముఖ్యోద్ధారణగానన్॥ ౫౧౫.

జనులనేకు లటుచేరి వచ్చుచును చక్కగవిందురుకృతిని।
అనువుగ నచ్చట గృహస్థుడొక్కండతితాపము నొందగని॥ ౫౧౬.
గ్రంథము వినుచును ఘనుడగు దాసుని కాళ్ళను తా బట్టుచును।
సందయమొందక నేలుకొనుమునను శరణంబని వేడుచును॥ ౫౧౭.
తాపత్రయముల తానొందుచు నరి దండమిడగ దాసుడును।
ప్రాపుగనీకును కుటుంబ భారము ప్రబలంబగు చుండగను॥
నాతో నటవిని నెటులనుండెదవు నడువుమనె గృహమునకును।
ఈతీరుగనటు కొన్నిదినంబులు నెలమినుండి పిమ్మటను॥ ౫౧౮.
అరణ్యంబునకు నందరు వెళ్ళగ నటబోయె గృహస్థుడును।
అరవిందాక్షుని నామముదాసుడు నరసి బాడుచుండుటను॥౫౨౦.
చెట్టునీడ కూర్చుండుచునుండగ చేరి గృహస్థుండటను।
బెట్టిగ దండము దాసుడు బల్కెను ప్రియము నీకు రెండెడను॥
కోరును నీమది కుటుంబమునకును గురుపదమునకును రెంటన్।
అరణ్యంబునను నతివైరాగ్యము నమరంగైకొని యుంటన్॥౫౨౧.
హరిభక్తియు నీకెటుల కలుగునన, నతడనె నీసాంగత్యమునన్।
విరుగును మాయయు జ్ఞానస్ఫూర్తియు విహితంబుగ నొందునన్॥

అనఘుడు దాసుడు పూర్ణనమ్మికయు నబ్బువరకు నీకిలను।
ఘనకఠినంబగు కలికాలంబున కలుగదు సుఖమనగాను॥ ౫౮౪.
మీరల యాజ్ఞకు మారునడవ నని మేలుగృహస్థుండనగ।
వారక దాసుడు శిష్యులతోడను వనమునకునుదా నరుగ॥ ౫౮౫.
దాటీవృక్షపు తలమునదాసుడు తటాక మొకటుండగని।
దీటుగ తా గూర్చుండి గృహస్థుని తిన్నగనటు బిలుచుకొని॥ ౫౮౬.
చెట్టునెక్కుమని చెప్పగనాతడు చేసెనట్లుగను నాడు।
బట్టుచుకొమ్మను పదము విడువుమన భయమున జేసెను వాడు॥
చెట్టుకొమ్మ నిను చేరబట్టినదొ చెప్పుమనుచు నడుగగను।
బట్టితి నేనే కొమ్మననుచు తగ బలికెనా గృహస్థుడును॥ ౫౮౮.
సంసారము నినుబట్టక నీవే సంసారము బట్టితివి।
శంసిత మనసె సంశయ మగుచును సరివిరోధియగు పృథ్వి॥ ౫౮౯.
చేతుల రెంటిని సరగున విడువుము చెందకు భయమనియనగా।
ఆతడు నీరును గాంచుచు క్రిందను నతిభయమును బొందంగా॥
విడువిడుమనుచును జెప్పగ దాసుడు విడవకుండ నతడుండా।
పుడమిని చిలుకయు పంజరమందును బూనినగతి నీవుండా॥ ౫౯౧.
కొమ్మను విడిచియు కొలనులొబడినను కుశలత హరిరక్షించు।
నమ్మిన వారల నాతడు విడువడు నమ్ముము నామాటనుచు॥ ౫౯౨.
ఇదివిని యాతడు చేతుల విడువగ నిలనాతినిబడి మునిగా।
సదయుడు దాసుడు ధ్యానమందుదా చక్కగనుండుచు మరిగా॥
మునిగిన నాతడు మహానగరమును మోదముతోడను గనియో।
చనువున నటు శ్రీదాసునిమఠమును చక్కగ నుండంగనియో॥
దాసభోధ మను గ్రంథమునకు నట తాత్పర్యము జెప్పగను।
వేసరిల్లకను జనములరిగి యటు వినుచుండిరి యా రిగను॥ ౫౯౫.
రామదాసు నటుగాంచి గృహస్థుడు రమ్యముతో దాబలుకు।
కామగుణంబుల తాపముచేతను కడుబాధలు చనుకొలుకు॥ ౫౯౬.

శరణాగతునను జేకొనుమనగను సొరుగనటు దాసుడును।
గురుతర తారకమంత్రము జెప్పెను గురునకు దండమిడగాను॥
ఇంతను దాసుడు గట్టుననుండుచు నిప్పుడె రమ్మనగాను।
పంతముతోడను బావినుండిదా బైటికి తగవచ్చుచును॥ ౫౯౭.
గురుచరణంబుల బట్టగదాసుడు గుంటనేమి గంటివనెా।
వెరవక చెప్పెను విచిత్రముగదా వింతలగాంచితి దానె॥ ౫౯౯.
అవనీపతియును నప్పుడురాగను నందరువినుచును దీని।
సువిశేషంబని గొని యాడిరియటు సుప్రలాప మగుటగని॥ ౬౦౦

ధరపతి బోవగదాసుడు మరియొక యరణ్యమున కరుగుచును।
తిరుగుచు నచ్చట చాఫలూరులో తినుకొని యాహారమును॥
సమీప మందొక పర్వతముండగ చనియట గూర్చుండగను।
అమాత్యుడును నృపు వెతుకుచువచ్చిరి యడవినుండు కొండకును॥
పాదచారియై పర్వతమెక్కగ బహు దాహముదాగొనుచు।
సాదరముగనే యాకాబాయిని జలము నియ్యమని యనుచు॥
దాసుని గాంచుచు దండము లిడుచును తవిలిపూ జసేయగను।
వేసరిల్లకను దెచ్చిరి భిక్షను విహితశిష్యులటుగాను॥ ౬౦౪.
ఆకాబాయీ జెప్పెను నుదకము నవనిపతికి కావలయు।
సోకిన తృషచే బాధితుడగచును సుఖముగాక నుండుటయు॥ ౬౧౫.
వినికొని దాసుడు వెళ్ల దూరమగు వే చేదండము గొనుచు।
అనువుగ భూమిని తవ్వగకొంచెము నవనిధార నటగనుచు॥
జలసమృద్ధియై చేరెతటాకమై జనులుగనెద రిప్పుడును।
ఇలపతి. పానము జేయగ దాసుడు యింతతొంద రేలయను॥ ౬౦౭.
ఉండుచోటనే యుండుచు నీవును నుంచుతలపు నాయెడను।
గండితొందరల బొందకుమనుచును దాసుడు జెపుచుండగను॥ ౬౦౮.

స్నానము జేయుచు శిష్యులచ్చటను సలిపిరి తగుపాకమును।
మానుగ నందరు భక్షణజేసిరి మహిపతితో నచ్చటను॥ ౨౦౯.
అవనీపతియును బోవగదాసుం డచ్చట తగనుండుచును।
వివరముగానటు శిష్యులనందర వివిధ శోధన జేసెమును॥ ౨౧౦.
విల్లంబులగై కొనుచుదాసుడును విపినంబుల నాడుచును।
చల్లగచెట్లను నండజములపై సలుపునాటల య్యెడను॥ ౨౧౧.

---

జటాధారులగు గోసాయివారలు చేరి శివాజి నృపునికడన్।
పటుతరముగ నీపూర్వులు మమ్ముల బాగుగబ్రోచిరి సిగుడన్॥ ౨౧౨.
అరణ్యభూముల పిచ్చివానివలె నటిటుదిరుగు దాసుగని।
ఇరవున మమ్ముల విడనాడితి విట నిది లెస్సగాదనగవిని॥ ౨౧౩.
ఊరకుండెనట నవనీపతియును నొప్పంగ గోసాయిలును।
వారక దాసునికడ నరునంపిరి వానిచర్య గనుటకును॥ ౨౧౪.
బంపబడిన యానరుడు దూరమున పరగదాసునిం జూడన్।
సొంపుగదాసుడు విల్లంబులతో సుఖమగునాటలనుండన్॥ ౨౧౫.
ఇదివిని గోసాయ్ తనవారెడ దానేగుచు తగదెల్పగను।
విదితుడు మహాంతువచ్చియు నృపుకడ విప్పు చుగురుచర్యలను॥
జూచెదమాతని చనుమని జెప్పగ జోకనేగెదమని రాజు।
సూచన జేసియు సేననుంచుకొని సొంపునేగె నారోజు॥ ౨౧౭.
వీరలరుగుటను దాసుడు జూచుచు వేసెపక్షుల బహుగాను।
తీరుగనవి యుసుధరను బడంగను తీయు నతడు కరమునను॥ ౨౧౮.
ఇదిగని నృపుడును యేహ్యాంబనకను నిష్టపూజలను జేసెన్।
సదయుడై గురుడును కూర్చుండియునటు సాదువేషులనుగాంచెన్॥
గోసాయ్ ముఖ్యుడు పిట్టల జంపుట కుమార్గవర్తనమనగన్।
దాసుడు బల్కెను చంపెడివాడి ధరను రాముడే గనగన్॥ ౨౨౦.

సృష్టిక_ర్తయే లయ క_ర్తయునౌ నూటిగ నటుగాకుండన్।
పుష్టిని మీరలు పుట్టింపుండనె పారిపక్షుల నీయండన్॥ ౬౨౧.
అందుకు వారలునూర కుండగను నవనీనాథుని గనుచు।
సందయమొందక పక్షుల నగ్నిలో సరి గాల్చుట బాగనుచు॥
కట్టెల నిప్పును గరిమెనుజేసియు కాల్చుటకును పక్షులను।
ఎట్టకేలకును నందున వేయగ నెగురుచు వెళ్ళె నవియును॥ ౬౨౩.
భ_క్తులందరును జయజయయనుచును బాగుధ్వనుల జేయగను।
సక్తులుగాకను గోసాయ్ శ్రేష్ఠులు చనిరటు దిగులొందుచును॥
పూజల సలుపుచు బోయె నృపుండును పొందుగ నగరంబునకు।
ఓజను సాధనములను శిష్యులకు నొప్పుగ జెప్పెను బాగు॥ ౬౨౪.

---

ఒకదినమందొక గృహస్థుడచ్చట నొగివచ్చెను దాసుకడన్।
అకలంకుండై దండము బెట్టుచు ప్రకట పరచెనటు జూడన్ ౬౨౬.
కోలాపురమున లక్ష్మియుపాసన కోరిచేయుచుందురిలన్।
మేలుగాదనియు రాముని నామము మెలగి తలచ రటుచాలన్॥
అంత్యకాలమున రామా యనుచును నాడువా_ర్తయనగాను,
పంతముతో విని దాసుడు నవ్వుచు బ్రహ్మమె రాముండగును॥
దేవియు బ్రహ్మకు ఛాయయైయుండును దివిభువి నదిమరుగిడుచు।
ఆవరణంబున స్వాధీనంబుగ నమర్చుకొనె నీ జగమనుచు। ౬౨౯.
శ్రీరఘురాముని భజించు ప్రాణులు చేరెదరా బ్రహ్మమును।
వారకనందుకు విశ్వమోహినియు వంచించెను ప్రాణులను॥ ౬౩౦.
శ్రీరఘురాముని యాజ్ఞను దలచుచు చింతించెను నటుబోవన్
కోరుచు శిష్యుల కూడజేర్చుకొని కోలాపురమును బోవన్॥ ౬౩౧.
వై_రాగ్యంబున నిత్యతృప్తితో నరహరికథ జేయగను।
వై_రాగ్యంబును భ_క్తియు కలిగియు వచ్చిరి జనుల్ వినుటకును॥

వేణుబాయియను విధవ స్త్రీయును విని రాముని గుణ కథయు।
నాణ్యము తోడను దండముబెట్టుచు ననుచేకొనుమని యనియు॥
పదములబట్టగ దాసుడు సమ్మతి పరుడై తగనుండుచును।
సదయుడు జెప్పెను నామమంత్రమును సద్భావంబునుగనుచును॥
వివిధాన్నంబుల జేయుచు వేణియు విప్రులకిడియెను మరియు।
పవన తనయుడును బ్రసన్నుడయ్యెను భావశుద్ధినటు గనియు॥
భవ్యరూపమును గని మూర్ఛిల్లగ పాడుగ దాసుడు లేపెౕ।
నవ్యతరంబుగ కీర్తన సలిపెను నాటిదినము ప్రజలొప్పౕ॥ ౬౩౬.
శ్రీరఘురాముని దివ్యచరిత విని చిత్తము జనులకు కరిగె।
వారక దాసుని యుండుమనుచునటు వచ్చిరి యుపదేశముకె॥
యోగ్యత జూచుచు నుపదేశించెను నొప్పగదా జనులకును।
భాగ్యశ్రీయుతు దాసుడు వెళ్ళెను పరగమూడొ దినమునను॥
వేణుబాయి దానేగుచు నడవిని వేడెను తోవచ్చుటకు।
నాణెముతో గురుడామెకు ననెనట ననువు గాదు సేయుటకు॥
చావక మునుపే చచ్చియుంట, నా సాంగత్యము సరియగును।
నీవునింటిలో నుండుచు నన్నుౕ నెరిదలచుచు నుండుమను॥౬౪౦.
సమాధానమును చెప్పిపంపుచును షాపురమును బోవగను।
దమమున వేణియు కొన్ని దినములకు దాసునికడకేగుచును॥
తిరిగి యింటికిని చేరరాగనటు దీనిగనుచు కులజనులు।
దురిత కర్మయని దుర్నిమిత్తములు తోచునుయన పలుమార్లు॥
వినసహించకయ తల్లియు తండ్రియు విషము నిడిరి కొమరికిని।
అనువుగ ద్రాగగ నామెకు కడుపున నట్టెబుట్టె మంటలని॥ ౬౪౩.
గురుచరణము మనసుననిడి వేడెను గురితో బ్రోవుమునన్ను।
వెరవక చిత్తైకాగ్రతనొందగ విడిచెను ప్రాణంబులను॥ ౬౪౪.
సిద్ధిమహిమచే శ్రీదాసుడుగని చేరవచ్చి యాచోటు।
పద్ధతి చొప్పున రాముని భజనను బాగుచేసె దాసుండు॥ ౬౪౫.

దశముఖహంతా శ్రీరఘురామా దాశరథే యిటురమ్ము।
విశదముగా నీవిషము నిప్పుడును వేగమె విడిపోనిమ్ము॥ ౬౪౬.
అనుచును జెప్పుచు నతనిబెత్తమున నాప్రేతను ముట్టగను।
తనువు కదలగను లేచియు దాసుని తత్పదముల బట్టుచును॥ ౬౪౭.
విషమును బెట్టిన వీరలతోడను విహిత సంగ మొల్లనను।
సుషమ మోహముల మానుకొనుచుదా సుఖమేగెను గురుతోను॥

చాపలగ్రామము చేరగనచ్చట సచ్ఛిష్యుల కూటమిని।
ప్రాపుగ జూచుచు వేణు బాయిమరి బహుమోదము బొందగని॥
గురు కృపచేతను జ్ఞానము వడసియు కూడియుండె నచ్చటను।
తరుచుగాను ధరణీ నాథుండును దర్శనమునకు రాగాను॥ ౬౫౦.
భిక్షను శిష్యులు దెచ్చి యియ్యగను ప్రియత స్త్రీలు వండగను।
భక్షణమునకును బహు పదార్థములు ప్రాపగు నరపతితోను॥ ౬౫౧.
భక్షణజేసియు దాసుండచ్చట పరితృప్తుడు దానగుచు।
అక్షీణంబగు రాజయోగమును నప్పుడుబూనెను మనుచు॥ ౬౫౨.

---

తులసిచెట్టుకడ సింహాసనమును తొందరలేకను జేసి।
విలసితవైభవ మొప్పగదాసుడు వేంచేసెను నటుమెరసి॥ ౬౫3.
పరివారము సభికులు కాగానటు బాడిరిశిష్యులు కథను।
అరమరలేకను యాకాబాయియు హరి కథజెప్పెను మున్ను॥
అందరు వంతున జెప్పుండనుచును నాజ్ఞాపించెగురుడును।
వందన మిడుచును వేణుబాయియు వాక్యసరళి దెలుపగను॥ ౬౫౫.
అత్తరి శిష్యులు కళ్యాణుండును నాత్మజ్ఞానము జెప్పగను।
చిత్తము రంజిల భూపతి యప్పుడు జెందె సమాధిని మున్ను॥
దేహాభావమును రెండుదినంబులు దెలియకయుండెను నృపుడు।
మోహములేకను కళ్యాణునిచే నుగియబడె గ్రంథమటు॥ ౬౫౭.

ఒకరేయంతయు వ్రాయుచునుండగ నొగికన్నులు జోవగను।
అకలంకుండగు దాసుడు స్పర్శచె యత్నులనిచ్చెను యటను॥
కనులురాగనె కళ్యాణునకును కడుముదమొందుచు నృపుడు।
అనువుగ లేచుచు మ్రొక్కి గురువునకు నమితప్రేమ గొనియుండు॥
అవనీపతికిని గ్రంధము దాసుడు నవేత్య తోడనునిచ్చె।
భువిలోనతనికి భక్తియుక్తమా పొందు యుపాసనహెచ్చె॥౬౬౦.
ఉపాసనముతో కూడిన జ్ఞానము నుచితంబగునని జెపుచు।
విపుల విరాగము వివేకయుక్తమై వెలయు ముముక్షునకనుచు॥
దాసబోధమను గ్రంధమునందును తదర్థమంతయు వ్రాసి।
వాసిగ జెప్పగ నరపతి యప్పుడు వరుస నేగె నటువెలసి॥ ౬౬౨.



కొన్నిదినంబులు గడిచెను పిదపను కోదవగాక నరపతియు।
ఎన్నికగా గురు దర్శనమునకును నేగుచుండె నెళవయ్యు॥ ౬౩౩.
గాగాయను నొకపండితు నృపునకు గలిగియుండె తగనటను।
భాగవతార్థము తెలియంజెప్పుచు పరువున నతడుండగను॥ ౬౩౪.
ఒకదినమిలపతి దేవగృహమునను నొసగదాస బోధమును।
ప్రకటంబుగ నటు చదువుచునుండగ పండితుడరిగెను యటను॥
ఏమిగ్రంధమన దాసబోధమని యిలపతిజెప్పగ ద్విజుడు।
సామాన్యము యీప్రాకృత గ్రంధము సంస్కృత మగునేచూడు॥
ప్రాకృత గ్రంధముల్ చదివిన యడలను బహుదోషంబగునిలను।
వైకృతముగనిటు చదవంగూడదు వసుధ శూద్రు కవి యగును॥
వ్యాసప్రోక్తంబైన గ్రంధముల వాసిగవినుటకు దగును।
ఈసరిప్రాకృత గ్రంధంబులను నెప్పుడుచూడకు మికను॥ ౬౬౫.
పండితు వాక్యము భూపతి వినికొని ప్రాకృతమై వెలసినను।
ఖండితముగ నది శృతిశాస్త్రంబుల నిండర్థంబుల జెప్పనను॥ ౬౬౬.

చదువను నాకును ప్రీతియు గలిగెను చక్కజూడు గ్రంథమును।
ఇదివిని పండితు డతిక్రోధంబున నికనుడువ పురాణమును॥ ౬౭౦.
జెప్పుచునింటికి శీఘ్రము వెళ్ళగ జెందక కోపము నృపుడు।
ఒప్పుగనుండగ దాసుడు వినియిది యుచితము గాదనుచుండు॥
పరివారముతో వచ్చెను దాసుడు పదపడి నగరంబునకు।
గురుని గనుంగొన ధరణినాధుడును గోరుచుండె వెళ్ళుటకు॥ ౬౭౨.
దూతలు జెప్పిరి రామదాసుడును తోటలో నున్నాడుయని।
పాదచారియై తర్లెను దాసుడు భక్తిని గురు గనుటకని॥ ౬౭౩.
సేనయు నరపతి చేరవచ్చిరటు శీఘ్రంబుగ తోటకును।
దానమానముగ నృపుడు పూజలను తవిలిసలిపె గురునకును॥ ౬౭౪.
బహు సంభ్రమమున ప్రజల గూడుకొని పట్టణమరిగెను గురుడు।
సహింపలేకను గాగజిపండితు చనుదేరక గృహముండు॥ ౬౭౫.
క్షితినాధుండును చారులబంపెను శీఘ్రమతని బిలుచుటకు।
హితవుగ గాగజి కీర్తనకునుదా నేతెంచెదననె బాగు॥ ౬౭౬.
గురునకు పూజలచేసెను బహుగా కూర్మిని నృపవరుడపుడు।
కరమరుదుగతా విప్రభోజనము గావించెను తగనాడు॥ ౬౭౭.
భక్తుణ జేసిన పిదపనందరును భయభక్తుల గూడుకొని।
లక్షింపుచు శ్రీదాసుని కీర్తన లలితమున నటుండుకొని॥ ౬౭౮.
అంతర గృహమున దాసుండుండగ నలశిష్యులు ముందుగను।
సంతస మొందగ సలిపిరి కీర్తన సర్వులు మోదించగను॥ ౬౭౯.
ఇంతలో దాసుండేగ నచ్చుటికి నితరులు తగలేచిరట౯।
పంతముతోడను గాగజి మాత్రము పదపడిలేవక యుండ౯॥ ౬౮౦.
దాసుడు నిలిచియు దశరథరాముని దలచుచు నుతులనుజేసి।
వాసిగ కృష్ణుం డుద్ధవునకు జెపు వచనరీతి నటుజూచి॥ ౬౮౧.
భాగవతార్థము బైలుపరచుచును ప్రబలార్తిని జెప్పగను।
వేగమె శ్రోతలు తటస్థులగుచును వినయముతో నుండగను॥

గాగజి యప్పుడు లేచియు దాసుని కాళ్ళబట్టి ముదమునను।
కౌగిలించుకొని దాసుండాతని కరమిడి కూర్చుండ నెను॥ ౬౮౩.
సకలశాస్త్రముల సమ్మతముగనే సకలార్థము జెప్పుచును।
ప్రకట పరచె శ్రీభగవంతుండును బహుభాషల చేమున్న॥ ౬౮౪.
ప్రాకృతజనులకు గీర్వాణంబున పాండిత్యము లేకుండఁ।
ప్రాకృతగ్రంధముల్ చేయించెనుమును బాగుగ గ్రాహ్యతగూడఁ॥
గొప్పగ్రంధములు సంస్కృతమందును గురిజెప్పిరి పెద్దలును।
ఒప్పుగ వాటిని పండితజనులును నొసగ రితరభాషలను॥ ౬౮౫.
భాషాంతరమై యుండినవైనను భావభేద మొందవను।
శేషశయనుని భావంబనుచును జెప్పెనుతగ దాసుడును॥ ౬౮౬.
సభాజనంబులు సంతోషించిరి చనువుజూపె గాగజియు।
విభవము తోడను కథను ముగించగ వెళ్ళిరి జనులును మరియు॥



ఆదినముననే యరణ్యమునకును నలదాసుడు వెళ్ళుచును।
మోదముతో చనె యాళందికిని ముఖ్యశిష్యులతోను॥ ౬౮౯.
జ్ఞానదేవునా దివ్య సమాధికి కనికరమున దండమిడఁ।
మానుగ నచ్చట బ్రాహ్మణజనులకు మంచి భక్షణముల నిడఁ॥
కీర్తన జేయుచు దినములు మూడును క్రియతోనుండియు నటుమఁ।
ఆర్తిని పైటను పురము వెళ్ళియు నటుగనె నేకుని గృహముఁ॥
చటులత విఠలమూర్తిని గనియటు సమాధినిం జూచెమును।
అటగనె తులసియు నశ్వత్థంబును నత్యానందముతోను॥ ౬౯౨.
ఏకనాధుడును దర్శనమిచ్చెను యేకాంతము గనుచుండీ।
సాకల్యంబుగ దాసుడుశిష్యులు చనుదెంచిరి పంచవటి॥ ౬౯౩.
చకోరపక్షులు చూచుచునుండును చంద్రోదయమునకును।
ప్రకారముగనటు వచ్చెదాసుడును పరుడు రాము గనుటకును॥

అమితప్రీతిని దాసుడు జూపుచు నార్తిని కీర్తనజేయన్।
సమహిత చిత్తులై సకలజనంబులు చక్కవినిరి కథడాయన్॥ ౧౯౪.
రామావేశము బూని చెప్పగను రమించియుండెను కథయు।
సోమశేఖరుడు మొదలగు సురులును సుఖముగ వినిరటుగనియు॥
అమలంబగు నధ్యాత్మ జ్ఞానమును నచ్చటదా జెప్పగను।
విమలమయ్యె మిన్నరుణోదయమున విపుల హారతిచ్చుచును॥
కథను ముగించియు కొన్నిదినంబులు గడిపెను తగనచ్చటను।
మధుర ధ్వనితో నిత్యనేమమున మంజుళ కథజేయుచును॥ ౧౯౮.
అనుజ్ఞకొఱకై రామునికడ జని యర్చావిగ్రహ మొక్కటిని।
చనువున కృష్ణాతీరమునందును స్థాపన శలవియ్యమని॥  ౧౯౯.
అడుగగ రాముడు నటులగానియని యనుజ్ఞ నియ్యంగనుచు।
కడిమిని కృష్ణాతీరము నేగియు ఘన మారుతి ధ్యానించు॥  ౨౦౦.
హనుమంతుని యట కనుగొని దాసుడు నడిగె నర్చావిగ్రహము।
అనువుగ సప్తక్రోశమునందును నలయూరొక టుండునను॥
సీతారాముల విగ్రహములునట చేరియుండు గైకొనుము।
చేతోముదమున జెప్పిమారుతియు చేరెను తన నిజస్థలము॥ ౨౦౨.
దాసుడు విని చనె రేయిని యచటికి తద్విగ్రహముల గొనియెన్।
వాసిగ కృష్ణా తీరము వద్దను వలసిదెచ్చి తానిడియెన్॥  ౨౦౩.
ఉగ్రామంబున మూర్తుల గానక కూడిరి మనుజులు నటను।
విగ్రహములకై వెతుకుచుండగా వినుచు దాసు చర్యలను॥
దాసుని కడగానేగి జెప్పిరటు తమపోలిక సాధువులు।
తీసికొనేగుట దొంగతనంబున దెలుపు న్యాయమే తెల్పు॥  ౨౦౪.
రామదాసుడును బల్కెనందులకు రామాజ్ఞను జేసితిని।
వేమారక నా విగ్రహములను మరి విధిని గొని పొండనగవీని॥
బహుజనములచే పెకలకుండనవి భద్రంబగు మూర్తులును।
ప్రహస్తములతో, హరిచిత్తంబని బరతెంచిరి యిండ్లకును॥ ౨౦౬.

ఆలయంబు నటుగట్టుటకొఱకై యారంభించె దాసుడును।
వీలుగ శిష్యులు వలయు రాళ్ళను వేగదెచ్చి రయ్యెడను॥ ౨౦౮.
కొన్నిదినంబుల గుడి ప్రాకారము కూరిమి నచ్చట ముగిసెన్।
ఎన్నికగాతానఖిలశిష్యులతో డిలమూర్తుల స్థాపించెన్॥ ౨౦౯.
అవనీపతియును నతిమోదముతో నమిత కానుకల నిచ్చెన్।
భవహరమగుటకు మూర్తిని రాముడు బలువుగ నావాహించెన్॥
పంచదివసములు బ్రాహ్మణ భక్షణ బహుగా జరుగుచునుండెన్।
అంచితముగనే యమిత ప్రభావము హరిదా జూపుచునుండెన్॥
అంజనీసుతుని మూర్తుల మూటిని యటుదగ్గిర స్థాపించెన్।
అంజలి హస్తుడై యుండు మూర్తిని యాసన్నిధి ముందుంచెన్॥
శౌర్యపరాక్రమ యుతమూర్తులనట చక్కగదూరము నునిచెన్।
భూరిమహిమలను జూపుచునవియును పుణ్యుల జేయుచుమించెన్॥
మారుతీ పూజను జేయువిధంబును మహిదాసుడు తెలిపించెన్।
ధీరతను బ్రహ్మచర్య వ్రతంబును తెంపున గైకొని శుచిచేన్॥ ౨౧౪.
తైలాభ్యంజన జేసిమూర్తికిని తదుపరి జలమిడుచుచును।
వాలుగసింధుర లేపనమొసగియు వరుసప్రీతి నుంచుచును॥ ౨౧౫.
ఊర్ధ్వపుండ్రము లొనరగదాల్చుచు నొప్పగ పుష్పధూపమును।
సార్థకమగునటు దీప నివేదనల్ చక్కగ నిడుచుండుచును॥ ౨౧౬.
పెరుగును వడలును నాంజనేయునకు ప్రీతికరం బగుచుండు।
మరువక షోడశ దినములు జేసిన మనోరథంబు లునిగుడు॥ ౨౧౭.
దాసుడు నిలిపెను మారుతిమూర్తుల ద్వాదశ స్థలములలోను।
వాసిగనొకచో నిలుపవంటలను వండెను శతద్విజులకును॥ ౨౧౮.
సహస్ర విప్రులు చనుదెంచగనటు చాలదనె నాకబోయి।
*సహాముున మారుతి చక్కబెట్టునని సరగజెప్పె దాసుడయి॥ ౨౧౯.
భక్షణ జేయగ బ్రాహ్మణులందరు బహువన్నము మిగులుండె।
అక్షయమగునటు నందరుతృప్తిని నటుబొందిరి గనుచుండె॥ ౨౨౦.

---

*సహాము-ఓర్పు.

వాయుసుతుని పై స్తోత్యము నెప్పుడు వాంఛసలుపు దాసుండు।
బాయకతనకును జీవాధారుడు బలుడగు హనుమంతుండు॥ ౭౨౧.
అవనిని తల్లియు తండ్రియునత డె యాప్త వర్గమును నత డె।
సవినయముగ తగ సద్గురుడగుచును సకలము తెలుపుచునుండె॥
అతనిమూలమున రాముని గంటిని నతితృప్తిని గాంచితిని।
హితవాక్యంబుల నిటులం జెప్పుచు నిలను తిరుగుచుండగని॥ ౭౨౩.
ఇరువైపు కృష్ణవేణి యుండనట నెలమియుండె లింగమని।
నరులనుచుండిరి మారుతిమూర్తియు నాటబడెను యేటినని॥ ౭౨౪.
మడుగున నదియును కృంగంబడెయని మనుజులందరును జెప్ప।
దుడుకున నచటికి దాసుడు వెళ్ళియు తొందర బొంచుచుగొప్ప॥
ధ్వనితో రమ్మని యాంజనేయునిం దాసుండును బిలువగను।
అనువుగ నీటను వచ్చిచూడమని యాంజనేయు డనగాను॥ ౭౨౬.
లోతగు మడుగున దాసుడు దుముకుచు లోన యేడుదినములును।
పాదుగనుండగ జనులసమూహము పడి మడుగున జచ్చెనను॥ ౭౨౭.
ఏడవ దినమున మూర్తినందుకొని యేటిగట్టు రాగాను।
తోడనె మారుతి చెప్పెదాసునకు దురుసుగ మరియొక రూపును॥
జేసినచట స్థాపించియునీటను జేర్చుము నావిగ్రహము।
దాసుడు వినుకొని తత్ప్రకారమె తవిలిజేసె నాదినము॥ ౭౨౯
నిశీవేళలో నూతనమూర్తిని నిరూపించి తనచెయితో।
ప్రశాంతుడగుచును ప్రొద్దుబొడవగను బ్రాహ్మణు లంగనిదయతో॥
ఆంజనేయుని శ్రీకరమూర్తిని యటునిలుపుండ నగాను।
ప్రాంజలులగుచును బహుమోదముతో పరగ నిలిపిరి విధిగాను॥
అన్నశాంతిని నటుదా జేయుచు హరికీర్తన జేయించె।
పన్నుగ విప్రుల తృప్తినొనర్చెను బహుదక్షిణ దానిచ్చె॥ ౭౩౨.
అనేక మనుజులు నచటవచ్చెదరు యపేక్షలును సమకూరు।
సుఖీతులగుచును బోవుచునుం దురుసుఖతర ఖ్యాతిని వారు॥ ౭౩౩.

దాసుడు పిదపను చాపలగ్రామము తర్లివచ్చి యచ్చటను।
వాసిగ రాముని యుత్సవమును మరి వర్ధిల్లగ జేయుటను॥ ౭౩౪.
చింతన జేసియు శిష్యులనందర శీఘ్రంబుగదా పిలిచి।
పంతము తోడను భిక్షమెత్తమనె ప్రబలవస్తువుల వలని॥ ౭౩౫.
అవనీపతియును నప్పుడు వచ్చుచు నన్ని ఖర్చుల నిత్తుననన్।
సవినయముగనే జెప్పును దాసుడు చక్కగాదది యెట్లనినన్॥౭౩౬.
పరమపావన మని పెద్దలునక్షయ పాత్రను బట్టుదురిలను।
స్థిరమగు సుకృతము జెందవలయు మరి జీవులనేకుల కిటను॥ ౭౩౭.
నలుగురి తోడను నీదుద్రవ్యమును ననయ నియ్యు మనుచును।
పలుమరు జెప్పగ భక్తియుతుండై భాగ్యంబనుచును చనెను॥౭౩౮.
పురప్రదేశముల బోవుచు శిష్యులు *పారి తెచ్చిరి ధాన్యముల।
నరపతి యిచ్చెను నానావస్తువుల్ నరహరికిని నయ్యెడల॥ ౭౩౯.
మందిరమప్పుడు నలంకరించిరి మనుజులనేకులరుగుచును।
సుందర రాముని శృంగారించిరి సొగసు నగల బట్టలను॥ ౭౪౦.
అమిత పూజలను జేసి రామునకు నన్నదానము బహుగా।
సుమహిత మనసున ప్రజలు గూడుకొని సొగసుగ నవదినములుగా॥
జేసి యుత్సవము శ్రీరామునకును శ్రేష్ఠతరం బగునటుల।
వేసరిల్లకయ ప్రతి దినమందును విధిని జేసె కీర్తనల॥ ౭౪౨.
దశమ దినంబున ప్రజలు వెళ్ళిరటు దాసుడు వెళ్ళెను యటవి।
విశదంబుగ నొక పర్వత శిఖరము వేంచేసెను తానుభువి॥ ౭౪౩.
హరికైంకర్యము కొఱకై ధాన్యము యవనిని యిచ్చిన జనుల।
వెరవకబిలిచియు ప్రతి వత్సరమును వేసలు పుత్సవ మిటుల॥౭౪౪.
నియమన రీతిగ నిప్పుడు నడచుచు నెరవేరును నుత్సవము।
నయమున దాసుడు తగు మారుతికిని †ననయజేయును త్సవము॥
ఆంజనేయు శ్రీజయంతి యందున నటనిలిపిన మూర్తులకు।
ప్రాంజలు డగుచును ప్రజల మూలముగ బలుయుత్సవముల కొఱకు॥

*అత్యంతము. †పుష్పించు.

అనేకచోట్లకు శిష్యుల నంపుచు నమిత వస్తు రప్పించి।
సునీతుడగుచును పుష్పగంధముల సూటి పూజ సలిపించి॥ ౨౮౭.
అన్నదానమును నఖిలుర కిచ్చెమును నాంజనేయు ప్రీతిగను।
పన్నుగ దాసుడు చాఫల ఖేడలో బాగుజేసె కీర్తనను॥ ౨౮౮.
మారుతిరాయుని మించు ప్రభావము మానుగనటు జెప్పగను।
కోరినృపుడు గురునడిగె మారుతి కోతి రూపమగుటకును॥ ౨౮౯.
కారణమేమన దాసుడు పలికెను కరుణ దలిర్పగ రుద్రుండు।
మేరుపుత్రుడగు శేషగిరిని దా మెలగి పార్వతి తోనుండు॥ ౨౯౦.
వానర మొక్కటి వనితతొ పొందగ వదలకగని రుద్రుడును।
మేనక తనయను వానరరూపుగ మెలగు నటులజేయుచును॥ ౨౯౧.
తానువానరుడై తరుణిని గూడగ తద్వీర్యము క్రిందబడగ।
దానిమరుత్తుడు చేతనందుకొని తరుణి యంజని తపసునటగ॥ ౨౯౨.
ఉండగ నామెకు చెవిలో బోయగ నుద్భవించెను సుతుడు।
దండివానరుడై ధరణిని వెలిగెను తద్వీర్యాంశము గనుడు॥ ౨౯౩.
సభయందుండిన ప్రజలును వినుకొని సమాధానమును బొందగ।
విభవము తోడను కొందరు వచ్చుచు వెలసిరి దాసునిముందగ॥
మరియొక యూరున హనుమజ్జయంతి మహావిభవముగ మీరు।
వెరవక జేయుచు నుండుచు మరియును విడిచితి రెపుడాయూరు॥
అచ్చటి శిష్యులు చెప్పిరి యపుడా నసఘు దాసుడిచ్చటనే।
ముచ్చటనుండెను సకలజనులకును మురరిపు కథ జెప్పుచునే॥
మరియొకయూరును చేరినకొందరు మానుగ వచ్చుచునటను।
గురితో దాసుని జూచితి మచ్చట గురుజయంతి సలుపగను॥
దశయేకంబగు మారుతి స్థలముల దాసుసలిపె జయంతులను।
విశదంబుగ ప్రతిచోట నుండుచును విభవంబుల సలుపగను॥
ఒకనరుడన్ని స్థలములనెట్లుగ నుండుననని గురునడుగగను।
అకలంకుండగు రాములీలయని నతడు జెప్పెనయ్యెడను॥ ౨౯౯.

గోవత్సంబుల విధాతదాంగిల గోవిందుడు గోవత్సములై।
భావముజూపగ విధియు పదంబుల బడియెను నమ్రతమిగులై॥౭౬౦.
అట్టిమహాత్ముని యఘటిత చర్యల నలవియగునే జెప్పటకు।
ఘట్టిగ నాకును దెలియదనుచును గారాబమునను బలుకు॥ ౭౬౧.
అఘటిత కృత్యంబనుచు జెప్పుచును నందరేగిరి గృహములకు।
అఘహరుడనుచును సంతసిల్లిరి యాతని ఘనచర్యలకు॥ ౭౬౨.
వాదముకోఱకై వచ్చినవారల వరసను గర్వములణచి।
సాదరముగదా కోలాపురమును చనియెను దాసుడు మనిచి॥
కొన్నిదినంబులు నచ్చటనుండుచు గోరి చనియె తీర్థములు।
పన్నుగ వానింజూచియు పిదపను బరతెంచెను పురిచాఫళ॥ ౭౬౪.

---

మాహెులియందును నుద్ధవ శిష్యుడు మారుతి బూజింపగను।
మోహావేశము తోడను కీర్తన మునియజేయు చుండగను॥ ౭౬౫.
తురకథొరయొకడు తొందరచేయుచు దురుసుగ కథనిలుపుమని।
విరిచికట్టుచును నుద్ధవు నప్పుడు వేగంబంపె కావలిని॥ ౭౬౬.
గ్రామవాసులును బహువిధములుగా కరుణ వేడుచుండినను।
తామసచిత్తుడై తురకవాడును తరమగొట్టి వారలను॥ ౭౬౭.
కాజిని బిలిచియు నుద్ధవు నచ్చట కావలివిడి రమ్మనుచు।
వ్యాజము లేకను బాపన తురకగా వారకజేయు మటంచు॥ ౭౬౮.
చెప్పుచునుండగ నుద్ధవు గురువును శీఘ్రంబుగదా దలవగ।
ఒప్పుగదాసుడు వినుకొని యప్పుడు నుద్ధవుకడదా నిలువగ॥౭౬౯.
సున్నతు చేయుట కెత్నింపంగను నూటిగ ధ్వనియొకటి డియెగ।
సన్నుతింపబడి పదితోపులతగు శబ్దమునకు సరియయ్యెగ॥ ౭౭౦.
అవింధ్యు డిదివిని యాశ్చర్యముతో నపుడేమూర్ఛను బొందె।
వివశుండగుచును లేచెనుజామున వేగదాసుగనె ముందె॥ ౭౭౧.

సంకటమొందక కీర్తనలిటుపై జరుపుము యిష్టముగాను।
పొంకముతోడను జెప్పిదాసునకు పొమ్మని దండంబిడును॥ ౭౭౨.
ఆలయమునకును నప్పుడు రాగా నాపురవాసులుగూడి।
తాళిమితోడను దాసునికొఱకై తగుపూజలచేబాడి॥ ౭౭౩.
మన్ననజేయగ మరలెను దాసుడు మరిచాపల గ్రామమును।
ఎన్నికగానే యిష్ట శిష్యులను నిలబంపె దేశములకును॥ ౭౭౪.
నామమహిమతగ నెల్లెడలందున నాటించుచు రండనుచు।
ప్రేమ భక్తులను జూచిచెప్పమని పెంపుజేసె దాసనుచు॥ ౭౭౫.

---

భాగానగరంబను నొకయూరున భక్తుడు కేశవుడుండన్।
బాగుగ తనయెడ శ్రీహరిభజనను భక్తిగజేయుచు నుండన్॥ ౭౭౬.
అనేకులనగను దాసునికీర్తిని నాతడుతగ వినుచుండి।
పనిబడిదర్శన మొందుటకును దా బైలుదేర లేకుండి॥ ౭౭౭.
ద్విజవరు చేతినిపత్రిక నిచ్చియు దీర్ఘదండ మిడితీనని।
నిజముగ ద్విజునకు సేరు బియ్యమును నిత్యభక్షణ కిచ్చెగని॥ ౭౭౮.
పక్షదినంబులు దారినడచుచును పరగజేరె దాసుకడన్।
అక్షయమగుచును సేరుబియ్యమె యందాకను సరినిగుడన్॥ ౭౭౯.
దాసుని జూచుచు దండంబిడుచును తానిచ్చెను పత్రికయు।
వాసిగ విప్రుని పూజలజేసియు వందనమును తాజేయు॥ ౭౮౦.
జాబునువిప్పుచు సంగతినిట్టుల చదివెను మన్ననతోడన్।
గాబరనొందక స్వామికిదండము గరిమబెట్టిగురితోడన్॥ ౭౮౧.
పత్రమునందును వ్రాసినసంగతి పదత్రయ రూపుడవునిను।
చిత్రరూపమగు దేహముతోడను చెలిమిచూడ గాకాను॥ ౭౮౨.
స్వానందావలోకన మీరలు సలిపెద రనుచును కోరి।
జ్ఞానంబెంతయు గలుగనినా విజ్ఞాపనమిదియని తీరి॥ ౭౮౩.

జాబును దెచ్చిన ద్విజునకు దాసుడు సరగ వస్త్రములనిచ్చెన్।
ప్రాపుగ నృపుఁడును బహుళధనంబును పరితృప్తిగ దానిచ్చెన్॥
ప్రత్యుత్తరమును దాసుడు వ్రాసియు బ్రాహ్మణు చేతులనిచ్చెన్।
అత్యుదారుఁడై సేరు బియ్యమును నతని భిక్షణకొఱకిచ్చెన్॥ ౭౮౫.
వీటిని గైకొని విప్రుఁడు గ్రామము వేంచేసెను నడచుచును।
సాటిలేని యాసేరుబియ్యమటు సరిపడె నదివరకును॥ ౭౮౬.
జాబును కేశవస్వామి చేతిలో సరగున నియ్యగ నతను।
గాబరలేకను విప్పిచూడగను గన్గొనె యర్థంబిట్లుగను॥ ౭౮౭.
పదాతీత మగు వాక్యార్థంబును పరిశోధించు సమాధిని।
సదానందమై యక్షరాతీతము సరి బోధనుసుండగని॥ ౭౮౮.
కేశవుసంగము దాసునకును నగు క్రియ జన్మము లాపైన।
పేశలమగు పేంచిన బీజమువలె పెరుగునె యంకురమెట్లైన॥ ౭౮౯.
పద్యంబును గని యీరీతిగతా బహుసంతోషము గొనెను।
విద్యమానమయ్యె నిరువురి మహిమలు వెలసిన తండులములను

---

ఒకదినమందును చాపలయూరున నుచిత శిష్యులను గూడి।
అకలంకుండగు దాసుండుండుచు నపుడె లేచెనటనుండి॥ ౭౯౧.
పండరిపురమును బోవ దొడంగెను పదపడి శిష్యులతోను।
నిండుప్రేమతో నృపవరుడప్పుడు నెనరున చనె సరిగాను॥ ౭౯౨.
కార్తికమాసము యేకాదశిలో ఘనమగు యాత్రకుగాను।
పూర్తిగ నుంచెను ప్రజలుగూడికొని పురపండరి యటుగాను॥
దూరముననును కలశములను జూడగ తోడనె దండంబిడియెన్।
పారజూచుచు నాలయమునకును బరతెంచెను దావెలయన్॥
భగవంతుని గని యాలింగనమును బహుముదమున జేసికొని।
వగవక రుక్మిణి తల్లినిగాంచుచు వచ్చె ప్రదక్షిణ గుడిని॥ ౭౯౩.

గరుడశైక్యమున కెదుర వచ్చియటు గాంచెను బహుభక్తులను।
వరుసను నొక్కరికొక్కరు నచ్చట వందనముల నిడుచును॥
ఆసమయంబున తుకారాముడటు హరికీర్తన యందుండెన్।
వేసరిల్లకను దాసుండచ్చట విహితుడగుచు కూర్చుండెన్॥ ౭౯౭.
భూపతియప్పుడు పండరినాధుని పొందుగదా సేవించి।
ప్రాపుగ నచ్చట కీర్తనవినుటకు భక్తినిబసగొనె మించి॥
అతిమాధుర్యం బమరియుండెనటు హరికీర్తన వినగాను।
గత యభిమానులై ప్రజలుండిరి తగ కనుగవ వేయక నటను॥
ప్రొద్దుక్రుంగగను తుకారాముడును పొందుగ హారతులిచ్చెన్।
పెద్దగగంతులు భక్తులువేసిరి ప్రియనామము గొనిహెచ్చెన్॥
తమతమ స్థానము జేరిన పిదపను దాసుండా రేయినను।
రమణీయంబగు పుండరీకుని రమ్యస్థలమున కీర్తనను॥ ౮౦౧.
గావింపంగను ఘనులగు భక్తులు కనికరముగ వినుచును।
సేవించగ మదిసౌక్యను వార్లకు శ్రీరాముని గుణములను॥ ౮౦౨.
అరుణోదయమున హరి విఠలయని యమితగర్జన చేయగను।
గురుతుగ హారతులిచ్చిరి హరికిని కోరి కెలలరగ నటను॥ ౮౦౩.
ద్వాదశియందును భూపతిచేసెను తదియారాధన యటను।
పాదుగ షోడశ పూజలసలిపెను భగవంతుని కయ్యెడను॥ ౮౦౪.
భక్షణజేసిన పిదపను విప్రులు బసజేయగ నయ్యెడను।
దక్షిణబహుగా దాతృత్వముతో ధరణినాధు డియ్యగను॥ ౮౦౫.
దాసుండచ్చట కూర్చుండుచు మరి దాసబోధ గ్రంథమును।
వాసిగశిష్యుడు చదువగ నర్థము వాచాజెప్పెను యటను॥ ౮౦౬.
కొందరు పండితుల్ వినుచును జెప్పిరి కుదురుగ శిష్యుండొకడు।
పొందుగమును నీగ్రంథను చదువం బూనె నిచ్చటను నతడు॥
పదినాలుగు బ్రహ్మాంబుల జెప్పెను ప్రాకృత గ్రంథంబనుచు।
మదిలో శంకల మాన్పనందునను మన్నింపం బడదనుచు॥ ౮౦౭.

జెప్పగ వినుకొని శ్రీదాసుండును చెలగిచూచె పక్కమును।
గొప్పగమోతను తలపై నిడికొని గొనిచనె నొకమనుజుడును॥
వానింబిలువగ మోపును దించుచు వందనమిడె దూరమున।
దానింగాంచుచు దాసుడెవడవని దయనడిగెను వాడువిన॥ ౮౧౦.
అనామికుండని నాతడు జెప్పగ నటనొక గీటును నిడును।
వినీతుడగునటు బుద్ధిని దలచుచు వే గీటున రమ్మనను॥ ౮౧౧.
అందునరాగనె యవరని యడుగగ నవింధ్యయని జెప్పగను।
సందయమొందక మరియొక గీటును చక్కవేసి యందునను॥
వానిం బిలిచియు యవరని యడుగగ వరుసను శూద్రుండనియెన్।
దీనింగనుచును మరియొక గీటును తిరిగివేసిరమ్మనియెన్॥
అందునరాగనె యతడు వైశ్యుడని యందరు వినగను జెప్పెన్।
పొందుగ నిట్లనే క్షత్రియ బ్రాహ్మణ పుణ్యజాతులను నొప్పెన్॥
ఆయాజాతిని నాతడు రాగా నంగభేద మగు పడియెన్।
ధీయుక్తుండగు బ్రాహ్మణుడగుచును తేజరిల్లనటు గనియెన్॥ ౮౧౫.
దగ్గర బిలచియు సంశయ నిరసన దాసుడు చేయమనంగన్।
తగ్గుగాక నా బ్రాహ్మణుడప్పుడు తగబలికెను నట వినగన్॥ ౮౧౬.

శ్లో॥ శబ్ద ఆద్యమోమిత్యే కాక్షరం ఖంసర్వతోముఖం। చైతన్యం చైవ
సత్తాచ సాక్షిసగుణమేవచ। నిర్గుణంవాచకంచైవా నుభవారుద్ర
సంఖ్యకం। ఆనందశ్చతదాకార మనిర్వాచ్యంచతుర్దశం॥

కరుణావీక్షణ కలుగగమాలడు గహనంబగు నర్థములన్।
మెరయుచు బ్రాహ్మణ రూపున జెప్పెను మేలనిరటు ప్రజలెల్లన్॥
పండితులందరు గర్వభంగులై పాదములకు మ్రొక్కగను।
నిండుప్రేమతో నిఖిలభక్తులును నెరిమోదము గొని రటను॥
వానిగాంచుచును దాసుండనేసి వంశపూర్వ మెట్టిదన।
దీనింగని యాద్విజుడు చెప్పెనటు తేటనునే పూర్వమున॥ ౮౧౯.

మలయుండను నొకగంధర్వుడనే మహితస్వర్గ ముందుదును।
జలక్రీడ లటుసలిపితి స్త్రీలతో జలమధ్యము నుండుచును॥ రా౨౦.
మద్యపానమున నగ్నుండగుచును మతిమాంద్యత నుండగను।
సద్యస్కాలము నారదమునియు సరగున నటు వచ్చుచును॥ రా౨౧.
విషయలంపట వృత్తినిగాంచుచు వేగబెట్టె శాపమును।
నిషిద్ధయోనుల మూడుజన్మములు నెనరున తగిలుండుచును॥రా౨౨.
పూర్వరూపమును పొందెదవనుచును పోయెను నారదమునియు।
తీరుగనట్లనే తురంగ మగుచును ధీరు ముకుంద రాజనియు॥
ద్విజవరు స్పర్శచే మెలగెను ప్రథమపు దీనజన్మమును నాకు।
సుజనుండగు నొకవిప్రునింట మరి సూటిగ బుట్టితి బాగు॥ రా౨౪.
ద్వితియజన్మము మహిషంబగుచును తిరముగ నేనుండగను।
అతిశ్లాఘ్యుండగు జ్ఞానదేవు కృప నరయ శృతుల జెప్పగను॥ రా౨౫.
కొంతకాలమటు జరగ వదలితిని కుత్సితయా దేహమును।
పొందుగ నిచ్చట బుట్టితిమాలనై పుణ్యునై తినీ కృపను॥ రా౨౬.
భవిష్యోత్తర పురాణమున నిటు పరగజెప్పె వ్యాసుదును।
అవచితముగ నది యర్థసిద్ధమై యనుభవమయ్యెను గనను॥రా౨౭.
ఇదివిని దాసుడు వేదరహస్యము నిష్టముతోడను జెప్పగను।
కుదురుగ శిరసును పగులగ విప్రుడు కోరివెళ్ళె స్వర్గమును॥రా౨౮.
ద్విజవరు లందరుజూచి తటస్థులై దీనతనొందిరి యపుడు।
సుజనులందరును పొగడిరిదాసుని సుఖసంతోషము నెగడు॥
ఉత్సవమంతయు ముగియగ విఠలుని నుచిత యనుజ్ఞ గైకొనుచు।
సత్సమాగమ సంతోషముచె చనెను దాసుడటు మనుచు॥ రా౩౦.
చాపల గ్రామముచేరిన పిదపను చనెను నృపుడు నగరమును।
ప్రాపుగనచ్చట కొన్నిదినంబులు పరగనుండె దాసుదును॥ రా౩౧.

---

జయరాముండను భక్తుండొక్కడు చక్కవచ్చి యయ్యెడను।
ప్రియముగ రమ్మని కృష్ణజయంతికి పెనుపుత్సవమునకును॥ ౮౩౨.
రథోత్సవమునకు రథము లేదనియు రంజిల్లక జెప్పగను।
నిదానముగ నిది దాసుడు వినికొని నే రథమును జేసెదను॥
వెంబడి గైకొని వచ్చెదననగను, వెళ్ళెను జయరాముండు।
*అంబరీషముగ దాసు శిష్యులచె నరయ రథమునానాడు॥ ౮౩౪.
చేయించియు మరి యుత్సవదినమున చేరె నచ్చటను తాను।
వాయించగ బహువాద్య ఘోషములు వచ్చెభక్తు లెదుర్కొనను॥
ఉత్సవమంతయు కృష్ణమూర్తికిని యూర్జితముగ జరగగను।
సత్సమాగమము జేయుచు దాసుడు సరగమళ్ళి పిదప మును॥
చాపలూరులో రామోత్సవమును సలుపుచు దా నుండగను।
నాపికు డొక్కడు దాసుని శిష్యుడై నాడుంచెను నొకయెడను॥
ఉన్నత భక్తిచే నుపరతి జ్ఞానము నూర్జితముగ గలుగగను।
సన్నుతించి ద్విజుడొక్కడు గోరెను సద్గురూప దేశమును॥౮౩౮.
దాసుని యనుమతి గొని నాపికుడును తారకమంత్రము జెప్పె।
వాసిగ శిష్యుడు వదలక నాతని వరసను సేవలనొప్పె॥ ౮౩౯.
కొన్నిదినంబుల పిదప నాపికుడు కుదురుగ దేహము విడిచె।
పన్నుగ ద్విజుడును గురునిసమాధిని బాగుగ నటు జేయించె॥
ద్వాదశ దినములు తొలగిన వెనకను ధర ద్విజులకు భోజనము।
పాదుగశిష్యుడు బెట్టదలంపగ బ్రాహ్మణు లనిరటు రాము॥ ౮౪౧.
అనుచు బలుకగా ద్విజుడు దాసుకడ నరుగుచు తగ దెల్పగను।
తనకృప వెలుగగ మహిమను జూపెను ధరణి సురులకయ్యెడను॥
దాసుని స్కంధముపైన మారుతియు తద్విజుపై రాముడును।
వాసిగ నిట్టుల విశదము కాగనె వచ్చిరి ద్విజుల్ తినుటకును॥
ద్విజులును భక్షణ చేసిన పిదపను ధీరుడయ్యె శిష్యుడును।
సుజన హితుండగు రామదాసుడును నూటి జరిపె కార్యమును॥

*మంగళము.

రాముని దలచుచు రామదాసుడును రాత్రింబగలును గిరిపై।
ప్రేమను రాముడే సకలంబనుచును ప్రీతివహించెను హరిపై॥
ఒకదినము స్నానమొనర్చి దూరము నొప్పగ కూర్చుండగను।
ప్రకటంబుగ గని శిష్యవర్గమిటు బైటనుండు టెందుకను॥
భ్రాత చచ్చెనని దాసుడు జెప్పుచు పది దినముల సూతకము।
ప్రీతితో నుండగ వలసెను నాకును పెద్దధర్మ మిదియుసుము॥ ౨౪౬.
సంగతి జెప్పిన వారలెవ్వరని సరగ శిష్యులడుగగను।
అంగజ జనకుని యనుగ్రహంబున నటులగంటి ననగాను॥ ౨౪౭.
రాజు వినుంగొని బంపెను దూతల రయముగ గ్రామంబునకు।
ఓజను వారలు ప్రత్యుత్తరమును నొగి దెచ్చిరి రాజునకు॥ ౨౪౮.
దాసుని వాక్యము సత్యమయ్యెనని ధర నడిపిరి సూతకము।
ఆసలేక దా నన్నికర్మముల నాచరించె నాదినము॥ ౨౫౦.
అవనీనాథుం డొకదినమందును నాచార్యుని గని పలుకు।
భువి సహస్ర శత బ్రాహ్మణజనులకు భోజనంబు నొసగుటకు॥
శ్రీరామునికై మఠము నొక్కటిని జేసితి నగరమునందు।
తారాగణముల చంద్రుని వలెనె తమరిని యటురమ్మందు॥ ౨౫౧.
ఇదివిని దాసుడు జెప్పె రాజునకు నిచటనుండు సర్వమును।
మదిలో తనదని తలచక రాముని మహదైశ్వర్యమనవలెను॥
భక్తినిష్ఠుడై దేవునిగని ప్రపంచమనుత యుడుగవలె।
రక్తిలేని యీ సర్వముగానక రామునొకని జూడవలె॥ ౨౫౪.
ఇటులం జెప్పుచు నగరము వచ్చెన య్యిలపతి కోరతీర్పుటకు।
చటులసాంద్రుడౌ క్షితినాథుండును సలిపె పూజగురువునకు॥ ౨౫౫.
తుకారాము మొదలగు భక్తులనట తోడను బిలువుండనుచు।
ప్రకారముగ దాసుండన నృపుడును బంపె చారులను మనుచు॥
దూరమునుండియు వచ్చిరి భక్తులు తుకా మొదలు వారలును।
సారతముండగు రామదాసు సత్సంగము గోరుచుతగను॥ ౨౫౬.

విప్రు లనేకులు వచ్చిచేరి రటు విశేషోత్సవమగు నటుల।
అప్రమేయులగు హరిదాసులు మరి యచ్యుత హరియని మిగుల॥
సౌకర్యముతో పృథ్వీపతియును సలిపె ప్రజలందరికి।
వైకల్పంబులు లేక యందరును వలయు భక్షణాల మరిగి॥ రా౫౯.
పిండివంటలను నృపుడు సలిపియటు ప్రీతిజేసె నందరను।
పండుగా నటుల ప్రజలనేకులటు బహుమోదము బొందగను॥
హరిదాసులు తగ రాత్రులయందును హరికథలను బాడగను।
వెరవకదాసుడు వసుధాధీశుని విధిని కథనుజేయుమను॥ రా౬౧.
నృపుడులేచి దా కీర్తనజేసియు నృత్యము సలిపెను యటను।
*సపర్య సన్నుతిజేసిరి భక్తులు చనె నభిమానంబులును॥ రా౬౨.
కొన్నిదినంబులు తుకారాముడటు కోరిజేసె కీర్తనము।
పన్నగమేనుల మరచి యందరును బాడియాడి రొకదినము॥ రా౬౩.
ఉల్లాసముతో జరిపిరి భక్తులు నుత్సవమును నయ్యెడను।
సల్లాపంబులు శ్రీహరి కథలను సలిపిరి మాసంబుగను॥ రా౬౪.
సజ్జనులందరు కూడి మఠమునకు సజ్జన గడియని యనిరి।
†బజ్జరూపులగు సాదులు తమతమ యుచిత యిండ్లకరిగిరి॥ రా౬౫.
అవనీపతియును దాసుని గాంచుచు నార్తితోడ బ్రార్థించెన్।
భువిలో కాయము నుండువరకు నిటపొసగి యుండుమని మనిచెన్॥
బలికెను దాసుడు బంధము కలుగును పదపడి యొకచోటున్నన్।
వలయుచు వచ్చెద నప్పటప్పటికి వాంఛను యెచ్చోటున్నన్॥
మనసునురాముడె మహియునురాముడె మాతృపితృలురాముండె।
జనమును రాముడె వనమును రాముడె చరాచరము రాముండె॥
అనుచు జూచుచు నతినిర్భరుడై యచ్చట నిచ్చట దిరుగు।
మనుకొని శిష్యులు మహిత సేవలను మరిగిజేయగను బాగు॥
ఒకదినమందును యేవత్యాయను నూరునకరిగె దాసుడును।
అకలంకుండగు సాంబమూర్తిగుడి నచ్చటతగ జూచుచును రా౭౦.

---

*పూజ. †గురురూపులు.

పద్యము భవునిపై బాడ నతడు కృప బహుళజేసెను దాసునిపై।
గద్యపద్యముల బాడుచు దాసుడు కరుణను మళ్ళినునటుపై॥
సజ్జనగడిలో నొకదినముండగ సావిత్ర్యను నంబికయు।
పజ్జనుదానటు వచ్చి రాతిరిని భక్తుడు దాసుని గనియు॥ ౮౭౨.
అందరి పైనను కవిత్వ రచనల నవనిని బాడితివీవు।
సందయ మొందగ జెప్పుమునాపై జనులును వినునటు నీవు॥ ౮౭౩.
ప్రత్యుత్తరముగ బల్కెను దాసుడు పదముల బాడెదనీకు।
విద్యుత్ప్రభగొను ముత్యపు పోగుల వీలుగ నిమ్మిటు నాకు॥
అటుల గాకయని యంతర్ధానమై యంబపోవ మరుదినము।
పటుతర రేయిని దాసుడు వెళ్ళెను భవానిగుడికేడజాను॥ ౮౭౪.
నిశిలోబోవగ నామె యిట్టియెడ నిగుడి యెటుల వచితివను।
విశాలప్రొవను నీవు వచ్చుగతి వేంచేసితి ననెనతను॥ ౮౭౮.
భవాని ముదమున పోగులు చెవులకు భద్రంబుగ వేయగను।
నవీన కృతిగా దాసుడు పద్యము నయముగ జెప్పెను యటను॥
ఎవరికి దెలియక దాసుడు గడికిని నేగుదెంచి యుంచుండగా।
తవిలియంబకిడు ముత్యపుహారము తక్కువనగు పడుచుండగా॥
పూజాచార్యులు గనుకొని నిదియును భూపతికిని నెరిగింపగా।
ఓజను నతనికి నెటులతోచకను యొగినిద్రను తానొప్పగా॥ ౮౭౯.
దేవియుసంగతి స్వప్నమునందును తెలియజేసె నాతనికి।
భావశుద్ధితో మరుదినమందును పరుగిడె నృపుడును గడికి॥ ౮౮౦.
గురుపూజను దాగురుతుగ జేయుచు గురితోగనె పోగులను।
అరమరలేకను దాసుడు జెప్పెను యంబజేసిన క్రియలను॥ ౮౮౮.
ధరణీనాథుడు బీగములెటులను తవిలిదీసితివన నతను।
నరుడొక్కడు శ్రీరాము నెల్లెడల నయమున గనుచుండగను॥
పరిపూర్ణంబగు నాతని కృపచే ప్రవేశ మొప్పులోకముల।
విరళమగును ప్రశస్తమనసునకు విడును బంధమెయ్యెడల॥

సంతసిల్లుచును నృపుడును వెళ్ళెను సజ్జన గడిని దాసుండు।
పంతముతోడను కూర్చుండగ నటు పాదాశ్రయ వర్తకుడు॥౨౨౪.
వాణిజ్యమునకు ద్వీపాంతరమును వాడపైని బోవగను।
ధాన్యధనముతో వాడ మునుగగను దాసుదలచి వణిజుడును॥
సముద్రమందును వాడ మునుగకను చక్కనుండెనేనియును।
కొమరొప్పగనే దశేక భాగము గురువున కిచ్చెదననను॥ ౨౨౬.
దాసుండచ్చట ప్రకటించియు మరి దరిజేర్చెను వాడలను।
వేసరిల్లకను కొన్నిదివసముల వేంచేసెను వణిజుడును॥ ౨౨౭.
దశాయుతంబగు రూపాయీలను దాసున కర్పింపుచును।
విశేషవస్తువు లుదధినిమునుగగ వేంచేసియు మీరటను॥ ౨౨౮.
వాడలనన్నియు దరిజేర్చగనటు వర్థిలె నీకృప మిగుల।
నాడటు మీకును జెప్పిన రీతిని తోడదెచ్చితి రూకల॥ ౨౨౯.
ద్రవ్యమునంతయు దాసుడుచేకొని ధరణీసురులకు నిచ్చెన్।
భవ్యమైన యీచర్యను వినుకొని ప్రజల వినోదము హెచ్చెన్॥
అరంగుజేబను యవింధ్య నరపతి యమితసేన వచ్చుచును।
నిరంతరంబును తోపుల గుండ్లను నెరి గడిపై విడువగను॥ ౨౩౧.
ప్రజలనేకులటు బాధల పడగను పరితపించి దాసుడును।
సుజన హితుండగు నాంజనేయుని నూటిగనటు దలచగను॥౨౩౨.
అనేక వానరు లచ్చట వచ్చియు నాపరసేనను బడిరి।
ఘనవానరులును ముక్కుల చెవులను కలియం గొరికియు తరిమిరి॥
గడును రాళ్లచే గొట్టి చంపిరటు గరిమెను సేనల నెల్లన్।
తడబడి యురుకుచు తరము గాదనియు తర్లిపోయె బలమెల్లన్॥
వానర సేనయు పరచక్రంబును వంచించుట నృపుడువిని।
మానుగ దాసుని వంకకు వచ్చియు మహావినతి మ్రొక్కగని॥
దాసుడు కృపతో నృపుని జూచుచును ధర పాలనమిక మీరదన్।
వాసిగనీవును వదలి కొడుకునకు వసుధనిమ్ముగరి మెందన్॥

ఇచ్చిన వెనకను శ్రీరఘు రాముని నెలమిదలచు చుండినను।
మచ్చికతోడను దేహము వదలును మహానంద మొందగను॥౮౯౭.
ఇదివిని ఖులపతి సంతోషముతో నింటికేగి కొడుకునకు।
సదయుడై రాజ్యము చక్కనిచ్చిమరి సర్వేశ్వరు జేరుటకు॥ ౮౯౮.
చింతన సేయగ రామదాసుడును జెప్పినగతి దేహమును।
వింతను వదలెను వీరరాఘవుని వేడుకతో గలియుటను॥ ౮౯౯.
సంబాజీయను రాజపుత్రుడును చక్కజరిపె క్రియలెల్లన్।
డంబుగ నటుపది మూడవ దినమున డాయుచు గురుగనె మెల్లన్॥
దాసుండతనికి ధైర్యముజెప్పుచు ధరణి బుట్టునందరును।
వాసిగ మరణము నొందెదరనుచును వరుసనీవు తెలియుమను॥
అవతారములే యుపరమమైనవి యవని మనుజు లెంతయను।
భవహారమగు శ్రీరామ నామమును బాగుగ చింతించుచును॥౯౦౦.
శోకము మానుము రాజరికమును సుఖముగ పాలింపనచు।
వీకను జెప్పగ సంబాజీయును వెలసెను భద్రంబనుచు॥ ౯౦౧.

---

కొంతకాల మటుగడిచిన పిదపను గురుడు శిష్యులం బిలుచు।
వంతముతోడను జెప్పెనప్పుడును పరమపదము బోగనుచు॥ ౯౦౨.
సమీప కాలము వచ్చెనుననుచును జాబులందరుకు బంపన్।
సమాన రహితుడు గురుని గాంచుటకు చనుదెంచిరి తగనొప్పన్॥
గంగాధరుడను శిష్యుని బిలిచియు గాదిపైన నుండమని।
పొంగారగదా జెప్పియు పిదపను పొసగ వినుడు మీరలని॥
నిజమగు నాత్మను గనుగొని యున్నను నెరిసలుపుము పూజలను।
గజిబిజి లేకను సగుణభక్తినిం గావించుడి మీరలును॥ ౯౦౩.
భావపవిత్రత భిక్షాటనచే జీవనమును జేయుచును।
దేవుని కృపగొని యహంకారమును దిగవిడువలె నియ్యెడను॥

శ్రీరాముని కథ విక్రయింపుకొని జీవనమొందగ రాదు।
పారీణులునై నామమున నరుల భక్తిని నిలిపింపొందు॥ ౯౦౯.
దాసబోధమను గ్రంథము మీరలు తప్పక నెటుచదువుచును।
వేసరిల్లకను మతమున కీర్తన విశ్రుతముగ జేయుచును॥ ౯౧౦.
రామభజనమును సర్వకాలముల రంజిల్లగ జేసినను।
కామగుణములగు మాయాజాలము కనబడకను దొలంగును॥
ఇదినాగోప్యమౌ దీనిని మీరలు నిశ్చితముగ జరిపినను।
సదమల హృదయులై సారతమంబగు సౌఖ్యము నొందెద రిలను॥
వినుకొని శిష్యులు నమస్కారముల వీలుగ నిడిగురునకును।
కనియుచు నేడ్చిరి గురుని చర్యలను గాంచుచు తమమనసులను॥
సమాధి వలదని దాసుడు జెప్పగ జనులు దుఃఖమొందగను।
సమీపమందును దత్తుడు వచ్చుచు సలిపె నమస్కృతు లటను॥
గురుడు గనుంగొని కారణ మడుగగ కుంఠితుడై దత్తుండు।
వెరచుచునడిగెను సమాధికాజ్ఞను విశ్రుతముగదాసుండు॥
భువిలో రాముని పూజకడ్డమగు పోరి సమాధి గట్టినను।
నవీనముగ నొక శిలసమాధినటు నాటుము భూగతముగను॥ ౯౧౨.
అందుపైని యొక రామ విగ్రహము నమరగ మీరుంచుచును।
పొందుగ సేయుము పూజ రామునకు పూర్ణభక్తి యుంచుచును॥
దివసములే డటుగడవగ నచ్చట దిక్కుల నుండియు జనులు।
నవీనముగ నేతెంచిరి తగ నటు నలుగడ లుండెడివార్లు॥ ౯౧౩.
భిక్షాటనచె దెచ్చుచు నన్నము బెట్టిరి యందరకపుడు।
అక్షయమగు నట రామచరితలను నటు జెప్పిరి రేయినడు॥ ౯౧౪.
అంతిమ దినమున దాసుడు స్నానం బరమర లేకనుజేసి।
పంతముతోడను ద్వాదశ పుండ్రముల్ బాగుగ తానటువేసి॥
తులసీమాలనుతాను ధరించియు దురుసుగ పద్మాసనముఁ।
విలసితముగ వేసికొనుచు రాముని విమలరూపు మానసముఁ॥

ఉంచుకొనుచు నసే యోకరుణాకర యొగిరమ్మీ సమయమున।
అంచితముగ నిను దప్ప నెవ్వరును నవని లేరు నేగాన॥ ౯౨౨.
తల్లివినీవై తండ్రివినీవై ధరఁబ్రోచితి విందాక।
సల్లలితంబుగ నిజధామమునకు సరిగై కొని వెళ్ళుమిక॥ ౯౨౩
నీవు నేనన నెడి భావమునిలిపితి నీకీర్తిని బొగడుటకై।
దేవుడ నిను నే జూచుచునుండగ దేహము విడవలె బ్రాగా॥ ౯౨౪.
ఆది మొదలుగను నిన్ను భజించితి యంతిమ రక్షణ మునకు।
పాదుగనీదు స్వరూపమందును భద్రస్థలమిదు నాకు॥ ౯౨౫.
ఈవిధముగ నా దాసుడు కవితను నిలజెప్పగ రాముడును।
భావముచొప్పున రాగా, దాసుడు పరగ మేను విడిచెమును॥
జయరఘు వీరాయని స్వరూపమున సమరస మొందెనుతాను।
ప్రియమున శిష్యులు జెప్పిరి నామము పెంపుగ నాసమయమును॥
సురలును గుప్పలై చల్లిరి పుష్పముల్ సూటిగ దాసునిపైని।
అరయఁగ ననేక లీలల సలిపియు నంత్యము హరి బొందగని॥ ౯౨౮.
అతిసంభ్రమమున మేను, ననలమున నటసంస్కారము జేసి।
హితులగు శిష్యులు జెప్పిరి తమలో నెలమి సమాధిని జేసి॥ ౯౨౯.
యుంచుద మనుచును యేర్పడియుండగ యుచితమాడవదినమును।
అంచితముగ నటుకాల్చిన చోటను నచ్చె శిల సమాధియును॥
ఇదిగని శిష్యులు మించినప్రేమను నేడ్వదొడంగం గనియు।
పదిలంబగు నాసమాధినుండియు బైలువెళ్ళె నొకధ్వనియు॥ ౯౩౧.
సావధానముగ కళ్యాణ, వ్రాయుము సాధించెటి పద్యమును।
భావిక శిష్యుడు విని తాటాకున పద్యము వ్రాసెను యటను॥ ౯౩౨.
రామదాసకృత పద్యమునందును రాజిల్లెడు యర్ధమును।
వేమరకను నిట్లువ్రాయంబడియెను వెలయ జనులు గనుటకును॥
సత్యంబుగ నాశరీర మిప్పుడు సౌమ్యముగను బోయినను।
నిత్యంబుగనే జగదాకారమై నిలిచియున్నా నిద్యోడను॥ ౯౩౪.

హితమును చెప్పెద వినుడు మీరుతగ నిలలో నుండేవరకు।
సతతము చూడుడి దాసబోధమును సందేహము వదలుటకు॥ ౬౩౪.
సందియ మొందుచు వేరుచేష్టలను సలుప వలప దెల్లెడను।
అందు జెప్పినట్లనుష్ఠించినను నబ్బును సాయుజ్యమును॥ ౬౩౬.
ప్రారబ్ధమునకు వేరువిధంబుగ పరివర్తన కలుగకను।
సారతమంబగు స్వస్వరూపమున సదనుసంధానులు గను॥ ౬౩౭.
శ్రీరఘురాముని చిరతర ధ్యానము చేయుచు మీరుండుచును।
ధీరత నెచటను సంచారంబున దిరుగ వచ్చునని యనెను॥ ౬౩౮.
ఈ యర్థముగల పద్యమునందరు నింపుగనటు వ్రాసికొని।
బాయని ప్రేమను పఠనజేసిరటు భక్తులందరును దాని॥ ౬౩౯.
పాదుక సహితమై సమాధి యచటను బైలుబడుట జూచుచును।
సాదరముగ తగుశాస్త్రయుక్తమున సలిపిరి స్థాపన నటను॥
గాన నటనముల సలిపిరి భక్తులు కడురమ్యత గలుగగను।
దానధర్మములు బ్రాహ్మణ భక్షణ ధరపతియును సలుపగను॥ ౬౪౧.
సీతారాముల విగ్రహమచ్చట చిరతరముగ తాముంచి।
వాతాత్మజుఘన మూర్తినిలిపియటు వర్ధిలజేసిరి మించి॥ ౬౪౨.
సదానందమున దాసుని చరితలు సకల జనులు బాడుచును।
హితోపదేశము శిష్యులు జేయుచు నేర్పడియుండె దరటను॥
పరభక్తినిగని పొందిన దాసుని పాదపద్మముల దలచు।
పరహితులగు హరి దాసుల దాసుడు బాలకృష్ణుడును మనుచు॥

---

## తు కా రాం చ రి త్ర ము.

ఉత్తరదిశలో దేహుగ్రామమున నుండెను వైశ్యుండొకడు।
విత్తము గలిగియు వర్తకవృత్తిని విశ్వంభరు పేరుండు॥ ౧.

అతులితగుణముల నాతడు గలిగియు నచ్యుతు గొల్చుచునుండె।
చతురత సాధుల పూజల జేయుచు సన్మానింపుచు నుండె॥ ౨.
కుటుంబసహితుగ నుండగ తల్లియు కోరి జెప్పె నొకనాడు।
ఇటుండి నీవును పండరిపురమున కేగుచు శ్రీహరిజూడు॥ ౩.
ఈవచనంబుల కొడుకును వినుచును నీప్సితముగ బోవుటకు।
సావధుడగుచును సహవాసముతో చనె పండరిపురమునకు॥ ౪.
భీమానదిలో స్నానము జేయుచు ప్రియమున రంగని గనుచు।
నేమము తోడను గ్రామప్రదక్షిణ నెనరున జేయుచుమించు॥ ౫.
పంచదివసముల్ పండరి నుండియు బైలుదేరె గృహమునకు।
సంచరించుచును చేరెను గేహము సాధుల గూడియు మెలగు॥ ౬.
విటలరంగని రూపును మనసున వేడ్కతోడ నుంచునిల।
పటుతరముగ తనతల్లికి జెప్పెను పండరిపతి విభవముల॥ ౭.
క్షణక్షణమునకును క్షేత్రపండరిని చనువున మదినెంచుచును।
అణుకువ నెప్పుడు హరినేజూచెద ననుచు యేడ్చుచుండగను॥ ౮.
కొన్నిదినంబులు గడువగ నచ్చట గూడిరి యాత్రాపరులు।
పన్నుగ వారితో నరిగియు పండరి బట్టెను హరిచరణములు॥ ౯.
ప్రీతిని నచ్చట మూడు దినంబులు పెంపుగనుండుచు మరియు।
వీతరాగుడై విఠలుని గాంచుచు వెళ్ళివత్తునని యనియు॥ ౧౦.
కన్నీరొలుకుచు నీదువియోగము కలుగజేయకుండదగు।
మన్ననతో నన్ననుగ్రహింపుము మాధవ ముకుంద బెణగు॥ ౧౧.
అశరీరుండై యచ్యుతుడనియెను నన్నిచోట్ల నేనుందు।
విశదంబుగనే చూడుము నీయెడ విశ్వము లోవెలి యందు॥ ౧౨.
వర్తకుడనియెను సగుణరూపమునె వాంఛించెద జూచుటకు।
కర్తవునీవును కరుణజూడుమిటు కాపాడుము నను బాగు॥ ౧౩.
హరియుబల్కెనా నామము నెప్పుడు ననుచుండిన నియ్యెడల।
గరిమెను నెప్పుడు గనబడుచుందును కల్లగాదు యెయ్యెడల॥ ౧౪.

వందన మొసగుచు వెళ్ళనింటికిని వర్తకుండు తగమరియు।
సందియమొందక ప్రతియేకాదశి చనుచుండును పండరియు॥ ౧౫.
అనేకవత్సర మిటుల జరగగను నతనికి ముదిమియు వచ్చెన్।
వినీతుడగుచును కలలో శ్రీహరి వేంచేయుచు నటు మించెన్॥ ౧౬.
పండరికరుగుట కాజ్ఞలేదయిక బరతెంచితినీ యూరన్।
ఖండితముగనటు మామిడితోటలో గాంచేదీవు నను మీరన్॥ ౧౭.
ఇంతలో మేల్కని విశ్వంభరుడును నిష్టజనంబుల బిలుచు।
పంతముతోడను మామిడితోటను భక్తిని వెళ్ళియు గనుచు॥ ౧౮.
ఎవ్వరనచ్చట గానక యుండియు నిల పరిమళ వాసనయు।
నివ్వటిలంగను నగరు చందనము నేలనునుండంగనియు॥ ౧౯.
అచ్చటత్రవ్వట కెత్నము చేయగ నంబరమున హరియనియెన్।
అచ్చుపు చే తులత్రవ్వగవలయును నాయుధమెది లేకనియెన్॥
చెప్పినరీతిని చేతులచేతను చెలగియు నటుత్రవ్వగను।
ఒప్పగనబ్బెను హరివిగ్రహమట నుచితానంద మొందగను॥ ౨౧.
జనులందరు హరి విఠ్ఠలయనగను చక్కనైత్తివి గ్రహమున్।
వినతుండగుచును విశ్వంభరుడును వేదెచ్చెను నూరును మున్॥
సకల మంత్రములు విప్రులుజెప్పగ స్థాపించెను యటుగాను।
ప్రకటంబుగ యింద్రాయణి నదియను భవ్యతీరమందుననను॥ ౨౩.
భక్తులందరును జయజయ యనుచును బాడిరి హరినామములు।
సక్తుడై సలిపెను విశ్వంభరుడును చక్కగనుప చారములు॥ ౨౪.
ఏకాంతంబున హరిని నుతింపుచు నెలమియుండగా నటను।
సాకారుండై హరియు వరములను చక్కనిచ్చెదన నతను॥ ౨౫.
సాదులసంగము సద్భక్తియు నాసద్వంశస్థులకును।
నీమకృపయును నుంచుమనంగను నిగుడియు హరి యిచ్చెమును॥
విపులజనంబులు భక్తిని పొందిరి, విశ్వంభరు హరిదలచి।
చపలత లేకను నంత్యకాలమున చనెవైకుంఠను మించి॥ ౨౭.

అతనిభార్యయగు నామబాయియు హరిభక్తిని నుండుచును।
సతతము సుతులను సంసారంబును చక్కనడపు చుండగను॥ ౨౯.
శ్రీహరి దయతో సకలపదార్థముల్ చేకూరుచు నిచుచుండె।
ఊహను సౌఖ్యము లుండుటచేతను నొనరగ హరి మరవ బడె॥
విషయారోపణ వచ్చుట చేతను వెళ్ళెను యనుతాపంబు।
సుషమలేని పాపంబునుతనుదా చొచ్చె నిదియ నియమంబు॥ ౩౦.
సుతులు యిరువురు హరి ముకుందు డని సూటిగ నామెకునుండర।
హితమగు భక్తిని యుండక వారలు యిష్టము కోలదిని నిగుడర॥
కొరత లెవ్వియును నింటలేకగని గూడి యిరువు రొకచోటర।
నిరతము మనకును శిబిక తురంగముల్ నెజీయుండగవలె ననుటర॥
ఇందుకు వారలు రాజసేవకును యిచ్ఛయించి వెళ్ళగను।
పొందుగ వారికి కొలువులనిచ్చెను భూపతిగని శౌర్యమును॥ ౩౩.
సంపద ధనములు రాగను వార్లకు సతిసుతులను తమయెడను।
పంపుమనంగను తల్లి హరినిగని తెంపున నిను నెటువిడుతునను॥
కొడుకులునుండెడి యూరున నామెయు గూడిజేరి యుండగను।
విడువక శ్రీహరి కొండొకకాలము వెనక వచ్చె కలలోను॥ ౩౫.
సంపద ధనముల గాంచుచు నీవును సరగున వచ్చితివిటను।
పెంపుగ దేహూ గ్రామంబునకును ప్రీతితోడ రమ్మికను॥ ౩౬.
ఈకలగాంచియు కొడుకుల బిలుచుచు నీశుపలుకు దెలుపగను।
సాకల్యంబుగ స్వప్నపు పలుకులసత్య మనిరి సుతులటను॥ ౩౭.
కొన్నిదినంబులు గడిచిన పిదపను కోరియుతల్లి తిరిగియు।
పన్నుగకొడుకుల గాంచుచు పలికెను పాండురంగడును మరియు॥
ధనసంపత్తుల విడిచి శీఘ్రమున తల్లిరమ్మనె దేహూనకు।
అనువుగ పుత్రుల కదిసత్యంబని యందకుండె విధినిక్కు॥ ౩౯.
నా[illegible]ం దినములు వెళ్ళగ హరియును నయముగ నామాయీకలను।
పిలుగవచ్చుచు యీదినమందును వెలయుపుత్రు లిరువురును॥ ౪౦.

చచ్చెదరనుచును జెప్పగ తల్లియు సరగ సుతుల కెరిగించెన్।
మెచ్చక వారలు ముదమున నుండగ మేదినిపతి బిలిపించెన్॥ ౪౧.
కొడుకులు వెళ్ళగ నరపతి బలికెను *కురుబొమ్మనె రణమునకు।
బిడియము తోడను వెళ్ళియు రణమున పెంపు యుద్ధమున మెలగు॥
కత్తిదెబ్బలచె నరకంబడగను కంఠగత ప్రాణముచే।
ఇత్తరియగునని శ్రీహరిపలుకుల నెనరున దలచిరి గురిచె॥ ౪౩.
విటలరంగని దలచుచు ప్రాణముల్ విడిచిరి వారిరువురును।
పటుతరముగ నా సంగతి తల్లికి పరులుజెప్పి రయ్యెడను॥ ౪౪.
తల్లియు కోడండ్రిరువురు నేడ్చిరి తలుచుగాగ నప్పుడును।
సల్లలితంబుగ చిన్నకోడలును సహగమనము చేసెమును॥ ౪౫.
సంపదయంతయు కొల్లబోయెనటు సరగున పరచక్రముచే।
కంపమొంది తల్లియరుగ కోడలు గర్భిణిగా నటువచ్చె॥ ౪౬.
దేహుగ్రామమున విఠ్ఠలరంగని దీనతతో దా గనుచు।
బాహుళ్యంబుగ నేడ్వగ హరియును బలికెను ప్రీతినిగొనుచు॥
కొడుకులు వినకనె జచ్చిరి విధిచె కొరతనీకు లేదనగన్।
పుడమిపైనిబడి దండంబిడియెను పూర్ణభక్తిని గనగన్॥ ౪౮.
తల్లింటికి యాకోడలువెళ్ళియు తనయుని దాగనెనటను।
చెల్లినవయసున కనులు మధ్యమై చెలగె నామబాయటను॥ ౪౯.
కోడలురూపున శ్రీహరి వచ్చియు గుణిని జేసె సేవలను।
వేడుకలలరగ కొన్నియబ్దములు వేంచేసెను యటుగాను॥ ౫౦.
ఏవిధలోపము లెంచనియ్యకను నేలుకొనెను శ్రీహరియు।
సావధురాలై సంతతమామెయు సర్వేశ్వరు దలచుటయు॥ ౫౧.
అంత్యకాలమున హరిపదమొందగ నన్నిక్రియల హరిజేసెన్।
సంతసమొందక నత్త జచ్చెనను సంగతివిని స్నుషవచ్చెన్॥ ౫౨.
ఆమెరాగనట నంతర్ధానుడై హరియు వెళ్ళె నటుగాను।
ప్రేమను లోకుల గాంచుచు నామెయు పెంపుమీరగను తాను॥

*కురు-తోడ.

అవసానంబున నత్తకు సేవల నరసి చేయ కుంటివను।
వివరంబగునటు ప్రజలునుబల్కిరి వెలసినీవె యుంటివను॥ ౫౪.
తరుణియుబల్కెను తల్లింటనునే తలచుచుగాగ నుంటివను।
వెరపున లోకులు విఠలుని పనియని విహితులైరి తామటను॥ ౫౫.
అతులిత వింతను నామెయు వినుచును హరికృపయని జెప్పుచును।
సతతము శ్రీహరి సన్నిధి బోవుచు నలుపుచుండె భక్తియును॥ ౫౬.
కొడుకగు విఠలుని తోడనచ్చటను గుఱిదప్పక యుండగను।
పుడమిని వారల యోగక్షేమముల పూర్తిజేయు హరియటను॥ ౫౭.
కొమరుడు వయసున పండరియాత్రను కోరియు చేయుచునుండె।
కమలాపతి హరి కరుణను పుత్రుడు గలిగె నతనికొక్కండె॥ ౫౮.
పదాజియనుచును నాతని పేరును బలుకంబడె నటుగాను।
నిదానముగనే నీతడు రంగని నిత్యసేవ నుండగను॥ ౫౯.
ఆతడు భార్యను నంగీకారము ననువుగ దా జేయుచును।
నీతినడతతో శంకరుడనునొక నిజపుత్రుని తా గనెను॥ ౬౦.
శంకరునకు కాన్యాయను పేరున సత్పుత్రుడు తగబుట్టెన్।
వంకలేక నతనికిని బోల్హోబా వంశజుడయ్యెను యట్టెన్॥ ౬౧.
ఈతడు శ్రీహరి గొలుచుచునుండెను నిష్టకాముడై యటను।
సాధులకెల్లను నన్నము బెట్టుచు సజ్జనులను గూడుచును॥ ౬౨.
అసత్యవచనము నెప్పుడుజెప్పక హరినామము నుడువుచును।
పోసగుచు దయనెటు పొందుగ జేయుచు భూతకోట్ల కెల్లెడను॥
పండరియాత్రకు పలుమరు బోవుచు భక్తిజేసె హరియెడను।
నిండుగ నిరువది నాలుగబ్దములు నెనరున నిటుజేయగను॥ ౬౪.
త్రిమూర్తులాతని కలలో వచ్చుచు తీర్చెదరన కోరికలన్।
వేమారిలబడి దండము బెట్టుచు వేడెను తనకును సుతులన్॥ ౬౫.
సుగుణపుత్రులను నిచ్చితిమనుచును సూటిగ వారేగగను।
తగులంబుగసతి కొన్ని నెలలలో తనయుని గనె దానటను॥ ౬౬.

వరపుత్రుండని సావజి యనుచును వాసినామ ముంచుచును।
ఇరవునపెంచుచు నుండిరికొడుకును నీప్సితమతితో నటను॥ ౬౭.
కనకాయిూయను బోళోబభార్యయు గర్భమునొందెను మరియు।
ఘనుడగు నామదేవుని యంశముగ కలుగజేసె శ్రీహరియు॥ ౬౮.
ఆదిత్యునివలె తేజఃపుంజమై యమరె సతియు నయ్యెడను।
పాదుగతొమ్మిది మాసపూర్ణమున బాలుగనెను సుదతియును॥౬౯.
మాయజాలముల నొందక మునుపె మాధవుడును వచ్చుచును।
నేయముతోడను లౌకికస్థితి నిలిచి వర్తన జేయుమను॥ ౭౦.
ప్రపంచవృత్తుల ప్రజలకు జూపియు ప్రబల వివేకముతోను।
అపారమగు వైరాగ్యంబునుగొని యమల భక్తి గనుటయును॥
శ్రీహరియిటులం జెప్పిన పిదపను చేరె మాయ బాలకుని।
ఊహను జననియు వినెను వాక్యముల నుచితస్వప్నపు రీతిని॥౭౨.
వెనకను బాలుని రోదన వినగనే వేంచేసిరి కులజులును।
మనసున బోళోబ యానందంబును మహితంబుగ బొందగను॥ ౭౩.
పురుడును వెళ్ళిన పిదపను బాలుని పురుషోత్తము గుడికిని।
వెరవక గైకొని వెళ్ళియు నుంచిరి విఠలమూర్తి సన్నిధిని॥ ౭౪.
బాలునెత్తికొని రుక్మిణిదేవియు పరగజనని కియ్యగను।
వీలుగ నచ్చట పూజల సలిపియు వేంచేసిరి యిండ్లకును॥ ౭౫.
సువాసినీవలె రూపుధరించియు సుందరిరుక్మిణి యటువచ్చెౕ।
భవతారకుడగు బాలు నుయ్యలను పదుగురితో దా నునిచెౕ॥౭౬.
జోలపాటలను బాడుచు పిదపను సుందరిరుక్మిణి మరియు।
బాలునకు తుకారామను నామము భవ్యంబుగ బెట్టుటయు॥ ౭౭.
కాంతలందరును యిండ్లకేగగను ఘనసంతోషముతోను।
శాంతచిత్తులై తలితండ్రులుమరి సరగపెంచిరి కొడుకును॥ ౭౮.

---

కొన్నిదినంబులు గడవగ కనకాయీ గుటిగ దాల్చెగర్భమును।
పన్నుగ నవమాసంబుల పిదపను భద్రముతో గనె కొడుకును॥
పేరుకాన్హయని శిశువునకు నిడి ప్రియకొడుకుల ముప్వురను।
తీరుగవారు త్రిమూర్తుల వరముల తిరతబుట్టిరని యిలను॥ ౮౦.
సంతతితోడను సంపద యుండగ సంతసిల్లి దంపతులు।
పంతముతోడను పెంచిరి కొడుకుల బహుగ మెచ్చ బంధువులు॥
సరివయస్సునను వైవాహికముల సలిపిరి యటు కొడుకులకు।
గురితో కొడుకులు వ్యాపారంబుల గూడిచేయుచును మెలగు॥
బంధుమాన్యతయు పరులెడ స్నేహము ప్రబలంబుగ నుండగను।
సందియమొందక ముదిమియు వచ్చెను సరగ తండ్రికయ్యెడను॥౮౩.
ప్రథమ పుత్రునకు వ్యవహారంబును పదిల పరచ దలపగను।
ఇదియా కొడుకునకింపుగా దనియు నేగెద ననెయాత్రకును॥
వ్యాపారంబుల రెండవ కొమరుడు వాసిగనటు గైకొనియెఁ।
ఏపారగ బహుచాతుర్యముతో నెల్లపనుల తగజేయఁ॥ ౮౪.
ఈతని భార్యయు రోగపీడచే నేర్పడియుండంగనియు।
పాడుగతండ్రియు మరియొక కన్యను పరగజేసెను పెండ్లియు॥౮౬.
ఇద్దరుభార్యలతోడను తుకయును నెలమి యుండుచును తాను।
పెద్దలు మెచ్చగ ప్రపంచరీతిని పెంపుజేసి ఖ్యాతిగను॥ ౮౭.
కొంతకాలమటు జరిగెను చక్కగ గొప్పగవ్యవహారమును।
వింతగనచ్చట దుష్కాలంబును విపులంబుగ రాగాను॥ ౮౮.
ఇంతలోముదిమిని తల్లియు తండ్రియు నీశుని పదమొందగను।
పంతముతో తనయన్న భార్యయును పరమపదము జెందుటను॥౮౯.
ధీరుండన్నయు వైరాగ్యముచే తీర్థాటన బోవగను।
సారరహిత సంసారముతనపై చక్కబడుట గాంచుచును॥ ౯౦.
వ్యాపారంబుల నష్టమువచ్చుచు వ్యసనమొంద నిరవయ్యెఁ।
గాపాడుచుతన నాణ్యమితరులకు గౌరతగన నరుదయ్యెఁ ౯౧.

అప్పులగొనుచును వ్యాపారంబుల నట్టిజరుపు చుండినను।
చెప్పరాని బహునష్టము వానిలొ చెలగిరాగ జూచుచును॥ ౯౨.
నేమియుతోచక విఠలుని నామము నింపుగదా నుడువుచును।
నేమముతో హరిచింతన జేయుచు నిలువగ కొన్నాళ్ళటను॥ ౯౩.
అప్పిచ్చిన యా వర్తకులందరు నరసివచ్చి యింటికిని।
ఒప్పుగ లెక్కల జూడగ నప్పుడు నుచితమెద్ది లేకగని॥ ౯౪.
సత్యముదప్పక వ్యాపారంబును జరిపినయెడలను నీకు।
ప్రత్యయముగనే నష్టము గలుగును బాగుగదెలిసెను మాకు॥
సంసారంబును నడిపే యుక్తిని చక్కగ తెలియక నీవు।
కంసారాతిని దలచుచుంటచే కష్టముబొందితివీవు॥ ౯౬.
హరినిభజించిన యధికఋణంబె యబ్బును శంకయులేక।
నెఱిమా మాటలరీతిని నడచిన నిలవ వరిష్టముల్ బోక॥ ౯౭.
ఇటులం జెప్పుచు నేగిరి వారలు నింటిసతియు పతిగనుచు।
పటుతరముగ హరి బట్టిన మొదలుగ బహుకష్టములే వచ్చు॥౯౮.
నలుగురిలోపల నాణ్యము దప్పెను నాలికెంచె నన్నముకై।
పలుమరు నీకిది బాగులేదనియు బలికె సతియును పతికై॥ ౯౯.
ఈవచనంబుల నాతడు వినుకొని యీశుభజనలో మించెగా।
పావననామము మిగులం జెప్పుచు పరులకు దావినిపించెగా॥ ౧౦౦.
దూషితపలుకుల నెవరు జెప్పినను తుచ్ఛమనుచు నెంచకను।
శేషశయను నిజనామ మెల్లపుడు జేయుచుండు ముదమునను॥౧౦౧.

---

ఒకదినమందా వర్తకమునకును నొనరవెళ్ళి నొకయూరు।
నికటపు వణిజుల కొందరితోడను నెఱిసహవాసము గోరు॥ ౧౦౨.
గోనెను వృషభము పైనియుంచుకొని గోవిందా హరియనుచు।
మానక నామము మహిత ధ్వనితో మరువక తాజేయగను॥ ౧౦౩.

కూడను వచ్చిన వర్తకులందరు కోపోద్యుక్తులు నగుచు।
వేడుకతోడను శ్రీహరినామము వేళనుచూడక మించు॥ ౧౦౪.
వదరుచునుండిన వచ్చుఫలంబెది వాసినిద్రలేకమరి।
హితముజెప్పినను వినకయుందువిటు యిదిసరిపడ దనియనిరి॥౧౦౫.
ఇటులంజెప్పుచు వారియెడ్లతోనే గిరతని విడనాడి।
పటుతరముగ తుక బోవగ వృషభము పల్లము బడె దిగనాడి॥౧౦౬.
గోనె క్రిందబడె యెత్తనశక్యమై కుదురుగాక నుండగను।
పూనెను వర్షము మెరుపురుములతో బొందెను చీకటి యటను॥
జాము రేయిలో యొంటిగ నడవిని చపలత జెందుచునతడు।
ప్రేమనువిఠలుని భజనజేయుచును బిలుచుచు రమ్మను చుండు॥
గోనెనెత్తుటకు మనుజులు లేరిటు గోవిందా హరిరంగ।
దీనతగొని యీసంసారముకై తిరుగుచు నేనుండంగ॥ ౧౦౭.
నీదునామమును జెప్పుటచేతను నిఖిలురు విడిచిరి నన్ను।
పాడుగ నేనిట నొంటరినైతిని భక్తునిబ్రోవుము యికను॥ ౧౧౦.
పండరినాథుడు వినుచును వచ్చెను పాంథునివలె నయ్యెడను।
నిండురేయిని దారి నిరోధన నిగుడిజేసి రెవరిటను॥ ౧౧౧.
అనుచు నడుగగా తుకారాముడనె నడవిని వెంబడివార్లు।
మనుకొని నన్నిటు విడిచియు వెళ్ళిరి మహి వర్షము విస్తరిలు॥
ఎద్దుపైని యాగోనె క్రిందబడ నెత్తువారు లేరనగ।
పద్దుగ శ్రీహరి గోనెను వృషభము పైనియుంచె నటుబాగ॥
సంతోషించుచు తుకయు చీకటిని సరిగ దారితెలియదనగ।
వింతగాకనే మార్గము జూపెద వేరమ్మనె జాగ్రతనగ॥ ౧౧౪.
నడవగ వారలు బహుదూరంబుగ నది వచ్చెను యడ్డముగ।
తడవులేని యాపూర్తిప్రవాహము దాటను శక్యముగాక॥ ౧౧౫.
తీరమందును తుకారాముండగ ధీరుడు పండరినాథు।
వారకచక్రము జలమున నునిచియు వాసిగ రమ్మనెనందు॥ ౧౧౬.

ఎద్దును తరుముచు తుకారాముడును యేపున దాటెను నదియు।
ఒద్దికగానా గోనె తడవకను నొప్పుగ నుండం గనియు॥ ౧౧౭.
సంతసిల్లియా తుకారాముడును సర్వేశ్వరు కృపయనుచు।
పంతముతోడను నడవ దొడంగెను బాటను మెరుపుల గనుచు॥
మెరుపులదీప్తిని దారిజూపు నరు మేనున హరిచిహ్నములన్।
గరిమెతోడ తుకగాంచుచు తిరిగియు గానకుండె నయ్యెడలన్॥
ఇరువురు గూడియు నింటికివెళ్ళిరి యిట్టిసమయంబు నందు।
హరితానేగను తెల్లవారునపు డచటినరులు గనిముందు॥ ౧౨౦.
తుకారాము కడకేగియు బల్కిరి ధూర్తవార్తలటుగాను।
ప్రకారముగ నీ నాలుగెడ్లలో పడిపోయెను మూడిలను॥ ౧౨౧.
హరిని భజించిన ఫలమగు నిదియని యరయ జెప్ప సతియటను।
కరివరదుని నిటుబట్టియుంటచే కరగెను సంసారమును॥ ౧౨౨.
అప్పుతీసికొని ముంచెననేకుల హరినామపు ఫలమిదియు।
ఎప్పుడితనికిని లజ్జయు గలుగదు యెంతజెపిన వినడనియు॥ ౧౨౩.
అట్టిపలుకులును తుకా వినుంగొని యతివ్యాకుల చిత్తుండై।
ఎట్టకేలకిటు యేమిచేయుదును యీసంసారము మెండై॥ ౧౨౪.
బాధనొందితిని బహుగాయనుచును పండరిపతి దలచుచును।
పాదుగదీనిని విడుచు నుపాయను భవ్యముతో జూపుమను॥

---

అనేకభంగుల ననుతపించుచును హరినే చింతింప గను।
వినీతుడైతుక యొకయోచనదా వీలుశేసె నయ్యెడను॥ ౧౨౬.
ఏదో ద్రవ్యము కొద్దిగ నుండగ నెలమి మిరెపుకాయలను।
పాదుగ వెలకును గొనియెనంగడిని పరగనింపె గోనెలను॥ ౧౨౭.
కొంకణ దేశము పోయినచ్చటను కోరివిక్రయించుటకు।
పొంకముతో సంసార బాధయును పోవునటుల జేయుటకు॥ ౧౨౮.

దారినడచుచును విఠలనామము దలచుచుగాగ తాజెప్పన్।
పారావార సద్భక్తియు గల్గెను పండరిపతిపై యొప్పన్॥ ౧౨౯.
ఊరుకువెలపల శివాలయంబున నుచితంబుగ దాదిగెను।
వారిజనాభుని నామము జెప్పుచు వరుసవిప్ప గోనెలను॥ ౧౩౦.
కొందరు వచ్చుచు వెలయేమనగను కోరినంత గొనుమనుచు।
తొందర లేకను తుకారాముడును తూచెను కాయలమనుచు॥
వలసినంతయును వారికి నియ్యగ వగ తవ్వెడు బియ్యమును।
చలములేకనటు తుకయున కియ్యగ సరెయనుచును గైకొనెను॥
కొసరుకాయలను వేయుమటన్నను గొనియు నీవె చనుమనగన్।
వెసనువారలును యిష్టము కొలదిని వేసికొనిరి వలసితగన్॥౧౩౩.
మరియునొక్కడట నారురూకలను మానుగనిడి తుకయునకు।
సరియగు కాయల దీసికొనియు దాచనియెను తనగృహమునకు॥
తుకారాము నౌదార్యంబునునటు తోడ దెలిసె గ్రామమున।
సకాములగుచును చనుదెంచిరి బహు జనులు కాయలన్నిగొన॥
అప్పగనిమ్మని వారలు నడుగగ నటులనె కానిమ్మనుచు।
తప్పక తూచెను తుకారాముడును తలచుగాగ నటుమనుచు॥
ఒకసారిగనే వచ్చియనేకులు నొసగకాయ లియ్యమన।
సకలజనులకును తూచనశక్యమై సరిగమీరెచే కొమన॥ ౧౩౭.
ఇష్టముకొలదిని కొల్లగొనుచుమరి యేగిరి తమయిండ్లకును।
కష్టముగాకొక గోనెడుకాయల ఖలుడొక్కడె గైకొనెను॥ ౧౩౮.
తెచ్చిన మిరియపు కాయల నన్నియు తెరువున నమ్మితిననుచు।
మెచ్చుచుతనలో తుకారాముడును మేలుజేసె హరియనుచు॥
తవ్వెడుబియ్యము నారురూకలును తనయెడ నుండగజూచు।
నివ్వటిలంగను నాతడువంటను నెనరున జేసెదననుచు॥ ౧౪౦.
ఇత్తడిపాత్రల నాతడు తోమియు నెలమిని స్నానముజేయు।
తత్తరపడకను కట్టెల వెతుకుచు తానుపాకమును జేయు॥ ౧౪౧.

అప్పుపైకమును నడుగడీతడని హరి తానే దలచుచును।
ఒప్పుగ తానొక సేవకుడగుచును నొక్కొకింటి కేగుచును॥ ౪౨.
అప్పుగ తీసిన వారలనందర నడిగె డబ్బుసరిగాను।
తప్పకవారును తూనికెజూడగ తథ్యము నట్లుండగను॥ ౧౪౩.
డబ్బులనిచ్చిరి కొందరయ్యెడల డంబముతో నియ్యకను।
గొబ్బున పొమ్మన గోవిందుండును కూడదియ్యమని యనును॥
అందరి వద్దను వసూలుచేసియు నతిఖలుడగు వానియెడన్।
సందియమొందక వెళ్ళివానిగని సరగున పైకము వేడన్॥ ౧౪౪.
ఎవరనియడుగ తుకాసేవకుడన యియ్యననుచు ఖలుడనగన్।
సవినయముగదా చక్కనిపలుకుల సర్వేశ్వరు జెప్పంగన్॥ ౧౪౬.
వినకను వాడును ధూర్తవాక్యముల విశేషముగ పలుకగను।
ధనమును నీ కిప్పుడియ్యని యెడలను తనువును విడిచెదనిటను॥
అనుచును జెప్పియు నురినికంఠమున నందరుగన నుంచుచును।
వెనగొని యూరును భస్మముచేసెద బింకములే కిమ్మనను॥ ౧౪౮.
పురజనంబులును ఖలునిగొట్టుచును పొసగపైక మిమ్మనగన్।
సరగుననాతడు పైకమునిచ్చుచు చక్కగబొమ్మని యనగన్॥ ౧౪౯.
తుకారాముడెడ చౌదరియనుచును దురుసుగ వచ్చెను హరియు।
ప్రకాశమగు నటు రూకల మూటను బాగుగనిచ్చియు మరియు॥
అప్పుగనిచ్చిన కాయలపైకము నడిగి దెచ్చితిని యనుచు।
చెప్పగ తుకయును వారలకునునే చెలగిపంచితన వినుచు॥ ౧౫౧.
ఊరుగృహస్థుడ నై నేనుండగ నూరకేల యియ్యవలె।
సారతరంబుగ సంపద మాకును చక్కగతగి విలసిల్లె॥ ౧౫౨.
అనుచు జెప్పుచును చౌదరి మెల్లగ నటుదా గూర్చుండగను।
వినితుడై తుకయును గిన్నెలోనే తిని వేగమెకొని దెమ్మనెను॥
మంచిదియనుచును చౌదరినేతిని *మసగిదెచ్చె దానటను।
అంచితముగ నాతుకారాముడనై నన్నము వండితి నిటను॥ ౧౫౪.

---

*విజృంభించి.

ఆరగించితివేనియు నీవును నతిసుఖమగు ననగాను।
మారుబల్కకను చౌదరి యందుకు మన్నించెను భక్షణను॥౧౫౫.
పినాకపాణియు నతిథి రూపమున పెనగివచ్చె నయ్యెడను।
వినీతుడగుచును తుకారాముడు వేరమ్మనె తినుటకును॥ ౧౫౬.
హరిహరులిరువురు తుకారాముతో నతిముదమున భక్షించి।
సరగుననచే తులకడుగగ తుకయును చక్కగ విడెముల నిచ్చి॥౧౫౭.
మన్ననజేయగ వారలు వెళ్ళిరి మరియా గ్రామపు జనులు।
తిన్నగవచ్చుచు తుకారాము నెడ తెలిపిరి సేవకుపనులు॥ ౧౫౮.
హరిభక్తుడవని యెంచియుంటిమిటు యమిత విక్రము సేవకుడు।
సరగున పైకము వసూలుచేసియు సాధించెను దా మెందు॥౧౫౯.
ఇదివిని తుకయును విస్మితచిత్తుడై యీశుని కృపయని దలచు।
సదయుండగుచును మళ్ళనింటికిని సర్వేశ్వరు వేరనుచు॥ ౧౬౦.

---

దారినడవగను పోకిరియొక్కడు తగిలెను వెంబడిగాను।
మీరియు నాతడు యిత్తడితునకకు మిగుల మొలాము బూసియును॥
బంగరుకడియని జూపె తుకయునకు బహుళ ధనము లేదనుచు।
అంగుగజెప్పెను తుకారాముడును నందుకు పోకిరి గనుచు॥౧౬౨.
ఎంతటిపైకము నీయెడనుండునో యంతే యిమ్మిటునాకు।
పంతముతోడను తక్కినపైకము పైనిమెల్లనియ్యదగు॥ ౧౬౩.
మనుజుల కపటము తుకయును చూడక మన్నించును తనవలెనె।
అనువుగపోకిరి యటులంజెప్పగ నన్నిరూకల నియ్యగనె॥ ౧౬౪.
ఇత్తడితునకను చేతులనిడుకొని యేగుచుండ నాతుకయు।
సద్దులేకనటు మరియొక దారిని చనియెను నా పోకిరియు॥ ౧౬౫.
తుకారాముడును నింటికిరాగనె తోడవచ్చి వర్తకులు।
ప్రకారముగనె యప్పుతీర్చుటకు పైకమిమ్మనిరి వార్లు॥ ౧౬౬.

బంగరు తునకను వారలకియ్యగ బహుసంతోషముతోను।
పొంగుచు నొరిపిడి రాతిని రాయగ పోయిరి మోసంబటను॥౧౬౭.
తునక యిత్తడిదని తెలియబలుకుచు తుకయునకును తిరిగిచ్చి।
అనువుగనెత్తిని గొట్టుకొనిరి యా యప్పుల వాండ్రటు లేచి॥
భార్యజూచుచును పెనిమిటినప్పుడు పండరిపతి దలచుచును।
కార్యములన్నియు చెడిపితివిచ్చట ఘనపాపివి యగుచును॥ ౧౬౮.
పోకిరితో నిటు సంగము నీకును పొందగునే లోకమున।
వీకను నీవును వివేకయుక్తితో వెలసి జూడ కుంటివన॥ ౧౭౦.

---

ఇండ్లకు వెళ్ళిరి యప్పుల వారలు యేమిచేయుదమని యనుచు।
కండ్లనీరుగొనె సతి, సంసారము కాపాడుట యెట్లనుచు॥ ౧౭౧.
అతనిసతులలో మొదటిది రుకుమాయ్ ఆవులి రెండవ దగును।
సతతము రెండవ భార్యయె జూచును సంసారము నయ్యెడను॥
పురుషార్థము హరిభజన యనుచు మరి పురుషుండుండుట చేతన్।
గుటితోజేసెడి వ్యాపారములకు గూడదు యశోసును రోతన్॥
తనదు పేరుపై యావులియడిగెను ధనవంతుల పైకమును।
అనువుగ వారలు రెండువందలును నప్పిచ్చిరి సరిగాను॥ ౧౭౪.
ఇరువందల యా రూపాయీలను యేపుననిచ్చెను పతికి।
తరుచుగాగ నాపేరున దెచ్చితి ధరనువర్తకము పెరిగి॥ ౧౭౫.
దూరదేశమున వ్యాపారంబును దురుసు జేసి రమ్మనుచు।
మీరకనీవును వ్యాపారులతో మిగుల జాగ్రతను గొనుచు॥ ౧౭౬.
ఉప్పును గోనెల వెసికొనుచు నటు నొగిబాలా ఘాటునకు।
తప్పక వణిజులు దానియమ్ముకొని తఱుగుగొని బెల్లమునకు॥ ౧౭౭.
షహరులో దానివిక్రయించి మరి సరిజేర్చిరి పైకమును।
సహచరుడగు యాతుకారాముడును సాధించెను యటుగాను॥

సత్యము జెప్పని వ్యాపారులతో సత్యవంతుడు తుకయగును।
ప్రత్యయముగనే పరిపరివిధముల బలికిరి యటు తుకయెడను॥ ౧౭౯.
హరినామంబె తుకయున కమరగ్ర నాపలుకుల దావినక।
నరహరి యచ్యుత యనుచు జెప్పును నారాయణ శ్రీరంగ॥ ౧౮౦.
ఈవిధమున యా వ్యాపారులతో డీతడుండి పైకమును।
సావధుడగుచును చేకొని మళ్ళెను చనువున వారలతోను॥ ౧౮౧.
దారినుండు నొకగ్రామము నందును తవిలి వారుదిగియుండఁగ।
తీరుగనచ్చట బ్రాహ్మణుడొక్కడు తిరుగుచు యిటనటునుండఁగ॥
కట్టెను జేసిన నాగలి యొక్కటి కంఠము వేసి కొనుండెఁ।
బెట్టిదముగ తలవెంట్రుక పెరిగియు భిక్షము నడుగుచునుండెఁ॥
పావుల వీసము కొందరిచ్చిరటు ప్రజకొందరు లేదనగఁ।
నావుడు తుకయును వానింబిలుచుచు నవయుట కారణమడుగఁ॥
అతడు జెప్పెను దాయాదులచే నపహత మయ్యెను నేల।
నీతిదప్పి లంచములిడి కైదున నెలమిని నన్నుంచిరిల॥ ౧౮౪.
కష్టతరంబుగ పంచాయతిలో కారాగృహమును వదలె।
నష్టబుద్ధితో నరపతి యిమ్మనె నలకరూక మున్నూర్లె॥ ౧౮౫.
ఏబదినిచ్చితి నిరుశతమున్నర నిచ్చుటకును తగనేను।
గాబరతోనిటు తిరుగుచుందునని గరిమ జెప్ప నాతడును॥ ౧౮౬.
దయతో చిత్తము కరిగి తుకయునకు తప్పక నిడె పైకముచే।
ప్రియమున ద్విజుసతి బిలిచి దానిచే పెనగి వంట జేయించె॥ ౧౮౮.
మంగలివానిచే తలగొరిగించియు మహిస్నానము జేయించఁ।
సంగము గూర్చుచ పదుగురు విప్రుల సరగభక్షణ మొనరించెఁ॥
ద్విజుడు పైకమును రాజునకిచ్చుచ తీర్చుకొనెను బాధయును।
కుజనదూరుడగు వెంకటరమణుడు గురితో రక్షించుననను॥ ౧౯౦.
ద్వాదశాబ్దములు తిరుగుచుండితిని తలపడలేదీ ధనము।
పాడుగ నీకును భగవంతుండును బహుగశుభము సేయునుము॥

శ్రీ

శ్రీమతేరామానుజాయనమః.

భగవన్నిర్హేతుక కటాక్షముచే ప్రాప్యభూమినిపొందిన

భక్తశిరోమణుల చరితలనుదెలుపు

# భక్తమాల.

ఇది

మహారాష్ట్ర భాషయందు మహీపతిబావాయను

భక్తశ్రేష్ఠునివలన రచింపబడిన

భక్తవిజయము, సంతవిజయము, భక్తలీలామృతము, సంత

లీలామృతమను గ్రంథములను క్రోడీకరించి,

వె. బాలకృష్ణ మొదల్యారిచే

తెనుగున

తోహరా కవితలగా రచింపబడిన పదిసంచికలలో నిది

— ఐదవ సంచిక. —

చెన్నపురి, మవుంటురోడ్,

"కమర్షియల్ ముద్రాక్షరశాలయందు"

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

౧౯౦౦వ సంవత్సరం ఆగష్టునెల.

శ్రీమత్ అవిచిత్ర శతావధాని, విద్వన్మణీ మహాభాగవత సలక్షణ
కృష్ణ యజుర్వేద ఘనపాఠి, హరిదాస బాళేగడ్డె కట్టె,
శ్రీమాన్ లక్ష్మణాచార్య కృత కృతిప్రశంస.

---

శ్లో॥ గ్రథితేయం బాలకృష్ణదాసేన లలితైః పదైః।
భక్తమాలా విష్ణుభక్త చిత్రచారిత్రబోధినీ। ౧॥
మహాకవి కృత గ్రంథప్రౌఢిమానం శ్రయత్యహో।
ఇతి శ్రీభగవద్గీతా లక్ష్మణార్యోఽనుమన్యతే॥ ౨॥

విదితంబుగనటు తుకారాముడనె వెలయగసత్కార్యమున।
సదయుడనైనే ఖర్చుబెట్టితిని సతియాపులి గృహమున॥ ౧౯౨.
కానివాక్యముల పలుకునేమో యను ఘనభీతిని బొందగను।
దానవాంతకుడు తుకారాముపలె తాను గొనుచుపైకమును॥
అప్పిచ్చిన యా ధనవంతునికడ నప్పుడె జేర్చెను రూకలను।
తప్పక వడ్డియు నైదు వరాలును తానిచ్చెను నయ్యోడను॥ ౧౯౪.
ఆవులియగు తనభార్యకిమ్మనుచు నతడు జెప్పి వెళ్ళగను।
భావశుద్ధితో ధనవంతుండును భర్తని గృహమేగుచును॥ ౧౯౫.
ఆవులి సతినింగాంచుచు జెప్పెను నందెరూకలు వడ్డియు।
నావుడు తుకయును నైదువరాలును నాకిడె నీకిమ్మనియు॥ ౧౯౬.
సతియుం గైకొని సంతసమొందగ చక్కవచ్చిరా వర్తకులు।
హితముగ సతినిం బిలిచి వారలును నెలమి జెపిరి సంగతులు॥
దానము చేసెను తుకారాముడును ద్రవ్యమంత ననగాను।
మానుగ సతియది యబద్ధమనుచును మన్నింపక యుండగను॥
భయముతోడ తుక యింటికి రాగను బయలయ్యెను సంగతియు।
దయతో హరియును తప్పించెనని తలచుచుండె [illegible]యు॥

---

ఇటులం జరగగ బహుదుష్కాలము నే తెంచెను యటుగాను।
పటుతర వర్షము మేదిని బడకను బహుగ ధరలు నెక్కగను॥ ౨౦౦.
అన్నము దొరకక నుపవాసంబున నమరియుండి రటు జనులు।
పన్నుగ తుకయును కుటుంబమున్నకై బహుగాపొందె నిడుములు॥
ప్రథమ భార్యయు నన్నములేకను పరమపదంబును బొందెగా।
కుదరక నామెకు నొకడైయుండిన కొడుకుకూడ మృతినొందెగా॥
అధిక వ్యసనము తుకారామునకు నబ్బెను నయ్యోడగాను।
వ్యథనుబొందె దానన్నము కొఱకై వలయుగింజ దొరకకను॥ ౨౦౩.

గోనెలు మొదలగు కొన్నివస్తువుల గుఱితో నమ్మెను యవుడు।
మానెడు ధాన్యమునందున వచ్చెను మహిని వాటిచే నతడు॥ ౨౦౮.
కొన్ని దినంబులు జరిపియు పిదపను కుటుంబ పోషణకొఱకు।
ఖిన్నుడై యొరుల ధాన్యమడిగినను క్రియగానక తా నటకు॥ ౨౦౯.
నిందితుడయ్యెను సకల జనులచే నెళవుదప్పె నయ్యెడను।
పొందికలేనిదై భార్యయునుండెను పూర్తిదుఃఖ మగుటకును॥
సర్వవిధంబుల సంసారంబున సంకటమే గలదనియు।
నిర్వహించుటకు నెళవుగాదనియు నిలువదు యీ మేననియు॥
ఆయుర్దాయము నిటులనె బోయిన హరిని గనుట యెపుడనియు।
పోయెను నప్పుడె బాంబనాథమను పుణ్యగిరికి నటు గనియు॥ ౨౧౨.
దానిపైని చని దామోదరు మదిదలచుచు తా నిట్లనియెన్।
దీనుడనే నిను నెటుల భజించుదు తెలివియు లేదనియనియెన్॥
విధాత మొదలగు దేవతులందరు వెదకెదరు నిను గనుటకు।
నిదానముగ శ్రీసాంబమూర్తియు నెగడును నినుజూచుటకు॥
ఎంతటివాడను నే నీజగతిని నీశ దయాళో యనుచు।
పంతముతో శ్రీపాండురంగనిన్ భావములోపలనుంచు॥ ౨౧౫
ఏడుదినంబులు నన్నపానములు నేమిలేక నుండగను।
వేడుక లలరగ మనసేకాగ్రమై విస్మృతినొందెను యటను॥ ౨౧౬.
వ్యాళరూపమున పాండురంగడును వచ్చె మహదాకారమున।
కాళకూటమగు విషమును కక్కుచు కానబడె నటుచుట్టున॥
అంబరవీధిని శబ్దము మ్రోగెను హరిభక్తుడ కను దెరువు।
సంబరముగ శ్రీ హరియు సర్పమై చక్కవచ్చె నీతెరువు॥ ౨౧౮
ఇదివిని తుకయుండీశుడు సర్పమై యిటేలవచ్చెను యనుచు।
సదయుడు శ్రీహరి నిజరూపంబును చక్కజూపు వాడనుచు॥ ౨౧౯
కనులను దెరువక నుండగనప్పుడు కంజదళాక్షుడు గనుచు।
చనువున సుందర చతుర్బాహుడై చక్కగ ముందుగ నిలుచు॥

తల్లియు బిడ్డను యెత్తునట్లుగను దామోదరు తా నపుడు।
ఉల్లము లలరగ చంక నెత్తికొని యొసగజూడుమనె నపుడు॥
శ్రీహరిరూపును తుకరాం గాంచుచు జెందెను సంతోషమును।
ఊహను జూచుచు కన్నీరొలుకగ నుచిత తమ్ము డరుగుచును॥
వెతుకగ కాన్హా యేడుదినంబులు విదితుడయ్యె తుక యటను।
హితులగు నిద్దరనచ్చట గాంచెను నిలమోదము నొందగను॥
వరముల నిచ్చెద వేడుమని తుకను వరమడు గని పలుకగను।
గురుతుగ నిను నే మరవకుండు నటు కోరువరము నిమ్మిటను॥ ౧౧౦.
అడిగిన వరమును శ్రీహరి యొసగియు నంతర్ధానమొందెమును।
పుడమిని యిప్పుడు నాస్థలమందును పొసగ గనెద రడుగులను॥



తుకరామనుజుడు కాన్హాయచ్చట తోడత్రవ్వె నడుగులను।
సకాములగుచును నన్నయు దమ్ముడు చని తమయూరయ్యెడను॥
అష్టమదివసము నదీతీరమున నారగించి రిరువురిల।
ఇష్టముతోడను తుకారాముడింటిలెక్క కోశముల॥ ౧౧3.
తమ్మునితోడను తెప్పించియునటు తమకు బాకిపత్రముల।
సమ్మతియగునటు నీటిని వేయను సరియత్నము జేయనిల॥ ౧౧౪.
ఇటులజేయుటకు కారణమేమని యెలమిననుజు డడుగగను।
చటులత ఋణమగు ద్రవ్యమబ్బునను సరియాశను విడుటకును॥
తరులు మనకును బాకి విత్తముల నిత్తురొయియ్య రొయికను।
శతమువానిని స్మరించుచుండిన సార్థకమేమన యతను॥ ౧౧౫.
విరక్తిచేతను నీవీటుజేసిన నెటిసంసారిని నాకు।
తెరువెట్లనగను నన్నయు బలికెను తేటనర భాగమునకు॥ ౧౧౬.
నీవు కర్తవని తనభాగంబును నీటముంచె నయ్యెడను।
దేవుడెకర్తయా నాకికమీదను దినమునుభిక్షాటనను॥ ౧౧౭.

కాలయాపనము జేసెద నేనిటు ఘనవ్యాపారము నిలను।
చాలునంత మరిసలుపుదు వీవని చక్కవెళ్ళి కొండకును॥ ౨౨౯.
నామస్మరణను మరువక నెప్పుడు నారాయణ హరియనును।
రామా హరి శ్రీరాజీవాక్షా రంగా విఠ్ఠలయనును॥ ౨౩౦.
నామమెజపమగు నామమెతపమగు నామంబే వ్రతమగును।
నామమెనాకును కులాచారమగు నామమె ధర్మంబగును॥ ౨౩౧.
నామముచేతనె పాపముపీడును నామమె విశ్రాంత్యగును।
నామముతప్పగ వేరాధారము నాకును లేదీ ధరను॥ ౨౩౨.
నామమె ధనమగు నామమె విత్తము నామమె సంపద యనుచు।
నేమముతో భవసాగరముండియు నెఱిపారము ముట్టించు॥ ౨౩౩.
ఈవిధమున తానిత్యానిత్యమును నేకతమున నుడువుచును।
సావధుడగుచును సాయంకాలము చనుదెంచును గుడికటను॥
ఆడుచు పాడుచు నుండునచ్చటను హరివిఠ్ఠలయని జెప్పు।
వేడుకతోడను లోకులు జూచుచు వివిధ పలుకులన నొప్పు॥ ౨౩౫.
తుకారాముడును వినకను వాటిని తుచ్ఛ యహంకృతి నతడు।
వికారములతో విరగ ద్రొక్కుచును విహితశాంతితో నెగడు॥
ఆశయుతృష్ణయు మోహము మాయయు నవలంబించక తాను।
ఈశుని పూజల జేయుచు పిదపను నేగు పురము వెలపలను॥ ౨౩౬.
పగటివేళలో నేకాంతంబున భగవన్నామం బనుచును।
మిగులప్రేమను నుండగ నొకయెడ మెలగెడి నది తీరమును॥ ౨౩౭.
కరంజయాయను స్థలమున నుండుచు గావించెను నామమును।
నిరంతరంబిటు చేయగ నచ్చట నిగుడుచుండె పంటయును॥ ౨౩౯.
అచ్చటకాపుని చేనున ధాన్యము నమరియుండె కంకులను।
సచ్చరితుండగు తుకారాముకడ సరగునవచ్చి యతడును॥
చేనుపంటకును కావలియుండుచు చేకొనుధాన్య మరమణువు।
మానుగదానిచె కుటుంబరక్షణ మహిజేయుటకగు నెళవు॥ ౨౪౧.

ఊరకుండినను యెటులంజరుగును నొప్పగ సంసారంబు।
మారకనీవును మంచెపైనిడగ మాధవుభజనను సలుపు॥ ౨౪౨.
నీయాధీనము జేసితిచేనును నెటి రక్షణ జేయుమను।
నేయము తోడా గోషణ మిచ్చెను నిలువుమిచట ననుచును॥౨౪౩.
పంట ఫలమునకువచ్చిన వెనకను పరగనిత్తు ధాన్యమును।
వెంటనె జెప్పుచుకాపు వాడును వెళ్ళె వేరు దేశమును॥ ౨౪౪.
తుకారాముడును చేనుకావలిని దురుసుగ దానుండగను।
వికాసముగ తగువిహంగములనటు వేడుకనుండ గనుచును॥౨౪౫.
ఈశునిజీవులు యివియన్నియుమరి యిచటనుండి తరిమినను।
దేశము వెళ్ళిన యధికారికిమరి దెచ్చుపాప మియ్యెడను॥ ౨౪౬.
దుష్కాలముచే నన్నముదొరకక దుర్బలమగు పక్షులును।
నిష్కారణముగా గొట్టినయెడలను నిందితునగుదునునిలను॥
అనుచు జెప్పుచును మంచెపైనిదా హరినామముతో నుండు।
ఘనుడగు రంగనిగాంచుచు మదిలో ఘనమోదముతో నెగడు॥
రవి మధ్యాన్నము రాగనె పక్షుల రమ్యము తోజూచుచును।
భువిలోవిహారలు పొట్టనిండుగను భుజించినందున యికను॥ ౨౪౯.
నీరు ద్రాగుటకు వెళ్ళవలయునని నెనరున జెప్పుచువేగ।
ధీరుడై శ్రీహరి నామముజెప్పును తెరువుగప్రజలు వినంగ॥ ౨౫౦.
ఇంటిలోన సతి పతిరాలేదని యితరుల జూచుచుతాను।
ఒంటరిగా తా నెచటనుండునో నొనర దిరుగు వనములను॥ ౨౫౧.
సంసారంబును నీటుగజేసెను సారసాక్షు భజనయును।
కంసాంతకుడగు హరిసన్నిధిలో గరిమె నాడు విసుకకను॥
ఆకలిలేచెను నధికోత్తరముగ నతడులేక నే దినను।
జోకను కూతురి బిలిచియు జెప్పెను జూడు పితను వెలిగాను॥
కాసిబాయి దా వెతుకుచుబోవగ గనె తండ్రిని చేనుకడ।
వేసజిల్లి కొమా రైకను సంగతి వినిపించెను తా జూడ॥ ౨౫౪.

కూతురు వచ్చుచు తల్లికడకు నటు కోరిజెప్పె సంగతియు।
పాడుగ రొట్టెల పతికిని బంపియు భక్షణజేసెను సతియు॥ ౨౫౯.
భక్షణ జేసియు తుకారాముడును పరగమంచె మీదుండేక।
పక్షులన్నియును ధాన్యభక్షణము బాగుగ జేయుచు నుండేక॥
పశ్చిమదిక్కున సూర్యుడు వెళ్ళగ పక్షుల గని యాతుకయును।
నిశ్చయమిది గద కనులుదెలియవు నెతె రాత్రుల మీకనియు॥
ఉదయము కాగనె తిరిగియురమ్మని నుచితంబుగ జెప్పుచును।
హితుడై యొక పరియెగర గొట్టుచును నెలమినిటుల జేయుచును॥
రాతిరి వేళలో గుడికి వచ్చుచును రంజిలు నట్లాడుచును।
పాడుగ నుదయము లేచి పూజలను భగవంతునికి జేయుచును॥
పంటపైరు కడవచ్చియు తుకయును భగవన్నామం బనును।
ఒంటరిగా నిటులుండుచు పక్షుల నొప్పురీతి చూడగను॥ ౨౬౦.
వింతనొందుచును తనలోనిట్లనె విహంగములు ధాన్యముల।
ఎంతయుచే కొని వెళ్ళవిండ్లకును నెలమి తినును నిద్యోడల॥ ౨౬౧.
వీటిగుణంబులు నాకెటుగల్గును విఠ్ఠల శ్రీహరి యనుచు।
నీటుగనాకును నేననుభావము నెటబోవుట యెపుడనుచు॥ ౨౬౨.
అందర నేనును నాత్మభావమున నమరజూచు టెన్నటికో।
పొందుగ బంధువుల్ నను లేనట్లుగ భువినితలచు టెన్నటికో॥
గళిత పత్రములు గాలికెగురువలె కావలెనే నీభువిలో।
విలసితమగు నీ చరాచరంబులు విష్ణురూపమగు నిలలో॥ ౨౬౩.
అటుగానాకును సమత్వభావన నందునటుల జేయుమను।
చటులతరంబుగ నిందాస్తుతులను *నరకకుండ చూడుమను॥ ౨౬౪.
నీగుణకీర్తన నెపుడు బాడునటు నెనరున జేయుము రంగ।
బాగుగ నిదియ నేనడుగు దానమగు ఫలితపరచు రిపుభంగ॥ ౨౬౫.
ఈవిధమున యా తుకారాముం డీశుభజన సలుపుచును।
భావన హరిపై నిడిదానుండగ పంటకాపు వచ్చుచును॥ ౨౬౬.

---

*లక్ష్యముంచక.

చేనును జూడగ ధాన్యమెద్దియును చే కు..డె కంకులలో।
మానుగ కాపుం డటుయిటు దిరుగగ నుసలె పిట్టలయ్యెడలో॥
నాలుగుపక్కల చూడగధాన్యమునడికంకుల లేకగని।
వాలుగమంచెపై తుకయుని జూచెను వాసుదేవ యనగవిని॥
కాపు బల్కెనటు క్రోధయుక్తుడై కావలిడితి నిన్నిటను।
ఏపున ధాన్యము పక్షులకిడి నన్నిల ముంచితి వియ్యెడను॥ ౨౭౦.
ఖలుడా కాపు తుకారాము నటు గట్టిగ బట్టీడ్చుచును।
నెళవునదెచ్చెను యధికారులకడ నెత్తినిగొట్టుకొనుచును॥ ౨౭౧.
తుచ్ఛభాషలను బహుగాబలికెను తుకారాము మీదుగను।
మెచ్చుకవారలు తుకారాముగని మెలగి యడిగి రేమిటను॥ ౨౭౨.
ఉత్తరమిచ్చెను కాపువాడు నను నొప్పుగమంచె నుండమని।
తత్తరబడకను పక్షులజూచుచు ధరకావలి యుండమని॥ ౨౭౩.
చెప్పిన రీతిని జేసితి నేనిటు చిలుకలు ధాన్యంబులను।
మెప్పుగ దినగను వాటినిగొట్టిన మెలగి విడును నుసురులును॥
భయమున వాటిని గొట్టక యుంటిని క్రియగింజల నిండ్లకును।
నయమున యవిగొని పోలేదనగను నవ్విరచటి జనములును॥ ౨౭౪.
అధికార్లపుడా కాపునడిగిరా చేనుపంట యెంతయని।
విధితోనాతడు రెండు మణువులని వెరవక యన, వారువిని॥ ౨౭౫.
పంటయంతయును ఫలితంబగునెడ పాడుగ తుకయును నీకు।
వెంటనిరుమణువు లిచ్చునట్లుగా వెలసితీర్పు చేయనగు॥ ౨౭౬.
ఇందుకు పత్రము తుకారాముకడ నిప్పుడె గైగొనుమనుచు।
సందియ మొందక వ్రాసి దస్కతును సరగున గొని రటు మనుచు॥
తుకానుగని పంటనీయధీనము తోడనుంచుమన నతను।
సకాముడగుచును నితరుల పంటను స్వాధీనము నుంచనను॥ ౨౭౭.
కూలికిసర్కార్ మనుజుల బెట్టుచు గురితో పాలింపగను।
వీలుగ పంటను మిగులధాన్యమటు విస్తరిల్ల జూచుచును॥ ౨౮౦.

మణువులు రెండని కావువాడనె మహిత ధాన్య మగుటగని।
అనువుగ నిదియును పండరినాథుని యంచిత కృప యనియుగని॥
కావువాడు చేసును తన స్వాధీనము కానిమ్మని యడుగగను।
ఏవున వారలు తీర్పువిరోధము నిపుడుచేయ దగదుయను॥
కోతలువేసిన వెనకను ధాన్యము కొండయెత్తుగను నుండెన్।
పాడుగ నదియును కొలతకు మణువులు పదియునేడు గను నుండెన్॥
కావున కిరుమణుల్ ధాన్యము నిచ్చియు కడమువాటిని తుకయునకు।
ఏవుననియ్యగ నతడు వలదనియు నిష్టములేదనె తనకు॥ ౨౮౪.
నిరపేక్షయె ఘనవైరాగ్యంబగు నిరపేక్షయె జ్ఞానమగు।
నిరపేక్షయె ఘన యువరతి సుఖమగు నెఱిసంతోషంబునగు॥
అనుచు తుకారామిచ్ఛయులేకను నటు దా తగ నుండగను।
పనిబడి యచ్చట పటేలుదాజీ పంతుండా ధాన్యమును॥ ౨౮౫.
హరికృపచేతను యిచ్చినదగునని హరిసమర్పణ మగుటకును।
వెరవక తానేయుంచె నింటిలో విహిత సమయము గనుచును॥
శ్రీహరిభజనను తుకారాముడును చిరతరముగ జేయుచును।
ఊహకలంగక ప్రేమజనించుచు నుచితస్థితి నుండగను॥
ఆతని భార్యయు ధాన్యముకొఱకై యధికమాటలను జెప్పెన్।
పాడుగ తుకయును సంతోషముతో భగవద్భజనలో నొప్పెన్॥
పండరినాథుని యాలయ మచ్చట బహుకాలము గడిచినదై।
ఉండెను శిథిలమై తుకయును జూచుచు నొగి మరమతు వలసినదై॥
పార గుల్లలను చేతుల గైకొని పని చేసెను నొక్కడుగాన్।
తీరుగనిటులనే జేయుచునుండెను దినదినమును తగ వేగన్॥ ౨౮౧.
పటేలుదాజీ స్వప్నమునందును పండరినాథుడు బలుకు।
కుటీరమందలి ధాన్యమునిమ్మిటు గుడిమరమ్మతు కొఱకు॥ ౨౮౨.
ఇదిగని దాజీగ్రామస్థులకును నేర్పడదా జెప్పగను।
ముదమున నందరు సమ్మతించుచును ముఖ్యజనుల బిలుచుచును॥

పని నడిపించిరి బాగుగ గుడికిని భక్తుడు ముదమున నిగుడఁగ।
జనులచె ముగిసెను కొంతకాలమున, సంప్రోక్షణ నిలవబడఁగ॥
ద్రవ్యము లేకను తల్లడబడగను దాజీ స్వప్నంబునను।
దివ్యశరీరుడు వైష్ణవుడొక్కఁడు తేటగ దాజికి ననెను॥ ౨౯౪.
అధికార్లిచ్చట నన్యాయస్థులు నరయ పాప మొందెదరు।
విధినికాపువా డరమణు గింజలు వీలుగనియ్య కరారు॥ ౨౯౫.
చేనురక్షణకు కూలిబాబతున, చేకొని వాటిని వేగఁ।
మానుగ గుడికిని సంప్రోక్షణమును మహితగ జేయుండనగఁ॥
గ్రామస్థుల కీస్వప్నము జెప్పియు కాపును బిలిచియు నడుగఁ।
నేమముతోడను నరమణు ధాన్యము నెనరున నతడియ్యంగఁ॥
పప్పు బెల్లమును కూరగాయలును ప్రజలందరు నియ్యగను।
ఒప్పుగ గుడికిని సంప్రోక్షణమును నూర్జితముగ చేయగను॥ ౨౯౯.
సంతసమొందుచు తుకారాముడును సర్వేశ్వరు నటుబాడఁగ।
పంతముతో హరి నామము నుడువుచు భాగవతుల దాగూడఁగ॥



కీర్తన సలుపుట కిచ్ఛించుటచే క్రియతో సద్గ్రంథముల।
పూర్తిగ జూచియు పాఠము జేసెను పొసగుచుండు పద్యముల॥
భాగవతంబును రామాయణమును భగవద్గీతయు మరియు।
వేగమె చదువుచు వాశిష్ఠంబును విజ్ఞ్యానేశ్వరిగనియు॥ ౩౦౧.
ఏకనాథకృత భాగవతంబును నితరులు భక్తుల కృతుల।
జోకను చదువుచు మననము కొఱకై నూటినరుగు గిరి యొడల॥
ఇటులుండంగను నొకయెడ నాతడు నింటికి తినరాకుండఁగ।
తటుకున భార్యయు రొట్టెను నీరును తాగొనిపోవుచు నుండఁగ॥
ఎండతీవ్రమై మధ్యాన్నంబున యెలమిభూమి కాలగను।
కొండనెక్కఁగను బహుకష్టముతో గుచ్చెముల్లు దారినను॥ ౩౦౪.

బాధచేమూర్ఛను బొందగ నప్పుడు పాత్రనీరు బడిపోయెగా।
వేధనొంది తా తిరిగిలేచుచును వెడలురక్తమును గనియెగా॥ 306.
ముల్లుతీయ తనవల్లగాకదా ముందుబోవు టెట్లనుచు।
తెల్లగజెప్పెను తుకారాముడును *తేగడువైరి తనకనుచు॥ 308.
సంసారంబును తెరువుజేసిమరి చక్కవేసి నా తలపై।
కంసారాతిని గొలుచుచు నెప్పుడు కఠినుడయ్యె నిలపై॥ 309.
విశ్వంభరుడా విఠలుని దెచ్చెను వివేకహీనుండగుచు।
అశ్వంబులు మరియమిత సంపదయు నన్ని బోయె మాకనుచు॥
విష్ణూవిఠ్ఠలయని నాభర్తయు విభ్రాంతిని దాబడియెగా।
కృష్ణాయను నానల్లనయ్యచే కృతదరిద్రత నెళవయ్యెగా॥ 310.
పిల్లల కొడుకుల పెద్దకుటుంబము ప్రియముగాక తావిడిచి।
సల్లలితంబుగ కొండపైని దా చక్కజేరి యటనిలిచి॥ 311.
తొందర నాకును కలుగం జేసెను తోచదేమి యెటుజేతు।
పంతముతో నా పూర్వపు కర్మము ఫలించె నిట్లనిదలతు॥ 312.
ధనమును బహుగా ఖర్చుబెట్టి నా తండ్రిచేసె లగ్నమును।
అనువుగ నాకీ పిశాచమబ్బెను నన్నము దొరకదు యిలను॥ 313.
విరోధి శ్రేష్ఠుడు విఠ్ఠలుడును నిది వినివచ్చిన నవ్వనుము।
నిరాకరించెద చచ్చేవరకును నెటిశరణము బొందనుము॥ 314.
అనుచు జెప్పుచును కంటకబాధచె నతిరోదన జేయగను।
చనువున విఠలుడు నిజరూపంబున చక్కవచ్చె నయ్యెడను॥ 315.
ఆవులి గని యిటు వచ్చిన దెందుకు హాస్యము చేయుటకొరకో।
నీవు నామగని పిచ్చివానిగా నేర్పన జేయుటనొక్కో॥ 316.
అనగను బల్కెను శ్రీహరి యామెకు నటచెట్టుకు ఫలముండు।
ఘనమగు గాలికి క్రిందబడంగను గనెదరు నరులిల నుండు॥ 318.
అటులనె తుకయును వశ్యంబగుచును నమరెను నియ్యెడగాన।
అటవిని నాతడు కూర్చుండుటచే యతనివెంట నీవుగన॥ 319.

---

*నిందించు.

తిరుగుదువనుచును నేను ధాన్యమును తినుటకు నిచ్చితి మరియు।
వెరపునదానిం గొనకను తుకయును విడిచి పెట్టెదా గనియు॥
నీతిదప్పకను నేనుండంగను నిమిత్తమిచెదవు నాపై।
ప్రీతీనియిట్లని నావులిపాదము ప్రేమనిడియు తనతొడపై॥ ౩౨౦.
బాధ కలుగకను ముల్లును దీయగ బహుసంతోషము తోను।
వేధ దొలగగను కొండపైనయా వెంగలి యాకలి గొనును॥ ౩౨౧.
అనుచు జెప్పుచును నావులి వెళ్ళెను నచ్చటికొండకు నపుడు।
పనిబడిశ్రీహరి వెళ్ళగ వెంటనె భక్తుడు గనుచును నాడు॥ ౩౨౨.
దినకరుడును మరి చీకటిరాత్రియు తిరతగూడె నొక చోటన్।
అనువుగ నావులి హరిపైవైరము నరసి వదలె నిచ్చోటన్॥ ౩౨౩.
సమీపమునకును వెళ్ళగ నిరువురు సరగున తుకయును లేచెన్।
రమానాథునకు దండంబిడుచును రమ్మని బస చేయించెన్॥ ౩౨౪.
ముగ్గురు నచ్చట కూర్చుండంగను ముచ్చటాడె తుక సతితో।
ఎగ్గులేక నన్నము హరికిమ్మన యేకభత్యమనె పతితో॥ ౩౨౫.
కష్టము నొందుచు మనసున నావులి కత్తెకొంటె వచ్చెనెటు।
స్పష్టముగా నాసిగ్గు దీయునని సమూల మాతనికె నిడు॥ ౩౨౬.
వంచింపక నిడనని హరి గంపను వస్త్రాచ్ఛాదన చేయు।
అంచితముగ హరి తుకారామునకు నన్నంబిడుమన సతియు॥
లజ్జితురాలై గంపమూత నటు లాలితముగ తీయగను।
బుజ్జగించు నటు పక్వాన్నంబులు పూర్తినుండ గనుచును॥ ౩౨౭.
అతివిస్మితయై నాకులదైవమొ నలభవాని భైరవుడు।
హితరక్షణమును జేసిరి యెవరో ప్రతివారికి దండమిడు॥ ౩౨౮.
ఇదిగని రంగడు బలికెనన్నమును యేనే యిట జేసితిని।
కుదురుగ సతియనె నమ్మను నేనిది కోరి శబరి ఫలములని॥ ౩౩౦.
తింటివి నీవును సామర్థ్యంబిటు దెప్పగ నీ కుండినను।
ఒంటరి వగుచును వనవాసంబున *కొలయువచ్చు టెంచుకను॥

*ఒలయ-ఒప్పుగ.

పరిపరివిధముల నిటులం జెప్పుచు భక్ష్యనుభోజ్యంబులను।
సరసాన్నము నటు వడ్డించెను మరి చక్కగ నిరుపుర కటను॥
త్రాగుటకొఱకై తీర్థములేకను తత్తరబడె నావులియు।
వేగముతో గిరినెక్కుచుండగను వెలిగ నీరు గోపుటయు॥ 333.
కొండపైని నీరము లేకుండగ గోవిందుడు గనుచుండు।
నిండుప్రేమతో నావులినింగని నెలతరొ జలమటనుండు॥ 334.
కొంచెము దూరము పోయిచూడుమన గురుతుగ నామెయు బోవఁ।
అంచితముగ నొక యూటను గనెనటు యమిత ముదంబున త్రోవఁ॥
అఘటిత చర్యల చేసె హరియనియు నాశ్చర్యము బొందుచును।
విఘటికలో నిటుచర్యల జూపుచు వెంగలిజేసెను తుకను॥ 335.
అనుచు జెప్పుచును చొంబెడునీళ్ళను యావులిదెచ్చియు నటను।
ఘనులగు నిద్దర కిచ్చెనప్పుడటు కనికరంబు నొందుచును॥ 336.
ఆవులి నప్పుడు కూడనుంచికొని యందరుతగ భక్షించఁ।
భావశుద్ధితో గొనుము కబళమని పండరిపతి మన్నించఁ॥ 337.
తుకారాము నోటనువేసెను తగ దురుసుగ హరితనచేతిఁ।
ప్రకాశమగునటు యోగము నీకను పట్టుబడును సుప్రీతిఁ॥ 338.
అనుచు చెప్పగను పుష్పవృష్టియును నటుగురిసెను దివినుండి।
ఘనమగు సుఖమును బొందెను తుకయును కమలేశుని దయనుండి॥
చేతుల గడిగియు తుకారాముతో శ్రీహరియనె నయ్యెడను।
ఈతరి సకలము బ్రహ్మమయంబై యెపుడు భాసిలుచుండునను॥
జనులందరిలో జనార్దనుండును చైతన్యంబై యుండు।
అనువుగ స్వర్ణము భూషణములుగా నమరినట్లు తగనుండు॥ 342.
ననువినా జగము వేరులేదనే న్యాయంబున నీవుండు।
అనుభవమొప్పగ నట్టెచూడుమని యాజ్ఞాపించుచు నుండు॥ 343.
ఇకపైనిచ్చట పర్వతమునకును యెలమిని నేతేరకుము।
వికల్పముగ సతి యిచటికి వచ్చుట విపులంబగు సంకటము॥ 344.

ఇదివిని తుకయుండీశుని చరణము లిరవొందగ బట్టుచును।
మతిహీనుడనే మూర్ఖుడ ఖలుడను మందబుద్ధుడ ననుచును॥ ౩౪౫.
పతితపావన యను నీబిరుదిటు పాలింపంబడె తగను।
హితమున దీనుని రక్షింపుచు మరి యిలపై కొంటివినన్ను॥ ౩౪౬.
పండరినాథుడు జ్ఞానముద్రచే బట్టిజూపె లక్ష్యమును।
నిండినప్రేమను వెలిని గానకను నిలిచె తుకారామటను॥ ౩౪౭.
భగవదనుభవపరుడై యుండుచు బహు విశ్రాంతిని గనుచు।
సుగమంబుగ తన దేహభావమును సూటిగ మెల్లన గొనుచు॥ ౩౪౮.
విట్టలరంగని ముందర గాంచుచు వేడ్కను దండంబిడియెఁ।
పట్టుగ నచ్చట పాండురంగనికి భక్తిని కీర్తన జేయఁ॥ ౩౪౯.
నీ కడనుండెద ననుచు జెప్పుచును నీరజనాభుం డేగఁ।
వీకను దంపతుల్ వచ్చిరింటికిని విపులమోద మొందంగఁ॥ ౩౫౦.

---

సాదుసేవలో తత్పరుడై తుక సలుపుచుండె సేవలను।
పాడుగ శ్రీహరికీర్తన సలిపెటి భక్తులయెడ నుండుచును॥ ౩౫౧.
జంటనుతాళము వేయుచు జాడను చక్కగ దివిటీల బట్టు।
బంటుడగుచు కథవినువార్లకు దా పాదరక్ష గాపాడు॥ ౩౫౨.
ఇతరజనంబుల కుపకారంబుల నెప్పుడుజేయుచు నుండుఁ।
సతతము సర్వము శ్రీహరి మయమని చక్కగజూచుచు నుండుఁ॥
ఒకదినమందును యింటను భార్యయు నొగిస్నానము జేయగను।
ప్రకటంబుగ నటు చీరెయొక్కటియె పరగనుండె నామెకును॥
అడ్డగోడపై దానినుంచుచును నామెయుండె స్నానమున।
దొడ్డరంగని నామము జెప్పుచు తుకయునుండె దావెలిన॥ ౩౫౫.
ఆసమయము నొక పేదబ్రాహ్మణి యతని నడిగె వస్త్రమును।
వేసరిల్లకను ముదిమిని జూడుము వేరుబట్ట లేదిటను॥ ౩౫౬.

అదిగని తుకయటు సౌఁజ్ఞను నావులియలచీరెను గొనుమనెను।
ముదమున బ్రాహ్మణి కోకదీసికొని ముఖ్య దీవెనలిడుచును॥ ౩౫౭.
వెళ్ళగ తుకయును వేంచేసెను యటు విఠ్ఠలనామము జెపుచు।
మెల్లగనావులి స్నానమొనర్చియు మీదగ చీరెనుజూచు॥ ౩౫౮.
ఉంచినస్థలమున లేకుండంగని యుచితము గననని తాను।
పెంచిన దాసియు పోయెనుపెండకై పిల్లలేగి రాటకును॥ ౩౫౯.
కొడుకులిరువురును నదికినరిగిరటు కోరియుస్నానముకొఱకు।
తడవులేక నాచీరెను తుకయే దానమొసగె నితరులకు॥ ౩౬౦.
బాపననామెయును దానమడిగినది పదపడి వింటిని నేను।
ఏపున తుకయును యిచ్చియు వస్త్రము నెటుబోయెనో గనలేను॥
కత్తెవాని తిరునామము జెప్పెను కంఠధ్వని వింటిని నే॥
వెత్తియాత నెటుచనియె నోకో యిటు విడనాడితి చీరెను నే॥౪౬౧.
పూర్వజన్మపు విరుద్ధమున తుక పుట్టెను నాపతిగాను।
సార్వకాలముల దుఃఖము నిచ్చెను సరసుడు గాడిద్యోడను॥
ఒక్కవస్త్రమే యుండెనునాకును నొప్పుగనదియును పోయెఁ।
నిక్కముతోనే బైలువెడలుటకు నికృష్ట మగునట్లయ్యెఁ॥ ౩౬౪.
ఆసమయంబున శరీరబంధువు లావులి గృహ మరుగుచును।
వేసరిల్లగను విచారించిరటు వివాహమునకు చనుటకును॥ ౩౬౫.
ఆవులి నగ్నయై లోగూర్చుండగ నతిలజ్జను తాబొంది।
భావసూన్యులగు బందులు వచ్చిరి బలుయుపాయమే ముంది॥ ౩౬౬.
ఏమిచేయుదును యెటునేబోవుదు యేమిదోచ దనగాను।
కామునిజనకుడు గనుచు నావులిని ఘనమగుతాపంబునను॥ ౩౬౭.
గప్పెనువస్త్రము నావులిపైనది కనకాంబరముగ నుండఁ।
తప్పకనామెయుహరిచర్యనెయని దలచుచు మదిలోనిగుడఁ॥ ౩౬౮.
పిచ్చివానిగా జేసియు భర్తను పెనుమహిమల జూపించఁ।
నొచ్చుగనిట్టుల నెంచుచు వస్త్రము నేపున పరిధానించఁ॥

ఇంటియంగణము బోవగబందుగు లెక్కడిచీరె యిదియనుచు।
వెంటనె వారలు విస్మిత చిత్తులై వెలిగ జెప్పిరిట్లనుచు॥ 320.
ఎవరి గృహమునో ముంచియు తుకయును నీవస్త్రంబును దెచ్చెగా।
భువిలో నెక్కడ దొరకని వస్త్రము పూసగ నితని కేటువచ్చెగా॥
పరిపరివిధముల వారలు బల్కుచు బంధులడిగి రావులిని।
అరయబంధువుల వివాహ మునకును నరిగెదవాయన సామెవిని॥
నాకుందెలియదు సంసారంబును *నరగవిడిచి నాపతియు।
వైకుంఠుని పై వాఛనుంచికొని వలసి విదేహుండయ్యె॥ 323.
ఎచ్చటుండినే దెత్తునుకట్నం బీదుర్బల సంసారమున।
హెచ్చిన యాశలు బంధువర్గమున కిలనుండుట విశదమన॥ 324.
అనుకూలంబై యుండిన యెడలను నవతల వచ్చెదననుచు।
నెనరున జెప్పగ పోకల నుంచుచు నిఖిలురు వెళ్ళిరిగనుచు॥ 325.
ఆ పగలంతయు తుకారాముడు నడవిలోన నుండుచును।
మాపటివేళను గుడికిని వచ్చియు మాధవు కథజేయగను॥ 326.
సతియు వినుంగొని రొట్టెముక్కలను సరగబంపె నయ్యెడను।
హితుడగు శ్రీహరి వస్త్రమిచ్చెనని యేమియు జెపకుండెమును॥

---

శ్రీహరిచింతన జేయుచు తుకయును జెప్పుననరహరికొఱకు।
ఊహను నేనిటు దురితపురాసుల యొప్పులకుప్ప యననుదగు॥
సేవహీనుడను మానఖండనను చేయుము శ్రీహరియనుచు।
భావహీనతను దొంగచేష్టలను బలముగ జేయుదుననుచు॥ 329.
గతితప్పిన ననుకరుణ జూడుమని కంజాక్షుని గోరుచును।
అతిక్రూరంబగు హాంకృతిమాన్పియు నాత్మసాధనముంచు మను॥
అందుకు తానటు వలసట లేకను హరికీర్తన జేయుచును।
పొందుగ రేయిని నిద్రను బోవక పుస్తకముల చదువుచును॥ 331.

---

*నరగ-అనర్థ భేదము.

సకలేంద్రియముల స్వాధీనంబుగ చక్కగదా జేసికొను।
వికసిత ముఖుడై వినదగువార్తల వినుచుండును తా తగను॥
చూడదగని దినుసుల జూడడు కను సూటి జిహ్వాయత్నైయగు।
గూడుచు పరహిత వాంఛను యెప్పుడు కోరివెలసెనట బాగు॥
పరోపకారము జన్మాంతరమున బహుజేసిన మనుజుడును।
అరోగయుక్తుడై యుండుచు జగతిని హరిభజించు గురుతుగను॥
ఇదిగని తుకయును పరోపకారము నేర్పడిజేయుచునాడు।
కుదురుగ నితరుల మోతల మోయును కూలియునడుగకయుండు॥
వానను దడిసిన వారలనింటికి వాఛతోడ గొనిచనును।
దీనత యాత్రను కాళ్లువాచినను దిగ్గన యుపచరించును॥ ౩౭౬.
చీమల పుట్టల కన్నంబిడుచును చేరి మృగముల పెయిరాచుగా।
నేమముతోడను నెవ్వరు బిలిచిన నిలువ కరుగు హరియనుచుగా॥
ఒకయెడవణిజులుసంతకేగుచును యొగి తుకయుని బిలుచుకొన।
నికటంబున నొకముసాలి బ్రాహ్మణి నెఱిబడు యిడుములగాన॥
ఎవగొని తుకయును యామెను వీపుపై నెక్కించుకొ నేగెదన।
ముదిమిని నడవంజాలను నూనెనుముం తెదు కొని దెమ్ముయన॥
అవశ్యమనుచును ముంతయు డబ్బును నాతడుతగ గైకొనుచు।
వివరంబుగ నాసంతకు వెళ్ళియు విలవనూనె గొని తెచ్చు॥ ౩౮౦.
బాపనామెదా నింటను నుండగ పడపడి యామెకునిచ్చెగా।
పేపుననామెయు బహుమోదంబున నెలమిని దీవెనలిచ్చెగా॥ ౩౮౧.
కొన్నిదినంబులు గడవగ బ్రాహ్మణి కోరిజూచి నితరులను।
పన్నుగ తుకయును దెచ్చిన నూనెకు బహువృద్ధిని గంటినను॥
అష్టదినముల సరినూనె యనేకయహముులతగ గడిపెనను।
స్పష్టవార్తలను ప్రజలందరువిని చని తుకయెడ నెయ్యమున॥ ౩౮౩.
నూనెను మాకును దెచ్చియిమ్మనుచు నూనెపాత్ర లియ్యగను।
మానుగ తుకయును మంచిది యనుచును మరివెళ్ళెను సంతకును॥

ఇతర వర్తకులు చనగను వారితో నేర్పడి వెళ్ళెను తుకయు।
సతతము వార్లకు సహాయ పడుచును చమురు దుకాణము గనియు॥
బడవేసెను యటననేక పాత్రల పైసల కోమటికిడును।
తడవులేక నీకిష్టమైనయటు తైలముంచుపాత్రలను॥ ౩౯౬.
ఇంతలోవణిజులు బిలువగ రమ్మని యేపునతుక యటుపోయెను।
పొంతను వారల పనుల సలుపుచును ప్రొద్దుగ్రుంక డాగనియెను॥
పరోపకారము జేయుచు నోటను పాండురంగ హరియనుచు।
నిరాశయుక్తుడు మంచివాడనియు నిఖిలుగు జెప్పంగనుచు॥ ౩౯౭.
ఆదినరాత్రిని యచటనె గడిపియు నరుణోదయ మగునపుడు।
పాదుగ వణిజులు బోవగ మూటల పరగ గట్టి వారికిడు॥ ౩౯౯.
చమురువర్తకుడు యిష్టము కొలదిని చమురుబోసె పాత్రలను।
కొమరొప్పగ నాతుకారాముడును గురిగదెచ్చెనన్నియును॥
అనేకజనములు నూనెపాత్రలను నాతని కిడినందునను।
వినీతులగుచును వచ్చిరి వారలు వేగనూనెగైకొనను॥ ౪౦౧.
ఈశ్వరమాయచే నెవరికి నెంతయొ యేర్పడె నంతేపాత్రలను।
శాశ్వతప్రీతిని చక్కబెట్టెహరి చమురువెలకు సరిగాను॥ ౪౦౨.
వచ్చిన ప్రజలను గాంచుచు నాపులి వదరెను వారలతోడ।
పిచ్చివాడగుచు నాపతి మోసెను పెద్దద్దు బరువుప్రజూడ॥ ౪౦౩.
దారినినాతడు వచ్చినయెడలను తనివిని జూతురె మీరు।
తీరుగనిట్టుల జేయుట న్యాయమె దీనతగని యీతీరు॥ ౪౦౪.
కూలిలేకయిటు మీపనులెల్లను కోరిజేయు నాపతియు।
వాలుగ మీరును కనికరమింతయు వహించియుండరె గనియు॥
వారిలోనొకడు వివేకయుతుడై వాసిగననె నాపులికి।
మీరినభక్తిని పరోపకారము మెలగెను మాకందరికి॥ ౪౦౫.
అతడుదెచ్చుటి నూనెకు వృద్ధియు నమరియుండునని తెలిసి।
పాదుగ నిదియును చమత్కారమని పాత్రలనిడు దురువలసి॥ ౪౦౬.

ఇందుకు మాపై నిమిత్తముంచుట నెలమియు గాదని యనఁగన్।
పొందుగ నావులి యూరకుండుచును పోయెను యింటికిలోఁగన్॥

---

ఒకదినమందును పెద్దలతిథియును నొప్పగ నటురాగాను।
అకలంకుండగు పతినిగాంచుచు నావులియును జెప్పెమును॥ ౪౦౯.
ఈదినమందును పెద్దలతిథియగు నేమియులేదనె యింటన్।
పాదుగసాధన జేయుచు ధాన్యము బాగుగ తెమ్మనె జాడన్॥౪౧౦.
అదివిని తుకయనె అటవిని వెళ్లుచు నడవికూర దెచ్చెదను।
పదపడినీవును పితృదేవతలకు పరగ బెట్టుశ్రాద్ధమును॥ ౪౧౧.
ఇటులంజెప్పుచు విఠలునినామము నీప్సితముగ జెప్పుచును।
అటవిని వెళ్లుచు హరిని దలంచుచు నానందము బొందగను॥ ౪౧౨.
గోధుమపంటను కొందరుకోయగ కూలినరులు తుకనుగని।
పాదుగ నవ్వుచు వచ్చికోయుమని భక్తునియన నతడువిని॥ ౪౧౩.
మంచిదియనుచును కోయదొడంగెను మాధవ కృష్ణాయనుచు।
అంచితముగనె హరినామంబుల నరమర లేకనుజెపుచు॥ ౪౧౪.
కూలిమనుష్యుల కోతకునధికమై కోసె తుకయు నటుగాను।
మేలుగ శ్రీహరి నామరూపమున మెలగుచు తుకయయ్యెడను॥౪౧౫.
ఆవులిజెప్పిన సంగతి మరచియు హరివిఠ్ఠలయని యుండన్।
భావీకులతో యింటను యావులి పదపడిజెప్పెనుజాడన్॥ ౪౧౬.
దొంగ యగుచు నటు వెళ్ళెనడవికిని తుకారాముడీవేళన్।
అంగాచ్ఛాదన మన్నము దినుటకు నతడు బెట్టడియ్యెడలన్॥౪౧౭.
పరులకొఱకు బహుబలవంతుండై పనులజేయు నటుగాను।
కరమరుదుగనే ఋణానుబంధము కలుగ దతనికి నాయెడను॥౪౧౮.
పెద్దలశ్రాద్ధము యీదినమున, నే పేద జేయుటేమియును।
సద్దుజేయుచును చింతనుసుండెను సాధ్వియావులీ యటను॥

పండరినాథుడు తుకవలె వచ్చెను బహుసామగ్రి మూటలను।
నిండుభారమును తలపైనిడికొని నెటియింటను దించుచును॥ ౮౨౦.
కాంతతోడననె వంటను శీఘ్రము కానిమ్మని తామఱియు।
శాంతచిత్తుడై వంటపాత్రలను సరగ నితరులెడ గొనియు॥ ౮౨౧.
దెచ్చియియ్యగను యావులి మూటల తెకలివిప్పి జూడగను।
మచ్చికతోడను పదార్థమెల్లను మహితము గని యామెయును॥
వంటను జేయుట కారంభించగ వాసుదేవుడయ్యెడను।
యింటను పెద్దల శ్రాద్ధంబనుచును యెల్లబంధుల బిలువగను।
వినుకొని వారలు వెట్టివానికీ వేళపుట్టె గుణమనుచు।
మనసున వారలు సత్యమగునె యిది మానక జూచెదమనుచు।
ఉండగ నయ్యెడ పాకము పూర్తిగ నొప్పగ కాగనె హరియు।
ఎండను యిండ్లలో తిరుగుచు బిలిచెను యెలమి బందుగుల గనియు॥
స్నానము జేయుచు వారలు రాగను సలిపెను మర్యాదలను।
దీనులబంధువు దననాగ్రకర్తల ధీకర్మల పూర్తిగను॥ ౮౨౬.
ఇంపుగ జేయుచు యిష్టబంధువుల నిలను లేపు భక్షణకు।
సొంపుపదార్థముల్ వడ్డించెను బహు సూటిగ దానెల్లరకు॥
మాధుర్యంబై యుండెననుచునటు మహివారలు భక్షింపన్।
చాతుర్యముతో తాంబూలంబుల చక్కనిచ్చి మన్నింపన్॥ ౮౨౮.
ఇదిగని వారలు నావులితోడను నిదిమొదలుగ నీమొగడు।
సదయుడైయింటను సంసారంబును చక్కజేయుచును వెగడు॥
అనుచును జెప్పగ నమ్మికలేదని యావులితగ ననుచుండన్।
చెనగొని వారలు యిండ్లకు వెళ్ళిరి ప్రియమగు మోదముతోడన్॥
అన్నము కొఱకై వచ్చినజనులకు నందరకన్న మిడుచును।
పన్నుగ నావులి భక్షణజేయగ నన్నముమరి మిగులగను॥
అకులనుంచుచు పాత్రలనెల్లను నప్పుడెనటు తోముచును।
జోకను వాటినిగొని చనియిచ్చెను సొత్తిచ్చినవార్లకును॥ ౮౩౨.

పనియంతయు నటుచక్కఁబెట్టి మఱి పదగ వెళ్ళెశ్రీహరియు।
అనువుగ తుకయును కోతకోయగను నచటికావు తగగనియు॥
సాయంకాలపు సమయమునందును చక్కని చెఱకు కంకులను।
నేయంబగ దాతలపై నిడికొని నిలవరమున కరుగగను॥ ౪౩౪.
లేనెటిగెలును శరీరమునకును తీరముగనటు తగులంగన్।
మానుగవాటిని మకలం గొట్టక మఱిగిరి పితరులీలాగన్॥ ౪౩౫.
పరోపకారము శరీరమనియును ప్రసిద్ధ్వేణ మనుచును।
వెరపక నింటికి చేరవచ్చుచును వేడ్కార్యను చూచుచును॥ ౪౩౬.
ఇంతలలోన హరిగు స్త్రహూపుడై మగలనన్నిటి గొట్టెన్।
పాకేనుగో త్రాక సుఖశరీరుడై బాగుగ విలసిలు చుండెన్॥ ౪౩౭.
ఆవులినింగని గోధుమధాన్యము నొసెను నాకీవేళన్।
గాపశుద్ధిగో ప్రతుల పనునిడు పాక మొసగి వాతెల్లన్॥ ౪౩౮.
ఇదిగని యావులి వెఱ్ఱివాడవని రోషమున జెప్పచునీవు।
విదితముగునటుల పెరుల కిడితివి నిహితభోజనము నెళవు॥ ౪౩౯.
జరిగిన పనులను వినుకొని తుకయును సమధిక కష్టమునొందె।
హరిహరియనుచును పిలుచునానెడ నాకగింప చెలువొందె॥
హరినారాయణ విఠ్ఠలరంగ యచ్యుతకృష్ణా యనుచు।
తీరముగ నాతడు గద్గదకంఠుడై దీనుడగుచు తాబిలుచు॥ ౪౪౦.
పండరినాథుడు వినుకొనివచ్చెను భక్తపరాధీనుండై।
నిండుప్రేమతో తుకారాముడును నేలంబడె నమ్రుండై॥ ౪౪౧.
భక్షణచేయను విస్తరవేసెను పదపడి యావులి యటను।
అక్షయ కృపతో హరియు భక్తుడును ననువుగ గొని భక్షణను॥
భావశుద్ధియగు నుపచారంబుల పరితృప్తినిగనె హరియు।
ఆవులిగాంచుచు నతివిస్మితయై యమరియుండె దామరియు॥ ౪౪౨.
పండరినాథుని కరుణను గాంచుచు బహుగా తుక ప్రార్థించు।
మోదముగ శ్రీహరి ప్రేమను నాపుడు మెలగి యుండు తగగనుచు॥


దొంగలు
భయంకరపురుషుడు
పాండురంగుడు

పరోపకారమున పూర్ణశ_క్తిని పరగ నతడు ప్రయపరచె౯।
పరాకులేకను పండరిపురికిని ప్రతియుత్సవమును వచ్చె౯॥ ౪౪౬.
ఇదియే యతనికి కాయికతపసగు నిలనామము నుపుపుటయు।
విదితంబుగ నదివాచిక తపసగు వెంకటేశు భావనయు॥ ౪౪౭.
మానస తపమై మరిగె నతనికిని మాధవుడందుకు వెలిగా।
బూనియిచ్చెనటు కవిత్వస్ఫూ_ర్తిని బుద్ధిబలంబును బాగా॥ ౪౪౮.
కలలో శ్రీహరి యతనికివచ్చుచు గౌరాబముతో ననియె౯।
ఇల నాముడు శతకోటి గ్రంధమును యేర్పరచుచు దావెలయ౯॥
సమాప్తి యగుమును చనియెను నాతడు సర్వేశ్వరు పదమునకు।
క్రమాలంకృత గ్రంధము నీచే కానిమ్మిటు నాకొఱకు॥ ౪౫౦.
అయిదుకోట్ల యేబది యొకలక్షల యవనిపద్యముల నీవె।
నయముగ జేసిన, నాతని గ్రంధము నరయపూ_ర్తియగు నువ్వె॥
వరకవిత్వమును నీవు జెప్పుమిటు వసుధనరులు యీడేర౯।
వెరవ వలదనుచు జెప్పియు నప్పుడు విఠలుడు చనెగుడిజేర౯॥
అతిసంతోషము తుకయును బొందెను నాస్వప్నము తాగనుచు।
గతిగ సరస్వతి జిహ్వాగ్రంబున కలిగెను నతనికి మనుచు॥ ౪౫౩.
బాలబందులిఖి నక్షరవ్రాతయు బాగుదెలియ కుండినను।
లీలగ నాతడు కలమునందుకొని లిఖిత పరచె గ్రంధమును॥ ౪౫౪.
హరి విజయంబను పేరున జేసియు నరయ జెప్పె కవితలను।
నరులు గనుంగొని యాశ్చర్యంబును నాటించిరియయ్యెడను॥
ప్రతిదినమందును కీ_ర్తనజేయగ ప్రజవచ్చును బహుగాను।
అతిమాధుర్యము గలిగియుండగా నద్భుత మొందిరి మున్ను॥
చించవడీయను గ్రామములో ద్విజ శ్రేష్ఠు మంబజి మెలగ౯।
అంచితముగ తనయూరు వదలుచును నలదేహు పురమురాగ౯॥
కొందరు శిష్యులు యోగక్షేమముల కోరి జరుపుదురు తగను।
సందియమొందక తుకారాముడటు సరిఖ్యాతిని పొందగను॥ ౪౫౮.

అసూయగలిగెను మంబాజీకిని నరయ తుకయు శూద్రుడగు।
*విసువు లేకయ దెలియని వాడగు వివిధజనము లతనెడకు॥
చనుచుందురు మరి యడుగరు నన్నుక్ చదవరి నేనుండగను।
అనుచు జెప్పుచును నతిద్వేషంబును నతని పైని యుంచుచును॥
ఎప్పుడైన తానపమానంబును నెసగ జేయవలయుననును।
ప్పుడు లేకను కథవినవచ్చును సమరసమున్నటుగాను॥ ४౬౧.
తుకారామునకు శత్రుమిత్రులును తుల్యులగుదు రెవ్వడును।
ఒకానొకప్పుడు తుకయుని పశువు లొప్పుగచనె మేతకును॥ ४౬౨.
దారితప్పియవి మంబజితోటను తలప జేగివృక్షముల।
†కారికపరచగ నిందితపలుకుల కఠినమనెను నయ్యెడల॥ ४౬3.
కొన్ని దినంబులు గడవగ పిదపను ‡కురుగవచ్చె హరిదినము।
వన్నుగవచ్చిరి గుడికియనేకులు భగవత్కథ విననుసుము॥ ४౬४.
గుడిక్రప్రదక్షిణ బోవుదారికిని గుంపుగముండ్లనునిడిరి।
కడగుచు తుకయును నచ్చటకేగియు కంటకముల గనిమీరి॥ ४౬౫.
దారిని ముండ్లను తీయగ మంబజి తాగొట్టెను దెబ్బలను।
మీరిముండ్లతో వెలసినకొయ్యను మేనున నవిగుచ్చగను॥ ४౬౬.
అనేకదెబ్బలుతుకయుని గొట్టగ నలసె నతని చేతులును।
వినీతుడై తుక యేమియుబల్కక విఠలుసన్నిధి వచ్చుచును॥ ४౬౭.
నాయెడ నీవును మంచికార్యమును నయముగ జేయించితివి।
వేయువిధంబుల దుస్సహవాసము వేలేకనుజేయుభువి॥ ४౬౮.
ముండ్లుగుచ్చబడి మేనునరక్తము ముద్దలగుట గనిజనులు।
కండ్లను జూచుచుబహుసంతాపము గాంచిరి యచ్చట నరులు॥
ఆసమయంబున నావులివచ్చుచు నటుయిటుదా జెప్పుచును।
వేసరిల్లకను ముండ్లనుతీసెను విఠలుకృపయు నమరగను॥ ४౭౦.
ఆరోగ్యముతో హరికథ జెప్పుట కారంభించెను తుకయు।
ధీరాయుతుడై విఠలునినామము తెరువునయనిదా మరియు॥ ४౭౧.

*మనసుచేత శ్రాంతుడగుట. †తీవ్రవేదన. ‡తోడ.

కథకును మంబజి రాకయుండగను కడగి పిలువ బంపగను।
వ్యధకలిగెనుయని యాడతు జెప్పగ వచ్చెతుకయు నతనెడను॥
దండముబెట్టుచు శరీరమంతయు తానేయటు పుణుకుచును।
ఖండితముగ నాపశువులు తోటలో కలిగించెను నష్టమును॥ ౪౭౩.
అపచారంబును నాయెడ గలిగెను నరసి క్షమించుండనుచు।
నెపములేక నిటు కథకును రమ్మని నెనరున బిలిచెను గనుచు॥
శీఘ్రున మంబజి కథకును వచ్చెను చింతను నటుగూర్చుండు।
వ్యగ్రక నచ్చట తుకారాముడును మాధవు కథజెపుచుండు॥౪౭౪.
అచ్యుతానంతా ఆనందకంద ఆదిపురుష గోవిందా।
ప్రచ్యుత కర్మల నిర్మూలముగా బారదోలుము ముకుంద॥ ౪౭౬.
కాలచక్రమున భ్రమింపబడితిని కర్మగతిని నేనిలను।
వాలుగ నీవును విడిపింతువు నను వాసుదేవ హరియనును॥ ౪౭౭.
హరిగుణ వాదము జెప్పగ మధురం బధికంబై యుండంగా।
మరవున నావుల నిద్రిత యగుచును మహిగృహమున నుండంగా॥
దొంగలిద్దరటు తుకయుని పశువుల తోలు కొనుచు నటుబోవగా।
సంగము బాయగ వాటిదుడ్డెలును సలిపెరోదనముగావగా॥ ౪౭౮.
విఠలుడు కనుగొని వికారపురుషుడై వెనకవచ్చె వారలకు।
కఠినంబగు నొక ముసలము చేతిని కనబడ జేయుచు చుముకు॥
భయమున దొంగలు మరియొక దారిని పరుగులిడుచు బోవగను।
నయముగ హరియును వెంబడె యుండెను నమ్రతనెటుదిరిగినను॥
కలంగివారలు బ్రహ్మరక్షసుడో కాలపురుషుడో యనుచు।
మెలంగుచుండుచు తుకారాముడును మేదిని భక్తుండగుచు॥
ఉండుటచేతను యాతనిపశువుల నుచితముకా దంటుటకు।
మెండుగ నిటుల దలంచుచు దెచ్చిరి మెలగ తుకని గృహమునకు॥
పశువుల గట్టియు బైటబోవగను భయరూపము కను దోచె।
కుశలము గాకను గ్రామము చుట్టున కూర్మిని తిరిగిరి హెచ్చె॥

చింతాతురులై శ్రీహరికీర్తన జేయుచోట తుకనుగని।
సంతోషముతో నీదుపశువులను సరగదొంగిలింపగని॥ ౮౦౫.
వికారపురుషుం డొక్కడు వచ్చియు వెంటదగులుచును మమ్ము।
సుకరంబుగ పశువుల విడిపించెను సూటిగ నీగృహము సుమ॥
బయలువెళ్ళగను విడువడు మమ్మును భయకరుడగు మనుజుడును।
దయతో మాకును దారిజూపుమని తనివిని వారడుగగను॥ ౮౦౬.
తుకయువినుంగొని హరిధ్యానంబును దురుసుగ నటుజేయగను।
ప్రకటంబుగ శ్రీపాండు రంగడీభజన లోనలేడువిను॥ ౮౦౭.
అనుచు జెప్పుచును హరిగోవిందా యటుయెటు బోతివినీవు।
ఘనయేకాదశి జాగరణంబున కాననమెటు దిరిగెదవు॥ ౮౦౮.
పశువుల గాచుట పూర్వము నుండియు పనియైయున్నది నీకు।
విశదము గానినువర్ణన జేయగ వికటాకృతి దొంగలకు॥ ౮౧౦.
చూడంబడుదువు చోద్యమెగదయిది సూటిగనిటు రమ్మికను।
వేడుకతోడను దొంగల తరుముచు వెంటతిరిగితివి యటను॥ ౮౧౧.
నీవులేక హరి కీర్తనమధురము నిలిచియున్నది య్యేడను।
దేవదేవ హరి రమ్మాయనగను దీనబంధుడ య్యేడను॥ ౮౧౨.
వెనకనుండి తావచ్చెను, తుకయును వేగగాంచి దొంగలను।
అనువుగ బొమ్మని యానతిచ్చుచును నాపశువుల గొనుమనును॥
పశువులు వలదని పారిరిదొంగలు భగవంతుడు మరుగయ్యె।
కుశలమహిమ గని హరివిఠ్ఠలయని గొప్పగ గర్జన మయ్యె॥ ౮౧౪.
మంబజి జూచుచు నను తాపముతో మహిమయు దొడ్డది యనుచు।
డంబముజేయక ద్వేషబుద్ధులను డాయకనుండెను మనుచు॥ ౮౧౫.
అభక్తులుండగ భక్తుల మహిమయు నవనిప్రసిద్ధికి నెక్కు।
శుభగుడు తుకయును నరుణోదయమున శుద్ధారతి నిడిమ్రొక్కు॥
ఉదయముకాగనె యింద్రాయణిలో నొగిస్నానము జేయుచును।
సదయుడై సన్నిధివచ్చియు హరికిని సలిపెనతడు పూజలను॥

ఆవులి వినుకొని దొంగల సంగతి యతిముదమున తుకయునకు।
భావశుద్ధితో నన్నము బెట్టెను పాలిచ్చెను త్రాగుటకు॥ ౯౮.
పాలును గైకొని తుకారాముడును పాండురంగనికి నిచ్చెన్।
వీలుగ నిట్టుల దినదినమును తా విఠ్ఠలునకు నర్పించెన్॥ ౯౯.
కొన్నిదినంబులు యిటులం జరగగ కోరియు సతి యొకనాడు।
పన్నుగ విఠలుడు పాషాణంబై బరగు మూర్తిగానుండు॥ ౧౦౦.
పాలుద్రాగుటకు మనుజుడు కాడని పలుమరు దానెంచుచును।
వీలుగ పుత్రిని యడిగెను నొకయెడ విగ్రహమెటు ద్రాగుననును॥
కొమార్తె జెప్పెను హరి విగ్రహమటు గుడిని త్రాగు దుగ్ధమును।
అమితాశ్చర్యము నావులి బొందుచు నది తా గన వలయుననును॥ ౧౦౨.
తుకతో నొకయెడ నావులి జెప్పెను దుగ్ధము హరికిత్తునని।
సెకగొని యుండెడి పాలును గైకొని జేరవచ్చి హరినిగనె॥ ౧౦౩.
ఉడుకు పాత్రనటు పెదవిని యుంచగ నుచిత దుగ్ధమును త్రాగెన్।
తడబడి యూష్ణపు మంటల చేతను దామోదరుడటు మెలగెన్॥
ఆవులి వింతతో నల్లరాతికిని యబ్బెను జీవంబనుచు।
నావుడు తుకయును నిత్యము పాలును నతనికిడుట నిజమనుచు॥
మనసున దలచుచు నింటికిరాగను మాధవు తుక ధ్యానమున।
అనువుగ వచ్చియు నూష్ణదుగ్ధమును నావులి యిడె నాకునన॥ ౧౦౬.
భార్యను గనితుక నూష్ణదుగ్ధమును భగవంతున కియదగున।
వీర్యముతోడను నామెయు బలికెను విఠలుడు గోకులమున॥ ౧౦౭.
నిప్పుల రాసుల మ్రింగిన వాడని నీవును నటువినలేదా।
ఇప్పుడు నాచేద్రాగిన పాలున నిలబొబ్బలు కలిగెగదా॥ ౧౦౮.
గుడిలో నీవును వెళ్ళి చూడుమన గురుతుగ తుక యట కేగి।
అడుగిడి చూడగ పెదవిని బొబ్బలు హరికిని కలుగుట యెరిగి॥
కన్నీరొలుకగ గారాబముతో కంజాక్షుని నుతిసేయన్।
పన్నుగ బొబ్బలు మానెనప్పుడును ప్రజలకు ఖ్యాతిని సేయన్॥ ౧౧౦.

సాక్షిగనుంచెను యిపటికి ప్రచితము చక్రధరుని మూర్తికిని।
వీక్షింపుచు హరి భక్తప్రభావము వెలిజేయును తానుగని॥ ౪౧౧.
ఒకయెడ తుకయును ఆకు తోటకును నొప్పుగదా బోవగను।
ప్రకటంబుగ నటుర్వాలె నతనిపై భ్రమరము లనేకములును॥౪౧౨.
పరోపకారము దేహంబనుకొని బలికి వానిగొట్టకను।
నిరోధ మొందుకు చేయవలయునని నెగడి యూరకుండగను॥ ౪౧౩.
అవియు కొండ్లతో గొట్టుచునుండగ నతితొందరయును కలుగన్।
భవభంగుడు హరి దాకి నడచునరు పగిది రూపమున వెనకన్॥
సిందీవృక్షపు కొమ్మనందుకొని చెదరగొట్టె భ్రమరములన్।
కందాయంబుగ కన్నతల్లిగతి కాపాడెను నయ్యెడలన్॥ ౪౧౪.
మహాదేవుడని విఠోబాయనియు మహిపుత్రులు తుకయునకు।
నిహీనమగునటు వ్యాధిచె ప్రథముడు నిత్యములోబడు శ్రమకు॥
అనేక యౌషధసేవల నావులి యప్పుడప్పు డియ్యగను।
దినముదినము నది వృద్ధిని బొందుచు తీరకుండ నిగుడగను॥
కులదేవతయగు గండేభాలుని కోరుచు ముడుపును గట్టెన్।
పలుమరు నాతని విభూతిదెచ్చియు పరగ కొమరునకు బెట్టెన్॥
భూతబాధయని జెప్పగ నందుకు పూజల బహుగాజేసెన్।
పాడుగదేనిని కుదురుగాకయది బాధిత మగుచును వెలసెన్॥
ఉదాస వృత్తిని తుకారాముడును నుండుచు నేకాంతమున।
నిదానముగ తా శ్రీహరి భజనను నేర్పున జేయునుగాన॥ ౪౨౦.
ఇరుగు పొరుగునను నుండువారలట నెలమి నరిగి తుకగృహము।
సరగున బాలుని జూచుచు జెప్పిరి సరిపడదిక నౌషధము॥ ౪౨౧.
కట్టెపుల్లలగు రీతిని యున్నవి కరము పదము బాలునకు।
వట్టిగ మందుల సెలవు సేయుట వలదిక ముందును మీకు॥౪౨౨.
నీదుభర్త శ్రీపాండురంగని న్నెపుడు భజించుటచేతన్।
పాడుగ నీకును సంసారంబున బహు విపత్తు లిట చెందన్॥ ౪౨౩.

హరిచరణంబుల బట్టిన మొదలుగ నష్ట కష్టమమరె సుము।
ఇరవొందగ తొలిసతియు పుత్రుడును నెలమి జచ్చిరిది నిజము॥
ఈవచనంబుల నావులి వినగను నిబిడె కోపము మనసున।
దేవ ద్రోహము మునుపే యుండెను తీరపడె నది యిటుగాన॥౫౨౫.
పట పట గొరుకుచు పండ్ల నావులియు బాగుగ జెప్పితి వనుచు।
కట కట యిక నేనేమిజేసెదను కలిగివచ్చె నిట్లనుచు॥ ౫౨౬.
చావుకు సిద్ధంబయ్యెను బాలుడు చక్రధరుడు కారణము।
దేవుని గుడిలోగైకొని వెళ్ళియు తిరముగ మనముంచుదము॥
అక్కడ జచ్చిన హత్యయతనిపై యమరి యుండతగు ననుచు।
నిక్కముగా నాబాలునెత్తికొని నెపమున ముచ్చెను గొనుచు॥
గుడికడ కేగియు నల్లవానినే గొట్టెదనని తగ జెపుచు।
చిడచిడ లాడుచు వచ్చుచు నుండగ శ్రీహరి రుక్మిణి గనుచు॥౫౨౯.
అపకీర్తియు తగ నబ్బును మనకును యావులినను గొట్టినను।
నెపములేక నిటు జేయుటేమియన నేర్పున రుక్మిణి యనెను॥౫౩౦.
ఊచెటి కాచెటి మాచెటి చేష్టల నొప్పుగ జేసెద నీవు।
ప్రాచుర్యంబుగ భక్తురాలుపై బహుకటాక్ష మొసగెదవు॥ ౫౩౧.
ఇటులం జెప్పుచు నుండగ నావులి యెలమి వచ్చె సన్నిధికి।
తట తట ధ్వనితో బాలుని యెత్తగ ధ్వనివిన బడెనటుపైకి॥౫౩౨.
జగన్మాతయగు రుక్మిణి బలికెను సరి ధిక్కారము తోను।
ప్రగల్భముగ నిటు మరియొక గుడియును ప్రపంచమున లేదాయను॥
బాలుని వ్యాధియు బాగానీవును పరగ నేగు మింటికనఁ।
వీలుగ నావులి చూడగ బాలుడు విడిచె మూత్రమును గానఁ॥
గుడికిని వెలపల గైకొని రాగనె కుటిలంబును పోవగని।
తడవులేక నన్నము దెమ్మనియటు తనయుడడుగ తల్లిగని॥ ౫౩౫.
ఇంటికి వెళ్ళియు నిష్టభోజనము నెలమినుంచె కొమరునకు।
చంటిబాలుడును హరికృపకలుగగ చక్కనయ్యె గాంచుటకు॥౫౩౬.

గంగాధరు, సంతాజీ, శిష్యులు గలిగుండిరి తుకయునకు।
పొంగారంగను ప్రథముడు వ్రాయును పొంపుగ కవితలతనకు॥౩౭.
వీరలిరువురును కీర్తనయందును వేసెదరటు తాళముల।
వారిజనాభుని కథయు మధురమై వన్నెకెక్కెనయ్యెడల॥ ౩౮.
అచ్యుత కృష్ణా గోవిందాయని యాడును పాడును తుకయు।
విచ్చలవిడి నను నంగీకారము వేగమెచేయుము గనియు॥ ౩౯.
అనాథబంధుడ వనునీనామము నబ్బజేయు నాయెడను।
పునీతు జేయుము పాండురంగ హరి పురాణ పూరుషనన్ను॥ ౪౦.
పలుమారును యిటుప్రేమను బాడగ భక్తుడు విస్మృతినొందు।
సలలితముగ తన దేవత్వంబును సర్వేశ్వరుగనడందు॥ ౪౧.
సమరసమందును నిలువగ శ్రీహరి సంకల్పమున తుకయుందు।
విమలమనంబున వెలపలిచూపున విఠలు నుతించెనుమెందు॥ ౪౨.
అద్వైతంబగు శాస్త్రములందును నమరికనొందదు తుకయు।
సద్వైతంబగు శ్రీహరి సగుణమె చక్కనగును తనకనియు॥ ౪౩.
గురువరునెవ్వని చింతింపకదా గోవిందుని తగదలచు।
హరియిదిగన్గొని స్వప్నంబందును నాతనికడకును వచ్చు॥ ౪౪.
మాఘ శుద్ధదశిమి తిథియందును మహి గురువారమునందు।
మేఘశ్యాముడు బ్రాహ్మణరూపుడై మించివచ్చె తుకముందు॥
ఆసమయంబున కలలో తుకయును నమరజేసె స్నానమును।
వాసిగ తులసిని దెచ్చుచుండగను వచ్చెనుద్విజు డెదురుగను॥౪౫.
తులసీపత్రము నతనికి నిచ్చియు దురుసుగనటు దండమిడగ।
విలసితముఖుడై బ్రాహ్మణు డప్పుడు విహిత కరము తలనునిడగ॥
రామకృష్ణయను మంత్రంబతనికి రంజిల్లగ జెప్పుచును।
ప్రేమను శ్రీగురు పారంపర్యము పెంపునజెప్పెను యటను॥ ౪౬.
చైతన్యంబగు రాఘవగురుడును చైతన్యపు కేశవుడు।
చైతన్యంబగు బాబజి తానను సలుపు ముపాసన గనుడు॥ ౪౭.

వినికొని తుకయును సంతోషించియు వే రమ్మనె యింటికిని।
ఘనుడావిప్రుడు పావ్ సేర్ నేతిని కావలెనన తుకయు విని॥ ౫౫౦.
అటులనె యిచ్చెదననుచు జెప్పుచును నతనిదెచ్చె నింటికిని।
పటుతరముగ తనభార్యను బిలిచెను పప్పు బియ్యమియ్యమని॥
ఆవులిగాంచుచు నతిక్రోధముతో నపశబ్దము బలుకగను।
దేవుడుజూచుచు వెళ్ళిపోయెనటు దిగ్గున తుకమేలుకొనెను॥ ౫౫౨.
శ్రీగురునాథుడు భవతరణంబును చింతించియు జేసెనను।
వేగపడుచు నాభార్యకలహమున వెళ్ళెను గృహముండకను॥౫౫౩.
ఆచార్యుని తుక గనిన మార్గమిది యవని యతని శిష్యులును।
స్వాచార్యుడు తమ స్వప్నమునందె సలుపును నుపదేశమును॥



ఒకయెడ తుకయును సతీపోరునదా నొంటరివెళ్ళెను వనము।
ప్రకటంబుగ సతి స్వప్నము నైనను పలుకదు తనకును హితము॥
తిట్లును పోరునే దినమును చేయును తీరని తొందర గనుచు।
ఇట్లని జెప్పుచు నీశుని భజనను నేర్పడిజేయుచు నుంచు॥ ౫౫౬.
ప్రొద్దుక్రుంగగను గుడికివచ్చియటు పూజజేయు రంగనికి।
సద్దుజేయుచును హరివిఠ్ఠలయని స్మరణచేయుదా మరిగి॥ ౫౫౭.
ఎవరైనను యటురొట్టెల నిచ్చిన నిష్టము తోడను భక్షించు।
వివరంబగునటు యింటికిబోవక వెలపలనే చరియించు॥ ౫౫౮.
ప్రొద్దుబొడవగను స్నానమొనర్చియు పూజించును విఠ్ఠలుని।
సద్దుచేయకను నడవిని బోవుచు సర్వేశ్వరు చిత్తమని॥ ౫౫౯.
నామము నుడువుచు నిట్టులనచ్చట నావుడుండె నిరునెలలు।
నేమముతోడను నొకయెడస్నానము నిగుడిజేసి విలసిల్లు॥ ౫౬౦.
ఆసమయంబున యావులి నీటికి నటుచని తుకయొడి బట్టె।
వేసవి గృహమును రెండునెలలుగా విడిచి యుంటి పీవట్టె॥ ౫౬౧.

ఎవనికి సతినైయుండుదు నేనును యెటుసంసారం బగును।
సవినయముగ నా తుకయును జెప్పెను సర్వేశుని భారమను॥
విటోబా రుక్మిణి పితృమాతృలై వెలసిరి మన కియ్యెడను।
కటాక్షించెదరు నీవునువారల ఘనపదముల దలచుమను॥ ౫౬౩.
వినను యింటికి రమ్మని బిలువగ నతడు జెప్పె భార్యకును।
మానుగ నేనిటు జెప్పువిధంబును మన్నించితి వేనియును॥ ౫౬౪.
వచ్చెదననగను యావులి సరెయని వలసి దెచ్చె నింటికిని।
సచ్చరితుండగు తుకగూర్చుండెను సరి బృందా వనముగను॥ ౫౬౫.
ఆదినమందును యేకాదశియై యమరియున్న కతమునను।
పాడుగ జనులును కథవినరాగనె భార్యకలత చేసెమును॥
ఇదిగని తుకయును యెవరింటికి యెవ రేపున వత్తురుధరను।
సదమలమగు బ్రహ్మాండ మంతయును సర్వేశునిదగు నిటను॥ ౫౬౭.
అందున నుండెడు సకలప్రాణులును నమరునాకు బంధువులై।
సందియ మొందక చల్లటిపలుకుల సలిపిన బాగౌనిటులై॥ ౫౬౮.
వారికార్యముల వదలుచు మనయెడ వచ్చుట భూషణమగును।
తీరులేని పలువార్తలు జెప్పుట తెరువుగాదు నీకిలను॥ ౫౬౯.
అనుచును జెప్పగ నావులియూరక నమరియుండె నయ్యెడను।
పనిబడి తుకయును భార్యను పిలిచియు బాగుగకూర్చుండనెను॥
సమ్మతిగా నావులికూర్చుండెను చనువున తుకయును జెప్పగా।
నెమ్మది నొందియు వినుచుండెను యా నిజపతి వాక్యమునొప్పగా॥
ఎనభై టంకముల్ దిదార్దారునకు నియ్యవలసె తగనిపుడు।
పనిబడి దేహూగ్రామముంటినే పరగ నియ్య కున్ననిటు॥ ౫౭౨.
కాలుడు హవులేదార్ కనికర మొందక కష్టనుబెట్టును మనల।
వీలుగ వీటిలో పదిటంకంబులు వేగనిచితి నియ్యెడల॥ ౫౭౩.
మిగిలినటంకముల్ డెబ్బైయింటికి మెలగుచౌదరి విఠలుడు।
తగిలెనుబాకీ వసూలుకొఱకును తపేలలమ్మను చుండు॥ ౫౭౪.

మునుపే భూమిని దున్నకయుండిన మొద లగుపడ కుండుగద।
మనసున నీవిపు డుదాసవృత్తితో మనువున విడిపించు సద॥ ౫౭౫.
ఉదయమునందును ద్వాదశి యగుటచె నుచిత పర్వమై యుండు।
సదయురాలవై స్నానముజేసియు సర్వంబును కొల్లలిడు॥ ౫౭౬.
అన్నవస్త్రముల చింతను నీవును నవనినుంచ కెప్పుడును।
పన్నగతలపై పాండురంగడును బహుభంగుల బ్రోచునను॥ ౫౭౭.
అన్యపదార్థము లందలి యాశను నట్టె వదలుము నీవు।
విన్యస్తంబుగ హరిదాసులయెడ విపులసేవ సలుపుదువు॥ ౫౭౮.
భావముతోడను వైష్ణవదాసివై భక్తులకును శరణొందు।
సావధురాలవై హరినామంబును చక్కజేసి యింపొందు॥ ౫౭౯.
పైని జెప్పిన పదిటంకంబులు పంచేంద్రియ దమనమగు।
మానుగ కర్మేంద్రియములు శ్రీహరి మార్గమునందు జెలంగు॥
ఇటులం జెప్పుచు నరుణోదయమున నిచ్చెను హారతి హరికి।
తటుకున భార్యయు విరక్తినొందెను తక్షణమున దామరికి॥ ౫౮౦.
ప్రొద్దుబొడవగనె విప్రులబిలిచియు ఫొసగ గృహము కొల్లలిడె।
సద్దులేకను బూడిదె సహితము జనులు గొనగనటు వీడె॥ ౫౮౧.
పాతవస్త్రములు పెరటిని నుండగ పదపడి రుక్మిణి గనుచు।
మాదిగెస్త్రీయై వచ్చియడిగెనటు మశిగుడ్డల నిమ్మనుచు॥ ౫౮౩.
బట్టల నిచ్చుచు తుకారాముడును పరులకు జెప్పకు మనియె।
దిట్టముగా నాస్త్రీగొని వెళ్ళగ దెలిసె నావులికి డాయె॥ ౫౮౪.
ప్రపంచ వృత్తిని నితరుల గాంచుచు పతిని దెచ్చితింటికిని।
నెపములెన్నియో జెప్పుచు నింటిని నీరుజేసి వెళ్ళగని॥ ౫౮౫.
అన్నవస్త్రములు హరియిచ్చునున నె యతని పదము దలచినను।
మన్నించుచునే సర్వము విడిచియు మహి హరిచరణంబులను॥
ఇరుపర్యాయము దలచగ నాకును యిహసంపద బోయెనని।
తలుచుగాను నొకపాషాణంబును తలనిడి హరిగుడికేని॥ ౫౮౬.

బోవగ నప్పుడు రుక్మిణిగాంచుచు భోగరంగని కియ్యెడను।
సావధురాలవై జేయుటేమియన నావులి జెప్పను మున్ను॥౫౮౭.
ఘాతకుడయ్యెను నీమగడును నే కాళ్ళనువేసెద ననియు।
నీతి జెప్పె పతి హరిపాదంబుల నిలిచి దలచు తగనని యు॥ ౫౮౯.
ఒకయెడ దలచగ సకలవస్తువు లొప్పగ చనెగృహాముండి।
ప్రకటంబుగనే బాధనొందెదను బలు విరాగి తుక గనుడి॥ ౫౯౦.
సంతాపంబును జెందితి నేనును సలుపుటేమి యిక ననగ౯।
వింతను రుక్మిణి బలికె నయ్యెడను వివిధ తాపములు దొలగ౯॥
యోగక్షేమముల చింతను నీళును నుంచను వలవదు యికను।
బాగుగ నీకును గలుగును నవియని పరగ పిడికె మొహరిలను॥
ఆవులి కిచ్చియు చీరెరవికెలును ననుళుగ నిడె రుక్మిణియు।
భావశుద్ధితో గట్టుకొనుచుదా బైటరాగ తుక గనియు॥ ౫౯౩.
మొహరీలిచ్చుచు నావులితొందర ముదమున హరి మాన్పెనను।
సహనముతోడను దీనుల బిలుచుచు సరగవాని బంచుమను॥౫౯౪.
నిరాశయుక్తుడై హరిభజనను దా నెనరున నటుజేయగను।
సరాళముగ తగు కీర్తియు నతనిది సకలచోట్ల నరిగెమును॥ ౫౯౫.

---

చించవడీయను గ్రామములోపల చింతామణియను ద్విజుడు।
అంచితముగ తా గణపతి స్వామికి యమితభక్తుడై యుండు॥
ఆతడు తుకయుని కీర్తివినుంగొని యచట బిలువనంపగను।
ప్రీతివెలసికొని పోయెను తుకయును పిలువక మున్నటుగాను॥
దారినడమ నామనుజుడు వచ్చుచు తద్విజ్ఞాపనజేసె౯।
వారక తుకయనె వచ్చెదనటకని వాంఛనుతగ వేంచేసె౯॥ ౫౯౭.
చించవడీలో గణపతిమూర్తికి చేసెను దండం బపుడు।
అంచితపూజలొ చింతామణియును నమరియుండగా నపుడు॥

మౌనవ్రతుడై మానస పూజను మరిగియు నుండంగాను।
పైనము వచ్చిన తుకారాముడును బైటనిలబడుండగను॥ ౬౦౦.
చింతామణియును చిత్తేకాగ్రత చేయలేక నయ్యేడను।
సంతాపించెను పువ్వులతోటను చక్కజేయ దగునుయను॥ ౬౦౧.
మనోరాజ్యమును నటులంజేయుచు ఘనపూజయు ముగియగను।
వినోదమునయా తుకనిం జూచుచు విధివందన మొసగకను॥
ఎప్పుడువచ్చితి వనుచునడుగగను నెలమిని జెప్పెను తుకయు।
మెప్పుగ నీవును మనోమార్గమున మెలగి తోటలో వెలయు॥
విచారించునెడ వచ్చితిననుచును వినితుడగుచు తుక యనగన్।
ప్రచితంబుగనా చింతామణియును పరిక్షింపవలయుదగన్॥ ౬౦౪.
అనుచు దలంచుచు పరిశోధనమును నతనింజేయను దలచి।
చనువున భోజనవేళ తుకయునకు చక్కగ విస్తరవేసి॥ ౬౦౫.
పిలువగ తుకయనె రెండువిస్తరల పెలుచ వేయుడనగవిని।
వలసివేయుచును ద్విజుడునుజెప్పెను వరుస పిలువు మరియొకని॥
ఇదివిని తుకయనె విఠలుడు వచ్చును యిల గణపతీ మూర్తికిని।
విదితంబగునటు వేసియు విస్తర వే బిలువుము గణపతిని॥ ౬౦౭.
చింతామణియును విస్తరపైనను శ్రీగాయిత్రి మంత్రమున।
పంతముతోడను ప్రోక్షణజేయుచు భక్తిజేసె నివేదన॥ ౬౦౮.
అటులంజేయగ తుకారాముడనె నల గణపతి లేడిపుడు।
చటులతభక్తుం డొక్క డుదధిని సరగ మునుగచనె నతడు॥ ౬౦౯.
నిదానించినను గణపతివచ్చును నెఱి తడివస్త్రింబుండున్।
హితవున నిటులం జెప్పగ గణపతి యేతెంచియు నటు నిగుడున్॥
పీతాంబరమును తడియైయుండెను పిండగ నీరుప్పయ్యెన్।
వేదాంతులుయగు మీరలు బిలువుడి వినాయకుని యిటననియెన్॥
ఈవార్తలవిని చింతామణియును నెలమి జెప్పె గణపతియు।
భావబంధమున నైవేద్యములో భవ్యవాసన గొనుననియు॥ ౬౧౨.

విగ్రహమెట్టుల భక్షించునుయని విశదపరచగా నటను।
నిగ్రహమగు భక్త్యుపాసనమునకు నిలుచు దేవుడియ్యెడను॥ ౬౧౩.
అనుచు తుకారాం బలుకగనప్పుడు నాచింతామణి యనెను।
ఘనయుపాసనను జేసిన గానము గణపతి భక్షించుటను॥ ౬౧౪.
పండరిపతి నీతోడ బలుకునని పలులనగను నేవిందు!
పండుగయగునటు బిలువుము నాతని భక్తిని గణపతినిందు॥ ౬౧౫.
అటులనె జేసెద ననుచును తుకయును నట గణపతిని నుతించు।
చటులసాంద్ర శ్రీజయలంబోదర చక్కగరమ్మిట ననుచు॥ ౬౧౬.
చతుర్దశ విద్యల సాగరుడగుదువు సకలసిద్ధి దాతవును।
విదితంబుగనీ నృత్యముచూడగ విశ్వ మోహనంబగును॥ ౬౧౭.
ఎవని పైన నీకృపాదృష్టి మరి యెలమినుండు నాతనికిఁ।
వివరంబగునటు విఘ్నములడుగును విధివంద్యుడ వందరికిఁ॥ ౬౧౮.
సంకటకాలము జూచుచుభక్తుల సంరక్షింతువు నీవు।
పొంకముతో నా మనివింజేకొని పొందుగ భక్షించెదవు॥ ౬౧౯.
గొడ్డుపశువునెడ పాలుపిండునటు కుదురుగాదు నాభక్తి।
*ఒడ్డుకొను చింతామణి భక్తికి యొప్పన రమ్మిటు రక్తి॥ ౬౨౦.
సిద్ధాన్నము భక్షించుము గణపతి చింతను నేవేడెదను।
ప్రొద్దాయెను త్వర రమ్మని బిలువగ పొసగ నతడు రాగాను॥ ౬౨౧.
దండము బెట్టుచు పాండురంగనిం దనమనసున నటు దలపఁగ।
పండరినాథుడు నిజరూపంబున బరతెంచెను నటు యొప్పఁగ॥
ఇరువురు నచ్చట విస్తరలందును యేర్పడ కూర్చుండుచును।
ఇరవున చింతామణికిని తుకకును నిద్దరకే యగుపడును॥ ౬౨౩.
వడ్డనజేసిన పదార్థమంతయు వరుసను భక్షించిరటఁ।
అడ్డిలేకనటు కరశుద్ధికినై యరయ నీరుగొనిరి యటఁ॥ ౬౨౪.
విడెములనియ్యగ నదృశ్యులయ్యిరి విహితానందము తోను।
కడుముదమొందుచు చింతామణియును ఘనతుకరాం పదములను॥

---

*ఒడ్డుకొను - ప్రార్థించు.

వందన మొసగగ వలదు వలదనుచు వాసిగ దా మఱలుకొను।
అందము యిది మీచరణ ప్రతాపమె యరసి యిట్లులుండుననుః॥
అనేక భంగుల తుకారాముని యాతడు తగ నుతియించెన్।
పునీతుడనైతిని దేవ దర్శనము పొందుపరచితివి సెలొచ్చెన్॥
ఇటులం జెప్పగ తుకారాముడును నేపున నాజ్ఞ గొనుచును।
అటు దా నడచుచు నామము జెప్పుచ నరిగెను తన గ్రామమును॥
కాశి భగీరథి గంగా యనుచును గలిగిరి త్రై పుత్రికెలు।
వాసిగ వీరలు పెద్దబెరుగుచును వయసునొంది విలసిల్లు॥ ౬౩౯.
ఆవులి గాంచుచు వీరి వివాహము లగుటెట్లని చింతించు।
భావశుద్ధితో పతికిందెలుపగ బైటికేగె తుక వినుచు॥ ౬౩౦.
తన కులబాలురు వీధిని నాటలో తఱుచుగ నుండంజూచి।
వినయముతో నాముగ్గుర బిలుచుచు వేగమె యింటికి పిలిచి॥
ఆదినమందును లగ్నతిథియునై యమరియుండె నటు గనుక।
పాడుగ పుసుపును బూసి వస్త్రముల పౌరోహితు డటురాగ॥
మూడుకొమార్తెల మంగళ సూత్రముల్ మురిపెముతో గట్టించెన్।
వేడుకతోడను పాలునన్నమును విశేషముగ తినిపించెన్॥ ౬౩౩.
మరుదినమందును పుత్రుల బంధువుల్ మర్యాదను వినివచ్చి।
వెరవక సల్పిరి వివాహమంతయు వేడుక లలరగ మెచ్చి॥ ౬౩౪.
భక్తులందరటు గూడుచు నప్పుడు బహుసామగ్రిని జేయన్।
రక్తిగ సకలము జరిపించిరి యటు రమ్యమలరగను డాయన్॥
హరికృప చేతను ననుకూలంబులు నంమరియుండె నటుగాను।
పరమ మోదమును బొందెను యావులి భక్తిజేయు పనికటను॥

---

బీడను గ్రామపుదేశ పాండ్యద్విజు ప్రీతినొందె చదువుటకు।
వాడును నాటక పురాణ తెలివిని వరుసను గోరుచు బాగు॥ ౬౩౬.

పండరియందుతా నన్నవర్జితుడై పది దినములు తపసుండె౯।
మెండుగ శ్రీహరి స్వప్నము నందును మెలగియు నిట్లనుచుండె౯॥
ఆళందిని నాజ్ఞానదేవు నీ వారాధించిన యెడల౯।
మేలొందగ దగు వార్తను జెప్పును మెల్లగ చను మయ్యెడల౯॥
కలగని మేల్కని జ్ఞానదేవునెడ గరిమెనపుడు లేచిచనె।
తలపడి యచ్చట ద్వాదశ దినములు తపస్సు జేసెను మున్నె॥
ప్రాప్తహీనుడై శరీరదండన బహుగ జేసినాడనుచు।
ఆప్తుండగుచును జ్ఞానదేవుడును నతనిస్వప్నమున వచ్చు॥ ౬౪౧.
దేహాయూరున తుకారాముడును దివ్య భక్తుడై యుండు।
విహితుడవై నీవటుబోవుచు మరి వేడిన జెప్పును నతడు॥ ౬౪౨.
ఆతని మాటను విశ్వసించినను యమరును కోరికెలనగ౯।
ఈతడు మనసున కించనుంచుకొని యేగె తుకనికడ నలుక౯॥
సకల సంగతుల తెలియ జెప్పగను చక్కగ వినుకొని తుకయు।
అకలంకుండగు జ్ఞానదేవుచే నలవిగాక తా మరియు॥ ౬౪౪.
నాయెడ బంపుట నాశ్చర్యంబిది నాకేమి దెలియుననుచు।
బాయక తుక పదకొండ భంగులను బాగుగ వ్రాసియునుంచు॥
వాటిని యొక టెంకాయతో నియ్యగ వదలి చనె వాడాళంది।
నీటుగ రాత్రిని జ్ఞానదేవుచే నెరి దెబ్బల ద్విజుడొందె॥ ౬౪౬.
తెలియబలికె తుక ద్విజుని చేష్టలను ధీరు జ్ఞానదేవునకు।
తలపడి యాజ్ఞను నడపగ విప్రుని దారిద్రత నెదురెక్కు॥ ౬౪౭.
ఇంతను నచ్చట బ్రాహ్మణుడొక్కం డేతెంచెను తుకయెడను।
పంతముతోడను దండమిడుచు గనె పదపడి కౌకితమటను॥ ౬౪౮.
అక్షర గురుతులు లేనివానికిని నాతడిచ్చె నభంగులను।
పక్షముతోడనె బాపడు చదువుచు పండితుడయ్యెను మున్ను॥
అమదాబాదున సాహుకారుడొక డాళందికి ప్రార్థించె౯।
క్రమమున కార్యము కొనసాగుటచే ఘనరూకల గొనివచ్చె౯॥

జ్ఞానదేవునకు నర్పణచేయగ కలలో తుకయున కిమ్మనగన్।
మానుగ నతడును తుకకడ దెప్పుచు మన్నింపుండని యనగన్॥
ఆసమయంబున బీదబ్రాహ్మణుం డచ్చటికిని రాగాను।
వేసరిల్లకను ద్రవ్యమునంతయు వేగనిచ్చి వెలిగాను॥ ౬౫౨
విద్యయు నీకును ప్రాప్తములేదీ వెలసెడి జన్మమునందు।
సద్యస్కాలము ద్రవ్యముదొరికెను చక్కగ గొనిపొమ్ముందు॥ ౬౫౩.
కొండోబాయను ద్విజు డభంగులను గురితోడను చదువగను।
పండితుడై గీర్వాణ గ్రంధముల బహుగ జెప్ప నృపునకును॥ ౬౫౪.
ఇదివిని తొలిద్విజు ద్రవ్యముతోడను నింటికి వెళ్ళెను యపుడు।
విదితంబయ్యెను తుకని కీర్తియును విలసిల్లగవినె నృపుడు॥

---

లోహగామను గ్రామమునందును లోకులు తుకనిం గొనుచు।
బాహుళ్యంబగు మర్యాదలనటు ప్రతిదినంబును సలుపుచు। ౬౫౬.
హరిగుణ వర్ణన జేయగ నందరు నతిసంతస మొందుచును।
గురుతుగ తుకయును ద్రవ్యము నెప్పుడు గోరక కథ చేయగను॥
ప్రతిదినమందును బ్రాహ్మణ భక్షణ బాగుగ జరుగుచు నుండెన్।
సతతము హరికథ యొకరొక యింటను సలుపంబడుచును నెగడెన్॥
వృద్ధ బ్రాహ్మణి యొక్కతె వచ్చియు వినుతిజేసె తుకయునకు।
పద్దుగ నాగృహమందును నీవును భక్షణజేసియు బాగు॥ ౬౫౯.
కీర్తన చేయుండనుచు జెప్పగను కించలేక యాతండు।
ఆర్తినిగాంచుచు వచ్చెదననియెను యామెయు కోరేనాడు॥ ౬౬౦.
వెనక నామెయును కూలినిజేయుచు విత్తము సంపాదించె।
అనువుగ పది విప్రుల కన్నమునిడ నామె యత్నమును జేసె॥ ౬౬౧.
ఇంతను వర్షము నమితము కురియగ నిల్లును కురుచుచునుండెన్।
పంతముతోనటు గోడ తడపబడి పడను సిద్ధమైయుండెన్॥ ౬౬౨.

శోధనచేయుచు తుకారాముకడ రూఢినరిగి బ్రాహ్మణియు।
పాదుగ గోడయు పడుటకు సిద్ధమై పదపడియున్నది యనియు॥
సాహిత్యంబును సిద్ధపరచితిని స్వామికార్యమెటులగును।
ఊహను జెప్పుండనగను తుకయును నుర్విబడదు గోడయును॥
భక్షణజేసిన వెనకను బడునని బలుకనామె మోదముతో।
తక్షణమంచే సకల వంటలను తానుజేసెను త్వరతో॥ ౬౬౫.
పత్రములందును నన్నముంచగను బ్రాహ్మణులటు కూర్చుండఁగ।
చిత్రముగానటు సకలపదార్థముల్ చెదరక తగ దినుచుండఁగ॥
వారలతోడను తుకభక్షించెను బలుకుచు హరినామమును।
సారెసారెకును పదార్థములనటు చక్కగ వడ్డింపగను॥ ౬౬౭.
అందరు భక్షణ జేసి లేవగను నటదినుసుల దీయగను।
వింతతోడబడె గోడయప్పుడును వినుచువచ్చిరి జనులును॥ ౬౬౮.
వేరొకచోటను కీర్తన తుకయును వెలయజెప్పె నాదినము।
వారక జనులును కీర్తన వినుటకు వచ్చిరి బహుగా సుమ్ము॥
మాసమువరకును నచ్చటనుండుచు మరలవచ్చె దేహూనకు।
గాసిజెందిరటు దుర్జనులందరు ఘనకీర్తిని గాంచుటకు॥ ౬౭౦.
వాగోలియను గ్రామములో ద్విజు వసించె రామేశ్వరుడు।
బాగుగ శాస్త్రముల్ నాల్గును నాతడు పరగ నేర్చితానుండు॥
విద్యావంతుం డనుచు నరపతియు విహిత మన్ననల జేయఁగ।
ఉద్యోగించెను నాతడు తుకపై యొప్పుగ హానిని జేయఁగ॥ ౬౭౨.
అధికారులకడ తానుబోవుచును నలవారల శ్లాఘించెఁ।
సుధీరుడైయటు తుకారాముడును శూద్రుండై జన్మించెఁ॥ ౬౭౩.
శ్రుతిమథితార్థము జెప్పుచు నాతడు శ్రుతపరచును హరికథలో।
హితధర్మంబుల ముంచుచు నాతడు యీశుని నామంబిలలో॥ ౬౭౪.
ఉంచుచు భక్తిని యూర్జితపరచుచు నురుకర్మల మాన్పుచును।
మించియు జెప్పెను పాషండంబగు మేలుగాని జ్ఞానమును॥ ౬౭౫.

మోహపరచు జనులందర యటనన మూర్ఖుండగు యధికారి।
దేహుగ్రామపు మునుసీపునకును తిరముగ వ్రాసెను కోరి॥ ౬౭౬.
గ్రామమునుండియు తుకారామునిం గట్టిగ వెళ్ళంగొట్టఁ।
నేమంబిదియని వ్రాసియుండగను నిఖిలురు పత్రముబట్టఁ॥ ౬౭౭.
తుకారామునెడ జూపగ నాతడు దురితహరుడు హరిచేతఁ।
ప్రకారయుక్తమై నియమించినగతి బట్టియుంటి యీచెంతఁ॥ ౬౭౮.
ఏమిచేయుదును నెటులంబోవుదు యెవరు భిక్షమిచ్చెదరు।
గ్రామవాసులును కలతలొందిరని కాగలపని యేమడరు॥ ౬౭౯.
రామనామ గర్జనతో నరిగెను రామేశ్వరు ద్విజుకడను।
ప్రేమతో నతనికి దండముబెట్టుచు ప్రియ నామము జెప్పుచును॥
హరికీర్తనదా నారంభించియు నచ్చట తగ జేయుచును।
సురుచిరమగు తన ప్రసాదవాణిని సూటిగ జెపు చుండగను॥
పండితు డనియెను శూద్రుడవగుచును బహుకవితల జెప్పెదవు।
నిండుగ వాటిలొ శ్రుత్యర్థంబులు నిబిడియుండ జేసెదవు॥ ౬౮౨.
అనాధికారివి జెప్పుట దోషం బరయ నిరయ మొందదగుఁ।
వినీతులగుచును వినువారును మరి విధితో నేగెదరటకుఁ॥ ౬౮౩.
కవిత్వముల నికపైని జెప్పకుము గడిచిన కాలమునందు।
వివరంబుగ నీవనిన కవితలను వేయుము నీటనుముందు॥ ౬౮౪.
ఇదివిని తుకయును యిష్టప్రకారమె యేపున జేసెద ననుచు।
పదపడి వచ్చుచు దేహుగ్రామమును పాండురంగనిం గనుచు॥ ౬౮౫.
పామరుడనునే మూఢమనుజుడను భవదీ యాజ్ఞను గొనుచు।
వేమరు జెప్పితీ లోకులకొఱకై వికటమొ వికచమొ యనుచు॥
కవితల నెల్లను గంగను విడువను కాంక్ష నీకు బుట్టినదో।
వివరంబుగ తా జెప్పుచునిట్టుల విపుల గ్రంథముల గురితో॥ ౬౮౭.
బట్టనుగట్టియు పాషాణముతో బడవేసెను నదిలోను।
విట్టల విట్టల యనుచును జెప్పుచు వేగవచ్చె గట్టునను॥ ౬౮౮.

సుజనుల కూటను దుఃఖ మొందెనటు కుజనులు ముద మొందుటకు।
విజయ మొందితి మను పలువా ర్తల వేధగలిగె తుకయునకు॥
భగవత్సత్తా ప్రమాణ మగునని భావించుచు నా తుకయు।
విగతమోహుడై విఠల నామము వేమరు జేయంగనియు॥
పంచరాత్రము లిట్లుండంగని బ్రాహ్మణ కుజనులు నటను।
అంచితముగనే కూడివచ్చియని రమిత దుర క్తులనటను॥ ౬౯౧.
వెనకటి దినముల ఖాతా పత్రముల్ వేసి నదిని ముంచితీవి।
ఘన ప్రపంచమటు నీటను గలిసెను గనుచుండగ మేముభువి॥ ౬౯౨.
కవితల నెల్లను గంగను నిడితివి ఘనమగు పరమార్థంబు।
అవశంబుగ నిటుమునిగి పోయెతగ నవనిని జచ్చుట సొంపు॥
నలుగురి ముందర ముఖము జూపుట న్యాయముగాదని యనుచు।
వెలితిగ జెప్పియు వెళ్ళిరి కుజనులు వినుకొని తుకరాం మనసు॥
ఖేదమునొందుచు ప్రాణత్యాగము క్రియతో జేసిన నిటకుఁ।
సాదర మొందని యాత్మహంతయు చక్కగ నబ్బును తనకుఁ॥
అనుచు దలంచుచు నన్నవర్జితము నటు మొదలుగ జేయుచును।
వినతను బృందావనమున నుండెను విఠలు సన్నిధి ముందును॥
ఏకాదశి తాకీ ర్తన జేయుచు నెలమిని జాగరణంబు।
వీకను జేసిన ఫలమిటులయ్యెను విఠ్ఠల నీచరణంబు॥ ౬౯౭.
ఎన్ని యవస్థలు వచ్చిన మరువను యిహజన సంసర్గమును।
తిన్నగ మాన్పుము ధైర్యమిమ్ము తగ త్రివిక్రమనిను వేడెదను॥
అనేక భంగుల బ్రోచితి నీవును నలసెను కాయము నాకు।
పునీతు చేయుము భ క్తవరద నిను పొంద గోరితిని బాగు॥ ౬౯౯.
అనేక విధముల నిటుల నుతింపుచు హరిపరాత్సు దలచుచును।
వినీతుడగుచును పడియుండెను యటు విపులశ క్తి బోవగను॥ ౭౦౦.
పండరినాథుడు బాలునిరూపుడై బరతెంచెను యటుగాను।
ఖండితముగనీ పక్కననుండుచు కాపాడెద బాగనిను॥ ౭౦౧.

భక్తిని నామము పఠన జేయగను బలు కర్మము లెడబాయుఁగా।
సక్తిగ నేనిటు నివర్తించెదను సకల విపత్తుల మరియుఁగా॥ ౨౦౨.
హిరణ్యకశిపుచె హింసింపంబడె నిల ప్రహ్లాదుడు మునుపు।
వరదుడ నైనే వానిం బ్రోచితి వచ్చు నాపదల పెంపు॥ ౨౦౩.
అటులనే నీవును చింతను బొందకు యాపదలెల్లను బోవు।
పటుతరముగ నిటు జెప్పుచునుండియు బాలుడు మరుగై పోవు॥
భక్తద్వేషి రామేశపండితుడు భగవన్నిగ్రహ మునను।
సక్తిగ వచ్చెను పునహా నగరము సాంబమూర్తి గనుటకును॥ ౨౦౪.
నాగనాథమను లింగం బచ్చట నవ్య మహిమ గూడినదా।
బాగుగ నలుపుస రామేశ్వరుడును బహుగా పూజలతనదా॥
సోమవారమగు పర్వకాలమున సూటిగ వచ్చుచు పురము।
నేమముతో స్నానమున కొకబావి నిగుడగ యవనుని వనము॥
ప్రవేశించియట స్నానము జేయగ ఫకీరు చప్పుడు వినియు।
నవీన బాపడు నా కోనేటిని నలకువ నీరాడుటయు॥ ౨౦౫.
నిమాజుకొఱకై నిర్మలోదకము నేనుంచితి నియ్యెడను।
పుమానుడెవడో చెడిపెను నీరును పుట్టును తాపము మేను॥ ౨౦౬.
శాపము వినగనె రామేశుండును సరగనీటి వెలిరాగఁగా।
తాపము గలిగెను దేహమంతయును తల్లడపడె నటుబహుగఁగా॥
తనతో వచ్చిన విద్యార్థులగని తగునాలోచ యేమియన।
మనివిని వారలు ననగడశాయను మహాసిద్ధుడీతడన॥ ౨౧౧.
వినియుందుముదగ వాడు ప్రయోగము వేగజేసె కాబోలు।
మనము వాని యెడ బోయిన యెడలను మానుగ తాపము మరలు॥
పండితుడిదివిని హీనజాతికిని ప్రణతి సేయ నిందుకని।
నిండుదుఃఖమున నింటికి తిరిగిరి నెఱితాపము నుండగని॥ ౨౧౩.
తడివస్త్రంబుల పైనిగప్పుకొని తాజేరెను తనగృహము।
పడుకొని యున్నను లేచిన నడచిన బహుతాపము నొందుసుము॥

అనుష్ఠానముల నెన్ని జేసినను నవికొంజగాకను పోయెన్।
ఘనమగు మాన్యత నొందియుండినను కానదుపాయము చేయన్॥
ధనసంపత్తియు దారాపుత్రులు తనకు హితముగాకాను।
అనువుగ వచ్చెను యాళందీకిని యజానవృక్షము కడను॥ ౨౧౬.
దేహంబునకును విపత్తి వచ్చెను దెలుపుము కారణమనియు।
బాహుళ్యంబగు యనుష్ఠానముల బాగుగనటు జేయుటయు॥ ౨౧౭.
కొన్నిదినంబు లిటులంజేయగ గురుతుగ స్వప్నము గనెను।
ఎన్నికగా హరిభక్తుని ద్వేషము యేర్పడియెను నీకిటను॥ ౨౧౮.
భగవద్భక్తుడు తుకారామునికిన్ బహునిందల జేయుటచే।
తగనిరోగ మిటు కలిగెను నతనికి తలపడి శరణంబనుచే॥ ౨౧౯.
పోవును వ్యధయును నటుగాకున్నను పోదెట నెవ్విధమునను।
భావబంధమగు మంత్రక్రియలచే పరిహరింపబడదికను॥ ౨౨౦.
పండితుడిదిగని పశ్చాత్తాపము బలువుగ దాబొందుచును।
నిండుభయంబున పత్రికె వ్రాసెను నిగుడి తుకరామునకును॥
అనేక విధముల నుతులను జేసియు నరసిబంపె దేహునును।
వినీతు డగునొక విద్యార్థినియటు వెళ్ళమనుచు జెప్పెనును॥ ౨౨౨.
దెహూగ్రామమున మనుజులనేకులు తెరువున కలలను గనిరి।
బహుళంబగు నా తుకరాం గ్రంధముల్ పైవచ్చును నది మీరి॥
ఉదయమునందును నదికడ కేగియు నొప్పుగ గైకొను మనుచు।
విదితము కాగనె యుదయము నందును వెళ్ళిరి నదికడకనుచు॥
గ్రంధము తేలుచు నీటను రాగను కనుగొనిరపు డాజనులు।
బంధించినగతి గైకొని తుకయెడ బాగుగ నుంచిరి వార్లు॥ ౨౨౪.
ఆసమయంబున తుకారాముడును నతిబలహీనత నుండెన్।
వాసిగ పదిమువ్వారము లయ్యెను *వనము కూడు లేకుండన్॥
మెల్లగ కనులను తెఱచి చూడగను మిగుల మోద మొందుచును।
ఉల్లమలర హరి కరుణను దలచుచు నూర్జిత ప్రేమను జెపును॥

*వనము = జలము.

విఠలరంగా యన్యాయమునే వెలయ జేసితీ తఱిని।
శఠులవార్తలను వినుచు గ్రంథముల సరగనదిని ముంచితిని॥ ౭౨౭.
శ్రమచే నీవును నన్ను నొకయెడను సద్గ్రంథము లొకయెడను।
క్రమమొప్పారగ రక్షణజేయుచు ఖ్యాతినిడితి విద్యేడను॥ ౭౨౮.
అనుచును శ్రీహరి ననేక భంగుల నాతడు స్తోత్రము చేసెన్।
మనివితోడ రామేశుని శిష్యుడు మలయుచునటు వెంచేసెన్॥ ౭౩౦.
సంగతి జెప్పుచు పత్రికనియ్యగ సంకోచింపక తుకయు।
పొంగుగ తానొక యభంగు వ్రాసియు బూనె నతనిపై దయయు॥
దానినందుకొని విద్యార్థియుమరి తన గురుకడ వచ్చుచును।
మానుగ నియ్యగ గురుడు జదివికొని మదినిగనెను భావమును॥
పండితు డొందిన తాపము వెళ్ళెను ప్రబలాశ్చర్యం బొందన్।
ఉండిన బొబ్బలు దేహంబెల్లను యొసగ తగ్గె నిరవొందన్॥ ౭౩౩.
పదిబొబ్బలెగని తుకారామునిని పదముదలచి దండమిడెన్।
విదితంబగునటు వేదశాస్త్రముల విపుల తెలివి నాకుండెన్॥ ౭౩౪.
నీటను గ్రంథము తడవక యుంచెడు నెనరువిద్య నేరనని।
పాటవముగతా బైలుదేరె తుక భక్తుడుండు చోటికిని॥ ౭౩౫.
పండితుండు యిటు తనకడ వచ్చుట పరగ తుకా తెలిసికొని।
నిండు ప్రేమతో తుకారాముడును నెమ్మినేగ నెదురుకొని॥
దారి మధ్యమున నిరువురుగూడియు దండమిడుచు యొకడొకడున్।
తీరుతప్పి నిను బాధించితినని తెలియపరచి పండితుడున్॥ ౭౩౭.
భక్తి మహిమ నిటు ప్రబలపరుచుటకు బాగుబుట్టితివి ధరను।
సక్తిగ నీవును వ్రాసిన పద్యము చక్క జేసె నామేను॥ ౭౩౮.
అందుకు తుకయును దండము బెట్టుచు ననుగ్రహము తమరిదగు।
సందియమొందక పామరుడనునే సరి పాత్రుడ మీకృపకు॥
అనిదా జెప్పగ పండితు డప్పుడు నతనికి మరిదండమిడు।
దినమును తుకరాం సహవాసముచే తీరునహంకృతి యనియుండు॥

ఆళందికిని తుకరాం బోవగ ననేకులరిగిరి యటకు।
మేలొందుచు శ్రీజ్ఞానదేవుని మిగుల ప్రేమగని తిరుగు॥ ౭౪౧.
దెహూనకురాగా రామేశ్వరుడును తెగువ తుకను విడువకను।
బహుళప్రేమగన, యభిమానంబును పరుగిడె దూరంబుగను॥౭౪౨.
తగిలియుండెడా తుకారామునే తరుణోపాయమునకయ్యె।
ప్రగల్భముగనిది పునహానగరులో ఫకీరనగడ్షా వినియు॥ ౭౪౩.
బాపనికిని శాపముబెట్టితి నే ప్రాపు యనుచు రాడాయెగ।
కాపుజేసియా తుకారాముడును కాపాడెనుయని వినియెగ॥౭౪౪.
ప్రతీతి గనవలె ననుచుజెప్పుచును బైలుదేరె నటనుండి।
సదానందమున నిమగ్నుడగుచును చక్కవచ్చె చించవడీ॥ ౭౪౫.
గణపతి గుడికిని యెదురుగనుండెడి ఘనగృహమును దా జొచ్చి।
వినతుడై తనయెడనుండు చిప్పసరి విపుల ధాన్యముల నిచ్చి॥
పంపుడనుచుదా వేడగనప్పుడు పనివాడిడె ధాన్యమును।
యింపొందగ నా చిప్పకుసరియై యేర్పడకుండ గనుచును॥ ౭౪౬.
అనేకమణువుల ధాన్యంబిడినను నది సరిగాకుండగను।
వినీతు గృహపతి చింతామణియును వేంచేసియు నటుగాను॥ ౭౪౭.
చేతిని ధాన్యము తానుంచగనే చెలగినిండె చిప్పయును।
పాదుగ నిదిగని ఫకీరుడప్పుడు పరగవెళ్ళె దేహూకును॥ ౭౪౮.
తుకారాముని గృహమునుగాంచుచు దురుసుగ నిలుచుండుచును।
వికాసమొందగ భిక్షవేయమని విపులధ్వని చేయగను॥ ౭౫౦.
ఆవులి యతనిని దురుక్తులాడుచు నటుబిలుచుచు తన కొమరిగ।
భావశుద్ధితో పిడికెడు ధాన్యము బట్టిచ్చిన వేయుతరిగ॥ ౭౫౧.
ఫకీరు చిప్పయు నిండెనంతలో బహుసంతోషము బొంది।
ప్రకారముగనా సిద్ధినియోగముల్ పనిబడవిచ్చుట నంది॥ ౭౫౨.
ఎటుబోయెను యా తుకారాముడని యెలమినడుగ కొమరియును।
పటుతరముగదా పూజలసలుపును పండరిపతి గుడినసెను॥ ౭౫౩.

ఇదివిని వెళ్ళెను నటకు ఫకీరుడు యింపుగ తుక జూచుచును।
ముదమున నాతని మన్ననజేయుచు నురిపెమున ఫకీరుడును॥
హరిగుణ కథనము వినుచుండెనుయటు నతిహర్షము బొందుచును।
ఇరుదినములుతా నచ్చటనుండియు నేగుదెంచె పునహాకును॥ ౭౫౫.



ప్రతిదినమందును దేహుగ్రామమున పరగ జరుగు కీర్తనము।
సతతము జనులును చేరుచుందురటు సత్కథ వినుటకు సుమ్ము॥
కామినియగునొక పరస్త్రీ యచ్చట కథవినుచుండెను దినము।
ఏమారకనది యొకదినమందును యేగె తుక వెంబడిసుము॥ ౭౫౭.
జనులు లేని యేకాంతమునందును సలుపుము రతియని యనగన్।
ఘనుడగు తుకయును గజగజవణకుచు కాంత కనెను నాడుతగన్॥
పరస్త్రీలందరు మాతృభావమున బరగుచుందురిటు నాకు।
వెరవక షడ్రిపు లర్పించితినే విఠలుని చరణంబులకు॥ ౭౫౯.
మహాసిద్ధులను మానుకుంటితగ మహిలో ప్రకృతిని నేను।
సహానముతోడను చక్కజేసికొని సలుపుదు హరిధ్యానమును॥
ఇకనీవేగుము తల్లియనుచును నింపుగజెప్పుచు తుకయు।
అకలంకుండై మరియొకచోటికి నతడువెళ్లుచును మరియు॥ ౭౬౧.
భజనజేయుచును పాండురంగనిన్ బహుప్రేమను నుండగను।
సుజనులుకొందరు లోహగామునకు సూటిగగొని చనుటయును॥
శ్రీహరికీర్తన నమితప్రేమతో జేసెను తుక యవ్వేడను।
బాహుళ్యంబుగ ప్రజలువచ్చిరటు భక్తిని విందురు కథను॥ ౭౬౩.
వినువారందరు నత్యానందము విపులంబుగ బొందుచును।
అనువుగజేతురు బ్రాహ్మణ భోజన మమితోల్లాసముతోను॥ ౭౬౪.
కంసాలుండొక డాయూరందును ఖలుడగుచును తగనుండెన్।
సంసారంబున బద్ధుడై తుకను సలుపుచు నిందల నుండెన్॥ ౭౬౫.

శివాజిపేరున నాతడువెలయగ శ్రీకరు తుక పిలువుమనె।
వివరము నతడనె తానటుగానని విపులదూషణలిడుచునె॥ ౭౬౬.
అళకావతినొక విప్రుండుండెను ననుష్ఠానముజేయుచును।
ఇల పదివెయ్యిల రూపాయిలకును యెలమి ఋణము దీరమును॥
మాసములారటు గడిచిన పిదపను మహిని స్వప్నము గనియెగా।
వేసరిల్లకను తుకయెడబోయిన వేగతొలగు ఋణమనియుగా॥౭౬౭.
ఆతడు వెతుకుచు లోహగాములో నరసి తుకను తానుగని।
ప్రీతిగజెప్పెను జ్ఞానదేవునను పేర్మిబంపె నిచటికని॥ ౭౬౮.
ఇదివిని తుకయును గ్రామవాసులను నియ్యమనెను ద్రవ్యమును।
సదయులై యందరు చక్కగనిచ్చిరి స్వల్పంబగు రూకలను॥ ౭౭౦.
శివాజీనియా విప్రుడు డబ్బును శీఘ్రంబుగ నిమ్మనగా।
దవాగ్నిసరిగా మండిపడుచునటు తానిరు డబ్బులియగా॥ ౭౭౧.
తుకారాముసెడ రెండుపైసలను దురుసుగ ద్విజుడుంచగను।
వికాసముగనొక పెంకుబిల్లచే వేగరాసె డబ్బులను॥ ౭౭౨.
బంగారంబై చెలగగ డబ్బులు బాపనికిచ్చెను తుకయు।
భంగపరచకను నాతడుచేకొని పైసయు చాలదనుటయు॥ ౭౭౩.
తామరపాత్రల గైకొనిరమ్మని తనివిని తుకయును జెప్పగా।
నేమముతోడను విప్రుడుదెచ్చెను నెనరున వాటిని యొప్పగా॥
కాంచనమగునటు జేసియన్నిటిని కరుణనిచ్చె బాపనికి।
చాంచల్యంబును విడిచి ముదముతో చనె ద్విజు డాళందికి॥ ౭౭౫.
పెంకుచిప్పనటు తుకారాముడు పెనగివేసె గుంటలోను।
సంకుచితులగుచు నచ్చటి జనులును చక్కజూచి వింతగను॥ ౭౭౬.
కంసాలుండును తుకారాముసెడ కనకవిద్య యున్నదని।
సంసారమునకు చక్కనగునుయని సాధించను తానుగని॥ ౭౭౭.
భక్తునివలెనే తుకారాముకడ పదపడివచ్చును దినము।
సక్తిగ శ్రీహరి కథలనునెప్పుడు చక్కగదా వినునుసుము॥ ౭౭౮.

వత్సర మొక్కటి జరిగెనిట్టులను వంచన హృదయుండగుచు।
సత్సమాగమం బగుచుండంగను సర్వేశ్వరు కృపగనుచు॥ ౨౭౯.
కొన్ని యెడ్ల నొకనరుని బదలడిగి యన్ని బంపె బంబాయికిఁ।
పన్నుగ నవియును దెచ్చె సరుకులను బహుగా రూకల వరికిఁ॥
తిరిగియు నెడ్లను స్వంతవానికడ ద్రిప్పవాడు తనదనకఁ।
మరలించెను తన లెఖ్ఖ జూచుకొని మహికంసాలునివనకఁ॥౨౮౧.
వింతనొంది యాకంసాలుండును వేంచేసెను తుకయెడను।
సంతసింపకను యేమిసేతునన సర్వేశుండిచ్చెనను॥ ౨౮౨.
మంచి విషయమున వ్రయపరచుముయన మహినాతడు ప్రజలకును।
అంచితముగతా నన్నదానమును నతిముదమున జేయగను॥ ౨౮౩.
అదిమొదలుగనా కంసాలుండును నతివిరక్త చిత్తమునఁ।
వదలక యుండెను తుకారామునిఁ వాంఛ విడిచె గేహమునఁ॥
క్రోధము నొందెను శివాజీసతియు కుటిలత తుకరామెడను।
పాదుగ నాతడు పిచ్చివానిగా భర్తను జేసెననియును॥ ౨౮౪.
నాలుగు బానెల నీళ్ళను గాచియు నవి మసులుచు నుండగను।
వీలుగ నామెయు తుకనిం బిలిచియు వే స్నానము చేయమను॥
కనుగొని తుకయును శ్రీహరినామము గౌరవమున చెప్పగను।
నెనరున నీరను సీతల మయ్యెను నిగుడి జేసె స్నానమును॥౨౮౫.
వెళ్ళెను తుకయును నుండు చోటునకు విపులవ్యధ యువతిగొని।
మెల్లగ పతితో విన్నపించెనును మేలులేదు దేహమని॥ ౨౮౬.
కుష్టువ్యాధియని దెలియగ నతడనె గుఱిగ రామేశునకును।
ఇష్టత నతడనె తుకారాముడును నెలమిస్నాన మొనర్చగను॥
అచ్చటి మృత్తిక నామెయు గైకొని యామె శరీరము మీదఁ।
మెచ్చగ బూసిన మానును వ్యాధియు మేలగు సౌఖ్యంబందఁ॥
ఇటులనె వనితయు జేయగ నప్పుడు యిష్టసిద్ధితా గనియెఁ।
పటుతరముగదా కీర్తన వినుచును భావశుద్ధి నటుగనియెఁ॥ ౨౯౧.

ప్రకటంబయ్యెను తుకరాం కీర్తియు బహుతరముగ దేశములన్।
అకలంకుండగు శివాజి నరపతి యమితప్రీతి నయ్యెడలన్॥ ౨౯౨.
పంపించెనునొక గుఱ్ఱము మనిషిని పరగ తుకను బిలుచుటకు।
ఇంపొందగనా తుకరాం జూచుచు నీశుని దలచుచు బలుకు॥ ౨౯౩.
అభిమానము మరి దంభము మొదలగు నఖిలగుణములిల నాకు।
శుభముగ లేనటు జేయుము శ్రీహరి సుఖమును నే జెందుటకు॥ ౨౯౪.
ఆపేక్షలెవ్వియు తనకు లేవనియు నపుడు వ్రాసె పద్యములు।
అపార కృపతో మనుజున కిచ్చియు అవనీపతికడ దోలు॥ ౨౯౫.
మంగళ మగునటు నృపున కిమ్మనుచు మనుజుని గుఱ్ఱము పైని।
రంగుగ నెక్కుచు పొమ్మని జెప్పగ రంజిల్లుచు వాడుగని॥ ౨౯౬.
చెడ్డగుఱ్ఱమది యెక్కనియ్యదని చెప్పగ తుకగుఱ్ఱముపై।
అడ్డగించకను చెయినుంచగ నట నదిజూపె ప్రియము నరుపై॥ ౨౯౭.
దానిపైని యా మనుజుండెక్కుచు తర్లివచ్చె రాజుకడన్।
తానటుదెచ్చిన పత్రిక నిచ్చియు ధరపతికిని దండమిడన్॥ ౨౯౮.
నిరపేక్షుండగు నిశ్చయ వృత్తిని నేర్పునగని నరపతియు।
తలచుచుగాగ బహు వస్త్రభూషముల ధనమును గైకొని మరియు॥
తుకారాముకడ వచ్చి కీర్తనను తొందర నొందక నృపుడు।
ప్రకాశమొందగ ధనవస్త్రంబుల పరగముందు నిడుచుండు॥ ౩౦౦.
నమస్కారమును జేయుచు పూజల నమ్రుడగుచు తాజేసెన్।
క్షామరొప్పగనా తుకరాం గనుగొని కోరనిదిటు విచ్చేసెన్॥ ౩౦౧.
ఎందుకుద్రవ్యము నాకిపుడమిని యెపుడు విఠలు నామమున।
సందియమొందక తృప్తిని బొందితి సదానంద భరితమున॥ ౩౦౨.
నెళవైయుండును హరినామమెమది నిరతంబెది గోరకను।
ఇలలో సూర్యుని జూచుట కొఱకును నెందుకు దీవిటి యిలను॥
గోమాంసమునకు సరియగు నాకును గురుతుగనుంచిన ధనము।
ప్రామాణ్యంబుగ జెప్పెదనీకును భగవద్దాసుడ వగుము॥ ౩౦౪.

హరివాసరమీ వనుష్టింపుచును నల తులసీమాలయును।
తిరముగ కంఠము నిడుకొనియుండిన పరితృప్తియు నాకగును॥
ఇదివిని నరపతి ధనమునంతయును నెలమిబంచె ద్విజులకును।
విదితంబుగనా తుకారాముకథ వినుచును ముదమొందె మను॥
హరినామము సుస్వరగానముగా నాతడు తగ జేయగను।
గురుతుకు నంటెను మాధుర్యంబును గోవిందుని ప్రేమయును॥
విఠలుడె తల్లియు విఠలుడె తండ్రియు విఠలుడె బంధువు సఖుడు।
విఠలుడె ధనమగు వీఠలుడె సంపద విఠలుడె యాత్మగ గనుడు॥
ఏకాంతంబును విఠలుడె యగుచును నెక్కడ నాతడె యగును।
లోకాంతంబున విఠలుడె యమరును లోవెలి దానుండుచును॥
విఠలునితప్పనే నితరముజూచిన విహితకంఠ్లు తగచెడును।
విఠలునివిన నా నాలికె స్తవనము వేరుగాను చేయదను॥ ౮౧౦.
విఠలునిజెప్పని బ్రహ్మజ్ఞానము విహితముగాదియ్యెడల।
శఠుడుగాక శ్రీవిఠలుని గొలిచిన చనుచుండును భ్రమయు నిల॥
వక్తయు శ్రోతయు విఠలుండేయని వాసిగ గానముచేయు।
రక్తిగ నిటులం జెపుట వినుంగొని రాజు విరక్తిని గొనియు॥
అరుణోదయమున హారతినియ్యగ నవనీపతి లేచుచును।
విరక్తుడగుచును వనమున కేగుచు వేగజూచి మంత్రులను॥ ౮౧౩.
మీరలు నాకడ రావలదనుచును మెలగి దెలుప వారలకు।
వారును పత్రిక నరపతి తల్లికి వ్రాసిరి నగరంబునకు॥ ౮౧౪.
సంగతివినుకొని శిబికనెక్కుచును సరగవచ్చె తల్లియును।
ఇంగితముగ నా తుకారాముకడ కేగి సలిపె దండమును॥ ౮౧౫.
కొంగుజాపుచును బాష్పములొలుకగ కుమారునిమ్మిట నాకు।
రంగుగ నియ్యెడ లేరు వేరుసుతుల్ రాజ్యము నేలుటకొఱకు॥
ఇతనికి పుత్రులు నెవ్వరు లేరిటు యికపై రాజ్యము కొఱకు।
గతిగొని నీతడు విరక్తచిత్తుడై కాననమును దానరుగు॥ ౮౧౬.

వినుకొని తుకయనె రాజు కీర్తనకు వినుటకు నిటువచ్చునెడ।
పనిబడు మాటల కొన్ని జెప్పెదను పండరిపతి కరుణనిడ॥ ౧౧౧.
సాయంకాలము కాగనె నృపుడును చనెను కథను వినుటకును।
నేయంబుగ తుక కర్మమార్గమును నెనరున జెప్పెను యటను॥
భవాబ్ధి తరణంబగుటకు చేయుము బహుసత్కర్మల నిటను।
నివారింపకను స్వధర్మాచరణ నిలుపుము సత్యంబిటను॥ ౧౨౦.
ఇతర ధర్మముల నుత్తమమనుచును నిష్టంబుగ గైకొనినన్।
సతతము నవియును తరణోపాయము సలుపనేరవటు గానన్॥
నీటిని విడిచియు మీనము లెప్పుడు నేతినుండ నిరవగునే।
పాటవముగ సర్వేశ్వరుడుంచిన పద్ధతియగు మనకుననె॥ ౧౨౧.
వేదవచనముల నుల్లంఘించక విహిత ప్రవర్తనమునను।
పాదుగనుండిన పండరినాథుని భవ్యపదము బొందువను॥ ౧౨౩.
పరధనంబులను విషతుల్యంబుగ పరకాంతల తల్లులుగ।
వెఱవక గనితమ వర్ణాశ్రమముల విధిని జరుపుచును రాగ॥ ౧౨౪.
నిజమును బలుకుచు రామనామమును నెనరున జేయుచునుండి।
కుజనుల గూడక సర్వభూతముల గురుకరుణను గనుచుండి॥ ౧౨౫.
సంసారంబున నుండుటకన్నను సాధన మెది లేదనుచు।
హింసయనుచు సంసారము విడిచియు నెలమి యుండతగదనుచు॥
అనేకభంగుల తుకరాం జెప్పగ నవనిపతియు ముదమొందెన్।
పునీతుడగుచును నాలుగు దినములు పోసగనుండి నెళవొందెన్॥

---

నావజిమాలి యనునొకడచ్చట నయముగ హరికీర్తనలో।
భావశుద్ధితో నృత్యముసలుపుచు బహుముద మొందును ధరలో॥
అతిమోదంబును నందరునొందగ హరికి ప్రేమగలిగుండున్।
హితుడై యాతడు పగటికాలమున నేపున మాలలగట్టున్॥ ౧౨౬.

శ్రీహరికీర్తన జేయుసమయమున చెలగు పుష్పమాలలను।
బాహుళ్యంబుగ విప్రులకిచ్చుచు బహునృత్యము సలుపుచును॥
ద్వారకనుండియు నరుసు పండరికి తర్లివచ్చె నరుదుగను।
సారతరంబగు చోద్యముగాదె సరగ మనసు జూడగను॥ ౮౩౧.
ఇటులంజెప్పుచు నవ్వుచు నాడుచు నెలమినుండు తుకయెడను।
పటుతరముగ నొక బ్రాహ్మణుడిదివిని ప్రాతఃకాలంబునను॥ ౮౩౨.
స్నానముకొఱకై మాలితోటకును సరగున వెళ్ళెను యటను।
మానుగ నచ్చట నాతనిజూచుచు మహి యబద్ధమంటివను॥ ౮౩౩.
సరుకువచ్చుటను చూడము మేమును సత్యవచన మదికాదు।
వెఱవక నీవును నధోగతికినిటు వేంచేయుట దగునిందు॥ ౮౩౪.
మాలియు వినుకొని యిదిమొదలుగనే మానెద నటు జెప్పుటయు।
మేలొసగితివని నాలికె బీకియు మిగులప్రేమ నారేయి॥ ౮౩౫.
హరికీర్తనకును నాతడువచ్చుచు నటు దా బలుకకయుండెఁ।
జరిగినసంగతి వ్రాసియుజూపెను జనులకు సరియైయుండెఁ॥ ౮౩౬.
ఆసమయమునొక దోసకాయతో డట్టెవచ్చె నొకకాపు।
వాసిగ తుకరాం ముందరబెట్టుచు వందనమును తగ సలుపు॥
కాపువాని సద్భావముజూచుచు కాయనరికె తునకలుగ।
ఏపున మూటిని తుక భక్షింపుచు నెలమినిడెను యొకటనగ॥ ౮౩౭.
పండితుడచ్చట నుండుచు మాకును ప్రసాదమిమ్మనగాను।
ఖండితముగమీ భక్షణయోగ్యము కాదదియని జెప్పుచును॥ ౮౩౮.
మాలివానికిని సగము తునకనటు మానుగ తానియ్యగను।
వీలుగ నాతడు పలుకదొడంగెను విచిత్రమయ్యెను యటను॥
మిగిలిన తునకను నందర కప్పుడు మేలుగ తానియ్యంగఁ।
ఒగరు చేదనియు యుమియదొడంగిరి యొగి నందరు జూడంగఁ॥
దోసకాయనటు చేదయ్యెండెను తుకారాముడిది నెరిగి।
వేసరిల్లుచును తా భక్షించెను విశేషభాగము తఱిగి॥ ౮౪౨.

నావజి యప్పుడు హర్షాయుక్తుఁడై నటనసలిపె బహుగాను।
భావశుద్ధితో నృపుడును చూచుచు బహుమోదము బొందుచును॥
ప్రసాదమిమ్మనె సుతుని గోరియటు ప్రబల రాజ్యమునకును।
†అసమున తుకరాం కొబ్బెరకాయను యవనీపతి కిచ్చెమును॥
అవనీపతియును దండము బెట్టుచు నరిగెను నగరంబునకు।
సవినయముగ యా తుకారాముడును చనుదెంచెను దేహునకు॥

---

చించవడీలో నివసించినయా చింతామణి యాత్రకని।
అంచితముగ నా దేహుగ్రామమును నరుగుదెంచె మార్గమని॥
తుకారాముడటు జూచియు నతనికి తోడనె దా దండమిడెం।
వికాసమొందగ చింతామణియును విహితభోజనము వేడెం॥
సమ్మతించియా తుకారాముడును చని తన గృహమునకును।
నెమ్మది నొకరికి సరి సామగ్రిని నెనరున దా దెచ్చుచును॥ ౮౪౮.
ఇయ్యగ నచ్చట నతనితోడి ద్విజులితరులకది చాలదని।
చయ్యన జెప్పగ తుకారాముడును సర్వేశ్వరు దలచుకొని॥ ౮౪౯.
సామగ్రిని నే దెచ్చితి కొంచెము జనులనేకుల్ వచ్చిరను।
కామజనక నది పూర్తియగునటుల కరుణ జూడుమి య్యెడను॥
అనుచు వేడగను గుప్తుఁడగుచు హరి యందరికిని సరిపుచ్చెం।
వినతుండగుచును చింతామణియును వింతయు నిదియని తలచెం॥
ఒక రేయంతయు నచ్చటనుండియు నొప్పుగ కీర్తన వినియు।
*వికుర్వాణుడై విప్రశ్రేష్ఠుడు వెళ్ళెను దారిని గనియు॥ ౮౫౨.
మరియొక విప్రుడు జ్ఞానదేవుకడ మహిత తపసు చేయగను।
తిరముగ నాతడు స్వప్నమునందును తెలియబలికె, తుకయెడను॥
పోయితీవేనియు వలసినద్రవ్యము బొందెదవని జెప్పగను।
బాయని ముదమున తుకారాముకడ బరతెంచియు జూచుచును॥

---

†అసము - కీర్తి. *వికుర్వాణుడు - సంతోషముకలవాడు.

కలలోఁగాంచిన క్రమము దెలుప తుక కలవరించుచు బహుగాఁ।
ఇలలో నాకీ యుపాధి యెందుకు యేర్పాటయ్యెను వెలిగాఁ॥
అనుచు జెప్పుచును లోహగామునకు నాతనిబొమ్మనె తుకయు।
ఘనుడగు శివాజి కంసాలుండును కనకమిడును నీకనియు॥ ౯౪౬.
ఇదివిని ద్విజుడును లోహగామునకు నేతెంచుచు నయ్యెడను।
విదితపరచెదా కంసాలునియెడ వెలిగ తుకా మాటలను॥ ౯౪౭.
కంసాలుడు మూడినపకడీలను కరములనిడె ద్విజునకును।
హింసాయతనమీ యినపకడిలు నా కెందుకనుచు దలచుచును॥
మరలి వచ్చుచును రెండు కడీలను మహి యడవిని బడవేసెఁ।
దొరకొని యొకటితో తుకయెడచనిగన $తోడవు స్వర్ణమైవెలసెఁ॥
ఇదిగని తుకయనె నెవరికిజెప్పకు నిచ్చె జ్ఞానదేవుండు।
ముదమున పొమ్మని జెప్పగ ద్విజుడును మునుపటడవి చనిజూడు॥
కడీలరెంటిని యటుదా వెతుకగ కనబడకుండెను యవియు।
కడంగెనింతయె ప్రాప్తంబనుచును గరిమనేగె గృహమునియు॥

---

మూలానదియును భీమానదియును ముడియగూడు స్థలమునను।
వీలుగ నొంటరి పర్వ దినంబున వేంచేసెను తుకయును॥ ౯౬౨.
దారినరణ్యము తగులగ నచ్చట తగులబడెను శ్వానములు।
వారక మనుజుల గఱచి రక్తమును వాసిద్రాగి విలసిల్లు॥ ౯౬౩.
కుక్క లనేకము తుకారాముకడ కెక్కుచు పైని బడంగఁ।
నిక్కముతోడను నతడనె గురగురల్ నిజముగ నాకును లేకఁ॥
మీరలె కోపమునొంది యుందురన మిగుల శాంతమవి గొనుచు।
మేరజూచుచును మొరుగక ధరపై మించియు నుండంగనుచు॥
ఆతడు వెళ్ళుచు సంగమమందును నరసియు స్నానము జేసి।
ప్రీతిగ నచ్చట పండరినాథుని పెంపుధ్యానమున వెలసి॥ ౯౬౬.

---

$తోడవు - భూషణము.

మధ్యాన్నము రాంజణగామునకును మహినరిగెను భిక్షుకును।
విద్యాశీలుఁడు విప్రుండొక్కఁడు వేగ నన్నంబిడెను మును॥ ౭౬౭.
హరిభక్తుండని యెంచుచు తనలో నతిముదమును బొందుచును।
గురుతర ప్రేమను బలికె నాతడును కొడుకొక్కఁడు తనకటను॥
ఎనిమిది వర్షము లరిగినవైనను నేమి యనడు మూగయగు।
గనివ్రతబంధము జేయకయుంటిమి కరుణజూడుమని యడుగు॥
చిన్నవాని తన సమీపమందును చేరబిలిచి తగ తుకయు।
పన్నుగ విఠ్ఠల విఠ్ఠల యనుచును భవ్యంబుగ జెపుమనియు॥ ౭౭౦.
ఇట్టి యనుగ్రహ వచనము తుకయును నేపున దా జెప్పగను।
విఠ్ఠల శబ్దము బాలుడు పలుకుచు వేగబలికె మాటలను॥ ౭౭౧.
మరుదినమచ్చట తుకయు నుండుచును మహి నుపనయనము జేసె।
చిరతరముగనటు పొగడిరి జనులును శ్రీహరి కృపయును వెలసె॥
అచ్చటనుండియు దారిబట్టుకొని యాతడు గృహమేగగను।
హెచ్చినప్రీతిని మునుపటి కుక్కలు యేగెను వెంబడిగాను॥ ౭౭౩.
ఏకాదశినా డన్నముదినకను నెపుడు కీర్తన వినుచుండు।
వీకనునచ్చట నెలతడూరునకు వేంచేసియు తుక యుండు॥ ౭౭౪.
మాలజియనునొక భక్తుండచ్చట మహి వచ్చుచు తుకయెడను।
పీలుగ తనకొక నిత్యనియమమును విహితంబుగ జెప్పమను॥
అందుకు తుకయును భగవద్గీతల నాతనికిని దానిచ్చెఁ।
నందియమొందక సుఖముజెందెదవు చదువుమనుచు సెలవిచ్చెఁ॥
ఆవిధముగనే పారాయణమును నాతడు జేయుచురాగఁ।
భావశూన్యుడగు బ్రాహ్మణుడొక్కఁడు పదపడివచ్చుచు నటుగఁ॥
అపశబ్దంబుగ చదివెదవీవును నదియు నరక మొసగునఁ।
నెపమున మాలజి యది మొదలుగదా నిలిపెను చదువుట గానఁ॥
వికల్పమగునటు జేసియు విప్రుఁడు వేంచేసెను తనగృహము।
సకలరక్షకుడు పాండురంగడును చనెను ద్విజుని కలనుసుము॥

నాదుచిత్తమిటు రంజిల చదువును సాదు మాలజీ గీతయును।
పాదుగ దానిం జెరిపితివీవును బాగుగాదు నీకిటను॥ రారాం.
అతని గృహమునకు వెళ్ళియు నీవును నాతని చదువం జెపుము।
హితమతి నిట్టుల జేయని యెడలను నెలమి శిక్షయగును సుము॥
ఇదిగని బ్రాహ్మణు డుదయముకాగనె యేగెను మాలజి కడను।
సదయుఁడై యనె గీతాపారాయణ సలుపుము యెప్పటివలెను॥
అనుచు జెప్పుచును స్థిరపడనేర్పియు నతను వెళ్ళె తనగృహము।
వినతుఁడై మాలజి విశేషభక్తిని వితలుపైని నిడె దినము॥ రారా३.

---

శ్రీహరి చరితము తుకారాముడును జెప్పెను కవనముగాను।
ఊహను కృష్ణుని బాలలీలలను నుచితంబుగ జెప్పగను॥ రారా४.
మలినముఖముతో కృష్ణునిగాంచుచు మహి యశోద యెత్తెనను।
సలలితపద్యము గనిరామేశుడు సరిగాదని దిద్దగను॥ రారా५.
కలలో కృష్ణుడు నతనికి వచ్చుచు గారవమున దాననియెన్।
ఇలను బాల్యమున మన్నుదింటినే నెలమి ముఖముగ్లానమయెన్॥
అతనుజెప్పిన పలుకులె సత్యం బందుతప్పు లేదనుచు।
ఈతను కలగని యితరులకందర కేర్పడదెలుపుచు మెచ్చు॥ రారా६.
శంకరుని గుడి శిఖరము గనుటకు చనె తుకరామా యార్యున్।
పొంకముగానిరు శిష్యులు వెళ్ళిరి పొసగజెపుచు హరి పేరున్॥ రారా७.
పర్వతాగ్రమున భవుడుండుటచే పయస్సు యటు లేదనియు।
ఉర్విని సాంబున కన్నము బెట్టియు నాగిగిరి నెక్కుదమనియు॥
నలుగురకన్నము నప్పుడుజేసియు నయముగ విస్తరలుంచున్।
ఇలను దిగంబరి యొక్కడువచ్చెను యిటు భోజనమిడు మనుచున్॥
అతిథికి ముందుగ నన్నముంచుమని యప్పుడు తుక జెప్పగను।
హితుఁడై యటులనె బెట్టగ నతిథియు నేపున నంతయు తినెను॥

కడుపునిండతగు భక్షణజేసియు కరశుద్ధిని తానుగొని।
విడెములగొని కల్యాణంబగునని వేంచేసెను యతిథిగని॥ ౯౩.
అన్నము పాత్రలో లేకుండంగని యంగడరిగె శిష్యుడును।
పన్నుగ పాత్రను యీగెలు ముసరక బట్టవేసి మూయుచును॥
సామగ్రినిదా దెచ్చి పాత్రముల సరగ తోమనెత్తించఁగ।
సోమశేఖరుని యనుగ్రహంబున శుద్ధాన్నముగని మించఁగ॥ ౯౪.
గంగాధరుడె యతిథీరూపమున గైకొనెనన్నంబనుచు।
పొంగుచు వారలు జేసిరి భక్షణ పొసగను నచ్చట నుంచు॥ ౯౫.
వెనకను గిరిపై వెళ్ళి శంకరుని విహిత స్తవనము జేసి।
ఘనతరముగ నటు కీర్తన సలుపుచు దినములైదట నిలిచి॥ ౯౬.
దేహుగ్రామంబునకును వచ్చిరి తీరముగ శిష్యులు తుకయు।
శ్రీహరి నామము జెప్పుచు దారిని చిత్తమీశుపై నిడియు॥
ఒక తడవాయిని పద్యము జెప్పెను నొప్పుగ తుక జనులగని।
ప్రకటనామమును జెప్పుచు నడచిన పదోపచేష్టి* యగునుయని॥
ఇదిగని విప్రుండొకడు వినుచుననె యిలలో నిది సత్యమగుఁగ।
విధితో నడవగ హరినామ మనుచు వేసెను ముడి తాడునకుఁగ॥
ఒక వత్సరమిటు జరుగగ నచ్చట నొగి నొక్క గృహస్థునకు।
వికటంబగు నొకబ్రహ్మ గ్రహమున విపులబాధలను కలుగు॥ ౧౦౦.
హరిహర క్షేత్రమునా తడు వెళ్ళియు నారాధించెను తాను।
తెరువుగ గ్రహమును యజ్ఞ ఫలమునకు తెగవెళ్ళెద ననగాను॥
దేశదేశముల గృహస్థు డప్పుడు తిరిగె యజ్ఞ ఫలమునకు।
వాసిగ నెచటను దొరకకుండగను వచ్చెలోహ గ్రామముకు॥
అచ్చట నడుగగ నా విప్రుండును నదివిని యాతని గృహము।
మచ్చికతోడను బిలిచి తాడును మహి జూపుచుననె వినుము॥
నీపయిని గ్రహము వెళ్ళుననుచుదా నేర్పున నొకముడి కోసి।
ప్రాపుగ నీటను ముంచి యాజలము పరగ త్రాగు నటుజేసి॥ ౧౦౪.

*ఇష్టి - యజ్ఞము.

హరినామంబును నేర్పడఁజెప్పగ నపుడే యరిగెను గ్రహము।
కరమరుదుగనే యజ్ఞఫలంబును గలుగుటచేతను సుమ్ము॥ ౯౦౫.
నేమముతో తుక పండరివెళ్లును నెటియేటను నిరుతడవు।
నేమముగాకను శీతజ్వరంబు చేరె మేను నొకతడవు॥ ౯౦౬.
పరమక్షీణమై దేహముండెనటు బలుయుపాయ మేదనియు।
వెలుపును ఖేదము నొందుచునుండగ వేగ ప్రజలు గూడుటయు॥
వెయ్యి చతుశ్శత పతాకంబులును విపులవాద్యములు మెలగగా।
చయ్యన పండరి యాత్రాపరులును చనుదెంచిరియటు వేగగా॥ ౯౦౭.
ఇరువైనాలుగు పద్యములప్పుడు నేర్పడవ్రాసెను తుకయు।
హరి, నీపదముల కరమరలేకను నలయక దండమొసగియు॥ ౯౦౮.
నడవను శక్తియు నాకులేదిపుడు నారాయణ హరి విఠల।
పుడమిని జీవుల జీవధరుండవు పూర్ణబ్రహ్మమగుదువిల॥ ౯౧౦.
నీముఖ పంకజమును నేగనుటకు నెళవులేదు నాకిపుడు।
క్షేమమొసగగను కృపజూడుమునను శ్రీహరి కృష్ణా వినుడు॥
ఉదకము వదలిన మత్స్యంబులకును నునికి గలుగ దిద్ధరను।
మధుహర యటునీ ముఖముజూడకను మహితతాపమొందితను॥
బహుభంగులనిటు పత్రికవ్రాసియు భక్తినిచ్చె వారలకు।
విహితులగుచునటు గైకొని వెళ్ళిరి విఠల విఠలయని సొక్కు॥
పండరిజేరియు బహుభంగుల శ్రీపండరిపతి దలచుచును।
నిండుప్రేమతో భీమానదిలో నిగుడినలిపి స్నానమును॥ ౯౧౪.
శ్రీహరిదర్శన మపుడుజేసికొని జెప్పిరి తుక పద్యముల।
బాహుళ్యంబగు ప్రేమను వినుకొని భగవంతుండయ్యెడల॥ ౯౧౫.
సతి రుక్మిణినిం గనుచును జెప్పెను చనెదమికను తుకయెడను।
హితవున యామెయు యాత్రను విడిచియు నెచటికేగ దగదుయను॥
గరుడుని బంపియు తుకయుని నిచటికి కడగను దెప్పించెదము।
ఇరవుగ నిటులన హరి గరుడునిగని యేగుమనెను దెహుకుసుము॥

శిరమువహించుచు నాజ్ఞను గరుడుడు చేరి తుకను గాంచుచును।
వెఱవక నాపై యెక్కిరమ్మనుచు విఠలునాజ్ఞ దెలుపగను॥ ౯౧౮.
తుకారాముడును యారు వెలపలను తొక్కులాడుచును నుండెన్।
ప్రకాశమగునటు గరుడుని పలుకుల బాగుగవిని కొనియాడెన్॥
దండముబెట్టుచు గరుత్మంతునికి దరిద్రు హీనుడ నీపై।
ఖండితముగ నేనెక్కనెప్పుడును కటాక్షింపుము నాపై॥ ౯౨౦.
అచటికరిగి నీవిచటికి హరిని ననుపుగ దెమ్మని వేడన్।
ప్రచితంబుగ వచ్చెను గరుడుండును పండరిపతికడ జాడన్॥౯౨౧.
దేవరవారిని యటురమ్మనుచును తెలియబలికె నా తుకయు।
భావబంధమున నాపై నెక్కడు భక్తినిష్ఠ నను గనియు॥ ౯౨౨.
ఇటులంజెప్పగ యాత్రాపరులును నేపున నుండుచు గుడిని।
పటుతర పూజల సలిపియు హరికిని బరతెంచెద మనగవిని॥౯౨౩.
భగవంతుండనె వెంబడె వచ్చెద పరగ జెపుము తుకయునకు।
విగతమోహులై సాగిలిమ్రొక్కియు వేవచ్చిరి దేహునకు॥౯౨౪.
తుకా రాముడటు నిక్కిచూచుచును తొందరొందె నయ్యెడను।
వికాసమొందగ యాత్రాపరులును వే వచ్చిరి తుక యెడను॥౯౨౫.
పండరినాథుడు వెనకవచ్చునని బలుకగ వారయ్యెడను।
నిండు ప్రేమగొని తుక హరిరాకను నెఱీ జూచుచునుండగను॥
గరుడుని మూపున శ్రీహరి యప్పుడు గారాబముతో రాగన్।
అరమరలేకను తుకారాముడును హరికిని వందనమొసగన్॥ ౯౨౭.
శ్రీహరి యాతని చెయినిబట్టుకొని చేరవచ్చె తుక గృహము।
బాహుళ్యంబగు ఆకలెత్తెనని ప్రసాదమిమ్మనె సుమ్మ॥ ౯౨౮.
సతిని గాంచుచును తుకరాం బల్కెను సరగచేయు వంటయని।
ఇతరములెవ్వియు నెంచకమదిలో నెలమిచేయు హరికియని॥
వంటయు ముగిసిన వెనకను యాసతి వడ్డించెను విస్తరల।
జంటను శ్రీహరి భక్షణజేసియు చనె దారిని నయ్యెడల॥ ౯౩౦.

---

తుకయుని కీర్తన విని యొక విప్రుడు తుచ్ఛంబని జెప్పుచును।
ప్రకటితమగు వివేకసింధువను బలుగ్రంథము జూచుచును॥ ౯-౩౧.
దేవుడు తనలో నుండగ నెప్పుడు తిరుగుటేల యటనిటకు।
నావుడు తుకయున కిదిదెలుపుదమని స్వయువచ్చె దేహునకు॥
నదీతీరమున తుకారాముడును నామభజన చేయంగా।
నిదానముగనే బ్రాహ్మణుడచ్చట నెనరున కూర్చుండంగా॥౯-౩౩.
వందనమొసగుచు నొకరికొక్కరును వచ్చిన విప్రుడు బలికా।
గ్రంథంబొక్కటి ముకుందరాజుచే గల్పింపంబడి వెలిగా॥ ౯-౩౪.
వివేకసింధువు యను నాకృతియును వినుపించెద నీకిటను।
నవీనయర్థము నీవుగాంచెదవు నయముగాను నీవు విను॥ ౯-౩౫.
ఆతనిమన్నన జేయుటకై తుక యటులనె కానిమ్మనియు।
పాతబొంతనటు ముసుకు వేసికొని పరగకన్నులను మూయు॥
చరాచరంబుల జూచినయెడలను చలనమగును తనమనసు।
పరాకులేకనె విని యెదననుచును బ్రాహ్మణుముందర నుంచు॥౯-౩౬.
పుస్తకమాతడు చదువగ తుకయును పొందియుండు మౌనమును।
విస్తరింపుచును నర్థముజెప్పెను విశదంబుగ జామమును॥ ౯-౩౭.
అలసటజెందుచు బ్రాహ్మణుడప్పుడు నతని ముసుకుతియ్యగను।
విలసితముగదా చెవులమూసికొని వినకుండెను గ్రంథమును॥
ఇదిగని విప్రుడు వ్యర్థశ్రమనే నిదివరకును జెందితిని।
పదపడివచ్చితి దూరము నడచియు బాగుగ నిది విందువని॥౯-౪౦.
ఇదివిని తుకయుం డేర్పడజెప్పెను నీశునిభక్తిని వీడి।
సదమలమగునీ బ్రహ్మజ్ఞానము చప్పదనముచే నిగుడి॥ ౯-౪౧.
విక్షేపించును దాస్యరసంబని విన సరిపడకుంటినను।
లక్షింపగ ప్రజల్ జగత్తునంతయు లలితబ్రహ్మంబనుచును॥ ౯-౪౨.
గర్వాగర్వాకును కలతలబొందుచు ఘనయాశల నుండుదురు।
దర్పున మాటకు చోటులేదనియు తలుచుగ నిర్గుణమందురు॥

దేహముండు పర్యంతము నిచ్చట దేవుడు భ క్తుండనుచు।
ఊహను మర్యాదుంచుట తుకయనె నుచితంబగునన వినుచు॥
అనుభవమయ్యెను, విప్రునకప్పుడు హరిసర్వాత్ముని తెరువు।
చనువున జేసెను శ్రీహరిభ క్తియు చదువుచు పూర్వులనెళవు॥

---

తుకారాముడును లోహగామములో దురుసుగ కథజేయుచును।
ఒకానొకప్పుడు స్నానముజేసెను నుప్పునీటి నూతీనను॥ ౯౮౬.
తియ్యటినీరై వెలసెను బావియు తీరుగ నటు మొదలుగను।
చయ్యన శ్రీహరి దాసు స్పర్శమున సరిసిద్ధియు కనబడెను॥ ౯౮౭.
ఆయూరందును బ్రాహ్మణుడొక్కడు నతిభ క్తిని తుకయెడను।
డాయుచు శాస్త్రిముచక్కగ నెరుగుచు డస్సిగృహమువిడుచుచును॥
ఏకభ క్తితో శ్రీహరిభజనను నిమిడియు నుండంగాను।
జోకను నాతని భార్య సురూపియో చూపట్టె విరోధమును॥
తుకారాము తన పతిని చెడిపెనని దుర్బుద్ధిని తాగొనుచు।
సుకరము నొందని దోసకాయలను చొప్పున తాగైకొనుచు॥
భోజనమొసగుట కొఱకు తుకయుని పొసగబిలిచి నింటికిని।
ఓజను నచ్చట దోసకాయలను నొనరనిచ్చె తినుముయని॥ ౯౪౦.
సంతోషముతో వానితీసికొని సరగున తుక భక్షించెన్।
వింతయగునటుల రసనేంద్రియమును వెలయగ తాను జయించెన్॥
చేదని తెలియక భక్షణచేయుచు శీఘ్రంబున తావెళ్ళెన్।
పాదుగ నామెకు గుల్మవ్యాధియును ప్రబలమగుచు విలసిల్లెన్॥
చికిత్సలేనోకి జేసినసైనను చెడుకర్మంబగుటచే।
ప్రకర్షణమొందుచు వ్యాధియు బోవక బహుకష్టంబటు వెలసె॥
భావికుడగునొక విప్రుడు తుకయుని పరగబిలిచె భక్షణకు।
శ్రావణ సోమవారవ్రతంబును సలుపుచు ప్రీతిని మెలగు॥ ౯౪౪.

భార్యయు భర్తయు తుకారాముతో భక్షింపుచునుండగను।
కార్యసిద్ధికిని కలతలగునటుల క్రమదీపము వెలుగకను॥ ౯౫౬.
చమురుతక్కువై మలగిపోవునటు జనులును గనుచుండగను।
సుమహితుడగునా విప్రుడు భార్యను చమురును తెమ్మనగాను॥
సతియు బలికెనటు గృహములోపలను చమురింతయు లేదనుచు।
విదితపరచె పతి బాజారునతగ వేదెచ్చెద రమ్మనుచు॥ ౯౫౭.
బహుదూరంబున బాజారున్నది పనిబడదటు బోవుటకు।
సహచరులగునా సతిపతులిట్టుల చనువున జెప్పదొడంగు॥ ౯౫౯.
పాత్రమునందును నూనెయుండునని పలుకగ తుకయుండపుడు।
నేత్రముతో సతి పాత్రనుచూడగ నిండుగ నూనెయునుండు॥
ఇదిగని మోదము జెందిరి వారలు నెలమి భర్త భార్యయును।
సదమలుడు తుకారాముని తోడను సరగ భక్షించిరిమును॥ ౯౬౧.
చదువుశాల యొకటుంచెను యూరుళో శకటమొకటి యటనుండె।
కుదురుగ నచ్చట తుకారాముడును కూర్చుండుచు దానుండె॥
అనపకాయ బుఱ్ఱను గొని యొక్కండాడుచుండె తుకయెడను।
చనువున నాతం డేమి వలయునని సరగ నడుగ వాడటను॥ ౯౬౩.
ఇనపగుదపనటు రాత్రిపైనినిడి యిరవుగ జెప్పెను నతడు।
దినమునునే నీగ్రామము తిరిగితి తీరుగ నొకనెల గనుడు॥ ౯౬౪.
సొరకాయ బుఱ్ఱ నిండలేదనియు సుఖముగ దా నాడగను।
కరమున తుకరాం ముట్టగ గుదపయు కాంచనమయ్యెను యటను॥
అమిత మోదమును నాతడు బొందుచు నట్టెవెళ్ళె తనచోటు।
సుమహిత చిత్తులై లోకులు తుకయుని సూటిగ పొగడిరి నీటు॥

---

పురోహితుండా యూరున తుకపై పూర్తి ప్రేమ నుంచుచును।
నిరాటంకముగ వచ్చుచు కీర్తన నెనరున వినుచుండు మును॥

ప్రతిదినమును తా దప్పక నచటికి బరతెంచుచు కథనువిను।
అతని సుతుండును నతిజాడ్యముచె నలసియుండె నొకయెడను॥
జాముర్రాత్రిలో కలగిన మనసున చనెకీర్తనకా నాడు।
యేమరునటు సతి శిశువు గృహంబున నెలమి చావగనుచుండు॥
తల్లియు శవమును చేతినందుకొని తర్లివచ్చె తుకయెడను।
తెల్లంబుగ తా నేడ్చుచు బలికెను దేవుని భక్త్యుండినను॥ ౯-౨౦.
ఈ శిశువును లేపుము లేనియెడల నిదియును డాంబీకంబౌ।
వాసిగ నాపతి నిను గన నాపదల్ వచ్చుట నాకధికంబౌ॥ ౯-౨౧.
ఇదిగని తుకయును కనుల మూసికొని నెలమినుండె ధ్యానమున।
కుదురుగ నటు కొంచెము సేపుండుచు గుఱిగా నందరునువిన॥
పురాణపురుషా పాండురంగ హరి పూర్వము భక్తుల కొఱకై।
సరాళముగనటు చేసిన చర్యల చక్కగజూపుము నాకై॥ ౯-౨౩.
అని బహుభంగుల హరిని భజింపుచు నార్తిని కన్నీరొలుకగ।
పనిబడి శ్రీహరి వచ్చిచెప్పెనటు పలుకుము నామము జోకగ॥
సావధుడగుచును తుకారాముడును సభజను లందర గనుచు।
భావశుద్ధితో విఠల నామము భక్తిని జెప్పండనుచు॥ ౯-౨౫.
తెలియ బలుకగను సకల జనంబులు తేటను విఠల విఠలని।
విలసిల్లంగను చెప్ప దొడంగిరి విహితులగుచు తాముగని॥ ౯-౨౬.
ఆసమయంబున నచ్చట విస్మృతి యందరకును తగ నెగడు।
వాసిగ బిడ్డకు ప్రాణము వచ్చుచు వడిగలేచి కూర్చుండు॥ ౯-౨౭.
ప్రేమతో శిశువును భజన జేయగను పెనగి తల్లి ముదమొందె।
సేమముతోడను హరినామంబును నెఱియజేసి యింపొందె॥ ౯-౨౮.
రెండు యామముల రేయి వెలసె నీరీతిగ నటు జరుగగను।
దండ కమండలములతో వచ్చెను ధర శ్రీపాదస్వామియును॥
ముందుగ కూర్చుండగను తుకరాం ముఖ్యము హరినామమును।
సందియ మొందక సారతమంబగు సారంబె వెలయునను॥ ౯-౩౦.

సకల కర్మముల కాదిని శ్రీహరి సరినామమె చెప్పబడుఁ।
ప్రకటంబుగ నా కర్మాంత్యంబున పద్మాక్షుండె తలపబడుఁ। ౬౮౧.
నామమె బ్రహ్మము నామమె కర్తయు నామమె సకలము నెందు।
నామమె గతియౌ నరులకు నిలలో నయముగ మీరలు నసుడు॥
అనుచు జెప్పుచును విఠల విఠల హరి నారాయణ యనుచు।
మనుకొని గర్జన చేయుచు తుకయును మాధవు పేరనిపించు॥
శ్రీపాదులునటు శూద్రుని ముఖమున శ్రీహరికథ విన తగదు।
ఏపున యిట్లని వెళ్ళి పునహాకు నిలనధికారికి ముందు॥ ౬౮౪.
కర్త మార్గమును ముంచెను తుకరాం కలిలో విపరీతంబౌ।
నిర్తమత్వమును నామ మహిమనటు నెఱిజెప్పుట విఘ్నంబౌ॥
బాపనవారలు దండమిడుదురని ప్రభువునకటు జెప్పగను।
ప్రాపుగ నతడనె సుస్థిరమతివై బరగుమనుచు జెప్పుచును॥
పిలిచెద నేనిటు తుకారామునిఁ పిర్యాదును నరయుచును।
వలసిన వారికి శిక్ష జేతునని వ్రాసె పత్రిక ద్విజులకును॥ ౬౮౭.
ఏబది రూపాయిల దండుగయని యొలమి బంపె సేవకుని।
గాబర నొందిరి ద్విజులాయూరున ఖడ్గపాణి జవానుగని॥ ౬౮౮.
సంకటపడుచును దండుగవిషయము సరగున తుకయెడ రాగఁ।
బింకమునొందక తుకరాం బలికెను ప్రియ హరి మనకుండంగఁ॥
భయమేమున్నది దండుగరూకలు ప్రభువుముందు నుంచెదము।
నయమున నిట్లని యందరరిగిరటు నామమనుచు పున పురము॥
నదీసంగమ మగుచోటను తగ నయముగ తుకరాం దిగియు।
సదానందమున స్నానముజేసియు సలుపుచు పూజల మరియు॥
తాళము వీణెయు మృదంగములతో దామోదరు బాడగను।
వీలుగవచ్చిరి యమితప్రజలును విహిత కానుకలతోను॥ ౬౯౨
అశేషజనములు తుకారాముగన నట నరుగుట ప్రభువినియు।
విశేషప్రీతిని పండ్లు పుష్పములు వేగమె గైకొని చనియు॥ ౬౯౩.

సన్న్యాసియునవు డడ్డగించుచును చనుటయు సరికాదనగన్।
అన్యోన్యంబుగ లోకులతోడను నాతనిగని యేమరకన్॥ ౯౯౮.
పట్టణమునకును వేంచేపించియు ప్రభు విచారణ చేతునని।
దిట్టముగా తావెళ్ళి దండముల దీర్ఘంబుగ నుంచెగని॥ ౯౯౯.
మాధవు కీర్తన తుకారాముడును మధురముతో బాడగను।
ప్రీతిని ప్రభువును కూర్చుండుచు విని పెంపుజేసి యద్యెడను॥
ఆసమయంబున పురుషుండొక్కం డత్యుజ్జ్వల రూపముతో।
వేసియు వేషము దిగంబరుండై విభూతి చర్చితాంగముతో॥
తుకయెడవచ్చియు దండముబెట్టుచు దురుసుగవెళ్ళెను త్రోవ।
ప్రకటంబుగనిది ప్రజలందరుగని ఫాలనేత్రుడని ప్రోవ॥
దత్తాత్రయుడని కొందరుజెప్పిరి తనివిని తుక కీర్తనము।
సత్తాధారక మగునటు సలిపియు చాలించెను యటు సుమ్ము॥
ప్రభువు తుకనుగని నగరము రమ్మని ప్రార్థించుట తానుగని।
విభవంబున నటు వెళ్ళెను తుకయును వే ప్రభువును గూడుకొని॥
నగరవాసులగు సాహుకారులును నాటిదినము తుక కొరకై।
ప్రగల్భముగనటు రెండువేల ప్రజ భక్షణ జేసిరి బాగై॥ ౧౦౦౦.
మూడవ జామున కీర్తన జేయను ముందుగ తుక నిలుచుండె।
వేడుకతోడను జనులనేకులును వినవచ్చిరి వెనకుండె॥ ౧౦౦౨.
శ్రీపాదుల నటు ప్రభువు బిలిచియనె చేయుము వాదంబికను।
ఏపుమీరగను యోడిన వారల నిపుడె జేతు శిక్షయును॥ ౧౦౦౩.
కొందరు కుటిలుల గూడివచ్చిరటు గురుతుగ సన్న్యాసులును।
సందియ మొందక తామె గెలుతుమని చాల నమ్మియుండగను॥
హరినామము తుక గర్జన జేయుచు నారంభించెను కథయున్।
గురుతుగ కాయము నిశ్చయమనుచును గురిగొనకుండగవలయున్॥
నిమిషనిమిషమును కాలుండుగ్రుడై నెఱి నాయువు భక్షించు।
అమితము గనుపడు దృశ్యము సకలము నంత్యము గలదగునను చు॥

శ్రీహరి భజనను చేయక యుండిన సిద్ధమగును మరణంబు।
మోహ మమతలును మానవు భువిలో ముంచంబడును సుఖంబు॥
హరినామమె యీ కలియుగమందును నధిక సారమై యుండు।
తిరముగ దానిం జేసిన యెడలను తీరును భవభ్రమ మెండు॥
అనేక భంగుల నిటులం జెప్పుచు హరి పరతంత్రత నుండగ।
వినీతులగుచును సన్యాసులుగని వేగమె దండంబులిడగ॥ ౧౦౦౯.
అధికారుడు గని యిది యేమనగను నందుకు వారిట్లనిరి।
సుధీరుడగు తుక శ్రీహరి రూపున సూటిగ కనబడె మీరి॥ ౧౦౧౦.
ప్రభువు వినుంగొని శిక్షార్హులరై బరగితిరిటు మీరలును।
సభికులగని ఖరముల నెక్కించియు సరగ వెళ్ళగొట్టుమను॥
తుకారాము కథ ముగియ జేయుచును దుఃఖితుడగుచునునవెను।
ప్రకారనియతియు కాదు శిక్షయని బహుభంగుల వేడగను॥
అధికారియునటు శిక్షను మాన్పుచు నాతనికొఱకై యటను।
విధితో జాబును వ్రాసె రాజునకు వేసంగతి దెలుపుచును॥
శివాజి నృపుడును పత్రిక చూడగ శీఘ్రంబుగ వచ్చుచును।
భవాబ్ధి తరణో పాయంబనుచును పరగబెట్టి దండనును॥ ౧౦౧౪.
హరిదిన మైనందున కీర్తన తుక యారంభించెను నాడు।
పరిపూరితమై వెలసెను సుఖమును భక్తిగ వినియెను నృపుడు॥
పరచక్రంబటు శివాజిరాజును బట్టవలయునని తలచి।
తెరువున నాతడు కథను వినంగని దేచ్చి సేన చుట్టించె॥ ౧౦౧౬.
విశాల మగునొక యింటను హరికథ వినుచుండిరి బహుజనులు।
నిశీవేళలో తురకల సేనయు నెఱియ చుట్టుకొనిరిల్లు॥ ౧౦౧౭.
అవనీపతి గని బోవుటకొఱకై యాజ్ఞను నిమ్మనగాను।
సవినయముగ నా తుకారాముడును సర్వేశ్వరు నెంచుచును॥
నాదు చావునకు భయపడ నిటు పర నరులబాధ గనలేను।
నీదు నిలకడ విక్షేపము నొందిన నే జచ్చినగతి యగును॥ ౧౦౧౯.

లాఘవమున నీ విఘ్న కారణము లయించు హరి యన జూడఁ।
మేఘశ్యాముడు శివాజి రూపును మేలుగ దాల్చెను జూడఁ॥
గురుతుగ రాజును బట్టవలయునని గూడిచూడ తురకలును।
వెఱవక శ్రీహరి వారిమధ్యలో వేంచేయుచు త్వరలోను॥ ౧౦౨౧.
వారల కెదురుగ నురుకగ నొక్కడు చారుడు వేగులవాడు।
తీరుగ నితడె శివాజి రాజుయని ధీరత జెప్పగ, వెనకుండు॥౧౦౨౨.
సకల సేనయును నాతని బట్టను చనిరి యురికి వెంబడిని।
ఒకయెడ శ్రీహరి ప్రకటంబగుచును నొకయెడ నగుపడక గని॥
సమీపముననే యున్నటులుండును సరగనిడుద మనగాను।
రమానాథుడును నురుకును వెంబడి రచ్చగొనిరి తరకలును॥
ఈ విధమున యా సేనను జామున నిరువైకోసు లీడ్చుచును।
తావు దెలియకను చీకటి వేళను తల్లడిలిరి యడవిలోను॥ ౧౦౨౩.
కంటకములచే బట్టలు చింపులై కాళ్ళకు దాకెను యవియు।
బంటుతనంబున హరి యదృశ్యుడై బరగెను తగ నెళవయ్యె॥౧౦౨౪.
శ్రీహరి కథ యా తుకారాముడును చెదరకనటు చేయగను।
ఊహలకు మించిన యానందంబును నొప్పగ గని రందరును॥
పరచక్రంబగు సేనయంతయును పరుగిడెనని రాజు విని।
వెఱవక నాతడు సాంగంబుగ కథ వినెనటు భయమును మాని॥
అరుణోదయమున హరతులియ్యగ నవనీపతి దండమిడెఁ।
హరిభక్తులతో సంగము కలుగగ నాపదలును పోయివిడెఁ॥
అనుచును నృపుడును ప్రసాద మడుగగ నతడు దోశెడు లద్దిచ్చెఁ।
వినతుడై నృపుడు దానిం గైకొని వెలిని దుకాణము నుంచెఁ॥

---

వెనక తుకారాం లోహగామునకు వేంచేయగ తగనచటఁ।
వినతిని కొండోబ వచ్చుచు నతనెడ విశ్వనాథునిం జూడఁ॥

కాశికి బోవలె ఖర్చుకు లేదని కరుణ జూడుమని యడుగ।
ఆసనమందలి మొహూరి యొకటి తుక యపుడె తీసియియ్యంగ॥
చాలదు యిదియని కొండోబ జెప్పగ చక్కగ ప్రతిదినమునను।
వీలుగ ఖరుచు చేసి యొక పైసను వెనక నుంచుకొను మనెను॥
మరుదినమున నది మొహూరీయగునటు మహి జెప్ప కితరులకని।
గురుతుగ జెప్పగ నతడు పరిక్షను కోరిజేసెనచటగని॥ ౧౦౩౪.
చెప్పినవిధమున నగుచుండంగను చెందెను మోదము తాను।
ఒప్పుగ తుకరామాజ్ఞను నాతడు నొగి ప్రయాణ మగుటయును॥
అప్పుడు తుకయును మూడుపద్యముల నచటికి వ్రాసియునిచ్చె।
మెప్పుగ గంగకు విశ్వనాథునకు మెలగి గయకు పంపించె॥౧౦౩౬.
దారినడచుచును సత్పాత్రంబున తగుద్రవ్యమును చేయుచును।
తీరుగమళ్ళియు రాగ తుకారాం తిరిగిమ్మనె మొహూరీను॥
ఇటులం జెప్పగ కొండోబ తుకయున కేపున వందన మిడుచు।
పటుతరముగ ననె జేరితి కాశిని పాదచారిగ నడచుచు॥ ౧౦౩౭.
గంగాస్నానము జేసియు తగనటు గంగను గని నేనంటి।
భంగము లేకను సకలతీర్థముల పావనత్వ జగజెట్టి॥ ౧౦౩౮.
చీటినిబంపెను తుకారాముడన చేజాచెను గంగయును।
పాటవముగ తగు కటక కంకణల ప్రబలకాంతి మెరయగను॥౧౦౪౦.
ప్రజలనేకులటు చూడగ నప్పుడు భాగీరథి వచ్చెనని।
సుజనులు చేతిని బెట్టిరి డబ్బులు సూటి రవికె చీరలని॥ ౧౦౪౧.
ఎన్నియిచ్చినను హస్తము వెలపల నేర్పడి యటనుండగను।
పన్నుగ నేనటు పత్రికనియ్యక భాగీరథి చేకొనెను॥ ౧౦౪౨.
హస్తమును గంగ గుప్తముజేసెను నటువెనకను తగనేను।
స్వస్తిజెప్పుచును విశ్వనాథునెడ చదివితి నీ పద్యమును॥ ౧౦౪౩.
పురహరుడప్పుడు బిల్వదళంబును పొందుగ్గ తానియ్యగను।
కరములగైకొని నేనటు వెళ్ళితి గయావర్తనమునకును॥ ౧౦౪౪.

పిండము వేయుచు విష్ణుపాదమున ప్రేమను మళ్ళితి తిరిగి।
కొండొబ యిట్లని తుకారామునికి కొనియాడెను తగ వెలికి॥
ఆతండిచ్చిన మొహరీచేతను నన్నుమిడె ననేకులకు।
నీతిగదానిం దిరిగి తుకయునకు నెనరున తానిచ్చుటకు॥ ౧౦౪౬.
మనసురాకదా తుక్కయెడజేరియు మహితానందముతోను।
వినతుడై దండము బెట్టియు సంగతి విన్నపించె నయ్యెడను॥౧౦౪౭.
మొహరీనిమ్మని తుకరామడుగగ ముదమొందక తానటను।
సహనముతో దా బోగొట్టితినని చక్క జెప్పెనయ్యెడను॥ ౧౦౪౮.
ఇందుకు తుకరాం మంచిది యనుచును నేర్పడజెప్పగ నితడు।
అందముతోడను నింటి కరిగి గన నరయ మొహరి లేకుండు॥
గుడ్డకు వేసిన ముడియు నట్టులనె గుటీనుండగ మొహరీయు।
ఒడ్డగిలుచునటు కనబడకుండెను నొగి వింతను తగ గనియు॥౧౦౫౦.
అణుమాత్రంబగు యాశయులేకను నల తుకరాం వర్తించు।
అనుమానించక యల్పాహారమె హరినామముతో గొనుచు॥
శ్రీహరిభజనను విడనాడకదా చేయుచు నెప్పుడునుండు౯।
ఊహను కీర్తన రాత్రికాలమున నొప్పుగ చేయుచునుండు౯॥
ఒకదినమందును కీర్తనవేళలో నుపరతి సుఖమొందగను।
సకలజనంబులు తటస్థులగుచును సౌఖ్యోన్నతి నుండగను॥౧౦౫౩.
దివిటీమలిగెను తుకయుని మేనున తేజంబును గలుగగను।
దివిటీవలెనె యది ప్రకాశమానమై తేజరిల్లె సొంపుగను॥ ౧౦౫౪.
కథ ముగియంగను తుకారాముడును కడగొని కూర్చుండంగ౯।
విదితమయ్యెనటు చీకటియప్పుడు వెల్చిరి దివిటి బాగ౯॥ ౧౦౫౫.

---

నామస్మరణేల్లా జిహ్వారమించెను నయముగ తుకరామునకు।
నేమముతోడను నాతనికాయము నిర్వికారమై సొక్కు॥ ౧౦౫౬.

ఒకచోనుండక యెవరికిజెప్పక యొప్పుగ నడచును తానె।
నికటంబగు నరు లెటుబోయెదవన నే వైకుంఠమే గెదనె॥ ౧౦౪౭.
ఇటులంజెప్పుచు బోవుచునుండును యిష్టమైన తగుచోటు।
పటుతర శిష్యులు పదునాల్గురు మరి బలుగ వెతుకుదురు నీటు॥
అధికమాన్యతయు నవనిజనముచే నాతడు తగబొందగను।
సదయుండెవరికి జెప్పక వెళ్ళను సరగ దేహుగ్రామమును॥౧౦౪౯.
పాండురంగని గుడిలోగాంచుచు బాష్పాకులుడై యనియెన్।
తాండవమును నే ధరణిని జేసితి తక్కువనక సరియయ్యెన్॥౧౦౫౦.
మహాత్వమాన్యత లధికములయ్యెను మహినుండుట సరిపడదు।
విహగవాహనా వైకుంఠమునకు వేగమె జేర్చుము యిందు॥౧౦౫౧.
భగవంతుండును పలికెను నవ్వుచు పరగ నటులజేసెదను।
విగతభయుడవై యుండుము కాలుడు వీక్షింపడు నిన్నిటను॥
ఇదివిని తుకయును కన్నీరొలుకుచు నీశు భజన నుండుచును।
కదలిక నరిగెను నాళందీకిని జ్ఞానదేవు గనుటకును॥ ౧౦౫౩.
అజానవృక్షపు తలమున పక్షులు నరసి మేతగొనగాను।
సుజనుడు తుకయటు బోవగ నవియును సూటిగ నెగురంగాను॥
సదయు తుకారాం జూచుచు చిత్తము సమత్వమొందిన యెడలన్।
విదితంబుగనీ పక్షులు బోవునె వే ననుగని యిర్యోడలన్॥ ౧౦౫౫.
అరిషడ్వర్గము లణచియు నేనును నాత్మభావన జగమెల్లన్।
వెఱవక జేసియు వ్యర్థమయ్యెనో విహగ మేల నెగిరె నిలన్॥౧౦౫౬.
ప్రేతమువలె తన శరీరమయ్యెను పెకలె దేహభావమును।
ఖ్యాతివిరాగము బట్టి దేహమును బ్రహ్మాగ్నిని వేల్చగను॥ ౧౦౫౭.
పండరినాథుని చరణములందును పగిలె దేహభాండంబు।
ఖండితనామము రూపంబులనే కరిగించితి నిరతంబు॥ ౧౦౫౮.
ఆయుర్దాయపు కొలతమిగులగను నదియె రక్షణ కిరవయ్యె।
ధీయుతుడు హరి వెలిగించెను మేనున దీపంబును తానయ్యె॥

ఇటులైయుండిన వన్నియువ్యర్థమై యేర్పడె నాకిటు సుమ్ము।
పటుతరముగనె ప్రార్థించెదశ్రీ పాండురంగ హరివినుము॥ ౧౦౭౦.
అనాధనాథా కేశవాచ్యుత యల కన్నులు గలిగియును।
వినీతునగుచును, అంధునిగానే వేరుత్రోవ చనకయును,॥ ౧౦౭౧.
పరమార్థంబగు మార్గమునందును బాగుగనే నడవగను।
ఇరవుగానియొక యడ్డదారిలో నిడితినేమొ పాదమును॥ ౧౦౭౨.
సంబోళింపుము హరివిఠలయని సన్నుతింపుచును మరియు।
*అంబకములదా మూసి నిశ్చలుడై యమితప్రీతి నుండుటయు॥
హరికృపచేయగ పక్షులన్నియును నతనిపైని వ్రాలుచును।
వెఱవక తుకయును కదులుచుండినను విడువకుండు శరీరమును॥
ఇదిగని తుకరాం సర్వభూతముల నెఱిసామ్యత నిప్పుడును।
ముదమున గాంచితియని దండంబిడె ముని జ్ఞానదేవునకును॥
వెతుకుచు శిష్యులు రాగను నచటికి విహంగంబులట నెగిరెగా।
సదయుడగుచు తుక కీర్తనజేసెను సకల ప్రజ వినజేరెగా॥ ౧౦౭౬.
అచ్యుత నరహరి కష్ణా కేశవ యాదిపురుష గోవింద।
సచ్చిత్సుఖమయ సర్వేశ్వర నను సంరక్షించు ముకుంద॥ ౧౦౭౭.
కనికరముగదా జ్ఞానదేవునిగా కవితల నటుబాడుచును।
వినీతుడగుచును నుదయవేళలో విధినిహారతి నిడుచును॥ ౧౦౭౮.
ద్వాదశి దినమున పారణజేయుచు తర్లివచ్చె దేవునకు।
సాదరమున చింతామణిదేవుడీ సంగతివినుకొని బాగు॥ ౧౦౭౯.
మనుజునిబంపెను తనకడనుండియు మహిని తుకను బిలుచుటకు।
అనువుగ నాతడు వచ్చి తుకాకడ హరిగుణ కధవిని సొక్కె॥
మనుజుడు తిరిగియు రాకుండంగని మహి చింతామణి తర్లెగా।
అనువుగ తుకయుం డిదియు గనుంగొని యాతని కెదురుగ తర్లెగా॥
నడిదారిని వారిరువురు చేరగ †నతి నిడె చింతామణియు।
విడువక తుకయును నాతని పదముల వేబట్టెను తాగనియు॥

---

*అంబకము - నేత్రములు. †నతి - నమస్కృతి.

ఆలింగన మిరువురును జేసికొని యట నొకయెడ కూర్చుండి।
కూలంకషమై ప్రియ వచనంబుల కోరియు బల్కిరి గూడి॥ ౧౦౪౩.
చింతామణియును జెప్పె తుకయునకు చిరఖ్యాతిని నీవిలలో।
వింతయగునటుల నొందితి వెచటను విఠలుడు వశముండుటలో॥
మనుజచర్యలకు మించియున్నది మహిమయు భువిలోననుచు।
అనువుగ నెవ్వడ వీవని యడుగగ నా తుకరాముడు గనుచు॥
తొడను కత్తితో గోసియు చీరగ దూదియుంచె నందుననును।
పుడమిని మాంసము నెత్తురు లేదని బొందెను వింతయునతను॥
దండము బెట్టగ తుకారామునకు తగదనుచును దాసుడని।
నిండు ప్రేమతో నితడు దండమిడె నెతెని చింతామణికిని॥ ౧౦౪౭.
చించవడీకిని వెళ్ళియు నచ్చట జేసెను కథ మధురముగా।
అంచితముగ తా మూడు దినంబులు నచ్చటనుండియు బాగా॥
తిరిగియు దేహూ గ్రామము వచ్చుచు ధీరత భజనలో నుండు।
అరమరలేకను హరిభావనతా నమరంగైకొని యుండు॥ ౧౦౪౯.
దేవుడొక్కడే రెండు భాగముల దెలుపును సుఖవిశ్రాంతీ।
భావభక్తుడై భగవంతుండై పరగజూపెదా జగతీ॥ ౧౦౫౦.
శ్రీహరి తుకయుని వైకుంఠంబున జేర్చవలయునని దలచి।
మోహము జగతిపై యతనికున్నదని ముఖ్యత నది వెడలించి॥
ఉపాయముగనే వైకుంఠమునకు నొసగ దెత్తునని యుండె।
అపార ప్రీతిని లోహగాము నరులా తుకరాం గొనియుండె॥
సంపన్నత్వము చాలనొందిరటు సకల జనులు గ్రామమున।
సొంపుగ తుకరాం భజన వినుటచే సుకృతంబుల మరిగిరన॥
మాసము వరకును నచ్చట తుకయును మహికీర్తన జేయుగను।
వాసిగ నచ్చట పరచక్రంబును వచ్చియునటు కొల్లగొను॥ ౧౦౫౪.
తెలివిని కొందరు నష్టంబునకును దిగులొందక యుండిరటు।
పలుమరు యేడ్చిరి కొందరందుకని పరగ తుకయు ననుచుండు॥

పోయిన వాటికి తత్తరపలువడు పొందెనవియు హరియందు।
బాయక నగ్నిని బడునన్న మునకు భగవదర్పణ మింపొందు॥ ౧౦౯౬.
అటులం దలచుచు మీర లందరును హరి కర్పణ మయ్యెనని।
చటులత తాపము విడిచి శ్రీహరిని శరణొందుట మంచిదని॥
ఉదాస వృత్తిని దేహుగ్రామునకు నొప్పగ వచ్చెను తుకయు।
సదానందుడై భజన జేయుచును చక్కగ నుండగ మరియు॥
ప్రతి దినమందును దర్శన మునకై బహుజనములు వచ్చుచును।
సదమల కీర్తన తుకారాముడును సలుపుచు నుండెను యటను॥

---

ఇందిర దేవియు వైకుంఠంబున ఈశుని గనితా బలుకు।
సందియ మొందక దేహము తోడను సరగ తుకని దెమ్మిటకు॥
హరియు బలికెనటు దేహసహితముగ నాతని దెచ్చెదనిటను।
గురుతుగ నీతడు పూర్వభవంబుల కూర్మి నుద్ధవుండగును॥ ౧౧౦౧.
నామదేవుడై నానాచర్యల నయముగ జేసెను భువిని।
ప్రేమమీరగను నాతని దెచ్చెద పెంపున నేనిచటికిని॥ ౧౧౦౨.
అనుచు జెప్పుచును విమానంబుపై హరియును పార్షదులటను।
బెనగొని వచ్చిరి దేహుగ్రామునకు పెంపున హరి తుకనిగను॥
అనేక జనులకు నామ సాధనము నమరునటుల జేసితివి।
వినీతులగుచును భక్తిమార్గమున విశేష ప్రజ నుంచితివి॥ ౧౧౦౪.
పరమపదంబును చూపుట కొఱకై ఫాల్గుణ వద్యైకాదశిని।
వెఱవక నీవును రమ్మని జెప్పుచు వే సిద్ధుల తానుగని॥ ౧౧౦౫.
వైకుంఠమునకు సరియగు రచనను వాలుగ నిచ్చట జేసి।
సాకల్యంబుగ భోజన ద్రవ్యము సాహిత్యములును వెలసి॥ ౧౧౦౬.
సకల భక్తులకు భక్షణ కొఱకును చక్క జేయు మనగాను।
ప్రకట సిద్ధులును పరిపరి విధముల పక్వాన్నము లుంచగను॥

మహా భవనమున ముగ్గుల వేసియు మహి శృంగారించగను।
నిహీన మెద్దియులేక విస్తరల నేర్పున వేయగ నటను॥ ౧౧౦౮.
వికుంఠ వాసులై యుండు ననేకులు వేంచేసిరి యచ్చోటను।
అకుంఠితుండగు తుకయుని పజ్తిలో నందరు గూర్చుండగను॥
భక్తులకందర పూజల సలిపెను భగవంతుండును నపుడు।
సక్తిగ గంధము అక్షత పుష్పల చక్కగ బెట్టుచు నుండు॥
ప్రసాద మచ్చట లక్ష్మీదేవియే బాగుగాను వడ్డించె।
హృషీకేశుడు సంకల్పోదక మేపున విడిచియు మనిచె॥ ౧౧౧౧.
భక్త జనంబులు బ్రహ్మరసముచె పరితృప్తిని బొందుచును।
రక్తిగ నిట్టుల నైదుదినంబులు రాజిల్లం బడగాను॥ ౧౧౧౨.
తుకారామున కొకనికి మాత్రమె తోచబడెను యీసేవ।
ప్రకారముగనే యితర జనంబులు భక్తిని కథ వినబోవ॥ ౧౧౧౩.
పరుడగు శ్రీహరి తుకరాం గనియనె పాల్గున ప్రదిపద రాత్రి।
కరమరుదుగ శ్రీ వైకుంఠమునకు కలియబోదమీ ధాత్రి॥
ప్రాణము దేహము నాకు నొసగితివి బలిదానంబుగ నిటను।
దాన మొసగితివి కామక్రోధముల ధర మనసును నిలుపుచును॥
అపరోక్షంబుగ నాత్మ ప్రాప్తియు ననుభవ మగుచుండినను।
నెపమున దానిని మీరుచు నీవిటు నిజదాస్యము నుండుచును॥
సిద్ధుల నిచ్చిన వదలితి వీవును చిర ముక్తిని వలదనిరి।
పద్దుగ నీకేమిత్తును యికనే బహు నిరపేక్షత నున్నరి॥ ౧౧౧౭.
తుకారాముడనె పండరి యుండగ దూరమరుగు టెందుకను।
ప్రకాశముగనే భజన చేయుటకు భక్తి ప్రీతి గందునను॥
అనివిని శ్రీహరి క్షీరాబ్ధ్యందలి నైశ్వర్యము గనుమనెను।
వదలక నీవును నేనును యెచటను వ్యాపకులుగ నుండినను॥
ఇహలోకముననె పూర్తిగ నుండిన యేర్పడ $దాస్థ జనులకు।
సహానంబున నే జెప్పిన రీతిని చనుమనె వైకుంఠమునకు॥ ౧౧౨౦.

$ ఆస్థ = అపేక్ష.

ఇదివిని తుకరాం భగవత్పదముల నింపుగ బట్టెను యపుడు।
ముదమున కీర్తన జేసెను జనులకు మోహము తగవీడునటు॥
మధురంబగు తన కవిత్వధారయు మహితంబుగ జెప్పుచును।
విదితపరచి దా జెప్పెనందరికి వేదాంతార్థంబులను॥ ౧౧౨౩.

నాదు మరణమును నేకనుగొంటిని నాకనుపమమై యుండెన్।
పాదుగ నదియును త్రిభువనములలో పరానందమై నిండెన్॥
సకల భోగములు సమకూరెను నిటు సర్వాత్మకత్వమునను।
ప్రకటంబుగ నా యహంకృతి బోవగ బరగె సుకాలంబిటను॥
జనన మరణ సూతకములు వదలెను చనగ నహమ్మమతలును।
అనువుగ నారాయణు డిచ్చెను నరయగాను స్థలమటను॥ ౧౧౨౪.

భావశుద్ధితో చరణము బట్టితి బ్రహ్మాత్మక మనసయ్యెన్।
సావధానముగ సౌఖ్యాంగము నే చక్కగొంటి సరియయ్యెన్॥
అనేక భంగుల నిట్టి లక్షణము లా తుకయును జెప్పగను।
పునీతు లగుచును దేవతులనిరటు పొందివినుచు ముదమునను॥
నామకీర్తనము జేయగ తుకయను నరకాయము బ్రహ్మమయెన్।
ప్రేమను మీరిన వైష్ణవ ముఖ్యుడు పెంపున ధన్యుండయ్యెన్॥
అనుచును చెప్పుచు నుండగ తుకరామ తిహర్షముతో నపుడు।
వినతుండై యనె నంత్యము నందును విఠ్ఠల నామము ననుడు॥
కను లతనివి హరి రూపుననుండెను కరగె మనసు పదములను।
అనువుగ ప్రేమయు హరికీర్తనమున నలవాక్కు నామమునను॥
భాగము లిటులం జేయగ తుకయును పండరిపతితా నయ్యెన్।
బాగుగ నతడనె వినుడు సౌఖ్యమును బరగును మీకటు జేయన్॥
మానుకొనుచు తార్కికుల సంగము మహిని హరిని దలచండి।
దీనిని విడిచుచు మతాంతరంబుల తెరువు గానకుండండి॥
కలికాలంబున దాసుడు తుకయును గారవమున నిట్లనియెన్।
అలవైకుంఠము పోయెద ననుచును హరి హరి విఠ్ఠల యనియెన్॥

శ్రీహరి యచ్చట విమానమునకును చెలగియు రమ్మన నపుడు।
మోహ మొందక తుక సతిని బిలువగ ముద మొందక సతి నాడు॥
ఇంటను పిల్లలు యేడ్చుచు నుందురు యెటుల వచ్చెదను నేను।
ఒంటరిగానే సంసారంబును నొసగ నడుపు చుండుదును॥
ఇదివిని తుకయును నింటి మమత్వము నిదివరకును పోలేదు।
విదితమయ్యె నిటు మాయ ప్రభావము విచిత్రమని నేగందు॥
భజింపుమనెదా నందరహరినిక భక్తి సలిపి పెద్దలకు।
గజిబిజి లేకను యీగెదుముకులిడు గతిగొను మధురంబునకు॥
గడిచిన గడియయు తిరిగి రాదయిటు గంగ యుదధి గలిసినను।
పుడమిని తిరిగియు రానేరదు యిది బుద్ధిని నెపుడుంచుమను॥
ఈ విధమున దా జెప్పుచు దండము నెలమి బెట్టె నందరకు।
సావధానముగ జెప్పుచు నామము సరగ వచ్చె వెలపలకు॥
శ్రోతలందరును కన్నీరొలుకగ సూటిగ తామను కొనిరి।
పాదుగ నీతడు హిమగిరి బోవునొ బదరికి చనునోయనిరి॥౧౧౪౦.
ఎటులైనను మన మాగ్రహమునుగొని యిచ్చట నేయుంచదగుణ।
ఇటులం జెప్పగ తుకారాముడును నీశు నిబాడుచు బాగుణ॥
నదీ తీరమును వచ్చుచు పిదపను నవ్య కృతుల బాడెనటు।
సుధా రసమునకు సమమగు వాక్యముల్ సుఖమిచ్చును వినినట్టు॥
నామమె పతియూ నామమె రతియూ నామమె సర్వము నాకిటను।
నేమంబిదియగు నెప్పుడు దొలగదు నిలకడగొనె హరియెడను॥
అంగసంగం బయ్యెను నతనితో నట్టె దొలగె భయచింత।
*వింగడమున నిటు నాపై కామము బెట్టవలదు రవ్వంత॥౧౧౪౪.
జూడవు కన్నులు వినవు చెవ్వులును సుఖనాలికె బలుకదను।
నేడు హరి చిత్తమున కూర్చుండెను నిగుడువాడు లేడిటను॥
దేహమందు తా గూడి కలిసిమరి తిరము జేసె నొకటిగను।
ఊహను నతనికి సమబలవంతుడు నొనర లేదు భువిలోను॥

---

*వింగడము - వేరు.

నారాయణుడును నాకు వేరుగను నయమొప్పగ నుండడను।
పారావారంబగు కైంకర్యము బహుగ జేసె దా నిటను॥ ౧౧౪౭.
పతియగు హరినను తనకై చేకొనె పావనునిగ జేయుచును।
హితమని నాతో వచ్చుట మీకును నెలమిగాదు యిక మున్ను॥
ఆశామోహము లుండేవరకును నబ్బదు హరి సుఖమిటను।
వాసిగ మీరలు వాటిని వదలిన వచ్చును సుఖమింపుగను॥
ఆశాత్యాగం బగుపర్యంతము నవని చరించు చెపటివలె।
వేసారక శ్రీరాముని నామము విపులంబుగ జేయవలె॥ ౧౧౪౦.
ఆటలు పాటలు మీతో నాకును నమరియుండె నిదివరకు।
పాటవముగ నది దొలగె కులముతో బరగె హరికులము నాకు॥
చావుకు మునుపే చచ్చియుంటినే చనెను భయము మనసందు।
భావశుద్ధినిటు గానరు మీరలు భయము గలుగు మీయందు॥
ఇటులుండుటచే సంగము నాతో నెట్టులనగు నిటమీకు।
విఠలుని గనుటకు యత్నము జేసిన విడువవలెను తా తనకు॥
వెళ్ళెద నేనును కృపను మీరలును వీలుగ నుంచుండికను।
సల్లలితంబుగ పాండురంగడును చక్క వచ్చె గొనిపోను॥ ౧౧౫౪.
వైకుంఠమునకు శ్రీగరుడుండును వరుసబిలుచు రమ్మనుచ।
సాకల్యంబుగ నంత్యకాలమున చక్కగ విఠలుడు నుడుచు॥౧౧౫౫.
సశరీరముతో గుప్తమైతినని సారంబుగ జెప్పి తుక।
విశదంబుగనటు వేంచేసియుదా విమానమంచున జొరగ॥ ౧౧౫౬.
విచిత్రమగునొక ప్రకాశమప్పుడు వే నభమున గనుచును।
ప్రచుర జనుల కన్నులు మూయంబడె ప్రభ విమానకాంతినను॥
కనులందెరుచుచు చూడగనచ్చట కనబడకుండెను తుకయు।
ఘనశోకముతో నావులి వినుకొని కరము రొమ్ముగొట్టుటయు॥
అనేకజనములు వచ్చియుండిరటు హరికీర్తన వినుటకును।
వినీతులగుచును నధికవ్యసనమున వెలసిరి వారందరును॥ ౧౧౫౯.

మరలివచ్చునని యెంచుచు వారలు మానుగనుండిరి యటను।
వెలచుచు సంధ్యాకాలమునందును వెళ్ళిరి వారిండ్లకును॥
చతుర్దశ శిష్యులు మాత్రమిండ్లకును చనకుండిరి యచ్చటను।
హితముగ నొకపరి దర్శన మైనను నెలమిరతుణంబగును॥ ౧౧౬౧.
అనేకభంగుల కవిత్వరచనచే నరసి నుతుల జేయుచును।
వినీతులగుచును నైదుదినములటు వేంచేయుచు నుండగను॥౧౧౬౨.
ఆకసముండియు క్రిందబడెనునట నంగవస్త్రము తాళమును।
ఏకీభావము నొందిరి శిష్యులు నెలమివాని జూడగను॥ ౧౧౬౩.
శ్రీవైకుంఠము చేరెను తుకయని చింతింపుచు వారలును।
భావశుద్ధితో స్నానము జేయుచు పండరిపతి గుడికడను॥ ౧౧౬౪.
గైకొని వాటిని రాగా జనములు గరిమెనరిగి చూచిరటు।
జోకను నాడే బ్రాహ్మణ జనులకు సారది యన్న మిడిరియటు॥
ముఖ్యశిష్యుడగు రామేశ్వరభటు ముదమొందగ జెప్పెమును।
సఖ్యముతోడను క్రియాకర్మములు సలుపవలవదిందుకను॥ ౧౧౬౫.
శరీరమిచ్చట బడకుండుటచే చరమక్రియల పనిలేదు।
ధురీణుడగుచును వైష్ణవిమాయను దూరపరచి యింపొందు॥
అందరు శిష్యులు గూడియప్పుడును హరిగుణకీర్తన సలుపన్।
పొందుగ మూడు దినంబులు విప్రుల భువిభక్షణ చేయింపన్॥
ఆనందంబును బొందిరి యప్పుడు నరయ తుకని కొడుకులలో।
సానందంబున మూడవ కొమరుడు చక్కవిరాగియై యిలలో॥
నారాయణుడను పేరువహించియు నయముగ తుక కవితలను।
పారాయణముగ పఠనజేసియు ప్రబల భజన చేయగను॥ ౧౧౭౦.
అతనియాజ్ఞలో జ్యేష్ఠభ్రాతృలు నమరియుందు రయ్యెడను।
హితుడై నారాయణుడుండెనునిల నెలమినొంది కీర్తియును॥
తనకృపచేతను తుకారాముడును తగు భావిక నరులకును।
ఒనర ప్రసన్నుండగుచు స్వప్నమున నుపదేశము జేయుమును॥

కనిష్టభార్యయు కాన్యాజీకిని కరుణించెను స్వప్నమున।
కనడ వణిజుడు గబా యనువాడటు ఘనభక్తిని నెయ్యమున॥
జగతి తుకారా ముండగ వచ్చియు సలిపె సేవ బహుగాను।
సుగమంబుగ తన యంత్యకాలమున సుఖ దర్శన మిమ్మనుచు॥
వేడుకొనుచు తన గ్రామము నరుగగ వెళ్ళె తుకా హరిపదము।
నాడు వణిజునకు కొంతకాలమున గూడె నంతిమ కాలమ్ము॥
అప్పుడె వేహుగ్రామంబునకును నతడుబంపె మనుజులను।
తప్పక శిష్యులు నారాయణుతో దారి నడచి గబ కడను॥ ౧౧౭౮.
అనువుగ రాగను నాతడు ప్రేమతో నందరి దా పూజించఁగ।
ఘనుడు తుకారా మచ్చట గబకును కానంబడెతగ మెచ్చఁగ॥
కుసుమమాలలను కంఠము వేసియు కొనియాడగ నరులచటఁగ।
అసమానంబగు నాశ్చర్యముచే నా మాలను గని మింటఁగ॥
జయజయశబ్దము జేయుచు శ్రీహరి సరినామము నుడివిరటు।
ప్రియమున భక్తులు పాటలబాడుచు పెంపుజేసిరి తగునట్టు॥౧౧౭౯.
రామకృష్ణుల చరితలవలె యిది రమ్యంబగు వినుటకును।
వేమఱు భక్తుల దాసదాసుడై వెలయు బాలకృష్ణుడును॥ ౧౧౮౦.

---

రో హి దా సు చ రి త్ర ము.

చర్మకారుడై జన్మమునొందియు సలుపును హరిభక్తియును।
నిర్మలమతియై కృష్ణపూజలను నెనరున దాజేయుచును॥ ౧.
రోహిదాసుడని బహుతరఖ్యాతిని రూపింపంబడి యుండెఁగ।
బాహుళ్యంబగు పరోపకారము బాగుగ జేయుచునుండెఁగ॥ ౨.
యాత్రాపరులకు ననుదినమునుదా నమరగ ముచ్చెలనిచ్చు।
పాత్రమునెరుగుచు భిక్షనిచ్చుచును భాగవతుల సేవించు॥ ౩.
ప్రాతస్స్నానము జేయుచు పిదపను పరితృప్తిగ భక్షించుఁగ।
నీతిగ వెనకను దేవునిపూజను నెనరున లానొనరించుఁగ॥ ౪.

ఈయుగమందున నన్నమయముచే నేర్పడియుం డునుసురులు।
వేయువిధంబుల చిత్తము చెమరును వెలయలేక భోజ్యములు॥ ౫.
భూగతద్రవ్యము చేకొనుటకును పొందుగ బలినిడు వలెను।
వేగముగనుతా భక్షణజేసియు విష్ణుపూజనుండుమును॥ ౬.
సహజంబుగనొక చర్మాసనమున సాలగ్రామముంచుచును।
బహుతరప్రీతిచే ప్రతిదినమందును పత్రపుష్పముంచగను॥ ౭.
అవనిసురుండొక డర్థిగవచ్చెను నాతనికడ నొకనాడు।
సవినయంబుగను భక్తుడు విప్రుని చక్కజెప్పె కూర్చుండు॥ ౮.
నమస్కరించుచు భక్తుండుండగ నయమున విప్రుడుగనియెన్।
సమభావంబున సాలగ్రామము చర్మాసన నమునడాయన్॥ ౯.
తగదిటు నీకని విప్రుడు జెప్పుచు తత్స్వరూపుడగు హరియున్।
అగణితాండముల కర్తయతండగు నమరులధ్యేయుండయ్యెన్॥ ౧౦.
పయోదధినిదా పన్నగశాయియై పడుకొనియుండెడి పరుని।
క్రియాకరుని విభు చర్మాసనమున క్రియనుంచం దగదుయను॥ ౧౧.
బాగిదికాదని విప్రుడు బల్కగ భక్తుడుజెప్పె నతనికి
‡సాగరాంబర సకలపదార్థముల్ చర్మసహితమని పలికి॥ ౧౨.
గోవునకును మరి చర్మంబుండును గోక్షీరము నాజ్యమును।
భావశుద్ధితో పవిత్రకరమగు పంచామృతమగు నెడను॥ ౧౩.
చాతుర్వర్ణులు చర్మయుక్తులుగ సలుపంబడిరీ జగతి।
ప్రీతిగ విప్రులు బలికెడు శ్రుతులును పెంపు చర్మవాక్సమితి॥ ౧౪.
చర్మపు చెవులను మీరలు వీందురు సరి వేదాధ్యయనమును।
చర్మహస్తముల శ్రీహరి బూజల సలుపుచుందు రియ్యెడను॥ ౧౫.
ఇదివిని విప్రుడు బలికె జీవుడును యెలమి దేహ మందుంటన్।
పదపడి చర్మము పవిత్ర మగునని బలికె ద్విజుడు, భక్తుడటన్॥ ౧౬.
ఈశ్వరు డంతట నుండగ జగతిని నెదియు పవిత్రంబగును।
శాశ్వతముగనే నశుచి యెట్టులగు జగతిని చర్మమునకును॥ ౧౭.

‡సాగరాంబరము - భూమి,

రజస్వల స్త్రీరుధిరములోపల రంజిలబడె రేతసును।
ప్రజననమగు నీ దేహంబంతయు బహు నీచంబనదగును॥ ౧౮.
వ్యాపకు డగుచును శ్రీహరి యుండగ వరుస నంతయును కడకు।
ప్రాపుగ సకలము బ్రహ్మ మయంబన బ్రాహ్మణుడనె భక్తునకు॥ ౧౯.
శుచియగు సాలగ్రామ పూజయును సూటిగ నీవును జేయ౯।
ఉచితముగాదని జెప్పగ రోహిదా సొప్పెద రెవరిక దెలియ౯॥ ౨౦.
ద్విజుడు కోపమున మూర్ఖ మనుష్యుడ, దెప్పరవాడా యనుచు॥
విజితంబుగ నా శ్రీహరి నచ్యుతు విప్రు డెపుడు బూజించు॥ ౨౧.
చతుర్వర్ణముల విప్రుడు శ్రేష్టుడు చక్కన సాలగ్రామమును।
సతతము నాతడె జన్నిదమునకును సదాధికారుండగును॥ ౨౨.
అతడే యర్హు డగుచుండగ నా హరికృష్ణుని పూజలకు।
ఇతరులు తగరని బల్కగ రోయిదా సిలబడి సాగిలమ్రొక్క॥ ౨౩.
ఉపవీతంబును చూడుమనుచు తన యురము చీరె రంపమున।
చపలతనొందక యుపవీతంబును సరగజూపె నెయ్యమున॥ ౨౪.
వింతను గని ద్విజు డుత్తమజ్ఞానివి విష్ణునిభక్తుడ వనుచు।
సంతసముగ నా శ్రీహరిపూజను సలుపుచుండు దినమనుచు॥ ౨౫.
అటులంజెప్పుచు ద్విజుడు వెళ్ళగా నత్యాశ్చర్యముతోడ।
పాటకరి జనములు మహిమగొప్పదని పొగడుకొనిరి విధితోడ॥
పంచాయతనపు పూజసలుపుచును భక్తికృష్ణుపై నుంచి।
సంచారంబై చెలగెడు ఖ్యాతిని సాహు కబీరుడు గాంచి॥ ౨౬.
ఈతడు రాముని గొలుచుచునుండును నితరదేవతల గనక।
చాతుర్యముతో రోయిదాస్ కడకును చనుదెంచెను తా కడక॥
పూజాగృహమున పంచాయతనము పొసగగని కబీరుడును।
తేజరహితమని వందన మొసగక దిగువను కూర్చుండగను॥ ౨౯.
ఇదిగని రోయిదా సచ్చ హాపముల కేటికె దండంబిడరు।
కుదురుగ దప్పున కూర్చు ండియని కూరిమి నడిగె కబీరు॥ ౩౦.

దామాజీ యనుతాప యుతుండై ధరణి బడుచు తానపుడు।
వేమారును నే తొందరనిచ్చితి విఠలునకని జెప్పుచుండు॥ ౯౩.
కొలువు చేయనని కువలయేశునకు గురుతుగదా జెప్పుచును।
నెళవున పండరివాసమె నాకును నియమమనుచు దాననెను॥ ౯౪.
రాజుబలికె నటు నీదుయోగమున రాముని గంటిని నేను।
ఓజను నాజన్మంబును సఫలత నొందెననీయు జెప్పెమును॥ ౯౫.
సేవను విడిచియు దామజియప్పుడు చేరెను పండరిపురిని।
భావశుద్ధితో పండరినాథుని పదముల మ్రొక్కుచు భువిని॥ ౯౬.
అపరాధంబుల కాలయమగునను నాదరించితివి నీవు।
కృపగొని నన్నొక యనామికుడవై క్రియగొని గోచితివీవు॥ ౯౭.
శివసనకాదులు సన్నుతిజేసెడు శ్రీపదములు నీకుండన్।
పవిత్రగంగకు పావనతల్లివి బ్రహ్మతండ్రివై యుండన్॥ ౯౮.
అట్టిఘనతను బొందిన నీ విటు యనామికుండ వగుచును।
పట్టిగులాంమని యేర్పడనంటివి ప్రభువు సమ్ముఖంబునను॥ ౯౯.
ఈకారుణ్యము నీ సౌలభ్యము నెంతయనుచు వర్ణింతు।
శ్రీకర విఠోబా శ్రీరంగాయని చేతుల నేవందింతు॥ ౧౦౦.
దారాపుత్రులు తనతోనుండగ దామాజీ యటు పిదపన్।
ధీరత పండరిచేరి స్వస్థముగ దేవుని సేవల నొప్పన్॥ ౧౦౧.
పురజనులందరు భక్తిధన్యతను బొందియున్నదని పలుకన్।
పరమభక్తుడై ప్రాభవమొందెను బాలకృష్ణు డిల మ్రొక్కన్॥ ౧౦౨.

---

మృత్యుంజయుని చరిత్రము.

బిదరున శాంత బ్రహ్మణి యనునొక పెద్ద బాదుషా యుండెన్।
పదపడి యాతడు వైరాగ్యంబును భక్తిగూడుకొని యుండెన్॥ ౧.
ఎట్టులనంగా నాతండొకదిన మింటిమేడ పైనుండన్।
పట్టెమంచమున సతితోలీలల బాగుగ సలుపుచు నుండన్॥ ౨.

ఇంటను నెవ్వరు రాకయుండు నటు నేర్పరచెను కావలులు।
జంటను కిటికీ కడగూర్చిండియు సారెకుకదళి ఫలముల॥ 3.

చక్కెరతోడను చేకొనుచుండిరి, సరసను ఫలముల పొరల।
అక్కరలేకయు పారవేయుచును నారగించుచుండనిల॥ ౪.

క్రిందబడిన యా కదళీపొరలను గీల్కొని యొక మనుజుండు।
పొందుగభక్షణ చేయుచునుండగ పొలతి కంటగనుచుండు॥ ౫.

పరపురుషుండీ పంచను వచ్చెను పతినిగాంచి చూడుమన।
ధరణీనాధుడు ద్వారపాలకుల త్వరితంబుగ బిలిచెవిన॥ ౬.

అన్యపురుషుడీ యంతఃపురమున కరసియు నెటువచ్చెనను।
పన్నుగమీరలు కావలియుండెడు భటులాయని గొట్టగను॥ ౭.

ఫలముల పొరలను భక్షించుచునటు పదపడి యుండిన నరునికి।
వలగొని తన్నుచు భటులు తొందరను వరుసను బెట్టిరివానికి॥ ౮.

దెబ్బల బడుచును నాతండచ్చట తేటగనవ్వుచు నుండు।
గొబ్బున దీనింగాంచుచు నృపుడనె గొట్టవలవ దిటు తెండు॥ ౯.

భటులాపురుషుని గొట్టినదెబ్బలు ప్రజానాధుపై జూడ।
చటులమనుచు నృపుడాతని బిలుచుచు చనువుగ గనుచునుజూడ॥

ద్వారపాలకులు తాడనచేయగ తల్లడిల్లకను నీవు।
పారతరంబుగ నవ్వుచునుండే కారణమును దెలుపుదువు॥ ౧౧.

నావుడుబల్కెను నీదు గృహంబున నడగియుంటి నరగడియ।
నీవటు వేసిన ఫలముల పొరలను నేతింటిని యిటువెలయ॥ ౧౨.

ఇందులకే నా మేనదెబ్బలును నేర్పడగలిగెను నిపుడు।
పొందుగనీవును ఫలభోగంబుల భుజించుచుందువు నెపుడు॥ ౧3.

నీగతిమీదట నేమగునోయని నెనరున నవ్వితినేను।
బాగుగగోధుమ పిండియుండలచె బట్టుచుంద్రు చేపలను॥ ౧౪.

జీవరహితమై చెలగుపిండిచె జెందెను మృతిమీనములు।
జీవసహితమగు జంతుల చంపియు చేకొనెదవు మాంసములు॥౧౫.

ఏమి శిక్షనీ కేర్పడియున్నదో యెరుగననుచు జెప్పగను।
నేమంబగు నటు నరపతి విడిచెను శీఘ్రంబుగ రాజ్యమును॥ ౧౬.
చిత్తవిరాగము చేకొనియడవిని చేరెను మున్నాతండు।
ఇత్తరిసాధుల సంగము నెప్పుడు యెలమిదొరుకు ననుచుండు॥ ౧౭.
ఈశుని భజనను నెటుల జేయుటొ యేరీతిని యోగమగు।
పాశరహితమును వైరాగ్యంబును వచ్చుమార్గ మెట్టులగు॥ ౧౮.
అనుతాపం బెటు హరి కృపయెట్టిది హరినెటు పూజించుటయో।
జననము సఫలం బెట్టులయగునో ఘనహరి నెటుగొలుచుటయో॥
ఆవిధచింతను నాతడు జెందగ నాషాఢపు మాసమునన్।
భావశుద్ధితో పండరియాత్రకు ప్రజలుబోయిరటు గానన్॥ ౨౦.
వాద్యఘోషమున విష్ణునామమును వర్ణించుచు బోవగను।
ఆద్యుడీశుడని శాంతబ్రహ్మణి యణగివారి గలియుచును॥ ౨౧.
ఇచ్ఛయించినది యేగుదెంచెనని యెలమి సంతసించుచును।
విచ్ఛలవిడి దా పండరిపురికిని వేంచేసెను ప్రియమునను॥ ౨౨.
చంద్రభాగలో స్నానమొనర్చియు సలిపెపురి ప్రదక్షిణము।
ఇంద్రావరజుని భక్తులకార్తిని నెలమిజేసె వందనము॥ ౨౩.
పుండలీకునికి పూజనుజేసియు పొంగుగ హరిగుడియందు।
నిండుప్రీతిగను ముకుందునామము నెనరునదావిని ముందు॥ ౨౪.
అతిముదమొందుచు ననేకతీర్థము లవనియందు నుండినను।
హితకరమగు నీ తీర్థముపోలికె నెటలేదని జెప్పుచును॥ ౨౫.
విష్ణుభక్తులకు వందనమిడుచును వేగమె మంటపమునను।
కృష్ణుని విగ్రహ నిర్మలరూపము క్రియగాంచుచు మనమునను॥ ౨౬.
సద్భావముతో చేసెనమస్కృతి సర్వేశ్వరు పదములకు।
అద్భుతప్రియమున నచ్యుతకృష్ణా హరి రంగాయని బలుకు॥ ౨౭.
కీర్తినివినినినే కోరివచ్చితిని కృష్ణకృపాళో యనుచు।
ఆర్తినివేడెద గురుదర్శనమును నందజేసి నామనసు॥ ౨౮.

పూర్తిజేయుమని తలచుచు తనలో పొందుపరచి యొకచోట।
ఆర్తిని నాతండన్న పానముల నల్పము లేకుండు నట॥ ౨౯.
శ్రీహరి మూడవ దినమున కలలో జెప్పెను నాతని తోడన్।
ఊహను సహజానందుడు నీకును నుపదేశించును జూడన్॥ ౩౦.
వివేకసింధవు యను నొకగ్రంధము విహితంబుగ నియ్యగను।
నవీనమిదియని యాతడు మేల్కని *నలువుగ గనె గ్రంధమును॥
పండరి నాధుని గానక పిదపను బహుతర క్లేశుండగుచు।
నిండుప్రేమతో మననము జేసెను నెనరున గంధ్రము గనుచు॥ ౩౧.
కాలము కొంతయు గడిపి యచ్చటను కల్యాణీ పురమునకు।
మేలుగ వచ్చెను శ్రీహరి యాజ్ఞను మించకుండ గురు కొఱకు॥ ౩౩.
శ్రీగురునచ్చట గానక తిరిగియు చేరెను పండరిపురము।
వేగమె గురుడును చేరెనచ్చటను వెలయగ నట నుత్సవము॥ ౩౪.
సహజానంద స్వామిని గనియట స్వప్నసంగతిని దెలుపన్।
బహుమంచిది యని తనపురమునకె బైలుదేరి రపు డొప్పన్॥ ౩౫.
చనియాచోటను తారకమంత్రము సద్గురు డుపదేశించెన్।
అనువుగ నతనికి మృత్యుంజయుడని యాతడునామం బిచ్చెన్॥ ౩౬.
శ్రవణముకాగా మననముజేసియు సలిపె నిది ధ్యాసమును।
సవినయమగునటు గనె హరి తనలో సాక్షాత్కారంబుగను॥ ౩౭.
జంగమజాతిని భవరాయుండన సజ్జను డొక్కండుండు।
సంగతి నెరిగియు శరణుంజొచ్చెను సాధుమృత్యుంజయు నపుడు॥
అధికారంబుల నీతడు జూచియు నతనికి నుపదేశించెన్।
విధితోనచ్చట పెక్కు జంగములు వీలుగనుండగ గాంచెన్॥ ౩౮.
సముచ్ఛయుండను శ్రేష్ఠజంగమట సరగదిట్టె భవరాయున్।
క్రమమును దప్పుచు నితరజాతిలో గైకొనె గురువరుననియున్॥
భవిష్కారమును బెట్టగ శ్రీగురు పాదములకు మ్రొక్కుచును।
భవరాయుండును చెప్పెసముచ్ఛయు ప్రబల క్రియను తనకిలను॥

---

*నలువు - సుందరత్వము.

ఆచార్యుండును నాదరించుచును హరిపైనమిక మీరఁగ౯।
ప్రాచుర్యంబుగ భక్తినిచేకొని భజనజేయుమనెను ధర౯॥ ౪౨.
ఆనగరంబున జ్ఞానవంతుడగు నవనీపతి యొకడుండు।
మానుగ కాశీపతియను పేరున మహి శంకరభక్తుండు॥ ౪౩.
శివదాసులునగు జంగమయ్యలకు జేయించును భోజనము౯।
వివరంబగు నటు షడ్విధ రుచులను వెలయు నన్న మిడు దాము౯॥
ఈవిధముగ నుండగ నొకదినమున నితడనేక జంగములు।
భావశుద్ధితో భోజన మిడుటకు పఙ్క్తినుండ జేయనిల॥ ౪౫.
పూజల సలిపియు పదార్థముల నటు పొందుగ వడ్డింపగను।
ఓజను హరునకు నర్పించుటకై యొగిలింగము లెత్తగను॥ ౪౬.
కాయను లింగాల్ కనుబడకుంటను కడుతొందర నొందుచును।
బాయక నందరు నొకరొకరిని గని భయము సిగ్గునొందగను॥ ౪౭.
దేవునిపూజను సలుపు టేటికను తీరుగనన్నము గుడువర్।
బోవదు గదయని బహుక్లేశంబును బొందుచు ప్రాణాల్ విడువర్॥
ప్రాయశ్చిత్తము బూనగ వలయును పరమశివుడు బోవంగ౯।
చేయునట్టిపని జీవత్యాగమె సిద్ధశాస్త్రమిది యనగ౯॥ ౪౯.
అంతనందరికి నీగతికాగా నరయ శిక్ష, యెవ్వరికి।
పంతము తోడను భ్రాంతిని జెందుచు పరిపరి విధముల బలికి॥ ౫౦.
ఏమియు దోపక నిటులుండంగను నెలమియవని నాధుడును।
పామరత్వమున నెవరో సాధువును బాధించిన కతమునను॥ ౫౧.
ఉమాకాంతుడును విడిచెను మనలను నొగినీ యపచారమును।
ప్రమాద మగునటు జేసి రెవరనుచు పలుమరు వారినడుగగను॥
ఒకరినినొక్కరు వారలు జూచుచు నుచితపలుకులనుచును।
సకలజనులు విన సముచ్ఛయుండును సార్వభౌము గాంచుచును॥
భవరాయునకును పూర్వమునందున భవిష్కారం బిడుటచే।
శివుడు క్రుద్ధుడై చనినట్లున్నది చేయు టేమియని వెరచె॥ ౫౪.

మేదిని పతివిని మృత్యుంజయునిల మీరువెళ్ళి వేడినను।
వేదన మనకును వదలుననంగను వెళ్ళియు మృత్యుంజయును॥ ౫౫.
మ్రొక్కుచు బలికిరి మహావినయమున ముందునిలిచి వారలును।
నిక్కంబుగ నాభవరాయుని నెఱి నిందించిన కతముననూ॥ ౫౬.
కాలకంఠుడును గుప్తుండయ్యెను కరుణబ్రోవుమని వేడన్।
శీలుండతడనె వేదాంతంబును సిద్ధాంతంబును జూడన్॥ ౫౭.
కుక్కలగుచు లింగంబులగొనియెను గురుతుగ చూడుండనుచు।
చొక్కుచు బిలిచెను వేదాంతమయని నూటిగ శునకమువచ్చు॥
జంగమయ్యల లింగములన్నియు సరసను దీసిన యెడలన్।
ఇంగితమగు నటు బయలు పరపుమని యితడు బలుక నయ్యేడలన్॥
శునకము క్రక్కెను సహస్రపంచక శుద్ధలింగముల నపుడు।
ఒనరగ నాతడు సిద్ధాంతమయని యొప్పగ బిలువగ నాడు॥ ౬౦.
వేరొక కుక్కయు వచ్చియు క్రక్కెను వేలునైదు లింగముల।
వారీవింతను జూచుచుమిక్కిలి వర్ధిలజేసిరి నుతుల॥ ౬౧.
శ్రీయాళునకును సాంబమూర్తియు శిలశత యష్టోత్తరము।
బాయకజూపగ స్వాంతశిలనుదా బట్టదెలియ కుండెనుము॥ ౬౨.
మాకునుగలిగెనుయటులనెయనియునుమహిమను గనినుడిజేయన్।
సాకల్యంబుగ వారివారియెడ సరగలింగములు గలియన్॥ ౬౩.
జ్ఞానసాగరుం డనుచును నామము సరగనిడిరి జంగములు।
మానుగనుతులను జేయుచు వెళ్ళిరి మహీపతి కడకా జనులు॥ ౬౪.
నీలకంఠునకు నైవేద్యంబును నెఱినర్పణ జేయుచును।
వీలుగ భక్షణ జేసిరియందరు విపులమహిమ దలచుచును॥ ౬౫.
హరిభక్తులు నీ యవనిప్రచురులై యతిశయ చర్యలజేయన్।
గురుతుగ బాలకృష్ణుడు వారల కొనియాడును దాడాయన్॥ ౬౬.

## భానుదాసు చరిత్రము.

ప్రతిష్ఠానమను పట్టణమందును బ్రాహ్మణు డొక్కండుండు।
సతతము నాతడు సేయుచునుండును సవితుని పూజనుమెండు॥ ౧.
ఆదేవుని కృపయబ్బగ పుత్రుడు నాతనికిని యటుగలిగెఁ।
మేదిని తలిదండ్రులును పెంచగా మిగుల వృద్ధి గని చెలగెఁ॥ ౨.
ఉపనయన క్రియ లొనరజేసిరి యుచితకాల మటురాగఁ।
నెపములేక వేదంబును తండ్రియు నెఱిని జెప్పుచుండంగఁ॥ 3.
చదువకయుండగ కోపము జేసెను సరగతండ్రి కొమరునట।
అదరునకొమరుడుభయమునుబొందియునలగృహమును వెడలియట॥
దాగియుండ నొక స్థానము గనుటకు తనయుడటవి బోచుండఁ।
*ఆగుబ్బున నట నాలయమొక్కటి యతనికి నగుపడుచుండఁ॥ ౪.
మేదిని గుప్తముగా నదియుండెను మెలగక యుండిరి నరులు।
పాదుగ కొమరుం డందు చేరకొనె బహుగానొందుచు దిగులు॥ ౬.
ప్రసిద్ధముగ నట భానుని మూర్తియు భవ్యంబగునట్లుండెఁ।
సుశీలమతిచే జూచియు బాలుడు సూటిగనటు దండమిడెఁ॥ ౭.
భావశుద్ధిగని ప్రసన్నుడయ్యెను భానుడు ద్విజ వేషముతో।
నావుడు గిన్నెను క్షీరంబిచ్చుచు నయమగు వచనంబులతో॥ ౮.
మనోభయంబును మానుము నీవును మాధవుని స్మరింపుమనెఁ।
వినీతుండవై రాత్రియు బగలును విఠలు పేరు నుడువుమనెఁ॥ ౯.
సంకటమందక సంరక్షించెద సందియమొందకు మనుచు।
పొంకముతో నాబాపడు జెప్పియు బోయె నదృశ్యుండగుచు॥ ౧౦.
పితయు మాత యాయాసము నొందిరి బెంపుగ నేడుదినంబుల్।
సుతునిగానకయు పారంజూచిరి చొచ్చిపురంబున గృహముల్॥౧౧.
ఏడవదినమున నాబాలకుడును నేపున బైటికి రాగా।
వేడుకవచ్చిన బాలుని నటనొక విప్రుండుండియు గనగా॥ ౧౨.

*ఆగుబ్బ - అతిశయము.

ఇదిగని బాలుం డంతర గుహలో నెప్పటివలెనే దూరెన్।
పదపడి తండ్రికి పుత్రునిసంగతి బాపడు దెల్పుచుమీరెన్॥ ౧౩.
తన సమ వారిని తండ్రియు నప్పుడు తానుబిలుచుకొని వెళ్ళెన్।
ఘనకాననమున గుప్తంబగు గుడి గనిరి వార లవ్వేళన్॥ ౧४.
తిమిరంబగుటను దివిటివేసికొని దిగినడచిరి గుహలోన।
భ్రమలేకయు నా బాలుడు నిద్రను బడియుండెను తాగాన॥ ౧౫.
తల్లిదండ్రులును తనయుని లేపుచు తనుపోషణ మెటులనన్।
సల్లలితంబుగ జెప్పెను బాలుడు *చవి పాల్దాగితి గానన్॥ ౧౬.
సుజనుండగుచును బ్రాహ్మణు డొక్కడు నూటిగ పాల్నాకిచ్చు।
ప్రజారక్షణము చేయుభావమున పరిరక్షణ జేయించు॥ ౧౭.
ఈపలుకులవిని బహు లాలించుచు నితనిభాగ్య మేదోయని।
ప్రాపుగబిలిచిరి భానుదాసుడని భాస్కరు ననుకంప గని॥ ౧౮.
పితయు మాతయును బాలునెత్తికొని పెంపుగ నింటికిదెచ్చి।
సుతుచదివించుటకై శిక్షణమును నూటిగచేయగవచ్చి॥ ౧౯.
శ్రీహరి రక్షణ చేకొన్నందున శ్రీపతియే తోడనుచు।
మోహామమతతో కఠినుడుగాకయు ముద్దుజేయుచు నుంచు॥ ౨౦.
భగవంతుండును పొందికజేయగ ప్రాప్త్యగు నంతయు ననుచు।
మిగులతొందరగు విద్యలమానుట మేలని వారలుతలచు॥ ౨౧.
కొంతకాలమును గడవగజేసిరి గురుతుగ వైవాహికము।
సంతతమును శ్రీరామభజనయును సలుపును భానుడు దినము॥ ౨౨.
తల్లి దండ్రులును మేనులవిడిచిరి తగుకాలుని నియమమున।
ప్రల్లదముగ నా భానుదాసుడును భయవర్జితు డయ్యెగన॥ ౨౩.
పండరినాథుని ప్రాభవసేవల భక్తింజేయుచు నుండెన్।
కొంచెము జెప్పెడి కుటిలమనుజులను కూడక దానెపుడుండెన్॥
ఎవరి యుపార్జన నెప్పుడు జేయక నిచ్చి పుచ్చుకొనుచుండు।
వ్యవహారంబును సేయక యెవరిని వగపున గొల్వకయుండు॥ ౨४.

*చవి = రుచి.

భార్యాపుత్రులు పస్తుగనుండిన బాధకమొందం డతడు।
ఆర్యసమ్మతిని నుండగ కులజులు నచ్చటగూడిరి యపుడు॥ ౨౬.
భానుదాసుతో బలికిరి నీవును భార్యాపుత్రులతోడన్।
బూనివిద్యలను చదువక కాలము బోవుట కఠినముచూడన్॥ ౨౭.
మేమందరమును ముద్దలు పైకము మెలగు నూరువరహాలు।
నేమంబలరగ గూడియిచ్చెదము చేకొనవలె వస్త్రములు॥ ౨౮.
ఇతరుల కమ్ముచు నందు లాభమున నింటిప్రాపు జేయుచును।
మొదటిరకంబును మెల్లమెల్లగను మోసబోక నియ్యమను॥ ౨౯.
భానుడు సమ్మతి పడగ గృహస్థులు బట్టల నచ్చటగొనుచు।
మానుగ నాతని సాహుకార్లతో మచ్చికపడ జేయించు॥ 3౦.
వర్తకరీతిని నేర్పవలయునని వారికి తగ జెప్పుచును।
కర్తలగుచు ప్రార్థించగ భానుడు కడువడి మంచిదియనెను॥ 3౧.
వారలుజెప్పిరి వర్తకరీతిని వస్త్రము కొనువారలకు।
మీరి యసత్యము జెప్పుటచేతను మేలు లాభములు దొరకు॥
అతడు వినుకొని యసత్యమును నే నాడుటకును నొప్పననన్।
ఇతరులు నవ్వుచు బిచ్చాటనయె యితనినొసట వ్రాసెననన్॥ 33.
ఎన్నివిపత్తులు సంభవించినను నెపుడు సత్యమును వదలన్।
పన్నుగ బల్కుచు వర్తకమునకై భానుడు కూర్చుండె నిలన్॥ 3౪.
గిరాకి వారికి కొన్నధరలనటు గుఱితో జెప్పుచుతాను।
మరుగుజేయకయు మేలగులాభము మానుగ నటుదెల్పుచును॥
సత్యవచనమును జెప్పుచుజరిపెను చక్కగ వ్యాపారమును।
సత్యవాదియని యందరువచ్చిరి సరగున నతనికడకును॥ 3౬.
వచ్చువారలకు నొక్కవచనమె వరుసతోడ జెప్పుచును।
అచ్యుత కృష్ణా హరి రంగాయని యాతడు బలుకును నటను॥ 3౭.
భానుదాసుడును బొంకడనుచు తగ ప్రసిద్ధికెక్కెను ధరలో।
మానకగూర్చెను ధనమును బహుగా మహిని కొంతకాలములో॥

గిరాకియంతయు నితనియంగడికె క్రియతో వచ్చుచునుండు।
ఇరుగుపొరుగునను నుండు వర్తకులు నెరిగి ద్వేషులై యుండు॥ ౩౯.
అసత్యంబుగా నుండెడి మనుజులు నసూయతో బలికిరటు।
పొసగ వీసమున కొరగాకుండిన బుద్ధిలేని భానుడిటు॥ ౪౦.
మనసహాయముల మేలిమినొందియు మనకు కీడు గలిగించెన్।
జనులను మోహన చేయుటచేతను సరగనన్న ధరవచ్చెన్॥ ౪౧.
మరుమాటాడక కొనుచునుండుదురు మనుజులందర టగనుచు।
నెటిసత్యంబున మేముండినయెడ నేగెదరచటికి నగుచు॥ ౪౨.
పరిపరివిధముల బలుకుచు నిట్టుల బహుక్రోధముతో నుండన్।
గరిమెను నందరు గూడియంగడికి నరిగిరి యొకయెడ జూడన్॥ ౪౩.
సంతకూటమటు వేరుగ్రామమున సలుపంబడును గరిమెతో।
పంతంబుగనా భానుదాసుడును బైలుదేరి వారలతో॥ ౪౪.
తమ వ్యవహారము సలిపి దిగిరియటు తగునాలయ మందునను।
క్రమమొప్పగనట నొక్కడు దెలిపెను కరివరు కథ జరుగునను॥
హరిదినంబునను హరికీర్తన విని యానందించను మిగులన్।
పరితృప్తుండగు భానుదాసుడనె పాడుగబోవలె గ్రోలన్॥ ౪౬.
కూటమినుండెడు కుటిలవర్తకుల గోలిజెప్పె తానపుడు।
మూటలనిటు నేనుంచెద మీరలు మోసబుచ్చకయ కనుడు॥ ౪౭.
కాదని వారలు గోవిందునికథ కడగివినిన నేమగును।
నీదుమూటలను మేముజూడమిటు నీవెంటనుంచు మనుచును॥ ౪౮.
భానుదాసుడును బలికెనందులకు పండరిపతి భావమున।
బూనియుంటచే బట్టలమూటలు పోనుండిన సమము యన॥ ౪౯.
అనుచు జెప్పుచును నప్పుడె వెళ్ళెను హరిగుణ కీర్తనమునకు।
చనువునజేసె నమస్కృతి నాతడు సాదరహరి దాసులకు॥ ౫౦.
విష్ణునికథలను వారువచింపగ వినుచుండెను మోదమున।
కృష్ణస్మరణను గురితో చేయుచు క్రియనుండిరి జనులుగన॥ ౫౧.

దేవాలయమున దిగిన వర్తకులు తెంపున మోహించుచును।
సేవాశూన్యత భానునిమూటల జేర్చి బొందలో నిడుచును॥ ४౨.
భానునిగుజ్జీము పారదోలిరటు వంట పైరులకు చెంతన్।
సానందముతో పల్కుచునుండిరి సకలమూటలను వింతన్॥ ४3.
అపహరించిరిటు తస్కరులనియును వతనికి జెప్పియు మనము।
నెపమున బట్టల పంచుకొని యెదము నిజనష్టము నొందునుము॥
ఈవిధమున నా వర్తకులందరు సేపున మోదమునొందన్।
గోవిందుని దయలేక తస్కరులు కోరివచ్చి ముదమందన్॥ ४४.
వర్తకులసరకు గైకొని వెళ్ళిరి వారల యశ్వంబులతో।
కర్తలమనుచును కలియబోవగను కడుకొట్టిరి కఱ్ఱలతో॥ ४౬.
దెబ్బలచేతను తలలువంచుకొని దీనతవారుండుచును।
ప్రబ్బియు మనమిటు భానుదాసునకు ప్రబలహాని దలపగను॥ ४౭.
ఈశ్వరక్షోభయు నేర్పడెననుచును నెలమి దుఃఖమున నుండన్।
శాశ్వతమిదియని విష్ణుని కథలను సరి విని భానుండుండన్॥ ४౮.
అరుణోదయమున హారతులియ్యగ నప్పుడు భానుడు లేచెన్।
హరిదాసులకును నంజలిజేయుచు నటుదా వెలి నేతెంచెన్॥ ४౯.
హరి తనచేలిని యశ్వము నిడుకొని యా దారిని తానుండన్।
నెఱినాశ్చర్యము నొందుచు భానుడు నిగుడెదెట్లు యిటులుండన్॥
విప్రవేషుడా గుఱ్ఱముగట్టిగ వే వలువను బట్టుచును।
క్షిప్రంబుగ తన చేతికినిచ్చుచు శీఘ్రంబుగ వెళ్ళగను॥ ౬౧.
కౌతుకమున దా గుడికిని వచ్చెను కరమునిడుచు నశ్వమును।
భీతిని వర్తకు లేడ్చుచునుండిరి వేధల బహు నొందుచును॥ ౬౨.
అదిగని భానుం డడిగెను వారల నారోదన కారణము।
పదపడి వారును బలికిరి యప్పుడు బద్ధజనులమై మేము॥ ౬3.
నీకు దుఃఖమును నొందించుటకై నీదుమూటలన్నియును।
ప్రాకటముగ నొకబొందను వేసియు గ్రహింపగా దలపగను॥

దేవుని దయయును లేక దొంగలును మావలువలు దొంగిలిరి।
చావు దప్పెనిటు మేనుదెబ్బలను సారెకుగొట్టి యరిగిరి॥ ౬౫.
తొందరలయ్యెను దొంగ లశ్వముల తోకొన నీ గుఱ్ఱమును।
పొందుగ మేమును విడిచి పెట్టగను బూనివచ్చితివి యిటను॥౬౬.
విపరీతంబై వెలసెను కర్మము విధికుటుంబ మెట్లగును।
నెపమున సొమ్మును మునింగిపోయెను నిలకడ చెడెమాకికను॥౬౭.
భగవంతుడు నీ బట్టమూటలను పదిలపరచె నిటజూడర।
పగవకుండుమని జెప్పగ ఖానుడు పరుసతోడ కొనియాడర॥ ౬౮.
చిత్తద్రవమును చేకొని యాతడు చింతించెను తనలోనర।
ఇత్తరి నశ్వము చేబట్టిన వాడీశుడు హరియే గానర॥ ౬౯.
కఠినజన్మమును గాల్పనె హరికిని కడుతొందర నిచ్చితిని।
వికలరంగడు వేదాతీతుడు విశ్వంభరితు డతడుమని॥ ౭౦.
శ్యామలసుందర సుకుమారుండును సర్వేశ్వరు డగువాడు।
కోమలబ్రాహ్మణ వేషము గొనియటు గుఱ్ఱముచేకొన్నాడు॥ ౭౧.
పండరి పతికిని కడుతొందరనే బహుగానిచ్చితి ననుచు।
ఖండితముగనే కర్మము చేయను కరుణను వారల గనుచు॥ ౭౨.
మనోదుఃఖముల గైకొన కుండుడి మానుగ నాసొమ్ములను।
నెనరుగ మీకే యిచ్చెదననుచును నిగుడదెచ్చి వెలుపలను॥ ౭౩.
బట్టమూటలను విప్పియు నాతడు పంచియిచ్చె వారలకు।
దిట్టముగానే శ్రీహరినామము తేటతోడ తాబలుకు॥ ౭౪.
గుఱ్ఱము ద్రవ్యము తోడనెయిచ్చియు కోరివచ్చె నింటికిని।
విఱివీగి తానొకరి యార్జనను వెలయ నొల్లకుంచెగని॥ ౭౫.
అతిప్రేమను దా హరిని భజింపుచు నానందం బొందుచును।
ప్రతినిత్యంబును పండరి పతిపై బాడుచు కీర్తింపగను॥ ౭౬.
జనులందరు వినుచుండుడు చేరియు జగన్నాథు చరితములు।
అనువుగ నెవ్వరు నేమియిచ్చినను గొని యామోదించునిల॥ ౭౭.

కుటుంబ యుతుడై గృహమున నుండియు గొప్ప విరాగుండగుచు।
పటుతర ప్రేమను పండరినాథుని భజించు చుండెను గనుచు॥ ౭౮.

---

పండరివాసుడు బ్రాహ్మణు డొక్కడు వచ్చె దేశ యాత్రకును।
దండిపురంబుల తా జూచుచు మరి తర్లె విద్యానగరమును॥ ౭౯.
స్నాన సంధ్యలను సలిపియు పిదపను చనె నరపతి గృహమునకు।
మానుగ బంటుల నడిగియు నేగెను మరియునంతఃపురమునకు॥ ౮౦.
నృపవరు డాతని గని పూజింపగ నెఱిమోదము నొందుచును।
కృపాధర్మముల పరిపాలించెడు క్షితలక్షణువని ద్విజుడను॥ ౮౧.
ఏయూరనుచును నృపవరు డడుగగ నిలలో పండరి యనుచు।
నేయముతో ద్విజుడనె నేవచ్చితి నెఱి నీ కీర్తిని వినుచు॥ ౮౨.
నృపవరు డని యెను స్నానంబిప్పుడు నేజేసివచ్చి పిదపన్।
చపలత లేకయ శ్యామలాంబకును సరగున పూజల సలుపన్॥ ౮౩.
సంభావననే చక్కనిత్తునన సంతోషించియు ద్విజుడు।
దంభము లేకయు విప్రుడుండగను ధరణీపతి గ్రుంకులిడు॥ ౮౪.
దేవీపూజకు వెళ్ళగ నరపతి ద్విజుడును వెంబడి వెళ్ళెన్।
భావగమ్యుడై భవాని కోవెల బహురమ్యత విలసిల్లెన్॥ ౮౫.
అంతరగృహమున నలంకరించిరి యమిత పుష్పములచేతన్।
పంతముతోడను పరిపరివాద్యముల్ బహుగాజేసిరి ప్రోతన్॥
వేదవేత్తలును వేదముజెప్పగ విశాలాక్షికిని నపుడు।
మేదినిపతియును పూజలజేసెను మేలని ప్రజ గొనియాడు॥ ౮౭.
ప్రసాదమంతయు బంచినపిదపను *పారుని నరపతి బిలిచెన్।
వసుమతిలోపల విఖ్యాతంబై వరుస నంబికయు మించెన్॥ ౮౮.
గురుతర మహిమను గొనియాడందగు కులదేవత తనదనుచు।
చిరతరఖ్యాతిని సకలజనంబులు సేవించెదరిటు మనుచు॥ ౮౯.

---

*పారుని - బ్రాహ్మణుని.

స్వహ స్తములనే చేసెద పూజను సలలితముగ దేవికిని।
అహమున రేయిని నలంకరించుచు నార్తిగలిగి యుండగని॥ ౯౧.
భూపతులెవ్వరు పండరియందును పూజచేయ రారుగదా।
ప్రాపుగ పూజలు పాండురంగనికి బాపలొనర్తురు కాదా॥ ౯౧.
ద్విజవరులందరు దుర్బలులగుటచే దివ్యభూషణలతోడన్।
నిజమగు పూజల సలుపగనోపరు నిండుగ నగలను నిగుడన్॥ ౯౨.
పండరినాథున కుండ నేరదని పలుకగ పృథ్వీపతియు।
దండిగ కోపము ద్విజుడు నొందుచును ధరణినాథ వినుమనియు॥
పండరిచూడక భవాని శ్లాఘ్యత బలుకుట న్యాయమె నీకు।
వెండి నీరుచే విఖ్యాతంబై వెలసెను నీగుడి తళుకు॥ ౯४.
స్వర్ణరత్నములు చేర్చినగుడియగు, సారతరపు పండరియు।
నిర్ణయింపబడె విశ్వకర్మచే నేర్పురచన గలదయ్యు॥ ౯౫.
కామధేనువును కల్పవృక్షమును కలుగును చింతామణితో।
ప్రేమను భక్తుల మధురగానమును బెంపొందును నట గరితో॥
ప్రవాహపూర్ణిని భీమానదియును బరగియుండు నచ్చటను।
నివాసమగునది భక్తజనులకును నిత్యమంగళంబుగను॥ ౯౬.
అందముగా గంధర్వులు పాడుచు నటనుందురు శివుడాడన్।
సందియమొందక తారకజపమును సలుపుచునుండును వేడన్॥
నలుముగ వేల్పును నాకవాసులును నంజలిహస్తులరగుచు।
చలనములేకయు నుతులనొనర్తురు సర్వేశ్వరునటు మనుచు॥ ౯౯.
పరమాత్ముడె శ్రీ పాండురంగడై భక్తరక్షణము జేయున్।
పురియగు పండరి వైకుంఠంబును బోలుచుండు తగ మరియున్॥
శ్రీహరి విభవము జెప్పతరంబె శ్రీభవానియును నాడ।
ఊహను తానటు నంగణమంతయు నూడ్చుచునుండును జూడ॥
మేదినిపతికిని హెచ్చగుకోపము మించివచ్చె మరి యపుడు।
సాదరముగనే స్వర్ణపుగుడియని సరగవినను యేనాడు॥ ౧౦౨.

మూలపీఠమున ముఖ్యవాసియై ముపుర కాదియగు దేవి।
పీలుగ నీవును దాసీ యనగను వింటిని నే నిటను చెవి॥ ౧౦౩.
విహిత శిక్షనే జేసియు నిన్నుఁ వెడలించెద నడవికని।
బహుకోపముతో బలుక బ్రాహ్మణుడు భయమొందక బలికె విని॥
పండరియందున పాండురంగనిఁ ప్రత్యక్షము జూచినను।
ఖండితముగ బహుగుణాధికంబై కనబడుచుండి య్యెడను॥ ౧౦౪.
సత్యము జెప్పితి, నీవు జూచిమరి సలుపు శిక్ష నాకిటను।
ప్రత్యయముగ నీ వాతని జూచిన భవానిపూజ వదలుదను॥ ౧౦౫.
వేదాంతంబును వినక యుండినను వేరు శాస్త్రముల గోరు।
నాదా తీతుడు రంగని జూచిన నదుల సంశయము దీరు॥ ౧౦౬.
ఇదివిని యాన్నృపు డటు జేయుదునని యెలమి సేన తోడుకొని।
విదిత మంత్రులను పోగుజేసికొని వెళ్ళె పండరి పురికిని॥ ౧౦౭.
పండరి విప్రుడు బహు తొందరగని పాండురంగనిం దలచె।
నిండు ప్రేమతో నారాయణ హరి నేడు బ్రోవుమని గొలిచె॥
చెప్పిన విధమున చూపని యెడలను శిక్షచేయు నీ నృపుడు।
ఒప్పగ వేడెద శ్రీశ ముకుందా యోదయాళ విను మిపుడు॥౧౧౦.
బహుదుఃఖముతో పలుమారును నే ప్రార్థింతును తగనిన్ను।
ఇహమున సాధులు జెప్పిన రీతిని నెరిగించితి నృపునకును॥ ౧౧౧.
శ్రీ వైకుంఠమువలెను పండరిని సేవింపని యెడ *ఱేడు।
భావబంధమున శిక్షను జేయును ప్రాణహాని తగ నెగడు॥ ౧౧౨.
అనాథ నాథా యచ్యుత కృష్ణా యాపద్బాంధవ యనుచు।
వినీతు డగుచును సన్నుతి సేయగ విఠలుడు రుక్మిణి బిలుచు॥
పండరి వర్ణన బహుగా జేసెను బ్రాహ్మణుండు రాజునకు।
మెండు సేనతో మనకడ వచ్చును మేదినిపతి కన్నులకు॥ ౧౧౪.
ద్వారక సమముగ దీనిం జేయుము తవిలి ముహూర్తము వరకు।
తీరును విప్రుని కోరికె యిందున స్థిరమంగళమగు మనకు॥ ౧౧౫.

*ఱేడు - రాజు.

తలపగ రుక్మిణి పండరిపురమును ద్వారక సమమయ్యె నును।
ఇలపతి యప్పుడు దారిని నడచుచు నేతెంచెను పురికడను॥౧౧౬.
ఏనుగపై దానెక్కుచు విప్రుని నేర్పడరమ్మనె నచట౯।
గానకయుండిన నీవుజెప్పినటు ఘనముగ శిక్షింతునిట౯॥ ౧౧౭.
అనుచుజెప్పుచును నటువెళ్ళంగను నాతని నేత్రములకును।
ఘనతేజముతో గుడిశిఖరంబును గానుపించె తగ నటను॥ ౧౧౮.
పున్నమ చందురు బోలినకాంతిని బొడగనె నా నరపతియు।
తిన్నగ నేనుగు దిగియు ప్రేమను దీర్ఘదండముల నిడియు॥ ౧౧౯.
ధరణీనాథుడు ద్విజవరుగనుగొని తథ్యము బలికితినీవు।
నెరి సత్యంబని యెంచక నిను నే నిందించితి ననుగావు॥ ౧౨౦.
నమస్కరింపగ నావిప్రుడును ననుప్రోచెను హరియనుచు।
రోమరోప్పంగను ప్రేమభావమున గోవిందుని మది దలచు॥౧౨౧.
సమారంభమున సంతోషముతో చనుచుండగ నరపతియు।
అమేయ కల్పకతరు కామధేను నల చింతామణి గనియు॥ ౧౨౨.
పక్షులుగూడియు పాదపములపై బాడుచు నటనుండగను।
అక్షీణంబగు నంబువుతోడను నట గంగయు వెలుగగను॥ ౧౨౩.
హంస మయూరము లచ్చట నచ్చట నాడుచునుండెను చూడ౯।
శంసితముగ నచ్చరలును నృత్యము సలుపుచు నచ్చటనుండ౯॥
భగవద్భక్తులు పాడుచునాడుచు బ్రహ్మానందము నొంద౯।
పొగడగ నామము భక్తులు సాధులు భూరిసుఖము యింపొంద౯॥
స్వర్ణమయంబగు ద్వారకాపురికి సమాన రచనల నుండె౯।
నిర్ణయింపబడి మాణిక్యములతో నెగడుచు పండరి యుండె౯॥
మూర్తీకరములై ముఖ్యతీర్థములు మునగ భీమనదియందు।
పూర్తిగ వీటిని పృథ్వీనాథుడు పొందుగ గని ముదమొందు॥
చంద్రభాగలో స్నానముజేయుచు చనె విఠలుని సన్నిధిని।
ఇంద్రుడు మొదలగు దేవతలందరు నిశుగొల్వ తానుగని॥ ౧౨౮.

అష్టసిద్ధులును నంగణమూడ్వగ నవనీపతియును గాంచెన్।
ఇష్టదైవమగు నంబాదేవియు నేపున శ్రీహరి గొలిచెన్॥ ౧౨౯.
ఇలపతి యా యంబనుగని యడిగెను నిట నూడ్చెదవేలయని।
సలలితంబుగా నామెయుజెప్పెను సర్వేశ్వరు సన్నిధిని॥ ౧౩౦.
అనంతశక్తులు గూడియుందురటు నందొక్కరితెను నేను।
వినమితులగుచును నితర తీర్థములు విశ్వసించి తగనిటను॥ ౧౩౧.
బరతెంచుచు మరి పావనులగుచును ప్రాపుగ వెళ్ళెదరెపుడు।
నిరవధికంబగు నిత్య మహిమయును నెలకొన్నది యనుచుండు॥
బహువిస్మితుడై పృథ్వీనాథుడు పారజూచె నారదుని।
సహచరు తుంబురు సంగీతంబును సలిపి దిరువురును గుడిని॥ ౧౩౩.
స్త్రీలు పురుషులును చతుర్బాహులై చెలగుచుండిరచ్చోటన్।
వీలుగ శంఖము చక్రంబులతో వెలసిరి జయవిజయులటన్॥ ౧౩౪.
గగనభాగమున గరుడపతాకలు గనుపించుచు నటనుండెన్।
అగణిత కాంతుల నాతడు జూచియు నప్పుడె దండంబునిడెన్॥
అంతరాళమున గర్భగృహములో నటుచొచ్చియు శ్రీహరిని।
అంతరరాముని నార్తరక్షకుని నమిత భవ్య విగ్రహుని॥ ౧౩౬.
శ్యామల సుందర సుకుమారుండును సరస నవ్వుగల ముఖము।
కామిత ఫలదుడు కరయుగ్మంబుల కటితలమందుంచు సుము॥ ౧౩౭.
భక్తరక్షణము జూచుచునుండెడు పరబ్రహ్మమగు నతడు।
ముక్తపురుషులకు ముదమొందుచుదా మోమునుజూపెడి విభుడు॥
అనుభవజ్ఞానులె యాతనిగురుతును నరయుచుంద్రు తమలోను।
వినుతులజేయను వాక్కులుచాలవు వెలసిజెప్ప నెట్లగును॥ ౧౩౯.
ఇట్టి నిరుపముని నీశ్వర మూర్తిని నిలపతిజూచుచు ముందు।
బట్టెను పదములు భక్తిని మస్తక భాగమునకుపై నందు॥ ౧౪౦.
పండరినాథుని బ్రాహ్మణుకృపచే బాగుగజూచితిననుచు।
కొండలరాయని కరుణయె యిదియని గోవిందుని నుతియించు॥

ఇంద్రుడు మొదలగువారలగాంచితి నెల్లసిద్ధులను గంటి।
చంద్రకాంతితో నొప్పు వికుంఠము సరి పండరి కనుగొంటి॥ ౧౪౨.
పావనుడను నేనైతి బ్రాహ్మణుడ పదపడి మన్నించుమిటన్।
బావశుద్ధితో బలుకగ నప్పుడు ప్రబల రచన కోయెనటన్॥ ౧౪౩.
ఈశుమాయచే నదృశ్యమగునపు డిలపతీ వింతను బొందెన్।
పేశలముగ నొక పల్లెటూరువలె పెంపుగనది వెలుగొందెన్॥ ౧౪౪.
నరనాథుండీ చిత్రమునంతయు నయముగ తా జూచుచును।
సరగున హరిపై జేర్చెను చిత్తము సకల కారణుడనుచును॥౧౪౫.
భవానిపై తా భక్తిని వదలుచు పండరిపతి జూచుచును।
అవాప్తకాముడ, దయతో వినునా యార్త వాక్యములనుచును॥
శరణాగతినై చేరితి నీకడ కరుణింపుము హరినీవె।
వరుసను విప్రుడు విద్యానగరము వచ్చుట శ్లాఘ్యమునువ్వె॥
భక్త వాంఛలను పూర్తిజేయుటయు భవ్యంబగు గద నీకు।
సక్తుడనై నీ చరణసేవయే సలుపుదు మోక్షముకొఱకు॥ ౧౪౭.
కారుణ్యాలయ కృపజూడుమునీ కైంకర్యంబున నెపుడు।
తీరుగ నుండెదననుచు వేడగను తేటగ రంగడు నపుడు॥ ౧౪౮.
ప్రసన్నుడై యనె వచ్చెద, భూమిపై పదపడి యుంచకు నన్ను।
వెసతోగైకొని పొమ్మని దెల్పియు విష్ణుని దాసులయెడను॥ ౧౫౦.
నీతిమార్గమును దప్పితి వేనియు నేనట నుండననుచును।
ఆతండిట్టుల జెప్పగ నరపతి యతిహర్షము నొందుచును॥ ౧౫౧.
మనుజుల నిలిపెను మార్గమునందును మహిం తన నగరము వరకు।
ఘన విగ్రహమును కరములపైగొని క్రమముగ జేర్చెను యటకు॥
అర్చకులందరు పలుకక యుండిరి యవనిపతికి భయపడుచు।
వచ్చిస్సునదా నగరికి దెచ్చియు వరుసను నటు స్థాపించు॥ ౧౫౩.
నిజభక్తుండై యెల్లపూజలను నెనరున తానె యొనర్చెన్।
గజిబిజి లేకయు గౌరవమునదా కంజాక్షుని సేవించెన్॥ ౧౫౪.

భాగవత జనులు పండరిపురినికి వచ్చిరి యాషాఢమున।
*అగుబ్బగ శ్రీహరిని గానకయు ననుతపించి తమలోన॥ ౧౫౫.
ఒకరితో నొకరు బలికిరి శ్రీహరి యొగి పండరి నెటువదలెన్।
సకలాలంకృత సతి తన పురుషుని †సడి విడినటు రాజిల్లెన్॥ ౧౫౬.
ఏమొనర్తమని యందరు గూడియు నెటుదోచక యుండగను।
ప్రేమ భక్తుడగు భానుదాసుడును ప్రియమున లేచియునవెను॥
విఠలరంగని వేంచేపించెద విద్యనగర ముండిగనన్।
కఠినకరంబుగ ప్రాణము మాన్పెద కమలేశుని తేకున్నన్॥ ౧౫౭.
ఈవిధమున తా నేర్పడ బలుకుచు నేగె విద్యానగరమును।
భావశుద్ధినెటు విఠలుని చూతును ప్రజలను నటు వేడుకొను॥
ఏకాంతంబున దెల్పిరి వారలు నీశుమూర్తి నృపవరుడు।
ప్రాకారంబగు యింటిలోపలను బాగుగ నిడికొని యుండు॥౧౬౦.
శ్రీహరి పూజను జేయువేళ ప్రజ చేకొందురు దర్శనము।
బాహుళ్యంబుగ కవాట బంధన పరచెదరటు నను వినము॥ ౧౬౧.
భానుడు వెళ్ళెను రాజగృహమునకు ప్రబలరాత్రిలో తాను।
మానుగ కావలిజనములు నిద్రను మరచి యంద రుండగను॥
తలుపును ముట్టగ తాళము క్రిందుగ తానుచూడ నటుబడియెన్।
వలచియు గుడిలో హరికిని నాతడు వచ్చియు దండంబిడియెన్॥
పండరినాథుని శ్రీకరమూర్తిని భక్తితోడ జూచుచును।
నిండు ప్రేమతో పదముల పైబడి నెనరును కడునొందుచును॥
నారాయణ హరి మధుసూదన శ్రీ నందనందనా యనుచు।
చేరితి వెందుకు సార్వభౌముకడ చెలగివచ్చి యిటు మనుచు॥౧౬౫.
పండరియందును బహుముఖములుగా భక్తసమూహము గూడెన్।
నిండారగ తగు నేత్రోత్సవముగ నిన్నట గన లేకుండెన్॥ ౧౬౬.
క్లేశమునొందిరి గోవిందానీ కృపజూపుము వారియెడన్।
దేశముడిగినే నీకడ కరిగితి దేవ రమ్ము నాతోడన్॥ ౧౬౭.

---

*అగుబ్బ - అతిశయము. †సడి - ప్రసిద్ధి.

ఏమికారణం బిచటికివచ్చుట కిష్టులు చనరీ చెంతన్।
నామగర్జనయు నెల్లకాలముల నచ్చట జేయుటచేతన్॥ ౧౭౮.
విన సహింపకను వచ్చితివాయిటు విఠలరంగా యనియు।
పనిబడి వారికి ప్రేమనుజూపక పరుగిడితివె యిటకనియు॥ ౧౭౯.
జనము లనేకులు జేరగ యాత్రను శ్రమజెందితివే నీవు।
దినమును నిచ్చట నొంటరివగుచును దెలియకుండు లేమీావు॥
భగవత్పదముల బట్టగనప్పుడు పాండురంగడును బలుకు।
వెగటుగ నాశలవిడిచి మీారు నను విధితోడను గొలుచుటకు॥
సిద్ధులనిచ్చెద ననుచుజెప్పినను చేకొనకుందురు మీారు।
పెద్ద ఋణము నాపై బడెననుచును వెసవచ్చితి నీతీరు॥ ౧౮౨.
సేవా ఋణమును నేను సకలురకు చెల్లించనుయని మీారు।
భావబంధమున విడనాడుటచే పరుగిడి యిటు నేజేరు॥ ౧౮౩.
బందిఖానలో పడినట్లున్నది పందరి విడిచిన మొదలు।
పొందుగ మీారలు యిత్తరిరాకనె బోతిరిగద యిదివరలు॥ ౧౮౪.
ప్రొద్దుబొడవగను పూజవేళలో బొడగందును నేనిన్ను।
సద్దుజేయకను సంశయించకని స్వర్ణపు మణిహారమును॥ ౧౮౫.
భానునిమెడలో బడవేయంగను బైటికి వెలువడె నతడు।
మానుగ మునువలె మూాయగబడినవి మహి కవాటములు నాడు॥
ప్రతిదినంబునా పృథ్వీనాథుడు ప్రాతఃకాలమునందు।
హితవుగ నారతులిచ్చుచునుండును, నింపుగ నాదినమందు॥ ౧౮౮.
ఆరతినియ్యగ హారము గళమున నగుపడకుండుటచేతన్।
కోరియు పూజా గురువులపైనను కుపితుడగుచు నాచెంతన్॥
దొంగతనంబును కనుగొనుటకునై తోలె నరుల వెదకుటకు।
భంగము నొందక పరిపరిస్థలముల ప్రజలును వెతికిరి కడకు॥ ౧౮౯.
నదిలో భానుడు స్నానముజేసియు నరహరి భజించుచుండన్।
పదపడి హారము నాతని గళమున బాగుగనుండగ జూడన్॥ ౧౯౦.

దొంగ దొరికెనని త్రాళ్ళనుగట్టుచు తోలిదెచ్చిరి రాజుకడన్।
పొంగుచు తోడనె పతకహారమును భూపతి యటు గనుచుండన్॥
సొమ్ము రాజునకు శీఘ్రంబిచ్చియు నాటిశిక్ష యేమనగన్।
అమ్మహీపతియు నెట్టి దొంగయని యరయువిచారణ లేకన్॥౧౮౨.
కుపితుడగుచు శూలపుకొన వేయను గొప్పశిక్ష నియ్యాపను।
చపలత భానుడు దూతలగాంచుచు సరగనేగు నాయువును॥
సమీపవర్తిౕయు శ్రీహరిరంగని సరగున గనివచ్చెదను।
కోమరొప్పగనా పాండురంగనిన్ కోరిచూపుమనగాను॥ ౧౮౪.
అవనీపతిచే నాజ్ఞనందుకొని హరికోవెలకును రాగన్।
సవినయముగనా భానుడు హరితో సరసమాడనటు దొడగన్॥
దేవరవారిని గైకొనివెళ్ళను తెంపున నిచటికిరాగన్।
సేవకునకు మెడ హారమువేసియు చెలగితి వేకాంతముగన్॥౧౮౬.
భూపతియును నా ప్రాణఘాతమును బూనుకొనియు నున్నాడు।
నీపున నా ప్రాణంబులుబోవగ నెలమినీవు సుఖముండు॥ ౧౮౭.
నీదుమనంబున నిట్టివిచారము నెనరున తగనుంచుకొని।
పాదుగ తంత్రము జేసితివిట్టుల పది జన్మములైనగని। ౧౮౮
నినునే వదలను నారాయణయని నీరు కనుల రాలగను।
వినుతిజేయగా ప్రభువు జవానులు వేరమ్మని జెప్పుచును॥ ౧౮౯.
తరుముచు వెడలిరి శూలంబాతని తలపైనుంచిరి గనియు।
పరిపరివిధముల బాధింపంగను బహుళతరంబున ప్రజయు॥ ౧౯౦.
విహరించుచునటు వచ్చిరి నగరము వెలుపలజూచుచు చెలగు।
బహుభారంబగు శూలమునచ్చట పాతిరివేగము బాగు॥ ౧౯౧.
భక్తునిముందుగ నుంచగ నాతడు పతితపావన మురారీ।
సక్తిగ నినునే మదిలోనుంచితి చక్కగ ననుగావు హరి॥ ౧౯౨.
దివిభువి రెండును తలక్రిందైనను ధీరసముద్రము లేదును।
నువిశేషంబుగ సమరసమైనను నాటిని చెదరనునేను॥ ౧౯౩.

దేహము నీకును దృష్టిచుట్టిమరి తిరముగ బడవేసెదను।
బాహుళ్యంబగు ప్రళయము నందును బట్టుకొనుచు నుందు నిను॥
ప్రాణభూతుడవు ప్రాణనాథుడవు పరమపురుషు వనగాను।
త్రాణను శూలము చిగురించెనునా ధరను మిగుల వెలుగగను॥
పల్లవదళములు ఫలసుమములతో పాదపమై యదియుండన్।
సల్లలితంబుగ జూచుచు వారలు సరగననిరి రాజేంద్రన్॥ ౧౯౬.
అతివిస్మితుడై వచ్చుచు నరపతి యచటివింత జూచుచును।
పతితుడనని హరిభక్తుని పదముల బట్టె ప్రీతిఘనముగను॥ ౧౯౭
అవివేకుడనై యపచారంబుల నరయక జేసితినిక్కు।
సవినయముగనే భక్తునిచేకొని చనెనటు శ్రీహరి గుడికి॥ ౧౯౮.
శ్రీహరినచ్చట జూడగ భానుడు చేతబట్టె చరణముల।
మోహముతోడను మురారి యతనికి ముదము జూపి విలసిల్లె॥
నీదుభుజంబున నన్ను మోసికొని నెటె నరుగుము పండరికిన్॥
పాదుగ నచ్చట పుండరీకుని భవ్యాశ్రమమగు యునికిన్॥ ౨౦౦.
క్షితిపతివిని నీవరుగుటబాడియె శ్రీరంగాయని వేడన్।
హితమగు నీతిని దప్పితిపీవిల నేనుండను నిటు జూడన్॥ ౨౦౧.
ఎద్ది సుకృతమో యాచరించితివి యేనుంటి నా హేతువునె।
పద్దుగ నాదగు రూపము నీమనః పద్మమందు నుంచుమనె॥ ౨౦౨.
భానుదాసుడును భగవంతునిగని భారమగు విగ్రహమును।
నేనొక్కడగుచు నెట్టు వహింతును నేరను సామర్థ్యమును॥ ౨౦౩.
హరియనె నేనీ స్వాధీనుడనై యమరియుంటి నివ్యోడను।
గురుతుగ నప్పుడు సూక్ష్మరూపమును కోరియుడా బొందగను॥
దేవతార్చనపు తిరుమణి పెట్టెను తీరపరచుచు భానుడును।
భావశుద్ధితో నుంచుచు చంకను బైలుదేరె నాతడును॥ ౨౦౪.
పురసమీప పద్మాలయమునకును బోవగ నపుడచ్చటను।
హరిమూర్తిని నట నునిచి యుదకమున కాతడు తగపోగాను॥

ఇంతలోన హరి యున్నత రూపున నెలమిని దానట నుండెన్।
పంతముతో నా భానుదాసుడును భగవంతుని గనివేడెన్॥ ౨౦౭.
వాసుదేవ పండరిలో నిను నెటు వలసి జేర్తుననగాను।
వాసిగ హరియనె సాధుల నిచటికి వచ్చునటుల జేయుచును॥ ౨౦౮.
సమారంభమున పండరిపురిలో చక్కజేర్చు మీదినము।
ప్రమాణ మొప్పగ సుదినం బిదియగు పరమ సుఖంబగు సుమ్ము॥
భానుదాసువిని బహు సంతసమున పండరిపురికిని రాగన్।
ధ్యాన నిష్ఠులగు భక్తు లితనికై తలపడి గనుచుండంగన్॥ ౨౧౦.
క్షేమాలింగన మొసగిరి భానుడు చేరిన తక్షణమందు।
ప్రేమను నతడనె పద్మాలయమున ప్రియహరి వచ్చింపొందు॥ ౨౧౧.
అచ్చటి జనులును నర్చకులును మరి యతి మోదము నొందిరటు।
పచ్చని తోరణ భజంత్రీలతో పద్మాలయము జేరిరటు॥ ౨౧౨.
శ్రీహరి నామము జయ విఠ్ఠలయని జెప్పుచు తగు మార్గమున।
బాహుళ్యంబగు నుత్సవ మలరగ పాండురంగని రథమున॥ ౨౧౩.
వైభవ మొప్పగ వేంచేపించిరి వాసిగ పండరి పురము।
శోభను రాగను చంద్రభాగలో సూటిగ నాడి జలకము॥ ౨౧౪.
దేవాలయమున కరుగ జేసిరటు దివ్యంబగు శిబికపయిన్।
సేవారతులై జేర్చిరి లోపల స్థిరమగు నాసనము పయిన్॥ ౨౧౫.
విప్రులందరును వేద మంత్రముల విధ్యుక్తంబుగ జెప్పన్।
అప్రమేయుడగు హరికిం జేసిరి యభిషేకంబును నొప్పన్॥ ౨౧౬.
పూజల వడసియు పక్వాన్నంబుల పూని తాను గైకొనుచు।
తేజమలరగను పుష్పాం జలులను దీపారతులను గొనుచు॥ ౨౧౭.
సుఖాసీనుడై క్షేమమలర హరి సుందర తనుడై యుండె।
సకల జనంబులు పండరి పురమున సంత సిలిరి యానాడె॥ ౨౧౮.
శ్రీహరి చిత్రము జెప్ప నలవియె శేషునకును భువిలోను।
బాహుళ్యంబగు గుణాను వాదము బాలకృష్ణుడెటు జెపును॥ ౨౧౯.

## బహిరంభట్టు చరిత్రము.

బహిరంభట్టను బ్రాహ్మణు డొక్కడు పైటను పురమున నుండెన్।
మహిత శాస్త్రములు మిగులజదివియును మన్ననతోనట నిగుడెన్॥
విద్యార్థులకును విద్యను జెప్పును వేదశాస్త్ర పఠనమును।
ప్రత్యహంబునను నగ్ని హోత్రముల భక్తితోడ జేయుచును॥ ౨.
సామర్థ్యంబును చక్కగ గలిగియు సలుపడు స్మృతు దర్శనము।
నేమము దప్పక జీవించును దా నెఱి నయాచ్న వృత్తిసుము॥ 3.
నిత్యము గంగానదిలో స్నానము నియతంబుగ జేయుచును।
సత్యబుద్ధితో దేవ పూజలను సలుపును నిరుజాములును॥ ౪.
వైశ్వదేవ నివేదన జేయును వచ్చు ద్విజుల కయ్యెడను।
ఈశ్వరప్రీతిగ భోజనమిచ్చును యిల భాగవతము జెపును॥ ౫.
ఈవిధమున తన యేర్పాటుండగ నేపున నొక దినమందు।
పావనాన్నమును బ్రాహ్మణులకు సతి పరిమార్చెడు తరియందు॥ ౬.
భర్తయు సతితో బలికెను లవణము పచ్చడిలో కొఱతయని।
కర్తయై భార్యయు నరువది యేడులు గడిపి తీపు వయసుగని॥ ౭.
వడిజిహ్వా చాపల్యపు రుచినిన్ వదలకుంటివీవనగన్।
కడుసంహార క్రియయగు వచనము *కసరున బహిరుడు వినగన్॥ ౮.
అనుతాపముతో సార్థక మగునటు నరసిఁము యత్నము జేయు।
చనువుగ నాతడు భార్యకు దండము సలిపి యపుడె తాగనియు॥ ౯.
మోదముతో తల్లీ నీ మాటను ముఖ్యముగా గొంటినను।
పాదుగ పూర్వము సుకృతంబులనే బహుగ జేసితి గనుకను॥ ౧౦.
నీ పలుకులచే నాకు విరాగము నెనరున నిప్పుడు గలిగెన్।
ప్రాపుగ నిటులను జెప్పియు చేసెను పర్యాలోచన వేగన్॥ ౧౧.
ఉన్నరీతిగా వనమున కరిగిన నొగిచుట్టముల్ బిలిచెదరు।
పన్నుగ సన్న్యాసమును గొనినను పరులు పూజ చేసెదరు॥ ౧౨.

*కసరు - లజ్జ.

పరమహంస యాశ్రమమును బొందిన బ్రహ్మస్వరూపుడనుచు।
నరులెన్నుదురిల, నింద గలుగునటు నానా ప్రయత్నము సొచ్చు॥
జేసికొనినయెడ శరీర పావన చేకూరెడు నని తలచి।
వాసిగ కాజీ వద్దకరిగియనె వచ్చితి తురక గావలసి॥ ౧౪.
కాజియు బల్కెను పండితుడగుచును కలిసెదేల మాజాతిన్।
ఓజను కామములెవ్వియు గలిగిన నొసగనిత్తు నీరీతిన్॥ ౧౫.
సకాముడనునే కాదని బహిరుడు సర్వేశ్వరు గాంచుటకు।
ప్రకారముగ మీ జాతి గ్రంథముల పలుకంబడునని తుదకు॥ ౧౬.
వచ్చితిననుచును విప్రుడు చెప్పగ వాసియనుచు కాజియును।
హెచ్చినప్రీతిని సున్నతుజేసియు నెలమి తురకజేసె మును॥ ౧౭.
పరిపరివిధముల పురజనులిదివిని పలుకులనిన దావినుచు।
గరిమెను నాతడు కలతలబడకయ కార్యముపై కన్నుంచు॥ ౧౮.
నదీతీరమున నొకయెడ విప్రుల నవీన తురక గనుచును।
*చదురున తానట రోదనజేసెను జనుల జాలి కలుగగను॥ ౧౯.
ద్విజులును బల్కిరి తురుష్కజాతిని తేటయనుచు మన కులము।
నిజముగానిదని యేలవిడిచితివి నిలిచిన సుఖమెది జెపుము॥ ౨౦.
బహిరంభట్టనె బ్రహ్మజ్ఞానము బాగుగ పొందుటకొఱకై।
సహజంబుగనే చేరితి దానను సఫలకర్మ వీడుటకై॥ ౨౧.
అవిచారముచే నటులంజేసితి నాత్మజ్ఞానార్థంబున్।
వివరముగాకయ జీవభ్రాంతియు విడువకుండు సతతంబున్॥ ౨౨.
అనుచుజెప్పగా బ్రాహ్మణులందరు నాలోచించి మనసున।
బెనగొని బహిరుడు బహుగుణియగుచును పెంపగుపారవశమున॥
తురకజాతిలో దూరెనీతడని వర ప్రాయశ్చిత్తముచే।
సరగున మనలో చేర్చుకొనవలెను సత్యముగా యిది హెచ్చె॥ ౨౪.
ఇతరగ్రామముల నరు లపచారము లిచ్చుట దీరుటవలనన్।
హితకాములమై యీతని యాపద నిటు దీర్చ మేలగుగానన్॥ ౨౫.

---

*చదురు = కూటము.

అనుచు జెప్పి యందరుగూడుకొనియు నమితంబగు కర్మములన్।
చనువున జేసిరి ద్రవ్యము గైకొని సత్కృత్యము నయ్యెడలన్॥ ౨౬.
బహిరుడు తిరిగియు విప్రుడుకాగా బలిష్ఠులై తురకలును।
సహనములేకయ రాజువద్దకును చనిరి బహిరు ద్విజులును॥ ౨౭.
యవనులజూచుచు బహిరుండనియెను యవనుడ నేనెటులైతి।
చెవిలో మునుపటి ఛిద్రంబున్నది చెదరక గనుమీరీతి॥ ౨౮.
కర్ణచ్ఛిద్రము పోగొట్టినయెడ కలియుదు నే తురకలతో।
నిర్ణయముగ నది గాకుండగనే నిలుతునెటుల యవనులతో॥ ౨౯.
ద్విజులనుగాంచుచు బహిరుడు బలికెను తేటగ శాస్త్రంబులచే।
సుజనకర్మములతో ప్రయోజనము సూటిగ లేకుండుటచే॥ 3౦.
సున్నతుచేసిన చర్మము తిరిగియు సూటిగ పెరగకపోయెన్।
పన్నుగ భస్మము గోమయములచే పవిత్రమెట్టులనయ్యెన్॥ 3౧.
చిత్తమునందును సంశయమిదియని జెప్పి తురకగాననియెన్।
ఇత్తరినందరు బ్రాహ్మణుడనుటయు నెలమియు గాదనియనియెన్॥
ద్విజులునువిని యా తురకలు నటులనె తెల్లంబోయిరి యటను।
విజితజాతి దానుంచనొల్లకయ విపుల సంశయంబునను॥ 33.
అడుగువారలకు నీసంశయమునె యప్పుడపుడు తా జెప్పన్।
పుడమిని *పీఱిడి బహిరుండనియును పొందు పేరుతో నొప్పన్॥
మనోసంశయము మాన్పెదరెవరని మహితకోరికెలనుండు।
దినములుకొద్దియు నిట్టులవెళ్ళెను తిరుగు గురునకై మెండు॥ 3౫.
వడవాళంబను గ్రామంబునకును వచ్చె బహిరు తిరుగుచును।
గుడి మఠమొక్కటి జూచెను సాధులు గూడియుండగ గనుచును॥
నాగనాథుడను సిద్ధుం డచ్చట ‡నలిరేగుచు నుండగని।
బాగుగ నాతడు సమాధి యచ్చట పనితరముగ గట్టగని॥ 3౭.
గుంటను శర్కర వేసె నందులో కోరి చీమ లుండుటకు।
జంటగ రాళ్ళను పైనుంచెను దా చక్కనుండ జూచుటకు॥ 3౮.

---

*పీఱిడి - పిచ్చి. ‡నలిరేగుచు - విజృంభించు.

సద్గురు డీతడు సంశయ మెల్లను చక్క బెట్ట తగుననుచు।
ఉద్గమించుచును నాచార్యుండని యుర్విని దండంబిడుచు॥ ౩౯.
తురకనో ద్విజుడనో తెలియ జెప్పుమన తొందరతో నాథుడును।
కరదండముతో తాలువులందును గట్టిగ కొట్టెను మున్ను॥ ౪౦.
బహిరుడు మూర్ఛను బడియెను క్రిందను బహిస్స్మృతియు లేకయును।
సహకరించుచును సంశయ నిరసన సద్గురు చేయ దలచును॥ ౪౧.
అతని శరీరము శిష్యుల చేతను నప్పుడె తా గొట్టించె।
కుదురుగ దానిని యొక యుండగదా కోరిచేసి యటనునిచె॥
శ్రీ హస్తముతో మూర్తిగ చేయుచు చెలగి యగ్నిలో నుంచె।
స్వాహాపతియును శాంతిని జెందగ సద్గురు కృప వెలిగించె॥ ౪౩.
శరీరంబులో చైతన్యంబును సంచరించునటు గాంచె।
తురీయ యున్మని యవస్థనొందిన ధుర్యయోగివలె జూచె॥ ౪౪.
పాపంబెల్లను పరిహారంబై పరిశుద్ధుండగునతని।
వపుమీరగను నడిగెను నాథుం డెవడవీవు జెప్పుమని॥ ౪౫.
బహిరుడు మపునిగ బలుకకయుండెను బలుసంశయ ముడిగెనని।
విహితుడు నాథుడు నవయవపూర్తిని విచ్ఛిన్నము లేకగని॥ ౪౬.
కరము శిరసుపై నాచార్యుండును కనికరమున నుంచుచును।
తిరమగునట్టుల తారకమంత్రము కరముపదేశింపగను॥ ౪౭.
బహిరుడు జ్ఞానియై హరిభజనను దా బ్రహ్మానందము బొందె।
సహనముతోనా సద్గురుమహిమను సరస జెప్పందరమిందె॥ ౪౮.
జ్ఞానము దెల్పెడి గురువులనేకులు గలరీ జగత్తులోను।
మేనువదల్చియు మరియొకజన్మము మేలిచ్చుట గనమిటను॥ ౪౯.
బహిరుడు వెనకను పండరికరిగియు పండరిపతి సన్నిధిని।
మహదుల్లాసముతో హరి బొగడెను మాధవుప్రీతి గనుగొని॥ ౫౦.
హరిపరతంత్రత నవనిని వెలసిన యార్యజనుల కథలెల్ల।
గురుతుగ దాసుడు బాలకృష్ణుడును కోరి జెప్పు విలసిల్ల॥ ౫౧.

## బా బా జి చ రి త్ర ము.

బారామతియను క్షేత్రము నందును బాపడు దామజి యుండెః
దారాగృహములు విత్తంబులతో తగు కరణీకము నుండెః॥ ౧.
శీలధైర్యములు రాజమాన్యతయు శిశిసంపత్తులు నుండి।
బాలుడు లేకను రిక్తగృహమువలె పలుమారును గనుచుండి॥ ౨.
కులదైవంబగు మార్తాండుని యటు కోరిభజించిరి వారు।
బలతరముగనే పూజల సలుపుచు భక్తిని జేసి రిరువురు॥ 3.
అనేకాబ్దములు నిటుల సలుపగను నతడు ప్రసన్నుండగుచు।
మనోరథంబును నడుగు మిత్తునని మార్తాండుడు గనుచు॥ ४.
ముందర నిలువగ దామజి పంతులు ముదమున దండంబిడియె।
సుందరతరమగు రూపవిలాసము జూచి మిగుల ప్రియమయ్యె॥ ౫.
కులదీపమువలె నొకపుత్రుని నాకొసఁగిమ్మని వేడగను।
సలలిత భక్తుడు సాధుపూజ్యుడగు సత్పుత్రుని నిచ్చెదను॥ ౬.
అనుచు జెప్పుచును నంతర్ధానుడై యాదేవుడు వెళ్ళగను।
దినములు కొన్నియు జరగగ భార్యకు తెలియబడెను గర్భమును॥ ౭.
నవమాసంబులు నిండిన వెనకను నాతికి కొమరుడు బుట్టె।
సవిరళముగనటు జాతకర్మలను సలిపెను దామజి యట్టె॥ ౮.
ద్వాదశ దినములు జరిగిన పిదపను తదియారాధన జేసి।
పాదుగ నామము బాబాజీయని బాలునకయ్యెడ యుంచి॥ ౯.
లాలితముగనే పెంచిరి కొడుకును లక్షింపుచు దైవమును।
తాళిమితోడను శివాజి నరపతి దామాజీ పైకృపను॥ ౧౦.
కొంతసేనలకు ప్రభువుగ జేయగ కోరివచ్చె సంపతియు।
పంతముతోడను కొడుకు విద్యలను బాగుగ నేర్చును మరియు॥ ౧౧.
షోడశాబ్దములు జరగగ సుతునకు సూటిగ వైవాహికము।
తోడనె సలిపిరి బంధువర్గములు వేడుకయని యెంచిసుము॥ ౧౨.

కొన్ని యబ్దములు గడచిన పిదపను కోరి పితయు నొకనాడు।
చెన్నుమీరగను ముదిమి వచ్చెనని చెప్పెను సుతుగని నాడు॥ ౧౩.
అవనీపతికడ కేగి దండమిడి యాతని దయతో నీవు।
సవినయముగ నటు సేవను జేసియు సంసారము నికబ్రోవు॥ ౧౪.
బాబజియప్పుడు తండ్రి యాజ్ఞచే బైలుదేరె రాజుకడకా।
సోబతుగా తగు సిపాయ్ సవార్లను శుభగుతండ్రి బంపె యెడకా॥
క్షితినాథుడుగని బాబజినడతల శీఘ్రమిచ్చె కొలువును।
అధిపతి జేయుచు కొంత సేనలకు నంపెను యుద్ధమునకును॥ ౧౫.
శత్రులసేనలు ముందువచ్చునెడ చనెబాబజి యెదురుగను।
మిత్రులైన తనసేనను కొందరు మేదిని బడిచావగను॥ ౧౬.
తోపుల గుండ్లను కత్తిదెబ్బలును ధూర్తులంపతన జనులు।
బాపురె యనుచును బడుచుండంగని బాబజినొందెను దిగులు॥ ౧౭.
అనుతపింపుచు తనలోననుకొనె ఘన యోనుల దిరుగుచును।
మనుజ శరీరము యవచితముగనె మనకబ్బెను భువిలోను॥ ౧౮.
ఇట్టి శరీరము సంసారార్థము యిలలో ద్రొబ్బిన యెడల।
పొట్టకుగానె దేహవిక్రయము పొందబడినదగు మిగుల॥ ౨౦.
చూచుచునుండగ ప్రాణులుబోయిరి, చూడను సార్థకమిందు।
ప్రాచీనులు గన నేనునిటులనే పడెదను యీరణమందు॥ ౨౧.
కాలుని యాజ్ఞయు వచ్చుటకు మునుపు గనవలె పరమార్థమును।
మేలని దలచగ గుఱ్ఱమదరెనటు మిగుల త్వరను మళ్ళుచును॥ ౨౨.
జగద్రక్షకుడె రక్షణకర్తని సాంగంబుగ తనకనుచు।
విగతభయుండై పరుగిడి వెనకను వెళ్ళెనరణ్యము గనుచు॥ ౨౩.
ఏకాంతము నటనేర్పడ చేకొని యెంచెను తనలో నటను।
సాకాంతును యో దేవదేవ నిను చక్కగ గన నెట్లగును॥ ౨౪.
శ్రవణంబెట్టిదొ మననంబెట్టిదొ సాధనమెటు తెలియదను।
అవిరళమై తగు యారాధనమును నవని నెదియొ నెరుగనను॥ ౨౫.

యోచన సేయగ స్మరణకు వచ్చెను నుర భవాని యాలయము।
ప్రాచీనంబుగ సప్తశృంగిలో బహుగనుండ మహిమసుము॥ ౨౬
చిన్న తనంబున విప్రులు కొందరు జెప్పిన సంగతి దలచి।
మన్ననజేయుచు నాగుడి కడకును మహిని వెళ్ళెదా లేచి॥ ౨౭
నమస్కరించి దేవికిరువది యొకది నములు నచ్చట తపసును।
క్రమముగ చేసెను నన్న పానముల ద్రాగక గుడువకమున్ను॥ ౨౮
ఏకాగ్రంబుగ మనసును నిలిపియు నిమిడ నుసురు కంఠమున।
సాకారంబుగ దేవిప్రసన్నయై సరగున వరమడుగుమన॥ ౨౯
శ్రీనారాయణు జూచుట కొఱకై చింతించెద ననగాను।
దీననాధుడు నాస్వాధీనము దెలువొందగ లేడుయను॥ 3౦
నావలె శక్తులనేకులతని యెడ నచ్చియుంద్రు సేవలను।
కావలసినయెడ శిరి యశస్సులను కలుగజేతు నీకిలను॥ 3౧
మాయాతీతుడు నారాయణుడును మాఱుక సాధన వదలి।
కాయమనస్సుల శుద్ధముచేయగ కనబడు హరి విలసిల్లి॥ 3౨
ఐనను నీకొక యుపాయమును నేనబ్బునటుల జెప్పెదను।
పైనంబైచను గుండోగాముకు పర్వతమొక్కటి యటను॥ 33
దానిపైన సడలేశ్వరుడను నొక ధరణిలింగ మచటుండు।
మానుగ నటనొక సరోవరంబును మహిలో వర్ధిలుచుండు॥ 3౪
మాండవ్యులచే ననుష్ఠింపబడి మహిమగలది యగునునది।
తాండవరాయుడు దర్శనమిచ్చియు తపసిని గాపాడినది॥ 3౫
శేకుమహమ్మదు జాతినియవనుడు జేసెను సాధనమటను।
ప్రాకటముగ నీ కలియుగమందును ఫలసిద్ధిని జెందెమును॥ 3౬
ఇటులం జెప్పుచు భగవద్గీతను నిచ్చెను యా దేవియును।
అటుగా వెళ్ళుచు సరసున మునిగియు నరసి చదువు గ్రంథమును॥
వినుకొని బాబజి వెళ్ళె నచటికిని వేగిరపడుచును తాను।
అనుదినమును నా దేవి జెప్పిన ట్లనుష్ఠించుచుండగను॥ 3౭

వైరాగ్యంబును భగవంతుని గను వాంఛయు గలుగుట చేతన్।
నై రాశ్యంబున నేమియు దినకను నాటెను గురి హరిమీదన్॥
బారామతిలో దామజి, పుత్రుని పలాయనంబును వినియు।
సారాసారము దెలియక నాతడు చాలా దుఃఖము గొనియు॥ ౪౦.
చారుల బంపుచు నలుదిక్కులకును సరగున శోధించుటకు।
తీరుగనాతడు జెప్పెసాధువుల్ తిరుగుచోట జూడదగు॥ ౪౧.
అటులనె వారలు పోయిచూడగను నగుపడె బాబజి యటను।
పటుతర మౌనియై నాతడుండగని భటులు వచ్చిరి తిరిగియును॥
దామజి తోడను తెలియం జెప్పిరి తనయుడు గుండోగామునను।
నేమము చొప్పున మౌనియగుచు దా నిలిచియున్నాడనగాను॥
సంతసిల్లుచును తల్లియు తండ్రియు సత్పుత్రుండని మనుచు।
పంతముతో మార్తాండుడు జెప్పిన పలుకురీతిగా నడచు॥ ౪౪.
అనుచు దలచగను కోడలువచ్చుచు పెనిమిటి నిలిచిన చోటన్॥
చనియెద నుత్తరవిమ్మని వేడెను శ్వశురుని యత్తను యచటన్॥
వారలు జెప్పిరి కొరతలేక యిటు వచ్చుతానె మనకడకు।
దూరము వెళ్ళుట యొంటరి వగుచును దురుసుగాదు వయసునకు॥
వేణుబాయి తా వినకను వార్తల వేగతల్లె నొంటరిగాన్।
మానుగ నశ్వము మనుజులనిచ్చియు మామయు బంపెనునటుగాన్॥
దారినడచి దినదినమును చేరెను తానా గుండేగాను।
మీరిన తపసియై శుష్కశరీరియై మెలగగాంచె పతిమోము॥ ౪౮.
భార్యను గాంచుచు పతియును బల్కను బరతెంచుట యెందుకిటు।
ఆర్యులుండు యూరునకు నరుగుమనె నాగిన నేనుండ నిటు॥ ౪౯.
మారుబల్కకను భార్య దూరమున మది హరినిడి కూర్చుండెన్।
తేరిచూచుచును పతిని విడవకను తిరిగిచనుట లేకుండెన్॥ ౫౦.
అతివిరక్తితో భార్యకడకు నట నాతండును వచ్చుచును।
కతిపయ శిలలను చుట్టు బెట్టుచును కలుగజేసె నొకగుహను॥ ౫౧.

బారిసుంచకను మూతను మూసియు తనపనిలో తానుండె౯।
వారిజాక్షి శ్రీ విఠ్ఠలరంగని వాసినామ మనుచుండె౯॥ ౫౨.
అనిత్యదేహామం దాస్థయుంచినను నందదు హరిపద మనుచు।
ఘనతర భక్తిని నుండగ హరియును కాపాడును తన్ననుచు॥
భర్తయె గురుడై పాషాణంబుల భద్రగుహాను నుంచగను।
అర్థముకాయము నాచార్యునదని యల సమాధి నిల్పగను॥ ౫౪.
బాబాజీయటు ప్రపంచ మమతల బట్టక హరిగొల్చుచును।
గాబర లేకను చిత్తంబొకనై కానకుండె దేహామును॥ ౫౫.
వ్యాధుండొకడటు తిరుగుచు వనమును వచ్చిరాతి గుహాగనుచు।
బాధితముగనట నీలరంగుగల బట్ట యెటుల నుండనుచు॥ ౫౬.
ధనము తస్కరులు దొంగతనంబున దాచియుందురట ననుచు।
అనువుగ దానిం జేకొన దలచియు నచట రాళ్ళ పెకలించు॥ ౫౭.
చిన్నది లోపల చెయ్యాడింపగ చేతికంకణ ధ్వనివినియు౯।
పన్నుగనిందున మనుజుడుండునని పదిలెముతో శిలదీయు౯॥
ఒక్కొకరాతిని వెలపలనుంచగ నుచితంబుగ దాజూచె౯।
చక్కనివనితను, యెవరని యడుగగ సతి సంగతి వినిపించె౯॥ ౫౯.
వ్యాధుడు విస్మిత చిత్తుండగుచును వందనమొసగియు వెళ్ళె౯।
సాదరముగ తన పతివద్దకు యా సతియు మెల్లగను మళ్ళె౯॥ ౬౦.
పతియుగాంచుచును నిన్నిదినంబులు బ్రతికితివాయని యడుగ౯।
కుదురుగ నీ కృప గలిగియుండగను కోరివచ్చితిని తిరుగ౯। ౬౧,
పతియును బలికెను నా సాంగత్యము బహుకష్టంబగు నిటను।
హితమైయుండదు, తల్లియింటికిని నేగుమనుచు చెప్పగను॥ ౬౨.
తరుణియు బల్కెను తల్లియెవ్వతే తండ్రి యెవ్వరీ భువిని।
దురుసుగ కాయము తర్లిపోవగను తోడురారు యెవ్వరైని॥ ౬౩.
సుకమును బొందుచు నుండువరకునటు చుట్టములుందురు తగను।
ప్రకటంబగునటు యంత్యమునందును బట్టియుండ రెవ్వరును॥ ౬౪.

పరమార్థంబగు సంపత్తిని నే బాగుగపొందుట కొఱకు।
ఇరవుగ మీతో నుండునటుల నను కరుణజూడ తగు నిటకు॥ ౧౫.
తొలిజన్మంబున సుకృతము లిడుకొని ధన్యత నిను గాంచితిని।
అలయక సొలయక కృపాదృష్టిచే నందజేర్చు మనగవిని॥ ౧౬.
పతియనె పర్ణముల్, భక్షణ చేయుచు భజన చేయుమనగ విని।
గతినీవేయని కాళ్ళను బట్టియు కలకంఠియు నుండగని॥ ౧౭.
బాబజి యచ్చట ననుష్ఠించెతగ పదిరెండబ్దంబులును।
సాబితుగా నొక వ్యాఘ్రమగుచు హరి చక్కవచ్చె నయ్యెడను॥
గీతను చదువగ గూర్చుండుచువినె *వాతెరనోరు దెరచుచు।
ప్రీతిని భక్తుండుండగ వ్యాఘ్రము పెంపుగ ధ్వనిచేమించు॥ ౧౯.
కొంతవరకు దానుండి వెళ్ళినటు గురుతుగ నొకరేయెడను।
వింతను వచ్చెను మహాసర్పమై వేభక్తుని గనియటను॥ ౨౦.
అంగమును చుట్టుకొనియు కాటులను నాతనికిని వేయగను।
రంగుగ భక్తుడు స్థిమిత మనస్కుడై రంజిల, హరి జూచుచును॥
నిజరూపంబును తానువహించుచు నిత్యమంగళ విగ్రహుడై।
విజయ బాహువులపంచాయుధములు వెలయుచుండ సేవితుడై॥
కటక కంకణ కిరీటహారముల్ కౌస్తుభమును వెలుగగను।
పటుతరముగనే పీతాంబరమును పద్మమాల నిగుడగను॥ ౨౩.
అభయంబనుచును హరియు బల్కగను నట బాబజి కనుదెరచి।
శుభగుని జూచెను శ్రీహరిమంగళ సుందర రూపును నరసి॥
పులకిత గాత్రుడై కన్నీరొలుకగ పొసగబెట్టె దండమును।
సలలిత హృదయుడై శ్రీహరిబల్కెను వలయు వరమునడుగుమను॥
బాబజి పల్కెను దేవరవారల భవ్యదర్శనమున నేను।
గాబరనొందక కృతకృత్యుడనై గంటినిష్ట సిద్ధిటను॥ ౨౬.
ఆసమయంబున వేణుబాయియటు హరిచరణంబుల మ్రొక్కె।
నీసమానమగు దైవములేదని నిండు ప్రేమతో సొక్కె॥ ౨౭.

---

*వాతెర - పెదవి.

భగవంతుండటు వారల గాంచుచు బలికె మీరలిటుపైని।
సుగమమగు నయాచిత వృత్తిచే సుఖగ నూరునుండుమని॥ ౭౮.
భావికజనులై శరణువచ్చినను భవతారక మంత్రమును।
సావధానమున జెప్పుచు బోదుము చక్కగ నాగుణములను॥ ౭౯.
పుండరీకుని కొఱకై పండరి భూవైకుంఠంబునను।
నిండినప్రేమను నేనుందు నుతగ నిజభక్తుల గాంచుచును॥ ౮౦.
ప్రతివత్సరమున పండరి కరుగుచు భక్తుల జూడుండటను।
సతతము జగతిని సత్సంగమునకు సాటిలేదు యెల్లెడను॥ ౮౧.
నామము మరవక నుండుమటంచును నరహరి గుప్తుండయ్యెన్।
ప్రేమమీరగను భక్తులిరువురును ప్రీతినొంద నెళవయ్యెన్॥ ౮౨.
హరిశ్రీవిఠల యచ్యుతరంగా యాశ్రితవంద్య ముకుంద।
అరవిందాక్ష, శ్రీ యబ్ధికన్యవర యాదిపురుష గోవింద॥ ౮౩.
అనుచును జెప్పుచు ననుమోదించగ నంగముల్ సుందరమయ్యెన్।
ఘనుడగు శ్రీహరి యాజ్ఞచొప్పునను కాలముజరుపుచు బోయెన్॥
ముదిమియురాగను శ్రీహరియాజ్ఞను మూర్తినిలిపి తమయూరన్।
సదయులైవారలు హరిగుణగానము సలుపుచుండిరటు గోరన్॥
భక్తులకెల్లను పాదధూళియై బాలకృష్ణుడిలనుండు॥
రక్తిగ నీకథ సంతవిజయమున రాజిల్లంబడి యుండు॥ ౮౬.

---

## ముకుందరాజు చరిత్రము.

జయతుపాలుడను క్షితిపతియొక్కడు సౌరాష్ట్రపు దేశమున।
ప్రియుడై పాలనజేయగ ప్రజలును ప్రీతివహించిరి గాన॥ ౧.
విలాసపురుషులు నవయవంబులను విధితో బ్రోచేక్రియను।
కులాచారముల పద్ధతిచొప్పున యిలపతి పాలించెమును॥ ౨.
ఒకదినమందును నృపుడు పురాణము నొప్పగ దా వినుచుండన్।
సకలసాధనలు సలిపియుండినను సద్గురు కృపలేకుండన్॥ ౩.

భవతరణంబిటు ప్రాప్తముకాదని బహుభంగుల వినగాను।
సవిరళముగనే యనుభవమగుటకు సదాచార్యునియొద్దను॥ ౪.
పొందవలయునని యెంచుచుమదిలో పూర్తిగ యత్నముజేసెఁ।
అందుకు నాతడు ప్రసిద్ధగురువుల నటుజేర్చియు తగ వెలసెఁ॥ ౫.
దాన దక్షిణలు తరుచుగాగనటు ధరణినాథు డిచ్చునను।
మానవియాశను నుపదేశంబుల మహినిజేతు మన్న ...మును॥ ౬.
జ్ఞాన ముగురువులు దెల్పెదమనగను గరిమెతోడ ...జుగని।
దీనుండిందుకె దేవరవారల తిరముగ బిల్చినదగ ...లసె...॥ ౭.
తనుమన వాక్కుల దేవరవార్లకు తదేక శరణా ...దు రటు ...తత్పరతఁ।
అనుభవజ్ఞానము నమరునట్లుగను ననుగ్రహింప ...ని చిరతఁ॥ ౪.
వాచాజ్ఞానము వలదు, జాపుము వస్తువా ...మంవృద్ధియును।
ప్రాచీనంబగు శాస్త్రపద్ధతులు బహ్వాపా ...గొలుతురు దినమును॥ ౫.
యోగలక్షణము దైవమంత్రములు యుచి ...పురికిని చనుచు।
బాగులేదని నరపతిజెప్పెను బహుగ వార ...నన్నంబిడుచు। ౬.
కొందరు శ్రుతులకు నర్థముజెప్పుచు గురి ...లి వచ్చుచు నిటులఁ।
సుందరముగనే దెలుపగ నృపుడును జ ...పె నేమ మయ్యెడలఁ॥ ౭.
జంగమ గురువులు శివపూజలనే సలుప ...లి గొనిరాగాను।
పొంగుచు నృపుడును ననుభవమున్న ...కట బడుచుండగను॥ ౮.
గోసాయీలును నలఖునిరంజను గోరి పురాణపురుషు డందరిలో।
వేసారక నటు జటిలు సదాశివు విధితో గ ...ంతములో॥ ౯.
పారసనాథుని గొల్వుమటంచును బౌద్ధగురులు తగ ...నీరిడుచు।
ధీరు మలంగులు నిరాకారమును తిన్నగ జూడుండనిరి॥ ౧౦.
ఈవిధముగ గురువులనేకులు తమ యిష్టమువలె జెప్పగను ...లె।
భావశుద్ధితో బల్కెను నృపుడును పగటివేషల్ వీరలును॥ ౧౧.
ఆశాబద్ధులు యవిద్యవేష్టులు యనుభవకళ రహితులని।
వేశలముగనే వారిసొమ్ములను పెల్లున నరపతియు గొని॥ ౧౨.

కారాగృహమును బ్రాహ్మణ పండితుల్ కలవరించి నృపుతోను।
దారాళంబుగ పరిక్షజేయుము తరుచుగ వేదాంతమును॥ ౧౭.
తెలియవలయు నర్థములన్నియు నిటు చేటపరచెదము నీకు।
నెళవున కారాగృహమున మమ్ముల నిలుపజేయు టెందులకు॥ ౧౮.
అవనీపతియనె యనుభవరహితం బగువాక్యము లన్నియును।
కువలయమందున లవణము వేయని కూడువంటిదే యగును॥ ౧౯.
అష్టాదశ వర్ణ ...రువులు యవనీసురులగు మీరు।
స్పష్టంబుగ ...సముల తగ చక్కం జేయగలేరు॥ ౨౦.
...రాగృహమున నెలమినుంచి వారలను।
పు...గచె గట్టను ప్రారంభించెను నిలను॥ ౨౧.
...పల్లల ఘనగురువులు బూనుకొని।
...న్నను యవనిపెద్దలే భువిని॥ ౨౨.
...ట మెటులందో చదనుచును।
...యాజ్ఞకు సహనముగా నుండగను॥ ౨౩.
...నృపుండును బహుసుకృతముకలిగుండక।
...ం చాలక వచ్చి దీనులై నిగుడక॥ ౨౪.
...చెను నెలమిని సంసారమును।
...నెనరున మ్రొక్కుచు తాను॥ ౨౫.
...ము శ్రీరఘురామా యనుచు।
...ంబగు సన్నాహము దాగొనుచు॥ ౨౬.
...నెద్దియునొల్లక నుచితమెద్ది లేదనుచు।
...ం నెన్నడుగందును క్రియనెటుగాంచెదననుచు॥ ౨౭.
...సాతండుండగ నిట కారాగృహమునను।
...రకక చెప్పదొడంగిరి పొందుగ నందరుగూడుచును॥
ధరణీనాథుం డిచ్చును బహుగా దానదక్షిణలనుచును।
గుటితో రాగను కర్మారులై మనలను గుంటత్రోవ్వ విడిచెనను॥

దారాపుత్రులు నింటనుండుచును థావంతము చేయుచు
ధీరుడు శ్రీహరి యెప్పుడుబ్రోచునో దెలియదనుచు ను
హరిగోవిందా యచ్యుత కృష్ణా యప్రమేయ కరివరదా యనుచును।
గురుతుగ ధర్మము నిలుపుటకొఱకై గుఱి యవతారమందుచును॥ ౧.
దైవమునీవని మేము నమ్మితిమి త్వరనువచ్చి మాచెఱలక్కీలను।
కైవల్యంబుగ ఖండించియు మరి కావుము మము సౌఖ్యమందుచును॥ ౨.
చెఱవిముక్తికై శ్రీహరిగొలిచిరి చిరభక్తిని వీరస్త్రీలసె మానినియు।
గురుదర్శనమును నరపతిగోరుచు గొల్చెను కృష్ణుందు రటుమరియు॥
వీరలమొరవిని శ్రీహరియప్పుడు వేంచేసెను తత్పరతన్।
దారు కమండలము కటిసూత్రమును ధరించుశక్తిని చిరతన్॥ ౪.
చేతుల బెత్తెము కౌపీనంబును చేకొనె వస్త్ర పశువృద్ధియును।
ప్రాదుర్భవుడై బ్రాహ్మణరూపున బ్రహ్మచ్ఛా గొలుతురు దినమును॥ ౫.
సరోవరముకడ నిలిచి ప్రజలకును సరసం పురికినిచనుచు।
సరోజనాభుని సేవకు మీరలు సద్విప్రున నన్నంబిడుచు। ౬.
ఈపనియెందుకు నిటులంజేయుచు నిచ్చకలి వచ్చుచు నిటులన్।
బావనవారలు వామన రూపున భవ్యమూర్తి నేమ మయ్యెడలన్॥ ౭.
చక్కటి మోమును సుందరమేనును షడ్గలి గొనిరాగాను।
ఇక్కడ వచ్చితి వెంమకుపీచెఱ, నిలపతిక్కటకట బడుచుండగను॥ ౮.
మాయుపదేశముల్ వ్యర్థములనుచును పురాణపురుషు డందరిలో।
ధీయుతుడగు నిను రాజుజూచినను తీరగాకను నే కాంతములో॥ ౯.
ముకుందువామను డప్పుడనెను మిము ముందుగ నీరిడుచు।
అకుంఠితులు గా పసులను పదలుచు నందరు నాకడ రండీ ౧౦.
అటులనె విడిచియు వారలురాగను నవనీపతి సేవకుల్వ్రవలె।
పటుతరముగ నెటుచనవల దనగను బలికె ముకుందుడు చా· ౧౧.
పనులకు విఘ్నము జరగకుండగను పరగగనుడి మీరలును।
అనుచును బలుకగ పారపికాసులున వీయెపనుల జేయగను॥ ౪౨.

కారాగృహ * చుచు సేవక జనులును వెళ్ళుచు నరపతికడను।
దారాళంబుగి నొక బ్రహ్మచారియటు చనుదెంచె తటాకమును॥ ౪౩.
దెలియవలయ యా విప్రు లనేకులు పరగ వెళ్ళి రతనికడకే।
నెళవున కార ధములు తమకై తామే కాగల పనులలో నుండకే॥
అవనీపతియ చు నట్టి చూడగను నవ్య చమత్కృతి యనుచు।
కువలయమందు బెట్టెను పటునకు సాష్టాంగంబుగ మనుచు॥
అష్టాదశ వర్ణ మును బిలువగ నిచ్చటి ద్విజులందరను।
స్పష్టంబుగ పి ధనముతో సాగనంపు నిండ్లకును॥ ౪౬.
తులం రిని వారల ముదమొందగ విడిపించెక।
పు నముల నిచ్చియు నంపుచు సన్మానించెక॥ ౪౭.
జ్ఞానము ననుగ్రహింపుము నేడు!
గా గనవలె తదాను భవమును జూడు॥
గురుడును నశ్వమపుడె దెప్పించెక।
య మెక్కగ చాబుకు దెబ్బల వేసెక॥ ౪౮.
యుగ నిలపతి దేహము మరిచెక।
తగులగను పాదము పై బడి జచ్చెక॥౫౦.
జేయగ గాంచె జాగ్రతను నృపుడు।
యుక్కుచు నిండు ప్రేమ గొనియుండు॥
ందుడు ఘనతత్వము నృపునకును।
ముందును విశ్వము హరిమయము యను॥
నెద్దియునొక్క ష్టము న చక్కగ జెప్పినదిదియు।
డను బాలకృష్ణుడు భక్తుల మొక్కును మనియు॥ ౫౩.

---

ధరణీ-

---

*బాబా - గుఱ్ఱము,

# బోధలుపశెలు చరిత్రము.

దామణగామను నొక యూరందును ధర పశేలుండగుచును।
నేమము తోడను శూద్ర జాతిలో నియత భక్తి నుండుచును॥౧.
ఉపనామము జగతాపుండనుచును నొప్పుగ జెప్పెదరిలను।
అపచారమునకు భయపడు భార్యయు నతనికి తగనుండుచును॥ ౨.
మమతాయీ యను నామము చేతను మహిని వెలసె మానినియు।
కొమరుడు యామజి కోడలు భగిరధి గూడియుందు రటుమరియు॥
ఏకమనస్సున నలుగురు నుండుచు నీశధ్యాన తత్పరతన్।
జోకను వారలు ప్రపంచ వృత్తిని జూచి విరక్తిని చిరతన్॥ ౪.
మహత్వ మాన్యత ధనసంపత్తులు మానుగ పశువృద్ధియును।
బహుగా గలిగియు పండరి నాధుని భక్తి గొలుతురు దినమును॥౫.
ప్రతి యేకాదశి బోధలుపశేలు పండరి పురికిని చనుచు।
హితుడై ద్వాదశి పారణ జేసియు నేపున నన్నంబిడుచు। ౬.
మరుదినమంచును దామ్ణగామునకు మరలి వచ్చుచు నిటులన్।
కరమరుదుగ దా బహుకాలంబును గడిపె నేమ మయ్యెడలన్॥ ౭.
ఒకయెడ నచ్చట దుష్కాలంబును నొగ్గిలి గొనిరాగాను।
సకల జనులకును నన్నము దొరకక సంకట బడుచుండగను॥ ౮.
బోధలు డిదిగని కరుణను బొందియు పురాణపురుషు డందరిలో।
పాడుగ నున్నాడనుచు భార్యతో బలికెను నే కాంతములో॥ ౯.
క్షుధాతురులకును నన్న మియ్యవలె శుష్కతరులకు నీరిడుచు।
ప్రధానముగ శీతా కాలంబున బట్టలు పేదల కిచుచు॥ ౧౦.
పరవాసులకును రోగము గలిగిన పత్య మౌషధ మియ్యవలె।
వెరపున నీటను మునిగే వానిని వీలుగ వెలికియ్యవలె॥ ౧౧.
దరిద్ర బ్రాహ్మణు లగ్నము మనమును తప్పక చేయింపవలె।
తిరముగ నగ్నియు గృహమున కంటిన ధీరతతో నణచవలె॥ ౧౨.

దప్పిని గొనునరునకు నీరిడవలె దలప యాచక జనులకును।
ఒప్పుగ నన్నులై బలుకుచు నిట్టుల నూర్జితముగ జేసినను॥ ౧౩.
అతిశయ పుణ్యంబమరియు సత్వం బందుచేత గలుగుచును।
లక్షణముగ వైరాగ్యంబును గొన లభ్యమగును రాముడును॥ ౧౪.
విషయ విఘ్నములు వదలం బడియును వివేకంబు పొందబడు।
సుషమంబగు వైరాగ్యముండినను సుఖ హరి పద మొందబడు॥ ౧౫,
పత్నియు వినుకొని పరోపకారము బహుగ జేయు, బోధలుడు।
యత్నము తోడను నన్నదానమును నమితము జేయుచునుండు॥
హరిదినమందును పండరి బోవుచు నమిత జనుల కన్నమిడుఁ।
తరచుగాగ తా నిటులం చేయగ ధనమును సెలవై నెగడుఁ॥ ౧౬,
ధాన్య వస్త్రముల గోవృష భంబుల తా నమ్ముచు నన్నమిడెఁ।
శూన్య హస్తుడై దారిద్ర్యంబును చుట్టుకొనుచు తగనుండెఁ॥ ౧౭,
అంగ కష్టమును కూలికి జేసియు నందు వచ్చు ద్రవ్యముచె।
భంగము లేకను కుటుంబ రక్షణ పరగ జేయుచును వెలసె॥ ౧౮,
హరివిఠ్ఠల యని స్మరణ జేయుచును నతడు నిష్ఠ నుండగను।
గురుతుగ రంగడు దర్శన మిచ్చును కోరియు నపుడప్పుడును॥
ఒకయెడ నాతం డేకాదశిలో నొగి పండరి బోవుటకు।
ప్రకటంబుగ దా బైలుదేరెనటు పైసయు చేతిని తనకు॥ ౨౧.
లేకుండుటచే యడవిని బోవుచు లెక్కింపుచు కాష్ఠములు।
వీకం గైకొని పోగుజేయుచును విడిచియు నభిమానములు॥ ౨౨.
మూట గట్టుకొని తలపై నిడికొని మోపును పండరి వీధిఁ॥
నూటిగ నమ్ముచు మూడు డబ్బులకు పొరదివచ్చె భీమనదిఁ॥ ౨౩.
స్నానము జేయగ విప్రున కిచ్చెను సంకల్పమున కొకపైస।
మానుగ పుష్పసుగంధంబునకై మహి నిచ్చెను యొకపైస॥ ౨౪.
దేవాలయమున వెళ్ళి యచ్చటను దేవుని గని పూజించెఁ।
భావార్ధంబుగ బహుతర భక్తిని పండరిపతిపై జేసెఁ॥ ౨౫.

హరిగుణ కీర్తన విని యారేయిని నరుణోదయ మగువేళన్।
గురుతుగ నదిలో స్నానము జేయుచు కోమటికడ కరిగినిలన్॥ ౨౬.
మిగిలిన రూకకు పిండి దీసికొని మెలగెను నదితీరమునన్।
తగిన విప్రులను నెవరినినైనను తాను బిలుచు నెయ్యమునన్॥ ౨౭.
ఉప్పు పప్పు యెవి లేని పిండియని యొప్పకుండి రెవ్వారును।
తప్పక నితడనె దుర్బలు డగునా దానమెవరు గొందురను॥ ౨౮.
ధనాఢ్యు లందరు బహుదానంబుల తరుచుగాగ చేయగను।
అనాథుడగు నా యన్నదానమును నడిగెడు వారెవరిటను॥ ౨౯.
అనుతపించుచును హరినామముతో నచ్చట తా కూర్చుండన్।
ఘనుడగు శ్రీహరి వృద్ధ విప్రుడై కట్టెయు చేతిని నుండన్॥ ౩౦.
చినిగిన వస్త్రము తలటోపితోనటు చేరెను బోధలు కడను।
అనువుగ జెప్పెను నీవు పురాతన యజమానివి నాకిటను॥ ౩౧.
గొప్ప బ్రాహ్మణులు గురుయజ మానుల గూడియుందురియ్యెడను।
ఒప్పుగ నేనును దరిద్రు నగుటచె నొకరుబెట్ట రన్నమును॥ ౩౨.
క్షుధితుడ నగుచును నీకడ వచ్చితి నూటిగ నిడుమేదైనా।
ఇదివిని బోధలు డతనికి నిచ్చియు నెలమి పిండిని కొంగునన్॥ ౩౩.
వినీతు డగుచును జెప్పెన తనితో వెలయగ పప్పుప్పులును।
అనువున నిడుటకు లేవని జెప్పగ హరి యాతని గాంచుచును॥ ౩౪.
సమయోచిత మగు పదార్థ మిదియె చాలు తన కనియనుచును।
ప్రముదితుడగు హరి గుడిలో నుండెడ పాకస్థలమటు గాననను॥
వంటను యిట నే చేయం దలచితి వలయుకట్టె లేరుమనన్।
వెంటనె తానటు పుడకల నేరియు వేగ దెచ్చి ద్విజునకనన్॥ ౩౫.
స్నానముజేసియు శ్రీహరి యచ్చట చక్కగ గూర్చుండుచును॥
మానుగ పిండిని పిసుకుచు నుండగ మందునగ్ని నిచ్చెమును॥ ౩౬.
ఆసమయంబున రుక్మిణి దేవియు నతి వృద్ధస్త్రీయగుచు।
ఆసనువచ్చియు పతికడ జెప్పెను యజమానుని తగగనుచు॥

వదలుచు నన్నట నొంటిగ గుడిలో వాసిగ వచ్చితి విటకు।
విదితంబుగ నిటుజేయుట న్యాయమె విప్రుడ, యని తానడుగు॥
ఆకలియైనది వంటజేతునని యామెయు స్నానముజేసి।
ప్రాకటముగ తా వంటనుజేసెను భక్తుండటు దాజూచి॥ ౪౦.
దంపతు లిరువురు భక్షణచేయుట తనకును సుఖమైయుండెా।
ఇంపుగ నన్నం బిరువురకును నట నెలమిచాల దనుచుండె॥ ౪౧.
అనంతసిద్ధుల స్వామిని రుక్మిణి యామె కరము తగులగనె।
తనివిగ నచ్చట ప్రసాద మయ్యెను తలపడి వడ్డించుచునె॥ ౪౨.
శ్రీహరియటు బోధలుని రమ్మనుచు చీరెను భోజనమునకు।
ఊహానునాతడు వెనక తిందునని యుచ్ఛిష్టము తగునాకు॥ ౪౩.
వెనకను శ్రీహరి రుక్మిణిదేవియు వీలుగ భక్షణజేసి।
అనువుగ వెళ్లగ బోధలుడప్పుడు నబ్జాక్షుండని తెలిసి॥ ౪౪.
మనోభిష్టమును పూర్తిసేయుటకు మహీవచ్చిరి దంపతులు।
అనుచు దలంపుచు నుచ్ఛిష్టంబును నాతడు తిని విలసిల్లు॥ ౪౫.
దేవాలయమున కేగియురంగని దివ్యరూపమును జూచి।
భావాతీతా భక్తవత్సలా భవహర యని నుతియించి॥ ౪౬.
దీనవత్సలుడ వట్టియన్నమును తింటివి నీవీ నాడు।
మానుగనాకును తృప్తిజేయుటకు మహీవచ్చితి విటునేడు॥ ౪౭.
ప్రేమ వాక్యముల బలుకగ హరియును ప్రియుడై తా నిట్లనియె।
ఏనుర కెప్పుడు గొప్పవారికడ కేగిన నన్నమిడ రయ్యె॥ ౪౮.
కౌతుక మొక్కటి నీకు జూపెదను గారవమున రమ్మనుచు।
యాతని వెంబడి యుంచుకొనుచు హరి యట్టె విప్రుండగుచు॥
చింపుడు గుడ్డలు ముసలివేషమున చేతులనొక కఱ్ఱనిడి।
పెంపువణకు బుట్టినరీతిని తగు బీద తనంబుననుండి॥ ౫౦.
పురమున దానటుబోవ దొడంగగ పురుషుండొక డాదినము।
ఇరవొందగ నటు వెయ్యి విప్రులకు నేర్పరచెను భోజనము॥ ౫౧.

అందుకు తొలిదిన మా మంత్రణమును నందరికిడి నామములు।
సందియమొందక వ్రాసియు నుంచియు పొందుగ మరుదిన మటులు॥
పఙ్క్తిని దీర్చియు పేర్ల చొప్పునను బాజారున తెరవేసి।
ఉక్త ప్రకారము విస్తరముందుగ నొగి కూర్చుండగ జేసె॥ ౫౩.
శ్రీహరి యచటికి బ్రాహ్మణ రూపున జేరియు దానిట్లని యెన్।
బాహుళ్యంబగు క్షుధ చేవచ్చితి భక్షణ చేసెద ననియెన్॥ ౫౪.
అందుకు వారలు చోటులేదనిరి యాగంతుక విప్రులకు।
పొందుగ హరియనె సహస్రజనులిటు భుజించుచో నొకనాకు॥౫౫.
చోటుండదొయిని బలిమిని విస్తరన్ నూటిగదా గూర్చుండన్।
పాటవముగ తగ నచ్చటివారలు బట్టి రతని చెయ్యాదన్॥ ౫౬.
హాటము చేయు వాడనుచు బైటికిని యపుడె దెచ్చి విడువంగన్।
కటకటయనుచును బోధలుగాంచుచు ఘనయార్తిని గైకొనగన్॥
ఆ పోశనమును విప్రులందుకొని యందరు భక్షింపగను।
ఆపలేని యొక దూళిగాలిచే యాకు లెగిరి పోవగను॥ ౫౭.
తెరలను గట్టిన వస్త్రమంటపము దిగ్గున నిలబడగాను।
కరమరుదుగ నాపదార్థ మంతయు కలిసిమంటి పాలయెను॥ ౫౮.
శ్రీహరి యొక్కడు లేకుండుటచే చెడిపోయెను భోజనము।
బాహుళ్యబగు సమారాధనము పనికిమాలె నాదినము॥ ౬౦.
భగవంతుండనె బోధలునింగని భావశుద్ధి లేకుండన్।
విగతభక్తి గొను డాంబీకులయా విప్రభోజన మిటులుండన్॥ ౬౧.
శుద్ధభావమున బెట్టితీవన్నము సుఖమయ్యెను తగనాకు।
పద్ధతినిటులం జెప్పగ భక్తుడు బహుమోదముతో నొక్క॥ ౬౨.
అఘటిత చర్యల నీవు జేతువని హరిపదముల బట్టగను।
అఘహరుడగు హరి బోయెను గుడిలో నాతడు గనుచుండగను॥

---

బోధలు డుదయము థాన్యగ్రామునకు బోవుచుండ క్షుధ చేతన్।
బాధితు డగుచును సూర్యరశ్మిచే బహుగనతడు శ్రమ జెందెన్॥
హరియిది గన్గొని యా మార్గములో నత్యున్నత తోటయును।
గురుతుగ జేసియు వనకరుడగుచును గొట్టుచుండె మోటయును॥
బోధలు మదిలో శీతోష్ణంబుల బూనక హరి నే తలచు।
పాదుగ నాతడు తోటను గాంచియు ప్రవేశింపక నుయ్యుంచు॥ ౧౬.
వనకరు భార్యయు వచ్చుచు నప్పుడు వాని బిలిచె రమ్మనుచు।
అనువుగ రొట్టెయు కందమూలముల నరసియునిటు భక్షించు॥ ౧౭.
తోటమాలి నిను జూచిదూరమున తొందరతో బిలువు మనెన్।
బాట గుడిసె నీ పాదస్పర్శచే పవిత్రమగునటు జేయుమనెన్॥ ౧౮.
ఇదివిని బోధలు తోటలో వెళ్ళుచు నిష్టంబుగ భక్షించెన్।
కుదురుగ నీరును ద్రాగిపిదపనటు పదపడి త్రోవను నడచెన్॥ ౧౯.
కొంతదూరమటు వెళ్ళి తిరిగియును కోరి జూచెదా వెనకన్।
పంతముతోనటు యేమిలేకగనె భగవత్కృప యనెనుతగన్॥ ౨౦.
బోధలు డొకయెడ చేనురక్షణము పొసగజేయు చుండగను।
పాదుగ తానొక మంచెనుండుచును పక్షులదోలు చుండకను॥ ౨౧.
చావడి వద్దను థాన్యము గొనినను చౌర్యంబని వచ్చుసుమీ।
కావున పక్షులు దుఃఖింపంగను కరముల గొట్టుట పుడమి॥ ౨౨.
చక్కగాదనుచు సకల భూతముల సర్వేశ్వరు డుండునని।
నిక్కముగాతన పడిశెను కంఠము నెనరుతోడ జుట్టుకొని॥ ౨౩.
హరి నామంబును జెప్పుచు నూరక నచ్చట దానుండగను।
వెరవున భార్యయు రొట్టె దెచ్చుచును వెలయ జెప్పెనయ్యెడను॥ ౨౪.
మనలకు భోజనమునకు కావలయు మహీని పన్నుగట్టవలె।
గనుకను యాచకుల కిడకు నీవును కంకి జోన్నలను నిటులె॥ ౨౫.
నీవును వాటిని ముట్టినయెడలను నెటికటినంబగు మనకు।
దేవుని మీదను యానయు నున్నది దెంపిలివేని యుతుదకు॥ ౨౬.

ఇటులం జెప్పుచు భార్య వెళ్లగను నటుకొందరు సాదువులు।
విఠ్ఠలవిఠ్ఠల యనుచు జెప్పుచును వేంచేసిరి యటువార్లు॥ ౨౭.
పోవుచు నుండిరి పండరి యాత్రకై బోధలు వారల జూచి।
భావశుద్ధితో మంచెనుండి దిగి భక్తిని దండము జేసి॥ ౨౮.
నిలుచుండగ నటుకొందరు బల్కిరి నెనరున దుష్కాలమున।
పిలిచియు నన్నము బెట్టిన దాతవు బెట్టుమిపుడు కంకులన॥ ౨౯.
ఆకలి దీరుననుచు దెలుపగను నటు తెంపుకొమ్మని జెప్ప।
జోకను వారలు కొన్నికంకులను సొరది తెంపిముద మొప్ప॥ ౩౦.
దారిని బోవగ జనులనేకులటు తగులవచ్చి వెంబడిగ।
తీరుగ నడిగిరి యన్నదానమును చేవుడు ప్రీతి జెలంగ॥ ౩౧.
అతిముద మొందుచు బోధలుడనియెను నాటంకము లేకయును।
హితులగు మీరలు హస్తంబులతో నెలమికంకి కోయుమను॥ ౩౨.
శతద్వయంబగు జనులటు వచ్చియు సరగచేను కొల్లగొని।
గతధాన్యంబుగ చేసియు చేనును గరిమె వెడలిరి బైటికిని॥ ౩౩.
భగవన్నామము జెప్పుచువారలు భక్షించియు వెళ్లగను।
పగపున భోధలు డింటికి రాకను వసించెను చేను కడను॥ ౩౪.
కొల్లబోయెనటు చేనంతయునని కొమారు డప్పుడు వినుచు।
మెల్లగ నచటికి వచ్చి చూడగని మిక్కిలి చింతను గొనుచు॥ ౩౫.
ఎటుల జేతునని తలచుచు నుండగ నీప్సితుడగు తండ్రియనె।
కటకట నీవును కృపణత్వంబును గైకొన కెపుడుండుమనె॥ ౩౬.
తేనెటీగెలును నుపవాసముచే తేనెను గూర్చియు వెనకన్।
మానుగ వ్యాధుని కంతయునిచ్చును మహిలో తొందర గనగన్॥
ఆటువలె కృపణులు సంసారంబున నమితధనము కలిగుండి।
పటుతర దొంగలు గైకొనివెళ్ళగ బాధనొంది తాముండి॥ ౩౭.
ఈదినమందును సత్పాత్రములో నిడితి ధాన్య మిందున్నకై।
చీదరవలదని జెప్పగ కొమరుడు చేసెనుదండము పితకై॥ ౩౮.

హరికృప చేతను ధాన్య మబ్బెనని యౌదార్యుండై తాను।
గురుతుగ భక్తుల పిలిచియు నిచ్చెను గోవిందుని ప్రీతిగను॥౧౧౯.

---

అరయామడలో రాళేరాసను నలగ్రామం బొకటుండు।
తిరముగ నచ్చట శ్వశుర గృహంబును తీరుగ భక్తునకుండు॥ ౧౧౭.
హరిపదంబు తన మామయు బొందగ నతని పుత్రు లిరువురును।
దురభి మానులై బోధలు వద్దను దూరచూపు నుండగను॥ ౧౧౮,
బానిసె యొక్కతె హాసి యనుచును బట్టియుండె వారలను।
మానక నామెయు శ్రీహరి భక్తిని మన్నింపుచు నుండుచును॥
అప్పుడప్పుడును బోధలు కడకును నామెయు వచ్చుచు నుండున్।
ఒప్పుగ శ్రీహరి గుణవర్ణనములు నొసగ వినుచు బోచుండున్॥౧౨౦.
ఒకదిన మందును బోధలు చరణము లొప్పుగ దా బట్టుచును।
ప్రకటపరచు నా కుపాయ మొక్కటి భవతరణం బగుటకును॥
ఇదివిని బోధలు దాసీ జనులకు హెచ్చు నేమ మెందుకను।
సదయుడై దలచుచు నాసిని గాంచుచు సర్వేశుని నీవిటను॥౧౨౨.
సంసారములో పనుల జరుపుచు చక్కగ దలచుచు నెపుడు।
కంసారాతిని నామము జెప్పుచు గరిమ నేకాదశి నాడు॥ ౧౨౩.
ఉపవాసంబును నుండుము రేయిని నొగిహరి కథ వినుచున్నన్।
చపలత లేకను శ్రీహరి చరణము సరగగందు విట్టున్నన్॥ ౧౨౪.
ఈవిధమున యాహాసీ దాసియు నెలమి జేసె భక్తియును।
భావశుద్ధితో భోధలు డింటికి ప్రతియేకాదశి నరుగును॥ ౧౨౫.
కథాశ్రవణమును జేసివెళ్ళుమరి కథయురమ్యమైయుండు।
విధేయులగుచును వచ్చియ నేకులు విఠలు కీర్తి విని నెగడు॥౧౨౬.
ఒకదినమందును రాళెరాసగు యూరునుండి బహుజనులు।
సుకరంబుగ నా రాత్రి కాలమున సూటిగ నరిగిరి యటులు॥౧౨౭.

మనుజుని యొక్కని పాము గఱచె నా మార్గమందు రాగాను।
అనువుగ వానిందెచ్చిరి యితరులు హరికీర్తనలో గాను॥ ౧౨౯.
ప్రాణమువానికి లేకయుండినను బైలుపరచ కుండగను।
మానుగ బోధలు డచ్చటిమనుజుల మన్నించుచు బహుగాను॥
నామ మహిమ తగ వార్లకు జెప్పుచు నయమున దానటనుండు।
రామరామయని ప్రజలజెప్పుమని రాజిల్లుచు నిలుచుండు॥ ౧౩౦.
విషము నమృతమై వెలయుచునుండును విమలుని నామముచేతౕ।
దశదిశలందును భక్తులయనుభవ దర్శనమిది ప్రియమొందౕ॥
వినుడుమీర లోజనులారా విమలను హరినామంబు।
చనువున జెప్పిన పవిత్రులగుదురు చక్కనగును నేమంబు॥ ౧౩౨.
మాధుర్యములోన మృతము కన్నను మధురంబై యదియుండు।
చాతుర్యంబున నామము నుడువుచు చప్పట్లను వేయుండు॥ ౧౩౩.
శ్రోతలువిని చప్పట్లు వేయుచును సుఖనామము బలుకగను।
పాదుగ చచ్చినమనుజుడు నామము బలుకకుండ జూచుచును॥
ఓతండ్రియీ నరదేహము హరి యొసగెమనకు నెయ్యమున।
స్వాతంత్ర్యము విడియతని నామమును చక్క జెప్పు నేనువిన॥౧౩౪.
శ్రీహరి యప్పుడు భజనమధురమటు చెడుననుచును దాదలచి।
ఊహను మరణము నొందినవానికి నూపిరియును గలిగించి॥ ౧౩౬.
అచ్యుతకృష్ణాహరి రామాయని యాతనిజెప్పం జేసెౕ।
ప్రచ్యుతముగ నాపీనిగె దెచ్చిన ప్రజలకు వింతయు వెలసెౕ॥
వారలులేచుచు సంగతి దెలుపుచు వందన మిడుచుండగను।
మీరిన యానందము తోనందరు మేలుమేలని జెప్పగను॥ ౧౩౭.
బోధలుడప్పుడు కన్నీరొలుకుచు పొందుగ హరిదలచుచును।
సాదరముగ ననుకరుణించితివిటు సర్వేశ్వర రంగయను॥ ౧౩౮.
ఘాతయు నాకుందెలియక ముందె కటాక్షించి తీవనుచు।
పాదుగనిట్టుల స్తోత్రము జేయుచు భక్తిని హారతులిచ్చు॥ ౧౪౦.

ఇదిగని హాసిక్రేమయు నధికమై యేండ్లు మూడుగడ వగను।
పదపడి యాస్త్రీయజ మానులలో భాగ విభాగ మగుట యును॥
హాసిబానిసెను విక్రయపరచను నలవారె త్నించంగన్
వాసిగనామెయు వినుకొని బోధలు వద్దను తెలిపింపంగన్॥ ౧౮౭.
ఆతడువినుకొని ప్రారబ్ధంబెటు లగు నట్టుల జరగవలెన్।
పాదుగనిందుకు చింతయెందుకని, పాండురంగ డిచ్చ్యేడలన్॥
సాగరమగునటు లుండునందులో సరళ అలలవలె మనము।
బాగుగ నవియును నీరువినాగా ప్రబలంబుగ లేవునుము॥ ౧౮౮.
అటులనె మనకును హరినివినాగా నబ్బదుస్థితీ యని జెపుచు।
పటుతరముగ నిది గనిన వియోగము బాధింపదు యిటు తరుచు॥
హాసియుజెప్పెను నిందుకు దుఃఖము నబ్బలేదు నాకిటను।
నీ సహవాసము యంతరించునని నెటిశోకము నొందితను॥ ౧౮౯.
ఇటులం జెప్పుచు మూర్ఛ నొందిదా నిరవుగ తీరిగియు లేచి।
తటుకున వెళ్లియు మమతాయీ కడ తత్సంగతి వినుపించి॥ ౧౯౦.
మీరలు నన్నిటు వెలకు దీసికొని మేలు జేయుండని కోరన్।
ధీరత పతిగని మమతా యీయనె దిక్కని మనకడ జేరన్॥ ౧౯౧.
బ్రోవ వలయునని వతనుభూమి నిటు పొందుగ విక్రయపరచి।
ఈవనితకు నే నిచ్చెద పైకము నిందుకు నిశ్చయపరచి॥ ౧౯౨.
ఆలోచన దా చేసి భర్తతో నభయ మిచ్చి పొమ్మనియెన్।
వీలుగ ముదమును బొందుచు హాసీ వెళ్ళెను తనయిలు డాయన్॥
వెనకను బోధలు బావ మరదులెడ వేంచేయుచు తా జెప్పెన్।
వినుచు వచ్చితిని హాసీ దాసిని విక్రయమును జేయింపన్॥ ౧౯౩.
మీరలిచ్ఛ నొందిన రీతిని యిటు మేలగు నా కమ్మినను।
వారక మీరలు దాని క్రయంబును వరుస జెప్పు డనగాను॥౧౯౪.
బావలు జెప్పిరి హాసీదాసిని బంధువు నీకియ్యమని।
కావున నీవును వెళ్ళవలయునని కఠినోక్తుల జెప్ప వినీ॥ ౧౯౫.

హాసి యేడ్వగను బోధలు డనియెను హరిచే దెప్పించెదను।
భాషించుచు నిటు యింటికి వచ్చుచు భార్యతోడ జెప్పెమును॥
బంధువు లిరువురు నాదినమందె బైటి గిరాకి వారలను।
పొందుగ బిలిచియు హాసిని యమ్మిరి *పార నిరువది వరహాకును॥
పైకము గైకొని హాసిని వార్లకు బట్టియిచ్చి పొమ్మనగన్।
వీకను నామెయు నేడ్వ దొడంగెను విఠ్ఠల హరియని యలుకన్॥
వెంకట కృష్ణా యిటురాకున్నను వేగవిడుతు ప్రాణముల।
సంకట పడుచును బోధలు నిన్నున్ సరగనంపెదని వెళ్ళ॥ ౧౫౭.
ఆవచనంబును సత్యము జేయుము యచ్యుత కేశవ యనుచు।
భావశుద్ధితో బలుకగ శ్రీహరి బ్రాహ్మణు డగుచును వచ్చు॥ ౧౫౮.
హాసిని గాంచుచు బోధలు నిన్నున్నచటి కరుగ బిలిచెనన్।
వేసరిల్లకను విప్రుని పదముల వేగమె బట్టెను గాన్॥ ౧౫౯.
ఆసమయంబున నందరు జూడగ నదృశ్యులయి రిరువురును।
హాసికి కొమరియు చిన్న పిల్లయును నచట లేకపోవగను॥ ౧౬౦.
విక్రయపరచిన వారల వణిజులు వేగనడుగ సంగతిని।
అక్రమమని యదితమకు దెలియదని నటు జెప్పిరి వారుగని॥ ౧౬౧.
దాసీకొఱకై యిచ్చిన పైకము తప్పక వర్తకు లియ్యమనన్।
హాసిని బిలిచిన విప్రుని మాటను నా బోధలుని గనుమనన్॥
బోధలు హాసికై హరి నంపెదనని జోయె ననుచు విందుమిటు।
సాదరముగ మా కెందు కమ్మితివి చక్కనియుము పైకమిటు॥
బోధలుకడ మాపనియు లేదని పోసగ జెప్పి వారలును।
పొదుగ పైకము వసూలు చేయను బహుతొందర నిడిరిమును॥
భగవంతుండగు శ్రీహరి బ్రోవును భక్తుల తా జూచుచును।
తగవులేక యా హాసీ బానిసె తర్లె వైకుంఠమునకును॥ ౧౬౫.

---

* పార - కుత్సితము,

అంత్యజు డొక్కఁడు బోధలు కడకును ననువుగనటు నే తెంచి।
*సంతన మడిగెను యుపదేశంబును చను వొప్పగ తానెంచి॥
బోధలు డనియెను పండరిపతి నే పొసగ నడిగి దెల్పెదను।
సాదరముగ దా జెప్పి శ్రీహరిని చక్కఁగ బ్రార్థించగను॥ ౧౬౭.
హరి బ్రసన్నుడై యుండగ బోధలు డనా మికుని విన్నపము।
గురుతుగ దెల్పగ పాండురంగడనె కుజనులకు పదేశమ్ము॥ ౧౬౮.
చేయం గూడదు యనా మికుడును చెడ్డ నడత గలవాడు।
బాయక నీకును ప్రతీతి జూపెద పంటపూజ యగునాడు॥ ౧౬౯.
దుడ్డెను వానిచె జంపించియు మరి తోలివంటను జేయుచును।
అడ్డము లేకను బంధు బోజనము నరయచేయు మియ్యెడను॥
అనామికునికిని జెప్పుము వృషభము హతము జేయు సంగతిని।
చనువున నితరుల కెరిగింపకుమని చక్కఁ జెప్పి యుండుయని॥ ౧౭౦.
వాడుం దానిని గోప్య పరచునెడ వరుస జెప్పు మంత్రమును,
జాడం జెప్పిన వాక్యము వినుకొని జనార్దనుం గని యతను॥
హింసాకర్మము జేయుట నాకును నిష్టము లేదని బలుకన్।
సంశయ మొందక జేయుము నీకును చక్కఁ గునని హరిచనగన్॥
మరుదినమున యా బోధలువద్దికి మాలవాడు వచ్చుచును।
గురుతుగ నడుగగ నుపదేశంబును నరయుచు బోధలుడటను॥
అతనిం గాంచుచు పంట పూజకై యరకదుడ్డె బలియిచ్చి।
సతతము దీనిం గోప్య పరచినను సత్శిష్యుడవగు హెచ్చి॥ ౧౭౫.
అటులనే జేసదననుచు జెప్పుచును నట చంపెను వృషభమును।
చటులతరంబుగ కోసియు మాంసము చక్కఁ జేసి యియ్యగను॥
వంటను జేసిన పిదప కులస్థుల వరుస బిలిచె భక్షణకై।
వెంటవచ్చి గని మాంసము, బోధలు వృత్తి తిరిగెనని నిటకై॥౧౭౭.
మేక మాంసమని దలచుచు వారలు మిగుల తృప్తి బొందుచును।
వీకను తగునటు భక్ష జేసియు వెళ్ళిరి తమ యిండ్లకును ౧౭౮.

---

* సంతనము - అనుకూలముగా కుదురుట.

అనామికుఁగని భోధలు డనియెను యాదుడ్డై శిరసు చర్మమును।
ఘనీభూతమగు నూకను నుంచుము కనపడ జేయకు మిటను॥
ఆతం డటులనె జేసియు మరుదిన మాదిత్యోదయ మపుడు।
స్వాతంత్రుండై కాపు లిండ్లలో చక్క వెళ్ళి గూర్చుండు॥ ౧౮౧.
వారలు వీనిం గాంచుచు లోపల వచ్చితి వెందుకు యనగఁ।
దూఱుచు వారల మీకును నాకును తొలిభేదము లేకంగఁ॥
నిన్నటిదినమున వృషభముజంపుచు నెఱిబోధలు డన్నమిడు।
పన్నగమీరలు నా మాంసంబును భక్షించియు తగనెగడు॥౧౮౨.
దూరముబొమ్మని నన్నుజెప్పుటయు దురితముగాదే యనుచు।
వారకయొక్కక కాపునింటిలో వరుసను జెప్పుచువచ్చు॥ ౧౮౩.
స్వజాతివారలు కోపయుక్తులై జాతిభ్రంశగలిగెనని।
నిజముతెలియుటకు యెద్దుతోలుతల నీవుచూపు మనగవిని॥౧౮౪.
అనామికుండనె నునుఁకను నున్నది యట్టె మీకు జూపెదను।
వినీతుడగు నా బోధలు జంపను వెళ్ళిరతని చేనుకును॥ ౧౮౫.
గుడియనందుకొని వారలువచ్చిరి గొట్టవలయునని తలచి।
కుదురగ బోధలు ధ్యానమునందును గుడిసెను నుండంగాంచి॥
కొందరుయాతని తెమ్మనిజెప్పిరి కొట్టుటకై వచి రని।
పంతమునాతడు బైటికిరాగను బల్కిరికులజు లతని గని॥ ౧౮౬.
తక్కరగాడవై కులనాశంబును తరుచుగాగ జేసితివి।
మిక్కటముగ తగు శిక్షజేతుమని మీరిపైని యరుగభువి॥ ౧౮౭.
ఆసమయంబున హరిరంగాయని యచ్యుతనామము జెప్పఁ।
వేసరిల్లకను వారలడిగిరటు వృషభ చర్మ శిరమొప్పఁ॥ ౧౮౮.
అనామికుండా యూకనునుంచిన యల చర్మము తల రెంటి।
అనాయాసముగ బైటికి తీయ్యగ నవి మేకవిగా కనుగొంటి॥౧౯౦.
చింతనొందుచును యనామికుండటు జెప్పెకోడె చంపితిని।
వింతనయ్యె యీమేక యెటులనిటు వేంచేసెను చిత్రమని॥ ౧౯౧.

గ్రామవాసులును బోధలుగాంచుచు కానమునీ కోడెయును।
సేమంబుగనటు చూపుమనంగను చింతను బోధలుండగను॥
పండరినాథుడు వచ్చినకోడెను బ్రతుకజేసె తా నటను।
దండితాపమటు కులజులుగాంచుచు తగినశిక్ష నంత్యజును॥ ౧౯౩.
చేయవలయునని దలచగవాడును చేసి నతి బోధలునకు।
నాయపరాధము క్షమింపుడనుచును నయమున వేడుచుమెలగు॥
గ్రామవాసులను గాంచుచుబోధలు కరుణింపుండని కోరు।
వేమరునాతని చంపవలదనియు విహితప్రార్థనం జేరు॥ ౧౯౪.

---

అచ్చటనొకయెడ మొదటివానలును ననువుగ గురియక యుండన్।
హెచ్చుగపంటలు లేకయుండెతగ నెలమికార్తి నెలగూడన్॥
వానలుగురియగ భూమినిదున్నుచు వడివిత్తన మలుకుటకు।
పూనియుతెచ్చెను, విత్తనధాన్యము బోధలు నింగనియటకు॥
పండరియాత్రకై పోపుజనంబులు భగవన్నామ మనుచును।
నిండుప్రేమతో నచ్చటనిలువగ నీతడుదండం బిడగాను॥ ౧౯౭.
వారలు కొందరు కరువుకాలమున వసుధనన్న మిడితివని।
తీరుగ మా కొకపూట కన్నమును తినిపించిన మేలుయని॥ ౧౯౮.
ఇదివిని బోధలుకొడుకును గాంచుచు యేకాంతంబున ననియెన్।
విదితంబుగ మనయింటను ధాన్యము వేరేమియు లేదయ్యెన్॥
విత్తనధాన్యము నింటికిగొనుచును విసిరిపిండి జేయుచును।
పద్దుగవీరికి భక్షణకియ్యుము పండరిపతి ప్రీతిగను॥ ౨౦౧.
జీవరహితమగు భూమి ధాన్యమును చిరతరముగ పితికించున్।
జీవరూపులగు వీరి యుదరమున జెందిన నగణిత మగుననుచున్॥
అతిమోదముతో కొమరుడుజేసెను యాజ్ఞప్రమాణముగాను।
హితమగువిత్తన ధాన్యములేకను యిలనిడె చేదనపలను॥ ౨ ౩.

పెద్దబెరిగియువి పచ్చగ యుండగ పెలుచ నవ్వి రితరులును।
సద్దులేక యొక కుటిలుడు కాయను చక్కగొట్టిచూడగను॥ ౨౦౪.
గోధుమలందున గూడియుండగని కొనియాడిరి వింతయని।
పాదుగదీనిని హవల్దారుడటు బాదుషాకు వ్రాసెగని॥ ౨౦౫.
నరపతిజూచియు నైమజవానుల సరగనంపి బోధలుని।
*విరగబాటునను తనకడరుగు నటు వేగమెజేసియు భువిని॥ ౨౦౬.
చేదనపలలో గోధుమగింజలు చేరెనెటుల ననగాను।
పాచుగ బోధలు పండరినాథుని ప్రబలచర్య యనగాను॥ ౨౦౭.
తుచ్ఛుడునరపతి క్రుద్ధత నాతని తురకజాతి చేర్చుటకై।
పచ్చిమాంసమును దెప్పించుచునటు భక్షింపుండనె బాగై॥ ౨౦౮.
ఈశుని కరుణను యది యంతయునట నేర్పడె ఫలపుష్పములై।
వాసిగ నిదిగని వసుధాధీశుడు వందనమిడె తానటులై॥ ౨౦౯.
నీకు నభీష్టము నడుగుమిత్తునన నెనరున భక్తుడు బలికెగా।
ప్రాకటముగ నాకపేక్ష లెవ్వియు భాధింపవుయని యేగెగా॥ ౨౧౦.
తిరిగివచ్చుచును స్వగ్రామమునకు ధీరతహరిని భజించు।
కరమరుదుగ తానహంవృత్తిని ఖండించియు దావైచు॥ ౨౧౧.
సచ్చరితచె తనయూరు పండరికి సమానముగ జేయుచును।
విచ్చలవిడియటు జడుల మూఢులను విఠలుభక్తి నిలిపెమును॥
భావశుద్ధితో భక్తులకథలను బాడెడు హరిదాసులకు।
సావధుడగుచును బాలకృష్ణుడిటు శరణుజొచ్చి దాటిరుగు॥

## గణేశనాథు చరిత్రము.

సారసెయుజ్జనియను గ్రామంబున సద్గుణిగ గణేశుడును।
ధీరవిరాగుడై పగటివేళలో తిరుగు నరణ్యము లటను॥ ౧.
హరిని భజించుచు నేకాంతంబున నలరేయిని గ్రామమున।
గురుతుగ వచ్చుచు కీర్తనజేయుచు కోరికేమి లేకచన॥ ౨.

*విరగబాటు - గర్వము.

ధనసంప త్తియు లౌకికపూజల దాంభికము లేకయును।
మనసునెప్పుడును హరి మీఁదుంచుచు మధురకవిత లొనర్చుచును॥
ఉండగనొకయెడ పండరి పురమును నొగివచ్చె గణేశుడును।
దండిసేనతో శివాజినరపతి తలపడి వచ్చుచు నటను॥ ౪.
గణేశనాథుడు కీర్తనజేయగ గారవమున వినుచుండు।
వినోదమొందిరి విపులజనంబులు వితలుకీర్తి వినిమెండు॥ ౫.
శివాజినరపతి నూతనమంచము చేసెతా పరుండుటకు।
నవ మంచముపై గణేశనాథును *చవిపరుండ జేయుటకు॥ ౬.
తలపోయుచు బహువినయ వీధేయుడై దండమిడియు నాథునకు।
సలలితముగ తనగృహమున కేగియు నిలనొక దినముండుటకు॥ ౭.
అనుజ్ఞనిమ్మని వేడగనాతడు నత్యార్తిని దాగనియు।
మనసునక్లేశము మరలొందగదా మంచిదియని జెప్పుటయు॥ ౮.
శివాజిరాజు గణేశనాథుని శిబికను నిడుకొని దెచ్చె।
భవాబ్ధితరుణో పాయంబనుచును బహుతర సేవలజేసె॥ ౯.
పట్టెమంచమున గణేశనాథును పరుండజేయ రేయినను।
అట్టె నాథుడు దెచ్చి శిలలను యా పరుపున వేయుచును॥ ౧౦.
అనుతాపముతో నందు పరుండియు నరుణోదయమున లేచె।
వినమితు డగుచును రాజువచ్చుచును విఠ్ఠదాసు దర్శించె॥ ౧౧.
విధిపూర్వకముగ దండముబెట్టుచు వీక్షించెను మంచమున।
వ్యతిరేకంబగు రాళ్ళురప్పలటు వచ్చు రీతియె మియన॥ ౧౨.
అంచితముగ నా గణేశనాథుడు నవనిపతిని గాంచుచును।
మంచమునందును పరుండి యున్నను మహితనిద్ర వచ్చునను॥
నీదుమనోరథ పూర్తికి శయనము నే జేసితి మంచమున।
సాదువునకు సుఖ మిచ్చిన దుఃఖము సంభవించు నెయ్యమున॥ ౧౪.
గోకుడు వ్యాధియు తగిలినవానికి గోకునపుడు సుఖమగును।
జోకనునాతడు కొంచెము సేపున సొరది దుఃఖమొందువీను॥ ౧౫.

---

*చవి - రుచి.

అటువలె నాకును విషయభోగము లతిభయమై తగనుండు।
పటుతరముగ నాపద్ధతి యిదియని బలుకంగను యానృపుడు॥ ౧౬.
అనుతాపముతో విరక్తి నొందియు నదిమొదలుగ శయనంబు।
సునిశ్చితంబుగ విడుచుచు నెప్పుడు సుజనుల గూడు దినంబు॥ ౧౭.
అరణ్యవాసమె గణేశ నాథుడు నతులితముగ దా జేయన్।
నరులును నాతని కీర్తిని వినుచును నరుగుదెంతురటు డాయన్॥ ౧౮.
శుశ్రూషలచే నుపదేశంబుల చేకొనుచుందురు వారు।
విశ్రుతముగ నాయడవుల నందును విహరింతురు తగవారు॥ ౧౯.
దురాచారులై యున్నమనుజులును గురుహస్త స్పర్శమునన్।
నిరాశకలిగియు వైరాగ్యముచే నెనరొందిరి భువిలోనన్॥ ౨౦.
మున్ముంటరువై శిష్యుల నిట్టుల ముదమొప్పగ జేయగని।
విన్నాణంబుగ నచ్చటి కుజనులు విపుల మాయజాల మని॥ ౨౧.
సంసారికుల నడవిపాలుగా సరగ జేసె నీతండు।
హింసాకర్మంబిది గాదాయని యెలమిననుచు వారుండు॥ ౨౨.
వీరలందరును గూడియు నొకయెడ వెళ్ళిరి యా యడవికిని।
ధీర గణేశుని జూడగ నాతడు ధీశిష్యుల బిలిచికొని॥ ౨౩.
వీర లందరకు నుపదేశంబును వీలుగ నిటు చేయవలన్।
సారతరంబగు నీ వార్తను విని సకల కుజనులును మెల్లన్॥ ౨౪.
అనేక ప్రజలకు సంసారంబుల హానియు నీ సంగమునన్।
ఘనముగ వెలసెను పురజనులకు నిటు కష్టమయ్యె బహుగానన్॥
నీదు దృష్టికిని సమమై యున్నది నిఖిలంబగు దృశ్యమును।
పాదుగ నిచ్చట తరువరములకును నీదుపదేశ మియ్యుమను॥ ౨౬.
సుకరంబుగ విని గణేశ నాథుడు చూతవృక్షమట నుండన్।
సకల జనులుగన తారక మంత్రము సరగ జెప్పె దానికటన్॥ ౨౭.
కుజనులు బలికిరి మనుజుల భ్రాంతిని గొట్టి నీవలె జేసెదవు।
నిజముగ వృక్షము నటువలె జేసియు నేర్పు జూపు నీ తెరువు॥ ౨౮.

ఆసమయంబున శిష్యులు దెచ్చిరి యన్నము కూరలతోను।
వానిగ వానిం గొని చేతిని యా వనతరువును గని తాను॥ ౨౯.
హరి ప్రసాద మిది నోరు తెరచి యిట నందరుగన భక్షించు।
గురుతుగ జెప్పగ చెట్టు నడుగునటు కొంచెము విరగంగనుచు॥
ప్రసాద మంతయు తినుచు మునుపువలె పాదప మయ్యెను తగను।
నిశేష వింతయు నిదియని జెప్పుచు వెళ్ళిరి కుజనలు యటను॥ ౩౦.
గణేశనాథుం డొకచో యడవిని ఘనమగు కీర్తన జేయన్।
వినుటకు వచ్చిరి విప్రపండితులు వివిధ జనంబులు డాయన్॥ ౩౧.
నామోచ్చారణ తాళ వాద్యముల నాదమంబరము నిండు।
ప్రేమామృతమగు లహరిని నాతడు ప్రియనామము జెపుమనుడు॥
చప్పట్లను వేయుచు హరినామము పలుపుచు నుండగ తాను।
ఒప్పగ నితరుల నటుల చేయుమన నొలయకుండ విప్రులును। ౩౪.
శ్రేష్ఠ జాతులము హీన జాతుడవు జెపుట నీకు సరికాదు।
వేష్టితముగ నటు వారలు జెప్పగ విహితుడు గణేశనాథు॥ ౩౫.
తాటి వృక్షమిట నీడ నిచ్చినను ధర నెవరికి పనిబడదు।
దీటుగ నటువలె నగ్ర వర్ణులై ధీరవిప్రు లున్నందు॥ ౩౬.
శ్రీహరి భజనకు పనిబడ వెప్పుడు చేతులు మీా కియ్యేడను।
బాహుళ్యంబుగ పాషాణంబులు భగవద్భజన జేయుననును॥ ౩౭.
ఇటులం జెప్పగ నచ్చటి శిలలును నెలమి గొట్టు నొకటొకటి।
పటుతరముగ బహుశబ్దం బిచ్చెను భజనకు సరి జూడబడి॥ ౩౮.
వింతను విప్రులు చప్పట వేయుచు విఠల విఠల యని రపుడు।
సంతస మొందిరి సకల జనంబులు సద్భావము గొనియాడు॥ ౩౯.
భజన ముగించుచు హారతు లిచ్చిరి భగవంతునకును నపుడు।
సుజనుల దాసుడు బాలకృష్ణుడును సూటిగ సేవనునుండు॥ ౪౦.

# కే శ వ స్వా మి చ రి త్ర ము.

---

కేశవు డనునొక బ్రాహ్మణ భక్తుడు క్రియను బీజపురమునను।
పేశలముగ యేకాదశి రెయిని ప్రియ హరికథ జేయగను॥ ౧.

వైదిక బ్రాహ్మణ సాధు జనంబులు వచ్చిరి కథ వినుటకును।
కౌతుక మగునటు కథామృతంబును ఘన ప్రీతిని వినగాను॥ ౨.

తాళ మృదంగపు సుస్వర గానము తాండవమును సలుపుచును।
మీలుగ రేయిని సొంటి శర్కరకై వృద్ధ శిష్యునంపుచును॥ 3.

అంగడిలోగొని దెమ్మని చెప్పెను హరివిఠలు నివేదనకు।
తొంగలించుచును శిష్యుండరిగెను తోడనె బాజారునకు॥ ౪.

కోమటి యొక్కడు నిద్రనునుండెను కుదురుగ నాతని లేపి।
వేమరు సొంటియు శర్కరనిమ్మని వేగనడిగె తగనొప్పి॥ ౫.

దుకాణంబులో దీపములేకనె తోడవెళ్ళి వణిజుండు।
ప్రకారముగ వసనాభిసంచిని బట్టి సొంటియనియు నిడు॥ ౬.

తూనికె చొప్పున శర్కతోడను తొందర లేకను యిచ్చెన్।
మానుగవణిజుడు జెప్పె తనకొడుకు మహిగ్రామము వేంచేసెన్॥

అంధునకైనే కథవినరాలే దనేక నరులరుగుటచె।
పొందుగ సొంటియు మరియుకొంచెము బూనియేగుమని యిచ్చె॥

గురుతుగ శిష్యుడు వెలుతుర జూడక కొనిదెచ్చెను యటుదానిన్।
గరిమెనఖ్మికను చూర్ణము జేయుచు కలిపెను శర్కరవానిన్॥ ౯.

శ్రీహరికి నచట నైవేద్యంబును సెమమలర నుంచగను।
బాహుళ్యంబగు ప్రజలు జూడగను భగవంతుం డయ్యెడను॥ ౧౦.

విపులజనములకు కీడుజేయునని విషమును దా హరియించెన్।
ఉపవాసముతో నున్నవారికది యొప్పదనియు హరితలచెన్॥ ౧౧.

కేశవస్వామియు కృష్ణకథల తా క్రియను జెప్పె రేయంతన్।
ఆశను హరికిని హారతులిచ్చెను యరుణోదయ మగుచెంతన్॥ ౧౨.

ప్రసాదంబునటు బెట్టిరందరికి భక్తిని కొందరు దినుచు।
సుశీలురగుచును మాటగట్టుకొని *జుణిగి కొందరరుగుచు॥ ౧౩.
తెల్లవారగను కోమటియంగడి తెరచిచూడగా నటను।
తెల్లంబుగ వసనాభిసంచిని తెలియజూచె నయ్యెడను॥ ౧౪.
అనర్థమయ్యెను యేమిచేసెదను యఖిలజనుల చంపుటకు।
చనువుదప్పినే వసనాభిచ్చితి సరిగ సొంటి యడుగుటకు॥ ౧౫.
నగరములోని వర్తమానమును నయముగ తెలిసినవెనక।
వెగటుగ నాకును చావుసిద్ధమగు వేగమె నరకముపోగ॥ ౧౬.
గాడిదెకన్నను హీనుడనే నిటు ఘనపాప మొనర్చితిని।
నేడిటు నదిలో బడిచచ్చుటయే నెఱియ బాగుయనియుగని॥ ౧౭.
ఇటులందానటు యోచించియుమరి యెలమివచ్చె బైటికిని।
చటులత నచ్చట విచారించెదా జనులను మెల్లగ గుఱిని॥ ౧౮.
చావుసంగతియు నగరములోపల సారెకువిన బడకుండన్।
భావంతముతో కీర్తనన జరిగిన తత్ప్రదేశమును జూడన్॥ ౧౯.
ప్రజలను కొందర నటు దా గాంచుచు ప్రసాద మిమ్మనగాను।
భజనను బంచిన హరిప్రసాదమును భవ్యంబుగ తింటిమను॥ ౨౦.
నిరాహారులై యుండుట చేతను నెఱి నితరులు గూడిరటు।
పరాకు సేయక భక్షింపుండని పరగ జెప్ప తింటిమటు॥ ౨౧.
నీవలె మేమును నన్నార్థులమై నిలవలేదు యిచటనియు।
భావశుద్ధితో మరియొక దిన ముపవాసముండెద మనియు॥ ౨౨.
ఇటులం జెప్పగ శ్మశాన భూమికి నేగియు వణిజుడు జూడన్।
పటుతరముగ నొక ప్రేతంబైనను బడకుండెను తనజూడన్॥ ౨౩.
ఇదిగని వింతను హరిని గూర్చియనె యీశ దయాళో విఠల।
సదయుడ వగుచు ననేకుల ఘాతల చక్కబెటితి వియ్యెడల॥ ౨౪.
కేశవ దాసుడు స్నానము జేసియు కేశవ మూర్తిని గనును॥
వేసరిల్లకను వర్ణ భేదమై వెలసెను మూర్తియు నటను॥ ౨౫.

---

*జుణుగు - వెనకదీయు.

చూచుటకొఱకై వచ్చువారితో సూటినరిగా వణిజుండు।
ప్రాచుర్యంబుగ కేశవునింగని బలికెను వణిజుండపుడు॥ ౨౬.
ఒకటియందును సొంటియగునుయని సేరిచ్చితి వసనాభ।
ప్రాకటముగ నను యరిష్టంబుచే పండరిపతి యిటుబాపె॥ ౨౭.
అపరాధంబును నేనుజేసితిని యరసి ప్రాయశ్చిత్తంబు।
కృపతో జెప్పుండనెను వణిజుడును క్రియభక్తుని చిత్తంబు॥ ౨౮.
కరగిన దగుచును ప్రేమ లహరిచే కన్నీరొలుకుచు హరికూర్చి।
బిరుదును నీయది సత్యమయ్యె నిటు ప్రియదాసుల నోరార్చి॥ ౨౯.
గొప్పయరిష్టము దూరపరచితివి గురుతుగ శ్రీహరికేశవ।
ఒప్పుగనీవా విషము భుజించియు యొల్లను నలుపయ్యెనిల॥ ౩౦.
నీదునామమును ప్రహ్లాదుండును నిజముగ తా జెప్పగను।
పాదుగవిషమే యమృతంబయ్యెను బాధించును యెటునిన్ను॥ ౩౧.
అజుడవ్యయుడవు హరి నీ గుణముల నలవియె జెప్పనునాకు।
సుజనమనోహర యేవిషబాధయు చొరకుండంగను మెలగు॥ ౩౨.
దాసుల మహిమల ప్రకటన చేయను ధరజూపెదు లీలలను।
వాసిగ మునుపటి రూపుడవగుచును వలయుకరుణ జూపుమను॥
ఇటులం జెప్పగ కళంకమప్పుడు నెటుగానకనే బోయెన్।
చటులతరంబుగ హరిగుణకీర్తన సౌఖ్యమగును కలినేయెన్॥ ౩౪.
ఆత్మజ్ఞానము కలిగియుండియు నమితప్రేమ సగుణమున।
స్వాత్మభావన సద్గురుపూజయు సర్వద హరినామమున॥ ౩౫.
ప్రీతిని గలిగియు కవిత్వరచనను పెంపుగదా జేయుచును।
మాధుర్యంబుగ హరికథవేళలో మనుజులకు వినుపించుచును॥ ౩౬.
ప్రతిష్ఠ బహుగా వర్ధిల్లగనటు భక్తునకది సరిపడకన్।
విదితపరచకను రాత్రికాలమున వెళ్లెతాను యొంటరిగాన్॥ ౩౭.
మనసున దలచెను కృష్ణవేణిలో మానుగ నీరాడుటకు।
వనజాక్షుండగు శ్రీహరినామము వర్ణింపుచు నిడు నడుగు॥ ౩౮.

హరికథా మృతమత్యాదరమున నాతడుద్రాగుచు నుడువన్।
గురుతుగ శ్రీహరి భుజముననుండుచు కోరివినుచుదా బోవన్॥ ౩౯
దారినడవ పంటకావలి వాడు తాగనెనొక బాలకుని।
మీరిన సొగసును సౌకుమార్యముతో మెడనుండగ నచటగని॥ ౪౦.
మాటల నాడుదమనుచు దలంచుచు మంచెనుండి క్రిందదిగన్।
నీటుగ కేశవు బహుదూరంబును నెఱిచనె నటు చూడంగన్॥ ౪౧.
వల్లగాకయా కావలివెళ్లెను వాసస్థానంబునకు।
వెళ్లెను కేశవు కృష్ణానదికిని విధిని స్నానమొనర్చుటకు॥ ౪౨.
మూడుదినంబులు నచ్చటనుండుచు మురిపెముతో మళ్ళుచును।
వేడుకతోడను కృష్ణుని బాడుచు వెళ్ళెను నామార్గమును॥ ౪౩.
కావలివాడటు జూచిదండమిడి కరముల దామకుళించి।
పోవు సమయమున బాలకునొక్కని పొందుగ నీ మెడగాంచి॥౪౪.
అతిలావణ్యము నేజూచుచుమరి యమితమోహ ముంచితనన్।
ఇదివిని కేశవు బాలునెపుడు నే నెత్తలేదు సత్యమనన్॥ ౪౫.
జూచితి సత్యము యెటువిడిచితివని సూటిగకావలి యడుగన్।
ప్రాచుర్యంబుగ కేశవస్వామియు బహుచింతను గనివేగన్॥ ౪౬.
అడవికి నేగియుహరిని దలంచుచు యార్త చిత్తుడై తాను।
పుడమిని నే నీ నామము జెప్పుచు పొందు భార ముంచగను॥ ౪౭.
నాదు భుజముపై నీ వుండియుమరి నాకు దర్శన మియ్యకను।
పాదుగ దారిని కావలి వానికి పరగ దర్శన మిచ్చుచును॥ ౪౮.
ఇటులం జేయుట యేమి న్యాయమో యీశద యాళో యనుచు
పటుతరముగ నిట నీ పురాని యెడ ప్రాణము విడిచెద ననుచు॥ ౪౯.
ఏకీభావము చేకొన హరియును యెలమిని వచ్చెను యటను
జోకను జెప్పెను నీదు భుజముపై సొంపుగ గూర్చుండగను॥ ౫౦.
దేహము విస్మృతి యగుటచె నీకును దెలియక యుండెనుయనుచు।
మోహము వదలియు బీజాపురమున ముదముననుందువు యనుచు॥

శ్రీహరి జెప్పియు వెళ్ళగ నాతడు చేరె తిరిగి నగరమును।
బాహుళ్యంబగు ప్రీతిని జేసిరి భక్తులు కొనియాడగను॥ ౧౨.
వణిజుం డొక్కడు యానగరంబున వాంఛను గట్టెనుయిల్లు।
ధనికుడై యేబదివేల ద్రవ్యమున దాని గట్టె విలసిల్లు॥ ౧౩.
అన్నశాంతియును విపుల దానముల నాతడు జేసిన వెనకన్।
పన్నుగ నందున ప్రవేశించగను బ్రహ్మరక్షసుచె నులుకన్॥ ౧౪.
వణిజుడు నిద్రను నుండగ రాక్షసు వానిని వెలివేయగను।
అనువుగ తనకును సరిపడ దనుచును నపుడె విడిచె గృహమును॥
మంత్ర జపములను చేసినప్పటికి మహా భయము కలిగించన్।
తంత్రముతో కేశవు నాగృహమున తలపడి వేంచేపెంచన్॥
హరి నారాయణ యచ్యుత కృష్ణా యని కేశవు డరుగగను।
సరగున రక్షసు పుణ్యునైతినని చనెను దండంబిడుచును॥ ౧౫.
బాజి పరాను డొక్కడు యచ్చట బహు ధనవంతుం డుండెన్।
తేజరిల్లు నటు మరణ సంగతియు దెలియక సుఖియై యుండెన్॥
ఒకయెడ గ్రామము బోవునప్పు డొకబంటె, మోత మోయుచును।
ప్రకటంబుగ నటు బరువు నధికమై బడెను క్రింద జచ్చుచును॥౧౬.
ఇదిగని బాజీ నడవదెందుకన యెలమి నుసురు పోయెనన।
పదపడి బాజియు యటులనె తనకును ప్రాణము బోవునుగాన॥
పరమార్థంబును బొందవలయునని బట్టెను కేశవు పదము।
హరికృప చేతను నఖండ జ్ఞానము నతని కబ్బ చేసెనుము॥ ౨౧.
అనఘుడు కేశవు శ్రీహరి భక్తిచే నవని బవిత్రత చేసెన్।
బెనగొని భృత్యుడు బాలకృష్ణుడును ప్రీతిని దాసుగ నిలిచెన్॥

---

గోమాయీ చరిత్రము.

గోమాయీ యను బ్రాహ్మణ స్త్రీయటు కోరిచనుచు పండరికి।
కోమలి వైధవ్యముచే భిక్షను గొంచుచు నదికడ కరిగి॥ ౧.

గట్టుదాటునటు యెవరు జేతురని ఘనచింతన జేయుచును।
దట్టముగా నటు నావికులంగని దయను గట్టు చేర్చుమను॥ ౨.
అనేకుల్ యాత్రకు రాగను నావికు లామెను లక్షింపకను।
ధనికుల మాత్రము నావ నుంచుకొని తర్లగ నా గట్టుకును॥ 3.
వారలతోడను గోమాయీ యటు వరుసతోడ నెక్కఁగొనెన్।
దూఱుచు నావికుల్ పడవు నుండియటు ద్రొబ్బిరామె నుదకమునన్॥
గట్టుకు తిరిగియు వచ్చియు గోమాయ్ ఘనముగ తా నేడ్చుచును।
దిట్టముగా నను పైలతీరమున తెరఁగు జేర్చె రెవరయ్యను॥ ౫.
పడవువారలును నామెను గాంచుచు పైసయిచ్చి వెళ్లుమనన్।
తడవులేక ముష్టెడు పిండిచ్చెద దయ గనుమని వేడుకొనన్॥ ౬.
వారికి కరుణయు బుట్టకయుండెను వాసిగ నట నొంటరగాన్।
నీరజనాభా పాండురంగ హరి నీదయ నాపై లేకన్॥ ౭.
అనాథనైతిని శరీరముచు నే యర్పించెద నీకిటను।
వినీతుడవు హరి దయజూడుము నను విఠలరంగ వరదయను॥ ౮.
కఠినచిత్తులగు నావికులకునటు కరుణగలుగ దియ్యెడను।
శత్రులైయుందురు నీదు సహాయము సరగ వేడెదనగాను॥ ౯.
పండరీశుడును నావికుడగుచును బరతెంచెను యటుగాను।
మెండుగ సొరకాయ్ బుఱ్ఱల కొన్నిటి మీదిగట్టు నుంచుచును॥ ౧౦.
గోమాయిని గని నది దాటను నీ కోర్కెదీర్తున నగాను।
ఆమెయనెను నావద్దను ద్రవ్యము ననువుగ లేదియ్యెడను॥ ౧౧.
పిడికెడు పిండియె యున్నది చేతిలో బెట్టెదనీ కదియనగన్।
అడుగిడి యటుయిటు దిరుగువారలను నలగట్టు చేర్చునటుగాన్॥
పండరియందును వసింతుననుచును పాండురంగ డనగాను।
ఖండితముగనిటు మరియొక వస్త్రము గట్టుటకు లేదుయను॥ ౧౩.
జాముగాత్రియు నిప్పుడయ్యెగ సరి గనుమనియామె యనన్।
వేగము హరియునె నీరుయుంటకను కాచిచెద పైగట్టునన్॥ ౧౪.

ఆమోదింపగ నామెను నిడికొని యటుగట్టున తాజేర్చెన్।
దామోదరుతో యామెయు బల్కెను తడుపక దెచితివి మెచ్చన్॥
వింతయగును యని బలుకగ హరియును విన్నపించెదా నపుడు।
సంతతమును నే నితర నావికుల సామ్యత నుండనుచూడు॥ ౧౬.
దాసజనుల యీ భవసముద్రమును తరింపించెద నగాను।
వాసిగనామెయు పిండిమూటనటు వడిచేకొను మనగాను॥ ౧౭.
ఎవరివద్ద నే నేమియు తీయను యీపిండి నీవుంచుచును।
సవినయముగ నా ద్వాదశి దినమున చక్కనిమ్ము ద్విజులకును॥ ౧౮.
అనుచు జెప్పుచును శ్రీహరియప్పుడు నంతర్ధా నుండయ్యెన్।
తనివిని నామెయు నేకాదశిలో దామోదరునటు గనియెన్॥ ౧౯.
రేయిని శ్రీహరి కథలను వినుచును రీతిగ ద్వాదశియందు।
బాయక నదిలో స్నానముజేయుచు బ్రాహ్మణులకిరవొందు॥ ౨౦.
పారణకొఱకై పిండితీసికొని భవ్యదయను జూపుడను।
వారలుజూచుచు వట్టిపిండియని వలదువలదని జెప్పుచును॥ ౨౧.
బోడబాపనిది యపశకునంబని పొసగద్విజులు తిట్టగను।
వేడుచు నామెయు పాండురంగని విహితంబుగ దలచుచును॥ ౨౨.
ద్వాదశి దినమున ద్విజులు దొరకనెడ తాభుజింప నని జెప్పన్।
పాదుగదీనిం భగవంతుడుగని బ్రాహ్మణ రూపము నొప్పన్॥ ౨౩.
యాచకుడగుచును నేతెంచెను యట నాగోమాయీ కడకు।
సూచనజేసెను పిండినియ్యమని సుఖభక్షణ చేయుటకు॥ ౨౪.
ఉనికిలేక నే దేవాలయమున యుంటినిపుడు నాకలిచే।
పనిబడి వచ్చితి రొట్టెల జేసియు పరగనిడిన భక్షణచే॥ ౨౫.
తనివిదీరునని చెప్పగ నామెయు ధన్యతనొందితి ననియు।
అనువుగ కట్టెల పోగుజేసికొని యచటనె స్నానముజేయు॥ ౨౬.
పిండిని పిసికియు రొట్టెలజేయుచు ప్రియవిస్తర వడ్డించన్।
నిండు ముసలి వలె రుక్మిణిదేవియు నెనరున నటకే తెంచన్॥ ౨౭.

భగవంతుని గని రుక్మిణి బలికెను బరతెంచితివి ననువిడిచి।
పొగసైయున్నది నాకు నన్నమును సొంపుగబెట్టుము వలసి॥ ౨౮.
భగవంతుండును గోమాయినిగని బలికెనవ్వి యా దినము।
అగణితపుణ్యము నీకునునబ్బెను నలసువాసినిం గనుము॥ ౨౯.
ఇదిగని గోమాయ్ మూడు విస్తరల నేర్పడ వడ్డించగను।
సదయులైముగ్గురు భక్షణనచ్చట సరగజేయు చుండగను॥ ౩౦.
హరికృపచేతను నన్నము పెరిగెను నందరు తృప్తిగ తినగఁ।
దురుసుగశ్రీహరి ముఖశుద్ధికినై తులసీ పత్రము గొనగఁ॥ ౩౧.
హరియును రుక్మిణి యదృశ్యులయ్యిరి గుజినాసమయము నందె।
పరమభక్తులకు దాస దాసుడగు బాలకృష్ణుడిం బొందె॥ ౩౨.

---

## లతీబుషా చరిత్రము.

అవింధ్యజాతిని లతీబుషాయను హరిభక్తుం డొకడుండెఁ।
ప్రవిమలమగు శ్రీభగవద్గీతయు భాగవతము గనుచుండెఁ॥ ౧.
రామభజనలో నతితత్పరుడై రంజిల్లుచు నుండగను।
ధీమసమున నటుతురకలు కొందరు తెంపునరిగి నృపుకడను॥ ౨.
హిందు మతంబును లతీబుషా యిటు హేపున యవలంబించెఁ।
నందియమొందక శిక్షార్హుండన సార్వభౌముడు గునిచెఁ॥ ౩.
అవివేకుండై యవింధ్యరాజుం డపుడె బంపె దూతలను।
నవిరళముగ వానిల్లుకొల్లగొని సర్వనాశ్య చేయుమను॥ ౪.
ఉత్తరవిచ్చిన రీతినివారలు నొప్పుగనటు వెళ్ళగను।
పద్దుగ భక్తుని వీక్షణముననె పరితాపము నొందుచును॥ ౫.
శాంతయుక్తులై భగవద్గీతల శ్రవణముచే యుదమనుచు।
దాంతినినృపవరు కొలువు మానుకొని దామోదరు భజియించు॥
భటులు తిరిగి రాకుండగ నచ్చట ప్రభువు మరియు కొందరిని।
చటులతరంబుగ బంపగ వారలు చక్కనటనె యుండగని॥ ౭

అవనీపతియును కోపముతోడను నటుతానే రాగాను।
వివరింపుచు శ్రీభాగవతార్థము వెలసె లతీబ్షా యటను॥ ౮.
ప్రజలువినంగను తులసీవనమున బాగుగజెప్పుచు నుండఁ।
సుజన మనోహర పుష్పలతలచె సొంపెక్కుచు నటనుండఁ॥ ౯.
ప్రాకారపు గోడయందు లిఖితపు పద్మనాభు చిత్రముల।
సాకారంబుగ వ్రాయింపంబడె సకల నరులు యుల్లసిల॥ ౧౦.
దశయవతార తీర్థక్షేత్రములు ధరరాముని చరితలును।
విశదంబుగ నటురాధాకృష్ణుని విపులలీల చిత్రమును॥ ౧౧.
లిఖితమై యుండగ నవనీ నాథుడు లెక్కించుచు నటుతాను।
సుఖదంబగు యా రాధాకృష్ణుల సుభగలీల జూచుచును॥ ౧౨.
అవనీపతి యటనడిగె లతీబును నంగన చిత్రముచేతఁ।
వివరంబగు నట్లున్నదేమనియు విశదపరచు మనె వింతఁ॥ ౧౩.
ప్రత్యుత్తరముగ నాతడుజెప్పెను భామయు తాంబూలమును।
విధ్యుక్తంబుగ నిచ్చుచున్నదని విహితంబుగ జెప్పగను॥ ౧౪.
రాజడిగెను నాయాకు మడుపులను రాధయియ్య కృష్ణుండు।
తోజిగ చేకొనడెందుకు సుఖమున దేవుం డెట్లగు నతడు॥ ౧౫.
భక్తుడువినుకొని యంజలిహస్తుడై భగవంతుని దాదలచి।
సక్తిగజెప్పెను శ్రీశదయోళ్లో సర్వేశ్వరుపై వెలసి॥ ౧౬.
హరిశ్రీకృష్ణా యచ్యుత విరల యఖిల భక్తకై వారా।
గురితో రాధా విడెము నందుకొని కుదురుగ నున్నదిమోర॥ ౧౭.
కరుణనునిప్పుడు నోరుతెరచి యిటు గైకొను మని జెప్పగను।
నిరవధికంబగు ప్రీతినిగాంచుచు నేర్పుజూపె హరియటను॥ ౧౮.
నోరుతెరచె నాకృష్ణ చిత్రమటు నోటనురాధా చిత్రంబు।
వారకవేసెను యాకుల మడుపును వసుధాపతి గనసొంపు॥ ౧౯.
పిమ్మటరాధా చేతినినుండిన పీతరేఖ లేదయ్యె।
సొమ్మసిల్లగను రాజుదండమిడి సుఖిగనేగె దానయ్యె॥ ౨౦.

భర్తలకొఱకై యాకారంబుల భవ్యముగ ధరించెను హరియు।
సక్తితో బాలకృష్ణుడు నిలలో సాధుపూజలను వెలయు॥ ౨౧.

---

## సంతోబాపావరుని చరిత్రము.

సంతోబాపు శివాజిపద్దను సరదారుండై యుండు।
పంతముతో నిరు నూరుగుఱ్ఱముల ప్రభు రాంజణగాముండు॥ ౧.
జాగిరూరులు చక్కటిమాన్యత సంపత్తియు గలిగుండు।
త్యాగశీలుడై యేసుబాయి యను తరుణిసుశీలయు నుండు॥ ౨.
సంతానంబును లేకయుండగని సతియుజెప్పె పతికడను।
పంతముతోనిటు వేరొకభార్యను వదపడిజేసిన యెడను॥ ౩.
వంశవృద్ధియు నగుననిబల్కగ వలదనుచును పెనిమిటియు।
సంశయమొందక తమ్ముని కొడుకుల చనువుగ పెంచుద మనియు॥
ఇద్దరుకొడుకు లయిదేడేండ్లను నేర్పడగను తమ్మునకు।
పద్దుగ వారల పంతులువద్దిర పరగవిడిచె చదువుటకు॥ ౫.
చనువుజేయుచును పెంచుచు నుండగ సంతోబాపు డొకనాడు।
పనిబడివచ్చెను పుత్రుల జూడను పంతులు యుండెటి చోటు॥ ౬.
ఆసమయంబున స్నానము చేసియు యాతడు జపమున మెలగు।
వాసిగ సంతోబ, గుణగుణయనుచును వదరుటేమియని యడుగు॥
పంతులుజెప్పెను సద్గురునేర్పిన పరమమంత్రమది యనగన్।
సందియ మొందక తనకది జెపమని సంతోబయాతని యడుగన్॥
అందుకు పంతులు సద్గురునింగని యబ్బుకొనుము మంత్రమును।
కొందలించు సేవకు సేనగుదు ను కూటికొఱకై యుంటినను॥ ౯.
సరదారుండనె చిత్తము చపలమౌ సమయ మిదియు జెప్పుమనె।
గురుపూజకునై సామగ్ర్యంతయు గొబ్బున దెచ్చ్యించగనె॥ ౧౦.
పంతులు యటులనె గురుమంత్రంబును బాగుగ జెప్పగ నపుడు।
వింత మునగునటు వేరొక పంతుల విధితో జేసెను నతడు॥ ౧౧.

అపరిమితంబుగ ద్రవ్య భూషణము లర్పించెను గురువునకు।
చపలతలేకను గృహమునొక్కటిని చక్కనిచ్చె నుండుటకు॥ ౧౨.
పాకముచేయుట కొఱకై ద్విజులను పరగనుంచె తానటను।
జోకను దాసీదాస జనంబుల నూటిగ నిడె సేవకును॥ ౧౩.
నరదారుండును నరపతి యాజ్ఞను సంగరమును బోవలసె౯।
గురువుని నుద్దిని కనుగొనుమని తన కోమలికిని యనివెలసె౯॥ ౧౪.
దూరదేశమును సంతోబ పోవగ దుర్మదుడగుచును గురుడు।
కోరి వరించుచు దాసీకాంతను కూడియుండి తానెగడు॥ ౧౫.
కొందరు యిదిగని యేసుబాయికడ గురుని నడత జెప్పగను।
పంతముతోడను సతియు బల్కెనటు పతియాజ్ఞను బట్టెదను॥ ౧౬.
అనుచును జెప్పుచు గురుని నరచుకొను నపుడప్పుడా సతియు।
వినమితయగుచును గురుసేవనుదా విహితయగుచు నుండుటయు॥
ఒక వత్సరమటనుండి సంతోబా యొనరవచ్చె తన గృహము।
సకలజనులు గని మోదమొందగను సద్గురుకడ కేగెనుము॥ ౧౭.
మరుదినమున గురుపూజ విభవముల మహాత్తరము సలుపగను।
గురుడును దాసిని కూడియుండునని కుజనులునటు జెప్పగను॥ ౧౮.
మాతృసేవయును నాకు లభించెను మహానంద మయ్యెనని।
నేత్రోత్సవముగ దంపతు లిరువుర నిండుగ పూజించెగని॥ ౨౦.
భార్యకు జేసిన రీతీ భూషముల పరగజేసి నామెకును।
కార్యకరంబుగ నూతన వస్త్రముల్ ఘనముగ గొనియిచ్చెమును॥
భోజన మిడియెను బ్రాహ్మణ జనులకు పుష్కలమగు దక్షిణలు౯।
ఓజను తానటు నిచ్చుచు గురువును నొగిజేసెను మన్ననలు౯॥ ౨౨.
సంతోబాపుని గురుభక్తిని గని సంతోషించెను హరియు।
వింతయైన నిస్సీమా భక్తియు విరాగమును కృపజేయు॥ ౨౩.
హరికీర్తనలో తుకజేసినకవి యభంగువిని సంతోబ।
సరుచిరమగునటు సుగుణంబులదా సొగసునొందె మగినొప్ప॥

నరదేహంబిది నాశవంతమగు నారాయణు గొలుచుటయె।
గురుతర సుఖమని విడిచెను నృపవరు కొలువును సంపతినయ్యె॥
పేదజనులకును ద్రవ్యమునిచ్చుచు ప్రియముహరిపై నుంచుచును।
సాదువేషమును తానుధరించుచు చనెను గృహము వీడుచుచును॥
విఠ్ఠలవిఠ్ఠల యనుచు జెప్పుచును విడిచి యుపాధుల నన్ని।
బైఠ్ఠావరమను నొక శివస్థలమును ప్రేమ లహరి జేరెగని॥ ౨౮.
భీమా కమటా నదుల సంగమను పెనగు నడవిద్రాయై యుండె౯।
వేమారక నటబసగొని శ్రీహరి విమలభజన యందుండె౯॥ ౨౯.
సంతొబ తల్లియు దీనివినుంగొని *సడివ్యసనము పొందుచును।
తొందరతోడను నాతనిభార్యను తోలెసొమ్ము లిడియుమును॥
తారుణ్యంబగు స్త్రీనిగాంచుచును తల్లిదలచె తిరుగునని।
వారకభార్యను నాతడుగని యనె వచ్చితివిట కేలయని॥ ౩౦.
పతివ్రత స్త్రీకిని భర్తను విడిచితే పరగతియెట్లనె సతియు।
హితుడై పతియనె విరాగినై నే యీవేషము నుండుటయు॥ ౩౧.
నాతో చేరిక నీకుసరిపడదు నానావస్త్ర భూషణముల్।
పాదుగ నితరుల కిచ్చివేయుమను బట్టినవచ్చును యిడుముల్॥ ౩౨.
పతివ్రత వినుచును పారవేసెనటు బహుళంబగు సొమ్ములను।
అతడు యిచ్చె తనయంగవస్త్రమున నర్థచించి యయ్యెడను॥ ౩౩.
ఇరువురు నచ్చట హరిని భజింపుచు నింపొందుచు నుండగను।
గరిమెను క్షుద్బాధయును వారికిని కలిగెను నయ్యెడగాను॥ ౩౪.
సతిని గాంచుచును పతియును బలికెను సమీపమగు గ్రామమున।
పదిలెము తోడను వెళ్లియు భిక్షను బట్టిరమ్ము యిట పైన॥ ౩౫.
దివ్యాన్నంబుల బంధువులిచ్చిన తే బోకుము యిటుగాను।
భవ్యంబుగ శ్రీభగవన్నామము బలుకుచునటు వెళ్ళుమను॥ ౩౬.
ఆతనియాజ్ఞను శిరమువహించియు నటులవెళ్ళె గ్రామమును।
ప్రీతిని శ్రీహరి విఠ్ఠలయనుచును భిక్షమడిగె నయ్యెడను॥

---

*సడి - ప్రసిద్ధి.

అకస్మాత్తుగను మరదలింటికిని యామె వచ్చె భిక్షుకును।
సకలురు చూడగ కౌగలించుకొని సరగనేడ్చె మరదలును॥ ౩౮.
అతి సుకుమారివి యఖిలసంపదల నరసి విడిచి నీవిటుల।
ఉదరపోషణమున కీవిధమున నొగి భిక్షమెత్తె దేటుల॥ ౩౯.
చప్పని రొట్టెల నడిగి తినుట యిటు సౌఖ్యమె నీకని యనియు।
ఒప్పుగ పూరీ శర్కరనెయ్యితో నుచితంబుగ నిచ్చుటయు॥ ౪౦.
ఏసుబాయి యనె నాయజమానున కిష్టముగాదిది యనియు॥
వేసటల్లకను వలదువలదనియు వెలదియు జెప్పంగనియు॥ ౪౧.
మరదలు బలికెను మమతనుంచి నే మంచియన్నము నిడితిని।
అరమరసేయక కొనబోకుండిన యానయున్న దనగవిని॥ ౪౨.
ఏసుబాయి యట నేమియుజెప్పక నేగెను తనపతి కడకు।
వాసిగ జోలెను ముందుగ నుంచెను పరుసను భక్షింపుటకు॥ ౪౩.
ఆత్తం డందున నెయ్యి శర్కరయు యప్పములుండం గనగన్।
పొద్దుగనప్పుడె జరిగిన సంగతి భార్యయు జెప్పెనువినగన్॥ ౪౪.
అనుతపింపుచును పతియు గ్రామమును నతిత్వర బొమ్మనె సతిని।
తన్నివని నిచ్చిన వారల కియ్యుము తప్పక పూరీలన్నిటిని॥ ౪౫.
తిరిగియు నీవిటు వచ్చినవెనకనె గరిమెను భక్షించెదను।
పరుసను నామెయు మరదలింటికిని వచ్చి యిచ్చి పూరిలను॥ ౪౬.
తిరిగియు నామెయు పతికడరాగను దిశలుకమ్మె మేఘముచె।
గురుతుగ సూర్యుం డస్తమానమై కుంతిత రాత్రియువచ్చె॥ ౪౭.
అమితవర్ష మటు గురిసి భీమనగి యతిప్రవాహమై యుండన్।
సమాళించుచును దాటలేకదా సద్గురువగు పతియందన్॥ ౪౮.
ఎట్టులజేరుదు యేమిజేసెదను యీశదయాళో యనియు।
విఠలరంగా వెంకటనాయక విశ్వోద్ధారా యనియు॥ ౪౯.
ఈసమయంబున నను రక్షింపుము యెవరును లేరిటు దిక్కు।
వాసిగ యిట్టుల బ్రార్థింపంగను వచ్చెనట నొకనావికు॥ ౫౦.

అతం డామేను జూచియు బల్కెను నటుగట్టును దాటింతు।
పతియగు సంతోబాపవరుండును పైలతీర మునందు॥ ౫౧.
ఆమెయు బల్కెను ధర్మ భగినిగా నరసి చూడుమిటు నన్ను।
ప్రేమతోడ నది దాట జేయతగు ప్రియుడగు పెనిమిటి కడను॥
అటులనె జేసెద ననుచును నామెను నతని భుజము నుంచుకొని।
పటుతరముగ నొకనిమిషము లోపల పైలతీరము జేర్చెగని॥
అదుగో నీ పతి యచట నుండునని యదృశ్యు డయ్యెను తాను।
విదితంబుగ సతి పతికడ కేగుచు విన్నపించె చరితమును॥ ౫౪.
పతియును వినుకొని పాండురంగడిటు ప్రసన్ను డయ్యెను నీకు।
గతిలేకను నే నాతని గానక కలతల నొందితి పెక్కు॥ ౫౫.
భక్షణ చేయను పండరి నాథుడు ప్రసన్నుండునగు వరకు।
అక్షయ మగునటు యతని యనుగ్రహ మాశను పొందే కొఱకు॥
కోమటి యొక్కడు చాపర గాములో గురుతర భక్తిని యుండెన్।
ప్రేమను నాతని కలలో వెళ్ళుచు పెంపుగ హరి చెపుచుండెన్॥
సంతో బాపుడిటు నది సంగంబున సన్నివాసుడై యుండు।
పంతము తోడను పక్వాన్నంబుల భక్తిని నతనకిబెట్టు॥ ౫౭.
ఇదిగని కోమట్కి యప్పుడె లేచుచు నెలమి వంట చేయుచును।
సదయుడై తెచ్చెను సంతో బాపునెడ సరస పదార్థముతోను॥
హరి యాజ్ఞను దా నానతిచ్చుచును నారగింపు మని వేడెన్।
గురితో శ్రీహరి తనకు జెప్పుమును కుడువ ననుచు దానుండెన్॥
సంతోబాపుని స్థిమితపు బుద్ధిని సర్వేశ్వరుడటు గనుచు।
అందముతో తన నిజరూపంబును నతనికి జూపెను మనుచు॥ ౬౧।
అనుగ్రహింపుచు హరి వెళ్ళంగను నటు వెనకను భక్షించెన్।
ఘన విరాగము శాంతియు భక్తియు గైకొనుచును దా వెలసెన్॥

---



శ్రీమతే రామానుజాయనమః.

భగవన్నిర్హేతుక కటాక్షముచే ప్రాప్యభూమినిపొందిన

భక్తశిరోమణుల చరితలనుదెలుపు

# భక్తమాల.

ఇది

మహారాష్ట్ర భాషయందు మహీపతిబావాయను

భక్తశ్రేష్ఠునివలన రచింపబడిన

భక్తవిజయము, సంతవిజయము, భక్తలీలామృతము, సంత

లీలామృతము గ్రంథములను క్రోడీకరించి,

వె. బాలకృష్ణమొదల్యారిచే

తెనుగున

తోహారా కవితలగా రచింపబడిన పదిసంచికలలో నిది

ఆరవ సంచిక.

చెన్నపురి, మవుంటురోడ్,

"కమర్షియల్ ముద్రాక్షరశాలయందు"

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

౧౯౦౦వ సంవత్సరం సెప్టంబరునెల.

శ్రీమద్విచిత్ర శతావధాని, విద్వన్మణి మహాభాగవత సలక్షణ
కృష్ణ యజుర్వేద ఘనపాఠి, హరిదాస బాళేగడ్డ కట్టె,
శ్రీమాన్ లక్ష్మణాచార్య కృత కృతిప్రశంస.

---

శ్లో॥ గ్రథితేయం బాలకృష్ణదాసేన లలితైః పదైః।
భక్తమాలా విష్ణుభక్త చిత్రచారిత్రబోధినీ। ౧॥
మహాకవి కృత గ్రంథప్రౌఢిమానం శ్రయత్యహో।
ఇతి శ్రీభగవద్గీతా లక్ష్మణార్యోఽనుమన్యతే॥ ౨॥

శ్రీరఘు రాముని విడిచి యితరులగు పిలు వేల్పుల పూజసుము
సారతరంబగు గురునాజ్ఞను నే సలుపుదు నెప్పుడు వినుము॥ ३౧.
ద్వాపరయుగమున కృష్ణుడు బుట్టియు తరుణుల పెక్కుర గూడె॥
ప్రాపుగ నాతని పరాక్రమంబును ప్రబలమె జెప్పుము యిపుడె॥
నేను భజించెడు రాముడు బుట్టెను నిగుడగ నినకులమునను।
దానమానముగ ప్రభువై రాజ్యము ధర పాలించెను తగను॥ ३३.
ఇదివిని రోయిదాస్ బలికెనప్పుడటు లినకుల రాముడు భువిని।
పదరి మృగముకై పరుగిడి సీతను వదలియు నేడ్చెను మదిని॥ ३४.
పలికె కబీరుడు కృష్ణుడు రోటను బట్టికట్టబడి యేడ్చెగా।
ఇలసుత భర్తరాలనుచు రాముడు కలతనొంది విలపించెగా॥ ३५.
రోయిదాసుడనె రాముడు ప్రభువై బాయక రంజిల్లినను
కాయక్లేశము నొంది సీతకై కపులగూడి తిరిగెమును॥ ३౬.
సౌలభ్యంబును చూప కృష్ణుడును సరగ చిక్కె తల్లికిని।
తాలిమితోడను పరమాత్ముండై తలపడియుండెను భువిని॥ ३౭.
గోవర్ధనమను కొండనెత్తి యటు గోవుల మనుజుల బ్రోచెగా।
పావను కబీర్ బలికె రాముడును పయోదధిని బంధించెగా॥ ३౮.
కోతులచే కొండల దెప్పించెను కులుకు కృష్ణు పనియేమి?
చాతుర్యంబుగ రామనామమున జనులు ముక్తులైరి సుమి॥ ३౯.
చెప్పదొడంగెను రోహిదాసుడును శ్రీరాముడు వనికేగగా
ఒప్పుగ రాముని నామము నెంచుచు నుసురువిడిచె పిత వేగగా॥
బలికె కబీరుడు కృష్ణునికొఱకై వసుదేవుడు దేవకియు।
సలలితముగ తాముండిరి చెఱలో సంకెళ్ళకు లోబడియు॥ ४౧.
జారచోరుడై చెలగుచునుండెను చక్కని కృష్ణుండిలను।
శ్రీరఘురాముడు సీతగూడుకొని స్థిరవ్రతుడై యుండెమును॥ ४౨.
ఈవచనంబుల కతడు బదులు వచియింపకున్న కబీరుడు।
సావధుడనయి నాతో వాదము సలుప నిలువు టేమనుడు॥ ४३.

ప్రాంతలోకపు హరి యాజ్ఞ చేసెనట నెలమి గణాధిపతికిని।
ప్రాంతంబున చని యుద్ధరి వాదము పొత్తుపరుపు మనగవిని॥ ౪౪.
ప్రకటుండగుచును గణపతి వచ్చియు భక్తులిరువుర గనుచును।
జగతి కృష్ణోపాసన దొడ్డదని సలుపుచునుండెద రిలను॥ ౪౫.
కబీరుడప్పుడు గణపతినింగని కల్లపలుకు వినననెను।
నివిషంబగునటు వేరుదేవతల నెఱి రొయిదాసు గొలిచెను॥ ౪౬.
పంచాయతనపు పూజను నీవిట పదపడి యుంటివి గనుకన్।
అంచితముగ నీవాతని పక్షమె యనుసరించితివని పలుకన్॥ ౪౭.
ఏకదంతుడపు డూరకయుండెను నెలమిని నిదిగని హరియు।
శోకనుబంపెను సూర్యునచ్చటికి సువాదమునకును మరియు॥ ౪౮.
ద్విజవేషంబును ధరించి వచ్చుచు దినకరు డిరువుర కడకు।
నిజముగ రొయ్‌దాస్ నిష్ఠ శ్లాఘ్యమన నిగుడి కబీరుడు బలుకు॥
నీవంశంబున నారఘునాథుడు నెనరున జనించియుండన్।
ధ్యానంతంబుగ వచ్చి కృష్ణునే తగ బొగడితివీటు జూడన్॥ ౫౦.
ఇదివిని సూర్యుం డూరకుండగా నీశుడు దేవిని బంపె।
ముదమున నామెయువచ్చి వాదమును మురిపెముతో వినియొప్పె॥
పరమదక్షుడు రోహిదాసగునని భవాని యటు జెప్పగను।
వెఱపక కబీరు వైష్ణవుడనునే విననని నీవచనమును॥ ౫౨.
శ్రీహరి యప్పుడు వాదనిరసనకు శివునింబొమ్మని జెప్పన్।
స్నేహభావమున వృషభారూఢుడు చేరియు శ్రీకరమొప్పన్॥ ౫౩.
గోకులమందున క్రీడలజేసిన గోవిందుడె గొప్పయనన్।
వ్యాకులుండగుచు నుత్తరవిచ్చెను వరకబీరుడటు గానన్॥ ౫౪.
దొడ్డవాడవై ధరణిని వెలసియు దురుసుగ రామునినీవు।
అడ్డములేకయ యహర్నిశంబును ననువు పేరు నుడివెదవు॥ ౫౫.
విషానలంబును మ్రింగుచు రాముని విమలపేరు దలచుటచే।
కషాయమొందక గ్రక్కున శీతలకాయంబగునటు మనిచె॥ ౫౬.

లంచముగైకొని లజ్జనొందక యలక్ష్యముపరచితి వతని।
అంచితముగనీ న్యాయము విననని యతడుజెప్పె వెళ్లుమని॥ ౫౭.
శంకరుండు ప్రతి జెప్పజాలకయు చనువున నూరకయుండఁగా।
పొంకంబగునటు శ్రీహరిభక్తిని *పురణించియు వారుండఁగ॥ ౫౮.
భక్తియు జ్ఞానము బ్రహ్మనిష్ఠయును పరిపూర్తిగా గనియుండి।
రక్తిగ నిరువు రుపాసన భేధము రంజిల్లంగనియుండి॥ ౫౯.
వాదము చేసిరి విష్ణుభక్తులై, వదలుచు మధ్యస్థులను।
సాదరముగనా శ్రీహరిజూచియు చనెదా రోయ్‌దాసెడను॥ ౬౦.
సంకును చక్రము శ్రీవత్సముతో చతుర్భుజంబులతోడఁగా।
పొంకముగా ఘన పీతాంబరమును పూర్ణకాంతితో గూడఁగా॥ ౬౧.
ప్రాభవరూపము ప్రకటించెను హరి ప్రణుతించిరి యిరువురును।
శోభన రాముడు కబీరు కనులకు నూటిగ గనుపింపగను॥ ౬౨.
సుందరరూపు కబీర్ గనుచుండగ నూటిగ కృష్ణుండయ్యెఁగా।
సందియముల హరి మాన్పి యిరువురకు చనువుతోడ నిట్లనియెఁగా॥
రాముడె కృష్ణుడు దీనికి మీరలు రచ్చలాడితిరిదివరకు।
ప్రేమభావమున సమము జూడుమని ప్రీతిబలుక వారలకు॥ ౬౪.
భక్తులిరువురును శ్రీనారాయణు పదములకును దండమిడఁగా।
సక్తచిత్తులై చూచుచుసుండగ చనె హరి వేల్పులతోడఁగా॥ ౬౫.
భక్తులిరువురును భగవద్దర్శన ప్రాప్తికి ముదమొందుచును।
సక్తిని రోయ్‌దాస్ కబిరుదాసునకు సాగిలబడి మ్రొక్కెమును॥
భోజనమొసగియు పూగీఫలమును పొందుగ నిచ్చియుబంపెఁగా।
తేజరిల్లగను భజనజేయుచును ధీరుడు బోవుచునొప్పెఁగా॥ ౬౭.
బోవుసమయమున బలికె కబీరుడు పూర్ణభక్తి విష్ణువును।
సావధానముగ దలచుచు నుండుము సలుపకితర పూజలను॥ ౬౮.
వేరుదేవతల విశ్వసించినను †వెత వ్యభిచారంబగును।
నారాయణ భక్తులకీనేమమె నాటవలెను మనసునను॥ ౬౯.

---

*పురణించి = తిరస్కరించి.    †వెత = వ్యధ.

ఈవచనంబుల నామోదించియు నింపుగ రోయిదాసపుడు।
భావశుద్ధితో భగవద్భజనను పాడుగ జేయుచునుండు॥ ౨౦.
చర్మకారుడై భువిలో నీతడు జన్మించిన దేటికన।
నిర్మల§వర్ణియై తొలిజన్మంబున నెగడె విప్రకులమున॥ ౨౧.
యతివరుడగునా రామానందుని యాశ్రయించి తానుండె।
హితుడై యతియ పాత్రాన్నంబును నెలమి గురునకిడుచుండె॥
పవిత్రాన్నమని రామానందుడు పరగ దాని గ్రహించును।
వివరంబగునటు లొకదినమందును వెళ్ళె వర్ణి భిక్షకును॥ ౨౩.
అతివర్షంబును దారిని గురియగ నటనొక కోమటియింటనె।
వెతతో నిలబడె నాతండచ్చట వెడలిపోవ గాకుంటనె॥ ౨౪.
కనుగొని కోమటి వలయు బియ్యమును గైకొమ్మని దానిచ్చె।
వినతిగ గైకొనివచ్చి వంటకము వేగమొనర్చియు నుంచె॥ ౨౫.
ఆచార్యునకును వడ్డింపంగను హరికర్పించెను గురుడు।
*శౌచముగాదని వదలెనన్నమును సరగున శ్రీహరియపుడు॥ ౨౬.
దోసపన్నమని దలచుచు శిష్యుని దూరి, దెచ్చినవిధమును।
వాసిగ నప్పుడు విశదపరపుమన, వణిజుడిచ్చె బియ్యమును॥ ౨౭.
అటులన శిష్యుడు, గురుడనె కార్యము నటుగ దెలుపకుండుటను।
పటుతరముగ నీ పృథివినిబుట్టుము పంచమవర్ణంబునను॥ ౨౮.
పాదములనుబడి బ్రహ్మచారియును ప్రార్థించెను గురువరుని।
ఆదరంబుతో బల్కెను క్రమ్మర హరిభక్తుడ వగుదువని॥ ౨౯.
కొంతకాలమిటు జరుగగ శిష్యుడు కుందెను చలిజ్వరమునను।
వంతముతోడను పడకను శిష్యుడు బాధల బహుపొందగను॥ ౩౦.
జ్వరబాధనుతా జెందకముందుగ సరి చెప్పులజోడులను।
ఇరవుగ దెచ్చియు నుంచెను చూరున నితనికంటి కెదురుగను॥ ౩౧.
దానింజూచుచు గురు ధ్యానముచె తనువును విడిచెను నతడు।
మానుగ జాతి విహీనుండగుటను మహిబుట్టియు తానుండు॥ ౩౨.

§వర్ణి - బ్రహ్మచారి. *శౌచము = ఆచారము.

భగవద్భక్తిని పొందియు మహిలో భాగవతుల సేవించు।
విగతకల్మషముచే ఖ్యాతుండై వెలయ నొక్కదినమనుచు॥ ౮౩
గంగాయాత్రకు కొందరుబోవుచు గనిరటు రోయిదాసుని।
పొంగుగ నాతడు జేసెను వారికి పూజల బహుగా గుతిని॥ ౮౪.
ఉదయకాలమున వారలు బోవగ నొప్పగ రోయ్‌దాసుడును।
పదపడి డబ్బును నొక్కటి దెచ్చియు భాగీరథికొసగుమను॥ ౮౫.
అర్పణజేసియు నామె ప్రసాదము నరమరవిడి తెమ్మనగ।
దర్పములేకను వారు మంచిదని దారినడచుచును మెలగ॥ ౮౬.
వారణాశికిని వెళ్లుచు గంగను వారలెల్ల మునుగుచును।
భూరి గంగలో రొయ్‌దాస్ కానుక పొందుగాను వేయగను॥ ౮౭.
ఉదకమునందును నుద్భవమయ్యెను నూర్జితముగ ధ్వనియు।
సదమలమగు నీస్వర్ణకంకణము సరగ నతనికిమ్మనియు॥ ౮౮.
కంకణమొక్కటి యుండగ వారలు కనిదెచ్చిరి భక్తునకు।
పొంకముగా నీభావశుద్ధికిని పుణ్యగంగయిడు నీకు॥ ౮౯.
పైసాగైకొని ప్రసాదమిచ్చెను బహు పుణ్యాత్ముడవనుచు।
వాసిగజెప్పుచు వెళ్ళిరి వారలు వాసస్థానము గనుచు॥ ౯౦.
రొయిదాసుండా రత్నకంకణము రుచితోడను గైకొనియు।
నయముగ నింటను నుంచియుండగను నవ్యకాంతి గాంచుటయు॥
ఈవిధంబుగా నుండ సాదులును నింటికరిగి రొకనాడు।
నాపుడు వారలకన్న మిడుటకును నాధారములేకపుడు॥ ౯౨.
కంకణమునుదా గైకొనివెళ్ళెను కంసాలుని గృహమునకు।
పొంకముతోడను విక్రయపరచెను భక్తికి హరిదాసులకు॥ ౯౩.
వెల యమితంబని కంసాలుండును విశేషవంచన బుచ్చెగ।
సలలిత భక్తుడు సాధుజనులకును సామగ్రిని దానిచ్చెగ॥ ౪.
కంసాలుండును కుటిలుండగుచును కంకణమిడె రాజునకు।
హింసాపరుడై బల్కె నృపునితో నింపుగ రొయ్‌దాస్‌కడకు॥ ౯౫.

మనుజునంపె రెండవ కంకణమును మఱి వేగమె గైకొనుము।
అనువుగ నదివిని రోయిదాసు నా యవనిపతియు బిలిచె నుము॥
యవనుండాతని మారుకంకణము నడిగెను తనకిమ్మనియు।
సవినయముగ నాభక్తుడు పలికెను జాహ్నవియిడె నొకటనియు॥
సాదులకొఱకై కంసలవానికి సామగ్రికి నమ్మితిని।
పాడుగ రెండవ కంకణమింటను లేదని తాజెప్పవిని॥ ౯౮.
వేగమె దెమ్మనె విశ్వసింపకను విష్ణుభక్తు నా నృపుడు।
భాగీరథి నేనడిగిదెత్తునని బలికెను రొయ్‌దాసుండు॥ ౯౯.
ఇంటివద్దికిని వచ్చినయెడలను నిష్టంబుగ జూపెదను।
జంటనుండు నీప్రథమ కంకణము చనినను నడుగకుమనెను॥ ౧౦౦.
మారుకంకణము దొరకిన యెడలను మలయగ గొనుమన నృపుడు।
కోరివచ్చెనా భక్తునియింటికి గురుతుగ రొయ్‌దాసుండు॥ ౧౦౧.
వాటిక లోపల నుదకమునుండగ వాసిగ గంగను బిలుచు।
పాటవముగ శ్రీవామనమూర్తికి పదముల బుట్టితివనుచు॥ ౧౦౨.
వేగమె రమ్మని వందన మొసగగ విని నిర్మల గంగయును।
బాగుగ జూపెను కంకణహస్తము పయస్సునకు పయిగాను॥ ౧౦౩.
ప్రథమ కంకణము పృథ్వీనాథుడు బట్టియుండె చేతులను।
విధితో నుదకముపైన హస్తమును వెలయ కంకణము గనెను॥
చూచు చునుండగ రెండు కడియములు చోద్యంబగునటు గాను।
ప్రాచుర్యంబుగ మఱుగై పోయెను పదపడి నృపుడటు గాను॥
శ్రీహరిభక్తుడు రోహిదాసునకు చేసెను వందనమప్డు।
మోహంబులవిడి ఖ్యాతిని వెలయుచు ముదమున రొయ్‌దాసుండు॥
భక్తకథామృత పానము చేతను పరితృప్తిని బొందుచును।
భక్తవర్యులగు పెద్దలకెల్లను బాలకృష్ణ దాసుడను॥ ౧౦౪.

---

# పిపాజీరాజు చరిత్రము.

---

గడెమండలమను నొకపుర ప్రజలను కనికరముగ నేలుచును।
పుడమికి ప్రభువై పిపాజియనునొక పుణ్యశాలి యుండెమును॥ ౧.
శౌర్యధైర్యములు చక్కగ గలిగియు సాధుల పూజను సేయు।
వీర్యవంతుడై శక్తియుపాసన వెలయసలుపు దా మరియు॥ ౨.
ప్రాతఃకాలము స్నానము పూజల ప్రతిమెకు దా జేయుచును।
ప్రీతిని భోజన పరికరమంతయు పెంపుగ నృపుడియ్యగను॥ ౩.
శుద్ధభావమును గనుగొని యంబయు సుఖభక్షణ దా జేయు।
పద్దుగ నృపుడును బెట్టుచు దండము భక్షించును దా మరియు॥ ౪.
ఈనియంబుల సలుపుచు నృపవరు డెప్పుడు సుఖముండగను।
మానుగ యాత్రాపరులై వచ్చిరి మరి సాధులు కొందరును॥ ౫.
ఆసలేక మది గురుతర భక్తిని నవని బవిత్రంబుగను।
వాసిగదిరుగుచు దేశదేశముల వచ్చిరా పురమునకును॥ ౬.
చారులు వచ్చియు జెప్పిరి నృపునకు సాధుజనుల రాకయును।
వారిజాక్షికి నైవేద్యంబుల వరుసను నొసగి మరియును॥ ౭.
జూతునటంచును జెప్పి యంబకును సుప్రసాద మియ్యగను।
పాతరలాడుచు భక్షణచేయక భాగవతుల జూడుమను॥ ౮.
భక్షణ వారలు జేసినపిదపను భక్షణచేయుదు ననగ।
అక్షిద్వయమున నామెనుగని నృపు డంజలి హస్తుడగుచు తగ॥
జగతిని నీకును శ్రేష్ఠదేవతను సరగ జెప్పుమని యడుగ।
ప్రగల్భత్వమున బల్కెను దేవియు బాగుగ నరపతి వినగ॥ ౧౦.
ఎవనిపారమును నబ్జజభవులును నెరుగకుందు రీభువిని।
త్రివిక్రముండై యఖిలాండంబుల దేవుడు ప్రభుడీ మహిని॥ ౧౧.
పాలకడలిపై శయనుండగుచును పరమపదాధిపు డనుచు।
చాలగ నవతారంబుల పెక్కులు సలిపినయాతడు మనుచు॥ ౧౨.

అన్ని దేవతుల కాదు శ్రేష్ఠుండవని బ్రోచుననగాను।
పన్నుగ నృపుడును శ్రీహరి దనకును ప్రసన్నునిగ జేయుమను॥ ౧౩.
భవానిబలికెను భాగవతుల శ్రీపాదంబుల బట్టినను।
భవాబ్ధిహరుడగు రామశ్రేష్ఠుని భవ్యరూపు గననగును॥ ౧౪.
సంపతి రాజ్యము సర్వసిద్ధినా సామర్థ్యమున గలుగును।
పెంపుగ వారలె రామప్రసన్నత ప్రియమొనర్తు రివ్వేడను॥ ౧౫.
చనషడ్గుణముల సకలపూర్తియును సర్వేశ్వరునకె గలుగు।
ఘనగుణ భరితులు హరిభక్తులకును కడునధీను డాతడగు॥ ౧౬.
అట్టిభక్తులీ నగరవరంబున కరసివచ్చిరని చెప్పన్।
దిట్టముగావిని రాజు భక్తులకు దిగ్గునవచ్చియు నొప్పన్॥ ౧౭.
నమస్కరించియు నమ్రతవారిని నయమున సన్మానించెన్।
క్రమమున వారికి భోజనమొసగియు కరముల విడెములనిచ్చెన్॥
ముందుగనిలబడి మిగులనమ్రుడై ముకుళహస్తుడై యొప్పన్।
సందియమొందక రామదర్శనము సలుపజేయుమని జెప్పన్॥ ౧౯.
భగవద్దాసులు బల్కిరి వెళ్ళుము తగ రామానందుకడన్।
నిగమ సారమగు తారకమంత్రము నెనరున జెప్పును వేడన్॥ ౨౦.
చిల్లరయమరుల సేవను జ్ఞానము చేకూడునే యీభువిని।
ఉల్లమలరగను హృషీకేశుహరి యుచిత భక్తిమార్గమని॥ ౨౧.
శరణు వేడుమల రామానంద స్వామిని తగ నీవిపుడు।
గురుని యనుగ్రహ వరమున నీకును గొప్ప భద్రమగుచుండు॥ ౨౨.
అనుతాపంబున నప్పుడు పిపాజి యతని ప్రధానుం బిలిచెన్।
ఘనరాజ్యంబును గైకొనుమనుచును గరిమనిచ్చి యేతెంచెన్॥ ౨౩.
సంపద గృహమును సకలము విడిచియు చనుటకు యత్నింపగను।
పెంపుగనాలగు సీతాబాయియు ప్రీతిని పురుషుని తోను॥ ౨౪.
పంచశతంబగు భార్యలందరును బైలుదేరగా నపుడు।
మించిన క్లేశము మదిలో నొందుచు మెలగివారిగని యతడు॥ ౨౫.

నగల నాణ్యముల కోకల వదలియు నతివేల దారమ్మనగా।
వగవక సీతాబాయియె వెళ్ళెను వస్త్రమొకటితో బాగా॥ ౨౬.
వారలిద్దరును వచ్చుచు గురునకు వందనమిడుచును పిదపన్।
కోరియు సేవల బహుగాజేసిరి గురుకృపకలుగుట కొప్పన్॥ ౨౭.
మక్కువజూచియు మంత్రము గురుడును మహిమను నుపదేశించెన్।
నిక్కముగా తన పూర్ణకటాక్షము నెఱి వారలపైనుంచెన్॥ ౨౮.
తారకమంత్రము గైకొని నృపుడును దశరథరాముని నెపుడు।
ధీరవరుండై యంతటజూచుచు స్థిరచిత్తుండై యుండు॥ ౨౯.
అహర్నిశంబులు గురుసన్నిధియం దమితభక్తి నుండగను।
సహచరు లిరువురు ద్వారక కరుగను సద్గురువరు నడుగగను॥ ౩౦.
గురువరు డానతినియ్య ద్వారకకు కోరివెళ్ళి రిరువురును।
మరువని ప్రేమను మునిగిరి గోమతీ మహాతీర్థమందులను॥ ౩౧.
ద్వారకనాథుని దర్శించియు మరి తద్భక్తులగని యచటన్।
కోరికతో పురి బంగారముచే థారుణి నిర్మితమగుటన్॥ ౩౨.
భాగవతమను పురాణములో దగ బలుకంబడి యుండెమును।
వేగమె దానిం జూపుడనుచు దా విన్నపింప వారలును॥ ౩౩.
శ్రీకృష్ణుడు తన పరమపదంబును జెందినపుడు ద్వారకను।
ప్రాకట సముద్ర మాక్రమింపగా బలు కలశముల్ మాత్రమును॥
భక్తుల కనులకు నగుపడుచుండును పరగజూడ పొలిమేరన్।
సక్తిగ నీవును జూడుమటంచును చక్కననిరి జనులూరన్॥ ౩౪.
ఈవచనమువిని శివాజి యచటికి నేగెదనని బలుకగను।
భావశూన్యులై బలికిరి వారును ప్రత్యుత్తరముల నటను॥ ౩౫.
వెనకటి వర్తన వెళ్ళె కృష్ణుతో విపరీతంబుగ నిటను।
పనిబడి నీటను ప్రాణత్యాగము పనియేమని చెప్పగను॥ ౩౬.
అవనీనాథుం డదిచెవినుంచక హరినెప్పుడు గందునని।
ప్రవిమలనిష్ఠుడు నీటనిబడెమును భార్యతోడ సుదతీని॥ ౩౭.

సత్యశీలయగు సతినిగూడుకొని సంసారిగ నుండగను।
నిత్యము నింటికి సాధులువచ్చిన నిండుమోదమందగను॥ ౬౪.
దరిద్రదశచే తల్లడిల్లినను దామోదరు ధ్యానమున।
పరితృప్తినిదా బొందుచు నెప్పుడు భజనచేయుచుండిరన॥ ౬౫.
సతితో పిపాజి భక్తునింటికిని చనె నాతని జూచుటకు।
అతిప్రీతినిగొని చిందిడి వారల కవనిమీద బడి మ్రొక్కె॥ ౬౬.
వినయముతోడను నర్ఘ్యపాద్యములు వెస నాసనమిడి యుండర్।
ఘనస్వర్గ సమానమగును నేడని తనియుమాట లనుచుండర్॥ ౬౭.
చిందిడి భార్యయు చనుదెంచుచునట చేసె వందనంబులను।
పొందుగ నతిథుల భుజింపుడనుచును బుజ్జగించె నాతడును॥ ౬౮.
శుద్ధభావమును జూచి పిపాజియు నూటిగ నామోదించెన్।
పద్ధతి దొప్పన గృహమున చిందిడి భార్యతోడ యోచించెన్॥ ౬౯.
గ్రాసమేమియును గానక యింటను కడువ్యసనము తానొందెన్।
వాసిగ భక్తులు భాగ్యోదయమున వచ్చుట నిటు మేలొందెన్॥
సామగ్రినిమరి వారలకిచ్చియు సన్నుతిచేయగ వలయు।
ఏమిచేయదగు నప్పునీయరిటు నిరుగుపొరుగునని వినియు॥ ౭౧.
భార్యబల్కెనటు యొక్కటెయగునా వస్త్రమమ్మి భోజనము।
ఆర్యులకొసగుము వంచనలేకయు నతిఖేదము బొందకుము॥ ౭౨.
ఇటులంబలుకుచు వెళ్ళెను పెరటికి నేపునగని పొరుగింటన్।
తటాలునను తనసఖియునురాగా తనవస్త్రమమ్మి వెంటన్॥ ౭౩.
అడ్డగోడపై డబ్బులుంచబడ నామెచేత గైకొనుచు।
దుడ్డుబైటనిడి గదిలోదూరుచు దురుసుగ తనపతి బిలుచు॥ ౭౪.
వాకిటిముందర డబ్బులుండగని వరుసను పతి చేకొనుచు।
దాకొనివెళ్లుచు వలయువస్తువుల్ ధరగొని యతిథులకిచ్చు॥ ౭౫.
సీతయు వంటనుచేసి భర్తకును చిందిడికిని వడ్డించెన్।
ప్రీతిగ నిరువురు భక్షింపంగను ప్రియచిందిడి విడెమిచ్చెన్॥ ౭౬.

నృపుడును విడెముల నందుకొనుచుచే నెనరున మోదమునొందెన్।
కృపతో సీతయు చిందిడిభార్యను క్రియనుబిలిచి యింపొందెన్॥ ౭౭.
పాకముచేయను ప్రొద్దయ్యెనుమరి భక్షింపుద మిరువురము।
పీకను రమ్మని బిలుచుచుండగా విగతవస్త్ర యగుచుసుమీ॥ ౭౮.
తలుపుమూసికొని కూరుచుండగను తగిలెను లజ్జయు మిగుల।
సలలితముగ నిల్లాలనె సీతకు సలుపుము భోజనమటుల॥ ౭౯.
వెనకను భక్షణ నేజేసెదను వినవలెనని జెప్పగను।
చనువున సీతయుజెప్పెను భక్షణ సలుపను నినువిడి నేను॥ ౮౦.
త్వరగారమ్మని బలుకుచునుండగ తరుణి నచటరాకుండన్।
వెఱవక సీతయువెళ్ళి కవాటను వేగమె తీసియు చూడన్॥ ౮౧.
చీకటి యింటను చీరెలేకతా శ్రీహరిని భజించుచును।
ప్రాకటముగ నుద్వేగచింతలను బాసి రాము దలపగను॥ ౮౨.
సీతాబాయ్ గని కారణ మడుగగ జెప్పెను సంగతి సతియు।
పాతరలాడుచు సీతయు బల్కెను బహుసుకృతం బిదియనియు॥
సీతా సతి తన చీరెను సగమును చించియిచ్చె నామెకును।
చేతబట్టుకొని వెలపల వచ్చుచు చేసిరి భక్తిరువురును॥ ౮౪.
నృపవరుడనె తన నారీమణితో నిరపేక్షులు యిరువురును।
చపలత లేకను ధనమువారలకు సంపాదింతు మనియును॥ ౮౫.
అనుచు వచించుచు నుభయులువెళ్ళిరి యరయ నగరవీధికిని।
వనితారత్నము సీతపాడె తగ వాలువీణె తానుగొని॥ ౮౬.
హరిమాహాత్మ్యము నందరువినగను నతివినోదముగ పాడన్।
పురజనులందరు మోహము నొందుచు భూరిద్రవ్య మిడుచుండన్॥
అమిత ద్రవ్యము నార్జన జేసియు నవియంతయు చిందిడికిన్।
క్రమముగ నీయగ భయపడి వారలు కలతను వెళ్ళిరి వెలికిన్॥౮౮.
నృపవరు డప్పుడు నార్తులకిచ్చుచు నెఱిధనంబులను నటను।
కృపతో వారల నింటికి బిలిచియు క్రియనుమాన్పి భయములను॥

శ్రీహరిభక్తిని చెన్నొందుచు భువి చిరకాలముండు మనియు।
బాహుళ్యంబుగ దీవెనలిచ్చియు బాటను బోయిరి మరియు॥ ८०.
శ్రీరఘునందను చర్యల బాడుచు చేరిరి కాశీపురము।
ధీరతరంబుగ నిత్యసుఖంబున తేజరిల్లిరటు కరము॥ ८१.
బాలకృష్ణ దాసుండు భక్తజన పాదధూళి దానగుచు।
వీలుగ వారల యద్భుత మహిమల విధినెప్పుడు వర్ణించు॥ ८२.

---

## నరసీమెహోత చరిత్రము.

పిపాజియను నా పుణ్య పురుషుచే పెద్దపులి పవిత్రమయు।
అపార మహిమను బ్రాహ్మణ జన్మము నదియును దాల్చెనుమరియు॥
జూనగడీలో నరసిమెహోతయును నూటిగ జన్మించియును।
మానుగ పెరుగగ జనకులు జేసిరి మహిలో నుపనయనమును॥ २.
జననీ జనకులు హరిపద మొందిరి తనయుని యేడవ యేట।
ఘనముగ నచ్చటి బంధువుల్ గూడియు కాపాడిరి తన్నచట॥ ३.
ఇతరబాలురను గూడి యాడుచును నెదియు చదవకుండగను।
హితపరయగుచును వత్తయు బలికెను నెటు బ్రతికెదు ముందుగను॥
ఆకలియైనపు డన్నము గుడుచుచు నీకాలము గడిపినను।
జోకను నీవును పెద్దబెరగగను సుతుసతి గతియెట్లగును॥ ४.
ఈవార్తలవిని యతికుపితుండై యేగెను కాననమునకు।
దైవాధీనముగా నరణ్యమున త్ర్యంబకేశుగుడి కడకు॥ ५.
శివలింగంబును జూచిదానికిని శిరమున దామ్రొక్కుచును।
వివరము దెలియక ప్రార్థనజేసెను విశ్వనాథుడని మున్ను॥ ६.
అనాథరక్షక యాదరింపుమని యంగము హరుపై నుంచె।
దినంబులేడటు లింగము పైబడి తీర్థాశనముల మరచె॥ ७.
పురహరు డప్పుడు పరితృప్తినిదా బొందిపలికె తనలోన।
వరుసను భక్తులు వివిధ వస్తువుల గుణీనిడుదురు నన్నుగన॥ ८.

దేహంబును నాకొసగిన ధన్యుడు దివిభువినెట లేకుండన్।
ఊహింపగనిది గొప్ప తపస్సని యుమాపతియు కానబడన్॥ ౧౦.
ఉచితభక్తి యో బాలక నీయది యొప్పిదమయ్యెను నాకు।
ప్రచురంబుగ తగు వరముల నడుగుము పాదుగ నిచ్చెద నీకు॥ ౧౧.
భక్తుడు బలికెను బాలుడనగుటను ప్రాపకమగు వస్తువుల।
సక్తుడనగుచును గోరుటకొఱకును చాలదు మది నియ్యెడల॥ ౧౨.
నీకుచితంబగు పదార్థమెలదగ నాకొసంగుమనగాను।
పోకడలేకను శంకరుడప్పుడు పొంకంబిది యని జెప్పును॥ ౧౩.
ఆసను బాలుని గనుచును కృష్ణుని రాస విలాసము నేను।
వాసిగజూచుచు నుందునెప్పుడును వర్ధిల్లును ప్రేమయును॥ ౧౪.
ఇష్టపదార్థంబదియే నాకును నింపుగజూపెద గనుము।
తుష్టినిజూడుము నీరజనాభుని పుష్టివిలాసమీ దినము॥ ౧౫.
జీవగోప్యమై యుండెడుదానిని జీరియడిగితివి యిటను।
భావబంధమున రాజును రాజ్యము పరగనడుగుక్రియ నగును॥
ఐననుజూపెద ననుచు బాలునకు నబలవేష మొసగుచును।
తానుదెచ్చె బృందావనమునకును తనివిదీర నయ్యెడను॥ ౧౬.
గోపికలందరు కృష్ణుగూడుకొని గురుతరలీలల సలుపన్।
ప్రాపుగ హరుడును నానందముతో పద్మనాభుగని యొప్పన్॥ ౧౭.
రాసక్రీడల రమ్యమొనరగను రాజిల్లెను శ్రీహరియు।
వాసిగ శంభుడు వందనమొసగగ వరుసగ నవ్వుచు మరియు॥ ౧౮.
నూతనగోపిక యెక్కడిదనగను నాతడు హరితోబలుకు।
ఈతడు వనమున నంగసమర్పణ మెలమినొనర్చెను నాకు॥ ౨౦.
తొలిజన్మంబున పులియైయుండియు తొంటిపిపాజీచేతన్।
ఇల తారకమంత్రముచే దేహము యొసగివిడిచి తరువాతన్॥ ౨౧.
ద్విజవర కులమున దేహముదాల్చియు దిగవిడి తలిదండ్రులను।
స్వజనులందరును చదువుమనంగను చనెను నరణ్యమునకును॥ ౨౨.

అన్నపానముల నంటక గుఱితో నధిక తపస్సును జేసెన్।
ఎన్నికతో తగు పరము వేడుమన నిష్టము నాదని వెలసెన్॥ ౨౩.
నీదువిలాసము జూచుట నాకును మోదంబగుగద నెపుడు।
పాదుగదానిం జూపుటకై నే బాలుని దెచ్చితి నిపుడు॥ ౨౪.
ఆసమయంబున హరిశ్రీకృష్ణుం డంచితరూపున నుండెన్।
వేసినగజ్జెలు కాళ్ళను నందెలు విపుల రవంబున నుండెన్॥ ౨౫.
మృదుతర నాట్యము స్త్రీలను గూడియు మెల్లగ జేయుచు నుండు।
వదలక గట్టెను పీతాంబరమును వరుస హొన్ను మొల త్రాడు॥
రత్నఖచితమై రొమ్మున పతకము రంజిలుచుండె మణులను।
యత్నము లేకయె యెల్ల దిక్కులను నెలమికాంతి నొందగను॥ ౨౭.
వైజయంతియును శ్రీవత్సంబును వక్షస్థలమున నుండన్।
భూజనులందరు వినోదమందగ పొందుగ గాంచుచు నుండన్॥ ౨౮.
సుందర కరముల సుందరాంగనల సొలయ బట్టుకొని యుండన్।
అందంబలరగ నధరోష్ఠంబును నతులిత సొగసుగ నుండన్॥ ౨౯.
సొంపు నాసికయు కమల నేత్రములు సులలాటము విలసిల్లన్।
ఇంపుగ తిలకము కుండలంబులును నెలమితోడ రాజిల్లన్॥ ౩౦.
మయూరపింఛము మణికాంచనయుత మహిత కిరీటము గలిగి।
ప్రియాంగనలతో బహుతర లీలల పెంపుగ సలుపుచు మెలగి॥ ౩౧.
శంభుడు దెచ్చిన చిన్నగోపికయు సాగిలబడి మ్రొక్కగను।
దంభ మొందకను హరితో శంభుడు దయగనుమని వేడగను॥ ౩౨.
శ్రీహరియప్పుడు తనహస్తంబును చిన్నవానిపై నుంచి।
ఊహను లీలల జూచిన విధమున సుచిత కృతిని రచియించి॥ ౩౩.
ప్రజలకు దెలుపుచు ప్రకటింపుము నా భక్తిసరణి లోకమున।
సుజనులలోపల శ్రేష్ఠుడవగుచును సూటిగ నిలనుండుమన॥ ౩౪.
శంకరునింగని శ్రీహరిబలికెను చనుము బాలుగైకొనుచు।
పొంకముతోడను బాలునిదెచ్చెను పురారిగుడికిని మనుచు॥ ౩౫.

అభయంబిచ్చుచు నంతర్ధానము నాతండటు బొందగను।
శుభగుడు బాలుడు హరికథ బాడుచు నూటిగ నటనుండగను॥
గానధ్వని విని గొల్లలు కొందరు గని రా బాలుని గుడిని।
జూనగడీలో జెప్పిరి వారలు నూటిగ బాలుని గతిని॥ ౩౭.
నరసీ చుట్టము నారాటముతో నలుగడ వెదకుచు నుండె।
పురమున గొల్లలు బల్కిన వార్తల బొందుగ నట వినుచుండె॥
బంధువులందరు బోవుచు నడవిని బాలుని గాంచిరి యటను।
సంధిగ్ధముగను బాలుని యింటికి చనువునజేర్చిరి తగను॥ ౩౮.
సుజనులు కొందరు సాత్వికమార్గము జూచియు నాబాలునకు।
కుజనుడుకాడని పెండ్లినిజేసిరి గుణి నొక ద్విజకన్యకకు॥ ౪౦.
భక్తినిష్ఠచే వర్ధిల్లుచు మరి భవ్యవయసు బొందగను।
సక్తిగ కొడుకును నొక కుమారికెను చనువున గనియెను తాను॥
సుజనమనోహరు కృష్ణు లీలలను సుఖతరముగ తాబాడు।
గుజరాత్ భాషను ననేకులచ్చట కోరిపఠించెద రిపుడు॥ ౪౨.
హరికటాక్షమున శ్రీహరి లీలలు నతనికి నగుపడుచుండు।
నరసీ కనులకు నగుపడినటులనె నవ్యప్రబంధము బాడు॥ ౪౩.
తాళము వీణెయు చేతుల నిడుకొని తాండవమును తాజేయు।
వేళవేళకును భక్తిప్రబలమున విరహతాపమును గొనియు॥ ౪౪.
ధాన్యములియ్యగ ప్రజలందరు నటు తనివిని పోషణమగును।
మాన్యత నొందుచు మాధవు స్మరణను మహితతృప్తి నుండెమును॥

---

సమీపమందున జూనాగడికిని శ్యామళరూప పురమున।
సమశాఖను ద్విజు నరసీమేతకు చక్కనుండె నెయ్యమున॥ ౪౬.
త్రిపురాంతకుడని జెప్పదు రతనికి సుపుత్రి యొక్కతెయుండె।
*అపచయ మొందక తనపురోహితుని నంపెను భర్తనుజూడ॥ ౪౭.

*అపచయము = నష్టము.

జూనాగడికిని నాతడు వచ్చియు సూచించెను నరసికిని।
మానుగ తన యజమానుని పుత్రిని మహి నీసుతునకిడుదమని॥
నిశ్చయించితిని ఘటితంబులగన నెగడె శుభస్కారముగను।
నిశ్చయమగునటు ముహూర్త దినమును నెనరున తా బెట్టుచును॥
యజమానుని యింటికి నేతెంచియు నట సంగతిజెప్పగను।
కుజనుండాతం డీ సంబంధము కూడదనుచు నడ్డెడను॥ ౫౦.
భిక్షాటనచే పొట్టజరుపుచును పెంపుగ హరి బాడుచును।
విక్షేపముబడు సంసారమునకు వెలయ పిల్లనియ్యనను॥ ౫౧.
పురోహితుండనె బలిమిని జేసెద పుత్రివివాహంబనియు।
పురాతనపు దేశాచారంబన, పొందుగ నాతడువినియు॥ ౫౨.
ఏబది యేనుగ లన్ని గుఱ్ఱములు నెలమి నగలు బట్టలును।
ఏబది శిబికెలు కానుకలునుగా నిన్నియు దెచ్చినయెడను॥ ౫౩.
పిల్లనిత్తునన, పౌరోహితుడును ప్రియమొందక తా నాడు।
ఎల్లపదార్థము లాతడు దెచ్చును నెలమి పెండ్లియగు చూడు॥ ౫౪.
అనుచు జెప్పుచును జూనాగడికిని నాతడేగి నరసికిని।
పనిబడి పుత్రుని పాణిగ్రహణము పరగ సిద్ధపరచితిని॥ ౫౫.
సామగ్రులతో పురమురమ్మనుచు చక్కజెప్పి తా చనియు।
ప్రేమతోడ త్రిపురాంతకుజేరియు సామగ్రిని గొనుమనియు॥ ౫౬.
కుమారిపెండిలి కొఱకని జెప్పగ, కూర్మితోడ నతడనెను।
సమరసముగ నీ వివాహమెన్నడు జరగనేరదని యనెను॥ ౫౭.
మహిత కట్నములు కావలెననియును మానుగజెప్పితి నపుడు।
బహు దుర్బలులగు విప్రులయింటికి బాలికె నియ్యననె యెపుడు॥
ఈవచనము విని పురోహితుండును నిల నవినీతుడవనియు।
దేవుడు నీకును నవమానంబును దెచ్చెదుననుచు వెడలియు॥ ౫౮.
నరసీమేతయు నిత్యనేమముల నాటిదినము సలుపుకొని।
పురోహితుడు జెప్పినవిధమునతా పొసగ వెడలె పెండ్లికిని॥ ౬౦.

వాద్యఘోషములు మ్రోగుచునుండగ వైష్ణవోత్తములతోను।
ఆద్యుడు శ్రీహరి యనుచు నామమును నరసి బాడియాడుచును॥
ఆనందముతో నరసియు బోవగ నామార్గము లోపలను।
శ్రీనివాసుడును శ్రీరుక్మిణితో చింతించెను ద్వారకను॥ ౮
నరసీభక్తుడు నేటిదినంబున వరుస కొడుకు పెండ్లికని।
దరిగొని నడచుచు నుండుటచేతను తత్సహాయ మగుటకని ౯
పోవలెననుచును భక్తులనెల్లను పొదుంగ రమ్మనగాను।
సావధానులై యుద్ధవాదులును సరగున వచ్చిరి యటను॥ ౧౦
పరమభాగవత జనులగూడి హరి బైలుదేరె సతితోడ।
వరుస వాద్యములు మ్రోగుచునుండగ వధువు కట్నములతోడ॥
త్రిపురాంతకుడటు జెప్పినక్రమమున దెచ్చెను కట్నములెల్ల।
అపరిమితంబగు నాడంబరముగ నటజేరె నరసిని మెల్ల॥ ౧౧.
నరసీముందర కృష్ణుండాడుచు నయముతోడ దా చనియు।
సరసభావమున చేరిరి వారును శ్యామలరూపగు పురియు॥ ౧౨.
సమీపమందును జేరి కృష్ణుడును చారుని నొకనిని బంపె।
ప్రమోదమొందుచు త్రిపురాంతకుకడ బాలికె దెమ్మని జెప్పె॥ ౧౩.
అతడు వినియు బహువింతను బొందగ నచ్చటిజనులందరును।
మితిమించినయా మహోత్సవంబున మెలగుచువచ్చె వరుడును॥
అనుచును బలుకగ పురోహితుండును నత్యానందము నొందె।
ఘనుడగు రంగడు కరుణించెనుయని కాంతుదీరి యింపొందె॥ ౧౪.
ఇంతలోన హరి సకలపదార్థము లిచ్ఛమాత్రమున జేసె।
పంతముతోడను మంటపశాలలు బాగుగ నచ్చట వెలసె॥ ౧౫.
దేవకన్యలను దెప్పించియు నట దివ్యనటన జేయించె।
భావించుచునా పెండ్లికొడుకునకు బట్టలు సొమ్ములనిచ్చె॥ ౧౬.
త్రిపురాంతకుడును తనవారలతో దెచ్చెను తనకన్యకను।
అపుడే శ్రీహరి యతనింగాంచుచు నతిభాగ్యము నీదియను॥ ౧౭.

పరమభాగవత బంధుత్వంబును బడయుట పుణ్యమగును నిల।
పరసవేదితో నంటిన లోహము బంగారంబగు నటుల॥ ౭౮.
ఇదివిని యాతం డెచ్చటనుండిమీ రేతెంచితిరని యడుగ౯।
విదితంబుగ హరి ద్వారకనుండినే వేంచేసితినిటు వేగ౯॥ ౭౯.
శ్యామళుడనినను జెప్పుచునుందురు సాహుకారు నేనగుచు।
నేమనుతోడను గుమా_స్తయగుదును నెనరున నరసికి ననుచు॥
శ్రీకరమగునా లక్షణములగని చెలగి త్రిపురాంతకుడు।
జోకతోడ కొంచెము సామగ్రిని జూపగ సిగ్గుననుండు॥ ౭౭.
శ్రీహరి జెప్పెను సంబంధంబును శ్రీమంతులతో మించి।
బాహుళ్యంబగు ప్రయాసయగునని భయపడవలదిది యెంచి॥ ౭౮.
ఎల్లవిభవములు నేర్పడి యుండగ నేమికొరత లేదిచట౯।
నల్లలితంబుగ నీవును దెచ్చిన సామగ్రిని నుంచుమిట౯॥ ౭౯.
చెప్పినవిధమున నాతడు జేయగ చేకొని హరియంతయును।
ఒప్పిదముగనే వివాహమంతయు నూర్జితముగ చేసెమును॥ ౮౦.
సంబరమొప్పగ జోడువస్త్రములు జనులకందరికి నిచ్చె౯।
వెంబడి ద్విజులకు దక్షిణలిచ్చుచు వేడుకలను జేయించె౯॥ ౮౧.
పిండివంటలును భక్ష్యభోజ్యములు పెరుగన్నము శాకములు।
నిండుగబెట్టియు నెల్లజనములకు నెనరున నైదుదినములు॥ ౮౨.
చతుర్విధ ము_క్తులు స్త్రీరూపంబుల నలిపెను నృత్యములటను।
అతులిత భ_క్తులు భజనముజేయుచు నాడిపాడుచుండగను॥ ౮౩.
అయిదవ దినమున తిరిగి యందరికి నర్పించెను వస్త్రములు।
ప్రియభ_క్తుండగు నరసీమేతయు ప్రేమలహరి బొందనిల॥ ౮౪.
పెండ్లియంతయును పూర్తిగ జరిగిన పిదపను సంతోషముతో।
ఇండ్లకు జేర్చెను వధూవరులతగ కృష్ణుడు కడుప్రేమముతో॥ ౮౫.
నరసీవద్దకు నేతెంచియు హరి నయముగబలికెను చెవుల౯।
గురుతర సంకట కాలమునందును గోరితలచు నన్నిటుల౯॥ ౮౬.

అనుచు జెప్పుచును నఖిలేశ్వరుండును నాతని పరివారముతో।
తనపురియగు శ్రీద్వారక చేరెను తరుణియు భాగవతులతో॥ ౮౭.

---

పిదపను నరసీ పూర్వమువలెనే ప్రియమోదముతోనుండెన్।
చిదచిదాత్మకపు జగత్తునందును శ్రీహరినే గనుచుండెన్॥ ౮౮.
ద్వారకయాత్రకు బోవుచు కొందరు తాము దిగిరి గ్రామమున।
వారియందొకడు గ్రామస్థులలో వలయు తనకు హుండియన॥౮౯.
కుచోద్యముగనటు నరసీ గృహమును కొందరు జూపినపగిది।
(సచరాముల సృష్టి యీశునిది స్వాభిమానము జీవునిది॥ ౯౦.
ఈశుని సృష్టిని నుందురు భక్తులు ఇతరమందు నభక్తులును।)
కేశవపంతులు వినుకొని చనెనటు గీల్కొని నరసీయెడను॥ ౯౧.
నరసీమేతయు నెమ్మదితోడను నరహరిని నుతించుచును।
తీరముగ తులసీ వనమధ్యంబున తీరుగ గూర్చుండగను॥ ౯౨.
వచ్చినమనుజుని యాదరించిమరి వార్తబలికె విహితముగ।
ఎచ్చటినుండియు నేతెంచితివీ వెచ్చట బోయెద వనగ॥ ౯౩.
బలికె కేశవుడు ద్వారకాపురికి ప్రయాణమై వెళ్ళెదను।
బలితము దారిని దొంగల భయమని బలికిరి జనులందరును॥ ౯౪.
ఊరునడుగగా హుండీపత్రము నొసగెద వీవిట ననుచు।
వారలు జెప్పగ వచ్చితి నీకడ వరహాలను గనుమనుచు॥ ౯౫.
ఏడువందలను నిచ్చెదనీకును నీయుము హుండీయనగన్।
వేడుక యిదియనె గ్రామస్థులయా వికటపువాతలను వినగన్॥
అయినను శ్రీహరి కరుణయెట్టిదో యనుచును నరసీ దలచి।
నయముగ రూకల నుంచుమనంగను నాతండటులనె యుంచి॥౯౭.
సాహుకారు పేరరయ జెప్పుము సాక్షిగ ద్వారకలోను।
ఊహను నడుగగ నరసీజెప్పెను యోగి శ్యామళుడనియును॥ ౯౮.

విధి రుద్రాదులు వందనమొసగుచు విహితులగుదు రతనికిని।
ప్రధానవేదము లాతని కీర్తిని బాగుగ నుడువును భువిని॥౯౯.
క్షీరాబ్ధిని శ్రీవైకుంఠంబున శ్రీబృందావనమందు।
ద్వారకాపురియు తిరుమల పండరి తగిన దుకాణములందు॥ ౧౦౦.
ఆర్తవర్తకులు వ్యాసు డుద్ధవు డల వాల్మికి దగువారు।
కీర్తన యనునటి ధాన్యపుకొలతను క్రియతో కొనుచుండుదురు॥
గిరాకిదారులు కబీరు నాముడు క్రియగల భక్తులునెల్లన్।
ధురీణులగుచును ధాన్యముగొందురు దురితహరము జేయనిలన్॥
కేశవుడీపలు కెరుగనేరకను గీల్కొనియుండె వరహాలన్।
పేశలుడు నరసి వ్రాసె పత్రమును ప్రేమ హరికి రాజిల్లన్॥ ౧౦౩.
అఖిలాండంబుల కాదికర్తవై యనంతరూపుడ వగుచు।
నిఖిల జగంబును నీదుచూపుచే నెపుడును కాపైయుంచు॥ ౧౦౪.
దీనోద్ధారణ దీక్షను ద్వారక దివ్యక్షేత్రమునందు।
తాను వాసుడగు శ్యామళ ప్రభునకు తత్సన్నిధి నేనిందు॥ ౧౦౫.
అనేక నతులను నరసిమేతనే నర్పించియు వ్రాసెదను।
వినీతుడగు నీపత్రము దెచ్చెడి విప్రుని వద్దను నేను॥ ౧౦౬.
ఏడువందలగు వరహాలనునిట నిరవొందగ గైకొంటి।
తోడనె యొసగుము స్వర్ణంబితనికి తొలగక శ్రీహరి యంటి॥౧౦౭.
ఉపమన్యుండను చిన్ని కొమారుం డొనరనడిగె క్షీరమును।
కృపగొని నీవును క్షీర సాగరమును క్రియతో జూపితి వటను॥
బాలుడు ధృవునకు బహాగమ్యంబగు పదవినిచ్చితివి నీవె।
వాలుగ నుండెడి నీయౌదార్యము వర్ణింప దగదు సువ్వె॥ ౧౦౯.
కావున దాసుని కరుణను జూచుచు కార్యఫలత జేయుమిలన్।
సేవకుడను నేజేయుదు సన్నతి శ్రీపదముల కియ్యెడలన్॥ ౧౧౦.
ఈవిధ పత్రిక వ్రాసియు నరసీ యిచ్చె హుండి కరములను।
భావశుద్ధితో సాధుల బిలిచియు పంచిపెట్టె ద్రవ్యమును॥ ౧౧౧.

విప్రుడు హుండిని గైకొనిదారికి విస్మిత చిత్తుండయ్యెన్।
అప్రయోజనం బగునేమోయని యమిత క్లేశుండయ్యెన్॥ ౧౧౨.
అతివీర క్తితో హరికృష్ణాయని యార్త భక్తుడై నట్టి।
సతత దరిద్రుని చేతనుంచితిని స్వర్ణ ద్రవ్యమును బట్టి॥ ౧౧౩.
ఆతడు వానిని కృష్ణార్పణముగ నందరికిని నటు బంచెన్।
వీతరాగుడని చింతను బొందుచు వేగ ద్వారకకు వచ్చెన్॥ ౧౧౪.
గోమతి స్నానము జేసియు కృష్ణుని కుదురుగ తా దర్శించెన్।
క్షేమంబగు హరి నామము జెప్పుచు జేసి నమస్కృతి హెచ్చెన్॥
అనాధ రక్షక యార్తశరణ్యుడ యరసి బ్రోవు నన్నుయని।
వినీతుడగుచును నర్చకులంగని విచారించె శ్యామళుని॥ ౧౧౬.
అర్చకుండనియె నీగ్రామంబున నట్టివాడు లేడనుచు।
చర్చచేయుమీ పురిలో నీవును చతురుడవై తగననుచు॥ ౧౧౭.
అంగడి వీధిని కేశవుడడిగియు నగుపడ కుండుట వలనన్।
భంగపడుచునటు కృష్ణార్పణమై బహుద్రవ్యము పోయెననన్॥ ౧౧౮.
నరసీమేతయు స్వర్ణ ద్రవ్యమును నరహరి భక్తుల కిడెను।
తిరిగిబోయినే ద్రవ్యము నిమ్మని తీరుగ నడుగ నతడును॥ ౧౧౯.
ఇచ్చెడి మార్గము లేదని దలచుచు నేమి చేయుదును నేను।
సచ్చరితుండగు ద్వారక నాధుని శరణంబని మ్రొక్కుచును॥ ౧౨౦.
చింతను బొందుచు వీధినుండగను శ్రీశ్యామళుడను పేరన్।
పంతము తోడను శ్రీహరి వచ్చెను బహుసౌందర్యము మీరన్॥
నీమాజామయు రత్నపు తురాయి నిగుడగ ధరించు కొనుచు।
క్షేమాలంకృత రధమెక్కెక్కియు చేరెనుద్ధవుని గొంచు॥ ౧౨౨.
సారధితోడను జెప్పె నచ్యుతుడు *సన్న చేత నాద్విజుని।
చేరబిలువుమని జెప్పగ నాతడు చెంతరమ్మనె నతని॥ ౧౨౩.
విప్రుడురాగా శ్యామలు డడిగెను విపులక్లేశ మేలనగన్।
సుప్రలాపమని గాంచుచు విప్రుడు జూనాగడి పురిలోగన్॥ ౧౨౪.

---

*సన్న - సౌజ్ఞ.

హుండిని నిచ్చెను నరసీమేతయు నొగి శ్యామళు పేరునను।
ఖండితముగ నాశ్యామళ నాముడు కనబడ డీపురిలోను॥ ౧౨౫.
ఏమితోచకయ నిచట నుండినే హెచ్చు చింత గొంటినన్।
శ్యామళుడేనని చెప్పగ విప్రుడు సరగనిచ్చె హుండిగనన్॥ ౧౨౬.
భగవంతుండా పత్రిక శిరమున భాగ్యమనుచు నిడికొనియెన్।
ప్రగల్భముగ నా పదాలమూటను బ్రాహ్మణుడును గైకొనియెన్॥
అతిమోదముతో గైకొని వానిని హరిగని విప్రుండనియె।
సతత శ్రీయుత సంపత్తులతో సాహుకారి వెటులనియె॥ ౧౨౮.
నీయజమానుడు నరసీమేతయు నిత్యదరిద్రత నుండన్।
న్యాయవిరోధము నెగడుచునున్నది నామదినని యనుచుండన్॥
హరియనె నరసీ భగవద్దాసుం డపేక్షలెవ్వియు లేక।
పరితృప్తుండై సంపద ధనముల బాగుగ మాకిడుగనుక॥ ౧౩౦.
తలిదండ్రులు తమ ధనసంపత్తుల తనయులకును నిచ్చుక్రియన్।
మెలగెడి సంపద మాకనుభవమై మేలుజేసి తావెలయన్॥ ౧౩౧.
అని యీవిధమున నెరుగంబలికియు నట్టివెళ్ళె నా హరియు।
వెనక బ్రాహ్మణుడు రూకలనన్నియు వీలుగనెంచగ మరియు॥
అగణితముగ గని యతిహర్షంబున ననేకులకు నన్నమిడెన్।
సగటుగ విభవము శ్రీకృష్ణునకును సలుపుచు తానటనుండెన్॥ ౧౩౩.
ద్వారకనుండియు తిరిగి జూనగడి తప్పక వచ్చియు చూచెన్।
వారక నరసీమేతకు సంగతి వరుసను జెప్పుచు మెచ్చెన్॥ ౧౩౪.
హుండీపత్రము నొప్పిదమగునా యుచితసంగతి నతడువిని।
నిండుప్రేమతో నేత్రబాష్పములు నేలను బడునట్లుగని॥ ౧౩౫.
పులకిత వపుడై పురాణపురుషా పుండరీక దళనయన।
ఇలలో దీనుని పరిపాలనమును నేర్పడెనిటు నెయ్యమున॥ ౧౩౬.
నీదుపారము నీసౌలభ్యము నెఱి నెంచదరమె నాకు।
సాదునిబ్రోవుము పతితపావనా సర్వేశ్వరయని మ్రొక్కెన్॥ ౧౩౭.

బహుభంగుల తా ప్రణతుల జేసెను భరితానందుం డగుచు।
సహజ దాస్యమున ప్రీతిసలిపి మది సర్వేశ్వరు నిడుకొనుచు॥ ౧౩౭.

---

భక్తుని పుత్రియు పెద్ద బెరగగను ఫలశోభన మగుటకును।
సక్తులై పత్రిక నరసికి బంపిరి సరగున బంధువు లటను॥ ౧౩౯.
కొమార్తెకయి కట్నము కావలెనని గొబ్బున సతియనె పతితో।
సమానులగు మన బందుల కడకును చనవలె కట్నంబులతో॥ ౧౪౦.
నరసీబల్కెను సతితోడను హరి నామమె కట్నము మనకు।
వెఱవక వేరేలేదని వెళ్ళెను వియ్యంకుని గృహమునకు॥ ౧౪౧.
చల్లగ వీణెయు తాళము చేకొని సర్వేశ్వరుని భజించు।
ఎల్లబందుగులు నిది యేమనుచును హేళనమును పాటించు॥
లౌకిక రీతిని లక్షించియు నిటు లలితపత్ర మంపగను।
జోకను ద్రవ్యము లేకయుండగను చుట్టాలిండ్లకుగాను॥ ౧౪౩.
ఈవిధంబుగను వచ్చుట తగదని యెల్లరు నిందింపగని।
భావికురాలగు పుత్రియు తండ్రిని పరమేకాంతమున గని॥ ౧౪౪.
అయ్యా నినుగని యందరు నింద్యము లాడుటచే నేట నాకు।
చయ్యన సిగ్గును లజ్జ పొందబడె సకల జనులు నవ్వుటకు॥ ౧౪౫.
నరసియు కనుగొని కట్నము కొఱకై నానా పదార్థములను।
వెఱవక వ్రాసియు నుంచుమటంచును వేడె బందుగుల తాను॥
బంధువులందరు పకపకనవ్వుచు బహుభంగుల నటనుండఁగ।
సంధిని కుటిలుం డొకడు పత్రమున సరియని వ్రాయుచు నుండఁగ॥
జామాతకునై నగలు చేలములు శాలువ లుంగరములును।
క్షేమ కొమార్తెకు కనకభూషలును చీరెయు కంచుకములును॥
ఇతర బధువుల కిష్టపదార్థము లెల్లను వ్రాయగ నందు।
హితవున నరసీ యాతని గన్గొని యిష్టమేమి నీకిందు॥ ౧౪౯.

బండపలయునని యతడన దానిం బదపడి వ్రాయుండనియె।
మెండుగ నవ్వారి మనుజులు, కుటిలుడు మేలని వ్రాసియునిడియె॥
తీర్థక్షేత్రముల తల్లిదండ్రులను దేవ సాధు నిందకుడు।
సార్థజీవుడును గాక జన్మములు శతముల నెత్తుచు నుండు॥ ౧౪౧.
నరసీమేతయు ననేక భంగుల నారాయణునిం బాడు।
పరమపావనా భక్తవత్సలా పాలింపుమునను నేడు॥ ౧౪౨.
దీనుల కెల్లను దీనుడనైనీ దిక్కు జేరితిని నేను।
మానక గ్రోవుము మాధవ కృష్ణా మధుసూదన వేగనను॥ ౧౪౩.
ఈవచనంబుల హరివిని ద్విజుడుగ నెలమి వేషమును దాల్చెర్।
సేవకునివలెను శిరమున మూటను చేకొని యచటికివచ్చెర్॥౧౪౪.
నరసీమేతా యెచటని యడుగగ నచటి జనులు జూచుచును।
పరుసగ నెచ్చటనుండి యిచ్చటికి వచ్చితివని పలుకుచును॥ ౧౪౫.
పేరూరేమని యడుగ వారలకు పెంపుగ శ్రీహరియనియెర్।
ద్వారకాపురము నాకాపురమగు ధర నే శ్యామళు డనియెర్॥
నరసీమేతకు గుమాస్తయగుచును నానా వర్తకములను।
వెలవక చేయుదు నతని కొమార్తెకు విహిత కట్నములతోను॥
వచ్చితిననగను నరసిమేతవిని వచ్చెను వెలపల నపుడు।
హెచ్చిన ప్రీతిని ముంగిటిలోనికి తెచ్చెను హరినా నాడు॥ ౧౪౭.
బంధువులందర బిలచియు బలికెను బహువిధ కట్నంబులను।
సందియ మొందక చేకొనవచ్చును సరగ మీారలందరును॥ ౧౪౮.
కాకిత మప్పుడు కంజాక్షునిశ్రీ కరముల నుంచియు పిదపర్।
జోక కట్నములు సకల బంధులకు సూటిగ నిమ్మని జెప్పెర్॥౧౫౦.
మూటను విప్పుచు మాధవు డచ్చట ముఖ్య బంధులందరికి।
నీటుగ నిచ్చెను దెచ్చు వస్తువుల నియమించిన యాగతికి॥ ౧౫౧.
ఇతర స్త్రీలకు నిచ్చె నతండే యింపుగ వస్త్రము లపుడ।
కుతుకముతోడను వారలు ధరించు కొనిరటు మోదము నెగడ॥

జామాతకు నరసీ కొమార్తెకును జల తరు చేలము లిచ్చెన్।
ప్రేమాస్పదమగు భూషణములదా పెంపుగాను నర్పించెన్॥ ౧౬౩.
వ్రాయువానికిని లబ్ధంబయ్యెను పరుసతోడ బండయును।
బాయని దుఃఖము బొందుచు నాతడు పరితపించుచుండగను॥
ఫలశోభనమును జరిపి వెళ్ళె హరి ప్రజలును ముదమొందగను।
పలుమరు నాడుచు బాడుచు నరసీ పరతెంచె *నిరవునకును॥౧౬౪.
అనేక విధముల హరిని నుతించుచు నత్యానందత నుండన్।
జనార్దనుండును తులసీమాలను సంతసమున గొనియాడన్॥౧౬౬.
భక్తుని మెడలో వేసెను నచ్చట ప్రజలకెల్ల నెరుగగను।
సక్తచిత్తులై సేవించిరియటు సజ్జనులును ముదమునను॥ ౧౬౭.
దినదిన మిటులనె తులసీ మాలను తిరముగ హరి యుంచుమును।
పనిబడి నరసీ భజన చేయగను ప్రజలు గందు పయ్యెడను॥ ౧౬౮.
మండూకుండను మహిపతి యుండెను మానుగ నిదివిని తాను।
ఖండితముగనది కృత్రిమ మనుచును కలికాలంబగుటయును॥౧౬౯.
విగ్రహపూజయు నుపచారమెయగు విష్ణుమూర్తి గనపడదు।
నిగ్రహాఢగుచును నరసీ వద్దకు నేగుదెంచి కూర్చుండు॥ ౧౭౦.
కుటిల బుద్ధితో మహిమ జూపెదవు గురుతుగ మనుజులు జూడ।
పటుతరముగ నిటు మాలయు కంఠము బడకుండిన నే డీడ॥ ౧౭౧.
నినుశిక్షించెద ననుచు జెప్పగను నెనరున నరసీ హరిని।
మనమున నిడుకొని భజనజేసెనటు చనువున విచ్చేయుమని॥ ౧౭౨.
ఉడుగని భక్తిని హరిగుణకీర్తన మూర్జితముగ జేసినను।
మెడలో తులసీ మాలయు నప్పుడు మేలుగ రాకుండగను॥ ౧౭౩.
నరసీ భక్తుడు కన్నీరొలుకగ నారాయణ హరియనుచు।
పరవశపరుడై పులకాంకితుడై భక్తితోడ హరిగొలుచు॥ ౧౭౪.
నిఖిలయుగంబుల నవతారంబుల నీవుదాల్చి భక్తులను।
సుఖసంరక్షణ జేసి పాపులను సూటిగ నట చంపుచును॥ ౧౭౫.

---

*యిరవు - గృహము.

కరి ప్రహ్లాదుల కృపాదృష్టిచే గాచితివీయిల నపుడు।
తెరువుగ పువ్వుల మాలను వేడిన దీనుని కొసగవు నేడు॥ ౧౭౬.
నృపవరుడప్పుడు నందరుజూడగ నేశిక్షించెద ననియు।
విపరీతంబుగ గర్జనచేయుచు వేగమె కుపితుడగుటయు॥ ౧౭౭.
మాధవ నాకొక మాలయిచ్చినను హాహా యబ్బసొమ్ము పోన।
శ్రీధర కేశవ యనుచు నరసియును జెప్పగ తత్క్షణమూన॥ ౧౭౮.
మాలాధరుడై మెలగగ నచ్చట మనుజులు మహిపతితోడన్।
మేలయ్యెనుయని యతనికి మ్రొక్కిరి మించుప్రేమ గొనియాడన్॥
భక్తులమహిమల నితరులెరుంగరు భగవంతుండే యెరుగు।
భక్తజనంబుల పాదధూళియై బాలకృష్ణుడిల బరగు॥ ౧౮౦.

---

డాకూరు రామదాసు చరిత్రము.

ద్వారకాపురికి తూర్పున పదనైదవ యోజన దూరమున।
తీరుగ డాకూరనుగ్రామంబున ద్విజవరుడుండె బ్రియమున॥ ౧.
రామదాసుడను నామముతో దా రంజిలుచును కృష్ణునకు।
ప్రేమమీరగను పూజల సలుపును పెంపుగ నామము బలుకు॥ ౨.
సదా నిరాశను సంతుష్టుండై చలన చిత్తమందకను।
నిదానముగ దా భిక్షాటనచే నిలుపును సంసారమును॥ ౩.
పక్షంబునకొక పర్యాయంబును పదపడి చను ద్వారకకు।
లక్షింపుచు తన మనోభావమున లక్ష్మీకాంతు గనుకొఱకు॥ ౪.
తోట్టిలోన నొక తులసీవృక్షము దొడ్డుగనిడి పెంచుచును।
బట్టుకొనుచు చే బోవుచునుండును పద్మనాభు గనుటకును॥ ౫.
సన్నిధి శిఖరము జూచినతోడను సలుపు నమస్కృతు లతడు।
పన్నుగ కోడలు పుట్టింటికిదా బరతెంచెడుక్రియ నపుడు॥ ౬.
మోదముతో గోమతి తీర్థంబున మునిపెముగా దామునిగి।
పాడుగ మానసపూజను సలిపియు భక్తిని సన్నిధికరిగి॥ ౭.

దేహముపై నభిమానమువదలియు దీక్షాదండ మొసగుచును।
మోహమువిడిచి యనన్యశరణుడై మురిపెముతో వేఁడుచును॥
జనన మరణముల నొందకుండుటకు జనార్దనుని ప్రార్థించు।
అనువుగ నాతడు తులసీదళముల నతని చెట్టునను తెసుచు॥ ౯.
మాలను గట్టియు మోదముతోడను మాధవు మెడకును వేయు।
వీలుగ దాసుండనాథనగుటను వెలయుపూజ నాదిక్కయు॥ ౧౦.
అనుచు జెప్పుచును హరికి దండమిడి యప్పుడె డాకూరునకు।
నెనరున వచ్చును నేడుదినములకు నెలకొకదినం బటకు॥ ౧౧.
తిరిగి పయనమై ద్వారకాపురికి తేప తేప బోవుచును।
ఇరువది యైదవ యేటను హరితో నెదురనిలిచి జెప్పెమును॥ ౧౨.
దేహ పటుత్వము తప్పెను నాకును దీనరక్షనామిాస।
స్నేహము కరుణయు మానకయుంచుము క్షేమకరము చెలువొంద॥
నీచరణంబుల నేజూచుటకును నేరనింక వృద్ధతను।
సూచించుచు నటు కన్నీరొలుకగ సూటిగనిడె దండమును॥ ౧౪.
ఈవచనమువిని హరి మన్నించుచు నెలమివత్తు నీవెంటన్।
సేవా ఋణమును చేరెనునాపై చెల్లించెద నీజంటన్॥ ౧౫.
హయముల గూడిన రథంబు నొక్కటి నారేయిని తెమ్మనగన్।
ప్రియమొప్పారగ భక్తుడు దెచ్చెను పెంపుగ రథమును నటుగన్॥
నిశాకాలమున శ్రీహరి మూర్తిని నెనరున రథమున నుంచన్।
వశీకృతుండై ద్వారక నాథుడు వచ్చుచుండు తగ పెలుచన్॥ ౧౭.
దారిని వచ్చుచు నుండగ విప్రుడు తలచుచుండె తనలోను।
వారిజాక్షుడును దయతోవచ్చెను వాసిగనెటు దాపుదును॥ ౧౮.
శ్రీహరి యర్చకు లరుగుదెంచి మరి చేకొందురు హరిననియు।
మోహముతో డాకూరునకరుగుచు మూర్తిని కొలకుననిడుటయు॥
ద్వారకలోపల ద్విజవరు లందరు ధర మూర్తిని కానకను।
తీరుగ నప్పుడె యిటనటు వారలు కోరి వెతకి చూడగను॥ ౨౦.

రామదాసుడే డాకూరునకును రథమును గైకొని వెళ్ళఁగ।
నేమి మార్గమును గని మదినెంచియు నెనరున వచ్చిరి మెల్లఁగ॥
ఆతని యింటికి నందరు వెళ్ళియు నడుగ మూర్తి నిమ్మనుచు।
నే తేలేదని దాసుఁడు బల్కఁగ నెఱి యాగృహము వెదకుచు॥ ౨౨.
గ్రామము లోపల మూర్తియు నెచ్చట గానక యల కొలకునను।
వేమరు చూడగ హరి విగ్రహమును వీలుగ గనిరందులను॥ ౨౩.
ఉదకము నుండియు వెలపల దీయగ నుదాసీనుఁడై యతఁడు।
వదలిపోయె దో శ్రీకృష్ణా నిను వారలు చేకొని రిపుడు॥ ౨౪.
నినువిడిచియు నిట నుండగ జాలను నేనన్నతము బలికితిని।
దినకరవంశజ దీనవత్సలా దీనుఁడ నను బ్రోవుగని॥ ౨౫.
ధ్యానముచేయగ నాకాశంబున ధ్వనియు వినంబడె నచట।
మానుము కించను మనసున నీవును మరగి యుందు నేనిచట॥ ౨౬.
పుండరీకుఁడును పూజించిన గతి పూజచేయుమిక నన్ను।
పండితుల నడుగుము నాదు మూర్తిని పన్నుగ నీకియ్యమను॥ ౨౭.
హరి విగ్రహ భారము బంగారము నవని నిత్తునని జెపుము।
భరమున నేనీ భార్యనత్తునకు భారము సరిగానుందుసుము॥ ౨౮.
ఇదివిని ముదమున నర్చకులంగని యింపుగ తానటు బలుకు।
కుదురుగ విగ్రహ భారసువర్ణము కూరిమి నిచ్చెద మీకు॥ ౨౯.
శ్రీహరిమూర్తిని చనువున నాకును చెల్లింపుండని యనగఁ।
సాహసమిదియని దలప కర్చకులు సరగున సమ్మతి పడగఁ॥ ౩౦.
ఇతరజనంబుల రామదాసుఁడపు డెలమి సాత్తులుంచెతఁగు।
పతితులు కుటిలులు నవ్వదొడంగిరి బహుకుటుంబ పోషణకు॥ ౩౧.
భిక్షమెత్తగను విగ్రహ భారము పెంపు స్వర్ణమెటు దెచ్చు।
కుక్షికిలేకయు దరిద్రదశచే కొనకొని తానెటు లిచ్చు॥ ౩౨.
హరిదాసుండును వారికి బలికెను హరిశ్రీపతి నాయింటఁగ।
వెఱపక రాగను నాదుదరిద్రము వెళ్ళదొడంగెను బాటఁగ॥ ౩౩.

ఇటులం జెప్పగ చోద్యమునొందిరి యెల్లమనుజు లయ్యెడను।
పటుతరమగు నొక త్రాసులోపలను భవ్యమూర్తి నుంచుచును॥
మరియొక వైపున స్వర్ణముంచమని మహీసురులును నటనడుగఁగా।
గురుతుగ దాసుడు భార్యవద్దకును కోరివెళ్ళినటు వేగఁగా॥ ౩౫.
నత్తునిమ్మనగ నామెయు నిచ్చెను *బత్తి నతడు కొనివచ్చెఁగా।
చిత్తమలరగను నత్తు చేతనిడి శ్రీహరినిటు ప్రార్థించెఁగా॥ ౩౬.
సత్యభామనిను నారదమునికిని చక్కగ నమ్మగనపుడు।
ప్రత్యయముగ శ్రీరుక్మిణి తులసీ పత్రమునకు సరియగుడు॥ ౩౭.
ఆమెకన్న నతిదీనుడైన నా యార్తి మొరను వినుమనుచు।
నేమము తోడను నత్తు త్రాసునను నెనరుననుంచెను గనుచు॥ ౩౮.
ఎవనియుదరమున నీ బ్రహ్మాండము లేర్పడియుండునో నతడు।
భువి దాసునకై తులము పసిడికిని పొందుగ నీడై యుండు॥ ౩౯.
జయజయ శబ్దము చేసిరి భక్తులు చప్పట్లను గొట్టుచును।
ప్రియమగు భక్తికి పొందబడెను హరి ప్రేమతోడ వెలయగను॥
పూజాచార్యులు జనిరి ద్వారకా పురమునకును తిరిగియును।
ఓజలేకయా మూర్తివదలి వేరొక మూర్తిని జేయుచును॥ ౪౧.
ద్వారకాపురిని స్థాపనజేసిరి, తలపడి డాకూరునను।
వారక శ్రీహరి మహత్వ మధికమై వర్ధిల్లింబడె తగను॥ ౪౨.
ద్వారక కరిగెడి యాత్రాపరులీ ధర డాకూరున కెపుడు।
చేరబోవుచును చూచి వెళ్ళెదురు చెప్పుచు మహిమల నెపుడు॥
హరికృపారసం బందిన పురుషుల యద్భుత మహిమల నెల్లఁగా।
పరికించిన యాభక్తుల దాసుడు బాలకృష్ణు డీ యెడలఁగా॥ ౪౪.

---

బ్రహ్మచారి కళ్యాణులను విప్రుల చరిత్రము.

సేతుస్నానము చేయుట కొఱకై చేరి రామనాథమున।
ప్రీతిని నిరువురు బ్రాహ్మణు లచ్చట పెద్ద సత్రమందుగన॥ ౧.

---

* బత్తి - భక్తి.

ఇటులంజెప్పగ చోద్యమునొందిరి యెల్లమనుజు లయ్యెడను।
పటుతరమగు నొక త్రాసులోపలను భవ్యమూర్తి నుంచుచును॥
మరియొక వైపున స్వర్ణముంచమని మహీసురులును నటనడుగన్।
గురుతుగ దాసుడు భార్యవద్దకును కోరివెళ్ళినటు వేగన్॥ ౩౫.
నత్తునిమ్మనగ నామెయు నిచ్చెను *బత్తి నతడు కొనివచ్చెన్।
చిత్తమలరగను నత్తు చేతనిడి శ్రీహరినిటు ప్రార్థించెన్॥ ౩౬.
సత్యభామనిను నారదమునికిని చక్కగ నమ్మగనపుడు।
ప్రత్యయముగ శ్రీరుక్మిణి తులసీ పత్రమునకు సరియగుడు॥ ౩౭.
ఆమెకన్న నతిదీనుడైన నా యార్తి మొరను వినుమనుచు।
నేమము తోడను నత్తు త్రాసునను నెనరుతనుంచెను గనుచు॥౩౮.
ఎవనియుదరమున నీ బ్రహ్మాండము లేర్పడియుండునో నతడు।
భువి దాసునకై తులము పసిడికిని పొందుగ నీడైయుండు॥ ౩౯.
జయజయ శబ్దము చేసిరి భక్తులు చప్పట్లను గొట్టుచును।
ప్రియమగు భక్తికి పొందబడెను హరి ప్రేమతోడ వెలయగను॥
పూజాచార్యులు జనిరి ద్వారకా పురమునకును తిరిగియును।
ఓజలేకయా మూర్తివదలి వే రొక మూర్తిని జేయుచును॥ ౪౧.
ద్వారకాపురిని స్థాపనజేసిరి, తలపడి డాకూరునను।
వారక శ్రీహరి మహత్వ మధికమై వర్ధిల్లంబడె తగను॥ ౪౨.
ద్వారక కరిగెడి యాత్రాపరులీ ధర డాకూరున కెపుడు।
చేరబోవుచును చూచి వెళ్ళెదురు చెప్పుచు మహిమల నెపుడు॥
హరికృపారసం బందిన పురుషుల యద్భుత మహిమల నెల్లన్।
పరికించిన యాభక్తుల దాసుడు బాలకృష్ణు డీ యెడలన్॥ ౪౪.

---

## బ్రహ్మచారి కళ్యాణులను విప్రుల చరిత్రము.

సేతుస్నానము చేయుట కొఱకై చేరి రామనాథమున।
ప్రీతిని నిరువురు బ్రాహ్మణు లచ్చట పెద్ద సత్రమందుగన॥ ౧.

---

* బత్తి - భక్తి.

ఒకనితోడ నొక డేదేశంబని యొనర నడుగ నొకడనియె।
ప్రకటంబుగ తా హరిద్వారమని ప్రబల దూరమది యనియె॥ ౨.
కుటింబినగుదును కళ్యాణుండను గుదుతుపేరు నాకగును।
అటుండి యాత్రకు నిటువచ్చితినే నరయగ నీచో టెటను॥ ౩.
మరియొక డనియెను బ్రహ్మాచారియని మానుగ బిలుతురు నన్ను।
అరయగ విప్రుడ గౌడదేశమగు హరియె తల్లిదండ్రులను॥ ౪.
సకలతీర్థముల యాత్ర చేయుచును చక్కగ వచ్చితి ననుచు।
నొకరితోడ నొక రుచిత స్నేహము నొప్పగజేయుచు మనుచు॥ ౫.
ఉభయులు జతగా సకల క్షేత్రముల నొనరగనటు జూచుచును।
వీభవముతో హరి విలాసమెల్లను విశ్రుతముగ బాడుచును॥ ౬.
నారాయణ నామంబు నుడువుచును నయముగవచ్చి మధురను।
వారక నచ్చట యమునా స్నానము వారిరువురు జేసియును॥ ౭.
మాధవస్వామిని నచ్చట జూచియు మరగగ దినములు మూడు।
వేధకలుగ చలి జ్వరము వచ్చెనటు విధి కళ్యాణున కపుడు॥ ౮.
ఎన్నివిధంబుల నుపచారంబుల నెలమిజేసి బోకుండు।
పన్నుగ దుఃఖము ముప్పిరిగొనగను బ్రహ్మాచారి వెలనుండు॥ ౯.
ఔషధంబు పత్యంబులు జేయుచు నతివిశ్వాసకు డగుచు।
ఈషత్తయినను వదలక విప్రుం డెప్పు డతనికడ నిలుచు॥ ౧౦.
శ్రీహరి సన్నిధి కరుగుచు నాతడు జెప్పుచుండు ననుదినము।
బాహుళ్యంబగు వ్యాధినిమాన్పుము భగవంతుడ నసుగనుము॥
ఆరుమాసముల కౌషధపథ్యము లమరజేయుచుండగను।
మీరిన వ్యాధియు మెల్లగ తగ్గియు మేలయ్యెను దేహమును॥ ౧౨.
కనుగొని యాతడు బ్రహ్మాచారితో గారాబముగా ననియె।
పనిబడి నీవే యిష్టసఖుండవు పరులులేరు నాకనియె॥ ౧౩.
దారా పుత్రులు కలిగియుండినను దైన్యపుదశలో నీవు।
తీరుగ నన్నుం బ్రోచుచునుంటివి దేవునిప్రీతి గనుదువు॥ ౧౪.

కన్నె యొకతె నాగృహంబు లోపల కలిగియున్నదిల నాకు।
పన్నుగ దానిని వైవాహికమున పదపడి యిచ్చెద నీకు॥ ౧౫.
ఇందుల కనియెను బ్రహ్మచారియును నిజగమునసే నెపుడు।
క్రందుకొనుచు నొక సంసారంబును గడప నిచ్ఛ లేకుండు॥ ౧౬.
నీవు వృద్ధుడవు నీ వచనంబుల నీదు కాంత వినకుండు।
భావబంధమై బరగును నాకును బ్రహ్మచర్యమును వీడు॥ ౧౭.
ఇదివిని యాతం డీశుడు తానే యిలనందర పోషించు।
మదిలో సంశయ మొందకు మనుచును మాధవు గుడి కేతెంచు॥
కన్నెనిత్తునని బ్రహ్మచారికిని కరముల నుదకము విడిచెన్।
సన్నుతించుచును శ్రీకృష్ణునినటు సాక్షియుంచి యేతెంచెన్॥ ౧౯.
దేవున కిరువురు దండము బెట్టియు తెరువున హరిద్వారమును।
భావశుద్ధితో మూడు వారముల పరగ జేరి స్థానమును॥ ౨౦.
కళ్యాణుడు తన గృహము చనగ సతి కనికరమును బొందకను।
ప్రల్లదముగనసె భూరియాత్రలో ప్రాణంబుల విడిచినను॥ ౨౧.
సుకృత విశేషము చేరియుండుసుము సుష్ఠుగనిటు వచ్చుటయు।
వికృతంబగునని భార్య జెప్పగను విహితసుతుడు పిత గనియు॥ ౨౨.
దేశాంతరమున దేహము విడువక తిరిగివచ్చితేలయని।
ఆశాతురుడవు ద్విజుని బిలుచుకొని యక్కటివచ్చి తెంచుకని॥ ౨౩.
ఏకాంతమున కళ్యాణుడు సతితో నింపుగ వచనము జెప్పెన్।
సాకాంక్షను యీ బ్రహ్మచారియును సరసను సేవల సలిపెన్।
మధురాపురమున జ్వరంబుతోడను మహాబాధనే బొందన్।
అధిక యాదరణ నౌషధ పథ్యము లారునెలలు యింపొందన్॥ ౨౪.
గురుప్రయాసచే పరిపాలించిన పరోపకారమునకును।
హరిసన్నిధి నే జెప్పితి నతనికి నచ్యుతుండు సాక్షిగను॥ ౨౫.
కన్యాదానము నే నొనర్తునని కరమున జలము లిడితిని।
ధన్యోస్మియన నాదు ప్రతిజ్ఞను ధరపాలింపుమనగ విని॥ ౨౬.

భార్యయు బల్కెను రోషముతోడను బావిత్రోతు గూతురను।
ఆర్య సమ్మతిగ బ్రహ్మచారికిని నబలనియ్యనే ననెను॥ ౨౮.
మరియొక భార్యను గైకొని నీవును మరియొక పుత్రీని గనుము।
వెఱపక దానిని వడుగున కిచ్చియు వివాహామిలను జరపుము॥౨౯.
పతియటు బలికెను బ్రహ్మచారియును భగవంతుని దాసుండు।
హితముగ నతనికి కన్య నొసంగిన నీశుప్రీతియగుచుండు॥ ౩౦.
సమ్మతినొందని సతిమాటలదా సరగున వినె నావడుగు।
సొమ్మసిల్లి ద్విజు పుత్రు నడిగినను నూటిగ కాదని బలుకు॥ ౩౧.
మరుదినమున కళ్యాణుడు వటుడును మహిపతికడ కరుగుచును।
కర ముకుళితుడై సంగతి నంతయు కళ్యాణుడు జెప్పగను॥ ౩౨.
సంకల్పమునకు జేసిరి హానియు సతియును సుతులిరువురును।
వంకరగతి నే నందెద నరకము వారలు విననుండినను॥ ౩౩.
ఇందుకు మీరా యిద్దర బిలిచియు పొందుపరచమని పలుకన్।
సందియ మొందుచు నృపవరు డప్పుడు సాక్షిని దెమ్మనె యలుకన్॥
బ్రహ్మచారియును పలికెను నప్పుడు బ్రహ్మాండంబుల కెల్లన్।
బ్రహ్మభూతుడై బరగిన కృష్ణుని పాదసాక్షి యయ్యెడలన్॥ ౩౪.
వ్యత్యయ మించుక లేకయు నృపుడనె వచ్చి సాక్షికొలుకిటను।
సత్యమనుచు హరి జెప్పిన యెడలను సలిపెదను వివాహామును॥
సద్భావంబున బ్రహ్మచారియును సరగ వచ్చి మధురకును।
అద్భుతమగునటు యాశ్రీకృష్ణుని నటరమ్మనె సాక్షిగను॥ ౩౬.
దేవదేవ హరి దీనదయాళా నీవిపుడటు రాకున్నన్।
భావశుద్ధమగు బ్రహ్మచర్యమును భ్రష్టంబగునని యనినన్॥ ౩౭.
శుద్ధభావమును జూచి కృపాళుడు నూటిగ తానిట్లనియెన్।
పద్ధతి చొప్పున పాషాణంబును పరగ వచ్చు నెట్లనియెన్॥ ౩౯.
అవనీ సురవరు డప్పుడు బలికెను నరయ మాటలాడుగతి।
త్రివిక్రమా హరి, నడవగ వచ్చును, దీనరక్షకా సుమతి॥ ౪౦.

నీయాశ్రయమునె నమ్మి వచ్చితిని నిన్ను నిలిపి మదిలోను।
మాయా రహితుడ వెంటవచ్చి నా మహిత కోర్కె తీర్చుమను॥
సమ్మతించి శ్రీహరి యందులకనె చనుము తిరిగి చూడకను।
నెమ్మది మార్గము నడచిరి రేయిని నిలిచిరి హరిద్వారమును॥ ౪౨.
గమన వేళ కాళ్ళనూ పురములు ఘల్లుఘల్లనుచు మ్రోయఁగ।
విమలకాంతియును వర్తిల్లంగను వేంచేసిరి పురి డాయఁగ॥ ౪౩.
హరిద్వారమునకు నర్థకోసునను నాద్విజుడు వెనకం జూడఁగ।
గురుతుగ శ్రీహరి నిలిచె నచ్చటను కోరి విప్రుగని జూడఁగ॥ ౪౪.
మరలి చూచితివి ముందుగ రానిక మహీపతీ కడకును వెళ్ళి।
సరగున నిచటకి రమ్మని జెప్పుము చనుము నీవు విలసిల్లి॥ ౪౫.
మహీసురుండును మంచిది యనుచును మహీపతి కడకరిగియును।
సహాయుడై హరి సాక్షినిమిత్తము చనుదెంచెను నిదె యనెను॥
మధురవాసియగు మురరిపు డిచటికి మహిత కృపను నేతెంచెఁగ।
ఎదుర్కొనుటకును నాడంబరమున నేగవలయునని బిలిచెఁగ॥ ౪౬.
మేదినిపతి విని మోదముతోడను మిగుల నింత నొందుచును।
పాదుగ మంత్రులతోడ నచ్చటికి బహుముదమున వచ్చియును॥
జనార్ధనునకు దండము బెట్టియు చనువున బైరాగులను।
వినీతుడగుచును వేంచేసినయీ విగ్రహ మెచ్చటిద నెను॥ ౪౭.
మధురవాసియగు మాధవు డితడని మానుగ వారలు ననగఁగ।
విధితో నృపుడును ప్రజలను బిలిచియు వెలయు లగ్న మిడు డనగఁగ॥
నిజముపరచుకొని నాపురమందలి నిఖిల వర్తకుల బిలిచి।
సుజనుండగునా విప్రు కూతునకు శుభసామగ్రుల నుంచి॥ ౫౧.
పెండ్లికూతుగా చేయుండనుచును ప్రియ వచనంబుల జెప్పి।
పెండ్లికుమారుని ప్రక్కను నేనె పెంపొనర్తునని యొప్పి॥ ౫౨.
ఈపలుకుల విని వర్తకులందరు నెలమి పదార్థము లెల్లఁగ।
ప్రాపుగ జేర్చియు పెండ్లికూతునకు ప్రబల ధ్వని విలసిల్లఁగ॥ ౫౩.

శ్రీహరి సన్నిధి జేర్చి వరునితో జేసిరి వైవాహికము।
బాహుళ్యంబుగ పెండ్లి జరిపి యట భగవంతుం డుండెసుము॥ ౫४.
మధురను వేరొక మూర్తిని నిలిపిరి మాధవు సమ్మతితోడన్।
ప్రధాన భక్తుల దాసదాసుడగు బాలకృష్ణుడును జూడన్॥ ౫౫.

---

సూరదాసు చరిత్రము.

శ్రీకృష్ణుండును ద్వారకపురినా శ్రితులను పాలింపగను।
ప్రాకృతువలె నక్రూరుడు సత్య భామయింటి కేగగను॥ ౧.
వెళ్ళగ నామెయు విహిత పూజలను విధితోడను జేయుచును।
సల్లలితంబుగ చెప్పదొడంగెను సరస కృష్ణు చర్యలను॥ ౨.
తనయింటికి హరి రాకయుండునని త్తరబడుచుంచునను।
వనితలలో నే వ్యర్థురాలనను వాంఛను హరిరా డిటను॥ 3.
అనుచు జెప్పచును నచ్యుతు డిటకును ననువుగ వచ్చెడివిధము।
పనిబడిచేయుము పూజ్యుండవు హరి పదభక్తిని నీవుసుము॥ ४.
విరహతాపమును వనితకునుండగ వినీతుడై మనసునను।
హరియే తెంచుట కాలస్యంబని యమర యువతి *యసువులను॥ ౫.
బాపుకొనుటకై పరిధవిల్లునని పరగదాల్చె హరిరూపు।
ఏపుమీరగా నామె గృహమునకు నేతెంచిన యామాపు॥ ౬.
సాక్షాత్కృష్ణుడు చనుదెంచియునటు చక్కగ గని యక్రూరు।
ఆక్షేపించెను వేరొకరూపము నవని కొనుచు నిటజేరి॥ ౭.
ఒంటరిగా నిట్లుండుట బాడియె యొరులు మెత్తురే యిటను।
వెంట నంధుడై బుట్టుము నీవును వెలసి పుడమి ననగాను॥ ౮.
అతివినయంబున నక్రూరుడుశ్రీ హరికిని విన్నపమొదవు।
పతితపావనా పరమదయానిధి భావశుద్ధితో నుడువు॥ ౯.
భామ ప్రాణముల బ్రోచుటకొఱకై బట్టితి నీరూపమును।
సేమమరయనీ వఖిలమెరిగెదవు చిత్తములో నుండుచును॥ ౧౦.

---

*యసువులు - ప్రాణములు.

కృపతోఁ జూడుము శ్రీహరియనగను కృష్ణుండప్పుడనియెను।
నెపమగు నిదియును కలియుగ ప్రజలను నిలుప భక్తిలోపలను॥
అవతరింపుమని యాజ్ఞాపింపగ నామోదించెను నతడు।
భువి శ్రీకృష్ణుడు సత్యభామనటు పొందుగజూచుచు నాడు॥ ౧౨.
అంధురాలవై యవనిబుట్టినీ వతని నెదుర్కొను వేళ।
సంధించెదవటు నారూపంబున సంగమగుదు వయ్యెడలన్॥ ౧౩.
హరియానతిచే సూరదాసుడా యంశారూపంబునను।
నెటియంధుండై బుట్టెను వెనకను హరి పరతంత్రత ధరను॥ ౧౪.
జనన మొందితా శ్రీహరిభజనను సలుపుచుండు నను దినము।
ఘన కవిత్వముల కీర్తనజేయుచు కమలేశుని బాడుసును॥ ౧౫.
ప్రబంధములనిల జేసినాతడును పరంధాము హరిపైని।
నిబంధనంబుగ మధురకుబోవుచు నిలిచెను హరిసన్నిధిని॥ ౧౬.
నారాయణునకు నమస్కరించియు నమ్రత ముందుగనిలిచి।
కోరి భజించెను సూరదాసుడును గొబ్బున శ్రీహరిదలచి॥ ౧౭.
పూర్వభవంబున నపచారంబుల పూని చేయకుండగను।
ఘోర శాపమును నిచ్చితివిలపై కూర్మి బుట్టుమని నన్ను॥ ౧౮.
ఒక యపరాధము బృందావనమున నొగిచేసితి చూడగను।
అకలంకుడ నిను బిలుచుకొనుచు నే నటువచ్చు సమయమునను॥
యశోదతల్లియు గోపికామణులు నందరు నన్నుగనుచును।
ప్రశాంతిలేకను వియోగమగుతాపముచే మది కుందిరను॥ ౨౦.
వారలకోపమె వర్ధిల్లంబడి వ్యర్థజన్మ మెత్తితిని।
సారోదారుడ సత్యభామనిల కోరలేదు నామతిని॥ ౨౧.
వారిజనాభా యచ్యుతకృష్ణా వాసుదేవ హరియనుచు।
సూరదాసుడును చేసెను స్తోత్రము సూటిగ కృష్ణుని గనుచు॥ ౨౨.
కన్నీరొలుకగ గద్గదరవమున కమలేశుని భజియింపన్।
వెన్నుండప్పుడు వచ్చెను ముందర విలసిల్లగ గననొప్పన్॥ ౨౩.

సంకును చక్రము చేతుల దాల్చియు చతుర్భుజంబుల తోడన్।
పొంకంబుగ నా కౌస్తుభ మాలయు పూని కుండలములాడన్॥ ౨౪.
శ్యామల రూపము పీతాంబరమును సర్వాలంకృతి మెరయన్।
సోముని సూర్యుని దీప్తులకన్నను సొంపుప్రకాశత వెలయన్॥ ౨౫.
వనజనాభుడును వరములడుగుమని వాంఛతోడ జెప్పగను।
అనువుగ సూరుం డంధత్వమునె యడిగెను తా ముదమునను॥
పుట్టిన మొదలుగ బహిర్విషయముల పొందుగ జూడక యిపుడు।
దిట్టముగా నీదివ్య విగ్రహము దీప్తినిగంటిని వినుడు॥ ౨౭.
నాదుమనంబున నిలిపితి దీనిని నన్యపదార్థము లెవియు।
మేదిని నాకును మనసున కొప్పవు మేటికృపను గనుమనియు॥ ౨౮.
శ్రీహరియప్పుడు సూరదాసునిల చేసెను తొల్లింటివలెన్।
సాహసయుక్తుగ చేయగ నాతడు సరి నివాసమునకు వెళ్ళెన్॥ ౨౯.
అవంతియను నొక పెద్దపట్టణం బవనిపైని తగనుండెన్।
కువలయమున నొక పృథివీ పతియును కూరిమి నేలుచు నుండెన్॥
అతనివద్ద సంగీత పాటకులు నైదువంద లుండగను।
సతతము పాటల వారిలొ తానే సమర్థుడై యుండెమును॥ ౩౧.
గానవిద్యలో ఘననైపుణ్యము గలిగియుండె నాతనికి।
మానుగ దీపము మలిగిన యెడలను మరి వెలుగు పాట తరికి॥ ౩౨.
ధరణిపతియు నొక దివసమునందును తానుసేను బొగడుచును।
సురుచిరమగు నీసుందర గానపు సొంపువలెను లేదెటను॥ ౩౩.
తానుసేనుడనె నొకరికి నొక్కరు ధరనధికులు నుందురను।
మానుగ నెచటను విశేషప్రజ్ఞతో మననశీలు రుందురను॥ ౩౪.
విధాత యొకపరి గర్వము నొందగ విశ్వామిత్రుండను ఋషిచేన్।
విధితో శ్రీహరి వస్తుపూర్తినిటు విలసిల్లగ చేయించెన్॥ ౩౫.
తన గంభీరము దొడ్డదియనచును ధరను సముద్రుడు బలుకన్।
అనువుగ నదియును నగస్త్యముని చె నాచమింపబడె చులకన్॥ ౩౬.

నారదముని నే నేర్పరి యనగను నర్వేలు భల్లూకముచే।
వారక గర్వము భంగపరచెహరి వసుధను వింతగ వెలసె॥ ౩౭.
అంజని సుతుడును బలవంతుడనని యతిగర్వము నొందగను।
భంజింపంబడె భరతుని వలనను భగవచ్చరిత్ర మిదెయునను॥ ౩౮.
గానవిద్యలో ఘననైపుణ్యము గలిగిన పురుషుడు మధురన్।
మానుగ నిపు డక్రూరాంశుండై మహితు సూరదాసు ధరన్॥
విలసిల్లెడునని విన్నవింపగను వేగముతో నృపవరుడు।
పిలువనంపె తన గృహమున కాతని ప్రేమను జూపుచు నాడు॥ ౪౦.
అతిసన్మానము నాదరణంబును నతనికిఁజేసెను నృపుడు।
హితుడై బంగరు పీటనియ్యగా నెలమి నతడు గూర్చుండు॥ ౪౧.
పూజలు చేయగ పాటకులందరు పొందుగ సభలో నుండన్।
తేజస్వియగు తాను సేనుడును యోజనునటు కూర్చుండన్॥ ౪౨.
సూరదాస, నీ సుందరగానము గోరి జనులు వినుటకును।
తీరని ప్రీతిని పృథివీపతి నిను దెచ్చెననుచు బలుకగను॥ ౪౩.
విష్ణుదాసుడనె భువి హరి కీర్తన వెలయజేయ వచ్చితిని।
కృష్ణచర్యలను బాడెద నేనిటు క్రియతో విందురు గాని॥ ౪౪.
అనుచుబలికితా నైకొని వీణను నరసి స్వరము సరిపుచ్చెన్।
ఘనరాగముతో గానము చేయగ గజాననుడు వెనువచ్చెన్॥ ౪౫.
తాళము వేయగ సరస్వతియునటు తత్స్వరముల వీణియను।
బైలుపరుపగను భవ్యనాట్యమును బాగుజేసె కృష్ణుడును॥ ౪౬.
యోగులకందని శ్రియఃపతియునటు నొగియాడెను కీర్తనలో।
భోగశాయి కీర్తనమును సూరుడు పూనిబాడ మాసములో॥ ౪౭.
నారులు పురుషులు నేకమనస్కులై నరహరిని భజింపగను।
సారాంశంబగు గాననైపుణము జనపతి భార్యలు వినను॥ ౪౮.
అంధకుగాయకు నంతఃపురమున కడిగిరి నృపు దెమ్మనుచు।
సంధానం జే నటులొనర్తునని చయ్యన నృపుడు పలుకుచు॥ ౪౯

నాటకశాలకు వెంటబెట్టుకొని నయముగ వనితలతోడఁ।
కూటమిఁ జేసియు గానమువినుటకు గూర్చొను కూరిమితోడఁ॥
సతులందరునటు గూడియుండగా శాపోహత భామయును।
*వితతిని దాసీయగుచు నచ్చటను వినుచును నాగానమును॥ ౫౦.
దేహముమరచుచు స్థలమును జలమును దెలియక దా మెలగునెడ।
సాహసముగనా నూరదాసుడును సతినిజూచె కనుఁజాడ॥ ౫౨.
విషయదండమిటు నిండియున్నదని విఖ్యాతిగ జెప్పగను।
†సుషమగల సతులు నంధుడుగాడని చొచ్చిరి యంతఃపురమును॥
ఏకాంతముగని హరిశ్రీకృష్ణుం డిలనా సమయమునందు।
సాకాంక్షతచే వారలనిద్దర సరగ కలిపె తనయందు॥ ౫౪.
భక్తచరిత్రలె భవ్యంబగునని బాలకృష్ణుడిల నుండు।
సక్తిగ వారల చరణధూళియె శరణంబని గనుచుండు॥ ౫౫.

---

సే నా నా పి తు ని చ రి త్ర ము.

సేనయనుచు నొక నాపితుడుండెను క్షితి హిందుస్థానమున।
మానుగ నాతడు సంసారంబును మహినశ్వరపు తలపున॥ ౧.
హరిభక్తినిదా నవలంబించియు నారాధించును నెపుడు।
అరుదగు శ్రీహరి విగ్రహమొక్కటి యతి సుందరమున నుండు॥ ౨.
చతుర్భుజంబులు గల శ్రీహరికిని శరణుజొచ్చి తగ నతడు।
అతినేమంబున జేయుచునుండును నఖిలపూజలను గనుడు॥ 3
ప్రొద్దునలేచియు స్నానముజేయుచు పొందుగ హరిపూజించు।
పద్ధుగ బోవును పిదపను జీవన పద్ధతికొఱకై మనుచు॥ ౪
మంగలివృత్తియు బహునీచంబగు మహి సేవకు పనికంటెఁ।
అంగుగానియా గ్రామజోషిపని యల కంసలి పనికంటెఁ॥ ౫
గ్రామపు మాదిగ కటికవాడునా కసాయివాడును భువిని।
నేమముతోడను నిర్దయపరులై నెపుడుండుదురిలనుమని॥ ౬

---

*వితతి - సమూహము. †సుషమ - మిక్కిలి కాంతి.

ఇట్టి వృత్తులలో బుట్టినవారలు యెప్పుడు పాపరాసులను।
బట్టియునుందురు పరమ పురుషు హరి భజన బూన రీయెడను॥ ౭.
కుకర్మంబులను గైకొనునెడలను గోరివచ్చు పాపములు।
సుకరంబుగ నీ జాతులయందును సొరది నెగడు జన్మములు॥ ౮.
భగవద్భజనను సేయక యుండిన భవచక్రము తొలగదని।
సొగసుగ సేనానాపితుండు మది చొప్పున యోచించుకొని॥ ౯.
శ్రీభగవంతుని శరణొందుటచే చెల్లిపోయె దోషములు।
ప్రాభవముగ జలధార నీరును భాగీరథి బడునటులు॥ ౧౦.
ఒకదివసంబున సేననాపితుని నుర్వీనాథుండటను।
నికాయమునకును బిలువంబంపెను యొక చారునితో తగను॥ ౧౧.
సేననాపితుడు సుఖభూతుండై శ్రీహరి పూజల నుండఁగ।
మానుగ నాతని భార్యయు నప్పుడు మనుజుల రాకను చూడఁగ॥
ఇంట సేననాపితుడు లేడనుచు నేర్పడ నటు జెప్పగను।
బంటును తిరిగియు బోయిరాజుతో బలికెను యీ కులుకులను॥ ౧౩.
మరియొక మనుజుని నప్పుడె బంపెను మహీపతీ యతని బిలువను।
వెఱవక నాపితు డింటను లేడని విన్నవించె భార్యయును॥ ౧౪.
మరియునిద్దరను మేదినిపతి యటు మహి నాపితు దెమ్మనియు।
గుఱితో బంపగ గృహమున లేడని గురుతుగ జెప్పెను సతియు॥
ఆసమయంబున నిరుగు పొరుగులను నచటనుండు వారలును।
వాసిగ నృపుకడ కేగియు బల్కిరి వసనకు డింట నుండుచును॥ ౧౬.
వెన్నుని పూజను చేయుననంగను విపుల క్రోధముతోడఁగ।
క్రన్నన యవనుల బిలిచి బలికె నృపు కడుకోపముతో నాడఁగ॥ ౧౭.
కాళ్ళు చేతులను బిగ్గర గట్టియు కడులోతగు నదిలోను।
వీలుగ ద్రోచియు వేగమెరమ్మని విధిగ చెప్పె వాంద్రకును॥ ౧౮.
భక్తుని తొందర బెట్టం దలపగ భగవంతుడు తానపుడు।
సక్తిగ సేనా నాపితు రూపున చనియెను నృపుకడ కపుడు॥ ౧౯.

సాగర శయనుండగు హరియిదుకొనె చంకను క్షౌరపు పొదియు।
భాగుగ ఖగవాహనుడై యుండియు పాదచారిగ నగుటయు॥ ౨౦.
దేవతుల ఋషుల ధ్యానము నందును ధ్యేయ భూతుడగు వాడు।
భావమునందున వేదంబులచే పరిశోధించబడు వాడు॥ ౨౧.
సర్వోన్నతుడగు శ్రీహరి సేనా, క్షౌరకు రూపముతోడన్।
ఉర్వీ నాథుని ముందర తానపు డుచితంబుగ రాజూర్డన్॥ ౨౨.
శాంతిని నరపతి క్షౌరకు వద్దను శ్మశ్రు కర్మ జేసికొను।
కాంతి గలుగునటు శ్రీహరి జేయగ కరుణ నృపతి గాంచుచును॥
మంగలి పనిలో చతురుడ నీవును మహినా వద్దనె యెపుడు।
సంగమంబుతో నుండవలయునని చనువున బలికెను నతడు॥ ౨౪.
భగవంతుండనె బ్రహ్మాండంబున బహుతర వ్యాప్తిని నేను।
వెగటుగ నొకడనె నిండియుండుదును వెలినిలోన యెల్లెడను॥
పోకడ రాకడ బోరయవు నాకును భువిలో భక్తుల కొఱకు।
సాకారంబును ధారణ జేయుదు తత్కైక రూపులు పెక్కు॥ ౨౬.
ఐనప్పటికిని వదల నెపుడు నా దవ్యక్తంబును నేను।
మానుగ నీవిధ మీశుడు జెప్పగ మహిపతికిని దెలియకను॥ ౨౭.
అభ్యంజనమునకును తైలంబును నవనీపతి దెప్పించెన్।
సభ్యుల ముందర స్వర్ణపు గిన్నెను చక్కని తైలము నుంచెన్॥
స్వర్ణ పీఠమున రాజ ముఖ్యుడును సరసముగా నుండగను।
నిర్ణయముగ శ్రీహరియు తైలమును నిలిచి శిరము నంటగను॥ ౨౯.
తైలపాత్రమున దృష్టుల నుంచెను ధరణీ నాథుండపుడు।
వాలుగ శ్రీహరి రూపమునందున వసుధపతియు గని యపుడు॥ ౩౦.
కటక కిరీటము కేయూరముతో కంకణ యుక్తము గాను।
పటుతరముగ తగు పీతాంబరమును భవ్య స్వరూపముతోను॥ ౩౧.
ప్రతిబింబంబున నృపవరు జూడగ ప్రబల వింత నొందుచును।
సతతము దానిం జూచుచు తిరిగియు సరగున తను జూచుచును॥

తిరిగియు తానటు గిన్నెను చూడగ దివ్య రూపు కనిపించెఁ।
మరగెను నరపతి మనసున శ్రీహరి మానితరూపు వహించెఁ॥ ౩౩.
చూడచూడగను సకలము మరచెను చొప్పెరుగక నట నృపుడు।
తోడనె జనములు పృథివినాథునకు మూడె వెఱ్ఱియని రపుడు॥
సభజను లటుగని నవ్వెరి నృపుడును చనెను మనోమార్గ మని।
విభజన లేకిటు పల్కుచు నుండగ వెఱచి కొందరట్లుగని॥ ౩౫.
యామద్వయమటు కాగా రాజుని నల జనులును లెమ్మనగఁ।
క్షేమసమాధిని విడిచియు లేచెను క్షితిపతి యందరు గనగఁ॥
సేనాపితునకు వరహాలిచ్చియు క్షణమిచ్చట నుండుమని।
మానుగ నరపతి వెళ్ళి స్నానమును మంగళముగ చేయగని॥ ౩౭.
శ్రీహరి వెళ్ళియు సేన యింటిలో జేర్చెను కత్తులపొదిని।
మోహము గలుగగ నడ్డగోడపై మొత్త రూకలుంచి చనె॥ ౩౮.
క్షితిపతి యచ్చట స్నానము జేసియు సేనను బిలిచెను త్వరను।
మితిమించిన వ్యామోహము చేతను మెలగివిడిచె భుక్తమును॥
ప్రాణము తల్లడ బడగ సేవకులు బరతెంచిరి యతనికడఁ।
మానుగ సేనయు మేదినిపతిగన మలయుచు వచ్చెను తోడఁ॥౪౦.
భయకంపంబున మంగలి పొదితో భక్తుం డచటికి రాగఁ।
నయమున నృపుడును లేచియు పలికెను నాకుమునుపునిట వెలిగఁ॥
దరిశింపించిన తేజోరూపము దయతోడను జూపుమిటఁ।
తిరిగియు పాత్రను తైలము తోడను దెచ్చియుంచె తానచటఁ॥
సభలోనందరు జూచి నవ్వగను సాగిల మ్రొక్కెను నృపుడు।
ప్రభావమేమని గాంచుచు నుండెను పరగగ సేనాపితుడు॥ ౪౩.
అతివిస్మితుడై యుండగ నప్పుడు నాతని ప్రతిబింబమును।
క్షితిపతిగిన్నెను చూచియు మునుపటి చిద్రూపము గానకను॥
అతిఖిన్నుండై యేడ్వ దొడంగెను నవనీపతి యప్పుడును।
హితులై కొందరు దెలియ బలుకగా నీ మంగలి భక్తుడును॥ ౪౫.

అర్తితోడనపు డచ్యుతు దలచుచు ననువుగ గన్నీరొలుకు।
కీర్తన జేసెను కరుణానిధియని క్రియతో శ్రీహరి కొలుకు॥ ౪౬.
పతితపావనా పండరిపతినీ పారమెవరు నెరుగరిల।
హితమును జూచుచు నీచకార్యముల నెలమినలిపి తీయెడల॥ ౪౭
శ్యామసుందరా సారసాక్షుడా సాధుల పోషక నీవు।
నేమము తోడను నాకుదర్శనము నిగుడి యిచ్చియిల బ్రోవు॥ ౪౮.
వేమరు జెప్పుచు విశ్వాసముతో విలపించెను సేనయును।
ప్రేమతోడ పృథ్వీపతి యప్పుడు ప్రియతర మోదంబునను॥ ౪౯.
నీదుసంగమున నిరుపమ సుఖమును నేనొందితినని యటను।
పాదుగనాతని పదము బట్టుకొని భక్తిచేసె హితముగను॥ ౫౦.
సాధుసంగమున శ్రీకృష్ణునినె చక్కగ జూచితిననుచు।
మాధవు నెప్పుడు మనమున దలచుచు మానవ నాథుడు నిలుచు॥
సేననాపితుడు నింటికి వెళ్ళియు శ్రీహరి యిడు వరహాలన్।
పూని విప్రులకు పంచి పెట్టెమును ప్రియమొందుచు విలసిల్లన్॥
కథాసారమును గలిగిన భక్తుల కథలను నిటువర్ణింపన్।
విధేయు డగుచును బాలకృష్ణుడును విన్నపించు తానొప్పన్॥ ౫౩.

## సాత్వికరాజు చరిత్రము.

జగన్నాథమున క్షితిపతి యొక్కడు సాత్వికుండని యుండెన్।
మిగుల ధర్మమున ప్రజాపాలనము మేదినిచేయుచు నుండెన్॥
అచ్చటి క్షేత్రము కలివైకుంఠం బందురు పెద్దలు భువిని।
సచ్చరిత్రులగు నచ్చటి రాజుల సాత్వికులందు రవని॥
శ్రీహరి యచ్చటి క్షేత్రము నందును చెన్ను మీఱ వసియించు।
సాహసంబుతో కృపావీక్షణము సలుపుచు నెప్పుడు మించు॥
త్రికాల పూజల ధరణీ నాథుడు దేవుని సన్నిధిలోను।
వికాసమగునటు వచ్చి తీర్థమును విమల ప్రసాదము గొనును॥

పిదప నింటిలో భక్షణ జేయును, పెంపుగ భూషణములను।
కుదురుగ శ్రీహరి కర్పణ చేయును గొప్పగ వస్త్రంబులను॥ ౫.
అనుదినమును తా నుంచును ప్రీతిగ నమిత నివేదనములను।
వినమితు డగుచును నుంచు సేవకుల విష్ణు ప్రీతిగా నటను॥ ౬.
ఈవిధముండగ నొకయెడ నిలపతి యేగెను హరిగుడి కడకు।
బావశుద్ధితో బసచేసియుదా పరగ ప్రొద్దు బుచ్చుటకు॥ ౭.
జూదమాడుచును తన్నిష్టుండై నూటిగ నట నుండగను।
పాదుగ పరిచారకులు ప్రసాదము బంచుచుండ నృపతీడును॥ ౮.
ఎడమ చేతితో ప్రసాదమును తా నేపున గొన బోవగను।
కడగియు పరిచారకు డొసంగకను కడుపడి దా వెళ్ళగను॥ ౯.
ఆటయు ముగిసిన పిమ్మట నరపతి యచటిజనుల జూచుచును।
పాటవముగ హరి ప్రసాదమెచటని పదపడి యతడడుగగను॥ ౧౦.
వారలుజెప్పిరి వామహస్తమున వరుసను గైకొనబోవన్।
కూరిమితో పరిచారకు లియ్యక కొనిపోయిరి తమత్రోవన్॥ ౧౧.
అనుతాపముతో నృపతియు వచించె నతివిపరీత మిదియునని।
చనువుగానియీ జూదకర్మమును సలిపితినిట నెందుకని॥ ౧౨.
వెలగల యమృతము మానుకొనుచునే విఱివిగ కలుద్రాగుగతి।
అలయక నిచ్చట హరిసన్నిధిలో నమరియుండ దగదూమతి॥ ౧౩.
పన్నుగ వెలపల వచ్చుచు నప్పుడు ప్రధానునిం బిలిచెనటన్।
మన్నన తోడను మాటను జెప్పెను మసలుచు నా పడకింటన్॥ ౧౪.
పానుపు పైనే పరుండి యుండగ ప్రబల పిశాచము వచ్చున్।
మానుగ దినము గవాక్షద్వారమున మహిత కరము కనిపించున్॥
ఈరేయిని నీ వచటకి వచ్చియు నెలమి దాని హస్తమును।
మారాడక నటు ఛేదన చేయుము మరువకు నుని జెప్పుచును॥ ౧౬.
క్షితినాథుండును వచ్చి యింటిలో చెందిన యను తాపమున।
వితతంబుగ నీ యపరాధంబును వెలయు చేతులకు గాన॥ ౧౭.

శీతార్తాంబని రేయిని శయనము చేయువేళ మంత్రియును।
దీక్షను పిశాచ బాధ తొలగునటు ధీరుడగుచు వచ్చుచును॥ ౧౮.
జాము రాత్రినటు చీకటింటిలో *జాలమందు మంత్రిగన।
సేమం బరయక క్షితినాథుండును చెయినిద్రిప్పె నటుగాన॥ ౧౯.
హస్తము నఱకెను పిశాచకరమని యరయక మంత్రియు నపుడు।
అస్తిమాంసమగు హస్తను బడగా నదరి దివ్వెగొని యతడు॥ ౨౦.
చూడగ నదియును క్షితిపతి కరమై జూపట్టగ తా నపుడు।
తోడనె పుడమిని బడుచు నేడ్చుచును దుఃఖముతో దానుండు॥
అవనీ పతియటు వచ్చియు హస్తం బపచారము చేసెనని।
వివరంబగునటు ఖండింపించితి వికలమొంద కీవునని॥ ౨౨.
సేవకు నొక్కని దగ్గర బిలిచియు చెప్పెను వానికి నటను।
భావబంధములు లేని హస్తమును పల్లకిలో నుంచుచును॥ ౨౩.
జగన్నాథు సన్నిధిలో నునిచియు సలుపుము దీనుని మనివి।
ప్రగల్భముగ నిది పెద్ద తప్పితము పాదుగ జేసెను తనివి॥ ౨౪.
దుష్కృతిచేతను తీర్థ ప్రసాదము ద్యూతమాడుచును మరిచె।
ధర్మము చేయక దురాచారముల దగిలియుండి తగ విడిచె॥ ౨౫.
భగవదర్చనము చేయంజాలక భక్తుల సేవను గనియు।
పొగురును గలిగిన కరముల నీకును పొసగబంపితిని యనియు॥
సేవకుడాజ్ఞను శిరసావహించి చేకొని వచ్చెను కరముం।
దేవాలయమున దెచ్చియుంచి మరి దెలియబలికె నచటనుముం॥
అచ్చట వైష్ణవు లతిమోదముతో హాహాకారము తోను।
మెచ్చిరి రాజును సాహసమునకును మిగుల మాన్యతను గనెను॥
జగన్నాథు శ్రీసన్నిధి ముందర జయజయ యని జెప్పుచును।
పొగడుచు శ్రీహరి ప్రార్థనజేయగ పుష్పాల పుటికెలవలెను॥ ౨౯.
దవనమైవెలసెను హరి ప్రసాదము తద్దినమున నర్చకులు।
భువిపతి కియ్యగ భావించెను తన పూర్వహస్త మున్నటులు॥ ౩౦.

* జాలము - కిటికి.

ప్రసాద మునకును చేతినిజాపగ బరువడికరములు రాగా।
ఆసమానంబగు దీనింగాంచుచు హరిగొనియాడిరి బాగా॥ ౩౧.
శ్రీహరి భక్తుల కధవిన చెవికిని చెలగిపండుగై యుండు।
బాహుళ్యప్రియ భక్తుల దాసుడు బాలకృష్ణుడిల నుండు॥ ౩౨.

---

## కర్మాబాయి చరిత్రము.

హరిక్షేత్రమగు జగన్నాధమని యవని బ్రసిద్ధత నొందు।
గురుతుగ భక్తులు కూడి యుందురటు కూర్మి యొకతె యింపొందు॥
కర్మబాయియను కాంతయు నచ్చట గర్భము దాల్చియు నుండన్।
కర్మవశంబున పెనిమిటి చావగ ఘనక్లేశంబును గూడన్॥ ౨.
తొమ్మిది నెలలును తొలగినపిమ్మట నెమ్మది గనె బాలకుని।
సమ్మతితోడను జగన్నాధ ప్రభు సంరక్షణ చేయగని॥ ౩.
షోడశ వయసున చిన్న వానికిని సుఖముగ పెండ్లిని జేసెన్।
కోడలు గర్భముతోడ నుండగను కొడుకును కాలము జేసెన్॥ ౪.
మనసున దుఃఖము మిగుల నొందగను మనుమని గనె కోడలును।
జనన మొందగా శిశువుని పాలన జరుపుచుండె బాగుగను॥ ౫.
కొంతకాలమిటు గడచిన పిదపను కొమరుడు కాలవశమునన్।
అంతము నొందగ నవ్వాయనందుల కతివ్యాకుల చిత్తమునన్॥ ౬.
కడుదుఃఖముచే కర్మాబాయియు కాలముదాగడుపుచును।
విడువక నెప్పుడు ప్రార్థించును హరి వీఠలరంగ యనుచును॥ ౭.
బహుదుఃఖంబగు భవసాగరమున బడితిని రక్షింప తగన్।
సహనముతో హరి చింతనసేయగ సాధులు కొందరు రాగన్॥ ౮.
వచ్చినవారికి విడిదినిచ్చెనటు వందనమిడి వాండ్రకును।
మచ్చిక తోడను మంచి మాటలను మానినిగని వారలును॥ ౯.
ఆననమందున నతిఖిన్నత్వము నచ్చిన దెందుల కనగన్।
దీనత్వముచే విన్నపించె తన దిగులంతయు బాయంగన్॥ ౧౦.

సాధువు లందరు జెప్పదొడంగిరి సంసారంబీ యిలలో।
మాధవుసాక్షిగ మిథ్య యటంచును మహిత దుఃఖమీధరలో॥ ౧౧.
భేరీవాద్యము పైనిపరుండిన పెను నిద్రయు రాదుగదా।
వారి దొరుకునే తృష్ణార్తునకట వరసను మృగతృష్ణనుదా॥ ౧౨.
అటువలె నీవును త్వరితంబుగనే యతిజాగ్రత్తను బొందు।
పటుతర మాయాభ్రమమును ద్రోచియు పాదుగ హరిపదమొందు॥
శ్రీహరిప్రాప్తికి సాధులసేవయె క్షేమపు మార్గంబగును।
మోహ మమతలను మానియు వారలు ముకుందునిం గొల్చుచును॥
శాంతీ దాంతులను చేకొని యుందురు సర్వేశ్వరు నుతించుచును।
కాంతితోడనిటు చరించుచుందురు కలిహరమును జేయుచును॥ ౧౪.
అనుదినమును నీవట్టి వారలను నార్తితోడ గాంచుచును।
వినుతుల జేయుచు వారల కన్నము విపులప్రీతి బెట్టుచును॥ ౧౬.
వస్త్రము లిచ్చుచు విహిత సేవలను వంచింపక జేసినను।
శస్త్రము చేకొని శ్రీహరియును కలుషమ్ములదగ కోయునను ౧౭.
చిత్తమునందలి చింతయు దీరును శ్రీహరి దయచే ననుచు।
ఉత్తమ సాధువు లిచ్చిరి విగ్రహ ముచిత పూజ సలుపనుచు॥ ౧౮
కోమల కృష్ణుని గోపాలుని మది కోరియు భజింపు మిపుడు।
క్షేమంబగునని సాధువులందరు జెప్పియు వెళ్ళిరి యపుడు॥ ౧౯.
పిదపను కర్మాబాయి మూర్తికిని పెంపున పూజల సలుపు।
మదిలో క్లేశము నొందక నెప్పుడు మాధవు సేవల నొప్పు॥ ౨౦.
పిల్లలతోడను నాడు పద్ధతిని ప్రియమున కర్మాబాయి।
ఉల్లమలరగను విగ్రహంబుతో నొప్పగ నాడును హాయి॥ ౨౧.
ఇతరులు జూచిన నపుడె దృష్టిని నేర్పడ జుట్టియు వేయు।
ప్రతిమెను గొని తన కాళ్ళపైని యటు బాగుగ నిడికొని మరియు॥
ఒళ్లుతోమిమరి వేడి నీళ్ళతో నుచిత స్నాన మొనర్చు।
తెల్లని వస్త్రము బాగుగ గట్టియు మెల్లగ నిద్రింపించు॥ ౨౩.

వ్యామోహముచే భూషణాదులను వరుస బెట్టి మరియును।
క్షేమంబలరగ చిన్న గిన్నెలో జేర్చును దధ్యన్నమును॥ ౨౪.
ముందుగ నుంచియు ముదమున జెప్పును ముద్దుకృష్ణ నాయన్న।
తొందర బొందక తినుతిను వేగమే దొలగు నాకలియు నెన్న॥ ౨౫.
కృష్ణ కృపాళో గోకులవాసా కృపాసముద్ర రమేశ।
ఉష్ణాన్నంబును నీవు భుజింపుము యుదధిశయన విశ్వేశ॥ ౨౬.
శుద్ధభావమును జూచుచు శ్రీహరి సొంపుతోడ తా దినును।
శ్రద్ధను దినమును కృష్ణమూర్తికిని చక్క బెట్టు నన్నమును॥ ౨౭.
అనేక దినంబు లిటులం జరగగ నగ్ని హోత్రులగు ద్విజులు।
అనువగు క్షేత్రము జగన్నాధమున కరుగు దెంచిరా ఘనులు॥
కర్మాబాయియా గృహమున కరుగగ కడుమన్నన జేయుచును।
నిర్మల మనసున వారలుండుటకు నెనరున నిచ్చె గృహమును॥ ౨౯.
ప్రొద్దున నామెయు లేచిన తోడనె పొందుగ హరి కన్నమిడన్।
పద్ధుగ బ్రాహ్మణు లిటగని పలికిరి భగవత్ పూజయు జూడన్॥ 3౦.
స్నానము చేసియే చేయందగునని చనువున నన నామెయును।
మానని భయమును మనసున బొందుచు మరుదినమున లేచుచును॥
ఇల్లును వాకిలి చక్కగ నలికియు నెలమి దెచ్చె నుదకమును।
సల్లలితంబుగ స్నానము జేసియు స్వయంపాక మొనరగను॥ 3౨.
పనిముట్టులదా జేయుచు నుండగ బహు ప్రొద్దయ్యెను నాడు।
అనువుగ హరియును క్షుధ జెందుచు మరి యర్చకుతో ననుచుండు॥
కర్మబాయికి కొందరు విప్రులు కర్మనిష్ఠు లరుదెంచి।
నిర్మల మనసున వికల్ప బుద్ధుల నెతీజేసిరి మదినెంచి॥ 3౪.
స్నానపువిధులను జెప్పుట చేతను సకల పనుల జేయుటలో।
బూనియుండగను ప్రొద్దయ్యెను నటు పొందగు నైవేద్యములో॥
కావున నీవును కర్మాబాయితో కర్మాతీతుడ నే ననుచు।
భావశుద్ధిగల భక్తి యొక్కటియె పనిబడి నాకును నిలుచు॥ 3౬.

అనుచు నామెతో నెరుగ బలుకుమని యాజ్ఞ నొసగగా నతడు।
వినుతుల జేయుచు కర్మబాయ్ గృహము వేంచేసియు దానెగడు।
శ్రీహరి పలుకుల దెలుప, కర్మబాయ్ చెలగుచు నైవేద్యమును।
ఊహను నందరు జూచుచునుండగ నుంచె హరి సముఖమునను॥.
హరిపరాత్పరుం డప్పుడు తానె యందరుగన భక్షించెన్।
గురుతుగ భక్తుల జయశబ్దంబులు కొనియాడంబడి మించెన్॥ ౩౯.
భక్తి మహిమలకు పారము లేదని బడిరి యామె పాదముల।
సక్తిగ నందరు నామె జేయువిధి సలుపుచుందు రియ్యెడల॥ ౪౦.
హరిదాసుల శ్రీ యమృత చరణములు యాత్తరతికం బనుచు।
భరమున నుంచెడి వారికి దాసుడు బాలకృష్ణుడును మనుచు॥ ౪౧.

---

జనజసావంతుని చరిత్రము.

సాహుకార్లలో శ్రేష్ఠతముండగు జనజా సావంతుడనన్।
బాహుళ్యంబగు ధనవంతుండై పంచ సుతుల తాను గనన్॥ ౧.
సాదు పూజలను సలుపుచు నెప్పుడు చక్క దలచు శ్రీరామున్।
పేద భృత్యువలె భక్తుల పదముల ప్రియమున దా బట్టునుమున్॥
సంతోషముతో నన్నము బెట్టును షడ్రస యుక్తముగాను।
వింతయనగ నిద్రాలస్యాదుల విలసిల్లక హరిగనును॥ ౩.
సకల యాచకుల సుఖింప జేయుచు సాధుల కృప బొందుచును।
అకలంకంబగు ధర్మ వాసనను నతడు గలిగి యుండగను॥ ౪.
పుత్రులు పెద్దగ బెరిగిరి వారును పూర్తిగ దుష్టులు నగుచు।
శత్రు బుద్ధినిం జేసియు తండ్రిపై సకల ధనము విడుననుచు॥ ౫.
పౌలస్త్యుండగు రావణాసురుడు పదపడి పుట్టిన క్రియను।
మేలగు చంద్రుని వంశము లోపల మెలగు సుయోధను క్రియను॥
బుట్టి పాపులై పూర్ణ ఖలులునై పుత్రులు నిందితులగుటన్।
దట్టముగా తమ తండ్రి ధనంబుల ధర్మమందు నెలవిడుటన్॥ ౬

పతితదృష్టిచే పిచ్చిబట్టెనని పరియాలోచన తోను।
చతురత వారలు దొంగిలి ధనమును సరిజేర్చిరి కొంతయును॥ ౮.
ఈవిధంబుగా నుండ నరపతిని సేవున గని పుత్రులును।
సావధానముగ వినుము నృపాలా చక్కగ బలికెద మిటను॥ ౯.
మాకు తండ్రియౌ జనజ సవంతుడు మహి ధనంబు నంతయును।
ఆకలి నొందిన యతిథి సాధులకు నతడు వ్రయము సేసెదును॥
మా యధీనమున నాధనముండిన మహినీకక్కర కగును।
బాయక నాతని బంధించియు మరి ప్రాణ హాని జేయుమను॥ ౧౧.
దేవర యీపని తప్పక జేసిన తేట ధనము చేకూరు।
భావహీనులై విన్నపింపగను ప్రభువు ధనము రాగోరు॥ ౧౨.
నీచసంగమము దుష్ట రాజునకు నెంతే ధైర్యము కలిగించు।
ప్రాచుర్యంబుగ నృపుడును భృత్యుల బంపెను మేలని గనుచు॥౧౩.
సాహుకారి చేబట్టియు నిటకును సరగున తెమ్మనగాను।
బాహుళ్యంబగు వేగము నాతని భటులు దెచ్చి రయ్యెడను॥ ౧౪.
అవివేకుండగు నవనీ పతియును నధముండగు మంత్రియును।
నివసితులగు నా యూర నుండుటయు *సవతుగాదు భువిలోను॥
సాహుకారినిం జూచుచు నృపుడును సరగున బల్కెను నపుడు।
ఊహను ద్రవ్యము పుత్రుల కందర కొప్పింపక నీ వీపుడు॥ ౧౬.
యాచక జనులకు నిచ్చివేయుటయు ననుచిత మగుగద నీకు।
పూచెడు కాచెడు నుత్తమ ధనమును పూని వెట్టిపై వెక్కు॥౧౭.
సెలవుల జేయుచు సుతులకు శూన్యము సేయుట యుక్తమె నీకు।
కలిమిని ప్రజలకు కొల్లబెట్టుటయు కార్యము గాదని పలుకు॥ ౧౮.
సాహుకారియును క్షితిపతి గన్గొని సర్వ ద్రవ్యమిట నాకు।
బాహుళ్యంబగు యత్నలబ్ధమై బరగ వచ్చె నీవరకు॥ ౧౯.
సాదు జనులకును సెలవు జేసెదను సాఫల్యము గనుటకును।
పాదుగ నిదివిని నృపుడు క్రుద్ధుడై పరగనడిగె పుత్రులను॥ ౨౦.

*సవతు - తరహా.

దురుత్తరము మీ తండ్రియు నాతో దురుసుగ జెప్పెను నిపుడు।
మరుమాటాడక మీసమ్మతమున మహిశిక్షకు పాత్రుండు॥ ౨౧.
ఈవచనమువిని వణిజుని పుత్రులు నేకీభావము తోడన్।
భావహీనులై తండ్రికాడనుచు బల్కిరటను నృపుతోడన్॥ ౨౨.
పగవాడీతడు శిక్షార్హుండగు జగతిలోన మాకనుచు।
మిగులను కాళ్ళను త్రాళ్ళ గట్టియును మేటికోలను ద్రోయించు॥
రాజునాజ్ఞగొని బంటులు త్రాళ్ళను రంజిల్లగ గట్టుచును।
ఓజనుదెచ్చిరి తటాక మునకును నుర్వీపతి చూడగను॥ ౨౪.
ప్రబలంబగు నొక బండను నతనిని బంధించియు నటుపిదపన్।
*అబంధరంబున లోతునీళ్ళలో నచ్చటి వణిజుని జొనుపన్॥ ౨౫.
భక్తుని తాపము పరిహరించునా భగవంతుడు రాముండు।
సక్తచిత్తుడై కూర్మరూపమున సరగవీపుపై నపుడు॥ ౨౬.
ఉంచియు భక్తుని యుదకము నుండియు నుద్ధరించి తగనుండన్।
అంచిత గుణుడగు సాహుకారియును నరపతిగని యనుచుండన్॥
శశికిని రవికిని దీప్తిని యిచ్చిన సర్వేశ్వరుడగు హరియు।
విశదంబుగనను సంరక్షింపను వేగమె వచ్చెను మరియు॥ ౨౮.
రాతిని నాతిగ ఖ్యాతిగ జేసిన రామచంద్రు డిచ్చోటన్।
ప్రీతిగ తానొక ప్రబల కూర్మమై పెంపుగ ననుబ్రోచెనిటన్॥ ౨౯.
చూడుము రాజా శ్రీహరి కరుణకు నీడెదియని జెప్పగను।
తోడనె నృపుడును జూచుచు నాతని వేడుకనటు బోవుచును॥ ౩౦.
ఓడనెక్కుకొని వచ్చియు భక్తుని నొసగవిప్పె కట్టులను।
వీడక నాతని దెచ్చి గట్టునకు వెలయగ దండమిడుచును॥ ౩౧.
అపరాధంబును క్షమియింపుమనుచు నతిప్రీతిని వేడుకొని।
కుపుత్రులగు నా వణిజుని కొమరుల కొమరొప్పగ బిలువుమని॥ ౩౨.
తగ దండించియు తప్పకజేసెను తండ్రికాళ్ళబడు నటుల।
భగవంతుని కృపవలనను పుత్రులు భక్తినొంది రయ్యెడల॥ ౩౩.

*ఆబంధరము – క్రమభంగము.

దేవుడు తండ్రియె యనుచు దలచుచును ధీరభావనయు గలిగి।
భావంబున శ్రీరామ చంద్రు హరి భక్తిని బొందిరి మెలగి॥ ౩౪.
భక్తాధీనత బరగిన రాముని భక్తుల చరితల నెల్లన్।
భక్తితోడ తా బల్కుచు నుండును బాలకృష్ణ దాసుడిలన్॥ ౩౫.

---

## సూరమను మోహాను చరిత్రము.

అకుబరు పేరను నవింధ్య నరపతి హస్తిపురంబున నుండెన్।
సుకముగ నతనికి సేవకవృత్తిని సూర్ మను మోహాను డుండెన్॥
మధురా పురమున కధికారిగ నా మహీపాలుడును జేసెన్।
విధితో నచటికి వెళ్ళి సూరుడును విహిత ప్రభువై వెలసెన్॥ ౨.
గోకుల మధురయు బృందావనమును గోవర్ధనముల యందు।
ప్రాకటముగ హరి బుట్టియు పెరిగిన ప్రబల స్థలముల సందు॥ ౩.
సాదుల గుంపులు చేరి యచ్చటను సదా వసింపగ మున్ను।
మేదినిలో నవి పుణ్యభూములై మెలగియుండు నెప్పుడును॥ ౪.
భూషణ వస్త్రముల్ బిడ్డలకిడినను బొందు ముదము తల్లియును।
శేషభూతులకు వైష్ణవసేవను శ్రీహరి గాంచు ముదమును॥ ౫.
సూరదాసుడీ సాధుల గన్గొని పేరిమితో సేవించెన్।
మీరిన భక్తిని మృష్టాన్నంబును మేలుగ నిచ్చుచు నిలిచెన్॥ ౬.
సంపద యంతయు సత్పాత్రంబున సద్వినియోగమగుటచే।
పెంపుగ శ్రీహరి బొందెను తృప్తిని తెంపున నెది గోరమిచే॥ ౭.
తనసొమ్మంతయు తదియారాధన తత్పరతను సెలవయ్యెన్।
వెనక తదీయుల కన్నంబిడుటకు విపుల ధనము లేదయ్యెన్। ౮.
అనుతపించుచును రాజ బొక్కసము నతనివద్ద నుండంగన్।
మనసున దలచెను సాదులకొఱకును మహి వినియోగింపదగన్॥
నరపతి క్రుద్ధత నను జంపిన యెడ నెఱి కృతార్థు నగుదునని
వెఱవక రాజ ద్రవ్యము చేతను వేగమె భక్తులను గని॥ ౧౦.

బహుభంగులతా పక్వాన్నంబుల బాగుగనిడి పూజించుచు౯।
విహరించుటకై యున్నత శాలల విపులంబుగ జేయించుచు౯॥ ౧౧.
క్షేత్రవాసులగు సాధులకెల్లను చేలంబుల నిచ్చుచును।
పాత్రలనిచ్చుచు పాన్పులనిడుచును భక్తిని దా నెలుపుచును॥
రాజుది యెనుబది రెండులక్షలకు రజితద్రవ్యము సెలవయ్యె౯।
ఓజ నొసగగా రాజునకిదియును నొకనిచేత వెలియయ్యె౯॥ ౧౩.
హస్తిపురంబున నకుబరువద్దికి నాతడు తగ వెళ్ళుచును।
విస్తారంబగు వ్యర్థపు ఖర్చుల విశేష ధనమంతయును॥ ౧౪.
సూరదాసుడును సెలవుజేసెనన సూటిగవిని యా నృపుడు।
నేరస్థుండని దూతల బంపెను కూరిమివిడి తానపుడు॥ ౧౫.
వసూలుచేసిన విత్తమునంతయు వరుసను గొనిరమ్మనియు।
పొసగు మొహొరుతో నుత్తర మొక్కటిపొందుగ తాబంపుటయు॥
సూరదాసుకడ బంటులుచేరియు పేరిమితో దెలుపంగ౯।
నేరుగ చీటిని చేతులనుంచియు నియమించిరి బోవంగ౯॥ ౧౭.
సూరదాసుడును జెప్పెను వాండ్రకు సొంపుగ నారాజునకు।
మీరిన వెలగల మంచిసొమ్ములను మేలుగ తీసితి పెక్కు॥ ౧౮.
పాదుషగారికి బంపినయెడలను బహుతర మోదము బొందు।
పాదుగ నదియును రెండింతలవెల పదార్థమై యింపొందు॥ ౧౯.
ఈవిధముననా దూతలకునుదా నిష్టంబుగ జెప్పుచును।
భావశుద్ధితో బోవుచు గృహమున భార్యయు తాగూడుచును॥
ఏకాంతంబుగ నిరుపెట్టెలలో నేపున నింపిరి రాళ్ళ౯।
సాకాంక్షను నొక పత్రిక వ్రాసెను జనపతికిని సూరుడిల౯॥ ౨౧.
వసూలు పైకము కోరికతోనే వనజాక్షుని దాసులకు౯।
వసుధను సర్వము సెలవు జేసితిని వాసిగ హరికర్పణకు౯॥ ౨౨.
పలాయనంబై పోయెదననిదా పత్రిక వ్రాసియిడుచును।
సలీనమగునటు తాళము వేసియు సత్కరించి దూతలను॥ ౨౩.

సాదరముగ తా నన్నము బెట్టియు శాలువ బోడ్ఢిచ్చియును।
మోదము నొందగ జేసి వారలకు ముందుంచెను పెట్టెలను॥ ౨౪.
సూరదాసుడును బోయె నడవికిని సూటిగ నామాపున నె।
మీరిన భక్తిని మాధవ భజనను మిగులజేయుచును తానె॥ ౨౫.
ప్రొద్దున లేచుచు దూతలు సూరుని బొత్తిగ గానక యుండన్।
సద్దుసేయకను యాత్రాపరుడై చనియె ననుచు నృపునికడన్॥ ౨౬.
దూతలు పెట్టెల నందుకొనుచునటు తొందర జెందక నేగి।
నీతిని నృపునకు ముందిడి వాటిని నెతి భారములయ్యె నొగి॥ ౨౭.
భయమునదూతలు బలికిరి నృపునకు ప్రభువర్యా వినుమనుచు।
నయగుణములచే సూరదాసుడును నాణ్యవంతుడైయుంచు॥ ౨౮.
అమూల్యవస్తువు లాతడు మీకును నంపెను పెట్టలలోను।
ప్రమోదమునదా వచ్చుటకుండెను భక్తిని మిముగనుటకును॥ ౨౯.
మేమే పోవగ మావద్దనెయా మించిన ద్రవ్యము బంపెన్।
క్షేమతోడ దా యాత్రకువెళ్లుచు ధీమంతుడు మమ్మంపెన్॥ 30.
వినుచు నృపుండును విస్మితు డగుచును వేమంత్రిని బిలుచుచును।
పనిబడి తెఱచెను పెట్టెల నప్పుడు ప్రధాని ముందుండగను॥ 3౧.
పెట్టెలయందును రాళ్ళేయుండగ పెలుచ నృపుండును జూచెన్।
ఎట్టకేలకును నందలి పత్రము నేపున చదివింపించెన్॥ 3౨.
సూరదాసుడటు సాధుల సేవను సొంపుగ దా ప్రయసరచెన్।
మీరిన సుకృతము మనకును నాతడు మేదినిలో గలిగించెన్॥ 33.
చాడిని చెప్పిన మనుజుని నృపుడును సరగజేసె శిక్షయును।
పాడిదప్పి యనృతమును బల్కెనని బహుకోపము నొందుచును॥
సుకృతము మాకును జేర్చియిచ్చెనా సూరదాసు డధికముగాన్।
వికృత మనియుదా వెళ్ళెను నడవికి పిలుచుకొనుచు రావలెగాన్॥
అనుచు ప్రధానికి నకుబరు జెప్పగ నందరికది బాగయ్యెన్।
వెనక ప్రధానియు వ్రాసెను పత్రముల్ విష్ణుస్థలములకయ్యెన్॥

సూరదాసుఁడీ సంగతివినుకొని చేరెను మధురాపురిని।
నారాయణకృప యని దాదలచుచు నద్భుతవింతయని భువిని॥ ౩౭.
హస్తినాపురికి నాతఁడు వెళ్ళుచు నవనీపతి కడకేగి।
స్వస్తి జెప్పెదా క్షితినాథునకును సాష్టాంగంబుగ నెఱఁగి॥ ౩౮.
అవనీనాథుం డాలింగనమును నతనికి జేసియు బలుకు।
*కవియఁజేయు నీసాంగత్యమునను కలిగెను సుకృతము నాకు॥ ౩౯.
సద్వినియోగము జేసియిచ్చితివి చక్కనయ్యె నిటు నాకు।
అద్వితీయముగ నీసరి పుణ్యుల నవనిగాన నీవరకు॥ ౪౦.
మునుపటివలె మధురాపురి నీవును మోదమలర నుండుచును।
ధనమును భగవద్దాసులకొఱకై దాన మొసగు చుండుమను॥
శ్రీహరి భక్తుల సేవ నచ్చటను జేయుచు ప్రభువగుము యను।
స్నేహ భావమును గనియా సూరుఁడు జెందెను బహుమోదమును॥
సన్నదు వ్రాసియు క్షితిపతి సూరుని చక్కగ గౌరవ పరచెన్।
పన్నగనాతఁడు మధురాపురికిని ప్రయాణ మగుచును వచ్చెన్॥
భయరహితుండై భక్తజనులకును బహుభోజన మొసగుచును।
ప్రియుడై కృష్ణుని శ్రీకర రూపును పెంపుగ హృదయంబునను॥ ౪౪.
అహర్నిశంబులు నుంచుచు నామము నాతఁడు స్మరియించుచును।
సహజ కవిత్వము జెప్పుచు హరిపై సలుపుచుండె కాలమును॥
కుజనులు కొందరు కవిత్వరచనను కొరగాదని నిందింపన్।
నిజ మానసమున నెపమెన్నకదా నేర్పునబాడె నుతింపన్॥ ౪౬.
సాధుండొక్కఁడు యా సూరదాసు సత్కవితల శోధింపన్।
మాధవుగుడికిని ముందటనిలబడి మానుగ నాలోచింపన్॥ ౪౭.
సూరదాసు హరి దర్శనమునకును సారది రాగ సన్నిధికిన్।
కూరిమి నా సామువు పాదుకలను కోరియిడ నతని కైకిన్॥ ౪౮.
మాధవు దర్శనమును జేసికొనియు మరలివచ్చునందాకన్।
వేధనొందకను పాదుకలుంచుము వెలినుండుచు నెటుబోకన్॥ ౪౯.

---

*కవియు = అభిముఖముగా యత్నపడు.

శిబికెను దిగి యా సూరదాసుడును చిరసంభ్రమ మొప్పగను।
ప్రబల ప్రేమతో *పావాల్ చేతుల బట్టి నిలిచి యుండగను॥ ౫౦.
ఇట్టి సేవ తన కెపుడు దొరుకునని యెదురు చూచుచును నొప్పఁ।
దిట్టముగా నింటికి శిబికెను గొని తెరువున పొమ్మని జెప్పెఁ॥౫౧.
సన్నిధి ముందుగ సూరుడు నిలువగ సాధు నతని శోధింపఁ।
పన్నుగ లోపల భజన చేయుచును బహుప్రొద్దును గడిపింపఁ॥
ఉదయము మొదలుగ రాత్రిరి వరకును నొనర పూజ చేయుచును।
పిదవను రాగను పాదుక రక్షకు ప్రియ సూరుని దాగనెను॥ ౫౩.
వారక పరమానందముతో సూరుడు పాదుకలను ముంచుంచెఁ।
సూరుని శిరమున సాధువు కరమిడి సుఖిభవ యని మెచ్చెఁ॥౫౪.
సాధుల సేవను జేయు వాడనని సంకీర్తించితి విలలో।
పాదుగ నదియును సత్యంబయ్యెను పరులందరు గన భువిలో॥౫౫.
పరీక్ష కొఱకై బూనిన పనియగు పరమ భక్తుడవు నీవు।
సరసముతో నను క్షమింపు మనుచును సరగున వెళ్ళె సాధువు॥
సువార్తలను విని యనుతపించుచును సూరదాసు డనురక్తిఁ।
భవాపహంబని పంచిపెట్టె తన ప్రబలంబగు సంపత్తిఁ॥ ౫౭.
ఉపాధి లేకయు నూర్జిత ప్రేమను సుచితంబుగ హరిగొలిచెఁ।
అపారముగ నా హరి కృప నతనికి నచ్చెను, కీర్తియు వెలసెఁ॥
శ్రీహరి భక్తుల చరణంబులకును సేవచేయు తలపునను।
బాహుళ్యంబగు ప్రేమతో నుండును బాలకృష్ణ దాసుడును॥ ౫౯.

---

## రసికమురారి చరిత్రము.

రమానాథునకు ప్రియకర భక్తుడు రసిక మురారియు నుండెఁ।
సమాన రహితము సాయన నగరము సన్నివాసమగు చుండెఁ॥౧.
కమలనాభు నిజ భక్తుల నాతడు గారవించి యింపొందు।
సుమహిత కృష్ణుని దర్శన పూజల చొక్కుచు తా ముదమొందు॥

*పావాలు - పావుకోళ్ళు.

బాహుళ్యంబగు భక్తిని జేయుచు పదపడి హరిదాసులను।
స్నేహముతోడను నుపచారంబుల జేసి వారి పదములను॥ ౩.
కడుగు జలముతో నా తీర్థంబును గైకొనుచుండును నతడు।
వడిగను జేయుచు పిండి వంటలను పక్వాన్నము లిడుచుండు॥ ౪.
విష్ణు రూపులై వెలసిన వారని విహిత పూజలను సేయు।
కృష్ణార్పణమని నేమము దప్పక క్రియలిటు జేయుచు వెలయు॥ ౫.
కొందరు శిష్యులు సద్భావంబున కూడి తనకు విలసిల్లన్।
పొందుపరచిరటు వలయు ధనములను పూజించను కృష్ణునిలన్॥ ౬.
కొఱతలు లేకను సామగ్రిని గని గురుకైంకర్యము సలుపు।
హరికృష్ణాయను నామంబులదా నఖండంబుగను జెప్పు॥ ౭.
కాలంబిట్టుల గడవగ నొకయెడ కమలేశుని దాసులును।
లాలిత ముఖులై చేర వచ్చిరట లక్షించి మురారియును॥
జెప్పె నతడు శిష్యుల గని సాదుల శ్రీ చరణక్షాళనము।
ఒప్పుగ జేసియు తీర్థము తెమ్మనె నుచితంబుగ నాదినము॥ ౯.
విని యా శిష్యులు సాధుల పదముల విధితోడను కడుగగను।
పనివడి యొక్కని పాదము లచ్చట పగిలియుండ జూచుచును॥
మనసు సహింపక వానిని కడుగక మంచివాని గడుగుచును।
అనువుగ పాత్రను నుంచి తీర్థమును నట్టె యిడిరి గురుకడను॥ ౧౧.
చరణతీర్థమును గురుడుపుచ్చుకొన చప్పగనుండుట గనియు।
పరువున శిష్యుల నడిగెను యందుకు నురుకారణమేమనియు॥ ౧౨.
కడిగినవారలు కపటపు వృత్తిని కలిగియుండ గనబడియెన్।
పుడమిని సత్యము జెపు మనశిష్యులు పొందిరి భయమును చయ్యన్॥
కుళ్ళిన పదములు గలిగిన సాధుని కోరియు కడుగకయుంటన్।
సల్లలితంబుగ నితరుల పదములు సరి గడిగితిమని యనుటన్॥ ౧౪.
మురారిదాసుడు వినుచును వచ్చెను ముందుగనా సాధుకడన్।
విరామముగతా కడిగెను పదములు విహితప్రీతియు నిగుడన్॥ ౧౫.

హృదయంబున పాదంబులనిడుకొని హృష్టత ప్రీతియొనర్చెఁ।
సదమలనిష్ఠను చరణతీర్థముల చక్కఁగ ద్రాగియు లేచెఁ॥ ౧౬.
తీర్థము తీపుగ దగిలెఁ నిప్పుడని తేటనొంది తాననగఁ।
సార్థమనుచు విని విస్మితులయిరిల సాధువులందరు వెలిగఁ॥ ౧౭.
మురారిదాసుని సుమహిత భావము ముఖ్యమెవరు నెరుగరని।
పురారియొక్కఁడె రామనామమును పూర్తిఁగ నెరిగెడు గతిని॥
మురారియొక్కఁడె సాధుజనుల పద ముల తీర్థము నెరుగుగని।
పరాయణుండై స్వాదునుగనుటకు భక్తుల రసికుండునని॥ ౧౯.
పేరువెలయునని బల్కుచు సాధులు పెంపుగ ప్రకటించుచును।
కోరుచు వెళ్ళిరి రసికమురారియె గురుతర భక్తుడనుచును॥ ౨౦.



మురారిదాసున కాచార్యుండును ముఖ్య దయార్ణవుడనుచు।
ధురీణుడగుచును శ్రీహరిభక్తిని దురుసుగ గ్రామమునుంచు॥ ౨౧.
పరమజ్ఞానము శాంతియు శమమును బలతరముగ నిగుడంగఁ।
గురుతరముగ నొక సాలగ్రామము కోరియు పూజించుతగఁ॥ ౨౨.
అచ్చటి నృపవరు డతని నిష్ఠకును నతిమోదము నొందుచును।
యిచ్చెను నాలుగు గ్రామములతనికి నీశునిపూజ కొఱకును॥ ౨౩.
శ్రీహరిపూజయు సాధులపూజయు జేయుచుండుమని జెపుచు।
సాహస నృపుడును మన్ననజేయుచు చక్కని ప్రీతిని మనుచు॥ ౨౪.
దయార్ణవుండనె దశరథరాముని దయగలిగెను తనకనియు।
నియామ్యముగ తా పూజలసలుపుచు నెతెయుదినము గడుపుటయు॥
దుష్టుండొక్కఁడు ద్రవ్యమునిచ్చుచు దొరకొనె దేశ యిజార।
నష్టంబగునని యెంచక నాతడు నచ్చియు గ్రామము మేర॥ ౨౬.
దయార్ణవునియా ధరణినంతయును తప్పక జప్తింజేసెఁ।
క్రియతో నితరులు విన్నపించినను దయనిగుడక తా వెలసెఁ॥ ౨౭.

మురారికి గురుడు చీటివ్రాసి తన ముందుగ వేరమ్మనుచు।
గురుతుగ మనుజుని వేగమె పొమ్మని కోరి తాను వ్రాసిచ్చు॥ ౨౮
అశనము జేయుచు శిష్యుండుండగ నాచీటియు నటువచ్చెఁ।
విశదంబగునటు విప్పిచూడగను వేగమె మడితో లేచెఁ॥ ౨౯.
చేతులకడుగక సరగునవెళ్ళెను శ్రీగురుసన్నిధి కడకు।
నీతిని గురుడును వేరొకయూరున నెగడియుండె నదివరకు॥ 3౦.
విశదముగా గురునింగని శిష్యుడు వేగనొసగె దండమును।
అశనోచ్ఛిష్టము హస్తంబునగని యడిగె గురుడు హేతువును॥
ఆరగించు నా సమయంబున తమ యాజ్ఞా పత్రము నేనుగని।
వారక యప్పుడు నున్నరీతి నే వచితి జెప్ప మేమిపని॥ 3౨.
గురుడు గనుంగొని బహుతర ప్రీతిని కొనియాడెను తా మిగుల।
కరయుగ్మంబుల కడుగ జేసియును కరుణించుచు నయ్యెడల॥ 33.
దుష్టుండొక్కడు దేశ యిజారా తోడనె గైకొన గాను।
కష్టంబయ్యెను హరి యారాధన గ్రామము లేకుండుటను॥ 3౪.
న్యాయార్థంబుల నెన్ని జెప్పినను నచ్చిలి తా వినకుండు।
బాయక నీవును శ్రీకృష్ణాయను భగవన్నామము తోడు॥ 3౫.
వానివద్దకిని వెళ్ళియడిగి మరి వంచింపక గ్రామముల।
బూనికొనియు మాధవుని పూజకును పొందుపరచు మిన్యోడల॥
గురునాజ్ఞను గైకొనుచు శిష్యుడును కోరిజిలెదారూరునను।
సరుగున వచ్చుచు విడిదియింటిలో సలిపె వాసమును తాను॥
భావిక జనులను కూడుకొనుచు తా బలికె మురారి దాసుండు।
గోవిందునికై గురువునకిచ్చిన కులు గ్రామంబుల నేడు॥ 3౮.
జిలేదారుడును చేకొనె నాతని చెంతకోదుననని జెప్పఁ।
వలకొని తామేవెళ్ళి జెప్పినటు వారల బలుకులు నొప్పఁ॥ 3౯.
వెలసెను నాతడు విష్ణుద్రోహియై విననేరడు హరి పలుకు।
ఇల కష్టంబగునని జనులనగా కలత మురారియు నులుకు॥ ౪౦.

జిలేదారునకు కొందరు జెప్పిరి యల మురారి దాసుడును।
బలముగ తనగురు గ్రామము లన్నియు బలువుగ గైకొని చనను॥
ఏతెంచెను నిట కాతడు ఖలులను నెలమి మోహ మొందించు।
ఆతండును హరినామము జెపునని యనగ జిలేదార్ వినుచు॥४౨.
మావిటివానిం బిలిచియు నరపతి మత్త గజంబును గొనుచు।
సేవకజనులను చేకొని వెళ్ళము చెలగి మురారిని గనుచు॥ ४३.
త్రోవ నిభముచే ద్రొక్కించు మతని దురుసుగ నటు జేసినను।
భావమలరగా నిచ్చెద నీకును బలతరంబగు ధనమును॥ ४४.
మావటివాడును మత్తగజంబును మార్గమందు త్రోలుచును।
బోవుచు నుండగ మురారి యెదురుగ పొసగనరుగు చుండగను॥
హరిని భజించుచు శిష్యుల గూడియు నతడు నడచు చుండగను।
పురజను లందరు గూడిరియప్పుడు హరికీర్తన వినుటకును॥ ४౬.
ముకుంద కేశవ మాధవ కృష్ణా మోహన రంగాయనుచు।
అకుంఠితులురునై యానందంబున నట్టులబోవుచు మించు॥ ४౭.
మత్తగజంబును మురారి యెదటికి మానుగ వచ్చుచు నుండె।
అత్తరి నొక్కడు మురారితోడ రహస్యము చెప్పుచు నుండె॥
తుచ్ఛపు జిలేదారుండిటు బంపెను దుర్మద వేదండమును।
ప్రచ్ఛన్నంబుగ నిన్ను జంపుటకు బరతెంచెను గనుమనను॥ ४౯.
మురారి దాసుడు మత్తగజంబును ముందుగ తా నెదిరించె।
సరాళముగ తన శిష్యులు జెప్పిరి చంపుటకొఱకిది వచ్చె॥ ౫౦.
పరుగిడి మేమును బోయెద మనగను భర్తుడనెను వారలకు।
గురూపదేశము గైకొని మీరలు కుదురుగ దేహంబులకు॥ ౫౧.
ఆసల నుంచుచు పరుగులిడెదమని యానతిచ్చితిరి మీరు।
కోసివేయుచును గళమున గట్టిన గురు సూత్రంబుల బోరు॥ ౫౨.
ఇచ్చి పొండనుచు బల్కగ వారలు నేపుననటు జేయగను।
మచ్చిక తోడను మురారి బల్కెను మహిమీవల్లను నేను॥ ౫౩.

విడుదలనందితి పొమ్మన వారలు వెళ్ళిరియటు వెనకకును।
ఇడుముల నొందక నొకడై బాడుచు యేనుగ కెదు రేగగను॥ ౫౪.
సర్వము నందును శ్రీపతి వరదుడు సర్వేశ్వరు డుండగను।
నిర్వహించు నాతండని జెప్పుచు నిలిపెను తన చిత్తమును॥ ౫౫.
వారణ మప్పుడు వచ్చుచు ముందర వాంఛను దండంబిడెను।
ధీరుడుశిష్యుల తులసీ పూసల గోరివేసె కరి మెడను॥ ౫౬.
నారాయణయను తారక మంత్రము నాతం డుపదేశించెన్।
క్రూరాయతమగు గుణములమాన్పి(యు గొబ్బున మదముడిగించెన్॥
అది మొద లాకరి సత్వగుణముతో నణకువ గుణమున నుండు।
సదయులు జనములు మహదాశ్చర్యము చనువున బొందిరి యపుడు॥
జిల్లేదారున కెరిగించిరి యల సేవకులందరు నపుడు।
మెల్లగ మేమును మత్తగజంబును మెళకువతోడ నరుగుడు॥ ౫౯.
సాగిలబడియది బెట్టెను దండము సాధు మురారికి నపుడు।
బాగుగ నిట్టుల వినగను వచ్చెను వేగమె జిలెదా రపుడు॥ ౬౦.
అతివింతను గని యీతడు దండము నాతనికిని తగ నిడియెన్।
పతితుడ నగుదును నేరక జేసితి పరగ క్షమింపుం డనియెన్॥ ౬౧.
శ్రీహరిభక్తుడ నీవు కోరినది జెప్పుమనుచు నడుగగను।
దేహపోషణం బునకగు గురువరు *తెగుబడు గ్రామంబులను॥ ౬౨.
ఎప్పటివలెనే యాతనికొజ్ఞకై యేర్పరింపుమని యడుగన్।
ఒప్పుగ నటులనే సన్నదు వ్రాసెను యొగి గురువునకని వెలిగన్॥
హరిభక్తునిశ్రీ హస్తయుగంబున నాతడిచ్చె పత్రికను।
మురరిపు దాసుడు గురువునకిచ్చెను మోద మొంది మెలగగను॥
వారణమప్పుడు నరహరి భక్తుని వదలక తరలెను వెనుకన్ ।
కోరుచు నెప్పుడు కృష్ణకీర్తనము గుటితోడను విను జోకన్॥౬౫
ప్రొద్దుపొడువగను బోవు నరణ్యము పొందుగ నింధనములను।
సద్దులేకతా పోగుజేసికొని సరగవచ్చును దినమును॥ ౬౬.

*తెగుబడు – దస్నుట.

భక్తులయెడనతి ప్రేమ సలుపుచును బహు వైరాగ్యము తోడన్।
శక్తికొలదిగను చేయును పనులను సాధువులును గొనియాడన్॥
బహుదినంబులిటు జరుగగ పిదపను భక్తకూట మంతయును।
సహచరు లగుచును భజనను జేయుచు చనిరి యాత్రకై యటను॥
ఏనుగు వెంబడి నేర్పడ జనియెను నెల్లసొమ్ము మోయుచును।
మానుగ దొంగలు బాటనుదగిలిన మరలించును నదియటను॥౧౯.
తులసీ మాలయు నూర్ధ్వ పుండ్రములు నలరాముని నామమును।
కలిగిన వారల కరుణను జూచుచు *కారు నితరులను తగను॥ ౨౦.
ఈవిధంబుగా యాత్ర సలుపుచును నేనుగుతో సాధువులు।
భావశుద్ధితో కురు క్షేత్రమును బాగుజూచి విలసిల్లు॥ ౨౧.
అరుణా వతియను పేరిటి నగరము నందు వీరు దిగియుండన్।
తురక రాజునకు తెలిపిరి కొందరు తుచ్ఛుండై యతడుండన్॥ ౨౨.
విష్ణుదాసులును వచ్చిరి యూరికి విహితంబగు నొక కరితో।
కృష్ణభక్తులను సత్కరించునది క్రియనిట్లని చెప్పుటతో॥ ౨౩.
అవనీపతియా యేనుగ దనకై యప్పుడె తెమ్మనగాను।
యవన సిపాయిలు చేరవచ్చియా హరిభక్తుల జూచుచును॥ ౨౪.
ఏనుగు రాజున కింపైయున్నది యియ్యమనుచు నడుగగను।
మానుగ వారలు నభక్తజనులను మన్నింపదు యదియునను॥ ౨౫.
మరిగి యున్నదది మాసేవలలో మహినెట్టిత్తు మనగాను।
మరియును చారులు నృపునకు దెలుపగ మావటీని బిలుచుచును॥
కపట వేషమును గైకొని యిచటికి కరినిందెమ్మని జెప్పన్।
విపుల పుండ్రముల ముఖమున నిడికొని విష్ణు నామమును జెప్పన్॥
మావీటి తులసీ మాల వేసికొని మరి వచ్చెను కరివద్దన్।
శ్రీవిభునామము జెప్పగ నదియును చెలిమిజేసి యింపొందన్॥ ౨౬.
కంఠముపై గూర్చుండియు నాతడు కరినిదెచ్చె నృపుకడకున్।
కుంఠితమతితో కపటవృత్తియని గుఱిగొని మదిలో వడకున్॥ ౨౭.

* కారు - నిషేధించు

శ్రీహరి నామము జెప్పుట చేతను చేయనొల్లకయ కీడు।
బాహుళ్యంబగు సాదులసేవయు *పడసిపోయె యలనాడు॥ ౨౦.
కొయ్యకు దానిం గట్టివేయగను కోపము లేకయ తాను।
నెయ్యంబుగ నెఱలేకొక వారము నెనరున నటనుండుచును॥ ౨౧.
ఏడవదినమున నచ్చట మావిటి యేన్గుదెచ్చె గంగకును।
వాడి చెడియుంట బాగుగాదనుచు వరుస యుసురువిడిచెమును॥ ౨౨.

శ్రీహరి నామము చింతించుచు కరి చేరెను వైకుంఠమున।
ఊహాను పశువై యుండియు నదియును యుచిత సాధు సంగమున॥
మేలగు పదమును మత్తగజంబును మించియు పొందెను యటను।
వాలుగ తెలివిని నుండు మనుజులును వాసుదేవు పదమిటను॥ ౨౪.
పొందనశక్యమె యనుచును పెద్దలు భువిని జెప్పుచుండుదురు।
సందియ మొందక బాలకృష్ణుడును సాధుసేవ తా గోరు॥ ౨౫.

---

## మీ రా బా యి చ రి త్ర ము.

రాణుండను నొక నరపతి యీ భువి రాజిల్లుచు తగనుండె।
ప్రాణపదంబై యుదాపురమునకు ప్రభువగుచును తా నిగుడె॥ ౧.
విష్ణు భక్తుడై వస్త్రాన్నంబులవిహిత సాధువుల కిడును।
కృష్ణ పూజలను జేయుచు నెప్పుడు కీర్తి వెలసి యుండెమును॥ ౨.
శ్రీగోపాలుని చక్కని మూర్తిని చెలిమిని గొలుచుచు నుండె।
సాగర శయనుని షోడశ పూజల సలుపుచు ప్రతీ దినముండె॥ ౩.
సరసాన్నంబును శ్రీహరి కర్పణ చక్క జేసి భక్షించు।
గరిమె నిష్ఠతో నిటులం గొల్వగ కన్యారత్నము గనుచు॥ ౪.
ద్వాదశ దినములు గడిచిన పిదపను తలి తండ్రులు శిశువునకు।
మేదిని చేసిరి నామకరణమును మీరాబాయి యని మెలగు॥ ౫.
బాలిక దెచ్చియు కృష్ణమూర్తికడ భక్తితోడ నుంచుచును।
పాలన జేయుగ పెద్ద బెరిగెనది బహుసుందరముగ నటను॥ ౬

---

*పడసె - తప్పె.

అనుమోదముచే నవనీపతియును ననుదినమును తనతోను।
చనువున పుత్రిని చేకొని వెళ్ళుచు సర్వేశుని గొలుచుముసు॥ ౭.
హరి శ్రీవిగ్రహ మతిసుందరమై యమరియుండె తగనటను।
కిరీటహారము కటక కంకణము కేయూరము మొదలుగను॥ ౮.
వనమాలయు మరి వైజయంతియును వరుసను పీతాంబరము।
అనువుగ దాల్చిన లావణ్యముతో నగుపడు నా మూర్తిసుము॥ ౯.
మీరాబాయీ సుత మదికింపయి మెలగి మూర్తి యుండగని।
వేరొక భర్తను నొల్లను శ్రీహరి విగ్రహమును దక్కనని॥ ౧౦.
ప్రేమమీర నా పెరుమాళ్ళను తన ప్రియ భర్తగ నెంచుచును।
నేమము తోడను నామెయు కృష్ణుని నెనరున చింతించగను॥ ౧౧.
ఒకదినమున నా యుర్వీపతియనె నొనర వచ్చి సతికడకు।
నికటంబయ్యెను వయసు పుత్రికిని నెగడి వరుని వెదకుటకు॥ ౧౨.
మీరబాయి విని తండ్రిని గాంచుచు మెల్లన దా నిట్లనియె।
వారక పురుషుని విచారించితిని వాంఛను దెలిపెద ననియె॥
ఏదేవుని నీ వారిధింతువా యిలను నాకు పతి యతడె।
మేదినిలో నే మరియొక పురుషుని మీరియు దలపనునెపుడె॥ ౧౪.
కావున నాపై కరుణ యుంచినను కమలేశున కర్పించు।
భావము గనుగొని బల్కెను తండ్రియు బౌద్ధుడు హరి కలిననుచు॥
జీవరహితమగు శిలామూర్తి యది చేరిక దెలియక నీవె।
భావము లోపల ప్రియమును బూనుట భద్రముగాదిది నువ్వే॥
మగువయు బలికెను కృష్ణుని కన్నను మహిలో దేవత లెవరు।
సుగమము గారి పద్మదళాక్షునే సొంపుగ నామది గోరు॥ ౧౭.
బ్రహ్మకు తండ్రియై ప్రకృతికి పరుడై పరమ శివునిచే నెపుడు।
బ్రహ్మ భావమున జపింప బడుచును పరాత్పరుండై యుండు॥ ౧౮.
పాషాణంబని బలుకుట తప్పగు ప్రహ్లాదుండును మరియు।
శేషత్వంబును నుంచుట చేతను శ్రీశు కంబము వెడలియు॥ ౧౯.

దారుణ విషమును తండ్రియు బంపెను ద్రాంగి నీవు జచ్చుటకు।
కూరిమి నీమృదు సుందర రూపును కోరిన దొరుకునె నాకు॥ ౫౯.
కంటను జలములు ఘనముగ రాలగ కనికరమున నేడ్వగను;
చంటి మోహమటు తల్లికి గలుగుట సరగజూచి పుత్రియును॥ ౬౦.
నిత్యముగాదీ నరదేహంబిట నిలువదు నిశ్చయమెరగు।
సత్యరూపుడగు శ్రీహరి కొఱకును చచ్చుటయును శ్లాఘ్యమగు॥
మృగతృష్ణలకును చింతన జేయుట మేలుగాదు భుః ననుచు।
సొగసగు వంధ్యా సుతుని పెండ్లికిని శోకమేల మనకనుచు॥ ౬౨.
వనవృక్షంబున పండిన ఫలంబు వసుధపైన పడునట్లు।
ఘనుడగు కృష్ణుని పదముల బడితిని ఘనబంధము విసునట్లు॥ ౬౩.
అలంకారమున స్వర్ణరత్నముల ననువుగ గూర్చెదు రితిఁ।
ఇలలో నన్నా యదునాయకుడును నేలుకొనెను గదుక్రీతిఁ॥ ౬౪.
బద్ధమైన యీప్రపంచ మాయకు పరితాపము మానుమని।
శుద్ధమనస్సున జెప్పుచు తల్లికి సూటిగ దా హరినిగని॥ ౬౫.
వందన మొసగుచు వనమాలాధర వారిజాక్ష నాకొఱకు।
తొందర బొందుచు తండ్రియు విషమును తోడనంపె జంపుటకు॥
నీకృపచేతను శ్రీవైకుంఠము నేబొందెద నికనుమ్మా।
ప్రాకృత మానవు లెవరొనర్తురిక భవ్యత నీ పూజనము॥ ౬౭.
భువిని దుర్జనులు ప్రాణమునీకైఁ యొగదాయని నిన్నా।
సవినయముగ నిటు సన్మానింపరు చక్కవిడిచె తండ్రియును॥ ౬౮.
శ్రీపతి నాకీ చింతయెందుకిక చిద్రూపుడ వీవయను।
ఏపుమీర నీవనేక భక్తుల నెలమిని సంకటములను॥ ౬౯.
పనిబడి దీర్చియు బ్రోచితివందర, ప్రహ్లాదుడు మొదలుగను।
అనుపమ భక్తుల ననవరతంబును నాదరించితీ వటను॥ ౭౦.
హాలాహలంబును హరుడు మ్రింగినీ యమల నామమును జెప్పఁ।
విలాసముగ నది చల్లారుచుమరి విపులసీతలముగ నొప్పఁ॥ ౭౧

వంకరత్రోవను తననిజ పుత్రియె వర్తన జేయుచు నుండఁగ।
పొంకంబుగ నాపెకు తగు దండన బూనిచేయఁడను చుండఁగ॥౪౬.
పరిపరి విధముల జనుల పలుకులను పదపడి వినియెను నృపుడు।
వరుసను కోపము నొందుచు బహుగా వచించె సతికిని నపుడు॥
పురజనులును మనపుత్రిని నిందను పూర్తిగ జేయుదు రనుచు।
సరివయస్సునను పుత్రి వివాహము సలుపవలయు దాననుచు॥౪౭.
మీరాబాయికీ మాటను దెల్పియు మేలుబలుకు దెమ్మనగఁ।
సారతరంబగు నాజ్ఞను పుత్రికి సరగ మాత జెప్పతగఁ॥ ౪౮.
కొమార్తె బల్కెను కృష్ణుని దక్కనె కోరను మరియొక వరుని।
దమమున నితరుల నీసమానమని దలతు భయముపడకుమని॥ ౫౦.
కృష్ణకథలనే కీర్తనజేయుచు క్రియతోనిట నుండగను।
విష్ణుభక్తులును బ్రహ్మజ్ఞానులు వినిబొగడుచు నుందురను॥ ౫౧.
నిందించెదునా నీచ జనంబులు నిరయంబును నొందెదరు।
సందియ మొందక సుజ్ఞానులుగని సంతోషము జెందెదరు॥ ౫౨.
జ్ఞానశస్త్రమును గైకొని నేనును ఘనభక్తిని వెడలితిని।
మానుగ రాముని యమల నామమును మధురమనుచు గాంచితిని॥
ఈసంగతి నాతండ్రికి నీవును నేర్పడ జెప్పుమనంగఁ।
వాసిగ తల్లియు వచ్చుచు పతితో వచనముజెప్పెను వినగఁ॥౫౪.
ప్రాణనాథనే పుత్రికి జెప్పితి పలువిధముల బుద్ధులను।
ప్రాణమంతయును మాధవు మీదనే పరగుచున్న దనగాను॥
నరపతి బల్కెను నిందకు లోబడు ధర కొమార్తెయును నాకు।
దురుసుగాదు బ్రతికుండుట యనియును ధూర్తుఁడామె జంపుటకు॥
విషమును గిన్నెలొ నుంచియు భార్యతొ వేగ తనదు పుత్రికిని।
సుషమహీనమగు నిందకు నోర్వక సూటిగ పిత బంపగని॥ ౫౭
పతియాజ్ఞకు సతి మారుబలుకకయ పరమ దుఃఖమొందుచును।
అతులిత పూజా గృహమున కేగియు నటపుత్రికను గనుచును॥

అట్టినామమే యబ్బెను నాకును నదియే ప్రాప్యంబనుచు।
గట్టిపరచుకొని కృష్ణుని ముందర గరిమెతోడ విషముంచు॥ ౨౨.
నివేదించుచును నిరుపమ భోక్తయు నీరజనాభుఁడె యనుచు।
భవాబ్ధి తరణంబనుచు ద్రాగెనటు పదపడి విషమును గనుచు॥ ౨౩.
అమృతముతో సరి విషము నమరెనటు నల మీరాబాయికిని।
*అమృతమయంబై విస్మృతి నొందక నామెయునట నుండగని॥ ౨౪.
ఎల్లజనంబులు నద్భుత మొందగ నేపునహరి విగ్రహము।
నల్లచాయనటు బొందుట గాంచుచు నరులొందిరి వింతసుము॥ ౨౫.
నరపతి యప్పుడు భార్యను నమ్మక నరసి తా రహస్యముగ।
హరి మందిరమున కేగి నిలుచుకొని యాశ్చర్యము గలుగంగ॥ ౨౬.
విదితంబగునటు సకలము జూచుచు విచిత్రమని తానుగని।
పదపడి నే శ్రీహరికిని విషమును పానము జేయించితినని॥ ౨౭.
కొమార్తె కాళ్ళను బట్టుకొనగ నటు కుదురుగ నామెయు మరలఁ।
ప్రమాదమేమని తండ్రిని లేపియు బట్టె నతనిచరణములఁ॥ ౨౮.
కృష్ణుని నాకును కరుణతో నిచ్చిన కృపామూర్తి నీవనఁగ।
విష్ణుమూర్తినా నరపతి యప్పుడు విలసితముగ నటు గనఁగ॥ ౨౯.
నల్లచాయయును గలిగి యుంటచే నుల్లము సరిపడకుండఁ।
మెల్లగ సుతతో కృష్ణుని మునుపలె మెలగజేయుటకు జాడఁ॥ ౩౦.
వేడుమనుచు తన తండ్రియు జెప్పగ విని మీరా యంజలితో।
గూడినప్రేమను కృష్ణుని ముందర కూరిమి నుండుచు గురితో॥ ౩౧.
శ్రీహరినీకీ స్వల్ప విషంబున జెందెరూపు భేదమును।
సాహసమున మును కాళింగునిపై సలిపితీవు నటనమును॥ ౩౨.
నీదునామమే విషములనన్నియు నివర్తిఁ జేయుచు చెలగు।
పాడుగ నిపుడది నాకు ప్రసిద్ధము భవ్యామృతమై వెలుగు॥ ౩౩.
హాలాహలంబగు విషము నంతయును హరుడునుమును భక్షింపఁ।
ఫలప్రదంబగు పావన నామమె బొరదోలె విషమొప్పఁ॥ ౩౪.

---

*అమృతము - ఆనందము.

నేటిదినంబున విషకళంకమిటు నీకును దగ దోచుటయు।
పాటవముగ నా హృదయపద్మమును బాధించెను నిటననియు॥ ౧౫.
రామనామమె రాత్రియు బగలును బల్కబడు భక్తులకున్।
కామ మోహముల కలుగు దురితములు గానరాపునిటు కలకున్॥
ఈవిష ప్రాశన మేమి చేయునిను నిచ్చటి జనులందరికిన్।
కేవల కౌతుక క్రీడయనియు నే గీల్కొంటిని నెమ్మదికిన్॥ ౧౬.
శ్రీహరి కృష్ణా జగదీశా నీ శ్రీరూపును మునుపవలె।
ద్రోహను నందరు జూచునటుల నిట నుండ జేయతగు మేలే॥ ౧౭.
అచ్యుతు డప్పుడు నాలకించి దా ననువుగ మును రూపొందన్।
మచ్చికతో తన భక్తి మహాత్వము మనుజులు గని యురవొందన్॥
గళమున నుండిన నలుపును మాత్రము కనబడునటు నుంచుకొనెన్।
ఇలలో నిప్పుడు నచ్చటి మనుజులు నెలమి గాంత్రు ముదముగొనన్॥
అవనీ నాధుడు తన పుత్రిని గని యతిమోదంబును గొనుచు।
భువి నావంశము నుద్ధరించితివి పురి దుష్టులు చెడిరనుచు॥ ౯౧.
ఆనందముచే యవనీపతియును నచటి భక్తులెల్లరును।
గానము జేసిరి రాముని లీలల ఘనకరుణను పొగడుచును॥ ౯౨.
భక్తిమార్గమును ప్రబలపరచుచును భామ మీరా యటనుండెన్।
భక్తుల దాసుడు బాలకృష్ణుడును ప్రమోద మొందుచు నిగుడెన్॥

---

## కానోపాత్ర చరిత్రము.

పండరికిని దక్షిణ భాగంబున పట్టణ మొక్కటి యుండెన్।
మెండుగ నదియును మంగళవెడయని మేదిని తగ పిలువబడెన్॥
శ్యామ యనెడు నొక వనిత యుండెనటు సరస వేశ్యకులమందు।
ఆమె గర్భమున సుందర రూపున నబల బుట్టియింపొందు॥ ౨.
కానోపాత్రయని పుత్రిక నామము కనికరముగ నుంచగను।
మానుగ నబలయు దినదినమునకును మంచి రూపవతిగాను॥ 3.

ఈపలుకులవిని యింటను తల్లికి నీప్సితముగ వండమును।
వీపున బెట్టియు వీణెనందుకొని యేగెను పండరి గనను॥ ౧౭.
వందన మొసగియు విఠల నాధునకు వాంఛతోడ తానసెను।
సుందర కీర్తిని చెవులను వినినే నాటిగ వచ్చితి నిటను॥ ౧౮.
షడ్గుణ సంపద విడువక నీయెడ చక్కగనుండును నెపుడు।
ఖడ్గముబోలిన మనో వృత్తిలిల ఖండనజేసియు నేడు॥ ౧౯.
శరణొందితినని సద్భావముచే సర్వేశ్వరు బొగడుచును।
చిరతరముగనట గానము జేయను చేసె నివాసంబటను॥ ౨౦.
పయసున నుండెడి మీనముల్ ప్రజలను బాధింపక యటనుండఁగ।
నయముగ బెస్తలు బట్టిచంపుదురు నాశ్యేమేమి లేకుండఁగ॥ ౨౧.
కానోపాత్రకు నట్లు విరోధము కలుగు కొందరేగుచును।
మానుగ బిదరున బాదుషగారికి బల్కిరి యిట్లని మున్ను॥ ౨౨.
దేవాంగనవలె తేజము మీరిన దివ్యశరీరము గలిగ।
భావార్థముతో పండరి యందున భక్తితోడ దామెలగి॥ ౨౩.
సిరివరు సన్నిధి నెప్పుడు గానము జేయుచుండు ముదమునను।
ధరణివేశ్యయై మర్త్యుల గూడక తానుండును ఘనముగను॥ ౨౪.
నియతయై యుండెడి యట్టిస్త్రీనియీ నిలయమందు జూడమనఁగ।
నయముగ నిదివీని యామెను తనకడ నరపతియును బిలువుమనఁగ॥
దూతల బంపగ వచ్చిరి వారలు దురుసుగ పండరి పురికి।
నీతిని శ్రీపతి గుడిలోగానము నిలిచి చేయగను కలికి॥ ౨౬.
తెలియ పరుపగా రాజునానతిని దేవుని పదమంటి సతి।
ఇలనా కన్యం డిష్టుడు గనుగొన నెవరును లేరని బడితి॥ ౨౭.
నీవే గతియని నేశరణొంచితి నీవు నన్ను విడువకుము।
భావబంధమున నిను బట్టిన నను పంపిన కాదది ఘనము॥ ౨౮.
నీదు బిరుదునకు న్యూనంబగుగద నీవు దయానిధి వగుచు।
సాదు కపోతము నిను శరణొందగ సరగబ్రోచితివి మనుచు॥ ౨౯

అతిలావణ్యము బొందెను పుత్రిక యమర సతులు శిగ్గుపడఁగ।
వితత సృష్టిలో మనుజ కులంబున వింతరూపమున నుండఁగ॥ ౪.
గానన్మృత్యముల బహుసులభంబున గ్రహించెనటు దిట్టమున।
మానుగ తల్లియు జెప్పెను పుత్రికి మనమేగిన నృపుని గన॥ ౫.
అలంకారముల నాతండిచ్చును యతి శోభాకరముగను।
పలికిన పలుకులు వినుచును కూతురు ప్రతిజెప్పెను మాతకును॥ ౬.
నాకును సరియగు నరుడీభువిలో నచ్చిన చిక్కుండనుచు।
సాకల్యంబుగ గుణసాంద్రుండిటు సర్వేశ్వరుడే యనుచు॥ ౭.
నిశ్చయ మిదియని జెప్పుచు నామెయు నేర్పననట నుండుటయు।
పశ్చాత్తాపము తల్లి గొనగ గనె భక్తులుపండరి కరుగుటయు॥ ౮.
కేశవకృష్ణా గోవిందాయని క్రియతో హరి బాడుచును।
పేశలముగ నటు వాద్యంబులతో పెంపుగ తగ బోవగను॥ ౯.
కానోపాత్రయు వారల జూచుచు కాళ్ళంబడి మ్రొక్కుచును।
మానుగ మీరలు బోవు టెచటికని మహిత భక్తి నడుగగను॥
వారలుబల్కిరి పండరి యాత్రకు వనితరో బోయెదమనుచు।
నారాయణుడటు పుండరీకునకు నడచివచ్చె తానసుచు॥ ౧౦.
విధాత మొదలగు దేవతతులచే వినుతింపంబడు నతడు।
సుధిరు డగుచును నున్నత విగ్రహ సుందరాకృతుండతడు॥ ౧౨.
దినకర దీప్తికి తేజంబిచ్చిన దివ్య తేజుడతడగును।
ఘనుడగు నాతని జూచుట కొఱకై వినుమే గెద మనగాను॥ ౧౩.
అబల బలికె హరి నన్నాదరించునో యనగ వారు జెప్పిరటఁగ।
ప్రబలప్రీతిని కుబ్జదాసినటు పండరిపతి బ్రోచెనటఁగ॥ ౧౪.
కురూపియైనను నంగీకారము గోరిచేసె కృపనుంచి।
స్వరూప పాపి యజామిళుని హరి చోఖామేళుని వలచి॥ ౧౫.
అంగీకారము ననువుగ జేసెను నట్టిదయానిధి యతడు।
పొంగుగ పతితుల పావనుడని యెదు పుణ్యానామముగ లాడు॥౧౬.

ద్విజవరు లందరు ప్రపత్తిజేసిరి తీరుగ శ్రీహరి కపుడు।
సుజనరక్షకా శ్రీప్రహ్లాదుని సారది బ్రోచితివి నాడు॥ ౪౩.
పాండవులందర పరిపరి విధముల పరిరక్షించితి వీవు।
మెండుగ నగ్నిని మ్రింగి గోపకుల మేలుగ బ్రోచితి వీవు॥ ౪౪.
ఘోరవర్షమటు గురియగ కొండను కుదురుగ వ్రేలిని గొనుచు।
సారతరంబగు జీవులబ్రోచిన సర్వేశుడ వీవనుచు॥ ౪౫.
మమ్మును బ్రోచుట మేలాసంగదె మాధవ కృష్ణానీకు।
సొమ్మసిల్లినిటు జెప్పుచు వెళ్ళిరి సోజర మంటపమునకు॥ ౪౬.
నరపతీ నచ్చట నిలువంబెట్టియు నారాయణు జూడుమనన్।
మరవక శ్రీహరి కేశకురళమును మానుగ జూచె శిరమునన్ ౪౭.
సుందర మోమును సరసిజలోచన సుకుమారముతో నుండన్।
మందహాసమును పీతాంబరమును మకరకుండలము లుండన్॥ ౪౮.
జఘనమునందును కేలనుంచుకొని చారుభుజంబుల తోడన్।
అఘహర రూపును పృథ్వీపతియును నందమొప్పగను జూడన్॥
అనుతాపముతో నంజలి జేసియు నావిప్రుల గని యనెను।
వినిన ప్రకారము విఠలుని గాంచితి విపుల వాంఛ దీరెనను॥ ౫౦.
కానోపాత్రయు కంజదళాక్షుని గలసెను సుకృతము చేతన్।
హీనుడనైనే హేళన జేసితి హెచ్చిన మదమున నంతన్॥ ౫౧.
వనితశరీరము వృక్షంబైనది వాంఛను జూపుమనంగన్।
చనువున విప్రులు తరటివృక్షమును చక్కగజూపిరి కనగన్॥ ౫౨.
భాగ్యశాలియని బహుగా పలుకుచు పదపడి వెళ్ళెను నృపుడు।
యోగ్య శీలురకు దాసదాసుడై యుండు బాలకృష్ణుండు॥ ౫౩.

---

దామాజి చరిత్రము.

బిదరు పట్నమున దామాజీ యను పేరబుట్టె బ్రాహ్మణుడు। ౧.
చదువ నేర్చుకొని సేవకవృత్తిని సలిపె రాజు కొలువపుడు॥

అంబరీషుడును యజామీళుడును హాస్తిరాజు మొదలుగను।
డంబుగ భక్తుల బ్రోచినదంతయు పంబి వెలయుచుండగను॥ ౩౦.
నీకేయర్థత నొందిన నేనీ నీచులనెటు గోరుదును।
ప్రాకటముగ నను బ్రోవుమీతరిని పరులునవ్వ కుండగను॥ ౩౧.
చర్చనసంగతి దొలగునట్లుగా ధురీణతను సేయుమనన్।
గర్జనజేసిరి సజ్జనులందరు కమలేశుం డియ్యకొనన్॥ ౩౨.
దాని యాత్మ హరి యీడ్చుకొనంగా ధరనుబడెను దేహమును।
మానుగపూజా చార్యులు జూచుచు మానిని మేనుం గొనుచును॥
దక్షిణ దిక్కున నుంచగనప్పుడు తరటివృక్ష మదియయ్యెన్।
చక్షులకిప్పుడు నగపడు చుండును సాక్షిగ పండరి చయ్యెన్॥ ౩౪.
బాదుష బంటులు బైటనుండుచును బల్కిరి విప్రులతోడన్।
పాదుగ కాంతయు వెళ్ళియు గుడిలో మరలవెలికి రాకుండన్॥ ౩౫.
ఎటుల బోయె నొదెలుపుండనగను నెలమిననిరి హరిలోన।
పటుతరముగనే లీనమయ్యెనన భటులు మేను జూపుమన॥ ౩౬.
విప్రులు బల్కిరి యామెశరీరము వెలసె తరటివృక్షముగాన్।
అప్రయోజకంబని యాభటులును నవని సురులను వెలిగాన్॥ ౩౭.
కరమిడి ధరపతికడ దెచ్చి యనిరి కానోపాత్రను వీరు।
మరుగున నుంచుచు జచ్చెనటంచును మనివిజేయుచున్నారు॥ ౩౮.
హరి ప్రసాదమును నర్చకులప్పుడు యవనీపతి కడ నియ్యన్।
తెరువుగ వెంద్రుక పుష్పంబులలో తెలియంబడుచును వెలయన్॥
అవనీనాథుం డతీ కృద్ధుండై యడిగె ద్విజుల కారణము।
వివరించిరి హరి శిరము కేశముల వెలసి యున్నదటు గనుము॥ ౪౦.
మేదినిసురు లామాటను జెప్పగ మిగుల వింతనొందుచును।
బాదుష యడిగెను పండరిపతితో భామినియెటు గలిసెనను॥ ౪౧.
బాపలనిరి సాగరమున లవణము పరగ చేరునట్టులను।
ప్రాపుగవీని నరపతి వేంచేసెను పండరికిని నయ్యెడను॥ ౪౨.

సంకల్పంబును జెప్పిరి విప్రులు సర్వేశుడు భోక్తయనన్।
పొంకంబుగ నావిప్రుడు దినకయ బోరిబోరి నేడిచెగాన్॥ ౧౫.
ఎజమానుండనె నీసమయంబున నెందుకేద్చుటని యడుగన్।
నిజసతి సుతులును నాల్గు దినములుగ నిలిచిరి యుపవాసముగన్॥
కఠిన నిర్దయను కలిగియు నతిథిగ కలిమినుంటి తినుటకును।
శఠుడనగుచు నా తలపును వారిపై చనగగంటి దుఃఖమును॥ ౧౭.
ఇందుకు దామజి సంవత్సర సరి యుష్టధాన్య మిత్తు నని।
బొందక క్లేశము స్వస్థ చిత్తమున భోంచేయుండనగ విని॥ ౧౮.
పండరి విప్రుడు భక్షణజేసెను పరితృప్తుడు తానగుచు।
మెండుగ దాతకు వేదసూత్రముల మేలు దీవెనల నిచ్చు॥ ౧౯.
దామజీయును తన తలారి వెంబడి ధాన్యమంపె నిరుపుట్లు।
సేమంబలరగ బ్రాహ్మణు డేగెను చిక్కె ధాన్యమని యిట్లు॥ ౨౦.
పండరి పురమును ప్రవేశింపగను బహుజను లుపవాసమున।
నుండుట చేతను బలాత్కారముగ నొత్తిలిగొని ధాన్యమున॥ ౨౧.
ఎచ్చటనుండీ ధాన్యము దెచితివి యెవరిచ్చిరీ యని యడుగన్।
విచ్చలవిడియా విప్రుడు మంగళవేడనుండి యన వినగన్॥ ౨౨.
ధరలో ధీరుడు దామజిపంతులు దయనొసగిన యన్నమును।
పురజను లందరు గైకొని వెళ్ళిరి పూర్వకర్మగతి గాను॥ ౨౩.
దారాపుత్రుల దురదృష్టంబున ధాన్యమంత బోయెనను।
ఘోరదుఃఖమును బొందగ నచ్చట గురితో పురజనములును॥ ౨౪.
ద్విజవరులెల్లను వచ్చిరి యప్పుడు తిరమున దామజికడకు।
సుజన వినతుడా విప్రులచూడగ సూటిగ శిరమున మ్రొక్కె॥
ఘనదీవెనలను ద్విజవరులందరు గావించుచు మరియపుడు।
దినము కఠినమై గానుపించె నిటు తిననన్నము లేకుండు। ౨౬.
ద్విజవరునకు ధాన్యము నీవిచ్చిన ధీరత్వంబును వినుచు।
సుజనుల పోషణ చేయువాడవని సూటిగ వచ్చితి మనుచు॥ ౨౭.

శాంతియు దాంతియు సద్భావంబును చక్కగలిగి తానుండఁ।
కాంతియగునటుల పనులను జేయుచు కడుప్రేమముతో నుండఁ॥
మిగులనేర్పుతో పనులను జేయగ మేలిమి నృపు డాతనికి।
తగు నధికారము మంగళవేడెను తలఁపడి యిచ్చె నతనికి॥ ౩.
యోజనద్వయము పండరి పురమున కుండునట్టి యూరదియు।
ఓజను సతితో నచటికి బోవుచు నోగి సేవల నుండుటయు॥ ౪.
అతిథులు వచ్చిన నన్నము బెట్టుచు నభ్యాగతులను బ్రోచు।
సతతము శ్రీహరి పండరి పతిపై సద్భక్తియు దానుంచు॥ ౫.
బహుకాలంబిటు లుండగ నచ్చట ప్రాపించెను కాటకము।
మహదాపదచే మనుజ మృగాదులు మరణము నొందిరి సుమ్ము॥ ౬.
వేరుదేశముల కరిగిరి కొందరు విత్తనంబు లేకుండఁ।
నీరసమగుటను బహు సంకటములు నిత్యము బొందుచు నుండఁ॥
పండరియందును బహు కఠినంబుగ బహువిధముల తల్లడిల।
కొండొక విప్రుం డాకలి గొనుచును గూడె మంగళవేడెల ॥ ౮.
అన్నము నేటికి నాకిట దొరకునె హరికృష్ణాయని యనుచుఁ।
ఖిన్నత నాతడు దామజి వాకిట క్రియతోడను నిలబడుచుఁ॥ ౯.
ఉండగ దామజి స్నానము చేసియు నోగిరమ్మని యనగాను।
మెండు ముదంబున నదిలో మునిగియు మెల్లగనటు వచ్చెమును॥ ౧౦.
(యాచక జనులకు మంచి వచనముల యత్నమునను బలుక వలెఁ।
జూచి యిచ్చుటకు నెదిలేకున్నను సొరది నాదరింప వలెఁ॥ ౧౧.
నరక భోగమును బొందగ వలయును నమ్రుడుగాక యాచకును।
పరిపరి విధముల బల్కియు మనసును బహుసాయాస మిచ్చినను॥)
ఈగురు తెరుగుచు దామజి యాచక ఈప్సిత జనులకు నెపుడు।
బాగుగ తగునటు మర్యాదలతో బహు మన్ననచే నెగడు॥ ౧౩.
పండరి విప్రుడు పక్తిని నుండెను భక్షించుటకును తాను।
నిండుగ నన్నము నితరవస్తువులు నెజె విస్తర నుంచగను॥ ౧౪.

'మజిపంతులు చెవిని వినినను తల్లడిలక దా నుండఁగ।
నేమము లేకను ధాన్యము గొనుచును నెనరున మాసంబుండఁగ॥
కానడవిప్రుఁడు క్రిందిహెూదా గలిగియుండె దామజికి।
మానుగ నాతడు నృపునకు వ్రాసెను మహిత ధాన్యమును వెలికి॥
ఎల్లజనంబులు కొల్లగొన్నంగా నిలదామాజీ జేసెనను।
ప్రల్లదముగ దా పుడమినాధునకు పత్రంబును వ్రాయగను॥ ౪౩.
తీక్రోధంబున నరపతి దూతల నంపెను దామజికడకు।
వితతంబుగ నాద్విజుని బట్టుకొని వేరమ్మనె తనయెడకు॥ ౪౪.
అనవుడు పత్రికనొక్కటి బంపగ నత నాజ్ఞనుగొని పుడమిఁగ।
చెనగియు క్షేత్రసమీపము దామజి చేతులనుంచిరి కడిమిఁగ॥ ౪౫.
కరముల చీటిని క్లేశమునొందక గైకొని దామజి యటను।
వెఱపక తనకిది వచ్చుననుచును వెలయ తలచియుండగను॥ ౪౬.
అచటి జనులనిరి ప్రభువునకీతం డపకారము చేయుటచే।
ప్రచితంబుగనే దూతలబంపియు బట్టిచంప నృపు దలచె॥ ౪౭.
'కుపురమునకు బోవుమార్గమున ప్రియ పండరిపురముండు।
కుదురుగ దామజి దూతలతోడను గోరి వెళ్ళుచును నుండు॥ ౪౮.
పండరిదాపున భీమానదిలో పదపడి స్నానమొనర్చి।
నిండుప్రేమతో శ్రీహరిముందర నెనరున దండమునుంచి॥ ౪౯.
దివ్యమంగళమగు హరిమూర్తిని తేటతోడ సేవించెఁగ।
భవ్యంబగుశ్రీ పండరినాధుని పాదంబులబడి లేచెఁగ॥ ౫౦.
నిటలంబునదా నిడియు చేతులను నెఱి బ్రార్థించెను మున్ను।
కటితలమందున కరములుంచుకొని కరుణను జనుల గనుచును॥
భక్తపోషణంబగు సుఖదీక్షను బట్టిన శ్రీహరి, నేను।
సక్తుడ నగుచును నృపునకు జేసితి సర్వాపరాధములను॥ ౫౨.
శిక్షించుటకై పరిజనములతో చేకొని నను దెమ్మనెను।
పక్షపాతమును బొందక పంపెను భటులతోడ బోయెదను॥ ౫౩.

ఉదారగుణమున మాయెడ కృపచె నొప్పగ *కొలుచిచ్చినను।
నిదానమగునటు శాశ్వత సుఖమును నీకును శ్రీహరి యిడును॥
క్షేత్రపండరిని చేరినవారము శ్రీహరి కృపగలుగునన।
పాత్రులగుదురని దామజివారల బసచేయించె నెనరున॥ ౨౯
వడవడి భార్యను బిలిచి పలికెనటు పండరి ద్విజులాకలిని।
వీదితంబుగనే పొందుచు వచ్చిరి వేగమె యిడు ధాన్యమని। ౩౦
కరువుకాలమున దూరపు విప్రులు కడుదైన్యముతో నిటకు।
సరగున వచ్చిరి బొమ్మని యనినను సత్వహానియగు మనకు॥ ౩౧.
రాజధాన్యమును రెండంబరముల రాశిగలదు మనవద్దన్।
రాజిని ద్విజులకు నిచ్చివేయుదము రామమూర్తి ప్రియమొందన్॥
క్షితిపతి వినినను నాదు ప్రాణముల చేకొను తప్పిదమునకు।
సతతము తనువున మదినుంచిన యెడ చచ్చెదరిందరు నిటకు॥ ౩౩.
ఇటులుండుటచే నేమొన ర్తుమన హితయగు సతి యిట్లనియెన్।
పటుతర యుక్తిని చూడ బ్రాహ్మణుల పరిపాలన మేలనియెన్॥
ఇదివిని యాతడు ధాన్యరాశియెడ నేతెంచెను ముదమునను।
పదవడి ద్విజులకు వలయు ధాన్యమును పంచియిచ్చె నయ్యెడను॥
ధాన్యరాసులను దీనులకిచ్చుచు దామజి యటనుండునని।
మాన్యులు పండరివాసులువిని యా మహి సరగునవచ్చి గని॥ ౩౬.
ఆతనిజూచుచు హరి నిన్నెపుడును నాదరమున రక్షించు।
నీతిగ దీవెనలిచ్చుచు ధాన్యము నెనరున వారలు గొనుచు॥ ౩౭.
అంత్యజుండు మొదలగువారలకును నాతం డియ్యాగోలిచెమును।
సంత్యక్తంబగు నభిమానుండని సకలజనులు ననిరటను॥ ౩౮.
జాతిభేదముల చూడక ధాన్యము చనువున దానిచ్చినను।
ఆతతముగనే నన్నమిడితినని యతడు దలపకుండుమునను॥ ౩౯.
దేశదేశముల దాటెను కీర్తియు తెగి దుష్టులు కొందరటన్।
పేశలుడగుచును రాజద్రవ్యమును పెంపుగ నొసంగెననుటన్॥ ౪౦.

---

* కొలుచు = ధాన్యము.

శిరచ్ఛేదమును జేయుసాన్నృపుడు శ్రీహరికృష్ణా యనుచు।
అకమరలేవిచి యంత్యాకర్శనం బచ్యుతరంగా యనుచు॥
లోభముంచుమని బహుగాపలికివి లోకించుచు హరిపదము।
ప్రాభవముగ కిన్నీరొలుకంగను భక్తుడు రుక్మిణి పదము॥ ౫
ఒకు దండంబిడి పురమును విడిచెను లఘువున సవ్యముగాను।
ప్రకటంబుగ శ్రీహరినామంబును బలుకుచు వేగముగాను॥ ౫౬.
భారము హరిపై నుంచగ, బాపడు బహు ధాన్యము కొల్లలిడెౘ।
వారక దానిం గోవిందుడుగని పంచముడై తా నిగుడెౘ॥ ౫౭.
గుడ్డచింపులను గట్టెను తలకును గుంజపూస మెడలోను।
దొడ్డగు గోంచియు కట్టెయు నొక్కటి దురుసుగ దానుంచుకొను॥
కమలాదేవియు గన్గొని దీనికి కారణమేమని యడుగఁ।
సుమహితుడగుచును శ్రీహరిబల్కెను సూటిగ దామజి గనగఁ॥
ఆనామికుడనై యతనిని బ్రోచెద ననుచు జెప్పి యటుపిదపఁ।
సునీతుడగుచును శ్రీముఖమొక్కటి సొంపుగ వ్రాసెను నొప్పఁ॥
మొహరీలనుదా మూటగట్టుకొని ముద్రవేసి నృపు పేరఁ।
బహుత్వరలో హరి బిదరుకరిగియటు భటులంగని తగజేరఁ
వరుసతో మంగళవేడనుండినే వచ్చితినని తెలిపించెఁ।
నరపతివద్దకు వచ్చియు భటుడును నయముగ తానెరిగించెఁ॥
తోడుకొనియు రమ్మని నరపతియును దురుసుగ జెప్పగ నపుడు।
సీడక యాతని దెచ్చిరి సభకును వేగమె గని యాతండు॥ ౬౩.
రాజావినుమో రాజనరేంద్రా రాజపూజితా యనుచు।
ఓజను స్తోత్రముజేసె ననామికు డో తండ్రీవినుమనుచు॥ ౬౪.
ప్రధానియప్పుడు పేరూరేమని ప్రభువునెదుట నడుగగను।
మధుర వాక్కునను ననామికుండను మంగళవేడ నుండుదును॥ ౬౫.
దా[illegible]జిపంతునకును చాకిరి ధర జేయుచు నుందునను।
వేహ[illegible]ను ఝటు విశ్వామహారుయను వెలయు పేరుభువిలోను॥

శ్రీ

శ్రీమతేరామానుజాయనమః.

భగవన్నిర్హేతుక కటాక్షముచే ప్రాప్యభూమినిపొందిన

భక్తశిరోమణుల చరితలనుదెలుపు

# భక్తమాల.

ఇది

మహారాష్ట్రభాషయందు మహీపతిబావాయను

భక్తశ్రేష్ఠునివలన రచింపబడిన

భక్తవిజయము, సంతవిజయము, భక్తలీలామృతము, సంత

లీలామృతమను గ్రంథములను క్రోడీకరించి,

వె. బాలకృష్ణ మొదల్యారిచే

తెనుగున

తోహారా కవితలగా రచింపబడిన పదిసంచికలలో నిది

ఎనిమిదవ సంచిక.

చెన్నపురి, మవుంటురోడ్,

"కమ్మర్షియల్ ముద్రాక్షరశాలయందు"

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

౧౯౦౦వ సంవత్సరం నవంబరునెల.

శ్రీమన్ విచిత్ర శతావధాని, విద్వన్మణీమహాభాగవత సలక్షణ
కృష్ణ యజుర్వేద ఘనపాఠి,హరిదాస బాళేగడ్డె కట్టె,
శ్రీమాన్ లక్ష్మణాచార్య కృత కృతిప్రశంస.

---

శ్లో॥ గ్రథితేయం బాలకృష్ణదాసేన లలితైః పదైః।
భక్తమాలా విష్ణుభక్త చిత్రచారిత్రబోధినీ। ౧॥
మహాకవి కృత గ్రంథప్రౌఢిమానం శ్రయత్యహో।
ఇతి శ్రీభగవద్గీతా లక్ష్మణార్యోऽనుమన్యతే॥ ౨॥

క్షమలేశమెప్పుడుండదు ప్రయోజనము లేదు నతనికి కరుణించుచు॥
సుమహిత జనులకు బాలకృష్ణుఁడును సాంచిగ నాస్వామి వెలసెఁగ॥

ఉద్ధవ శిష్యుని చరిత్ర.

ఉద్ధవశిష్యుడను నొకవిప్రుండుండెను ధాపరంబున
సద్ధర్మంబుగ శ్రీహరిభజనను సలుపుచుదా ముదమొందెను ౧.
కవిత్వరచనచె ప్రజలకు భక్తిని కలిగించెను బహుగాను
సవినయముగ తా సంచారముగా చనెను పెక్కుగ్రామములు. ౨.
మధుమాసంబున ప్రతిపదనాడటు మానుగతా జేయుచును
కథాకీర్తన నాదినమందున గావించెను యటుగాను॥ ౩.
మాధుర్యంబగు కథనువినంగనె మరియుకొన్ని దినములటఁ।
పాడుగప్రజలును నుండుమటంచును బలుకుచుపొందుగ వేడఁ॥
ఉద్ధవు డనియెను రామనవమికిని యూరుకుబోవలె ననగఁ।
పద్ధతి నవమిని సలుపుమిచటయని ప్రజలందరు జెప్పంగఁ॥ ౪.
సమ్మతించుచును నుద్ధవుడుండగ సకలప్రజలు గూడుచును।
సొమ్మసిల్లగను మంటపమొక్కటి సొగసుగ వేసిరియటను॥ ౫.
తోరణములు మరి యలంకారముల దురుసుగ జేయుచుబహుగ।
తీరుగ శ్రీరఘురామవిగ్రహము దెచ్చియునుంచుచు వెలిగా॥ ౬.
ప్రతిదినమును హరికథలం జేయుచు బాపలకన్నం బిడును।
విదితంబగునటు వాద్యఘోషములు విశ్రుతముగ కలుగగను॥ ౭.
హరిదాసులు నటు దిండి పతాకము లమితజనంబుల తోడఁ।
సురుచిరమగునటు యుత్సవ మొనర్చి చుట్టిరి వీధులు జూడఁ॥
సమారంభమున బోవగ తురకలు సహస్రజనులటు గూడి।
కుమార్గవర్తులై మసీదు ముందర కొనబోరాదను చుండి॥ ౧౦.
భజన పరులునటు కీర్తనసలుపుచు ప్రబలవీధి చుట్టగను।
కుజనులుమెండను రాళ్ళను గైకొని గొట్టగ వారయ్యెడను॥ ౧౧.

బాధల జెందుచు నుద్ధవు శిష్యులు పరగ తాము వెళ్లుచును
వేధనుబొందిన సంగతిదెల్పిరి విష్ణుభక్తునకు నటను॥ ౧౨.
ఇదివిని యుద్ధవుడతి దుఃఖితుడై యేగె రాము సన్నిధిని।
పతితపావన దీనపోషకా భవదియ యుత్సవ సరణి॥ ౧౩.
నీకుసమ్మతై యుండని యెడనే నేలవృథగ బూనితిని।
ప్రాకటముగ విశ్వాత్ముడవీవును పరాత్పరుం డగుటగని॥ ౧౪.
అందరి యందును నీవుండుటచే నవని ఖేద మెందుకని।
పొందుగ మూర్తిని పెట్టెలోనుంచుచు భూరిపందిలిక విప్పమని॥
హరిదాసులకును దండము బెట్టుచు హరిరామా యనుచును।
థిరముగ నామము జెప్పుచు తానటు దీనత కూర్చుండగను॥ ౧౬.
హనుమంతుడు క్రుద్ధుడై నగరము నరసి నీరు జేతుననీ।
ఘన మసీదుపై నెక్కుచు తానటు కాళ్ళతోడ నూపగని॥ ౧౭,
సమీపమందును జ్ఞానఫకీరుడు సాధుమార్గముండుచును।
ప్రమేయ సారా యాంజనేయనీ భవ్యపదము ప్రొక్కెదను॥ ౧౮
దీనుని గుడిసెను త్రొక్కవలవదని దీర్ఘధ్వని యిడగాను।
మానుగనచ్చట తురకలందరా మనుజుని వెంగలి యనుచును॥
ఆకాశముగని దండంబిడెనని యందరునటు యనగాను।
ప్రాకారముతో మసీదు బడునిటు పారుడనె ఫకీరుడును॥ ౨౦
యవనులువింతను బొంద మసీదును నాంజనేయుడటు గూల్చెను।
వివరముగాగా హాహాకారము వే నృపునకు వినవచ్చెను॥ ౨౧
ఫకీరుజ్ఞానుండిది విని వెళ్లెను బాదుష మందిరమునకు।
ప్రకర్షముగ దెల్పెను హనుమంతుని ప్రబలచర్య యిదియనగు॥
రాజువినంగనె భీతినినుద్ధవు రమ్యసన్నిధికిని వచ్చెను।
ఓజనుయాతని పదముల బట్టుచు నొగివెయి రూపాయలిచ్చెను॥
దండము బెట్టుచు నాతనికనియెను దయ క్షమగొని మీరలును।
దండిగనుత్సవ ప్రక్రియ సలుపుడు ధరపావన మగునిటను॥ ౨౪

లోఁదరయిచ్చిన వారలందరును దుర్దశనొందిరి యిటను।
పంతమునహరిని ప్రార్థింపుమునా ప్రాణముబోగగు నటును॥ ౨౫.
అనుచు వేడుచును నవనీపతియును నటువెళ్ళెను తనగృహము।
తనివినియందరు తిరిగియుత్సవము తప్పగసలిపిరి దినము॥ ౨౬.
ద్వాదశి యందును మహోత్సవంబును తాళవాద్యముల తోడన్
పాడుగ వీధులయందును తిరిగిరి బహుళసంభ్రమముజూడన్॥
విఠలునిపదముల మనసునునుంచిన విఘ్నములేవి రాకుండు।
పటుతరముగనే బాలకృష్ణుడును భక్తులకును దాసుండు॥ ౨౭.

---

## విసోబాసరావు చరిత్ర.

పండరియందును విసోబ యను నొక బ్రాహ్మణ భక్తుండుండెన్।
అండజవాహను నాతడుగొల్చుచు హరినామము జెపుచుండెన్॥ ౧.
ఇచ్చిపుచ్చుకొను వ్యవహారంబును నెలమిజేయు సత్యమున।
వచ్చిన యతిథికి నన్నంబిడుచును వనితయు పుత్రులతోన॥ ౨.
కరువుకాలమటు నొకయెడరాగను కఠినమగుచు జనములకు।
దొరకకుండెనట నన్నమునీరును దొంగల బాధయు కలుగు॥ 3.
అన్నాతురులై విసోబ వద్దకు నఖిలద్విజులు రాగాను।
విన్నాణంబుగ భోజనమిచ్చుచు విహితపరచె వారలను॥ ౪.
ఇటులంజేయగ కొన్నిదినంబుల నింటిపైన వ్యయమయ్యెన్।
పటుతరభూషణా లంకారములు పాత్రములును సెలవయ్యెన్॥ ౫
దేహమనిత్యంబనుచును దలచుచు దీనులకన్నం బిడియెన్।
బాహుళ్యంబగు సొత్తువ్యయముచే పరపత్యంబును పోయెన్॥ ౬.
పరిపరివిధముల దివాలాయెనని బలుకుచుండిరి ప్రజలు।
వెరపునఋణమును నియ్యకుండిరటు వేడినాను వర్తకులు॥ ౭.
కానేగ్రామున పఠానుడొక్కడు ఘనతర ధనము కలిగుండెన్।
దానెవెళ్లియట నేడునంచలగు ధనమునువడ్డికి వేడెన్॥ ౮.

ద్విగుణంబుగ తానిచ్చెదననచును తీరుగపత్రము వ్రాసెన్।
ప్రగల్భద్రవ్యము దెచ్చిక్షుధితులకు భక్షణమును చేయించెన్॥ ౯.
సాదువుడొక్కడు రాంపురిబావా చనుచును పండరికటను।
పాదుగవిసొబా సంగతి వినుకొని పరిశోధించును తాను॥ ౧౦.
చింపుదుగోచియు మైలమేనుతో చేరె విసోబా గృహాము।
పెంపగునాకలి యన్నమిమ్మనియు పెద్దగధ్వని వేసెనుము॥ ౧౧.
విసోబ వెలపల వచ్చిచూచుచును వేగలోన బిలుచుచును।
సుశీలయగుతన సతితోవానికి సుస్నాన మొనర్చుచును॥ ౧౨.
పిచ్చివాడుయని యలక్ష్యపరచక పెంపుగభోజన మిడియెన్।
మెచ్చియు రాంపురి పుణ్యాత్ముడవని మేలు దీవెనల నిడియెన్॥౧౩.
కుజనులు కొందరు పఠానువద్దకు కోరివెళ్ళి బలికిరటన్।
నిజము విసోబ దివాల యెత్తెను నీద్రవ్యము నతనందన్॥ ౧౪.
ఎందుకిచ్చితివి యనుచుజెప్పగను నింతకె కుపితుండగుచు।
సందియమొందక విసోబ యింటికి సరగ పఠానుడు వచ్చు॥ ౧౫.
అప్పుగ తీసిన ద్రవ్యమునంతయు నందజేయు నాకిపుడె।
తప్పగ కొంగును బట్టుకొనుచు మరి దాటనియ్యనని యుండె॥౧౬.
అనేకవిధముల మాటలు బలుకగ నటవిసోబ ధైర్యముచే।
వినీతుడగుచును యేడుదినములలో వెరసినిత్తు సరిజూచె॥ ౧౭.
పఠానుడందుకు సాక్షినుంచుమన పరులను నట నల్గురుని।
కఠినుండగు నా పఠానుముందర కనుపింపగ చూప గని॥ ౧౮.
సాక్షిజెప్పెదము నిజము విసోబా సర్వఅప్పు ద్రవ్యమును।
పేక్షింపుచు తానిచ్చును సత్యము వినవలెనని జెప్పగను॥ ౧౯.
పటానుడనియెను దూరగ్రామమున బసగొని యుంచెటి వాడన్।
కటాకటిగ నారూకను వాయిదకు గట్టిగ పంపుండింటన్॥ ౨౦.
అనుచును జెప్పుచు పఠాను వెళ్ళగ నతిచింతనుగొనివిసొబా।
తనకడసొత్తును నప్పునకును సరి తా గానక గరిమొప్ప॥ ౨౧.

ఏమియు దోచక నారుదినంబులు యేపున నూరకయుండి।
వేమరు మదిలో పఠానుదలచుచు విరలు దలచగాకుండి॥ ౨౨.
అసత్యవచనము జన్మముమొదలుగ నాడకుంటి నేనిపుడు।
పొసగగ జెప్పిన మాట యబద్ధమై పోవచ్చెను గద నేడు॥ ౨౩.
రూకల కొఱకై దారిజూచుచును రోయుచుండు పఠానుడును।
ప్రాకటముగ నే నేమిచేతునని బహుఖేదము నొందగను॥ ౨౪.
భగవంతుండు విసోబసరావుని పాత గుమాస్తా వలెను।
సగటున ద్రవ్యము వడ్డిచేర్చికొని చనెను పఠాను గృహమునకు॥ ౨౫.
మూటను విప్పియు పఠానుముందర ముట్టజేసె పైకమును।
పాటవముగ నే నలుగురుసాక్షుల బట్టి రసీదు తీసికొనును॥ ౨౬.
ఎచ్చట దొరికెను రూకలు యనుచును నెలమి జెపుచు పఠానుండు।
సచ్చరితుడు విసోబ యనుచును సత్యము నుడువుచునుండు॥ ౨౭.
రసీదందుకొని విసోబయింటికి రాజీవాక్షు డరుగుచును।
సుశీలు నాతనిగృహమందుండిన †సుద రసీదు ఉంచుచును॥ ౨౮.
పారాయణ భగవద్గీతలోపల పత్రంబును నుంచిచనె।
వారక విసోబా పారాయణమును వలసిచేయ దొడగగనె॥ ౨౯.
పత్రము రసీదు చూచియు భార్యతో పైస పఠానున కియకుండన్।
చిత్రంబెట్టుల పత్రమువచ్చెను చినిగి రసీదుతో నుండన్॥ ౩౦.
తనకు తెలియదని భార్యబలుకగను తాగైకొని పత్రమును।
పనిబడివచ్చుచు పఠానువద్దికి పైకమియ్య కుండగను॥ ౩౧.
నాయెడ పత్రంబెటుల వచ్చెనో నాకును దెలియ దనంగన్।
న్యాయంబుగ నీపూర్వ గుమాస్త నాకిడెవడ్డితో చెలగన్॥ ౩౨.
సాక్షులముందర పత్రముగైకొని చని యెనవెను నాతండు।
వీక్షింపుచు దా సాక్షులనడుగగ విశదంబగుచును నెగడు॥ ౩౩.
విసోబతిరిగియు పండరి కరిగియు వెళ్ళితన గుమాస్తకడన్।
విసువున నడుగగ నతడు దెలియదన విచిత్రమిది యని జూడన్॥

*పాంచజన్యు - అగ్ని. †సుద - అగ్రము-ముందలి.

పండరినాథుఁడే యిటులఁజేసెనని భక్తిని నాతనిగనియు।
నిండుప్రేమతో కన్నీరొలుకగ నేర్చు న స్తవమును జేయు॥ ౩౫.
దాసునికొఱకై శ్రమనొందితివని దండమిడుచు నుండగను।
వాసిగ శ్రీహరి కరుణయతని పై వర్ధిలఁజేసెను యటను॥ ౩౬.
పండరిపురి నీవార్తదెలియఁబడి ప్రజలు వింతనొందిరటఁ।
నిండుప్రేమతో బాలకృష్ణుఁడును నెఱిదాసుల దాసుఁడటఁ॥ ౩౭.

## గోపీచందు చరిత్రము.

నరపతియొకఁడు త్రిలోకచంద్రుఁడని నామంబున వెలయుచును।
అరయగౌడ బంగాళపుదేశము నవని నేలుచుండెమును॥ ౧.
కాంచన పురియను పట్టణమందును కారుణ్యా యతశీలు।
పాంచజన్యగతి నీతిదప్పకను ప్రజలబ్రోచి విలసిల్లు॥ ౨.
మైనావతియను సతినిగూడుకొని మహీధరుండటువెలసెఁ।
నానాతపములు దానంబులచె నారాయణు మెప్పించెఁ॥ ౩.
గోపిచందను కొమరుడు బుట్టగ కుతూహలము నొందుచును।
ప్రాపుగ విప్రుల కిడియెను ధనమును బహువిధ వస్త్రంబులును॥ ౪.
బాలుఁడు పెరుగగ పెండ్లిచేసి భూ పటము గట్టికొడుకునకు।
వీలుగ తండ్రియు వనమున కేగియు వేంచేసెను దివమునకు॥ ౫.
పరమకార్యముల కొడుకు సలిపి యటు చాతుర్యముతో నిలను।
గుఱిదప్పక దా పరిపాలింపుచు గోపీచం దుండుచును॥ ౬.
సహస్ర ద్వయ శత సతుల గూడి సంసారముజేయుచు నుండెఁ।
బహువిభవంబుల మరిగినవాఁడై ప్రబల మత్సరత నుండెఁ॥ ౭.
పితావియోగము నొందిన పిదపను పెంపుగ మైనావతియు।
సతతము భయమునుయను తాపముతో సౌధాగ్రమునుండుటయు॥
చుట్టుఁజూచుచును నంగడివీధిని చూపును జేర్చగ నటను।
కష్టమోయు వానొకనింగనే నటు కట్టెలు తలనటకను॥ ౯.

ఛాయయు భూమినిలేకయున్నయా జాలంధరు నాథుగని।
మాయా నిరసుండని యెరింగి తా మమతలెల్ల కోసికొని॥ ౧౦.
శరణుజొచ్చి బహుసేవలజేసెను సదాచార్యున కటను!
గురుతుగ తారకమంత్రము జెప్పెను గురుడును కృపజేయుచును॥
గోపిచందు ప్రియభార్యతోడ దా కూడియుండు నటువేళ।
ప్రాపుగ సతియనె యత్తయు గురుతో పడకనువిలసిల్లు నిలకె ॥౧౨.
రాజువినుచు బహుక్రోధము నుంచియు రప్పించెను యోగుడుని।
ఓజను బైటికి విభవముజేయుచు నొనర నిద్రవోవగని॥ ౧౩.
రాత్రివేళ జాలంధరు నాథుని రాజు యిడెను కూపమున।
పాత్రతగా నొకబండను గప్పుచు పరులకు దెలియక గాన॥ ౧౪.
మైనావతియును గురునిగానకను మనసున ఖేదము నెగడు।
కానీఫుండను గురుబంధుని గని కలయవెతుకు మనుచుండు॥ ౧౫.
కొన్నిదినంబులు గడిచిన పిదపను గోపీచందొక నాడు।
పన్నుగ చమురంటు కొనగను మేడ పైని తల్లిగనుచుండు॥ ౧౬.
దేహకాంతియును శౌర్యము ధైర్యము తేజంబును గలవాడౌ।
మోహమైన యీ వయసుపోయినను ముదిమిని మృత్యువు వశుడౌ॥
పరిపరివిధముల పరిభ్రమింపుచు పరితపించి యేడ్వగను।
గురుతరముగ కన్నీరుబిందువులు గోపిచందుపై బడను॥ ౧౭.
ధరణీశుండును దిగ్గునలేచియు తల్లినిమేడపై గనగన్।
స్థిరవైరాగ్యపు వాక్యంబుల సతీ జెప్పెను సుతుడునువినగన్॥౧౮.
మనసున చింతయు ననుతాపంబును మహింబుట్టెను యాతనికిన్।
కొనగొని శ్రీగురుహంతకు బెదరియు ఘనహరి భక్తినిమరిగెన్॥
కానీఫుడు తనగురువును వెతుకుచు కాననముల దిరుగగను।
మానుగ గోరఖునింగని యతనిచె మహిగురు స్థితి దెలిసికొను॥
కరతాళముతో కాంచనపురికిని కానీఫుం డరుగుచును।
గురుతుగ శిష్యులు సప్తశతంబును కూడియుహరి బాడుచును॥౨

ఉపవనంబు కడనుండి చారులను నూహింపుచు దా బిలిచి।
నిపుణంబున తన రాక జెప్పుమనె నృపవరునకు నటుమించి॥ ౨౩.
గోపిచందు మైనావతి వినుచును గురుబంధువు వచ్చుటయు।
ఏపుమీర బహు కష్టంబులతో నేగియు నాతని గనియు॥ ౨౪.
ప్రణుతిని జేసిన ప్రభువునిగని దా బహుదురుక్తులం బలికెన్।
గుణియగు నాతని తల్లిని గని దా కూరిమి నిట్లనె వేగన్॥ ౨౫.
సప్తమదినమున జాలంధరు నిటు చక్కగజూచెద వనియు।
గుప్తంబగు తన కొడుకపరాధము కూర్మిని దా దెల్పుటయు॥ ౨౬.
అమర శరీరుం డత్యుదారుడు యనఘుడు తన గురుడగును।
కొమరు మిగులగను కాలుని గెలిచిన కోవిదుడై యుండునను॥ ౨౭.
తల్లియు వినుకొని తత్తరబడుచును తనయుని హస్తము బట్టి।
కల్లలేక కానీపుని కాళ్లపై కరుణను వేసెను నెట్టి॥ ౨౮.
త్రాహి త్రాహి యని తలమలబడుచును దైన్యముతో సతిబలికెన్।
శ్రీహరి నీవే యనుచు జెప్పగను సిద్ధపురుషుడును బలికెన్॥ ౨౯.
చాతుర్యముగా చతుర్విధలోహముల్ చలములేక నిటుదెచ్చి।
ఖ్యాతిగ గోపీచందునివలెనె క్రమముగ బొమ్మలజేసి॥ ౩౦.
గైకొని రమ్మని త్వరితపరచె నటు కానీ పానాధుండు।
జోకను నృపవరుడటు చేయించెను సొగసుగ బొమ్మలనాడు॥ ౩౧.
గురుడు పడుండెడు కూపసమీపము గోష్టిని వేంచేపించి।
వెఱపక కానిపు డనునటు నృపుడిడె *వెఱబొమ్మలపై చుంచి॥ ౩౨.
అలఖుశబ్దమున ధ్వని వేయంగను నాచార్యుండది వినియు।
ఇలనెవ్వడవన భూపతి బలికెను నెలమి గోపిచందనియు॥ ౩౩.
భస్మంబగునని బలికిన యప్పుడు ప్రతిమయును నటు నీరయ్యెన్।
విస్మయమొందిరి వివిధజనంబులు విశ్వవంద్యుడని చయ్యన్॥ ౩౪.
నాలుగు బొమ్మల నటులనే జేసియు నరయోగీంద్రుండపుడు।
వీలుగ నైదవ సారి నృపుండె వే ముందర నిలుచుండు. ౩౫.

*వెఱ - భయము.

అనఘుడు గురుడనె నమరుడ వగుమన నపుడె భృత్యులను బిలిచె।
వినయముతోడను గోపిచందుడటు వీరత్వంబున వెలసె॥ ౩౬.
కప్పురాతినిం దీసియుచూడగ కాంతిని గురు విలసిల్లెన్।
నిప్పువంటి జాలంధరునాధుడు నీటతేల గని మెల్లన్॥ ౩౭.
వెలపల దీసియు నతిముద మొందుచు వేడుకలటు లలరంగన్।
కలిమిమీరగను గోపిచందుడటు కాళ్ళనుబట్టు కొనంగన్॥ ౩౮.
విరక్తి నొందిన చిత్తముగాంచుచు విమలబోధ గురుడిచ్చెన్।
గురుచరణంబుల హృదయమునుంచుచు గురునికృపను దావడసెన్॥
ధరణిప్రభుత్వము దారా పుత్రుల తత్క్షణమందే విడిచెన్।
నరాళముగతా సర్వఘటంబుల సర్వేశ్వరునే జూచెన్॥ ౪౦.
భార్యవద్ద తాభిక్షుకువెళ్ళియు పలికెవిరక్తి మాటలను।
కార్యముతో యమ్మాయని యామెను సర్వేశ్వరుగా గనెను॥ ౪౧.
మైనావతినిన్ మన్నించియు గురు మళ్ళెను తీర్థాటనకు।
అనామయుండగు గురుని చేరి నృపు డమరకాయుడై వెలుగు॥ ౪౨.
ఈచరిత్రమును వినినబఠించిన నీప్సితార్థ మొనగూరు।
గోచరమగు గోవిందుకటాక్షము గుటీబాలుడు వినగోరు॥ ౪౩.

---

## భర్త్రిరాజుచరిత్రము.

భర్త్రి నరపతి విక్రమార్కుడును భవ్యసోదరులు నగుచు।
గురుతుగ ప్రజలను యవంతీపురమున కుతుకముతో పాలించు॥ ౧.
భర్త్రి జ్యేష్ఠుడు ఛత్రపతియునై పట్టమేలివీల సిల్లెన్।
వెలివక విక్రము డువరాజగుచును వెలసిజేయు పనులెల్లన్॥ ౨.
శీలను ధర్మము గైకొని నరపతి చిరతర సుఖమున నుండెన్।
పీలుగయాచక దుర్బలులచ్చట వెలయకుండ గా నిగుడెన్॥ ౩.
భర్త్రి నరపతి మన్మధునివలెనె బహుసుందరుడై యుండు।
నిరతిశయంబగు రూపున పింగళ నెళవున సతియైయుండు॥ ౪.

సతిపతులిద్దర కన్యోన్యంబగు సఖ్యంబును గలుగుటచె।
క్షితిపతి సభలో వియోగ తాపము జెందకుండ నొక నరుచె॥ ౫.
పటమునొకటి తన భార్యరూపమున బాగుగ వ్రాయించుచును।
*శఠన రహితుడై సభయందుంచుచు చక్కని చూచుచునున్న॥ ౬.
సకలవిద్యా పారంగతుడును సత్కవీంద్రు డాతండు।
ప్రకటితముగ నొక నీతిశతకమును బాగుగ జేసెను నాడు॥ ౭.
శృంగారంబగు మరియొక శతకము చేసెను యానరపతియు।
అంగజు వృత్తులు భోగవిలాసము నందున బాగుగ వెలయు॥ ౮.
అన్నిలక్షణము లాతనికుండియు నతని భార్య జారిణియా।
పన్నుగ భర్తపై ప్రీతిని జూపుచు పరపురుషుని గనునదియా॥ ౯.
బహునిపుణుండై నరపతియుండియు భార్యగుణము గనకుండె।
ఇహమున కీర్తియు యశసుతక్కువగు నిట్టి భార్యతో నుండె॥ ౧౦.
చరపట నాథను సిద్ధపురుషునికి శరణు జెంది నరపతియు।
గురుతుగనాతని యుపదేశంబును గొనెనుతనకు సరియయ్యు॥ ౧౧.
భక్తి విరక్తులు లేనిజ్ఞానమును భర్త్రియును బొందుచును।
సక్తిగ నాతడు విషయలంపటుడై సలుపుచుండె రాజ్యమును॥౧౨.
ఆచార్యుండును జ్ఞానపూర్తిచే యవని దిరుగు లోకములు।
ప్రాచీనులునకు పుణ్యవంతులకె భవ్యరూపు జూపునిల॥ ౧౩.
అమరావతికిని నరుగుచునచ్చట నతడుభర్త్రిం దలచు।
కొమరొప్పగ యవంతి నగరమునకు కోరియుగురుడును వచ్చు॥౧౪.
వందనమొదలగు పూజలనెల్లను వరుసజేసి నరపతియు।
సందియమొందక సద్గురుసేవయు చక్కదొరికె నేడనియు॥ ౧౫.
జడజీవులు సంసార బురదలో సన్నివేశులై యుండన్।
పుడమిని వారల పుణ్యాలగునటుల పొందుపరతురిటు జూడన్॥౧౬.
ఇదివినిచరపట నాథుడు నరపతి కెలమినిచ్చెనొక ఫలమున్।
సదయుడై జెప్పెను యింద్రపురికి నే చనగదొరికె నిటమున్॥ ౧౭.

*శఠన - అసూయ,

సంచరించుచును నిటకును దెచ్చితి సమగ్రముగ నీ పండు।
అంచితముగ నిటు దినినయెడలను నమరకాయ మగుచుండు॥ ౧౮.
వేగమె భక్షణచేయుమనంగను వినతుడగుచు నరపతియు।
సాగిలబడుచును దండమిడుచునననె సగముఫలము సతికియ్య॥ ౧౯.
అందుకు గురుడునుమౌనివరై యుండుచునలసంచిత మున్నటులన్।
పొందిక యగునని బలుకుచు వెళ్ళెను పుణ్యుడు గురుడయ్యెడలన్॥
ఫలము నందుకొని యవనీపతియును భార్యకడకు దా వెళ్ళెన్।
సలలితముగ నే భోగ గృహంబును చనగను భార్యయు మెల్లన్॥
రాజు శరీరము కరమున దుడుచుచు రమ్యా మొందగను జేసెన్।
ఓజను ప్రేమను వేరు నరునకిడి యొగి వెలిప్రీతి గనుపించెన్॥ ౨౨.
విడెముల నిచ్చుచు మోహపు చూపుతొ వెలయనృపుని చూడగను।
*కడుకొని కామాతురుడై సలిపెను గాఢాలింగన మటను॥ ౨౩.
నిను నే చూడని గడియ యుగంబగు నీ సుందర మెటగనను।
అనువుగ నీవును నేను యిరువురము యమరులగుట కొఱకును॥
చరపట నాథుండమృత ఫలంబును చక్కగ నిచ్చెను ననుచు।
కరమున ఫలమును జూపగ నామెయు గైకొ దానింగనుచు॥ ౨౫.
మనసున దలచెను జారున కిదియును మంచిదగుచు నుండుననె।
చెనగొని మంచిముహూర్తము నందును పింగళ భక్షింతమనె॥
శుచితో మనమును స్నానము జేసియు సుఖముగ భక్షింపదగు।
వచించి యిట్టుల ఫలమును పెట్టెలో $వలతీ వేసి చెంపెసగు॥ ౨౭.
శయన యుక్తమై క్రీడల సలిపెను చక్కగ రాజున కపుడు।
నయముగ రేయిని నాలుగు జాములు నరపతి సుఖమై యుండు॥
ఉదయంబున యా రాజు వెళ్ళగను నొసగ సతియు పరపురుషున్।
కుదురుగ బిలిచియు నేకాంతంబున గుదుతుగ ఫలమును దెచ్చెన్॥
ఆతని కిచ్చుచు, భక్షించిన యెడ నమరకాయమగు ననగన్।
చేతిని నాతడు దానిం గొని పరస్త్రీయును తనకుండంగన్॥ ౩౦.

---

* ఉద్రేకించి, $ స్త్రీ ?).

దానికి నిచ్చిన ముదమగు నసుచును దలచియు దానటు మదిని।
మానిని గని నే స్నాన మొనర్చియు మహిభక్షణ జేసెదని॥ ౩౧.
చేతుల గైకొని యుండగ పింగళ చేయు నేర్పు లేకుండన్।
వేధ నొందుచును తిరిగి యడిగినను వెళ్ళిపోవు తనజాడన్॥ ౩౨.
అనుచు భయంబున నూరకుండెమును నా పింగళ తనయింటన్।
అనువుగ పండుతో పరపురుషుండును నట్టివచ్చె తనయింటన్॥ ౩౩.
అశ్వ సేవకుండా తని పరసతి యచ్చటుండు పులింద యగు।
విశ్వసించి యా ఫల మిరువురు తిని విపులకాల ముండదగు॥ ౩౪.
ఇటులం జెప్పుచు పులింద చేతిని నిచ్చెను యాతడు ఫలము।
పటుతరముగ నట గైకొని యాడుది పరగ జెప్పె నిరువురము॥
దాసీ జనులమై యుండు మనకును తగ దుసురుల బెంచుటకు।
వేసరిల్లకను రాజున కిచ్చిన విహితము మనకందరకు॥ ౩౬.
పుణ్యశీలుడును ధర్మాత్ముండీ భువినేలుచు నుండినను।
గణ్యము జనులకు సత్వరి పాలన కలుగును ప్రజ కియ్యెడను॥ ౩౭.
అమరుల మగుచును మనముండిన యెడ నశ్వసేవ జేయవలెన్।
కామరొప్పగ నీ ఫలమును నృపునకు కోరికెతో నియ్యవలెన్॥ ౩౮.
జారకర్ముడును ముదమొందక దా చను వికచెడునను భీతిన్।
ఊరకుండగను పులింద యప్పుడు నూరికి వెలి చని రీతిన్॥ ౩౯.
గంపలోన పెండను నిడి యందున కాంతి గలుగు ఫలముంచెన్।
పెంపుగ చనగను రాజవీధినటు పృథ్వీపతి తగ గాంచెన్॥ ౪౦.
దూతను బంపియు దగ్గిర రమ్మని దురుసుగ ఫలమును జూడన్।
పాదుగ తన గురు డనుగ్రహించిన ఫలము గదా యని జాడన్॥
పులింద నడిగెను ఫల మెచటిది యని పొసగ జెప్పె నామెయును।
కళంకయుక్తుడు నశ్వ సేవకుడు కరుణతోడ నిచ్చెనను॥ ౪౨.
ఇదివిని నృపుడును నశ్వ సేవకుని నెలమి నచట బిలుచుచును।
పదపడి నీ కీఫల మెటు వచ్చెను బలుకు మనెను సత్యమును॥ ౪౩.

మౌనంబుగ వాడుండగ దెబ్బల మహిపతియును గొట్టించు।
దీనుండగుచును దుఃఖము నొందుచు దెలిపెద నను కరుణించు॥
భయము లేదు నిను చంపను నేనని భర్త్రి నరపతి జెప్పన్।
నయముగ వాడును పింగళ యిడెనని నమ్ర భావమును జూపన్॥
అమరులకును నది యందని ఫలమగు నామెయు నీ కెటులని దన్।
క్రమముగ నరపతియడుగగ వాడును-ఘనమగు భయమునుగూడెన్॥
నాతో నామెయు రతి సల్పును మరి *నరగగ నేకాంతముల।
నీతిగ నిరువుర తీని సుఖంతమని నెటి ఫలమిడె నాకునిల॥ ౪౭.
బైట దేలిసినను ప్రాణ ఘాతమని భయతర భోగము కన్న।
పాటవముగ నే పులింద దాసికి పరమ ప్రేమతో నున్న॥ ౪౮.
ఫలమును దెచ్చియు పులింద కిచ్చితి భక్షించెదమని జెప్పన్।
ఇలలో దాస్యపు వృత్తిని నుండగ నేల వయసు పెరిగింపన్॥ ౪౯.
అనుచు పులిందయు రాజున కిడినను నవని యంత క్షేమమగు।
తనుతా జెప్పుచు నీకడ వచ్చెను త్యథమనుచు జెప్పనగు॥ ౫౦.
ఇదివిని నరపతి యనుతాపముతో నీశు దలచ కిదివరకు।
చెదిరిన సంసారములో నేబడి చిక్కితి వ్యర్థ మునాకు॥ ౫౧.
హరిచరణంబులె దిక్కగు ననుచును నమిత విరాగియై యపుడు।
నిరయ హేతువగు నింద్య సుఖంబున నెనరుంచితినని జూడు॥ ౫౨.
మైథున సుఖమతి తుచ్ఛంబనుచును మానుకొనుచు నటుతాను।
వేధనొంది యీ శరీరమును నే విష్ణు సేవ నుంచకను॥ ౫౩.
కాలము వ్యర్థము గడిపితి ననుచును కన్నీ రొలుకు-చు నపుడు।
వీలుగ జేసెను వైరాగ్యముగను వేరొక శతకము నాడు॥ ౫౪.
భార్యను బిలిచియు జారున కిచ్చుచు భయ మొందక మీరలును।
కార్య సఫలతను జేసికొనుము నిక కలతలొంద కియ్యెడను॥ ౫౫.
అనుచు జెప్పి యాఫల భక్షణతా, నరమర లేకను జేసెన్।
ఘనరాజ్యంబును విక్రము కిచ్చుచు గరిమెను నటవికి నడచెన్॥ ౫౬.

*అనర్థభేదము.

ఆచార్యుం డిది వినుకొని వచ్చియు ననుగ్రహించెను బాగ౯।
ప్రాచీనుల గతి భరత్రి రాజును ప్రబల తపసియై వెలుగ౯॥ ౫౭.
సిద్ధులతోడను సంగము గలిగియు చేరె గోరఖు మచ్ఛులను।
పద్ధతి వారల చరితల వ్రాసును బాలకృష్ణ దాసుడును॥ ౫౮.

---

## నాగనాథు చరిత్రము.

ఇందుశేఖరుని యంశముతోడను నిలమానూరను పురిలో।
పొందుగబుట్టెను నాగనాథుడను పుణ్యపురుషు డీభువిలో॥ ౧.
తపో విఘ్నంబగు ననిదలచుచు ధర మలినత్వము నుండు।
ఉపాయమునదా పెండబూడిదెను నొనరదాల్చు మేనుకడు॥ ౨.
అసంఖ్య మక్షికలాతని ముచ్చును నవని పిశాచములటను।
పొసంగనాడుచు భూతగణంబులు పొందికగొను నయ్యెడను॥ ౩.
మహాసర్పములు చుట్టుదిరుగునటు మహీజనులు భయపడగ౯।
నిహీనవృశ్చిక గుంపులుమేనుపై నెనరున దిరుగును వెలిగ౯॥ ౪.
కొందరుజెప్పిరి మోహినిమంత్రము గుటిగ వశంబగును యని।
సందియమొందక యతనిజూచినను సంసారము చెడునుయని॥ ౫.
అమంగళుండని కొందరుజెప్పిరి యనఘుడనుచు కొందరును।
క్రమంబులేకను పరిపరివిధముల కల్లలాడు చుండగను॥ ౬.
నాగనాథుడును వారివాక్యముల నయముగ దా నెంచకను।
త్యాగశీలుడై సాధన జేయుచు తగువైరాగ్యము గాను॥ ౭.
శీతాకాలము వస్త్రములుంచక చేరనవర్షాకాలమున।
నీతినిపర్ణపు శాలనుబోవక నిలుచు నూష్ణకాలమున॥ ౮.
ఛాయను వెతుకక యుండును నాతడు సరివిరక్తుడై యుండు।
బాయక యొకనరుడే కలింగుడటు భక్తితోడ నొకనాడు॥ ౯.
అడవిని బోవుచు నాగనాథుగని నతిప్రేమను దండమిడ౯।
పుడమిలోననే ననాథ దీనుడ పునీతుజేయు మని వేడ౯॥ ౧౦.

తనుమన వాక్కుల శరణుజొచ్చితిని దరిజేర్పుం డనగాను।
అనువుగ తనకృప వీక్షణమిడుచును ననుగ్రహించెను నతను॥ ౧౧.
ఉపాసించుటకు మంత్రంబొక్కటి నుపదేశంబును చేయఁగ।
అపార ముదముననే కలింగుడును హరిజభనను దా వెలయఁగ॥ ౧౨.
అనన్యప్రీతిని గురువరు కాళ్ళను నప్పుడప్పుడును పిసుకు।
ఘనమధు రాన్నములింటను జేయుచు కాంతయు దెచ్చును నటకు॥
ఆచార్యునకును నిరువురు గూడియు నారగించు నటుజేసి।
వేసారక శ్రీగురుడే హరియని విపులసేవలను వెలసి॥ ౧౪.
శ్రీగురు సేవయె జపము తపములని చిరతరముగ దా జేసుఁగ।
సాగించుచు సాధన లన్నిటికిది సఫలంబని దా మనుచుఁగ॥ ౧౫.
ప్రపంచ కార్యముల్ జరుపుచుండినను పరగనరుగు గురుకడకు।
నెపములేక తా జరిపెను నిట్టుల నెఱి బహుకాలము వరకు॥ ౧౬.
చిలవంతుండను వణిజుండచ్చట సిరి సంపదతో నుండు।
ఇలతన కూతురు షోడశవయసున నెలమి మృత్యువశ ముండు॥ ౧౭.
ఆయువల్పమున వ్యాధిపీడచే యామెయు నపమృతి నొందఁగ।
మాయమమతచే బంధువులందరు మహాదుఃఖమును బొందఁగ॥ ౧౮.
ప్రేతమునప్పుడు శ్మశానభూమికి పెంపునకొన బోవగను।
*బాతియే కలింగుడు గురునింగని బాటవచ్చె నయ్యెడను। ౧౯.
పీనిగ జూచుచు భూమిని వ్రేలును పెంపుగ రాయుచు మన్ను।
మానుగ గైకొని పీనిగనొసటను మన్నును తానుంచుచును॥ ౨౦.
నాగనాథ సద్గురుడును నిన్నుఁగ నడవ మనెను తనకడకు।
వేగముగా నిటు బల్కగ నప్పుడు వెలసె నుసురు కన్యకకు। ౨౧.
ఏకలింగు వెంబడె నా వనితయు నేర్పాటుగ నటు చనియెఁగ।
జోకను జూచుచు లోకులందరును చొక్కిరి విస్మయ మయ్యెఁగ॥
కొందరు దీనిం గాంచి వారిలో గురుశిష్యులు కపటులని।
పొంచుగ బలుకుచు వారిని గనుటకు పోవుట మేల్గాదు యని॥

---

*గొప్ప.

పరిపరి విధముల బల్కుచు జనులును బరతెంచిరి యిండ్లకును|
వెరవక నరిగెను యేకలింగుడును వెలదితోడ గురుకడను॥ ౨౪.
ఇరువురు దండము బెట్టగ నప్పుడు నెలమి దెలిసె గురువునకు
తిరముగ కన్యయు సేవల జేసెను దిగంబరియునై పెక్కు॥ ౨౫.
శ్రీగురు కృపచే నాత్మ జ్ఞానము చెందెను కన్యయు నటను।
త్యాగ బుద్ధిచే స్త్రీపురుషులు యను తద్వికల్ప మొందకను॥ ౨౬.
పరబ్రహ్మమే సర్వము నందును భాసిల్లుచునుండునని।
చిరనిశ్చయతను విషయ ధ్యాసయు చేరకుండె మనసుగని॥ ౨౭.
పరమాత్ముని యెడ రతి గలిగుండెడు పరభక్తుల కియ్యెడను।
గురతరమగు యేవిషయ వాసనలు గూడవు నెప్పుడునిలను॥ ౨౮.
భేదరహితయై వర్ధమకన్యయు ప్రియగురు సేవనునుండు।
సాదుకీర్తియును దేశదేశముల చని ప్రకటంబగు చుండు॥ ౨౯.
నవనాథ సిద్ధుల్ నాగనాథుడిటు నగ్నస్త్రీతో సేవలను।
సవినయముగ బహు చేయించును యని చక్కగవిని వారలును॥
దర్శనమునకై నాగనాధుకడ తలపడి వచ్చిరి యటను।
స్పర్శను సింహ వ్యాఘ్రంబుల పై సవారియగుచు రాగాను॥ ౩౦.
వారలు వచ్చే సంగతి నెరుగుచు వలసి శిష్యుబిలుచుచును।
దారి నెదుర్కొని సత్పురుషుల నిటు తప్పక బిలువనగాను॥ ౩౨.
ఆసమయంబున యేకలింగుడును నట గోడ గట్టు చుండెన్।
వాసిగశిష్యుడు బోవ గోడ చనె వారలు వింతను జూడన్॥ ౩౩.
సిద్ధపురుషులును దీనిం గనుచును చెందిరి యాశ్చర్యంబు।
పద్ధతి మాకును నిర్జీవంబును పరగనడపు నిపుణంబు॥ ౩౪.
గలుగ నేరదని సింహ వ్యాఘ్రముల గరిమెతోడ విడుచుచును।
ఇలపై నడచుచు వచ్చుచు నుండగ నేకలింగు దండమును॥ ౩౫.
జేయుచు రమ్మని యాశ్రమమునకును జీరగనటు వారలును।
బాయకనీవును నద్భుతవింతను బాగుగజూపితి విలను॥ ౩౬.

నాగనాథు శుభదర్శనమును తగ నయముగ జూపుమనంగన్।
బాగుగ వారల నేకలింగుడును పరగదెచ్చె గురుకడగన్॥ ౩౭.
ఇంటికి వచ్చిన వారల జూడగ నితడు లేచి దండమిడెన్।
వెంటనె వారల సన్మానించియు వే కూర్చుండం బెట్టెన్॥ ౩౮.
దిగంబరిగ సతిసేవల సలుపగ తేటతోడ జూచుటకై।
ప్రగల్భముగ మేమిటు వచ్చితిమన తగునని నాగుడు బాగై॥ ౩౯.
ఆసమయంబున వర్ధమానయును నాసన్నిధి నుండగను।
వాసిగ గురుడును యామెమేనుపై వామచెయితో తుడువగను॥
యువతి రూపమును మాని యాపెయును యుత్తమ నరుడై వెలసెన్।
సవినయముగ దా వరద బసవుడని సద్గురు నామంబుంచెన్॥ ౪౧.
నవనాథులునిది గాంచుచు ధూర్జటి నవ్యయంశ మితడనుచు।
వివరంబేమియు జెప్పక వారలు వెళ్ళిరి దారిని మనుచు॥ ౪౨.
హేగరసుండను సరాఫుడొక్కడు హితపరుడై నాథునకు।
త్యాగబుద్ధితో శరణాగతుడై తలపడి యతనికి బలుకు॥ ౪౩.
పతితుడ నే నీ పాదమునిడికొని భవసముద్రమును గడవన్।
క్షితినిటువచ్చితి నభయంబిచ్చుచు చెలగినన్నుతగు బ్రోవన్॥ ౪౪.
అభయకరంబుల తలపై నిడుచుచు నలతారక మంత్రమును।
శుభకరముగ నా కనుగ్రహింపుడు సుఖదాయక యనగాను॥ ౪౫.
చిత్తశుద్ధినిం గాంచుచునాగుడు చేసెను యుపదేశమును।
(పద్ధుగభువిలో తగువిశ్వాసికి బహుధనంబు నియనగును)॥ ౪౬.
హేగరసుండును భావపూర్ణుడు యేవికలము లేకుండన్।
భాగధేయుడగు సద్గురు కరుణకు పాత్రుండగుచును నుండన్॥ ౪౭.
నమస్కరించుచు నింటికిబోవుట కాజ్ఞను దానటనడుగు।
కొమరొప్పగనట నొకదిన మందును గురునిబిలిచె గృహమునకు॥
ఆచార్యుండనె నాదుగురుతు నీ కజయగ కల్గునో లేదో।
ప్రాచుర్యంబుగ శిష్యుండపుడనె బాలిక తల్లిని గనదో॥ ౪౯.

తల్లి కురూపియై యవనిం వెలసినను తవిలి విడుచునే శిశువు।
ఉల్లమలరగను దర్శనమియ్యుము యొప్పగ గృహమున నీవు॥ ౪౦.
ఇటులం జెప్పుచు దండము బెట్టియు నేగె మోహాళ్ గ్రామునకు।
పటుతరముగ నే గురుచరణంబుల భక్తిని జేసెను బాగు॥ ౪౧.
బహుదివసంబులు జరిగిన పిదపను భవ్యగురుం డొక నాడు।
విహరింపుచు దా వచ్చె మొహాళునకు వెంగలి వేషము నెగడు॥
వికారరూపుడై మద్యపానమును విశేషముగ బచ్చుకొని।
ప్రకారముగనే మాంసకండలను బాగుగ భక్షింపగని॥ ౪౩.
లోకులందరును పిశాచ రూపుడు లోలలాడు వాడనుచు।
జోకను జెప్పుచు తిరిగి చూడకను సూటిగ వెళ్ళిరి పెలుచు॥ ౪౪.
అకస్మాత్తుగా హేగరసుండును నచ్చోటికి తగవచ్చెన్।
వికటము నొందక గురునిగనుంగొని విహితుడై యింటికిదెచ్చెన్॥
ఇతరులు జూచుచు నీవ్యావార్తలను హేగరసుని జెప్పుచును।
పదపడి యాతడు భ్రష్టుడయ్యెనని ప్రజలునింద జేయగను॥ ౪౬.
ఆచార్యునకును హేగరసుండును నరసియు పూజల జేసెన్।
ప్రాచుర్యంబుగ పదముల గడుగుచు పదతీర్థము సేవించెన్॥ ౪౭.
ప్రేమభావమున నేకనిష్ఠతో ప్రియపదముల బట్టుకొని।
నేమముతోడను కండ్లకద్దుకొని నేత్రాంబులు నిగుడగని॥ ౪౮.
విప్రజనంబులు హేగరసునకును వేసిరి యాంక్షను నటను।
అప్రమత్తులై యతనిలు బోవక నడ్డగించి రందరను॥ ౪౯.
బంధులు మిత్రులు దూరంబయ్యిరి ప్రాయశ్చిత్తము గాను।
సందియమొందుచు నెవ్వరు యాతని సమాచారము గొనకను॥
ప్రతిబంధంబుల బహుగ జేసినను ప్రబుద్ధి ధైర్యముతోను।
హితుడై హేగుడు గురుసేవల దా యిష్టపడిన వాడగును॥ ౫౧.
అనేకవిధముల సేవల జేయుచు నతనియింట నిడుకొనును।
పునీతుడగుచున్న మెలగగ నొకచో పుత్తెంచెను శ్రాద్ధమును॥

గురునకు దెలిపెను బ్రాహ్మణులెవ్వరు కుడువను రారనగాను।
సరగున జెప్పెను గురుడును నతనికి సలుపు మిపుడు పాకమును॥
పితరులు స్వయముగ భోజనమునకై పెంపుగవచ్చెద రనగన్।
వితతముగా నటు సకలవంటలను వేగమె చేయింపంగన్॥ ౬౪.
గ్రామవాసులును భోజనమునకై గరిమెతోడ రాకుండన్।
ధీమసమున హేగర సుండెందుకు తెరువుగ జేయునువంటన్॥ ౬౫.
అనుచు జెప్పుచును సిద్ధబెక్కెమున నందరు గూర్చుండగను।
చెనగొని మధ్యాహ్నము నగునప్పుడు పెనగి నాగనాథుడును॥ ౬౬.
భోజనమునకై పితృదేవతల పొందుగ నటు బిలువగను।
ఓజనువారలువచ్చి విస్తరల నొప్పుగకూర్చుండగను॥ ౬౭.
హేగరసుండును ధూపదీపముల హెచ్చుపూజ సేయుచును।
సాగిలబడి దండమునిడి వారలు సర్వేశ్వరరూపులను॥
భావార్థముతో నన్నము బెట్టగ పరగవారు భక్షించి।
దేవానీకము వెలిచని చేతుల తెరువుగ కడుగగ మించి॥ ౬౮.
అచ్చటి విప్రులు క్రుద్ధులైవారల నటు బట్టంబోవగను।
అచ్చపు తంద్రులై కనుపడుచుండిరి యమితప్రీతి బలుకుచును॥
ఒకరికియొక్కరు నాలింగనముల నొప్పుగ నటు జేయుచును।
సకల పితరులు తమకొడుకు లింఢ్లకు చనుచు ప్రేమ జూపుచును॥
మూడు దినంబులునుండి పితరులటు ముదమున వెళ్ళిరి లోకమును।
గూడియునందరు హేగరసుని యటు గొనియాడిరి బహుగాను॥
అగణిత చర్యలు నాగనాథునివి యటు ప్రసిద్ధముగనుండు।
పొగడుచు భక్తుల బాలకృష్ణుడును పొందుగ భువిలోనెగడు॥

విఠలదాసుచరిత్ర.

హిందూస్థానపు దేశమునందును ఇద్దరు ద్విజులుండి రటు।
పొందుగవారలు నన్నదమ్ములగు పూర్ణప్రజ్ఞత నెగడు॥ ౧.

అవనీపతికి యుపాధ్యాయులై యమిత డబ్బు గూర్చుకొని।
వివరంబగు నటు వికల్పచిత్తులై వేరుబడుట కెంచుకొని॥ ౨.
ధనవిత్తంబుల భాగింపంగను తలపడి యొకరికి యొకరు।
ఘనవిరుద్ధమును పరిపాటింపుచు కలిసిగొట్టుకొని రువురు॥ 3.
ఉపాధ్యాయులై యుండుట చేతను యొకరి మాటయును వినక।
అపార గర్వము నభిమానంబును నమరెను వార్లకు గనుక॥ ౪.
ఒకనికి యొక్కఁడు బలిష్ఠుడగుచును నూర్జితముగ గొట్టుకొన।
ప్రకటంబుగ వారిరువురు జచ్చిరి ప్రజలందరు నచటగన॥ ౫.
పౌరుషబుద్ధిని ధనేచ్ఛగొనియును పడిపోయిరి యిరువురును।
భూరిదుఃఖమును పొందె నిదియు విని భూపతియును నయ్యెడను॥
అన్నకు పుత్రులు లేకయుండిరటు నంచిత కొమరుండొకడు।
పన్నుగ తమ్ముని కుండగ విఠల భవ్యనామము గలిగుండు॥ ౭.
బాల దశను తగిలుండగ తండ్రియు పడిపోవుట దా గనుచు।
పీలుగ కొమరుని పెంచెను తల్లియు విశేష ప్రీతిని గొనుచు॥ ౮.
పెద్దబెరగగను తల్లిని యడిగెను ప్రియతండ్రియు నెచటయని।
సద్దులేక దా ధనలోభముచే చనిపోయెను యనగవిని॥ ౯.
విఠలదాసుం డనుతాపముచే విషమ ప్రపంచంబనుచు।
పటుతరముగ శ్రీహరి కృష్ణా నను పరిరక్షింపుమి యనుచు॥ ౧౦.
తల్లినిగాంచుచు పలికెనప్పుడటు ధరణీశు పురోహితము।
వల్లను భువిలో విపరీతంబై వర్ధిల్లును తగనుమ్ము॥ ౧౧.
అనుచును జెప్పుచు శరణాగతుడై హరి రక్షకు డనియుండు।
ఘనముగ శ్రీహరి భజనసేయుచును కాలము గడుపుచు నుండు॥
విరక్తిపరుడని తల్లియెరుంగుచు వివాహమటు జేయించె।
నిరతము విఠలుడు సాధుసేవలో నిలువ ధనము వ్రయపరచె॥
శ్రీహరి పూజను సేయుచు విఠలుడు చేయును భజనను యెపుడు।
స్నేహతో శ్రీహరి నామము బల్కగ నూర్జితప్రేమను నుండు॥ ౧౪.

అచ్యుత కృష్ణా హరియని బల్కగ నపుడే దేహమును మరచు।
విచ్చలవిడి దా మూర్ఛను బొందును వేగభూమి పై బడుచు॥
జాముపరకు దా నట్టులనుండుచు సరసను మరి తాలేచుఁ।
ప్రేమ మిగులగను హరినామంబును పెంపుగదా వచియించుఁ॥
సజ్జనులటు నిష్ఠావంతుండని సారెకుబలుకుచు నుండఁ।
పజ్జను దుర్జనుఁ డాంబీకంబని పలుమారును జెపుచుండఁ॥ ౧౭.
మహిపతి యడిగెను యొకదినమందును మంత్రినినటు గాంచుచును।
విహితు పురోహితు కొమరుం డొక్కడు వెలసియుండ వింటినను॥
ఆతండిప్పుడు యెట్టులుండునని యడుగగ నామంత్రియును।
సాధుండగుచును శ్రీహరిభజనను సలుపుననుచు విందునను॥ ౧౯.
తన పితరుల గతి తానువినుంగొని ధనాభిలాషయు లేకఁ।
అనుతాపముచే మమతలవిడిచియు హరినేదలచును బాగఁ॥ ౨౦.
వినుకొని నృపుడును మంత్రిని గనియనె విఠలదాసు తనకడను।
అనువుగ బిలిచియు ధనధాన్యంబుల నతనికి నియ్యగవలెను॥ ౨౧.
ఇదివిని మంత్రియు చారులబంపెను నెలమి విఠలదాసు కడఁ।
సదయులై వారలు రాజు బిలిచెనని సరగున రమ్మని వేడఁ॥ ౨౨.
ఈతడు బల్కెను పనియు నాకు నటు నేమియు లేదని జెప్పఁ।
పాదుగ వారలు తిరిగివెళ్లుచును ప్రభువున కట్టులదెలుపఁ॥ ౨౩.
సంతోషింపుచు నరపతి బంపెను సత్పురుషుల కొందరిని।
వింతగవారలు వచ్చుచు విఠలుని వేరమ్మని బిలువగని॥ ౨౪.
పెద్దలుబిలువగ మారుబలుకకను ప్రియనామము నుడువుచును।
పద్దుగవారితొ రాజునింటికిని బరతెంచెను ముదమునను॥ ౨౫.
అవనీపతియును విఠలుని గాంచుచు నతిసన్మానము చేసెఁ।
సవినయముగ హరి కీర్తన వినుటకు చక్కగనడుగుచు వెలసెఁ॥
విఠ్ఠలదాసుండా మోదించగ వినిదుష్టులు మేడపయిఁ।
దిట్టతరంబుగ తీవాసి పరపగ తెరువుగ జనులుండి పయిఁ॥ ౨౭.

శ్రవణంబునకై వచ్చిరచ్చటను సకలజనులు లగ నపుడు।
వివరంబుగ శ్రీహరికథ జెప్పను విఠలులేచి నిలుచుండు॥ ౨౮.
సుస్వరవాద్యముల్ మ్రోయుచు నుండగ నూటిగ నారంభించు।
విశ్వవంద్య శ్రీవిష్ణు కృపాళో విఠలరంగా యనుచు॥ ౨౯.
ఇందిరావరా భక్తవత్సలా యీశ దయాళో యనుచు।
పొందుగ శ్రీహరి నామమునప్పుడు పూర్ణభక్తిని నుడువుచు॥ ౩౦.
కనులనీరు గారంగనునచ్చట గజ్జలలర నాడుచును।
అనువుగ దేహము మరచియుపిమ్మట నవనిపైని దా బడెను॥ ౩౧.
మిద్దెనుండి తాక్రింపడగ బడుచును మిగులమూర్ఛతా నొందన్।
సద్దుచేసిరి హాహాయనుచును సకలజనులు యిరవొందన్॥ ౩౨.
అనర్థముగని దుర్జనులందరు నతిమోదము నొందగను।
కనికరముగ నా నృపుడుక్రిందదిగి కరముబట్టి చూడగను॥ ౩౩.
దేహస్మృతియును శ్వాసంబును మరి తిరముగలే నందునను।
ఊహను నరపతి చింతను బొందుచు నుచితంబుగతా జెపును॥ ౩౪.
దుష్టులందరును కూడి మేడపయిన్ *తోణగిరి కీర్తిననుంచన్।
కష్టము వచ్చెను మనలకందరకు కరుణను నిట్లని పెలుచన్॥ ౩౫.
శిబికపైని యా విఠలుని దేహము శీఘ్రంబుగ దా నునిచి।
సొబగు హీనతను గురుని పత్నికడ నూటివెలయగను దెచ్చి॥ ౩౬.
సంగతినంతయు తెలియజెప్పుచును చాలాదుఃఖము నొందన్।
అంగాంకమున్పై ప్రేత పుత్రునిడి యామెయునేడ్చెను చింతన్॥ ౩౭.
సమాధానమును చేయుచు నరపతి చాలాధనమును యిచ్చెన్।
కొమరొప్పగనటు నృపవరు పిదపను కూర్మిగృహమునకు వచ్చెన్॥
తల్లియునింటిలో నేడ్చుచునుండెను తనయుడు బ్రతుకునుయనుచు।
తెల్లనిబట్టను నతనిపైనినిడి దినదినమును మూర్ఛించు॥ ౩౯.
తిరిగిలేచునని మూడుదినంబులు ధీరతనుండగ, కొడుకు।
అరమరలేకను నప్పుడులేచుచు యతనితల్లి గనిపలుకు॥ ౪౦.

---

*ఆరంభించు,

ఇచ్చటనన్నుం దెచ్చినదెవ్వరు యిదిరాజ గృహముకాదు।
విచ్చలవిడి దానడుగుచు నుండగ విహిత తల్లి ముదమొందు॥ ౪౧.
రాజుజెప్పయా సంగతి నంతయు రమ్యంబుగ దెల్పుచును।
ఓజను ద్రవ్యము చూపింపుచు దా నుత్తమమగు నప్పాచు॥ ౪౨.
అనుతాపముచే విఠలదాసుడు నాతని తల్లింగనుచు।
ధనలోభముచే యమ్మితివి నను ధనమెనీకగు హెచ్చు॥ ౪౩.
ఇటులంజెప్పుచు రెండు జాములట నేర్పడితా నుండుచును।
తటాలునను చనె జెప్పకయెవరితో ధర నెటనో తెలియకను॥ ౪౪.
అవనీపతికిది దెలియబడంగను నపుడెబంపె చారులను।
వివరంబుగ వారన్నిచోట్లలో వెదకియు కనరాకాను॥ ౪౫.
తల్లియు దిగులున తిండిమానుకొని తానుండె త్రిదినములును।
సల్లలితంబుగ మధురనుండునని చనువున తా గనికలను॥ ౪౬.
హరివాక్యంబని దలచుచు నామెయు నప్పుడె కుటుంబము తోను।
కరమరుదుగ తా వెళ్ళుచు మధురకు గాంచెను విఠలుని యటను॥
క్షేత్రవాసుడై త్రికాలములలో శ్రీహరి దర్శనమటను।
నేత్రోత్సవముగ సలుపుచు నెప్పుడు నెఱి భగవద్భజనయును॥
తప్పకజేయుచు భక్తజనులకును తానిడుచుం డన్నమును।
ఒప్పుగదా శ్రీహరిస్మరణను నూర్జితముగ జేయుచును॥ ౪౯.
కాలయాపనము గడుపుచునుండగ ఘనవర్షము యొకయేటఁగ।
వీలుగగురియగ యింటిగోడ లటు విరిగిపడుట దా జూడఁగ॥ ౫౦.
గోడ మరమ్మతు చేయ మన్నుకై గుంటత్రవ్వె భార్యసుము।
వేడుకయగునటు నచ్చట నగుపడె విష్ణుమూర్తి విగ్రహము॥ ౫౧.
అంచున పిదపను నపారద్రవ్యము నామెయు నటు గాంచుచును।
పంతముతోనిది పతికిందెలిసిన పరుగిడునని యనుచును॥ ౫౨.
ధనముగాంచి భీతిని విడె తల్లిని దాసినగుదు నన్నిటను।
అనువుగ విడుచుట కల్లగాదనియు నరుగుచు పతికడకును॥ ౫౩.

సంగతి యతనికి తెలియజెప్పగను స్వర్ణము పెంకు సరిగాను।
భంగపడక నా కగుపడుచుండగ బలుద్రవ్యం బెందుకను॥ ౫౪.
మహావిఘ్నములు ద్రవ్యమువలనను మనకును వచ్చును యనుచు।
గృహనాథుండగు మిరాశివానికి గీలుకొలిపి జూపించు॥ ౫౫.
ధనమును నాతని గైకొను మనగను తగదని నాతండనుచు।
అనువుగ నది తన సంచితమగునెడ నరయ తనకె దొరకునను॥
విపులధనంబును నీవే గైకొని వినియోగింపుము హరికి।
చపలతలేకను విష్ణువిగ్రహము సరిదొరికె నీభక్తికి॥ ౫౭.
దేవాలయమును గట్టి యందునను తెరువున స్థాపనచేయు।
నీవావిగ్రహ మూర్తికి పూజల నెనరున జేయుముయనియు॥ ౫౮.
గొప్పవారలా గ్రామమునందును గూడియు వచ్చుచు నటను।
తప్పక గుడిని గట్టుటకును కొంత ధనమును వ్రయపరచుచును॥
భగవన్మూర్తిని స్థాపింపుచు నటు బ్రాహ్మణులకు నన్నమిడఁగ।
ప్రగల్భముగ తా త్రికాలపూజల భక్తివితలు గొనియాడఁగ॥ ౬౦.
అనేకసాధుల కన్నముబెట్టుచు హరిగుణ వాదముచేయఁగ।
పునీతులగుచును యనేక నరులటు పొందుగ భక్తిని డాయఁగ॥
అనుగ్రహముచే శిష్యజనంబుల నాతడు జేసెను యటను।
ఘనవిరాగుడై కుటుంబధర్మము కర్మమూలమని యనును॥ ౬౨.
పుట్టెనుయతనికి పుత్రుండొక్కడు పురజనులటు వినుచును।
దిట్టముగానే బారసాలయని దెల్పిద్వాదశ దినమునను॥ ౬౩.
అమితోత్సవముల నందరుగూడియు నచ్చట జేయుచు నుండఁగ।
సమరసవ్యాప్తిని విఠలదాసుడు సర్వేశునె గొలుచుండఁగ॥ ౬౪.
వాద్యఘోషములు వారకాంతలును వచ్చియాడు చుండంగఁ।
సాధ్యపరచి యాశిష్యులుదాసుని చక్కగసభ నుంచంగఁ॥ ౬౫.
శిశువును నచ్చట దెచ్చియుంచుచును శిష్యులు బహుకానుకలఁ।
విశదంబగు నటు నిడిరి శిశువునకు వెలకలిగిన వస్తువులఁ॥ ౬౬.

వారకాంత యటు నృత్యగానముల వంచింపక సలుపుచును।
నారాయణ గుణ మధురగానమును నటనముతో చేయగను॥ ౬౭.

అచ్చటి శిష్యులు వారకాంతకై యభ్యుదయము లిచ్చుటకు।
కొచ్చిన వెలగల వస్త్రభూషణము లేర్పడ నుంచిరి బాగు॥ ౬౮.

హరిగుణవర్ణన వినుచును విఠలుం డమితప్రేమ నొందుచును।
కరమరుదుగ తనదేహము మరచుచు గణికకునిడె శిశువును॥ ౬౯.

వేశ్యకాంతకును కొడుకు నియ్యగను విపరీతం బనియనుచు।
నైచ్యవృత్తికిని తగదు బాలుడని నరులు తమలో నుడువుచు॥ ౭౦.

చింతాక్రాంతులై గురునికి ముందర చెప్పకుండి రేమియటన్।
సంతోషంబున వారకాంతయును చనెను పిదప తనయింటన్॥ ౭౧.

సంకటమొందిరి గురువరునింటిలో సకలశిష్యు లయ్యెడలన్।
అంకిలిచెప్పిరి మంగళమందును నమంగళంబు విలసిల్లెన్॥ ౭౨.

బలిమిని బాలుని దెచ్చితిమేనియు భవ్యగురుడు క్షోభించున్।
సలీనులగుచును యుపాయమెద్దియు సలుప నేరకనుయుంచున్॥

రంగరాయి యను శిష్యురాలు యొక రాజకన్య యటనిగుడన్।
సంగతివినికొని సంకటపడుచును చక్కనేగె వేశ్యకడన్॥ ౭౪.

అభీష్టమెద్దియొ యిచ్చెదనీకును నడుగు, గురుసుతు నిమ్మని।
విభనోపాయము జేసి యడిగినను వినకుండుట తానుగని॥ ౭౫.

శిబికెను గూర్చుండుచు గురువద్దికి చేరవచ్చి తానుండన్।
శొబగున వేశ్యయు శిశువును దెచ్చెను సూటిగవిఠలుని యండన్॥

సమయంబిది యని రాజకన్యయును సరగవాద్య ముంచుకొని।
క్రమముగ గానము నృత్యము సలిపెను ఘనచాతుర్య కళనుగొని॥

హరిగుణ వర్ణన నమిత రసంబుతో నచట బాడి యాడగను।
కరుణవెలయుచును వేశ్యకాంతయా కన్యకునిడె శిశువును॥ ౭౭.

రాజకన్యయును గురుపదతలమున రమ్యముతో శిశువునిడెన్।
తేజరిల్ల నటు ప్రజలకందరకు తిరతర మోదము నిగుడెన్॥ ౭౮.

లజ్జవిడిచి యారాజకన్యయును లక్షింపక కులవీధిని।
పజ్జనునాట్యము సలిపి గురువుకై ప్రసిద్ధినొందెను భువని॥ ౮౦.
వారకాంత యటు గురునిపదంబుల వందించుచు దా చనియెఁ।
ధీరులు భక్తుల దాసుడుబాలుడు దీనత్వము తా నిడియెఁ॥ ౮౧.

---

## మురారిదేవు చరిత్ర.

బడోదయను నొక పట్టణమందును భక్తుమురారిదేవుండు।
తడవులేక శ్రీహరిని భజింపుచు ధరనుప్రసిద్ధిని నుండు॥ ౧.
అహోరాత్రములు నిమిష సమానమై హరికీర్తన యందుండుఁ।
మహావిభవమున విష్ణుపూజయును మచ్చికజేయుచు నిగుడుఁ॥ ౨.
నారాయణ కథవినుచు ననేకులు నమ్రత శరణును బొందఁ।
వారికి నాతడు ననుగ్రహించెను వర్ధిలుభక్తియు నొందఁ॥ ౩.
ఈతని సద్గుణ ఖ్యాతిని వినికొని యిలపతి వచ్చెను శరణు।
పాదుగనతనికి నుపదేశంబును భక్తమురారి చేయగను॥ ౪.
ప్రతిష్ఠ మాన్యత బహుగా వచ్చెను ప్రజలును సన్మానింపఁ।
సతతంబును శ్రీరామ నవమినటు సలుప్రను నుత్సవమొప్పఁ॥ ౫.
సాధు లనేకులు వచ్చెదరచటికి సర్వేశ్వరు గుణకథయు।
నాదబ్రహ్మము నంబరమంతయు నయముగ నిండంగనియు॥ ౬.
మహోత్సవంబును తొమ్మిది దినములు మక్కువతోడను చెయుఁ।
సహాయమందుకు రాజు ద్రవ్యమును సమకూర్చుచు నుండుటయుఁ॥
వచ్చినవార్లకు బహుమానంబుల వరుసతోడ నిచ్చుచును।
సచ్చరితుల దా మాన్యతసలుపుచు మచ్చికగొను మురారియును॥
ఆపురమందును రోహీదాసుని యల శిష్యుండొకడుండెఁ।
ఏపుమీరగను చర్మకవీధిలో నీశుని భజనను నిగుడెఁ॥ ౯.
ప్రాతస్నానము జేయుచు శ్రీహరి భక్తితోడ పూజించు।
వీధిని వచ్చును తీర్థప్రసాదము వెలయ చేతిలోనుంచు॥ ౧౦.

అధికారులుగా వచ్చు వార్లకును నరమరలేక్రత్తునను।
పదపడి యిటులం జేసి యనేకుల భక్తిమార్గ ముంచగను॥ ౧౧.
ఒకదిన మందును తీర్థము గైకొని యొప్పగ వెలపల రాగన్।
ప్రకటంబుగనే మురారి దాసుడు పదపడి యటు బోవంగన్॥ ౧౨.
హరితీర్థముకై యధికారులౌను నటనరసిపిలువ మురారి విని।
వెలివక తీర్థము తనకిమ్మనుచును వేడె నతడు చర్మకుని॥ ౧౩.
భయమును బొందియు చర్మకు డప్పుడు భక్తితోడ నిట్లనియెన్।
క్రియగల విప్రులు పైవార్లగుదురు క్రింది జాతినే ననియెన్॥ ౧౪.
అనుచితమగు నేతీర్థంబిచ్చిన నవనీపతి యెరిగినను।
ఘనశిక్షను నే బొందెద ననుచును గౌరవమున బలుకగను॥ ౧౫.
మురారి వినుకొని నృపునకు నాకును ముఖ్యమేమి యిందునను।
సరాళముగనే తీర్థము గైకొని సరగున వెళ్ళెద నిటను॥ ౧౬.
అన్ని విడిచి నే విష్ణు తీర్థమె యభయనుచు గనియుందు।
పన్నుగ జాతియు లేదు సాధులకు భగవత్తీర్థము నందు॥ ౧౭.
ఉదకె బుద్ధి తగ విడిచియుండవలె నొగి సత్యం బిది యనియు।
కుదురుగ తీర్థాం బియ్యవలయునను కుంఠితమతి నుండకయు॥ ౧౮.
చర్మకవృత్తిని హీనంబనుచును చతురత దలచిన యెడలన్।
మర్మము లేకయ సకలపదార్థముల్ చర్మావరణ గలుగునిలన్॥
చెవులును చర్మమె జిహ్వయు చర్మమె చేతులు చర్మమెయగును।
వివరంబుగ నిటు భగవత్కర్మముల్ వెలయునీని గూడుచును॥ ౨౦.
నీవు భక్తుడవు నీచే తీర్థము నెఱి పవిత్రమగునిటను।
కావున నాకును దోషముకించితు కలుగదు తీర్థాంబునను॥ ౨౧.
అనుమానించితి వేని నీవు నను హరిభక్తుడ కానను చు।
ఘనయధికారము లేదని చెప్పుము *కలిమిని నాకిపుడనుచు॥ ౨౨.
ఉత్తరమెద్దియు చెప్పజాలకను నురుతీర్థము చర్మకుడు।
పద్దుగ నియ్యగ మురారిదాసుడు పరగగొనుచు వెళ్ళుచుండు॥ ౨౩.

---

*కలిమి = ఉనికి.

అనేకులచ్చట జూచుచునుండిరి యాశ్చర్యంబును మెరయ।
వినీతుడగుచ ను మురారిదాసుడు వెళ్ళెనుమందిర మరయ॥ ౨౮.
అనుచిత కర్మం బాచార్యుండును నాచరించె నేడనుచు।
మనసున దలచుచు రహస్యముగనే మాటల నరులటు జెపుచు॥
నరపతికిని యిదిదెల్పగ కొందరు నాణ్యముకాదని యతడు।
గురునింజూచుచు నాదినమందును గుణభేదము గలిగుండు॥ ౨౬.
బైటికినెద్దియు బలుకకయుండగ ప్రభుపు మనవికల్పమును।
పాటించెనుయని మురారియెవరితో బలుకక నాశేయి నను॥ ౨౭.
నగరము విడుచుచు మహత్వమాన్యత నాణ్యముతగదా విడిచి।
విగతకాముడై మరియొకదేశను వెళ్ళియు సుజనుల గలసి॥ ౨౮.
సమాధానమును చెందియుండెనటు సద్గుణ శీలుండగుచు।
రమాకాంతు శ్రీనామము నుడువుచు రంజిల్లుచు నటువెచ్చు॥
అవనీపతులకు నుపదేశింపుట నరయంగ నుపాధి యగు।
సవినయ దుర్బలసాదు విరక్తులు సాధకు లయ్యిరిపెక్కు॥ ౩౦.
ధనవంతునకును నుపదేశించిన ధరను లోకులివ్యోడను।
అనువుగ నను శ్రీమంతుని గురువని యనుచుందురు బహుగాను॥
అట్టిజనంబుల కనుగ్రహించుట హరినామం బమ్మిన దా।
దిట్టము నాకా గన్యత వలదని ధీ మురారియుండిన దా॥ ౩౨.
గురుడువెళ్ళెనని రాజువినంగనె గొప్పచింత నొందుచును।
అరయక నేనపచారముజేసితి ననుతపింప నయ్యెనను॥ ౩౩.
గురునివలననే హరిగుణకీర్తన గొప్పగవిందును యిటను।
అరుదగు నది యిపుడంతరించెగద యతడుగృహము విడువగను॥
అనుతాపముతో వార్తికరులను నష్టదిక్కు లంపగను।
ఘనముగ వారలు వెదకియు నెక్కడ గానక తిరిగి రాగాను॥ ౩౫.
చింతనునుండగ రామజయంతియు చేరవచ్చె నయ్యెడలన్।
సంతముతోడను సాధుజనంబులు బహుగవచ్చి రచటనిలన్॥ ౩౬.

మురారిదేవుడు లేకుండంగని ముదమొందక వారలును।
నిరాపేక్షచే తిరిగిపోవగను నృపుడువారి జీరుచును॥ ౩౭.
గురునిజాడనే నెరిగినయెడలను కోరిదెత్తు ననగాను।
సరగునకొందరు జూపెదమనగను చనెను నృపుడు వారితోను॥
ఆచార్యుని గని దండముబెట్టుచు నపచార క్షమనడుగగ।
వాచా బలుకక మరియొక దిక్కున యాచార్యుండును తిరుగగ॥
సమక్షమందున రాజునిలుచుకొని స్వామిని గని నయ్యెడలగ।
కొమరొప్పగ తగునుదకము పూర్తిగ కుండను నిండని యెడలగ॥
ఎచ్చుతగ్గులను నలయిక నొందును, నిదికుండ తప్పుగాదు సుము।
అచ్చనీర మేపురుషుడు బోసెనో యతడె కర్తయగు గనుము॥
సమూలభేదము విడువకయుండెను సద్బోధయు మిగిలుండెగ।
క్రమేణ యిప్పుడు మీకృపచేతను కల్లలన్ని విడనాడెగ॥ ౪౩.
ఇదివిని గురుడును నృపునకు హితుడై యిష్టంబుగ వేంచేసెగ।
కుదురుగ నృపుడును యింటికిదెచ్చుచు గురుసేవయు బహుచేసెగ॥
సంతసమున గురు రామజయంతిని సలుపుట కారంభించెగ।
నిందాపరులగు వారలందరికి నెనరులేక నటు వెలసెగ॥ ౪౪.
విశాలమంటప మొక్కటివేసియు విపులాలంకృతిజేసి।
ప్రశాంతచిత్తుడై రామునిమూర్తిని పదపడి యచ్చటనుంచి॥
ప్రతిదినమందును నన్నదానమును బహుగాజేయుచు నుండు।
సతతము నచ్చట హరిదాసులు మరి సేలుపు కీర్తనలుమెండు॥ ౪౫.
గొప్పవిభవమున తొమ్మిది దినములు కుదురుగ నటు జరగగను।
తప్పక నవమిని మురారిదాసుడు జెప్పదొడంగెను కథను॥ ౪౬.
రామనామమును జెప్పుచు బహుగా రతిగ తాళ మరయుచును।
ప్రేమమీరగను యానందాశ్రులు బెంపారెను బహుయటను॥ ౪౭.
అనుసంధానము రామచరిత్రమె యాతండారంభించెగ।
ఘనచిద్రూపుడు రాముండగుచును కరుణాకృతి గొనివచ్చెగ॥ ౪౮.

భక్తరక్షణము జేయునిమిత్యము భగవంతుం డరిగెనిల।
సక్తిగచర్యల బహుగాజూపెను సాధులుపొగ డేటటుల॥ ౫౦.
విధాతకొడుకగు పౌలస్త్యునకును విశ్రవసుండెను బుట్టెన్।
నిదానముగనే నీతడుకైకయి నెనరున తగపెండ్లాడెన్॥ ౫౧.
ఆమెకడుపునను ముగ్గురు పుత్రులు నవనిబుట్టి ఖ్యాతిగను।
నామముల్ రావణ కుంభకర్ణులును నయవిభీషణు డనుచును॥ ౫౨.
ప్రథమపుత్రుడును బలసంపదలకు బ్రహ్మవరము బొందగను।
కుదురుగ రెండో కొమరుడు నిద్రను కోరగనిచ్చె విధియును॥
మూడవ కొమరుడు విష్ణు భక్తినె ముదమొందగ తాగోరన్।
వేడుక తోడను సంతోషించియు విధాత యిచ్చెను మేరన్॥ ౫౪.
వరముల చేకొని రావణుడప్పుడు వడిజయించె లోకముల।
కరమరుదుగ దా కుబేరు నెడజని గైకొనె లంకనునటుల॥ ౫౫.
దేవలోకమున వెళ్ళిజయించియు దివిజుల బంటులజేయన్।
భావభ్రష్టులై రాక్షసులందరు ప్రజాపీడ బహుచేయన్॥ ౫౬.
అధర్మమప్పుడు నధికంబగుచును నవనిదేవి వణకెగని।
విధాత దివిజులు భూమిదేవియును వెళ్ళిరిక్షీరాబ్ధికిని॥ ౫౭.
నుతులంజేసిరి విష్ణుమూర్తికిని క్షితిబ్రసన్నుడై హరియు।
హితవున బల్కెనుమీరలు బుట్టుడు యిలలో వానరు లయ్యు॥ ౫౮.
చతుర్ధాంశములనే జన్మించెద సుతుగా దశరధునకును।
శతకంఠుని నేవధింతు ననుచును సరగజెప్పి వెళ్ళగను॥ ౫౯.
అయోధ్యపురమున ధశరధ రాజున కవని సుతులు లేకుండన్।
న్రమముగ క్రతువును వశిష్ఠముని చె నడపింపుచు దానిగుడన్॥ ౬౦.
పాయస మందున బైలుదేరగను భక్తినిగొని దశరధుడు।
ధీయుతు కోసల కైకేయీలకు తెరువుగ నిచ్చెను నాడు॥ ౬౧.
సుమిత్రయను నటు మరియొక భార్యకు సూటిగవా రిరువురును।
క్రమముగ భాగములర్ధమ్మర్ధము గౌరవముగ నియ్యగను॥ ౬౨.

ముగ్గురు భార్యలు గర్భవంతులై మొగి దశ మాసము నిగుడ౯।
తగ్గులేక శ్రీహరియె రాముడై ధరకౌసల్యకు బుట్టె౯॥ ౬౩.
కైకయిదేవికి భరతుడు బుట్టెను గరిమెతో సుమిత్రకును।
జోకను మిధునీ సుతులునుగల్గిరి సులక్ష్మణుడు శత్రుఘ్న॥ ౬౪.
దానధర్మములు బహుగాజేసెను దశరథ రాజుండపుడు।
మానుగ సుతులకు జాతకర్మముల మహినిజేసె తగ నృపుడు॥ ౬౫.
దినదినమునకును పెద్దబెరుగుచును ధీరతబాలురు కాగ౯।
ఘనవశిష్ఠుడును చదువు శాస్త్రముల కనికరముగ నేర్పంగ౯॥ ౬౬.
ధనుర్విద్యలో నైపుణ్యంబును తరుచుగాగ నటుకలుగ౯।
చనువున తండ్రియు రాముని గాంచుచు సంతోషించెను బహుగ౯॥
మఖరక్షణకై విశ్వామిత్రుడు మహిపతి కడ దా వచ్చె౯।
సుఖరూపులు నగు రామ లక్ష్మణుల సూటిగ నడిగియు దెచ్చె౯॥ ౬౮.
ఒకబాణంబున రాముడుతాటకి నుర్విని తగబడ వేసె౯।
ప్రకటంబుగ నాయజ్ఞవిఘ్నకుల పరగ నచట పడద్రోచె౯॥ ౬౯.
యాగపూర్తి జేయించుచు మరి తా నహల్యశాప మోచనము।
వేగంబుగ తా జేసి పిమ్మటను వే చనె మిథిలా పురము॥ ౭౦.
మహేశు చాపము ద్రుంచి యచ్చటను మహిసీతను పెండ్లాడి।
సహనంబుగ నటు పరశురాముతో సరసవాదముల నాడి॥ ౭౧.
ఆతని మదమును నణచియు పిమ్మట నయోధ్య నగరముజేరి।
సీతను గూడియు సుఖముననుండగ శుభగు దశరథుడు గోరి॥ ౭౨.
సీతాపతి పట్టాభిషేకమును చేయుటకును తలచగను।
హేతోత్పన్నము దివిజులు జేయుచు యేర్పడె విఘ్నంబటను॥ ౭౩.
న్యాసభూతమై రెండువరంబులు నాతికైక కుండగను।
వేసరిల్లియా యభిషేకమునకు విఘ్నమామె జేయుచును॥ ౭౪.
ఒకవరమున భరతునకు రాజ్యము నొసరనియ్యవలెననుచు।
సకలమువదలి రాముడు వనమునకు చనుటయు నొకవరమనుచు॥

దశరథు నడుగగ సత్యపాలనము తా జేయుటకై బూని।
విశదంబుగ నా వరముల నిచ్చుచు వే శోకము తానుగొని॥ ౨౬.
ఇదియు రామునకు తెలిపింపంగను యే తగవును జేయకను।
సదయుడై తండ్రిని యోదార్చుచు మరి జననికి హితపరచుచును॥
వనమును బోవగ సీతతో, లక్ష్మణు వరుసతోడనే తెంచెన్।
ఘనశోకంబును పొంది దశరథుడా కళేబరంబును విడిచెన్॥ ౨౭.
ఈతరువాయిని మురారిదాసుడు యేపున కథజెప్పుచును।
ప్రీతిరామునం దమోఘమగుచును ప్రియుడగు హరిజేరగను॥ ౨౮.
సభజనులందరు హాహాకారము సలుపుచు నపుడయ్యెడలన్।
విభుని చిత్తమని యాశ్చర్యంబును వెలయనొంది రవ్వేళన్॥ ౩౦.
అవనిపతి, గురు చరమకైంకర్య మాచార్యునకును జేసెన్।
వివరంబుగ గురుపుణ్యతిథుల నటు వెలయగ తా జేయించెన్॥ ౩౧.
మురారిదాసు రామాయణకీర్తన మురిపెముతోడను జేసెన్।
సరాళముగ నాదేశమునందును సరిప్రసిద్ధికిని వచ్చెన్॥ ౩౨.
ప్రభాయుక్తులై వెలసిరి భక్తులు పరమాత్ముని ప్రేమగొని।
సభాగ్యుడగుచును బాలకృష్ణుడును సాదుల వర్ణించెగని॥ ౩౩.

---

జయమల్లరాజు చరిత్ర.

జయమల్లుండను నరపతియొక్కడు సలుపుచుండె రాజ్యమును।
దయయు సత్యము గలిగియు జనులను ధర గాపాడెను నతను॥ ౧.
భగవద్భక్తియు సాదులసేవయు బహుతరముగ తా జేయున్।
విగతమోహుడై విష్ణుభక్తిలో విఖ్యాతుండై వెలయున్॥ ౨.
పట్టణమందును కొందరి గృహములు బహునిడుపై యుండగని।
దిట్టముగా తన ప్రధానిబిలిచియు తెలియబలికె నిట్లనుచుని॥ ౩.
హరిమందిర మిటనుండు చోటలో నవనిజనుల సదనములు।
సరి నభ మండల నిడుపులై యుంటయు సరిలేదని, దాసీలు॥ ౪.

సాలంకారము లధికముంచినను సాధ్వీ సములు గారుసుము।
చాలున పెరిగిన తాడిచెట్లు తగు ఛాయనియవు భువి నిజము॥ ౫.
అటువలె నిచ్చట హరి మందిరమును నతి పొడువుగ గట్టినను।
పటుతరముగ నీ జనుల కందరకు పరమోద్ధారక మగును॥ ౬.
ఆరంభింపుము యిప్పుడె యనుచును ననువున దా జెప్పంగన్।
సారము దెలిసిన శిల్పికారులను సరగ మంత్రి బిలిచితగన్॥ ౭.
అపూర్వ మగునటు యాలయ మొక్కటి హరికిని గట్టుండనుచు।
అపార ద్రవ్యము నృప వరు డియ్యగ నప్పుడె యారంభించు॥ ౮.
కొన్ని దినంబుల శిల్పులు గూడియు గుడినిం గట్టిరి బాగన్।
పన్నుగ స్వర్ణము మణిమయ యుతమై భాసిలె నున్నత మాగన్॥
ఏడంతస్థుల మేడయు నగుచును యేప్రక్కను ద్వారమును।
కూడం చేయక విష్ణుమూర్తినిం గుడిలో దానుంచకను॥ ౧౦.
తాళ్ళ నిచ్చెనను జేసియు నృపుడును తా నెక్కుచు గుడికేగు।
నీళ్ళను మునిగియు నేకాంతంబున నిటలతటుండై మెలగు॥ ౧౧.
సందియ మొందక మనసున శ్రీహరి చాతుర్భుజ రూపుగను।
పొందుగ శంఖము చక్రము కరముల భూరి కౌస్తుభ హారమును।
శ్రీవత్సంబగు హృదయ తలంబును శ్రీనాభీ కమలమును।
భావ పూర్ణమగు కటిసూత్రంబును పసుపురంగు చేలమును॥ ౧౩.
సుకుమారంబగు జానుజంఘలును సురుచిర నూపురములును।
ప్రకటిత నఖములు చంద్ర సమానమౌ పాదపద్మములతోను॥ ౧౪.
జలజాతధ్వజ హలకులిశాంకుశ కలిత దివ్య రేఖలును।
ఇలతీర్థంబుల నిజస్థానంబగు నీశుని చరణంబులును॥ ౧౫.
ఇట్టి రూపమును ధ్యానించుచు నృపు డేకాగ్రంబున నుండున్।
దిట్టముగా తాస్తోత్ర్యము జేయుచు దీర్ఘకాలమట నాడున్॥ ౧౬.
జయజయ కృష్ణా జయశ్రీ రంగా జయ కేశవ గోవింద।
జయలక్ష్మీపతి జయపరాత్పర జయ రఘునాథ ముకుంద॥ ౧౭.

అనంత రూపుడ వగుచును నీవును నరసి బ్రోవు భక్తులను।
సనందనాదుల మనో నిలయ, నిటు చక్క జూపు రూపమును॥౧౮.
అనేక దినములు యీ విధముననే యతడును నిష్ఠను నుండగ।
జనార్ద నుండును సగుణ రూపమును చక్కజూపి తానిగుడగ॥
కనుగోచరముగ జూడగ నృపుడును కాళ్ళపైని బడుచును।
బెనగొని బహుతర ప్రేమను జూపియు ప్రియ వచనము బలుకును॥
దీనదయాళా భక్తవత్సలా దిక్కు నీవను భక్తులకు।
మానుగ సులభుడ వగుచుందువుగద మహిత కరుణ యింపొసగు॥
అపార సుఖమును దర్శనముననె యవనిలోన బొందితని।
కృపగల కృష్ణుని సింహాసనమున క్రియతో కూర్చుండమని॥ ౨౨.
ఏకాంతంబున ననుపమ భక్తిచె నెల్ల పూజలను జేసెగ।
సాకాంక్షుండై ధూప నివేదన చక్కగ నర్పణ జేసెగ॥ ౨౩.
సభాస్థలంబున శిల్పి బొమ్మలను చక్క జేసి యుంచుండగ।
ప్రభతో నవియును తాళ వీణెలను పాణులందు గలిగుండగ॥౨౪.
మంగళ హారతి నియ్యగ హరికిని మహిత ధ్వనులవి జేసెగ।
పొంగుగ శ్రీపతి స్తోత్రము నృపుడును భూరిప్రేమతో జేసెగ॥
అటువెనకను దా పుష్పాంజలి యిడి హరికి నమస్కృతి జేసి।
పటుతరముగ నొక పర్యంకంబున బాగుగ శ్రీహరినునిచి॥ ౨౬,
పరుండ జేయగ భక్తితో నృపుడును పాదములను బట్టుచును।
ఎరిగియు శ్రీహరి నిద్ర బోయెనని నెలమి నృపుడు గుడి విడెను॥
ఇటులనె దినమును శ్రీహరిపూజను నేర్పడ జేయుచు నుండుగ।
చటులతరంబుగ మానస పూజను సలుపుననుచు ప్రజయుండుగ॥
ఒకడై నృపవరు డిటులసేయగను నొకదిన మాతనిసతియు।
ప్రకటంబుగ నిది గనవలయును యని పతివెంబడె దా చనియు॥
గోడనెక్కియా నరపతి పైగా గుడికిలోన బోవగను।
తాడునిచ్చెనను దీయుట మరచెను తనితోడ భార్యయును॥ ౩౧,

దానిపైని నెక్కియు లోవెళ్ళగ ధరపతి హరి సేవలను।
మానసవాక్కుల కాయయుక్తుడై మహితప్రేమ సేయగను॥ ౩౧.
హరిసౌందర్యము రూపుగుణంబుల నామెగాంచి దూరమున।
మరవక మనసున నిడికొని మళ్ళను మహికృతార్థ తొందితన॥ ౩౨.
ఎవరికి దెలియక యింటికి వచ్చుచు యేపున శయనించగను।
ప్రవిమలసేవల సలిపి నృపుండును బరతెంచె గృహమునకును॥ ౩౩.
పతిరాకను గని భార్యదండమిడి పద్మనాభు గంటినని।
వితతపూజలను నీవుండంగను వెలయుసేవ గంటిని॥ ౩౪.
అవనీపతివిని కృతార్థురాలవు నైతివి హరిగంటి వటు।
భవభయమును నిలబొంద వీవనుచు పలికెనామెతో నృపుడు॥ ౩౫.
శ్రీహరినామము శ్యామళయనుచును జెప్పుచుండు నరపతియు।
దేహబంధుడగు తమ్ముండొక్కడు తెంపున వైరముజేయు॥ ౩౬.
నగముురాజ్యమును గైకొందునుయని చనుచు దూరదేశమున।
ప్రగల్భముగ తా వచ్చెను యన్నపై ప్రబలసేన తోడగన॥ ౩౭.
పూజాసమయము జూచి నగరమును పొందుగముట్టడి వేయఁగ।
ఓజను మంత్రియు సేనను చేకొని యొగియుద్ధము నటుజేయఁగ॥
అమితభంగులను మంత్రీయుద్ధమును నరమరలేకను జేసి।
సమరమునందున నుండజాలకను చనె పలాయనత వెలసి॥ ౩౯.
సంగతి వినుకొని నరపతి తల్లియు సరగ నృపుని కడకేగి।
నింగుచు నాలయ మామె యెక్కుచును నెళవుల దా జెప్పితగి॥ ౪౦.
శ్యామళయనుచును నాతడు బల్కుచు చక్కనుండె హరిపూజఁగ।
కోమళ కృష్ణుడు రాజవేషమున గుఱ్ఱము నెక్కుచు పెలుచఁగ॥ ౪౧.
నగరము వెలపల వచ్చి యుద్ధమును నచ్చికతా జేయంగఁ।
వెగటుగ శత్రుని సైన్యంబంతయు వెళ్ళసాగెనటు వేగఁ॥ ౪౨.
జెయమల్ల రాజుని శత్రుని బట్టుచు చెఱసాలను హరి వేసి।
జయముగ తా నటు నద్భుతవృద్ధ్యోగను నరులుగాంచి నటు వచ్చె॥

శ్రీహరిపూజను జేసియు నరపతి చేరవచ్చె గృహమునకు।
దేహబంధువగు తమ్ముని చెఱలో దెచ్చుట విని తా నులుకు॥ ౪౪.
అతివిస్మితుడై యవనీపతియటు హరిచర్యలు యని యెరిగి।
పతితపావనుడు నాకొఱకై యిటు బహుశ్రమించెనని కలగి॥ ౪౫.
తమ్మునికీవును దర్శనమిచ్చితివి తప్పునాయెడ నేమియను।
నెమ్మదిలేకను నైదుదినంబులు నెఱి యుపవాస ముండగను॥ ౪౬.
హరిప్రసన్నుడై యాదరించె నటు యవనీపతి తమ్ముడును।
శరణుబొందగను విడుదలజేసెను చెరనునుండియు నృపుడును॥ ౪౭.
నీకును శ్రీహరి దర్శనమిచ్చెను నెఱిధన్యుడ విర్యోడలన్।
వీకనునిటులం జెప్పుచు నిచ్చెను వే వస్త్రాలం కృతులన్॥ ౪౮.
హరిభక్తుండై యమరెను తమ్ముడు నద్దిన మొదలయ్యెడను।
విరుద్ధభావము విడిచియునాతడు విష్ణునామ మనెను మును॥ ౪౯.
అఖండభక్తిని హరినిప్రసన్నత నారాజు చేసె కలిని।
సుఖవైకుంఠమున కరిగె నృపుడును సారది బాలు డనెను విని॥

---

## చ తు ర్భు జ రా జు చ రి త్ర.

మధురాపురమున చతుర్భుజుండను మహిపతి యొక్కండుండెన్।
విధితోనెప్పుడు సాధులసేవను వెలయజేయుచును నిగుడెన్॥ ౧.
ఎనిమిది దిక్కుల వార్తికరులను యేపున దా నుంచుచును।
ఘనులగు సాధులు వచ్చిన సంగతి కనికరముగ వినగాను॥ ౨.
నరపతి యెదురుగ బోయి వారలకు నమస్కారములు జెసి।
అరుదుగ మీరలు వచ్చుటచేతను నబ్బెను ధన్యత హెచ్చి॥ ౩.
నగరంబునకును చేతెంచుండని నమ్రుడగుచు బిలిచికొని।
సుగమంబుగ దా నింటికి దెచ్చుచు సుఖాసనము నుండగని॥ ౪.
చరణప్రక్షాళన జేసి తీర్థమును సరగున ప్రాశనజేసి।
సుమనోహరతిలకము నొసటను నుంచియు తొక్కునగంధముబూసి॥

పూలహారముల మెడలను వేయుచు బాదుగధూపము లిడును।
పీలుగ మంగళహారతు లిచ్చుచు విస్తరలను వేయుచును॥ ౫.
పిండివంటలును మృష్టాన్నంబును ప్రీతితోడ వడ్డింపన్।
దండిపుణ్యాత్ముని సాధుజనంబులు తరుచుగాగ భక్షింపన్॥ ౬.
ఎవరికి యే రుచి యింపై యుండునో యిలపతి యట్లే బెట్టుచును।
సవినయముగ తా విడెములనిచ్చుచు సత్కరించు పొందుగను॥
ఇచ్చటమీరలు నిచ్చనుండుటకు నే యడ్డియు లేదు యనన్।
వచ్చినవారలు చాతుర్మాస్యముల్ వాసముండి పోవగనన్॥ ౯.
నరపతివార్లకు రాజవిభవముల నయముగ నటు జూపుచును।
కొరతగాక మీకిచ్చకొలదిని కొనిపొండని యిచ్చుమును॥ ౧౦.
ఇటులంజేయగ నన్నిదేశముల నితనికీర్తి ప్రకటించెన్।
పటుతరముగ దా సాధుజనంబుల ప్రాపుజేసి యటనుంచెన్॥ ౧౧.
మాండలి నరపతి యొక్కండీతని మహిత కీర్తి దా వినుచు।
కాండత్రయమున నిట్టియాచరణ కలుగదు రాజులకనుచు॥ ౧౨.
ప్రధాని బిలుచుచు నిట్టిధర్మములు పనిబడవనె నృపులకును।
విధురంబగు నటు వేషధార్యోకడు వే రాజ్యము గొనిచనును॥
అనుచు జెప్పుచును *భాట్టుల నిద్దర నాతడు తగ బిలుచుచును।
చనుపున మీరలు చతుర్భుజరాజు సదనమునకు బోపుచును॥
మీరలు నేర్చిన విద్యలనన్నియు మెలగ నతనికి జూపుచును।
తీరుగ వెనకను వైష్ణవవేషము తెరువున నటు జూపుమను॥ ౧౪.
సాదులయందున నాతడుభావము సలుపుగతిని జూచుకొని।
పాదుగమీరలు తిరిగివచ్చి యిటు బైలుపరచ మనగవిని॥ ౧౫.
భాటులునటులనె బోయి చతుర్భుజు భవ్యనగరమును జేరి।
పాటవముగ తమ విద్యలనెల్లను బాగుగజూపుచు మీరి॥ ౧౬.
కొన్నిదినంబుల వెనకను వేషము క్రొత్తగ నటు వేసికొని।
పన్నుగ వైష్ణవ చిన్హాంబులతో బైరాగుల వలెనుగని॥ ౧౭.

గోపీచందన తిలకధారణము గొప్పతులసి మాలలును।
ప్రాపుగ నిట్టులగాంచుచు నృపుడును భక్తిని నతి జేయుచును॥
చరణక్షాళన జేసి తీర్థమును చనువున ప్రాశనజేసెన్।
కరమరుమగ నటు భాట్టులెల్లయుండియు కంజాక్షుని కృపవెలసెన్॥
తమ ధర్మము విడి శ్రీహరిభక్తిని తత్పరు లయ్యిరి యనుచు।
కొమరొప్పగ శ్రీవైకుంఠంబును గూడిరి యనితా దలచు॥ ౨౧.
పూజల జేయుచు వారలకప్పుడు భోజనమిడె బాగుగను।
తేజమలరగను గజ్జగట్టుకొని థయ్యని బాడ్యాడుచును॥ ౨౨.
సాదులువచ్చిరి సుదినంబనియును చక్షునీరు ప్రవహించన్।
పాదుగ శ్రీహరి బాడుచు ముదమున భరితానందు డైమించన్॥ ౨౩.
వేషధారులటు సిగ్గును బొందిరి విహితరాజు చర్యలకు।
శేషవృత్తిలో హీనులమగుచుము శ్రేయస్సును చను మాకు॥ ౨౪.
వివేకమెద్దియు లేదు మాయెడను విరాగంబు లేదుసుము।
నివాస మిచ్చుట చేయదగదనియు నేర్పున దలచుచుతాము॥ ౨౫.
నిజవాసమునకు పోవలెననగను నృపుడు జూపె సంపత్తిన్।
విజితంబగు నీరాజ్యంబంతయు వెలయును తమదై జగతిన్॥ ౨౬.
ధనరాశిని దా చూపుచు వార్లకు ధర మీకగు వస్తువుల।
కొనిపొమ్మనగను నాలుగు పిడికెలు గొనిరి ధనము నయ్యెడల॥ ౨౭.
రాజునకెరుగక మంత్రియు భాట్టుల రమ్మని తనయింటికిని।
తేజరిల్లునొక పెట్టెనిచ్చియటు *తెగనరపతి కియ్యమని॥ ౨౮.
వారలనంపగ నతిముదమొందుచు వచ్చి మాండలీకు నెడ।
ధీరత బల్కిరి చతుర్భుజునివలె దివిభువి నరులేచెచట॥ ౨౯.
భగవద్భక్తుల కైంకర్యంబున బహునిష్ఠను నతడుండు।
వెగటుగదానిం బరిక్షింపను వెలయదు మాకును నెపుడు॥ ౩౦.
ఆతనిమంత్రియు నం పెనునీకును యరుదువస్తు విదియనుచు।
పాదుగపెట్టెను నియ్యగ గైకొని ప్రభువుపెట్టె నటు తెరుచు॥ ౩౧.

---

*తెగ-సమానము, *భాట్టులు - వా[illegible]

అందునజరితో చుట్టబడినయొక యల్పమూట యటనుండెన్।
సందియమొందక విప్పిచూడగను నందుగప్పయొకటుండెన్॥ ౩౨.
దీనింగాంచుచు విస్మిత చిత్తుండై తెలియదనెను యర్థమును।
మానుగనచ్చట నుండు వివేకులు మహీపతిని గనుచును॥ ౩౩.
ఖాతులై యుండుచు వేషధారులును భక్తిజూపి బైటికిని।
వాటంబైతగు కల్మషవృత్తుల పంచించిరి వారలని॥ ౩౪.
ప్రధానిగాంచుచు నీకై పెట్టెను బంపెవీరి చేతులను।
నిదానమున నదిబైటికి సొంపును నిగుడువెత్తి లోపలను॥ ౩౫.
దెలిపెను మీకని జెప్పగఖాతులు తెలివిని బల్కిరిరాజునకు।
ఇలను చతుర్భుజు పుణ్యమూర్తియగు నేకపత్ని వ్రతుడునగు॥ ౩౬.
ఆతనినగరపు జనులును రాముని నహర్నిశంబు లెంచుదురు।
పాదుగఖలులును నాతనిజూచిన బహుసాత్వికు లగుదురు॥ ౩౭.
అచ్చటనుండే పక్షులన్నియును హరి రామాయని జెప్పు।
హెచ్చుగ వినగనె కామ క్రోధములు నెపుడులేక చననొప్పు॥
ఇదివినిమాండలి నరపతి యప్పుడు నెలమి బంపె పండితుల।
సదయులై మీరలువెళ్ళి నగరమున చతుర్భుజునిగని యటుల॥
భక్తియునెట్టిదో స్థితియునుయెట్టిదో పాటించును నాతండు।
సక్తిగమీరలు జూచిరమ్మనియు చనువున నంపెన్నృపుండు॥ ౪౦.
వేగమె వచ్చిరి పండితులప్పుడు విహితచతుర్భుజు కడకు।
సాగిలబడి నృపు దండము బెట్టుచు సలిపిపూజ వారలకు॥ ౪౧.
చరణ తీర్థమును ప్రాశన జేసియు చక్కటిభోజన మిడుచును।
కరమరుదుగ నిటు కొన్నిదినంబులు కరుణనుండు మనగాను॥ ౪౨.
అటులగాని యని వారలుండుచును యానగరములోపలను।
పటుతరముగ నీ చతుర్భుజుండును బట్టైహరిని స్థిరముగను॥ ౪౩.
అనుచు జెప్పుచును కొన్నిదినంబులు నచ్చటనుండియు పైని।
నినతులై నరపతియాజ్ఞను నడిగిరి వేంచేయును యూరుకని॥ ౪౪.

చతుర్భుజుడుగని శరణాగాతుడను స్వామిసాత్తు యంతయును।
కుదురుగ నెది కావలెనని కోరిన కొనిపోవచ్చు ననగాను॥ ౪౫.
వారలు ధనమును వలదని జెప్పుచు వచ్చితి మిము జూచుటకు।
సారెకు మేమును ధన్యులమైతిమి సరిలేరిలలో నీకు॥ ౪౬.
ఆసమయంబున పంజరమందును హరిభజనను సేయుచును।
వాసిపక్షియగు గోరెంకనునటు వలసిజూచి వారలును॥ ౪౭.
దీనినిమ్మనుచు ప్రియమున నడుగగ తిరముగ నిచ్చెను నృపుడు।
మానుగవారలు గైకొనివచ్చుచు మాండలిన్నృపు గని నెగడు॥
పండితులంగని నడిగె నృపుండును పరిక్షించిన దేమియన।
ఖండితముగ గోరెంకయు జెప్పెను ఘనమగు నీ లోకమున॥
శతమూర్ఖుని వలె నగుపడుచుందువు, చతుర్భుజుని తగగనుము।
సతతము సర్వేశ్వరునే శాంతిని స్మరింపుచుండును సుమ్ము॥ ౫౦.
అతనిపరిచు నీ వేలజేసెదవు హితమునీది చూడుమను।
హితపరులగు.నాసాధుల హేళన నెప్పుడు సేయకు మికను॥ ౫౧.
ఆయుర్దాయము పోవగ యముడును నట్టె నుసురు గొని పోవు।
బాయక నెప్పుడు శ్రీహరిభక్తిని బలపడ జేయుము నీవు॥ ౫౨.
సాదులనిందచె దేహబుద్ధియును చనకుండును యిట నెపుడు।
పాదుగనందుచె భవము తొలంగియు పరముగాన వీ వెపుడు॥ ౫౩.
అందరు వినికొని యీ వచంనంబుల నమిత వింత నొందుచును।
సందియమొందక నరపతి యప్పుడు సలిపె నతీని పిట్టకును॥ ౫౪.
గురుడవు నీవే యనుచు జెప్పుచును గురుతుగ హరి భజనమును।
కరమరుదుగ నే జేసి కృతార్థత గాంచెను నృపుడటు గాను॥ ౫౫.
ప్రధానిమొదలగు వారలిందరును బహు భక్తిని బొందిరటు।
సదావిరక్తితో శ్రీహరినామము జనులందరు నుడివిరటు॥ ౫౬.
సాదులసేవలొ నుండగజేసెను చక్కటిగోరెంకయును।
గీతముల్ భక్తులపైని బాడుచును క్రియనుండును బాలుడును॥ ౫౭.

# పరశురాముని చరిత్ర

పరశురాముఁడను భక్తుండొక్కఁడు బహుధనవంతుండగుచు।
గురుతర మాన్యత ప్రతిష్ఠయును మరి గొప్పగ నతనికి నుంచు॥ ౧.
రఘునాథుండను వైష్ణవ జ్ఞానిచే రంజిల గొనె నుపదేశం।
అఘహర మయ్యెను బ్రహ్మజ్ఞానము నమరె నతనికిని యనిశం॥ ౨.
గురు హస్తము తనశిరసున దగులనె కోరికలెల్లను దీరెఁ।
పరుసను యింటికి వచ్చి కుటుంబపు వాంఛలేక దామీరెఁ॥ 3.
పూర్వకర్మచే తగిలిన బంధముల్ బోవవనుచు దలచుచును।
సార్వకాలముల నేననుభావన చక్కవిడిచి పైగాను॥ ౪.
కర్తయు భోక్తయు శ్రీహరి యనుచును గనకుండు వికల్పములు।
వర్తనముండియు సంసారంబున వాంఛలేక యుండెనిల॥ ౫.
సకలభోగములు గలిగుండంగను సడలె యపేక్షలు తనకు।
అకలంకుండగు హరియె సర్వమని యమితప్రేమతో చెలగు॥ ౬.
ఒకయెడ నాతని గురుబంధుండును నొగివచ్చెను గృహమునకు।
ప్రకటంబుగ నొకయాసన మిడియెను బాగుగ కూర్చుండుటకు॥ ౭.
వింజామరములు కొందరు వేతురు విడెములిత్తురు కొందరును।
సంజను పంచారతులను స్త్రీలటు సరగున నిచ్చిరి గనను॥ ౮.
సుగంధచందన పుష్పహారముల్ సొగసునిచ్చి రందరకు।
ప్రగల్భముగ నటు పురాణశ్రవణము బాహుళ్యంబుగజరుగు॥ ౯.
దీనింగాంచుచు గురుబంధుండును దిగులొందియు తనలోను।
మానుగ నీతడు భోగభాగ్యముల మహానధోగతిని చనును॥ ౧౦.
ఉపచారంబుల సహింప నొల్లక నొప్పుగ బలికెను నతడు।
నెపములేక నే విరక్తినొందితి నీకును సంసృతి నెగడు॥ ౧౧.
ప్రపంచబాధయు విషయ లంపటను బట్టుకొనెను తగనిన్ను।
నెపంబుతోడను భ్రష్టుడవైతివి నిజముగ సుఖ మరిగెనను॥ ౧౨.

ఒకగురు పుత్రుల మిరువుర మయ్యును నుభయుల గతి భిన్నములా।
ప్రకట మాయలో నీవునుంటి విటు భ్రాంతి విడెను నాకిటులా॥౧౩.
పరశురాముడిది వీనుకొని బల్కెను బడితి మాయ నిజముగను।
గురుసుతుగ మీరలు బైట దీయునటు కోరెదమీచరణ మును॥౧౪.
ప్రారబ్ధంబగు సంకటమున నే బట్టితిని బంధువులను।
మీరలునాకును ముఖ్యసోదరులు మేలునుదెలిపిన యెడను॥ ౧౫.
వచన రీతి నేనడచెద నికపై వరుసను ప్రారబ్ధమును।
సుచరితు నీవును గొట్టివేసి యిటు సుఖముంచుము నన్నుయను॥
గురుబంధువు విని పగటి కాలమున కోరియిల్లు విడిచినను।
సరగున గూడుచు బంధువర్గములు చననియ రిటు మనలను॥ ౧౭.
రెండుజాములటు గడిచిన పిదపను రేయినివెళ్ళియు మనము।
కొండశిఖరమున యోగాభ్యాసము గురితో సాధించుదుము॥ ౧౮.
మంచిది యనుచును పరశురాముడును మానుగరాతిరి వేళన్।
అంచితముగ తానన్నిటి విడిచియు నతడుగోచి గట్టియిలన్॥ ౧౯.
ఇరువురు గూడియు యిల్లువిడుచుచును నేతెంచిరి పర్వతమున్।
గురుసుతుగ నచ్చటనే కాంతంబున గూడియుండిరటు ముదన్॥ ౨౦.
పరశురాముడును తన స్వరూపమగు ప్రత్యగాత్మగా నుండన్।
పురము విడిచి యడవిని వచ్చితినని పొందకుండె తలపునటన్॥౨౧.
శీతోష్ణంబులు తగులక నతనకి చేరకుండె నాకలియు।
వాతాతపములు వంద్య నింద్యములు వగుసను సమముండుటయు॥
ఇంటను సుఖసంపన్నుడనై నే నేర్పడియుంటిని యనియు।
కొంచెతనంబున వనమును దెచ్చెను గురుసుతుడని తలచకయు॥
స్వరూప మందును స్థితిని బొందుచును జరిపెను యిరు జాములును।
విరాగి గాకను గురు బంధుండును విపులక్షుధను బొందుచును॥
ఒంటరినగుచును భిక్షజేయుచును నుచితంబుగ నుంటినుము।
జంటరి నొక్కని నేలదెచితినని సరగున జోలెను బుజము॥ ౨౪.

ఉంచుకొనియు దా నరిగెనూరులో నుపాదాన మడుగుటకు।
సంచితకర్మచె యింటింటికి దా చని తనకన్నము నడుగు॥ ౨౯.
కొందర రభక్తులు మర్నితులునై కుక్కలవలె పైబడగ౯।
పొందుగ నాతడు తనలా తలచెనే పూర్వభవము లోన తగ౯॥
అన్నదానమును చేయక యుంటిని యందున నిపుడింటింటి౯।
పన్నుగ దిరుగుచు దుర్వార్తలనే పడుగురెడను వినగంటి౯॥
పరులెడ భిక్షమునీతం డడుగగ పరశురాము కొండపయి౯।
నిరపేక్షుండై యన్నియుండియును నెటివిరక్తి పరుడయ్యె౯॥ ౩౦.
కరువుకాలమున దరిద్రమెటులనో గానకుండె తగనతడు।
గురుతర క్షుధయును బాధించక దా గొప్పమోదమున నుండు॥
*చ్యారణు డొక్కడు భాగ్యవంతుడై చనుచుండెను కొండపయి౯।
దారిలో పరశురాముని జూచుచు దండమిడుచు శిబికెపయి౯॥ 3౧.
ఉంచియు నాతని కొండక్రిందికిని యొప్పగచనె మోదమున।
మించినప్రేమను సేవక జనులను మేలుపచారము సేయుమన॥ 3౨.
మంటప మొక్కటి వస్త్రంబులచె మానుగ వారలు వేయించి।
వెంటనె నతనికి స్నానమొనర్చియు విమల వస్త్రముల నిచ్చి॥ 33.
అత్తరుపన్నీర్ కుసుమ గంధములు నమితంబుగ నిచ్చుచును।
పద్ధుగ భక్షణ జేయించిరి మరి పక్వాన్నంబులతోను॥ 3౪.
మహాపురుషుడని మంచముపైనను మన్ననతోనుంచుచును।
విహార యుక్తపు దిండు పరుపులును వింజామరలు వేయగను॥ 3౫.
విడెములనిచ్చుచు చ్యారణు డచ్చట వేడ్కతోడ నుండగను।
అడుగుచు వచ్చెను గురు బంధుండును నతనిగిరి పైగానకను॥
అతిథివచ్చెనా యనుచు నడుగగను నౌననిచారుల నంగ౯।
కుదురుగ పరశురాముడు వినుకొని కోరియు రమ్మనె లోగ౯॥ 3౬.
లోపలబోవగ నతివిభవంబులు లోలతరము జూచియును।
ప్రాపుగ నీతడు పక్వాన్నంబుల భక్షించియు వెనకాను॥ 3౭.

*లంబాడి - ధాన్యములు గొనిపోవువాడు.

ఎజమానునకును తెలియం జెప్పుచు నెఱమిసంగ తంతయును।
నిజమగు సుకృతము పరశురాముడును నెఱిజేసెను పూర్వమును॥
సుఖభోగంబుల బొందుచు నీతడు సుఖియైయుండును ధరను।
అఖిలమువిడిచియు భిక్షాటన నా యారబ్ధంబున నుండానను॥ ౪౦.
వివేకయుక్తుడై శాంతి సుఖంబును విఖ్యాతంబుగ బొందెన్।
అవారింపకను పరశురామునిన్ నతనింట దెచ్చింపొందెన్॥ ౪౧.
హరిపరతంత్రులై యిరువురుండుచును నఖిల సుఖముగని రటను।
పరతంత్రుల రగు భక్తులసేవకు బాలకృష్ణుడగు నిలను॥ ౪౨.

## కూ బా కు మ్మ రి చ రి త్ర.

నీతడియను మార్వాడిదేశమును చేరినపుర మొకటుండు।
పాడుగనచ్చట కుమ్మరికులమున భక్తుడు కూబాయుండు॥ ౧.
పుట్టినదిమొదలు హరిని దలంచును బొందడు విస్మృతి యిలను।
బెట్టిదముగ నామదేవ్ కబిరువలె బెంపారెను జగమునను॥ ౨.
వివాహయుక్తుడై పురియను సతితో విలసిల్లుచు దా నుండున్।
భవాబ్ధి తరణోపాయం బనుచును భక్తిజేయు హరినెపుడున్॥
కుండలు ముప్పది మాస మేకమున గురుతుగ తా జేయుచును।
ఖండితముగ నట జనులకు నమ్మియు గడుపు తన జీవనమును॥ ౪.
అబద్ధమాడక క్షమాశాంతితో హరి కీర్తన బాడుచును।
కుబుద్ధిలేకను హర్షశోకముల కూడకుండె నియ్యిలను॥ ౫.
సమయంబునకును నతిథి వచ్చినను చక్కగ నిడుభోజనము।
కొమరొప్పగ దా ఫలాపేక్షయును గోరకుండు ననుదినము॥ ౬.
ఆతనిభాండపు యన్నముదినినను హరి భక్తిని బొందించు।
నీతిని నతడిటు కాలయాపనము నెనరున జరుపుచువచ్చు॥ ౭.
పదికుండలకై రాజదండనము బలముగ నటురాగాను।
కుదురుగ వాటిని రాజునకిచ్చుచు గోవిందుని దలచగను॥ ౮.

శ్రీహరికుండల నిర్మించుచు నటు చేర్చెను యాతనియింటన్
బాహుళ్యంబగు నాశ్చర్యంబును భక్తుడు బొందెను చూడన్॥ ౯.
కొందర నిచ్చితి రుక్మిణి పతికిని ధూర్తప్రపంచం బనుచు।
బొందెను తనలో యనుతాపంబును భూరిమహిమదా గనుచు॥౧౦.
ఒకయెడ నిరునూర్ వైష్ణవోత్తములు నొప్పుగయాత్రాపరులై।
ప్రకటంబుగ నాగ్రామము వచ్చుచు బహుగా నన్నాతురులై॥ ౧౧.
ఇందరకును కూడిచ్చు దాత యిచ్చట నుండు రె యనగన్।
కొందరు వర్తకుల్ మీరలకన్నము కూబాకుమ్మ రిచ్చుతగన్॥ ౧౨.
ఇదివిని వారలు కూబాయింటికి నీప్సితులై వచ్చుచును।
సదయులై యచ్చట సీతరామ యని సవాలువేసిరి తగను॥ ౧౩.
కూబా వారల జూచినమాత్రము కుదురుగదండం బిడుచు।
ఏపారగ నావలనను యగు పని నింపుగ చెప్పుడి మనుచు॥ ౧౪.
వారలు జెప్పిరి భక్షణ కావలె వైష్ణవులకు నీ దినము।
ధీరుడై యాతడు నవశ్యమనుచును తెరువున గృహమేగె నుమా॥
ఇంటను ధాన్యము లేకయుండె నటు యేమిచేతు నికననుచు।
ఒంటిరిగా నటు హరిప్రార్థించెను యోజగదీశా యనుచు॥ ౧౬.
బాజారునకును వెళ్ళి వర్తకుని భక్తినడిగె నీ దినము।
ఓజను యాత్రలో వైష్ణవోత్తము లొగివచ్చిరి నాగృహము॥ ౧౭.
పప్పు బియ్యమును వారలకిచ్చియు పద్దువ్రాయు నాపైన।
తప్పక యిచ్చెద ద్రవ్యమునీకును తరుణంబగు నపుడనిన॥ ౧౮.
వణిజుం డనియెను ఐవజు నీయెడ వాస్తవముగ లేకుండన్।
అనువుగ సీదా సాహిత్యంబును నరయనియ్య సరిజూడన్॥ ౧౯.
ఇందుకు బావిని యొకటి త్రవ్వినను నిచ్చెద సామగ్రియును।
సందియమొందక మాట నిమ్మయిటు చక్కజేతు కోరికెను॥ ౨౦.
వినుకొని కూబా యవశ్యమనగను విహితు వణిజుడును నెవకన్।
ఘనతరముగ తా పప్పు బియ్యమును కలిమినిచ్చె నటు వేగన్॥

సాదుజనులు తగ గైకొని వానిని చని రటు దీవించుచును।
పాదుగ కూబా పారనందుకొని బావిత్రవ్వ సతితోను॥ ౨౨.
భూమిని త్రవ్వుచు పురుషుండుండగ పూరీమన్ను మోయుచును।
తామస మొందక బైటవేయుచును త్రవ్విరి బావి నిరువురును॥ ౨౩.
బహుదినంబు లిటు జేయగనందున పయసువచ్చె బహుగాను।
సహనముతో పతి మన్నుత్రవ్వగను సతియు బైటరాగాను॥ ౨౪.
మెత్తటి మన్నై యున్నకతంబున మెలగికూలె బావియును।
తత్తరపడుచును సతియు మొత్తుకొనె పతిమంటిని నణగెనను॥ ౨౫.
పదుగురు నునుజులు వణిజుండును నటు భయమునరిగి చూడంగన్।
కుదురుగ నూతియు సమూలముగనే కూలియుండుటను గనగన్॥
అనర్థమయ్యెను కూబాకుమ్మరి యపుడె యుసురు విడియుండు।
బెనగొని మన్నుం బైటదీయుటకు పెనుదినంబులగు చుండు॥ ౨౭.
సంచిత మెట్టులో నటులంజరిగెను సతిని గృహము బొమ్మనిరి।
అంచితముగనే పూరీయేడ్చెను యనాథనైతిని మీరి॥ ౨౮.
కొన్నిదినంబులు గడవగ జనులా కుమ్మరిని మరచి రటు।
పన్నుగవత్సర మొక్కటినేగగ బావినేల సరిగిట్టు॥ ౨౯.
దారినడచు వారొకదినమందును తాముదిగిరి యచ్చోటన్।
వారలు రాతిరి సమయమునందును వరుసవేయ పడకలటన్॥ ౩౦.
తాళవీణె సుస్వరమగు గానను ధరను మ్రోయగా వినుచు।
వీలుగ నితరులు వచ్చియు వినుచును వింతనుబొందియు చనుచు॥
ఉదయము కాగనె ప్రజలనేకు లటు నూర్జితముగ వచ్చుచును।
నెదయులై వినుచును మోదమొందుచును చక్కవెళ్ళుచుండగను।
ఒకరికి యొక్కరు వార్తలజెప్పగ నూరంతయు వెలియయ్యెన్।
ప్రకటంబుగ నా ధ్వనివిని వెళ్ళిరి ప్రజలు వింతగొనిచయ్యెన్॥
రాజు వినుంగొని వచ్చియచ్చటికి రమ్యంబగు కీర్తనను।
ఓజను వినియట జనులనడిగె దా యొప్పుగ వృత్తాంతమును॥ ౩౪.

కూబాకుమ్మరి బావిత్రవ్వగను కూలెనదియని వారలనర్।
సాబితుగా గన రాజుప్రజల నటు సరగబిలిచి త్రవ్వుమనర్॥ ３౫.
ఆనేకులచ్చట గూడియు మట్టిని యాజ్ఞ గతిగ తియ్యగను।
పునీతు కూబా భక్తునిగని రటు పొసగయా మధ్యయమునను॥３౬.
శ్రీహరి సుందర విగ్రహ మెదుటను జేయునటన బాడుచును।
మోహ మమతలను వదలియు సేవల ముదము సలుపుచుండగను॥
అఖిల జనులు నటగూడియు మిగులను నాశ్చర్యము బొందుచును।
సుఖతర మిదియని రాజుసహితముగ నూటిగనిడి దండమును॥ ３౭.
కేవల మనుజుడు గా డీతండని క్రియను బైట రమ్మనుచు।
భావశుద్ధితో ప్రార్థించంగను బైటికివచ్చియు మించు॥　３౯.
జనులనేకులటు చేరియు తగి నటు సలిపి నుతుల బహుగాను।
ఘనమగు మఠమును నొక్కటి నచ్చట గట్టినరపతి దినమును॥ ౪౦.
దర్శనమునకై వచ్చుచు నుండును ధనధాన్యము బహుగాను।
స్పర్శనలేకను భాగ్యవంతులును సర్వమిత్తు రటుగాను॥　౪౧.
ప్రతిదినమందును రెండువేల సరిగ బ్రాహ్మణభోజన మగును।
ఇతర జాతులగు వారలనేకుల కెలమి భక్షణమగుచును॥　౪౨.
హరికథ కూబాజెప్పియు భక్తిని ననేకులను పొందించెర్।
గురుతర కీర్తియు బహుదూరంబున కూర్మిని నేగియు మించెర్॥
గ్రామవాసులును స్తోత్రముచేయగ కాంతతృప్తి గనకుండెర్।
ఈమెయు వారల గాంచుచు నాకిటు యేసుఖంబు లేకుండెర్॥౪౪.
రెండుజాములవరకును రాత్రిని రెప్పపాటు వేయకను।
ఖండితముగ నే క్షుధితుల కన్నము కరమిచ్చుచు నుండుదును॥ ౪౫.
ఎప్పుడుకష్టము బొందుచునుందును యేమిచెపుదు కర్మగతి।
చెప్పుచు నచ్చట నుండగ బంధువు చేర వచ్చె తగసుగతి॥　౪౬.
ముదమొందుచు నటు ధుగ్ధాన్నంబును మూసియుంచె బంధుకని।
ఇతరాన్నంబుల సాధుజనులకై యేపున వడ్డించగని॥　౪౭.

ఏమోపనికై యామెపోవగను యితరసాధు డొకడచటన్।
ప్రేమాస్పదమున యన్నంబడిగెను పెంపుగవిని కూబయటన్॥
తానేలేచెను వడ్డించుటకై దరి గనె క్షీరాన్నంబు।
బూనెను కోపము సతిపై నాతడు పొందునె తనకు శుభంబు॥ ౪౯.
సాధుల వంచనజేసి క్షీరమును చక్కనుంచె బంధుకని।
పాడుగనిదియును పాపంబగునని పంచె సాధుల కంతటిని॥ ౫౦.
వారలు భక్షణ జేసిన పిదపను వచ్చెనచట పూరియును।
కోరి బిలుచుచు బంధుజనంబును కూర్చుండను జెప్పుచును॥ ౫౧.
పాకశాలలో వెళ్ళిచూడగను పాలన్నము లేకుండన్।
జోకను నామెయు రొమ్ముగొట్టుకొని సుఖమించుక లేకుండన్॥
దెశవేశ సాదువుల నందరను దీసిదగ్గర నాచేతన్।
వేసరిల్లకను కష్టముగైకొని విహితబంధుగని పొంతన్॥ ౫౩.
నేనాతని సన్మానింపుటకై బూనిన దుగ్ధాన్నమును।
తానుసాధువుల కిచ్చివేయుటయు ధర్మమెయన కూబయును॥
అతిథుల వంచన జేసి బంధువును నాదరించితివి నీవు।
సతతమునీకిది సౌఖ్యముగాదని సతిపై కృద్ధత బోవు॥ ౫౪.
ఇదిగనియామెయు నిచటనుండనని యేగె మాతృగృహమునకు।
సదమలు కూబాసంతోషించెను సతితనువిడి పోవుటకు॥ ౫౬.
సాహిత్యములను శిష్యులుగూడియు సలుపుచు నుండగ నటను।
బాహుళ్యంబుగ ప్రజలకన్నమటు బహుగనిడుచు నుండగను॥ ౫౭.
సాధులకొఱకై సతిని విడిచెనని జనులు జెప్పుచుండి రటన్।
ఆతడు ఖేదంబింతయు లేకను హరిని భజించుచు నుండన్॥ ౫౮.
కరువుకాల మటు రాగా నచ్చట కఠినమయ్యె జీవనము।
అరిగిరి ప్రజలును కూబమఠమునకు నతడనె వార్లకాదినము॥ ౫౯.
భక్షణ జేయుచు శ్రీహరి భజనను భక్తినివిను చుండుమను।
అక్షయముగ నట నన్నదానమును నఖిలుర కగుచుండగను॥ ౬౦.

పూరియు వెళ్ళుచు నచ్చట మరియొక పురుషుని దా పెండ్లాడెన్।
పారవారమగు కరువుకాలమున భక్షణకెద లేకుండెన్॥ ౬౧.
దరిద్రపీడను పతియుండానును తల్లడిల్లుచును నుండెన్।
కరమరుదుగతగు సంతతివార్కు కలిగె బహుగనటు గూడన్॥ ౬౨.
పూరీ యప్పుడు జెప్పుచునుండెను పూర్వభర్త బాగుండెన్।
గారాబముతో నూతన పతి గని కఠినంబగుచును నెగడెన్॥ ౬౩.
కూబా వద్దకు వెళ్ళెదమనుచును కోరిచనగ పిల్లలతో।
డాబుగ వీధిని వచ్చుచునుండగ డౌలుగ యొక్క రొకరితో॥ ౬౪.
సూకరములు గని గంగోదకమును సుఖమని యని దలచకను।
జోకతో మోరీ నీరునెద్రాగును దుర్గంధమై యుండినను॥ ౬౫.
సుధారసంబును విడిచియు మద్యము సుఖముగద్రాగిన యటుల।
ప్రధానుడగు యావైష్ణవోత్తముని పరగ వదలి యియ్యెడల॥
మరియొక పురుషుని మరిగె పూరి యిది మంచిదిగాదని యనను।
అరసియు పూరీ ప్రతి జెప్పక దా నరిగెను కూబాయెడను॥ ౬౭.
ఆకలి గొంటిమి యన్నమునిమ్మని యడిగెను నామెయు నతని।
వీకను కూబా వారల గాంచుచు వేంచేయుము బైట యని॥ ౬౮.
వేరొక భర్తను గొంటివి నీవును విష్ణుని గాంచితి నేను।
సారతరంబగు భాగ్యవిశేషము చక్కజూడు మిందునను॥౬ ౯.
అనుచును జెప్పుచు నన్నమందరికి ననువుగ దా బెట్టంగన్।
తినుచుండిరి యటు బహుదివసంబులు దీనులగుచు బెంపెసగన్॥
పురాతనంబగు విష్ణుమూర్తి యటు పూజలేక యొకటుండన్।
సరాళముగ యాగ్రామవాసులును చక్కవచ్చి కూబయెడన్॥ ౭౧.
మూర్తిని దెచ్చుచు మఠములోననే మురిపెముతో నుంచినను।
కీర్తియు మహిమలు గలుగును మూర్తికి క్రియ గనుమని వేడగను॥
అటులనె దెమ్మని కూబా బల్కగ నపుడె చనుచు వారలును।
పటుతర నేర్పును మూర్తిని యెత్తను బహుజేసియు నిగుడకను॥

తిరిగివచ్చుచును సాధ్యముకాదని తెలిపింపగ వారపుడు।
సరగున కూబా వెళ్ళి యచ్చటికి సర్వేశ్వర హరి వినుడు॥ ౭౪.
కరుణాలయుడవు గుణాతీతుడవు కంజదళాక్షుడ వీవు।
హరియను నామము జెప్పినమాత్రము నపారకృప జూపుదువు॥
సకలజగత్తును నీరూపంబై సర్వకాలముల నుండు।
అగణిత గుణముల వర్ణింపను నాకలవియె యిద్ధర నేడు॥ ౭౬.
తెలిసియు భక్తుల మనోగతంబుల తెలియబడుదువు సగుణమున।
బలపడనీవును భావహీనులకు పాషాణముగ నుందువన॥ ౭౭.
మఠము వరకును రావలె నీవని మహాపేక్ష గొంటిసుము।
కఠినము లేకను కోర్కెను దీర్చుము కరుణతోడ నను గనుము॥ ౭౮.
ఇటులం జెప్పుచు కరములలేపగ యెలమిమూర్తి పెకలబడెన్।
నిటలతటాంజలు డగుచునుండగను నెజెజయజయ ధ్వని నిగుడెన్॥
మనుజులచేతను మోయంబడుచును మఠమునకును తేబడియె।
అనువుగ నచ్చట మంత్రఘోషముతో నామూర్తిస్థాపన మయ్యె॥
అనేకప్రజలును విష్ణుభక్తిని నడ్డిలేక బొందిరటు।
పునీతులగుచును దయాశాంతులను పొందుచు వెలసిరినాడు॥ ౮౧.
సాదుసమాగమ మెప్పుడు హరియెడ సత్ప్రీతిని గలిగించు।
సాదుగవారల పాదసేవకుడు బాలకృష్ణుడును మనుచు॥ ౮౨.

## నింబరాజు చరిత్ర.

దేవద్రైటణను గ్రామము నందును ద్విజుడు నింబుడని యుండెన్।
భావముశ్రీహరి భక్తిని నుంచుచు భాగవతుల దా గూడెన్॥ ౧.
కులకరణీ యగు వృత్తిని నుండుచు కుటుంబపోషణ జరుపు।
ఇలలోనుండెడు తీర్థములన్నియు నేపున జూచియు నొప్పు॥ ౨.
సేవింపుచు దా సప్తపురంబుల చేరెను యింటికి తిరిగి।
భావింపుచు శ్రీవిఠల మూర్తిని భగవత్కథ రుచి గలిగి॥ ౩.

తానుస్వయముగా కీర్తనజేయను తలపోయుచు శ్రీహరిని।
దీనత్వముతో వేడుకొనుచు దా దీర్ఘకాల ముండగని॥ ౪.
కరుణింపుచు శ్రీపండరి నాథుడు గజవదనుని దా బిలిచి।
వరమునిమ్ము యానింబ రాజునకు హరికీర్తనకై వెలసి॥ ౫.
ఇదివిని గణపతి యొకదిన మందును నేగెనింబు కలలోను।
సదయుడై వరమును చేకోమనుచును సరగనిడెను విశేషములను॥
ఆతడు దానింగైకొని చేతిని నందంబుగ భక్షించె।
పాడుగ గణపతి బలికె నతనితో భగవత్కథ జేయించె॥ ౭.
ప్రావణ్యంబును నీకుగలుగునని బ్రాహ్మణుడై జెప్పుచును।
సావధుడగునటు జేసియు చనియెను సరగున గణపతి యటను॥
మేలుకొనంగను నింబునకప్పుడు మితిగ కథల జేయుటకు।
వీలు సమర్థత గలిగిపాత్రుడై వెలసెను శ్రీహరి కృపకు॥ ౯.
ఆశా మోహము లభిమానంబుల నరసియతడు వర్జించి।
పాశబంధముల విడిచియు నాతడు పండరిపురికే తెంచి॥ ౧౦.
భీమానదిలో స్నానము జేయుచు ప్రియమున చనె దా గుడికి।
నేమము తోడను నాసమయంబున *నెఱిరుక్మిణి యాతనికి॥ ౧౧.
మాలాకారిగ గాజరగడ్డల మానుగ నమ్ముచు నుండి।
వీలుగ బలికెను నతనిగాంచుచును విహితశిశువు గృహముండి॥
చనుబాలుకునై చాలారోదన సలుపుట జూచితి నేను।
పనిబడియింటికి బోవుచునిప్పుడు బాలుని దెచ్చెద నిటను॥ ౧౩.
అందాకను యీగడ్డల జూచుచు నరసి యుండుమని జెప్పన్।
తొందర నొందక నింబుడు కరుణతో దురుసుగ నుండెను నొప్పన్॥
గడ్డలనప్పుడు వస్త్రములోపల గట్టియుంచుచును తాను।
బిడ్డను దెచ్చెద ననుచు జెప్పుచును ప్రీతి నేగె గుడిలోను॥ ౧౪.
అటుగూర్చుండెను నింబుడు యామము యామెయు నటు రాకుండన్।
పటుతరమగు ముడి విప్పి చూడగను బంగరుకడి లయ్యుండన్॥ ౧౫.

---

* నెఱి - గొప్ప.

ఆదిమాయ నను మోసబుచ్చుటకు ననర్ధమగు కనకమును।
పాదుగ నాకును జూపె గదా యని బహు యనుతాపముతోను॥
దేవాలయమున కరిగి హరికిని దీర్ఘదండం బిడుచును।
భావార్ధముతో బలికెను నాతడు బహుశోధన లిటుగాను॥ ౧౮.
ఏలజేసెదవు నీకృప మాత్రమె యిచ్ఛయించి మరి యొకటిఁ।
తాలిమి తోడను వలదని జెప్పుచు దండముబెట్టును నూటిఁ॥౧౯.
శ్రీరుక్మిణికిని దండముబెట్టుచు చేరెను విడిదిని యటను।
సారెకుశ్రీహరి నామము జెప్పుచు చక్కగనుండగ తాను॥ ౨౦.
శ్రీహరినింగని రుక్మిణిజెప్పెను చిక్కడీత డాశలకుఁ।
స్నేహాశూన్యుడై సంపద ధనముల చెంతకు రాకను నులుకుఁ॥
ఇదివిని నవ్వుచు శ్రీహరి బలికెను నిలదాసులు ననుగోరి।
మదిని నిరాశా సంతుష్టులునై మమతలోభముల మీరి॥ ౨౨.
ఉందు రనెను, నటు మరుదినమందును నొసగ నింబుడేటికిని।
తొందరతోడను నరిగిస్నానమును దురుసుగ నటు జేయగని॥ ౨౩.
తులసీ మాలయు మేఖలములతో యిల జల్తార్ టోపియును।
వెలసినగంధం బురమునబూసియు విప్రునివలె హరియటను॥ ౨౪.
నింబుని జూచుచు దొంగ లనేకులు నెనరున దిరిగెద రిటను।
డంబమనక నీవస్తువు లెల్లను డాయనుంచు నీ విటను॥ ౨౫.
జలకములాడిన పిదప వత్తునని జరిమేఖల మాలలును।
వలగొని టోపిని చేతులనిచ్చియూ వరుసగనుంచు మనుచును॥
ఆతడువెళ్ళగ నింబుడు నచ్చట నరమరగా నొకజాము।
పాదుగనుండియూ విప్రుడు తిరిగియు పదపడివచ్చుట గనము॥ ౨౭.
ఏమిచేతునని యచ్చటి సాధుల నెలమిని దా నడుగగను।
వేమఱు కనుగొని జెప్పిరి వారలు విఠలుని కృపయిది యగును॥
అతడే నీకివి యిచ్చెను యనుచును నరయగ నటు జెప్పగను।
హితులై యందరు గుంపులుగూడుచు నీశుని నుతిజేయుచును॥ ౨౯.

మాలయు టోపియు మేఖలమతనికి మానుగ వేయుచు నపుడు।
వీలుగ గుడిలో తీసికొ నేగిరి విఠలుని కథయానాడు॥ ౩౦.
జేయవలయునని సాధువులందరు జెప్పగ తా నాదినము।
బాయక శ్రీహరి గుణ వర్ణంబును భక్తితోడ జేసె సుము॥ ౩౧.
ప్రేమ లహరితో ప్రియవాక్యంబుల పెంపుగ నటు జెప్పగను।
నేమముతో నపుడనేక జనములు నిలిచిరి కుంఠితులుగను॥
గోవిందా హరి కృష్ణా యచ్యుత గోపవల్లభా యనుచు।
బ్రోవందగుదువు భువిజనంబులను పురాణ పురుషా యనుచు॥ ౩౩.
మధుర రసంబున కన్నీరొలుకగ మాధవు బాడ్యాడగను।
విదితుడు గాకను హరియొక బాలుడై వేసె వింజామరములను॥
ఆయాసముచే నింబరాజు యట నలయకుండు రీతిగను।
ధ్యేయ వస్తువగు కృష్ణమూర్తియును తీరజేసె సేవలను॥ ౩౪.
భగవంతుండటు నిజకళతోడను ప్రాదుర్భవుడై యుండగా।
విగతమోహులై విష్ణుని కథలను వినుచుండిరి తగనాడగా॥ ౩౬.
అరుణోదయమున నటనొక స్త్రీచనె నరయగ స్నానంబునకు।
గురుతుగ శ్రీహరి విసరుచునుండగ కూర్మినిగని తాసాక్కు॥ ౩౭.
ఆరూపము నేజూచుచుండ హరి యంతర్ధానము నొంద।
దూరుచు గుంపులో నార్తిని మించుచు తొడగి నింబు పదమంద॥
రోదన చేయగ కారణమేమని రూపింపుం డనగాను।
పాదుగ చమరులు వేయుచుండె హరి భక్తుని మెడనుండుచును॥
భుజములపైనను బాలవేషమున పూర్ణవిగ్రహుండగుచు।
సుజనోల్లాసుడు నెమలి పింఛమున సురతగ విసరెను మనుచు॥
పదచిహ్నంబులు చందనచర్చిత భాగ భుజంబుల జూచి।
కుతూహలంబున జనులు గూడుకొని కొనియాడిరి బహుమించి॥
విఠలుని నామముగర్జన జేయుచు విపులమోద మొందుచును।
నిటలతటంబున హ స్తము లిడుకొని నెనరుననుతి జేయుచును॥ ౪౨.

మాధవుకృపగని బహుగా పొగడిరి మానుగనింబుని యపుడు।
సాదరముగనటు హారతులిచ్చిరి సర్వేశ్వరునకు గనుడు॥ ౪౩.
మూడుదినంబులు పండరి నుండుచు ముకుందునటు గొల్చుచును।
పాడుచు నామము వెళ్ళిగృహమునకు పండరిపతి బొగడుచును॥
సారె సారెకును హరి నామంబును సలిపెను హరిదాసుడును।
కోరిభజించుచు బాలకృష్ణుడును గుణిని సలుపు సేవలను॥ ౪౫.

---

వల్లభాచారి గోవిందదాసు చరిత్రము.

వల్లభచార్యుండను నొకవిప్రుడు వసించె బృందావనమున।
ఉల్లమలరగను శ్రీహరి యర్చన యుచితభక్తి నిగుడగన॥ ౧.
శాంతియు క్షమ యధ్యాత్మజ్ఞానమును చక్కనతనికి గలిగుండెన్।
దాంతియు లీనత సర్వభూతముల తరుచుగాగ నెగడుండెన్॥ ౨.
ప్రబోధశక్తిచే ననేకజనులను భక్తిలోన బొందించెన్।
సొబగున శ్రీహరి కీర్తనమెప్పుడు సూటిగ జేయుచు వెలసెన్॥ ౩.
శ్రవణంబును హరి కీర్తనయును మరి స్మరణము పదసేవయును।
వివరంబుగ హరి యర్చనవందన విహిత దాస్య సఖ్యమును॥ ౪.
సతతము హరికిని యాత్మనివేదన సలుపుట నవవిధ భక్తియగున్।
గతయుగమందున నన్నియుజేసిరి కలియుగమున స్మరణమగున్॥ ౫.
అసంఖ్యజనులును తరింపబడుదురు హరినామస్మరణమున।
పొసగగ వల్లభాచార్యుడు హరినిం బూజించును క్రమమున॥
విధితో షోడశయుపచారంబుల విపులప్రీతి జేయగను।
సదయుడై శ్రీహరి యప్పుడప్పుడును సాక్షాత్కారుండగును॥ ౬.
త్రికాలపూజను వల్లభాచార్యుడు తిరముగ జేయుచునుండు।
ప్రకారముగనే యుత్తరోత్తరము భక్తియధిక మగుచుండు॥ ౭.
రాధాగుండంబను ప్రదేశమున రంజిలెనొక భక్తుండు।
సాధు లతని గోవిందదాసుడని చక్కగబిలిచెద రెపుడు॥ ౮.

తల్లియు కొమరుడు నిద్దరె యచ్చట దలచుచు హరితమలోన।
సల్లలితంబుగ ననేకజన్మముల్ సాధించిన ఫలము యన॥ ౧౦.
అనాయాసముగ హరిని గాంచుచును నరసియుండు సుతుడటను।
వినీతుడగుచును యెటు భావించిన విశ్వంభరునిం గనును॥ ౧౧
కపటములేకను హరినిభజించిన జ్ఞానులకును శ్రేష్ఠుడగు।
నెపమున హరి గోవిందదాసుతో నిత్యమాటలాడ నగు॥ ౧౨.
నందనందనుడు గోపబాలురతో నటనజేయు విధమునను।
సుందరముగ గోవిందదాసుతో సురుచిరాట లాడెమును॥ ౧౩.
గోలీలాడును పైగా నెక్కను గురుతుగ బలి చిక్కాడుచును।
మేలిమి యివి మొదలనేక యాటల మెలగుచుండు హరియటను॥
ఒకరికి యొక్కరు లీలను దెబ్బలు నొసగవేయుచుందు రటు।
పకపకనవ్వుచు యోడిపోతివని భాషలాడి మెలగిరటు॥ ౧౫.
హరిపరి గెత్తగ భక్తుడువెనకనె యతని వెంట పరుగులిడు।
మురిపెముతోడను హరిని బట్టుకొని ముదమొందును దా నపుడు॥
జ్ఞానపూర్ణులగు కొందరు భక్తులు గని హరి యిట్లాడగను।
శ్రీనికేతనుడు చిన్మయరూపుడు చిక్కెబాలు రాటకును॥ ౧౭.
పరంధాముడును బ్రహ్మకు తండ్రియు బాలచేష్ట గైకొనుచు।
నిరంజనుండై యాటలమరిగెను నెవరు చిత్రంబిది యనుచు॥ ౧౮.
అతివిస్మితులై వెళ్ళిరి వారలు యమితప్రీతి నొందుచును।
సతతము యిరువురు యాడుచుకాలము జరిపిరి యటు బహుగాను॥
ఒకయెడ హరియును భక్తునిగొట్టుచు నొగిపరుగిడి బోవగను।
అకలంకుడు గోవింద దాసుడును నతని వెంట నురుకగను॥ ౨౦.
శ్రీహరి యప్పుడు యేడు ప్రాయముల చిన్నవాని రూపునను।
సాహసమగునటు వల్లభాచార్యుని సదనంబును రాగాను॥ ౨౧.
అతివిస్మితుడై హరిచరణంబుల నతడు వేగ బట్టగను।
గతమోహుండగు గోవిందుండును గనుచువచ్చె వెనకాను॥ ౨౨.

వీపునదెబ్బను వేసి యుఃకితివి విడిచెద నోనిన్నిపుడు।
ఏపునబైటికి రమ్మని జెప్పను యిష్టుడు గోవిందుండు॥ ౨౩.
ఇదిగనివల్లభు డచ్చటి భక్తుల నీప్సితతో తాజూచి।
కుదురుగ బ్రహ్మయు ధూర్జటి యెవ్వని గురుతును మరవక హెచ్చి॥
మనసున నుంతురు యట్టిమాధవును మహిని విధవ కొడుకగుచు।
అనువుగనీతడు గొట్టవలయునట యదివింటిరె మీరనుచు॥ ౨౪.
గోవిందుచు యట తరుముచు బైటనె గొట్టిరి తగ వారలును।
ధావంతముతో వెలపల నేడ్చుచు దామోదరు గొట్టెదను॥ ౨౫.
నన్నెగొట్టుచు పైగా దెబ్బలు నాపైబడ చేసెనని।
అన్యాయంబిది యందరుగనుడని హరియుబైట వచ్చునని॥ ౨౬.
గుణుగుచు నచ్చట కూర్చుండంగను గురు వల్లభ చార్యుడును
అనుమానించక హరి యర్చనదా నరమరకను జేయుచును॥ ౨౭.
ప్రసాదమప్పుడు హరి నివేదనకు భక్తితోడ నుంచంగన్।
హృషీకేశుడును నారగించకను హృత్తాపము నుండంగన్॥ ౨౮.
వల్లభచార్యుండటి దుఃఖముతో వాసుదేవు ముందరను।
ఉల్లమలరగను ప్రార్థనజేసెను నుచిత భక్షణ జేయుమను॥ ౩౦.
మాధవుడని యెను గోవిందునితో మహి బాలుగ నాడెదను।
వేథనొందియా బాలుండియ్యెడ విపుల దుఃఖ ముండగను॥ ౩౧.
అన్నము నాకును హితముగనుండదు నతనిగూడి దినకుండన్।
పన్నుగ నీవును సమాధానమును పరగజేసి యతనియిటన్॥ ౩౨.
పిలిచి రమ్మనుచు జెప్పగనాతడు పెనగి వింత నొందుచును।
అలయక వల్లభు గోవిందుని యెడ నప్పుడె దా బోవుచును॥ ౩౩.
అనేకవిధముల సమాధానమును నతనికి తగ జేయుచును।
పునితుండగు హరిపైగా నేరము పొందినదియు సత్యమను॥ ౩౪.
శ్రీహరి నినువిన యారగించడిటు శీఘ్రంబుగ నిను బిలుచు।
బాహుళ్యంబగు కృపను జూపిమరి పరగనటకు రమ్మనుచు॥ ౩౫.

పరిపరి విధముల మృదు మాటలచే బట్టుకొనేగా హఠికడను।
ఇరువుర స్నేహము జేసియు పిదపను నిటు భక్షణ చేయుమను॥
పదార్థ మంతయు నుంచి యచ్చటను పరదాలను తగ వేయగా।
నిదానముగ శ్రీహరియు భక్తుడును నెనరున భక్షణ జేయగా॥ ౩౭.
గోవిందుండును మరచెను వెనకటి కోపు దెబ్బ క్రౌర్యమును।
సేవించుచు హరిరూప గుణంబుల చెలిమి భాష బలుకుచును॥ ౩౮.
ఆరగించిన వెనకను వల్లభుం డట నందిచ్చె విడెములు।
తీరుగ శ్రీహరి యంతర్ధానుడై తెలియకుండె నయ్యెడల॥ ౩౯.
ఒంటరి యగుచును గోవిందుండును నొనర వెళ్ళె తన గృహము।
జంటను నచ్చట హరిని గూడుకొని సరియాటల మరిగెసుము॥ ౪౦.
బాలచేష్టచే యొకయెడ నిద్దరు పైబడి కొట్టుకొనంగా।
వీలుగ తల్లియు గోవిందునికై వెలి వచ్చియు చూడంగా॥ ౪౧.
చతుర్భుజంబుల శ్రీహరి నచ్చట చక్కగ జూచియు తాను।
పదిలెము తోడను వచ్చియు కొడుకును బట్టి లేపుచుండగను॥
అంతర్ధానుండయ్యెను శ్రీహరి యామె కొడుకు బట్టుకొని।
పంతముతోడను నింటికి దెచ్చుచు బలుచనువున పుత్రుగని॥ ౪౩.
ఆటల నీతో మరిగిన వాడిటు యచ్యుతుడే యగునుసుమి।
పాటవమగు నీ పుణ్య ఫలంబున ప్రసన్నుడయ్యెను వినుమి॥ ౪౪.
హరిబ్రంహ్మాదులకంద రానియా యఖిలేశుండత డనియు।
గురుతుగ నాతని సేవ నెల్లపుడు కోరి జేయ వలెననియు॥ ౪౫.
నీ సమానుడని హరిని యెంచకుము నిత్య మాడూట మానుమను।
వేసరిల్లకను పూజను చేయుము వేల్పు పెద్ద యనుచును॥ ౪౬.
స్నానము జేయక నాతని ముట్టకు సచ్చిత్సుఖుడగు నతడు।
మానుగ నిట్టుల జెప్పగ పుత్రుడు మానిని గనియనె వినుడు॥ ౪౭.
ఆశుచిత్వము నాకుండంగనె నతడె వచ్చి తాకు నను।
ఈశుడు యతడని జెప్పెద వీవును యెప్పుడాడు నాతోను॥ ౪౮.

దెబ్బలు వేసిన నోర్చుచు నుండును తిట్టిన దా నవ్వునుము।
గొబ్బున నతనితో మర్యాదను నే గూడు నెట్లుతగ జెపుము॥ ౪౯.
తల్లి వినుంగొని గడిచిన పనికై తల్లడిల్లకిక నీవు।
సల్లలితంబుగ ధ్యానము నిటుపై సలుపుచుండతగు దీవు॥ ౫౦.
ఇదివిని కొడుకటు స్నాన యుక్తుడై యెలమిని గొనె యాసనము।
కుదురుగ నచ్చట ధ్యాన యుక్తుడై కూర్చుండెను యచటసుము॥
చేష్టల చేయుచు శ్రీకృష్ణుండును చేరవచ్చి తానటను।
కాష్టము నొక్కటి చేతిని నిడుకొని గారవమున చూచుచును॥
నెఱజాణత్వము జూపుచు నిట్టుల నే డుండుట యెందుకను।
గురుతుగ నీకగు దైవమెద్దియొ కోరికేమొ జెప్పుమను॥ ౫౩.
అనుచు జెప్పుచును నాతని ఛలమును హరి తానే చేయంగ౯।
చనువుగ తల్లితో గోవిందుండును చక్క జెప్పు హరి వినగ౯॥ ౫౪.
చూడుము నీవిటు హరి తానే నను చొప్పించుచు నాడునుము।
కూడేదెటు నే మర్యాదను, హరి కుంఠిత చర్యల గనుము॥ ౫౫.
తల్లి జూడగనె యదృశ్యుడయ్యెను దామోదరు తా నపుడు।
మెల్లగ తిరిగియు గోవిందుండును మెలగును ధ్యానమునాడు॥ ౫౬.
అప్పుడే శ్రీహరి ప్రకటన మగుచును నాటలాడ రమ్మనుచు।
గొప్పగ నెవరి ధ్యానముండెదవు గోవిందా లెమ్మనుచు॥ ౫౭.
సాధువేష మిటు సుందర మైనదె చాలుచాలు యనగాను।
పాదుగ నాతడు క్రోధ యుక్తుడై బలికె వికట మాటలను। ౫౮.
శ్రీహరి యందుకు సంతోషించుచు జెచ్చెర లేపె నాటలకు।
సాహసక్రియలను సలుపుచు తిరిగిరి చర్చల చేయుచు పెక్కు॥
ఆసమయంబున వల్లభు శిష్యుడు హరికి ప్రసాదము గొనుచు।
వాసిగ దారిని బోవుచు నుండగ వారలు తాకంగనుచు॥ ౬౦.
ప్రసాద మంతయు నంటయ్యెను యని బాలురకిడు శిష్యుండు।
సుశీలుడగు తన యాచార్యుని కడ నూటి నరిగి జెపుచుండు॥ ౬౧.

దారిని రాగను గోవిందునిచే తాకబడె ప్రసాదమును।
వారక నతనికె ప్రసాద మిచ్చుచు వచ్చితి నే నియ్యెడను॥ ౬౨.
క్లేశము నొందుచు వల్లభార్యుడును కేశవుతో నిట్లనియె।
వేసరిల్లకను గోవిందుని యెడ విపుల చనువు చేయుటయె॥ ౬౩.
అనర్థ మయ్యెను హరిగోవిందా యాజ్ఞయు నేమనగాను।
అనువుగ హరియనె గోవిందునకును నన్నపిడుచు ముందుగను॥
వెనకను నాకును ప్రసాదమిమ్మని విఠ్ఠల రంగడు బలుకన్।
తనివిని వల్లభు డట్లనే చేయుచు తా కాలము గడిపెతగన్॥ ౬౫.
అవనీ పతికిది దెలియంబడగను నతడు భటుల నంపునటు।
సవినయముగ నా గోవిందుని తన సన్నిధికడ దెచ్చునటు॥ ౬౬.
డిల్లి నగరముననుండి వారలును శీవి నరిగి మధురకును।
సల్లలితంబుగ గోవిందుని గని చనుమనిరటు నృపుకడను॥ ౬౭.
అదితా వినగనె యదృశ్యు డయ్యెను నందరి ముందర నతడు।
చతురతతో నటు బహుగా వెదకిరి జవాను లందరు నపుడు॥ ౬౮.
ఎచటం గానక ఖేదము నొందుచు యేమి జేతు మనగాను।
సుచరిత్రుడు యా గోవిందుండును సూటి నరిగె నృపు కడను॥
పట్టె మంచమున రాజుపరుండగ ప్రకట మగుచు నచ్చోటన్।
కొట్టెను నృపవరు నురంబు పైనను గుణుగుచు తగ క్రిందబడన్॥
ఎవ్వరు దూఱుట కలవిగానియా యేకాంతపు చోటందు।
దవ్వున మనుజుం డెటుల వచ్చెనని ధరపతి తొందర బొందు॥ ౭౦.
నిదానించియటు చూడగ నచ్చట నిలుచుండెను యొక నరుడు।
విధేయు డగుచును నృపవరు డతనికి విన్నపింప నిలుచుండు॥
ఎవడ వీవు నన్నేల గొట్టితివి యేపున జెప్పుమనంగన్।
వివరించెను తా గోవిందుండని వేంచేసితి బిలువంగన్॥ ౭౩.
ఆటలాడెదను హరితో నెప్పుడు నందున నీకేమయ్యెన్।
సాటిగ రాజమదంబున నాకై చారు లంపితివి చయ్యెన్॥ ౭౪.

అంజలి హస్తుడై నరపతి వేడెను హస్తము శిరముంచు మని।
వంచన లేకను యాజ్ఞ ప్రకారము వరుస జరిపెదికను గని॥ ౭౫.
ఇదివిని గోవిందుండనె నృపుతో యిదు జాబుల చారులకున్।
కుదురుగ వారలు తిరిగివచ్చినను కూర్మితోడ జేరుటకున్॥ ౭౬.
అటులనే కానిమ్మనుచును చీటిని యవనీపతియును వ్రాసెన్।
పటుతరముగ తాగైకొని మధురను ప్రకటంబగుచును వెలసెన్॥
రాజముద్రతో పత్రము నప్పుడు రాజదూతలు గనుచును।
పూజలసలుపుచు మహాపురుషునికి పోయిరివారు నగరమును॥ ౭౮.
ప్రతిష్ఠమాన్యత గోవిందునకును బహుగా కలిగెను యటను।
హితుడగు నాతడు నది మొదలుగ తా నెవరికి నగు పడకయును॥
చిరంజీవియై మధుర నుండునని చెప్పుచు నుందురు జనులు।
నిరంతరంబును బాలకృష్ణుడును నెఱిదాసుడై విలసిల్లు॥ ౮౦.

---

## ప్రే మ ని ధి చ రి త్ర.

శ్రీహరిభక్తుడు ప్రేమనిధి యనియు చెలగెను కరి నగరమున।
ఊహానునాతడు రాముని పూజను నొనరజేయు చుల్లమున॥ ౧.
శిష్యులు మనకును సాహిత్యంబును చెలిమినిచ్చు చుండినను।
వశ్యుడనగుచును వారల కెప్పుడు వరుసనుండ వలయునను॥ ౨.
జేసిన పుణ్యము వారలెగొందురు చేరదుసుకృతము తనకు।
కాసుతీసికొని చాకిరిజేసిన గతియగునని దలచదగు॥ ౩.
పరహస్తంబున సేవగైకొనరు భగవత్ప్రాప్తి సాధకులు।
సరి విభాగమగు సుకృతం బనుచును చక్కగ దలతురు వార్లు॥ ౪.
ఈవిధ చింతను జేసి ప్రేమనిధి యీశుపూజకై యొకడై
కావలసిన పనియంతయు జేయును కలుగు సుకృతమని మెంచె॥ ౫.
పురాతనంబగు రామవిగ్రహము పూజించును నాతడును।
సరాళముగ తా గంగకువెళ్ళును జాము రేయి యుండగను॥ ౬.

జలకము లాడియు నీళ్ళను దెచ్చును శౌజ - పాఠ పూజకును।
వలసినపువ్వుల మాలనుగట్టును వడి గంధము తీయుచును॥ ౭.
తిరుమంజనమును రామమూర్తికిని తీరుగ తా జేయుచును।
అరసియలం కృతులర్చన లన్నియు యామూర్తికి సలుపుచును॥ ౮.
ఈవిధమున తానే దినములు నెలమిజరగ ... ముండు।
సేవకుణస్థుడై సాక్షాత్కారపు సేవను జూపుచు నుండు॥ ౯.
మనుష్య మాత్రున ... కారంబును మానుగ జేయుచు రాగ।
తనదు సఖుండని తలచం బడగను దశరథరాముని బాగ॥ ౧౦.
ఆరాధించిన నబ్బకయుండునే యాతని కరుణయు నిలను।
పారావార సుఖంబునొందుదురు భగవంతుని గొలచినను॥ ౧౧.
ఒకకాలంబున హస్తినాపురిని యున్నతవర్షము గురిసె।
వికలంబయ్యెను మార్గము బురదచె వెలసెను రే చీకటిచే॥ ౧౨.
వాన చినుకులును పడుచుండంగను వలసి లేచి ప్రేమనిధి।
మానుగరాత్రిని చీకటి కమ్మెను మహిగంగ కరుగతగుసుద్ది॥ ౧౩.
ఉదయమైన వెనకను బోయిన యెడ నానరయవన స్పర్శయగు।
సద్దమల యుదకము నభిషేకమునకు సరిపడదటు దేవునకు॥ ౧౪.
అనుచు దలంచుచు బిందెనెత్తుకొని యపుడె వెలపల రుగుచును।
ఘనమగుచీకటి బురదను నొంటరై కాళ్ళు చెదర నడవగను॥ ౧౫.
సీతారాముడు మనుజ రూపమును చే దీవిటి బట్టినటు।
సాధారణముగ దారిదెలియునటు సలిపెరాము ముందునటు ౧౬.
నామము నుడువుచు ప్రేమ నిధియటను నడుచుచుండె ...।
ఏమరకంగనె దివిటీ నచ్చట నెలమి వింత నొందుచును॥ ౧౭.
ధనికుని యెవనినొ యింటిని విడుచుచు దారిచను మహాల్చి యని।
అనువుగ నాకది యుపకారంబుగ సమకియుండె నేడు యని॥ ౧౮.
చింతన జేయుచ భగీరథికి దా చేరియు స్నానము జేసి।
వంతము తోడను బిందె నింపుకొని పరగ తిరిగిపో జూచి॥ ౧౯.

అయోధ్య రాముడు చేతి దీవిటిఁ ననువుగాను వెలిగించి।
ప్రయాణ మయ్యెను భక్తుని ముందుగ ప్రబల దీప్తి కలిగించి॥ ౨౦.
నీటిబిందెదా తలపై నిడి చని నిలిచెనింట భక్తుండు।
సూటిగ రాముండ దృశ్యుడయ్యెను జూచుచుండ నాతండు॥ ౨౧.
మనసున నప్పుడు తలచెప్రేమ నిధి మహా దపచారమయ్యెనని।
ఇనకుల తిలకుఁడె దీవిటినిడికొని యేతెంచెను తోడయని॥ ౨౨.
సనకసనందులు యోగనిష్ఠనిటు సలుపుచుందు రెవ్వనికై।
ఘనుఁడారాముడు మహాల్చియగుచును గైకొనె దీవిటినాకై॥
అనుతాపంబును బహుగబొందుచును హరిసన్నిధి ముందుగను।
వినతుడై బల్కెను సేవహీనుడను విజ్ఞానము లేదుయను॥ ౨౪.
భక్తిహీనుడను విరాగహీను నీపాద పూజనెటుజేతు।
సక్తిగనీవే పూర్తిగజేతువు సర్వేశ్వర యేమందు॥ ౨౫.
ఒంటిగకైంకర్యంబును జేయుట కుచితముగా దనుటకునై।
కంటికింపుగా నుదహరించితివి కంజాక్షుడ నాకునై॥ ౨౬.
శ్రీరఘురామా చిత్తమునీపై జేరియుండ కృపజూడు।
వారక నిట్టుల భక్తిసలుపుచును వరుసప్రేమ నిధియుండు॥ ౨౭.
ప్రేమను కీర్తన రాత్రికాలముల పెంపుమీర జేయగను।
నేమముతోడను సాధువైష్ణవుల్ నెఱి స్త్రీశూద్రాదులును॥ ౨౮.
వినుటకు వత్తురు విశేషప్రీతిచె విపులభక్తినిం గనుచు।
ఘనుడు ప్రేమ నిధి జనులతరించను కలిని బుట్టె తమకనుచు॥ ౨౯.
కొనియాడంగను కుటిలులుకొందరు గూడిరి యటు నొకచోట।
దినమును నీతడు పొట్టకొఱకునై తెలుపును హరికథజూడ॥ ౩౦.
యువతీజనముల జేర్చుకొనుచు దా నొప్పుగ గీతముల్ బాడు।
అవకాశంబున వారికరంబుల నాతడు బట్టుచు నుండు॥ ౩౧.
శిక్షచేయవలె నీతని యనుచును జెప్పుచు నటు వారలును।
పక్షములేకను నరపతి కడకును బరతెంచుచు తగనటను॥ ౩౨.

కొండెముల ప్రేమనిధిపై జెప్పిరి గోరియతడు వనితలతో।
ఖండితముగ పరిహాసములాడును కపటజెప్పు వారలతో॥ ౩౩.
మాకును నాతడు సోదరుడైనను మహీయకర్మ చేయుటచే।
వీకను నీవుమ శిక్ష చేయుమిటు విచారించి తగు పోచ్చ॥ ౩౪.
ఇదివిని క్రోధము భూపతి నొందియు నెలమిబంపె దూతలను
కుదురుగనాతని రాజసన్నిధిని గురితో బిలుచుటకును॥ ౩౫.
దూతలువచ్చిరి జాముర్రాత్రిలో తొందరతో నయ్యెడను।
పాడుగనప్పుడు ప్రేమనిధియునట భగవంతుని చరితలను॥ ౩౬.
అతి సురసంబుగ జెప్పుచునుండగ ననేకులట వినుచుండు।
హితుడగు రాముడు ప్రాణభూతుడగు నిందుముఖుడె బంధువుడు॥
అన్నయు రాముడె తండ్రియు రాముడె యవని సఖుడు రాముండె।
పన్నుగ తల్లియు బంధువర్గములు పరంధాము రాముండె॥ ౩౭.
రాముడు లేకను శరీరముండదు రాముడె బ్రహ్మజ్ఞానంబు।
రామమూర్తిని నిక్షేప ధనంబగు రాము మోక్ష సదనంబు॥
కన్నులు రామునే జూచుచుండవలె కరములు నర్చించవలె।
పన్నుగనోరును రాము నుడువవలె పరభక్తిని మనసుండవలె॥ ౪౦.
ఈవిధముగ తా ననుసంధానము నేర్పడ జేయుచు నుండగ।
సేవక జనులును యప్పుడు వచ్చుచు జెప్పిరి నృపు నాజ్ఞనట॥ ౪౧.
నీదు సోదరులు నృపు కడ వచ్చియు నెపములనిరి నీపైనన్।
పాడుగ నీవును నిపుడె రావలెను బలవంతము జేతుమనన్॥
అందుకు బలికెను ప్రేమ నిధియును నర్ధరాత్రియై యుండెన్।
సందియ మొందక జలము రామునకు పొందుపరచి వత్తునెడన్॥
పలికిరి దూతలు బలాత్కారముగ పట్టుకొనెదమనగన్।
వెలపల వచ్చుచ, వార్లతో నాతడు వెళ్ళె నామమనుచు తగన్॥
వినుటకు వచ్చిన జనులందరు నటు వెళ్ళిరి తమ యిండ్లకును।
ఘనుడు ప్రేమ నిధి రాజ గృహమునకు కలత గొనక రాగాను॥

ఆసమయంబున నృపుడు గృహములో దాసి జనులతో నుండ।
వాసిగ దెల్పిరి జవానులప్పుడు వచ్చె ప్రేమనిధి నీచట॥ ౪౬.
అవనీపతి విని కావలి లోపల నతని యుంచి రేపకడన్।
వివరంబుగ నే విచారించి మరి విహిత శిక్ష జేసెదటన్॥ ౪౭.
ఇటులం జెప్పుచు రాజు మంచమున యేపున నిద్రితుడాగన్।
పటుతరముగ నా జవానులందరు భక్తుని కావలినిడగన్॥ ౪౮.
ప్రేమనిధియు మరి దలచెను నేడొక పెద్దసేవలోపించెన్।
రామునికొరకై తీర్థమొంచుటకు రాత్రియగుచు నిటుమించెన్॥
నావలె సేవాహీనుడు పృథివిని నయముగనుండడు యనుచు।
భావబంధమున చింతనొందుచును బహుతరముగ క్లేశించు॥ ౫౦.
ఆసమయంబున రామ విభుండును నవనిపతిపై క్రోధమున।
వేసరిల్లకను కాజి రూపమున వెళ్ళెను నృపుకడ గాన॥ ౫౧.
తన్నెను రాజును రోషమున నాతడు ధరణీపతి క్రిందబడు।
తిన్నగ కన్నుల తెఱచి చూడగను దెలిసెను తన కులగురుడు॥ ౫౨.
ఖురాను గ్రంథము చేత నందుకొని గురుతుగ బలికెను నృపుతో।
ఒరే భూపతి నిద్రయుతుడవై యున్మత్తుడవై యుంటివిదొ॥ ౫౩.
దాహము కొరకై తల్లడపడి నే తన్నితినని జెప్పగను।
ఊహతో నరపతి యుదక మిచ్చుచును నొసగ ద్రాగు మనగాను॥
కాజీ జెప్పెను యెవ్వని నేడిటు ఖైదినుండ జేసితివో।
ఓజను నాతడు నీరునిచ్చినను నొగిగొనెదను తగ గనవో॥ ౫౪.
ఇటులం జెప్పుచు నదృశ్యుడగుటచె నిలపతి సూచనగనుచు।
తటుకున విడుదల జేయనాజ్ఞయిడె ధరపతి భక్తునిమనుచు॥ ౫౬.
సొమ్మని జెప్పిరి ప్రేమనిధిని యటు పురికావలి వారలును।
సొమ్మసిల్లగను భక్తుడు వచ్చెను సుఖముగ తన గృహమునకును॥ ౫౭.
శ్రీరఘురాముని చర్య యిదియనియు చింతించుచు తనలోన।
నీరు రామునకు నిచ్చుచునప్పుడు నిద్రితుడై యుదయమున॥

పృథ్వీపతియును ప్రొద్దుబోడవగనే ప్రేమనిధిని గన వచ్చెన్।
అద్వితీయుడగు రాముడుచేసిన యలచర్యల దెలిపెంచెన్॥ ౫౯.
ధనధాన్యంబుల నిచ్చుచు బహుగా దండముబెట్టుచు వెళ్ళెన్।
బెణగిన యాశల మానుకొనుచు నటు ప్రేమ నిధియువిలసిల్లెన్॥
రాముని దలచుచు రామ రూపమున రంజిల్లగ తా గలిసెన్।
ప్రేమభక్తులను బాలకృష్ణుతగ పెంపుజేసి భువి వెలసెన్॥ ౬౧.

---

## భగవాన్ దాసు చరిత్రము.

హస్తినాపురీ బాదుష గ్యాలే రవనికి తగు ప్రభువగును।
స్వస్తిగ భగవాన్దాసను సుభదార్ సరణిని నియమించె మును॥
ఆతడు శ్రీహరి భక్తినిబొందియు యమిత సుగుణుడై యుండెన్।
సాధుల పూజయు సదాచారమును సత్సంగముతో నిగుడెన్॥ ౨.
కుటుంబముండియు నాశారహితుడై గోవిందుని దలచుచును।
చటులతరంబుగ సంస్కృతప్రాకృత సకలవిద్య నిపుణతను॥ 3.
దైవయోగమున నమితధన బును తనకును గలిగుండంగన్।
భావశుద్ధితో పరోపకారమె పదపడి సలిపెను బాగన్॥ ౪.
బృందావనమున విఠలాచార్యుడు పెనుజ్ఞానియు భక్తుండై।
నిందాస్తుతులకు వెఱవక యెప్పుడు నిలిచె విరాగయుతుండై॥ ౫.
అనేకజనులను భక్తిమార్గమును నవలంబింపగ జేసెన్।
పునీతుడగుచును శిష్యులసేవల పొందుపరచి తగ వెలసెన్॥ ౬.
భగవాన్దాసుడు వచ్చి యితనికడ భక్తిని శరణము జేసెన్।
ప్రగల్భముగ తను మన ధనముల గురు పాదంబుల కర్పించెన్॥ ౭.
భావశుద్ధినిం గాంచుచు గురుడును *భవిక రామ మంత్రమును।
సావధానముగ జెప్పగ శిష్యుడు సమాధాన మొందుచును॥ ౮.
నమస్కరించుచు నాచార్యునకును నయముగ మళ్ళెను గృహము।
అమల చిత్తమున హరినిభజించుచు నాతడుండె నచటనుము॥ ౯.

---

*భవిక – శుభము.

ప్రపంచకార్యముల్ జరుపుచు నాతడు భక్తులపూజల సలుపు।
నెపంబులేక నే గురుడెదేవుడని నిత్యముకాలము గడుపు॥ ౧౦.
బృందావనమను గ్రామమునుండియు ప్రీతి నెవరు వచ్చినను।
సందేహింపక గురురూపులె యని సన్మానించును తగను॥ ౧౧.
స్నానముజేసియు నేకాంతంబున సద్గురునిం ధ్యానించు।
మానుగ షోడశ యుపచారంబుల మనసున తా నర్పించు॥ ౧౨.
గురువరు సేవను సార్వకాలముల గుఱినుండగవలె ననుచు।
మరువక యెప్పుడు దలచుచునుండును మహిఁజూచుట యెపుడనుచు॥
గురుడే క్షేత్రము గురుడే దైవము గురుడే తీర్థ స్వార్థమగు।
గురుని వినాగా సాధన వ్యర్థము గుఱితోడను నుండదగు॥ ౧౪.
భగవాన్దాసుని భార్యయెప్పుడును పతిహితయై యుండుచును।
విగత కామియై ధర్మచింతనల వెలసియుండు నెప్పుడును॥ ౧౫.
కొందరికిచ్చును వస్త్రాన్నంబుల కొందరి పెండ్లిని జేయు।
కొందరి యప్పుల దీర్చియువారల కుదురుపరచి తగవెలయు॥ ౧౬.
గురుసన్నిధిలో భగవాన్దాసుని గొప్పచర్య వినబడగన్।
నెఱిముదమున గురుడాతని నెప్పుడు నేజూచెద ననెజోకన్॥
భావార్థము నతడెట్టుల నుంచునో పదపడి చూచెదననుచు।
సేవాకాంక్షుడై చనియెను గ్వాలెరు జిల్లాకును గురుమనుచు॥
భగవాన్దాసుతో కొందరు వెళ్ళుచు బలికిరి సద్గురు రాకన్।
అగణితగుణియగు శిష్యుండప్పుడు నమితానందము గనగన్॥ ౧౯.
ఏమి సేవ నేజేతు గురువునకు నెటుదోచక సతినిగని।
ప్రేమ మీరగను జెప్పుచు నుండగ ప్రియభార్యయు బలికెవిని॥ ౨౦.
తను మన ధనముల పూర్యమునందె ధరనిడితివి గురువునకు।
అనువుగ మనమును వారిచెస్థాపన మైనవార మననుదగు॥ ౨౧.
ఆతనిసొమ్మును నతనికినిచ్చుట నవశ్యమగు నటుపైన।
పాదుగ మరియొక యుత్తరవేళయు పనిబడ కుండెటు లైన॥ ౨౨.

ఇదివిని భర్తయు సంతోషించుచు ఇష్టముతో నుండగను।
పదపడి దీనిందెల్పిరి కొందరు భావికులా గురుకడను॥ ౨౩.
విఠలాచార్యుడు దీనివినుంగొని వేచనె బృందావనము।
కఠిన ముడిగియనే వెతికిన జిక్కడు కలి నీతనివలె సుమ్ము॥ ౨౪.
అతనింటికి నే బోయిన యెడలన్ను నతని గృహము తెల్లగును।
హితపురు షార్థమె బాగని గృమునకేగెను సద్గురుడును॥
ఈసంగతి యా భగవాన్దాసుడు ఏపునదా వినుకొనుచు।
దాసుండగు నను జూడక గురుడును తగదుపోవుట యుననుచు॥
అతియుద్వేగము నొందగనప్పుడు నాతని భార్యయు బలుకు।
గతమోహులమై సంపతి ధనముల గైకొని చన గురు కడకు॥ ౨౭.
మేలగు ననుచును మానిని జెప్పగ మించినప్రేమను నతడు।
కాలోచితమగు సంపతి విభవముల్ కలుగువన్ని తానట్టు॥ ౨౮.
గురువర్పణకై బృందావనమున కును గొని వెళ్ళియు నిచ్చెన్।
తిరముగనచ్చట భార్యతోడ దా గురుసేవనుతగ వెలసెన్॥ ౨౯.
మాన్యతయు తన రాజ్యాధికారము మహి గురుపున కర్పించెన్।
దైన్యతతో హరినామము నుడువుచు తనకాలము గడిపించెన్॥
ఆతని తండ్రియు మాధవ దాసుడు నాగర్యా గ్రామమున।
పాదుగనుండెను విష్ణుభక్తుడై బహువృద్ధత నుండ విన॥ ౩౧.
భగవాన్దాసుడు బృందావనమును పరగ విడిచి తండ్రికడన్।
సగటు కుటుంబము తోవచ్చియు గనె చరమదశను తండ్రికటన్॥
మాటలాడుటకు శక్తి లేకయటు మహితవ్యాధి నుండగను।
సూటిగ నీతడు బృందావనమును జొచ్చినయెడ మేలగును॥ ౩౩.
అనుచు దలంచుచు శిబికెను నిడుకొని యతని పితను గొనిచనగన్।
కనులను దెఱచుచుస్మృతిని చేకొనుచు గాంచుచు పుత్రుని వేగన్॥
ఎచటికి నన్నుంగొని పోయెదవని యెలమినడుగ పుత్రుడును।
సుచరితమగు నీదేహము మధురలో సొరది విడుచుదు ననుచును॥

అచటికి నిన్నుఁ గొని వెళ్ళెదనని యాతని కొమరుడు బలుకఁగ।
ప్రవిశతంబుగ నటు తండ్రియుఁ జెప్పెను బాగుగ పుత్రుఁడు వినఁగ॥
దేహముఁగళే మద్గ్రంథంబుల తెలివిలేని జడమగుచు।
మోహ మమతలును మలమూత్రంబుల మురికి భాండమున్నగుచు॥
ఇట్టిశరీరము మహాక్షేత్రమున నిడుటయు నపరాధంబౌ।
బట్టియుఁ దెచ్చుచు మోక్షసీమను భగీరథి నిడిన విధంబౌ॥ ౩౮.
కావుననీప్రను శిబికెను తిరిగియు గ్రామము జోపం జేయు।
భావశుద్ధితో కాయము విడిచినే భగవంతుని గనవయ్యా॥ ౩౯.
అవినాశుడవై మధురనాథునే నవశ్యముగ జూచెదను।
సవినయముగ నిటు జెప్పగ సుతుడును స్వగ్రామము గొనిచనెను॥
అచట జేరగనె తండ్రియు విడిచెను హరీ యనుచు దేహమును।
స్వచిన్నానములు లేక కొమారుడు కర్మవిధుల దీర్చుచును॥ ౪౧.
మధుర క్షేత్రము భగవాన్దాసుడు మానుగ దా జేరగను।
కుదురుగ నచ్చట భగవద్భక్తులు గూడుకొనుచు నత నెడను॥ ౪౨.
నీదు తండ్రియగు మాధవదాసుని నెఱ బృందావనమునను।
పాదుగ గంటిమి హరిసన్నిధిలో భక్తిసలుపు చుండగను॥ ౪౩.
అందరు వినుకొని యాశ్చర్యంబును నమితంబుగ బొందిరటు।
పొందుగ భగవాన్దాసుం డచ్చట పూర్ణనిష్ఠతో నుండు॥ ౪౪.
సాధుల పూజయు సద్గురుసేవయు సలుపుచుండుచును తాను।
పాదుగభక్తుల పాదధూళియగు బాలకృష్ణు డియ్యలను॥ ౪౫.

---

సనాతను, రూపా చరిత్రము.

బంగాళంబను రాజ్యంబునకును ప్రభువగును సనాతనుడు।
సంగీతము మొదల్ భోగ్యవస్తువుల సారగ్రహణ లేకుండు॥ ౧.
విరక్త చిత్తుడై కృష్ణోపాసన విహితంబుగ జేయుచును।
గురుతర నిష్ఠచె భక్తిసలుపుచును గొలుచుచు హరిపాదమును॥

ఇతనికి తమ్ముడు రూపాయనుచును ఇష్టప్రియుడై యుండెన్।
అతులిత స్నేహంబిరువురు జేతు నయిష్టమేమి లేకుండన్॥ 3.
తమ్ముడు రాధా దేవి పూజలను తనివిని సలుపుచునుండు।
సొమ్మసిల్లగను నతిప్రీతిని దా సూటిగ పూజల నుండు॥ ౪.
శాంతిక్షమలతో కూడుకొనిద్దరు సలుపుచుండి రుపాసనల।
కాంతంబినుమును భ్రమింపు నట్టుల కలయజేసె చిత్తములు॥ ౫.
విషయవాంఛ లెవి లేకను భక్తిని విపులంబుగ జేయుటచె।
*సుషమ యుపాసన మూర్తు లిరువురకు సుప్రసన్న మై వెలసె॥ ౬.
ధనసంపత్తులు విషతుల్యములై ధరవారికి దెలియబడన్।
అనువుగవాటిని యాశమానుకొని యఖిలక్షేత్రముల జూడన్॥
బైలుదేరుచును బృందావనమున బసగొని వారిరువురును।
వీలుగ నచ్చట భగవద్గుణముల వినుచుందురు బహుగాను॥ ౮.
ఉభయుల మనసుల వికల్ప ద్వేషము లొప్పుగనటు లేకుండన్।
నిభమును నెన్నక వేరు వేరుగా నివసించిరి వారునటన్॥ ౯.
జేసింగుండను రాజుయాత్రకై చేరె బృందావనమున।
వాసము సేయుచు కొన్నిదినంబులు వరుసనేగు యత్నమున॥ ౧౦.
యమునానదినిం దాటుటకొఱకై యటు పడవల నేర్పరచన్।
క్రమముగనందరు నెక్కిదాటుటకు కఠినమగుట కనిపించన్॥ ౧౧.
పడవలునదిలో పోలేకుంటచె బహుకష్టము బొందుచును।
తడవెందుకు యని బహువిధముల నృపు తర్కించుచు నడుగగను॥
వారలుచెప్పిరి సనాతనుండను వరిష్ఠభక్తు డొకడుండు।
తీరుగనాతని యడిగిన జెప్పును దేవు ప్రసన్నతనుండు॥ ౧3.
అటులగాని యని పడవులవిడుచుచు నతడు సనాతను కడను।
చటులతరంబుగ వచ్చిదండమును సలుపుచు వినయముతోను॥
నదిని దాట నాతరముగాక యిటు నడచితి నే తమకడను।
కుదురుగ పడవల బోనియ్యక మరి కునష్టియగు టెందుకను॥ ౧౫.

*మిక్కిలి కాంతి.

సనాతనుండును జెప్పెనందులకు సర్వేశ్వరు కృష్ణుండు।
ఘనతయగునటుల గుడి నిర్మాణము కలుగజేసి, యెడనుండు॥ ౧౬.
గోవిందుండగు సుందరమూర్తిన్ని గురుతుగ నందున నునిచి।
నీవంకకు తగ భోగిన సుఖములు నెఱిన్గొం దెదవన, దెలిసి॥ ౧౭.
అటులగానియని గుడిగట్టించియు నతడు కృషు విగ్రహము।
పటుతరముగనే స్థాపనజేసియు పరగనేగె తన్గృహము॥ ౧౮.
సకల నరులనిరి సనాతనుండును సర్వేశ్వరు కృప వడసెఁ।
ప్రకటముగా నటు దేశదేశముల ప్రఖ్యాతియు బహువెలసెఁ॥౧౯.
బాలక్రీడలు రాచలీలలును భాగవతము దెలుపుగతి।
వీలుగ కృష్ణుని వేషముగైకొని వివిధ నటన సలిపిమది॥ ౨౦.
ఉల్లమలరగను సుఖసంతుష్టిని నుండుచు నొకదిన మందు।
మెల్లగ తమ్ముని గృహమున కరిగెను మిగుల ప్రీతినిం బొందు॥౨౧.
అన్నవచ్చెనని రూపాలేచియు నపుడె దండ మిడగాను।
పన్నుగ తమ్ముని యాలింగనమును బాగుగజేయుచు తాను॥ ౨౨.
నీదు స్థితిని నాకెరిగింపుము యని నిగుడియడుగు సనాతనుడు।
పాదుగ తమ్ముడు మనసున దలచెను పరగ నొంటరగుచు నిటు॥
అరణ్యమందును నేమి జేసెదనుయన్నయు భక్షించుటకు।
గురుతుగ క్షీరంబొక్కటె యున్నది కోరియిత్తు ద్రాగుటకు॥ ౨౪.
అనుచు దలంపగ రాధాదేవియు నన్నము పక్వాన్నముల।
చనువుగజేసియు నిమిషము లోపల చక్కగనిడె పాత్రముల॥ ౨౫.
అతిరుచిగలిగియు నమృతసమానమై యమరియుండె యన్నమును।
హితకరుడగుచును సనాతనుండును నిలభక్షణ చేయుచును॥ ౨౬.
తమ్ముని గాంచుచు పలికెనప్పుడును దైవభోగ్య మన్నమును।
సొమ్మసిల్లగను జేసిరియెవరని సూటిగదా నడుగగను॥ ౨౭.
రూపాజెప్పెను రాధాదేవియె రూఢిజేసె వంటయును।
ప్రాపుగ నామెయె కొమరిరూపుతో బాగుగ వడ్డించెనను॥ ౨౮.

సనాతనుడు విని యనుతాపముచే సరిగాఁడిటు జేయుటయు
సునిశ్చితంబుగ శ్రమనిచ్చితివిటు సూటిగ రాధకు మఱియు॥ ౨౯.
ఒకయెడ నామెకు తొందర నిచ్చిన నొగిమరియొక సమయమున।
ప్రకటము గాకను ఫలవ్యర్థంబగు బాగుకాదు జూడుమన॥ ౩౦.
ఆశవంతులును భక్తిని సలిపెద రాసనముఁ బై నుండి।
వాసిగవారల యప్పుల వాంఛని వంచించును హరి నిగుడి॥ ౩౧.
కామికులగుచును నర్చనచేయగ కామ్యంబును గొననెగడు।
స్వామికి నిదియును సరిపడకుండును సాక్షాత్కారం బెపుడు॥ ౩౨.
ఆశాబద్ధులై యోగులు మునులును యవని భవము తిరుగుదురు।
సూచనతోడను యాశను నణికితే సుఖమగు కలిననియంద్రు॥ ౩౩.
కొందరు భక్తిని జేయుచు మోక్షము గోరుచుంద్రు మనసులను।
పొందుగ నిదియును హరికి యనర్హ మా భూవైష్ణవ మొందదను॥
అన్నిటియందును నైరాశ్యముతో హర్నిపై భరముంచుచును।
పన్నుగ జన్మం బుండువరకును బాగయుండ వలయునను॥ ౩౫.
అనుతాపముతో వినుకొని రూపా యన్నకు దండము బెట్టెన్।
ఘన యుపకారము జేసితివీవని గారవమున గొనియాడెన్॥ ౩౬.
సనాతనుండును యాజ్ఞను గైకొని చనియెను తన గృహమునకు।
పునీతుడగు యా రూపా భక్తుడు పొందుగ ధ్యాన గ్రస్తుడగు॥ ౩౭.
తటస్థ ముద్రను తగిలిన మనసున ధారణజేసెను యతడు।
పటుతర స్థితితో రాధాదేవిని భావములో గనుచుండు॥ ౩౮.
అమితప్రేమను గాంచు చుమదిలో నపుడె వీణనందుకొని।
కోమరొప్పగ శ్రీకృష్ణలీలలను కూర్మి బాడె ప్రీతిగొని॥ ౩౯.
కనునీరొలుకగ గద్గదకంఠుడై ఘనమోహము దాల్పగను।
సునిశ్చితంబుగ స్వర్ణఛాయతో సొంపగు గాత్రముతోను॥ ౪౦.
అప్పుడె రాధా ప్రసన్నమగుటయు నాతడు జూచుచు నెదుటన్।
తప్పకదండము బెట్టుచునామెను దయ తప్పుక్షమించుమటన్॥

సంకటమిచ్చితి నన్నుముకొంటకై సనాతనుడు నిటు రాగన్।
శోంకముతో నా యపరాధంబులు భువిననేకములు కలుగన్॥
వాటినంతయును క్షమించి నన్నిక వరుసను బ్రోవుండనుచు।
నూటిగ నంజలి హస్తుండగుచును సుఖమూర్తిని తా గనుచు॥
ఇరువురునచ్చట ప్రీతిని నుండగ, నెలమి సనాతను నింటన్।
హరిపూజను దా జేయుచునుండగ హరి యతనికి పల్కెనటన్॥
ఎటుబోయెనో నా రాధా యొంటరి నేనుండుట కుమరదని।
చటులతరంబుగ నీవువెళ్ళి యిటు సరగజేర్చు యామెనని॥ ౪౫.
జెప్పగ నతడును రూపా కడకును జేరిచూడగను నచటన్।
చొప్పుగ రూపా దేహభావమును నూటిబొందకుండె నటన్॥ ౪౬.
ఉపాయ మెద్దియు దోచక యన్నయు యొగిరూపా దేహములో।
అపారమహిమను తానుదూజెయటు నాతని ద్రిప్పెనువెలిలో॥
తమ్ముండన్నను గాంచుచునప్పుడు దండంబిడుటకు చనగన్।
కమ్మని ప్రేమతో గాఢాలింగన గావించెను యన్న తగన్॥ ౪౭.
అపూర్వరూపును గైకొనుచును నీ వల్ల బ్రహ్మా నందమునన్।
చపలత లేకను ప్రమ్గి యుంటివిటు సత్యంబుగ నేనుగనన్॥ ౪౮.
ఈవిధమున తా బల్కుచు తమ్ముని కేతెంచెను తనగృహము।
భావశుద్ధితో దండముబెట్టెను భగవంతున కాదినము॥ ౫౦.
శ్రీహరి రాధను గూడి యప్పుడే చిద్విలాసమును జేయు।
సాహస కృత్యముల్ భక్తులు సలుపగ చక్కజూచు చుండుటయు॥
ఒకయెడ రాధా హరి వియోగమును యోర్వలేక సనాతనుని।
అకలంకుండగు హరియెటుబోయెనో నతని గనక సహించనని॥ ౫౧.
అతనితో జెప్పగ రాధను గూడియు హరి తలపు నెరుగుచును।
సతతవిరామము రాధాకుండము చక్కవచ్చి రిరువురును॥ ౫౩.
శ్రీహరి యచ్చట విలాసయుక్తుడై చేరియుండ రాధయును।
బాహుళ్యంబగు ప్రేమతో కృష్ణుని బట్టివిడువ కుండెమును॥ ౫౪.

సనాతనుండును రూపయునిద్దరు సలిపిరి భక్తని యిటులన్।
పునీతులగు నీభక్తుల బాలుడు బొందు శరణమియ్యేడలన్॥ ౫౫.

---

## మహాజనుని చరిత్ర.

వణిజుండగుచును గ్వాలేరందున వాసముండె మహాజనుడు।
గుణదోషంబులు నెవ్వియులేకను కుటుంబీకుడై యుండు॥ ౧.
సంపతి మాన్యత బహుగానుండియు సాధుసేవా రతు డగును।
సొంపుగ బైటికి సాధువేషముల జూపి కపటముండినను॥ ౨.
వణిజుడు కించను మనసున బొందక వందనమిడు వారలకు।
గణుతింపక దా దోషగుణంబుల కైంకర్యత నిరతుడగు॥ ౩.
వేషధారులై వైష్ణవచిహ్నముల్ వేసుకొనుండిన నతడు।
శేషశయనునకు దాసవర్గమని సేవలజేయుచు నుండు॥ ౪.
దోషములెవ్వియు వారలకుండిన దురిత పఙ్క్తి చేరవను।
వాసిగ గరుడుడు పాముల దినినను వాసుదేవు కిరవగును॥ ౫.
దాసజనులపై శ్రీహరి యెప్పుడు దయజేయును యనితలచు।
లేశమైన దా కపటమునుంచక లీనతసేవల మించు॥ ౬.
భాగవతుల దా జూచినమాత్రమె పదముబట్టి దండమిడు।
వేగమె చరణ క్షాళనజేసియు వివిధపూజలొ నెగడు॥ ౭.
వారలుగోరెడి రుచియన్నంబుల వరుసతోడ నిడుచుండు।
ఊరులొవారలు యుండువరకు నటు యుపచరింపుచును నెగడు॥
బహుదినంబు లిటు జరుగుచునుండగ పాండురంగ డొకయెడను।
విహరించుచు దా పిచ్చివానివలె వేషమిడియు పుండ్రమును॥
తులసీమాలయు మెడనువేసికొని తోచబడెను వానింటన్।
అలయక వణిజుడు దండంబిడుచును నమితప్రీతి జేసెనటన్॥ ౧౦.
మహాంతు సాధులపూజా క్రమమున మన్నించెను *బాపుళను।
అహంతలేకను యన్నివిధంబుల నారాధించెను తాను॥ ౧౧.

---

*సాధుయొక్క పేరు.

లోకులు బలికిరి మలినగ్రస్తుని లోపల నిడి యనుదినము।
ప్రాకటముగ తగు పూజలజేసును ఫలమిందున లేదనుము॥ ౧౨.
అనుచును జెప్పుచునుండగ నొకయెడ నావణిజు కొమరుపైని।
బెణగున సొమ్ములు బహుగా వేసిరి ప్రీతివిశేషమునుగని॥ ౧౩.
సంధిజూచి యీబావుళ సాధువు సరగబాలు నెత్తుకొని।
పొందుగ నగరము వెలపలబోవుచు భూరినగల దీసికొని॥ ౧౪.
గుడ్డను చుట్టుచు బాలుని చంపియు గుంటనుంచె నగతోడన్।
అడ్డములేకను తొలిదూరంబున నటనొక దిబ్బయునుండన్॥ ౧౫.
ఒకయతీశుడును వాసముజేయుచు నొప్పుగ జూచుచునుండెన్।
సకలజనుల ముందర బావుళ చన, చనుబాలకు డెచటుండెన్॥ ౧౬.
అనుచు నడుగగను తనకుదెలియదని నతడు జెప్ప క్లేశముతో।
పనిబడి యందరు యింటయింట యటు బాగుగవెతికిరి యెంతో॥
తల్లియేడ్చుచును నాక్రందముతో తనయుని కై యుండగను।
సల్లలితంబుగ బాఫుళసాధును సకల నరులు నడుగగను॥ ౧౮.
చంపితి బాలుని యనుచు నాతడన, సాధువటుల జేయడని।
ఇంపుగ జెప్పెను మహాజనుండును యింతలో నృపుడిదియు విని॥
నగరమునందును డంకావేయుచు నలుగడ చాటింపగను।
సుగమంబుగ నాయతీశ్వరుండనె †సొదనిడె బాళుళతగను॥ ౨౦.
బాలునిపూడ్చిన చోటునునాతడు బైలుపరచగను నపుడు।
వీలుగతల్లియు తండ్రివచ్చి గన వెఱ గుంటయు నచటుండు॥ ౨౧.
మట్టిని దీయగ బాలుశరీరము మహిత నగలు దొరకగను।
ఎట్టకేలకు యేమిచేతుమని యేడ్చిరిలోకులతోను॥ ౨౨.
ఆసమయంబున మహాజనుని యెడ నవనీపతి వచ్చుచును।
బాసలాడు నీ యింటనునుండెటి బావుళచంపె శిశువును॥ ౨౩.
మహాజను డనియెను బావుళ విరక్తు మహి నట్టుల జేయడని।
సహజ సత్వమును శాంతిగుణంబులు చక్కనతని కుండునని॥ ౨౪.

---

†చితి.

సాధు మనసునకు ఖేదము కలిగిన సంతత్పుండగు హాయియు।
పాదుగ యిటులం జెప్పుచు నగ్నిని బాలునకిడియిలు చనియు॥
త్రివిధజనంబులు యతిపై నిందను దెలుపుచుండ మహాజనుడు।
అవినయముగనే జేసిన కర్మము నబ్బెననుచు జెపుచుండు॥ ౨౬.
యతివరుపైనను బావుళపైనను యల నిమిత్తమేలయగు।
సతతము కర్మపు నియతిని శ్రీహరి సకలజనుల నడపదగు॥ ౨౭.
అనుతాపంబును బొందవలవదన నటకొందరు గూడుకొని।
ఘననిర్దయచే బావుళ, సొమ్ముకై ఘాతచేసె బాలునని॥ ౨౮.
సుక భక్షణమును సొంపు నిద్రయును సూటిగ నటు దా గొనుచు।
ప్రకటంబుగనా బాలునిచంపెను పాపియు బావుళయనుచు॥ ౨౯.
ఇదివిని బావుళ నిందయు వచ్చెను యికనేనుండ యిచటయని।
విదితపరచగను మహాజనుండును వినతుండై యతనిగని॥ ౩౦.
దయావంతులౌ మీవల్లను నా తనయుడెట్లు చంపబడు।
క్రియాకలాపములేని జనులతో క్రియయేమున్నది జూడు॥ ౩౧.
నాపైదృష్టిని యుంచుచుమీరలు నయసేవల గొనవలయు।
ప్రాపైయుండును బీదజనులకును భాగవతాంఘ్రిని గనియు॥ ౩౨.
విన్నపమొక్కటి యున్నదినాకును విశదపరతు మీకిటను।
పన్నుగమీరలు నంగీకారము పరగజేయ మంచిదను॥ ౩౩.
వివాహమున నాకన్యను నీకును వెలయగనే నిచ్చెదను।
భవాపహంబగు ననుచును నప్పుడె బ్రాహ్మలచే లగ్నమును॥ ౩౪
నియమించుకొని వివాహపత్రముల నిఖిలురకును దా వ్రాసెను।
ప్రియముగ పెండ్లికి సకలపదార్థముల్ పెంపుగ నటు జేయించెను॥
ఇదివిని లోకులు నాశ్చర్యంబును యేపున నటు బొందగను।
యతివరుడనె తనపైని నిమిత్తము నందగంటి వ్యర్థతను॥ ౩౬.
భగవంతుండాను మహాజనుని దా పరిక్షించి తగజూచి।
విగతమోహుడని యాతని గురుకడ వెళ్ళి కలనుసాధించి॥ ౩౭.

నీదుశిష్యుఁడు మహాజను బాలుని నెచ్చట గాల్చెనో నచటన్।
పాడుగ నా సంజీవన నామము భక్తినినుడువుము జూడన్॥ ౩౮.
మృతబాలుండును మళ్ళివచ్చునటు మించుప్రేమయగు చుండు।
హితవాక్యంబుల నిట్లుజెప్పుచును యీశు దదృశ్యుఁడగుచుండు॥
దేవగురుండను నామమువెలసిన ధీరుమహా జనువద్దకును।
భావశుద్ధితో మరుదినమందును బరతెంచెను ప్రియమునను॥ ౪౦.
కలలోఁగాంచిన సంగతియంతయు గారవమున జెప్పంగన్।
తలపున గలుగని భగవత్కారుణయు తానంతనె గనిబాగన్॥ ౪౧.
ఆచార్యుండును చెప్పినవిధమున నందరరిగి శ్మశానమున।
ప్రాచీనంబగు తృష్ణలమానియు భజించె హరిని ప్రియమున॥ ౪౨.
తాళవీణెలను ధరించి యప్పుడు థై థై యని యాడుచును।
చాలప్రేమతో యచ్యుతకృష్ణ సారసాక్ష ముకుందయను॥ ౪౩.
కేశవమాధవ గోవిందాహరి కృపాసింధు ఘననీల।
వాసుదేవ శ్రీనారాయణ హృషీకేశరమ్యు యియ్యెడల॥ ౪౪.
భక్తవత్సలా విశ్వంభరయో పద్మనాభ శ్రీరంగ।
సక్తిగనీవును రమ్ముశీఘ్రమున సారసాక్ష భవభంగ॥ ౪౫.
విశ్వమునిండిన జగద్గురుండవు విష్ణ్వాఖ్యను వెలయుదువు।
నిశ్వసింపు నీ కృపచే బాలుని నెనరుజూపి తగ బ్రోవు॥ ౪౬.
ఇటులంబాడుచు అత్యార్తితోఁ గురు డేర్పడియుండగ నటను।
పటుతర భూషణ యుక్తుడై యచ్చట బాలుడాడు చుండగను॥ ౪౭.
భక్తులు గూడియు జయజయశబ్దముల్ బలికిరటను బహుగాను।
రక్తినియందరు హరిని బాడుచును రంజిలనేగి రిండ్లకును॥ ౪౮.
బావుళ సాధుం డదృశ్యుడయ్యెను భగవంతుండా రూపున్।
సేవనుజేకొని పరిక్షించెనని జెప్పినదంతయు నొప్పన్॥ ౪౯
సర్వజనులుగన మహాజనుండటు సాదుసేవనింపొందె।
నిర్వహించుచును భక్తచరితలను నెతిబాలుం డిరవొందె॥

# త్రిలోచనదాసుచరిత్ర.

శ్రీహరిభక్తుల శిరోమణియునై చెలగె త్రిలోచనదాసు।
మోహమమతలను వదలిన వాడును ముకుంద సేవవిలాసు॥ ౧.
భక్తియుక్తుడై వైరాగ్యముతో భజనచేయు ననుదినము।
రక్తినినందర సమమైత్రిని నటు రాజిల్లగ జూచుసుము॥ ౨.
దయయు శాంతియు సాధుసేవయును దాంతి క్షమలు గలిగుండు।
ప్రియభక్తుల దా పూజల సలుపును ప్రీతి భూతముల నెగడు॥ ౩.
పరిక్షజేయను వైకుంఠుడు తగ బరతెంచెను నొకయెడను।
దరిద్ర మనుజుని వేషము నిడుకొని తాగొంగడి గప్పుకొను॥ ౪.
త్రిలోచనుని కడ జెప్పుచు రారాం దీనత దండమిడుచును।
విలోకించి యాత్రిలోచనుండును వే దగ్గిర బిలుచుచును॥ ౫.
ఎవ్వడవీవిట కేలవచ్చితివి యేమి పేరుజాతియగుగా।
దవ్వులేక యింటు జెప్పుమనంగను దామోదరుడనె బాగుగా॥ ౬.
జాతికులంబులు లేనివాడనే జాతివిజాతం బగును।
మాతాపితృల దెలియకుండుదును మహిలో నెటనుందునను॥
భావము భక్తియు నెచ్చోటుండునొ పరుగిడి వెళ్ళుదునచ్చోటు।
సావధానముగ బిర్తాయ్యయనుచును సకలురు బిలుతురు గనుడు॥
చతుర్దశవిద్యలు ముఖోద్గతంబుగ చక్కనుండు నాయెడను।
పదిలెముతోడను యేపని జెప్పిన పరగజేతు విడువకను॥ ౯.
నాగలిదున్నుట విత్తనముంచుట నాకుందెలుసును బాగా।
వేగముతోడను పంటజేసెదను వెలసి యన్నిఋతులతగా॥ ౧౦.
వంటపాత్రలను తోమి యుతికెదను వస్త్రంబుల స్వచ్ఛముగా।
జంటను కుట్రపుపనుల నెరుంగుదు శాస్త్రములోగెద బహుంగ॥
సంగీతము నే జెప్ప నేర్తునిటు సాహిత్యము నటు గానె।
పొంగారంగను నృత్యముజేతును పురాణములను జెప్పుదునే॥ ౧౨.

ఇచ్ఛవచ్చుకొను వ్యవహారంబును యింపుగ జేతును నేను।
తెచ్చెద దూరపు వర్తమానమును తీవ్రంబుగ నెయ్యెడను॥ ౧౩
మంగలి పని నేనొకనికి జేసిన మన్మథరూపు డగుచుండు।
రంగయుద్ధమున శస్త్రవిద్యలను రమ్యసమర్థత నెగడు॥ ౧౪.
ఇచ్ఛయించు యాపస్తువులిచ్చెద యేన్యూనము లేకుండన్।
సచ్చరితుడవై చెప్పినపనులను చక్కజేతు క్రియతోడన్॥ ౧౫.
అఘటిత చర్యలజేతు నేనుమరి యందు సంశయ మొందకుము।
విఘాత మొక్కటి నాయెడనున్నది వే దెలిపెద నీకుసుము॥ ౧౬.
అపరిమితంబగు నన్న భక్షణము ననుదినమును జేసెదను।
ఎపుడైనను నాకన్నముంచనీ యెలనాగయురోసినను॥ ౧౭.
వెళ్ళిపోయెదను నిజమగుననుచును వేల్పు పెద్ద బలుకగను।
ఉల్లంబలరగ త్రిలోచనుండును యాజ్ఞాత ముద మొందుచును॥
దైవయోగమున నిట్టిపురుషుడును తనకుజిక్కె ననితలచి।
భావశుద్ధితో పనిలోనుంచను భార్యనునటు తా బిలిచి॥ ౧౯.
పరదేశియునై బిల్తియావచ్చెను బహుతర గుణియగు నితడు।
అరుదగు కార్యముల్ తక్షణముండె యరసియు జేయుచునుండు॥
జీతము లేకయ యన్నముకయ్యే చేయుచునుండును పనుల।
ప్రీతినినీవును కడుపునిండుగను బెట్టుమన్న మియ్యెడల॥ ౨౧.
క్షుధాతురునిగా నుండజేయకుము పొరదిజేయు నేపనియున్।
సదాతృప్తిని యతనికినీవును సలుపు మనంగనుసతియున్॥ ౨౨.
అన్నమువండియు బిర్రాయనుచును యతనిబిలువ వచ్చుచును।
పన్నుగనచ్చట విస్తరినన్నము పదార్థములు గాంచుచును॥ ౨౩.
నిజభక్తుల యాప్రీతిని జూచుచు నిండుగ క్షుధ జేకొనుచు।
ప్రచితంబుగ తాకవళకవళముగ భక్షణజేసెను గనుచు॥ ౨౪.
ఎవ్వనిసంగము భవుడుబ్రహ్మయు యెలమియుపేక్షించుదురో।
ఎవ్వనిప్రాప్తికి వజ్రాసనముల నిల యోగులునుండుదురో॥ ౨౫.

అట్టివిభుడు హరి భక్తుని యింటిలో నమరియుండె పనివాడై।
దట్టంబగుతన సౌలభ్యంబును ధరను జూపె వినతుండై॥ ౨౬.
కుండెడన్నమును భక్షణచేయగ కుంఠితయయ్యెను సతియు।
ఖండితముగనది పక్కా సేరును కష్మిరేకపండుటయు॥ ౨౭.
పాయసాన్నమును పిండివంటలును బహుగానటు భక్షించె।
తీయనిభక్ష్యము లుంచగవాటిని తినియుమిగుల మోదించె॥ ౨౮.
అన్నం బింకయు తెమ్మని భర్త్రా యడుగ కాంత లజ్జించె।
పన్నుగ నితనికి యేమి బెట్టుదును భాండము శూన్యత వెలసె॥
ఉట్టిని శర్కర కుండను నుండగ నొప్పుగ దా నుంచగను।
పెట్టిన దానిం భక్షణ జేయుచు భర్త్రాయన్నము దెమ్మనెను॥ ౩౦.
సెనగలు బెల్లము సతియటు బెట్టగ శీఘ్రగతిగ తినుచును।
అనువుగ నన్నము తిరిగియు నడుగగ నాశ్చర్యము గని మదిలోను॥
రాక్షసు డేమో యీతం డనుచును రాగులు కందు లుంచగను।
సాక్షిగ వానిం భక్షణ చేయుచు సరగ నడిగె నుదకమును॥ ౩౨.
ఉదకము నిచ్చుచు కాంతయు జెప్పెను నుచితంబగు మన చేను।
పది నిమిషములో ధాన్యపు పంటను బాగు జేసి దెమ్ముయను॥
అటులనె జేయుచు వచ్చెద నిప్పుడు నన్నము తగ వండుమను।
పటుతరముగతా జెప్పియు భర్త్రా వంట చేయ బోవుచును॥ ౩౪.
త్రిలోచనుని యా క్షేత్రము లోపల త్రివిక్రముడు నిలుచుండగ।
విలోకింపగనె నంకురించుచును విపుల ధాన్య మటుపండగ॥ ౩౫.
త్రివిధ జనులు గని గారడి మాయచె తీర్చె పంట నీతండు।
వివరము తెలియదు యనుచును జెప్పుచు విస్మితులై తగనెగడు॥
కోత గోయుచును ధాన్యము భర్త్రా గుత్తితో నిలు దెచ్చుచును।
మాతరో యాకలి మించి యయ్యెనిటు మహాన్నము బెట్టుమను॥
ఇంతకుముందే మణువుధాన్యమును నింటిల్లాలును వండె।
పంతము తోడను నాతనిగాంచుచు భక్షణజేయుమను చుండె॥

మఱుపు యన్నముచు బిత్రాన్యకొఱకై మానిని వడ్డించంగ।
అనువుగనాతడు భక్షించుచు మరి యరసితృప్తి బొందంగ॥ ౩౯.
నేటిదినంబున భక్షణమధురమై నిండె కడుపు యని నవ్వ।
పాటవముగ నీ సమానస్త్రీ నే పదపడి చూడను సువ్వ॥ ౪౦.
త్రిలోచనుడు యాపైరు సంగతిని తెలియుచు విస్మితుడయ్యె।
సలీనయగు నాసతియు బిత్ర్యకును సర్వద వంటను చేయగ॥ ౪౧.
బూనుకొనుచు తానాకలి దప్పిని పొందక సేవల నుండు।
మానుగ బిత్ర్యా సమాన మనుజుని మహినిగాన ననుచుండు॥ ౪౨.
భక్షణజేసిన వెనకను సతియును పదపడి బిత్ర్యకు గనుచు।
తక్షణమున కూలిన తన యింటికి తగుమరమ్మతు చేయుమను॥ ౪౩.
అవశ్యమనుచును నడవికి వెళ్ళుచు నల కట్టెల దెచ్చుచును।
వివరంబగునటు యింటిని గట్టెను విగతసహాయము గాను॥ ౪౪.
ఆసతి జెప్పెను నడవికిపోవుము యావుమేత లెమ్మిటను।
వేసరిల్లకను నశ్వము కడుగుచు వేకట్టుము శాలలోను॥ ౪౫.
అడవుల వృషభముల్ మేతను మేయును యరసివాని తెమ్మయిటగ।
తడవులేక యీ పనులజేసినను తగనుంచెద నన్నమటగ॥ ౪౬.
ఇటులంజెప్పుచు సతి దన మనసున నీపనులను చేయుటకు।
ఎటులైనను బహువిరామ మగునని యెరిగిమెల్ల వండుటకు॥ ౪౭.
ఆరంభించెను యింతలొబిత్ర్యా యడవికి నేగుచు నపుడె।
సారంబైతగు గడ్డిమేతయును సరివృషభంబుల నాడె॥ ౪౮.
దెచ్చియు నశ్వము గడిగియు శాలలొ తిరముగ తా గట్టుచును।
వచ్చియు తల్లీ యాకలియైనది వరుసనన్న ముంచుమను॥ ౪౯.
ఇదివిని యాసతి యేమిజేతును నిదుగొ దెచ్చితి ననుచును।
పనిలెము లేకతా గడ ఖడ చేతను పక్వపరచె రొట్టెలను॥ ౫౦.
విస్తరయందును వడ్డన జేసియు వేరమ్మనె బిత్రాన్యాను।
స్వస్థము తోడను భక్షణ జేయుచు చక్క బిత్రాన్యా యుండుమను॥

శ్రీ

శ్రీమతేరామానుజాయనమః.

భగవన్నిర్హేతుక కటాక్షముచే ప్రాప్యభూమినిపొందిన

భక్తశిరోమణుల చరితలనుదెలుపు

# భక్తమాల.

ఇది

మహారాష్ట్ర భాషయందు మహీపతిబావాయను

భక్తశ్రేష్ఠునివలన రచింపబడిన

భక్తవిజయము, సంతవిజయము, భక్తలీలామృతము, సంత

లీలామృతమును గ్రంథములను క్రోడీకరించి,

వె. బాలకృష్ణమొదల్యారిచే

తెనుగున

తోహారా కవితలగా రచింపబడిన పదిసంచికలలో నిది

తొమ్మిదవ సంచిక.

చెన్నపురి, మవుంటురోడ్,

"కమ్మర్షియల్ ముద్రాక్షరశాలయందు"

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

౧౯౦౦వ సంవత్సరం డిసంబరు నెల.

శ్రీమన్ విచిత్ర శతావధాని, విద్వన్మణీ మహాభాగవత సలక్షణ
కృష్ణ యజుర్వేద ఘనపాఠి, హరిదాస బాళేగడ్డెకట్టె,
శ్రీమాన్ లక్ష్మణాచార్య కృత కృతిప్రశంస.

---

శ్లో॥ గ్రథితేయం బాలకృష్ణదాసేన లలితైః పదైః।
భక్తమాలా విష్ణుభక్త చిత్రచారిత్రబోధినీ। ౧॥
మహాకవి కృత గ్రంథప్రౌఢిమానం శ్రయత్యహో।
ఇతి శ్రీభగవద్గీతా లక్ష్మణార్యోఽనుమన్యతే॥ ౨॥

అన్నంబింకయు దెచ్చిపెట్టు మిటు యాకలి పోలేదనగన్।
చెన్నుమీర నాసతియును బల్కెను చేసి రమ్మొక పనినితగన్॥
అన్నముబెట్టెద నవతల నీకును ననుచు జెపుచు లజ్జితయై।
పన్నుగ దూరపు దేశమునందును బంధువులుందురు సరియై॥ ౫౩.
వారలక్షేమము విచారించుకొని వచ్చిజెప్పుమని యడుగన్।
మారుబలుకకను పేరూరడుగక మహినాయూరున కరుగన్॥ ౫౪.
గడెయసేపులో నచ్చటి పత్రముల్ గైకొని దెచ్చియు నిడెను।
పటుతరముగ నాయూరొకమాసపు ప్రయాణ మితరులకగును॥
ఇంతలోనచ్చటి కుశలసంగతిని యెట్లుదెచ్చె నితడనుచు।
వింతనొందుచును సతియటనుండగ వే యన్నంబిడు మనుచు॥ ౫౬.
సేవకుడడుగ చింతాక్రాంతయై చేతునేమని విసుకుచును।
కావలసినయా పదార్థమంతయు గైకొని వడ్డింపగను॥ ౫౭.
ఇంతలోనామెకు స్నేహితరాలటు యేగియడిగె తడవునను।
వింతనొందితిని బహుదినములునిను వెలివచ్చుటగాననను॥ ౫౮.
చూడవచ్చితిని చిక్కియున్నదిటు సుఖమైయుండిన మేను।
గూడియుంటివిటు మలినవస్త్రముల కొఱత నీకు యెంమకను॥ ౫౯.
స్నానముజేయుచు తలను దువ్వుటయు సలుపకుంటి వెందుకని।
మానసమందున యేమిచింతనో మగువ జెప్పుమనగవిని॥ ౬౦.
ఇంట్లోలును బలికె నామెతో యేమిజేతు నాపతియు।
ఒంటరినగుచును సాధులసేవల నుచితంబుగ సేయుటయు॥ ౬౧.
వల్లగాక తా సేవకునొక్కని వాసిగనుంచెను యిటను।
ప్రల్లదముగ నామనుజుడు జేసెడి పనులును నఘటితమగును॥ ౬౨.
పొట్టకూటికే పనులజేయుటకు పొందుబడెను నాయింటన్।
దిట్టతరంబుగ నత్యాహారము దినము నియ్యతగిలుండన్॥ ౬౩.
పిండివిసురుటయు వంటవండుటయు పెంపయ్యెను బహుగాను।
ఖండితముగ శతమనుజుల భక్షణ కడిమిని సలుపునుయతను॥ ౬౪.

ఇట్టిభక్షణము మనుజులలోపల యెవరు చేయజూడనను।
దిట్టము నే దిగులొందెద బిర్త్యా తినుటకు కూర్చుండినను॥ ౧౫.
పగలును రేయిని కష్టబడుటచే బట్టకుండు నిద్రయును।
సొగసగు దేహము చిక్కిపోయెసుమి సుఖమేమియు లేకయును॥
సేవకునకు నే దురుక్తులను నిటు జెప్పిన నత డరుగుసుము।
సేవపూర్ణుడగు పతికి దెలిసినను చెందును కోపము గనుము॥ ౧౬.
ఆతండింటికి వచ్చిన మొదలుగ నన్నపానముల నెరుగక।
ప్రాతఃకాలము ముఖము కడుగుటకు పరగవీలు లేకంగక॥ ౧౭.
తలంటుకొనుటయు తలదువ్వుట నా తరమెట్లగునో చూడు।
కళంకంబుగల వార్తల బితాబ్యా కవాటమున వినుచుండు॥ ౧౮.
త్రిలోచనుని సతి కష్టము నొందుచు దీనత్వము నొందెనని।
విలాసచేష్టల గుప్తుండయ్యెను వేగమె హరి తానుగని॥ ౨౦.
కొంత సేపులో త్రిలోచననుండును కూర్మి బిలిచె సేవకును।
వింతగ నచ్చట కనబడ కుండగ విహిత భార్య వెదకుచును॥ ౨౧.
ఇప్పుడు నిచటనె నుండెను నాతడు యెటుబోయెనో తెలియదను।
ఒప్పుగ నెచటం జూచియి గానక నోర్వం జాలక నతను॥ ౨౨.
సేవకు చర్యల చింతింపంగను శేషశయను డని తెలిసెక।
దైవీమాయయు కమ్మెను తనకని తనివిని రోదన జేసెక॥ ౨౩,
భార్యను గాంచుచు దురుక్తు లెవియో బలుకుట చేతను యతడు।
కార్య కరంబుగ వెళ్ళెను ననుటయు కాంతయు జెప్పుచు నెగడు॥
స్నేహితురాలును నేను మాటలను జెపుకొను చుంటిమి యిటను।
మోహముతో నామాటల వినుచును మురారియేగిన యట్లగును॥
ఇటులం జెప్పుచు నత్యాదరమున నేడ్చుచు సతి బిలుచునుము।
పటుతరముగ యో బితాబ్యారమ్మిటు బాగుగ నన్నము తినుము
ఎంతబిలిచినను రాకయుండగను యెలమి భర్త బలికె నటు।
నిందిత పలుకుల నపరాధంబును నెటివచ్చెను నీకుయిటు॥

అనుచు జెప్పుచును భూమినిబడుచును హా కృష్ణా హరియనుచు।
చనువున నీవును రాకపోయినను చంపుకొనెద నే ననుచు॥ ౭౮.
అనంతశయనుడ, సేవకరూపున నమితసేవ జేసితివి।
అనంగతండ్రి. నీయబ్జపదంబుల యటు బట్టజేయనైతివి॥ ౭౯.
ప్రసన్నమిప్పుడు గాకుండిననా ప్రాణము విడుననగాను।
కుశలంబుగ హరి రామరూపమును కూర్మిజూపె నటు గాను॥ ౮౦.
అనేకవిధముల నుతులజేసియు నప్పుడడిగె భక్తుండు।
పునీతుడగు నిను బితార్యా యనుచును పొసగబిలిచి యెవడుండు॥
ఇందుకు శ్రీహరి బలికెనాతనికి యెలమిరూపు నామమును।
పొందుగ నే తగ గైకొనుచుందును పునీతభక్తుల కొఱకును॥ ౮౨.
భక్తులకొఱకై లీలజేతునని భగవంతుడు చనె యటను।
రక్తిగనీకథ బాలకృష్ణుడును రచియించెను తెనుగునను॥ ౮౩.

---

## అవంతి - తులసీదాసు చరిత్ర.

*అవంతీనగరున తులసీదాసుం డవనిని సత్పురుషుండు।
ప్రవంద్యుడగుచును యేకాంతంబున భగవద్భజనను నిగుడు॥ ౧.
అయాచితంబుగ నెవరేమిచ్చిన నందున బ్రతుకుచునుండు।
క్రియాశూన్యుడై యమంగళునివలె క్రీడించుచు మెలగునటు॥ ౨.
జాతినీతులను జూడకతా నటు సంచారంబున నెగడు।
పాదుగతనకును దేహమున్నదో లేదో యనినట్లుండు॥ ౩.
మంత్రోపాసన చలనమయ్యెనని మహీజనులు ననుచుండఱ।
తంత్రావళులను జేసి గాత్రమును తపింపించెనని జూడఱ॥ ౪.
పిశాచవృత్తిని జనులకుజూపుచు ప్రియతముడై హరిదలచు।
ప్రశాంతచిత్తుడై సర్వము హరియని భావమందు తానుంచు॥ ౫.
ఉజ్జనిపట్టణమందున వణిజుం డొకడు వాసమైయుండు।
వజ్జను సతీసుత సంపదలును నట బహుమాన్యత గలిగుండు॥

*ఉజ్జయనీ యను నగరమునకు మారుపేరు.

సుందరమగునొక కన్య యతనికిని సాటిగ గలిగిన తీరు।
అందరుజూచుచు లావణ్యముగని యాశ్చర్యము నొందుదురు॥ ౭.
ఇట్టిరూపమును నెచట గానమని నెలమినందర రనుచుండఁగ।
బెట్టిదముగ నాబాల దినదినము పెద్దబెరుగుచును నుండఁగ॥ ౮.
వణిజుని గనియనె నొకయెడ భార్యయు వరుని జూడు కన్యకును।
గుణశీలుండును సౌందర్యముగల కొమరునితగ వెదకుమను॥ ౯.
వినుకొని యాతడు కొమార్తె రూపును వేయించెను పఠమునను।
అనువుగ నిష్టులమిత్రుల బిలుచుచు నతడు పఠము నిచ్చుచును॥
కుమార్తె రూపునకు తగుకొమరుని కుదురు పరచి రమ్మనుచు।
ప్రమాణముగ నే విశ్వసింతునని బండియు ధనములనిచ్చు॥ ౧౧.
వారలువెళ్ళిరి దేశదేశముల వరువిచారణ జేయుటకు।
కోరివెదకినను నెచటంజిక్కక కొమరుడు సరి పఠమునకు॥ ౧౨.
ఆరుమాసములు వెదకుచు పిమ్మట నరిగిరి బురానపూరు।
తీరుగనచ్చట వణిజులకుస మరి దెలిపిరి సంగతి వారు॥ ౧౩.
పఠమును జూపుచు కన్యసమానము భర్తయుగావలె ననగఁ।
కఠినమనకయొక వర్తకు ధనికుడు గనుచును పఠమును బాగఁ॥
తనమ కొమరునకు తగిన పిల్లయని దలచుచు తనలో నపుడు।
వినతుడై బంధుల యిష్టమిత్రులను వేగబిలిచి మాటాడు॥ ౧౫.
కొమరుండొక్కడు కన్యకయొక్కతె కోర్కెలలర తనకుండఁగ।
సుమహితయగు నాయవంతి కన్యయు కొమరునకును తగియుండఁగ॥
ఐనను కొమరునకేకనేత్రమై యమరి యునుండుట చేత।
మానముగకన్యను యడిగిపుచ్చుకొన మహి యుపాయమెటు లొగద॥
అం దుకువారలు సీకొమార్తెకును నవని పురుష వేషమును।
పొందు. గ వేసియు కన్యనడిగినను భువినిత్తురు వారలును॥ ౧౮.
వివాహ సమ. యము నందున మనమును విహిత పుత్రు నుంచుచును।
నవీన వింతల జేం చుచు గడబడ నయ కన్యను గొందుమను॥ ౧౯.

అట్టియోచనను జేయుచు వారలు యవంతి పురవాసులతో।
బెట్టిదముగ మావణిజపుత్రుడును ప్రియవరుడగు చూడండో॥ ౨౦.
ఇందుకువారలు వణిజపుత్రుని యేర్పడ జూపుం డనగన్।
పంతముతో తమ కన్యకువేషము పరగవేసి పురుషుని గాన్॥ ౨౧.
వేషధారినిం జూపగవారలు విశ్వసించి నరుడనియు।
ఈశుని కృపచే యిట్టికుమారుని యేసతి గనె నోయనియు॥ ౨౨.
రూపగుణంబులు చక్కనుండగను రూఢిపరచి పెండ్లియని।
ప్రాపుగ కన్యానిశ్చయమునకును పంచిరి టెంకాయలని॥ ౨౩.
పతమును దెచ్చినవార లవంతికి పరగనరిగి వణిజునెడన్।
వితలుని కృపచే వరుడు చిక్కెనని విశేషమోదము తోడన్॥ ౨౪.
సులక్షణంబగు వణిజుని పుత్రుడు సుఖసంపద గలిగుండు।
విలక్షణంబును జూచి లగ్నమును విధినుంచుచు నటనుండు॥ ౨౫.
బంధులకెల్లను తాంబూలంబుల బంచియునిటు వచ్చితిమి।
సందియ మొందక విని తలిదండ్రులు సంతసిల్లి రొచ్చిసుమి॥ ౨౬.
సాహిత్యంబును విశేషమగు నటు సమకూర్చెను వణిజుడును।
బాహుళ్యంబుగ కనకవస్త్రములు బహుతరముగ జేసెమును॥ ౨౭.
వరునితండ్రికిని మనసునచింతయు వర్ధిలుచుండెను బహుగాన్।
అక్షుదగు లగ్నపు కాలమునందున యనర్థమగునో యనగన్॥ ౨౮.
అతనింజేరిన మూర్ఖులందరును నాసమయము జాతమని।
హితవును జెప్పగ పెండ్లికినాతడు నెల్లపదార్థముల గొని॥ ౨౯.
ఏనుగు గుఱ్ఱముల్ శిబిక రథంబులు నెలమి బండ్లుబహుగాను।
తానటు గైకొని యనేకజనులతో తనయుపెండ్లి కరిగెమును॥ ౩౦.
అవంతినగరపు సమీపమందును నాతడు తగ రాగాను।
భవతు శుభంబని కన్యక తండ్రియు బైలుదేరె నెదురుగను॥ ౩౧.
అనేకవిధముల వాద్యఘోషములు నపరిమితము చెలగగను।
ధనాధిపతులా యిరుపురు గూడియు దండములను బెట్టుచును॥ ౩౨.

సకలురు జూచిరి పెండ్లికొడుకు నటు సంతోషంబును బొందఁగ।
ప్రకటంబుగ యాపెండ్లికూతురును భాగ్యవతిగ యిరవొందఁగ॥ ౩౩.
కన్యరూపునకు తగినకొమరుడగు కనుదృష్టియు నగునుయని।
అన్యులుజెప్పిరి విశేషమిదియని యవంతిపురి చేరగని॥ ౩౪.
ముహూర్తదినమున దేవప్రతిష్ఠయు ముదమున నిడి నలుగులును।
బహుళంబుగ నటు బ్రాహ్మణజనులకు భక్షణజేయించుచును॥ ౩౫.
సాయంకాలము మంటపమందున చక్కగదెచ్చిరి వరుని।
చేయంబూనిరి పుణ్యాహవచనము చిరవాద్యముల్ మ్రోయగని॥
ఈసమయంబున వరుని మనుజులును నేకాత్ముని నిల్పుటకు
వాసిగబహువిధ యుపాయంబులను వంచనతో జేయుటకు ౩౬
ఎన్నికగానట నుండగ, వారల యే యత్నము బడకుండఁగ
పన్నుగనచ్చట కన్యబంధువుల బలుజాగ్రత గలిగుండఁగ॥ ౩౭
జనులనేకులును వచ్చుచు నచ్చట సభగాగూడిరి వెలుచఁగ।
ఘనమగు వాద్యముల్ మెలగుచునుండగ కన్యబదలుకొడుకుంచఁగ॥
వీలుగాక యా వరు తలిదండ్రులు విపులచింత నొందుచును।
మేలుగాని యామూర్ఖులమాటలు మిగుల కీడుదెచ్చెనను॥ ౪౦.
ముహూర్తవేళను బొట్టును గట్టెను ముద్దియ ముద్దియ కపుడు।
విహితంబుగనటు మూడుదినంబులు విపులోత్సవములు నెగడు॥
చతుర్థదినమున వధూవరులకును స్నానమొనర్పం దలచి।
కుదురుగ కన్యా బంధువులందరు గూడి పిలువ వరుగూర్చి॥ ౪౨.
వరునిబంధువుల్ వరునకు జ్వరమని వలదనిరి స్నానమునకు।
అరయుచువారలు బలాత్కారముగ వరు నీరాడించుటకు॥ ౪౩.
బిలుచుకొనుచుపోవగ, వరుబంధువుల్ భీతిని బహుబొందుచును।
నిలువకుండగను వెళ్ళిపోయి రటు కలవస్తువుల్ విడుచుచును॥
బ్రతికిన చాలును యనుచువారలును పరుగిడి తగ వెళ్ళగను।
విదితమయ్యె నావరుడు కొమిరెయని వెలి స్నానముజేయగను॥

కన్యతల్లి యిది జూచుచుబహుగా కలతల జెందుచు యేడ్వఁగ।
అమ్మలుకొందరు వెళ్ళి తండ్రికిని నపుడుజెప్ప తావచ్చెఁగ॥ ౪౬.
క్రోధముబొందెను వరుని జూడగను కుటిలులనుచు చంపుడను।
వేధనుబురాన పూరుజనులను వేగచంప దలచగను॥ ౪౭.
వారుదిగిన విడిదింటిలోపలను వారణరథముంచపంగఁగ।
తీరుగనొకరును లేకయుండిరటు తిరిగిపోయిరని యలుకఁగ॥ ౪౮.
వరుని వేషమును వేసినబాలను వరుసగొట్టి రందరును।
దురుత్తరంబుల బహుగాజెప్పిరి ధూర్తులగుచు బాలికెను॥ ౪౯.
వేడుకయగునటు జేసిబాలికెను వీధిద్రిప్పి ఖరము పయిఁగ।
తాడన సేయుండని సేవకులకు తాజెప్పగ నటు పయ్యెఁగ॥ ౫౦.
సేవకులందరు గూడి ఖరముపై జేర్చిరిబాలికె నపుడు।
పోవుచువచ్చుచు నుండెడు జనములు భువివెంటను గొట్టిరటు॥
అట్టహాసమున బాలికే యేడ్చుచు హరియునాపై కోపించెఁగ।
పట్టులేదు నాకెవ్వరు నిచ్చట పాండురంగ యనిబిలిచెఁగ॥ ౫౨.
వేషమువేసిన దుర్బుద్ధులు తగ వెళ్ళిరియటు వెనకానె।
గము నాకును దుఃఖము తెలియక లేకుండితి గృహముననె॥౫౩.
మాతాపితృలు తప్ప నాకుతగు మహిపోషణ లేకుండఁగ।
ఈ తీరుగ నను సంకటపరచియు నెలమి నరిగిరటు జూడఁగ॥ ౫౪.
సంకటమందును రమానాథుడే చక్కటి బంధువు డనుచు।
వెంకటరఘునా ధశరథ రామా వేగమెరా నను గనుచు॥ ౫౫.
దీనజనులకును బంధువుడనుచును దెల్పిరి పెద్దలు నాకు।
మానుగ నేనతి దీనతనైతిని మన్నింపందగు బాగు॥ ౫౬.
అనాథనాథుడ వనుచును దెల్పిరి యఖిల సాధువులు నిన్ను।
నార్ద నాహ్వాయ కాలము నాకును సన్నిహితం బయ్యెనను॥ ౫౭.
కుక్కలేకనీ దిక్కేజేరతి తీర్చుమాపదను యనుచు।
మక్కువ తోడను నిటులంజెప్పగ మహీజనులు తగ గనుచు॥ ౫౮.

సుకుమారంబగు చిన్నది యీపెకు సుఖములికను తొలగెగదా।
ప్రకటంబుగ నిది విచిత్ర గతియని పలుకుచునుండిరి తముదా॥౫౯.
ఆసమయంబున తులసీ దాసుడు నచటనుండ, బాలికయు।
గానిపడుచు హరి దాసుండనియును గాడిదె నుండియుదిగియు॥
ఆతనికడ నరిగి దండముబెట్టగ నలసంగతి దెలియకను।
సతతము నీకును విపత్తిలేకను సంసారిగ నుండుమను॥ ౬౧.
అప్పుడుబాలికె తనదు సంగతిని యాతనికిని జెప్పగను।
తప్పక నాతం డనుతాపముతో దాశరథిని దలచుచును॥ ౬౨.
పతితపావన విశ్వంభరుడా భక్తభూషణ గోవింద।
సతతము నీవును యనాథ దీనుల సంరక్షింత్వు ముకుంద॥ ౬౩.
చరాచరంబుల నీవెజేసితివి జగతిస్త్రీపురుషులను।
సరాళముగ యీస్త్రీ నరుడనునుడి చక్కజేయు మియ్యెడను॥
అసత్యమగునటు భక్తవచనముల నవనిని జేయకు మనగన్।
పొసగగ బాలికె పురుషుం డగుచును పొందుగచూడం బడగన్॥
ఇదిగని తులసీ దాసుడునాతని యెలమివెనక నుంచుకొనెన్।
ఎదురుగ నుండెడి సేవకులాతని యీడ్వదొడగ దాసుడనెన్॥౬౬.
బాలికె గాకను పురుషుడైనయెడ బట్టవలవదనగాను।
వీలుగ వారలు నప్పుడె వస్త్రము విప్పగ పురుషుని గాను॥ ౬౭.
ఉండజూడగని వెళ్ళివణిజుకడ నుచిత సంగతిని జెప్పన్।
దండివింతతో భార్యాభర్తలు తామెవచ్చి గనియొప్పన్॥ ౬౮.
పురుష చిహ్నములు పూర్తిగనుండగ పుణ్యాశీల కూతురని।
తురగ రథంబులు యేనుగ బలమును తోడదెచ్చి కొమరుగొని॥
అలంకారముల జేయగ వరుడును తులసీకిని దండమిడా।
సలలితముగ నూరేగింపంగను చనెవణిజుని పుత్రుండు॥ ౭౦.
పరుగిడివెళ్ళిన బంధువర్గముల పరగబిలిచి తగ మరియు।
కరమరుదుగ నటుపెండ్లి సంభ్రమను గావింపంగను గనియు॥

తులసీదాసుని దీవెనచొప్పున దురుసుగ వరుడుండె నటఁ।
అలయగ తులసీదాసుని మహిమయు నటు ప్రసిద్ధియగు చుండఁ॥
మహీజనంబులు నీశ్వరాంశమని మానుగ ననుచుండిరటు।
సహాయమయ్యెను బాలకృష్ణునకు సలపుట కీ గ్రంథమిటు॥ ౭౩.

కా నో పా టు చ రి త్ర ము.

కానోపాటను బ్రాహ్మణుడుండెను గ్రామముకేం దూరునను।
దీనోద్ధరుడగు శ్రీహరిభజనను తీరముగ జేయును నతను॥ ౧.
అయాచితంబుగ నేది దొరికినను నతిసంతుష్టిని బొందు।
దయాశాంతితో సర్వము హరియని తలపుతోడ ముదమొందు॥
పతివ్రతరాలై సుశీలయగుచును భార్యయుండె నాతనికి।
సతతము తనపతి మనోగతంబుల చక్కజేయు తగ మరిగి॥ ౩.
దంపతు లిద్దరు యేకమనస్కులై ధరజేతురు హరిభజన।
సంపతి ధనముల కోఱకయెప్పుడు సద్భావము గీలుకొన॥ ౪.
శ్రవణముచే తగు భగవత్కీర్తిని చక్కగ వారలు వినుచు।
భవహరమగు శ్రీవిష్ణు యర్చనను భక్తిని జేయుచునుంచు॥ ౫.
సుఖమాదును శ్రీహరినామంబును ముఖ్యమనుచు జేయుచును।
సుఖకరమగు నీపనులను జేయుచు సూటిగ వారుండగను॥ ౬.
అచ్చటనుండియు మరియొక బ్రాహ్మణు డరిగెను కాశీపురిని।
సచ్చరితుండై గంగాస్నానము సలిపియు నటు చూడగని॥ ౭.
పురాణమొకయెడ జరుగుచుండగను బాసగ జనులు వినుచుండఁ।
సరాళముగ యీకేందురద్విజుడును చనియెను దానచ్చోటఁ॥
ఇతిహాసములకు నర్థముజెప్పగ నిలభక్తుల మహిమయును।
కుదురుగ వక్తయు జెప్పుచునుండగ కొందరు శ్రోతలు వినుచును॥
ఈకాలంబున యట్టిపురుషులెట నెలమిలేదు లోకమున।
ఆకాలంబున నుండిరేనియు నరుదగునుమి భువిలోన॥ ౧౦.

ఇదివిని కేందుర ద్విజుడనె మాపురి నిట్టిపురుషు డుండునను।
సదయుడై శ్రీహరిభజనను సలుపును సకలసుగుణములతోను॥
ఆతనినామము కానోపాటని యవని జెప్పుచుందు రటఁగా।
నీతిని గంగాధరుని పద్ధతిని నెఱి ప్రవర్తకుం డగుటఁగా॥ ౧౨.
ఇదివిని వారలు శంకరమూర్తిని యిలమనుజుల కుపమగను।
కుదురు పరచుటకు శక్యంబగునే గొప్ప యన్నృత మిదియగును॥౧౩.
అనుచు జెప్పగను ద్విజుడును బల్కెను యరసిగాన వచ్చుననఁగా।
కనుగొనుటకు నై పండితుడొకఁడా కాశివిడిచి యటు పైనఁగా॥౧౪.
మెల్లగనిత్యము దారినడచుచును మేలగిచేరె కేందురును।
సల్లలితంబుగ దలచెను తనలో సంసారము గడుపుచును॥ ౧౫.
విరక్తి నొందుట యెట్లగుచుండును విష్ణుభజనచే హరియు।
తెరువున సాధ్యతయెట్లగునో యని తిరుగుచు వీధులమరియు॥
కానోపాటుని గృహముచేరగను గారాబముతో నతడు।
బూనుకొనుచు తన శిశువును చేతిలో భువి చుంబన మిచుచుండు॥
ఇదిగని విప్రుడు వికల్పబుద్ధిని యెంచుకొనుచు తనలోను।
పదపడినాతని గని కానోపాటు బాపడవీవెన యనను॥ ౧౮.
ఔనని యీతడు జెప్పి దండమును నతనికి తగ బెట్టుచును।
దీనునిపై కృపనుంచి నీవెవరో దెలియబలుకు నాకిటను॥ ౧౯.
ఎచటి బ్రాహ్మణుడ వేలవచ్చితివి యెటుబోయెదవనగాను।
వచించె విప్రుడు కాశినుండి నే వచ్చితి నిటు నిను గనను॥ ౨౦.
విరక్తచిత్తుడవని నీ ఖ్యాతిని వింటిని నే నటు బహుగాఁగా।
సరగున నే నిటు నడచివచ్చితిని చలమున కష్టముగలుగఁగా॥ ౨౧.
వచ్చిన వెనకను నీదుస్థితినిగన వంచింపం బడితినటు।
హెచ్చియు పుత్రులపైని మోహమున యెలమి మాయనుంటివిటు॥
దారాపుత్రులు గృహము ధనంబులు తగులక వర్తించునరు।
గారాబముతో విరక్తుడనుచును ఘనులందురు పలుమారు॥ ౨౩.

ఇచ్చటనుండియు యాత్రకువచ్చిన యెలమి బ్రాహ్మణుండొకడు।
హెచ్చుగ స్తవనము నిన్ను జేసెనటు యెరుగుట కొఱకై నేడు॥
నీదుదర్శనము విశ్వాశించి తగ నే వచ్చితి నిందాక౯।
పాదుగ నదియును వ్యర్థమైయ్యెనని బహువిచారమును గొనగ౯॥
కల్పకవృక్షంబున్నది యనుకొని కలిమిఛాయ నరిగితిని।
అల్పమదియు నొక తుమ్మచెట్టు గానగపడెనని చెప్పవిని॥ ౨౬.
కానోపాటుడు మధురోత్తరముగ కరముల ముకుళింపుచును।
మానుగమీరలు దూరదేశమును మహినడచియు నిచ్చటను॥
ఏమియవగుణము నాయెడగంటిరి యెరుగంబలికిన యెడల౯।
నేమముతోడను వానివిడిచినే నేర్చెద మీ సుగుణముల౯॥ ౨౭.
ఉదాసవృత్తిని మీరుబొందుటయు నుచితమునిటుగా దనుచు।
నిదానముగ తా నాతనిపదముల నెనరున బట్టెను గనుచు॥ ౨౮.
పరమశాంతితో నిటులంజేయగ బ్రాహ్మణు డతనింగనియు।
ఇరవున బాలికె చీమిడితుడిచియు నిలచుంబన మిచ్చుటయు॥ ౩౦.
సాధుల వృత్తికి సరియుండదు యిటు సకలము విడకుండినను।
వేధించునుయా మాయాజాలము విడవలె నిదియనగాను॥ ౩౧.
కానోపాటుం డిదివిని బాలిక౯ కరముల దా నెత్తుకొనె।
మానుగ నాతిని బడవేయుచు దా మాయాతీతు నైతినని॥ ౩౨.
ద్విజవరు నింగని జెప్పెను స్వామీ దీనునింటి భోజనము।
ప్రచితంబుగ నిటుచేకొన వలయును భగవదర్పణ మగునుసుము॥
విపరీతంబును జూచి బ్రాహ్మణుడు విస్మితచిత్తుం డయ్యె౯।
నెపములేక నీవంటి నిర్దయుడు నిఖలజగము నుండడయె౯॥ ౩౪.
వైరాగ్యమునకు సహజస్థితినె వంచింపక జెప్పగను।
నైరాశ్యంబని బాలికె జంపుట న్యాయంబగునే యిటను॥ ౩౫.
ఇటులం జెప్పుచు తనలో ననుకొనె నిచటరాక యుండినను।
పటుతరముగ యీబాల హత్యకును ప్రాపగుచును నుండనను॥ ౩౬.

వెలపలరిగి నే యితపలిశిబియును వెలిగాజేసిన యెడలన్।
అలయక నాపై నిందనుంచుచును నవస్థనిడుదు రియ్యెడలన్॥ ౩౯.
సాధు పురుషునే జూచిపోదమని చక్కవచ్చి నందులకు।
పాదుగ దురితము ఘటనమయ్యెనని భయదుఃఖము లొందెతగు॥
వ్యసనము వలదని కానొపాటుడటు వంచింపక జెపుచుండు।
పొసగగ మీరలు స్నానము జేయుచు భోజనమును చేకొనుడు॥
ఆతని కాంతయు మమతల వదలియు నావిప్రుని కడకేగి।
ఖేదము నొందక ప్రసాదభక్షణ క్రియతో జేయుడి మెలగి॥ ౪౦.
పాకము సిద్ధమై యున్నది యిప్పుడు భక్షింపక బోయినను।
జోకతోడ పరమార్థ ప్రపంచముల్ సూటిగ విడిపోవునను॥ ౪౧.
ఇదివిని ద్విజుడును నాశ్చర్యంబును నెలమిని నటు బొందుచును।
సతియై యుండియు తలమల బడకను సత్వహానికి వెఱచును॥
మోహ మమతలను బాలికపైనను మోపుకొనక నుండుచును।
బాహుళ్యంబగు విరక్తి నొందుచు పతికిహితము జూచునను॥ ౪౩.
ఇట్టిసంకటము ద్విజుడు గాంచుచును నిలస్నానము జేసికొని।
ఎట్టకేలకును నేమియు దోచక యిల విస్తర ముందుగని॥ ౪౪.
బసచేయగ నాయింటి గృహస్థుడు ప్రసాదంబు శ్రీహరికిన్।
పొసగ నివేదించి సతి నిడుమనె భోజనంబును నతిథికిన్॥ ౪౫.
ఆమెయు బెట్టెను నన్న మిద్దరికి, నతిక్లేశంబున ద్విజుడు।
సోమశేఖరుడు శ్రీయాళునిచె సుతుజంపించెను వినుడు॥ ౪౬.
ఏమియు నేనిటు యడుగకుండగను యేల శిశువు జంపితివి।
ఆమయమొందక శిశువు నుండునెడ నన్న మురుచి గలుగుభువి॥ ౪౭.
కడుపునిండనే నన్న ముదినిమరి ఘనముదమున వెఱ్ఱదును।
ఉడుకగ బాలికె హత్యకునేనె యొగి కారణమై తినను॥ ౪౮.
అన్నము నాకును రుచించ దనుచును నమితక్లేశమున నుండన్।
పన్నగనిదిగని కానొపాటుద్విజు భగవంతుడు వినుచుండన్॥ ౪౯.

పండరినాథా దేవాధిదేవ భక్తపాల యిటురమ్ము।
ఖండితముగ నీ వశేషభక్తుల కాపాడితివి యిలసుమ్ము॥ ౫౦.
హిరణ్యకశిపుచె ప్రహ్లాదుండును యిడుముల బహుబడగాను।
కొరతలేక నీను దలచగ నాతని కోరికె లొసగితి వటను॥ ౫౧.
పరమ కపటియగు దుర్యోధనుడును భంగపెట్ట ద్రౌపదిని।
వెఱవక నామెయు నిన్నుదలచగను వేగ బ్రోచితి వామెగని॥ ౫౨.
నందుడు యమున లొమునిగి పోవునెడ నాతని దెచ్చితి వీవు।
పంతముతో కలియుగమున భక్తులభహుంగ బ్రోచితివినీవు॥
భానుదాసుకై శూలము భువిలో పల్లవముగ జేసితివి।
కాననమున శ్రీనామ దెవునకు గల్పించితివి నీరుభువి॥ ౫౪.
దామజిపంతులు దుష్కాలంబున ధాన్యరాశి కొల్లలిడఁగ।
నేమముతోడను విఠూమాలవై నృపునకు ధనమిడితి వటఁగ॥ ౫౫.
రాకాకుమ్మరి తెలియక కూనల రయమున యావము నుంచఁగ।
సాకాంతుతో వాటినినీవును సంరక్షించితివి వెలుచఁగ॥ ౫౬.
ఈవిధమున నీఖ్యాతి యపారమై ఇలలోవర్ణిత మగుచుండు।
కావుము మమ్మును యీసమయంబున కరుణ కటాక్షము జూడు॥
శ్రీహరి వీక్షణ కలుగగ నచ్చట చిన్నబాల నూతిపయిఁగ।
మోహముతోడను నాడుచుపాడుచు మొనసి బడెను తండ్రిపయిఁగ॥
ఇదిగని యప్పుడు కానోపాటుం డింపుగ ద్విజవరు గనుచు।
సదయుడు శ్రీహరి కృపా రసంబుచె చక్కవచ్చె శిశువనుచు॥ ౫౯.
భక్షణ మీరలు తృప్తిగ చేయుడి భగవత్ప్రీతిగ యనగఁగ।
అక్షయ మగునీ మహిమను గాంచుచు యమిత వింత నొందితగఁగ॥
లేచియతడు దంపతు లిరువురకును లీనుడై దండము బెట్టిఁగ।
వాసిగమీవలె సత్పురుషులు యీ వసుధను లేరని బొగడెఁగ॥
భోజన మప్పుడు తృప్తిగజేసియు పొందుగ వెళ్ళెను ద్విజుడు।
కేశవభక్తిని కానోపాటుడు క్రియనిర్భరుడై యుండు॥ ౬౨.

సతీపతు లిద్దరు శ్రీహరి భక్తిని సదాసలుపు చుండిరటన్।
హితులగు వారల దాసులదాసుడు ఇలబాలకృష్ణుం డుండన్॥ ౬౯

---

బిదరురాజు, పండరిబ్రాహ్మణుల చరిత్ర.

దామజి పంతులు దుష్కాలంబున ధరణినాధు ధాన్యమును।
క్షేమ కరంబుగ కొల్లబెట్టగను శ్రీహరి రక్షించె మును॥ ౧.
బిదురు రాజు యొకయెడ తన మంత్రిని బిలిచియడిగె దానటను।
కుదురుగ దామజి దేవుడు దెచ్చెను గురుతరముగ రూకలను॥ ౨.
అట్టిదేవునే చూడ వలయునని యాయవన రాజు నుడువన్।
పట్టణమందును వినుచు ననేకులు భైలుదేరిరటు జోవన్॥ 3.
సేన సమూహము కుదురుపరచె నటు చెలగిమంత్రి యయ్యెడను।
మానుగ వాద్యముల్ మ్రోగ పండరికి మహీపతియు చనగాను॥
దేశదేశముల మాట వినంబడి దీనతతో విప్రులటన్।
కాసువీసముగ కలతలనొందిరి ఘనతర భయమును గూడన్॥ ౫
పండరి యందును బ్రాహ్మణు లదివిని బహుతర కష్టము బొంది।
మండలాధి పతి యిష్టమెటులో యని మహిని చింత బహునొంది॥
అవివేకుండా యవింధ్య నరపతి యనాచారముల జేయు।
సువిచారంబును లేకవిప్రులను సూటిగ భ్రష్టుల జేయు॥ ౭,
ఇచ్చటనుండక మరియొక దేశంబేగుట మంచిది యనగన్।
సచ్చరితులునగు కొందరు జెప్పిరి సకలభరము హరిపైగన్॥ ౮.
ఉంచియు మనమును యింటను నుందుము యొప్పదు చన హరివిడిచి।
అంచితముగ తా ననేకభక్తుల నరసిబ్రోచెతగ నునిచి॥ ౯.
విశ్వసింపకను కొందరు జెప్పిరి వెలసిన యీ కలిలోన।
అస్వతంత్రుడై యుండుటచేతను నతడు జేయ జెడిగాన॥ ౧౦.
హరినిగ్రహమును దాచి పెట్టుటయు యవనిమనను సరిపడదు।
దురుసుగ నరపతి దర్శనమునకై దూఱును మందిరమందు॥ ౧౧.

అచ్చట హరినిం గానకుండినను నపుడెమనల శిక్షించు।
మెచ్చదు యిటులంజేయుట యనుచును మెలగి పండరి విడుచుచు॥
వెళ్ళసాగిరటు, యందులో పదుగురు విశ్వసించి హరిపైనన్।
ఉళ్లము లోపల భయకంపముతో నుండిరర్చకులుగానన్॥
ఇంతలో నచ్చట వార్తికుండొక దేవున వచ్చుచు తగను।
పొందుగయామెడ పండరిపొలిమెర భూపతియును వచ్చెనను॥
ఇదివినియాపది పూజార్లును నటు యెలమి భయము నొందుచును।
పదపడి వారిలో నైదుగురప్పుడు ప్రసాదంబు నిడుటకును॥ ౧౫.
పూనియు మనమును రాజువద్దకును బోయెద మని జెప్పగను।
హీనజాతుడగు నృపునకు తులసీ యింపుగాదని కొందరును॥ ౧౬.
జాతిపుష్పముల చేకొని వెళ్ళిన సరగనృపుడు ముదమొందు।
పాదుగనవియును యీబుతువందున పట్టుబడవు యేమందు॥ ౧౭.
ఆసమయంబున బ్రాహ్మణ కన్యగా హారియు వచ్చెనయ్యెడను।
వేసికొనియు జాతీ పూమాలల విమల మస్తకంబునను॥ ౧౮.
శ్రీరంగేశుని గనుట కరుగువలె చేర వచ్చె సన్నిధిని।
సారంబగు యామాలల విప్రులు చక్కనడిగి తాముగొని॥ ౧౯.
పుష్పాలహారముల్ టెంకాయలు మరి పొందుగ నటు చేకొనుచు।
నిర్వాటిలంగను వెళ్ళుచు నృపుకడ నెటె శ్రీహరిని దలచుచు॥ ౨౦.
బిరుదును రక్షణజేసికొనము హరి పెనగి మమ్ముగాపాడు।
గురుతుగ నీకృపనుంచుము మాపై గోవిందాహరి నేడు॥ ౨౧.
ఈవిధముగ నటు హరినిదలంచుచు నేగిరి యామెడయటను।
సేవకజనులను సిబ్బందినిగని జెందిరి మిగుల భయమును॥ ౨౨.
మహారాష్ట్రుడగు ముత్సద్యోకనికి మనివిచేయ తమరాకన్।
సహాయభూతుడై వీరల రాజుని సమయము గని యటువీకన్॥
దరిశన మగునటు చేయింపంగను ధరణీ నాధుని ముందు।
వరుసను నుంచిరి ప్రసాదమునునటు వారు దెచ్చు తబుకందు॥

శరణని బలుకుచు నిలుచుండిరి యటు శాస్త్రనిపుణతయు సుండి।
వెఱపున మెలగిరి యవనరాజు కడ వీహిత నిష్ఠ తెలివుండి॥ ౨౫.
దామజి పేరగు పీతాంబా మనుజులు దర్శనకై వచ్చిరనఁ।
నేమముతోడను వారలు దెచ్చిన నిఖిల పదార్థము లోనఁ॥ ౨౬.
కుసుమమాలలను చే నిడినృపుడును కొనియాడుచు తగనటను।
విసరెడు వాసన నాఘ్రాణింపుచు వీక్షించెను సొగసును॥ ౨౭.
అపచితముగ నొకవెంట్రుకయందున నమరియుండగను జూచి।
వివరంబిందుకు యేమనియడిగెను విపులకోపమును వెలసి॥ ౨౮.
అందుకు విప్రులు భయభీతులునై యవనీపతినిం గనుచు।
సందయమొందక వితూనాయకుని చక్కని వెంట్రుకలనుచు॥ ౨౯.
దామజి కొఱకును వితునాయకుడై దర్శనమిడె హరినీకు।
సేమంబలరగ నాతని వెంట్రుక సిద్ధమనగ వినిబాగు॥ ౩౦.
క్షితిపతియనె మీదేవుడు దేనితో చేయంబడెనని యడుగఁ।
వీతతిని వారలు పాషాణముచె వేంచేయంబడె ననగఁ॥ ౩౧.
అందుకు నృపుడనె పాషాణమునకు నమరునెయిల వెంట్రుకలు।
పంతముతోడను ననేకమూర్తులు పగలబడియు విలసిల్లు॥ ౩౨.
వాటికినెప్పుడు కేశముండినటు వసుధను గానను నేను।
నీటుగమీరలు నసత్యవచనము నిగుడియు జెప్పితిరనెను॥ ౩౩.
ఇదివిని వారలు మా దేవునకును యేవికారము లేదు యను।
కుదురుగ నాతని గొట్టవలవదిటు గొట్టబడిన మూర్తులును॥ ౩౪.
సిందుర మొదలగు వర్ణంబులచె చెలగబడు వికారముల।
సందియ మొందక తురకలు వాటిని సరిగొట్టిరి యయ్యెడల॥ ౩౫.
మా దేవుండటు గాకయుండును మహిత కేశ ముండునని।
సాదరముగనటు చూడ వచ్చునని చక్కబలుక రాజువిని॥ ౩౬
చెప్పినరీతిని నుండకపోయిన శిరముల ఛేదింతునని।
తప్పకయప్పుడె కావలి వారల ధరాసాధుడుంచగని॥

ద్విజులనందరను కావలినుంచుచు దేవుని గన బోవుటకు।
ప్రజలును సైన్యము కూడిన యప్పుడు ప్రబలధ్వనియును చెలగు॥
పండరి జనములు తురకల భయమున పారివెళ్ళి రయ్యెడను।
మెండుప్రార్థనల పూజాచార్యులు మెలగియుండి రటుతగను॥ ౩౯.
అధిక భయముతో హరిసర్వేశ్వర యరవిందాక్షా యనుచు।
మధుసూదన నీవనేకభక్తుల మహిని బ్రోచితివి తరుచు॥ ౪౦.
నీదుసేవలో నుండెడు వార్లము నెటి యపరాధము గలిగెన్।
పాదుగ నీవును గాపాడని యెడ ప్రాణముల్ విడుతుము వేగన్॥
భయకంపముచే వణకును బుట్టెను పాండురంగ హరివిఠల।
నయముగ నీవును శిక్షజూపింపుము నరపతి గన నియ్యెడల॥ ౪౨.
మమ్ముల నిప్పుడు బ్రోవనియెడ నీ మహితబిరుదు న్యూనమగు।
సొమ్మసిల్లగను సాధుసజ్జనుల్ సూటిగనవ్వాం జెలగు॥ ౪౩.
సంకటమందున నిన్నువినా మము సంరక్షించెద రెవరు।
శంకముతోడను మాయెడనీవును పూర్తికృపను కొనగోరు॥
ఇట్టిప్రార్థనల జేయుచుసన్నిధి యేపున వచ్చిరి యపుడు।
దిట్టముగానా రాజు నిలిచియటు తీరముగ హరికెదురుండు॥ ౪౫.
అవనీపతికడ కరిగిన యర్చకు లచటకై ది నుండిరని।
వివరంబయ్యెను గుడిలోనుండెడు విప్రులనందర కిన్ని॥ ౪౬.
విటోబామూర్తికి తలపైయుండిన విపులముకుట మెత్తుచును।
పటుతరముగ నటు జూడగ నప్పుడు పాషాణమె యుండగను॥ ౪౭.
తలపై వెంట్రుకల్ లేకుండంగని తత్తరబడి యేడ్చుచును।
ఇలలోనరపతి చంపును గదయని యేమి దోచకుండగను॥ ౪౮.
భూపతి యప్పుడు వచ్చియు విఠలుని పొందుగాను జూడంగన్।
ప్రాపుగ తలపై కేశబంధనము బాగుగనట నుండంగన్॥ ౪౯.
జుట్టుననుండెడు రెండువెంట్రుకల సూటిగ నృపు డీడ్వగను।
ఘట్టిగనుండెను రక్తముతోడను గనబడియెను వెలిగాను॥ ౫౦.

ధరపతి గని బహువింతనొందుచును దండమిడెను మూర్తికిని।
చెఱలోనుండిన విప్రులవిడుచుచు చిరతోషము నొందగని॥ ౫౧.
నూతన వస్త్రముల్ వారలకిచ్చుచు న్యూనమేమి లేకయును।
ప్రీతిని శ్రీహరి పూజల జేసెను పెంపుగాను నయ్యెడను॥ ౫౨.
అలంకారముగ సొమ్ములనిచ్చెను హరి విఠల మూర్తికిని।
విలంబమొందక క్షేత్ర మినాముగ వెలసివ్రాసె హరికిని॥ ౫౩.
హరిదాసులచే కీర్తన వినుకొని యవనీపతియును వెళ్ళెన్।
మురిపెముతోడను పండరినాథుని మూర్తిదలచి విలసిల్లెన్॥ ౫౪.
పండరి విప్రులు భయవర్జితులై బాగుగనుండిరి పిదపన్।
దండిప్రేమతో బాలకృష్ణు హరి దాసులదాసుడై యొప్పన్॥ ౫౫.

---

స ఖు బా యి చ రి త్ర ము.

కరవీరంబను పురమొక టుండెను ఘన కృష్ణా తీరమున।
అరమర లేకను విప్రు డొక్కడట నతని కుటుంబము నెన్న॥ ౧.
భార్యయు భర్తయు కొడుకు కోడలును పరగ నలుగురుండుచును।
కార్య కరంబుగ సంసారంబును గడుపుచుండి రయ్యెడను॥ ౨.
కోడలు మీదను అత్త కఠినయై కుటిలత బహుగా చేయు।
వీడక కోడలు రాత్రిం బగలును వెలసి పనుల నుండుటయు॥ ౩.
సఖుయను పేరున బిలుతురు కోడల సకల జనులు నచ్చోటన్।
అఖండంబుగా హరినిం దలచును నమిత ప్రేమ గొనియాడన్॥ ౪.
పండరిపతి శ్రీ రుక్మిణి రమణా భక్తవరద గోవింద।
అండజ వాహన హరివిఠ్ఠల యని యామె జెప్ప మొదమొంద॥౫.
సాదు జనులచే దేవుని రూపును చక్కగ విని దానుండెన్।
పాడుగ నటులనె ధ్యానము నిడికొని భక్తి సలిపితగ నిగుడెన్॥౬.
అనేక విధముల యపశబ్దంబులు నత్తయు బలుకుచు నుండు।
వినీత యగుచును సఖూయందులకు వేరు పలుకకను నెగడు॥ ౭.

పండరిఁబోవుట కిచ్ఛబూనుకొని భక్తులపదముల బడియు।
ఖండితముగ నను పండరిపురికిని గైకొని యరుగుండనియు॥ ౨౧.
వేడుచునుండగ నటు యొకస్త్రీగని విచ్చేసెను సఖు గృహము।
కోడలు పండరిఁబోవుచున్నదని గురుతుగ జెప్పెను సుమ్ము॥ ౨౨.
అత్తయు వినుకొని యతిక్రోధముతో నామె కొడుకు గనుచును।
తత్తరబడుచును సఖూపండరికి తర్లిపోయెననగాను॥ ౨3.
క్రోధయుక్తుడై యాత్రజనుల కడ కొడుకువచ్చి తగజూచి।
పాదుగనచ్చట భార్యశిఖను దా బట్టియీడ్చి యిలుదెచ్చి॥ ౨౪.
తగనిమాటలను భర్తయు జెప్పగ తల్లియునటు జేసెమును।
విగత శమంబున స్తంభమునకు సతిని వేగగట్టిరయ్యెడను॥ ౨౫.
అన్నోదకముల పదైదుదివసము లామెకు వారియ్యకను।
విన్నాణంబుగ తొందరబెట్టగ వెలది యసురు విడుటకును॥ ౨౬.
తలకడియుండగ కట్టు విడుచుటకు ధరను మనుజులెవ్వరును।
వెలికి రాక బహుశ్రమలనొందుచును వెలది యుండి యయ్యెడను॥
వివేకియగుచును దుఃఖము సుఖముగ వీలుగ దలచుచునుండు।
భవాబ్ధితారకుడగు శ్రీరంగని భావములో గనుచుండు॥ ౨౮.
అన్నయు తమ్ములు తల్లియు దండ్రియు నవని నీవే హరిరంగ।
పన్నుగ నినునే జూడకప్రాణము బడిపోయిన యెడవేగ॥ ౨౯.
ప్రతి యవతారమునందును నీతో బట్టుదు సంబంధమును।
గతియగు నాకును నీవే యనుచును ఘట్టిగ నమ్మెను తాను॥ 3౦.
భక్తులనేకులు జయజయయనుచును పలుకగ పండరిలోను।
రక్తిగశ్రీహరి సఖూమొరను విని రాత్రికాల మందునను॥ 3౧.
పోవ దలంచగ రుక్మిణిదేవియు పునితభక్తు లెవరునిను।
కావుమటంచును గోరిరి యనగను కంజదళాక్షుం డటను॥ 3౨.
సఖూబాయినై వెళ్ళెదననుచును చనెనటు కరవీరపురి।
ప్రఖ్యాతిగనా సఖూరూపమును పరగదాల్చి తానుమరి॥ 33.

ఆమెనుగట్టిన స్తంభసమీపము హరియును తగ నిలుచుండగ।
నెమమలర సఖు వెవ్వరో నీవిటు చెప్పుమనుచు దా వేడగ॥
శ్రీహరి యందుకు యాత్రకారినని జెప్పుచునట తా మరియు।
స్త్రీహత్యవలన [illegible] నే యాత్రను జేర్చెద వగవకు మనియు॥
నీకు బదులుగను నేను స్తంభమున నెనరున కట్టంబడుదు।
నీవును నిశ్చయ యాత్రజేసికొని వేంచేసిన నేవెళుదు॥ ౩౬.
[illegible] సఖును గట్టినత్రాళ్లను నీశకు తానే విడుచు।
[illegible] యాత్రజనుల కడ సఖును దెచ్చి హరి యిడుచు॥
మరల వచ్చుచును సఖూరూపమున మహికంబము గట్టుకొనె।
దురుసుగ రాత్రిని జరిగినసంగతి ధూర్తులెరుగ జేయకనె॥ ౩౭.
అత్తమామల యపశబ్దంబుల నన్నిసహింపుచు దాను।
చిత్తతోషమున కట్టుకులోబడి శ్రీహరియట నుండగను॥ ౩౯
సఖూభర్తయును తనలో తలచెను చచ్చును తన భార్యయును।
ప్రఖ్యాతిగ నిట నన్నములేకను పదైదుదినము లరిగెను॥ ౪౦.
వివాహామునకై వ్రయపరచితినే విపులధనంబును మునుపు।
నవీన భార్యకు ద్రవ్యంబిప్పుడు నాయెడలేదని జెప్పు॥ ౪౧.
ఈవిధమున దా దలచుచు మదిలో నెలమి కట్ల విప్పుచును।
భావశుద్ధితో మధురోత్తరముల బలికి పనుల జేయుమను॥ ౪౨.
అనుమోదించుచు హరి యారూపున నప్పుడె స్నానముజేసెగ।
దినచర్యకు సరి వంటల జేయుచు తినిపించియు దా వెలసెగ॥ ౪౩.
అత్తయు మామయు కొడుకు గూడుకొని యన్నము రుచియించెనని।
పొత్తున నందరు చెప్పుచు నుండిరి భోజన సమయమును గని॥ ౪౪.
పతికై సలిపెడు పనుల నెల్లదా భక్తిని జరుపుచు నుండు।
హితపరు డగుచును భక్తులకై హరి యెంతో హైన్యతనుండు॥
మహామహీముడై యుండు శ్రియఃపతి మహినొక నరుసతియయ్యు।
విహారయుతుడై యుండు వర్తనము విపుల కృపను జూపుటయు॥

భక్తుల కొఱకై లజ్జను విడుచును భగవంతుండగు హరియు।
రక్తిగ బ్రాహ్మణు నింటను పనులను రమ్యమలరగను జేయు॥
రాతిరి మూడవ జాము లేచివిసు ర్రాయిని పిండిని విసరు।
పాడుగ యింటిని యూడ్చి మార్జనము పరగ జేసి యిడు నీరు॥ ౪౯.
అణుమాత్రంబును న్యూనము లేకను నత్త మామ కిరవుగను।
వెనగొనిపనులను జరుపుచు నుండును ప్రియమోదము జూపుచును॥
పండరి యందును సఖూబాయి దా భక్తులతోడను జేరి।
నిండు ప్రేమతో హరిదాసుల స్థితి నెనరున గని తగమీరి॥ ౫౦.
అచ్చటి వారలు హరినామంబును నపరిమితము నుడువుదురు।
హెచ్చిన ప్రేమతో నాలింగనముల నెలమి జేతు రొకరొకరు॥
నిరభిమానులై యొకరికి యొక్కరు నెనరున నతి జేసెదరు।
గురుతున నుంచరు కులగోత్రంబుల గోవిందా యనుచుందురు॥ ౫౧.
మహోత్సవంబిటు సఖూ జూచుచును మనసున మోదము వెలసెన్।
విహరయుక్తమా చంద్రభాగలో విధితో స్నానము జేసెన్॥ ౫౩.
దేవుని చూచుట కొఱకై వెళ్ళుచు దీర్ఘదండం బిడుచును।
భావము లోపల ననుతాపంబును బహువిధముల పొందుచును॥
సభామంటపమున తా వెళ్ళుచు సర్వేశుని ముందుగను।
విభవముతోడను హరినింగనె తన వికచతలపు నరిగాను॥ ౫౫.
ఆలింగనమును జేసి చరణముల నరమర లేకను బట్టు।
కాలం బిప్పుడు ఘటించె నాకును కనుల జూడనిను యిట్టు॥ ౫౬.
అమిత దుఃఖమును సంసారంబున ననుభవించితిని నేను।
కొమరొప్పగ నే తిరిగి వెళ్ళనటు గోవింద నీ యానయను॥ ౫౭.
కరుణను జూడుము పాండురంగహరి కంస మర్దనా యనుచు।
హరికీర్తన యటు జరుగుచు నుండగ నామెయు నచటికి వచ్చు॥
భగవన్నామము హరిగుణ వర్ణన బాగుగ తా వినుచుండెన్।
సగటున నదిలో మరుదిన మందును స్నాన మొనర్చియు నిగుడెన్॥

ప్రదక్షిణంబుగ క్షేత్రము నంతయు బాగుగ తానటు నడచి।
పదపడి ప్రాణముల్ పోవువరకు నే పండరి విడనని దలచి॥ ౬౦.
భగవంతుని యామంగళమూర్తిని భావములో నుంచుచును।
మిగులప్రీతిచే ధ్యానింపంగను మెయి విడిచెను తానటను॥ ౬౧.
అచేతనంబగు ప్రేతంబగుటచె నచ్చటవిప్రుం డొకడు।
విచారింపగను కరవిర నగరపు విప్రస్త్రీ యని యతడు॥ ౬౨.
తనగ్రామంబగు కివళ సమీపము తరుణియుండు యూరనుచు।
అనువుగనాతడు సంస్కారంబుల నగ్నిస్పర్శ జేయించు॥ ౬౩.
భీమాతీరమునందును దహనమై బెంపారెను యా మేను।
క్షేమాకాంతుసు రుక్మిణిదేవియు జెచ్చెర తలచెనుతాను॥ ౬౪.
కరవిర పురమును హరివెళ్ళెను సఖు కాంతను బ్రోచుటకొఱకు।
వెఱపుననామెయు మేనువిడిచె నిటు విఠలువచ్చు టెటులనగు॥ ౬౫.
ఈవిధముఁగ తా దలచుచుమనసున నేగెను శ్మశానమునకు।
భావపూర్ణముగ సఖూ యముకలను పద్మయు జూచెను బాగు॥ ౬౬.
అప్పుడెగైకొని పూర్వరూపమును నచటనుండి సఖు లేచెన్।
తప్పక రాత్రిని స్వప్నమునందును తరుణికి *మా దెలిపించెన్॥ ౬౭.
కరవీరమునకు వెళ్ళుము నీవును కళేబరము క్రొత్తదియా।
వెఱపున జేసినమునుపటి యానయు వీడిపోయిన దదియా॥ ౬౮.
జననము నూతన మగు నిటు యనుచును జననియు రుక్మిణి యనెను।
అనువుగ నాజ్ఞను శిరము వహించుచు యాత్రాకారులతోను॥ ౬౯.
సఖూవచ్చె కరవీరపురంబును, సతి రూపముతో యటను।
సుఖరూపుడు హరి నీళ్ళకుండతో నూటిగ సఖునింగనను॥ ౭౦.
సఫలంబయ్యెనె యాత్రయనుచు తగ సర్వేశ్వరు డడుగంగన్।
విఫలముగాకను నీకృపతో నే విఠలుని గంటిని బాగన్॥ ౭౧.
చెప్పశక్యమె నీయుపకారము చెలియరో యని జెప్పుచును।
ఒప్పుగ నిటులనె ప్రతివత్సరమును నుపకారము చేయుమను॥ ౭౨.

*మా - లక్ష్మి.

ఇటులం జెప్పగ నవశ్యమనుచును నీశుడదృశ్యుండయ్యె।
పటుతరముగ యా నీటిబిందెనటు బట్టివచ్చె దా చయ్యె॥ ౭౩.
ఎవరికినప్పుట దెలియకుండె సఖు యేగుసుద్ది యాత్రకయు।
భువి సఖు ప్రేతము నగ్నినిగాల్చిన భూసురు డెరిగించుటయు॥ ౭౪.
అత్తమామలును వినుకొని బొందిరి యత్యాశ్చర్యం బటను।
చిత్తమలరగను సఖూను బిలిచియు చెణుకున వారడుగగను॥ ౭౫.
జరిగిన సంగతి జెప్ప సఖూబాయ్ సర్వంబును వినుకొనుచు।
స్థిర యనుతాపము బొందుచు వారలు శ్రీశు భక్తిని గొనుచు॥
కోడలు పైనను ప్రేమ సలుపుచును కుటిల బుద్ధి మానుకొని।
గూడి యాత్రతో ప్రతి వత్సరమును గుఱి నరుగు పండరికిని॥ ౭౬.
ఉన్నత భక్తిని బొంది సఖూబా యుచిత పదము బొందెమును।
పన్నుగ భక్తుల పాద ధూళియగు బాలకృష్ణు డియ్యెలను॥ ౭౭.

---

## మా లో పం తు చ రి త్ర ము.

బరాడు దేశమునందు నుండె నొక బ్రాహ్మణు మాలోపంతు।
విరాజ మానుడై సుగుణంబులచె విఠలు భజన చెలువొందు॥ ౧.
అతి నైపుణ్యత గలిగి గృహస్థుడై క్షితి మాన్యత గలిగుండు।
కుదురుగ నతనికి కొడుకగు నరహరి గుణవంతుండై యుండు॥ ౨.
భూత దయయును నతిథుల కన్నము పొందుగ నిడు పంతుండు।
పాదుగ సత్యమె పలుకుచు నుండును భగవద్భక్తిని తగనుండు॥ ౩.
అనేకాబ్దము లిటుల జరగగను నతని సతియు వ్యాధులచే।
అనువుగ నేగెను పరమపదంబును, యామె తనువు విడుచుటచె॥
మాలోపంతటు దుఃఖితు డగుచును మనసును హరిపై యుంచి।
లీలానాటకు చిత్రం బిదియని లెక్కింపక తా వెలసి॥ ౪.
వివేక వృత్తిని యవలంబించియు విడిచె బంధమని దలచు।
భవాబ్ధి తరణో పాయం బగునటు పండరిపతిని భజించు॥ ౫.

విరాగ స్థితితో తానట నుండిన విహితులు కొందరు కూడి।
సరాళముగ నొక కన్యను దెచ్చుచు సలిపిరి వారలు పెండ్లి॥ ౭.
కొంతకాలమటు జరిగిన పిదపను కుదురుగ రెండో సతికిన్।
పంతము తోడను తండ్రియు వచ్చెచు పదుగురు ప్రజగన వెలికిన్॥
ఆతను జాతిని యనామికుండగు నతని కూతు గన్గొనెను।
పాడుగ నాతడు మాలోపంతు గని బలికెను సంగతి యటను॥ ౯.
దొంగలు రేయిని పుత్రిని దెచ్చియు తుచ్ఛత ద్విజు గృహమిడిరి।
రంగుగ పెండ్లిలో దానిన్నిపును రమ్యత గొంటివి మీరి॥ ౧౦.
అనాచారమై యమరె ననంగను నాద్విజు దుఃఖితు డగుచు।
ఘనీభూతుడగు పాపాత్ముడనని గరిమెను శ్రీహరి దలచు॥ ౧౧.
పుండరీకునకు వరదాయకుడవు బ్రోవు మిపుడునను కరుణన్।
ఖండితముగ నే పతితుడ నగుదును కంజ దళాక్షుడ దీనన్॥ ౧౨.
సతిని బిలిచి యీతడు నీ తండ్రియె సత్యముగా జెప్పమను।
పతికి మారు దా బల్కక యూరక భయమున నిలుచుండగను॥
అనామికుని గని బ్రాహ్మణుడనియెను యబలను గొనిచను మనగ।
అనీతియగుసుము యటు భాండమిటు యాదర మొందదు గనుక॥
కొమరిని నేనిటు గైకొని వెళ్ళిన కుదురదు నాజాతికని।
అమరగ ద్విజునకు దండము బెట్టుచు ననామికుడు చనగగని॥ ౧౫.
పురజను లందరు మాలోపంతునకు పొందుగ నిడి రాంక్షయును।
సరగున వెళ్ళిరి యింటిని విడుచుచు సరి బంధువు లందరును॥ ౧౬.
ఆతని కొడుకగు నరహరి దప్పగ నన్యులు తగ వెళ్ళంగన్।
పాడుగ మాలోపంతు విప్రులను భక్తిని బిలుచును వేగన్॥ ౧౭.
సంపతి నంతయు కొల్ల గొనుమనియు చక్కగ నింటిని విడిచెన్।
పెంపున శ్రీహరి నామము నుడువుచు ప్రీతి వీరలుపై గాంచెన్॥౧౮.
వేదవేద్యులగు బ్రాహ్మణ సభయటు విహితంబుగ చేయించి।
నీతిగ మాలోపంతు వార్లకును నెనరున దండము జేసి॥ ౧౯.

ప్రాయశ్చిత్తము విధింపు డనుచును బ్రాహ్మణులను తా నడుగు।
న్యాయపద్ధతిని శాస్త్రము చూడగ *నద్ధత దుష్కృతమునకు॥ ౨౦.
దేహాంతంబగు ప్రాయశ్చిత్తమె తేలెమాలో పంతునకు।
సాహసముగ నత డటుల గోరెనని చక్కజెప్పి యిటునాకు॥ ౨౧.
ఏవిధ యుక్తిచె శరీరత్యాగము యేర్పడు ననియడుగగను।
భావశుద్ధితో విప్రులుబల్కిరి పాండురంగని మ్రొక్కుచును॥ ౨౨.
బలిసిన తింత్రిణి వృక్షపు తొఱ్ఱిలో పరుండి నీవందునను।
వలసిన పిడకల యుంచియు నీవే వరుస నగ్ని నిడుకొమను॥ ౨౩.
ఇది యేశాస్త్రములందలి విధియౌ యిందున నఘమేగు ననఁగ।
ముదమున నాతడు వినుకొని తనకిది ముందుజన్మ కర్మమునఁగ॥
అనుభవమిట్టుల వచ్చెను యనుచును నవనిసురులు జెప్పినటు।
ఘనవృక్షంబగు చింత తొఱ్ఱిలో ఘట్టిగ తాను పరుండు॥ ౨౪.
పిడకలనుంచుచు నగ్ని వేల్చగను పెనగిమాలోపంతుడును।
తడబడలేకను హరివిఠ్ఠలయని ధ్వనిజేయుచు నుండుచును॥ ౨౫.
సంపతి సఖులను నాప్త వర్గమని సలలితముగ దలచితిని।
తెంపున వారలు నంత్యంబున నను దిగవిడిచిరి తమ్ముగని॥ ౨౬.
అపరిమితంబగు వేధ దేహమున కవని వచ్చుచుండినను।
కృపతో నీయడ క్షాప్తియుండునటు క్రియజూడుము కృష్ణయను॥ ౨౭.
భావము శ్రీహరి పండరిపతి పై బాగుగ నుంచుచు నపుడు।
దేవదేవు తిరునామము జెప్పుచు తెంపుననుండెను యతడు॥ ౨౮.
మాధవ ముకుంద గోవిందా హరి మధుసూదన చక్రధర।
ఆదిపురుష భవభంజన కేశవ యచ్యుత లక్ష్మీ మనోహర॥ ౩౦.
రామా రఘుపతీ దానవమర్దన రావణాంతకా యనుచు।
దామోదర శ్రీనారాయణ హరి దయజూడుము నన్ననుచు॥ ౩౧.
అనేకవిధముల నార్తితోడ నటు హరిని స్మరణ సేయగను।
జనార్దనుని తగు కరుణను దేహము చలన మొందకుండగను॥ ౩౨.

---

* కట్టుబడిన,

అచ్చటివిప్రులు గాంచుచుబల్కిరి హరినామ ప్రతాపముచే।
హెచ్చిన యగ్నియు దహన శక్తినిటు లేర్పడకుండగ వెలసె॥
గతకాలంబున హిరణ్యకశిపుడు కన్నకొడుకు నయ్యెడను।
అతులితముగ దా శిక్షజేయుటకు నగ్నిలోన నుంచగను॥ ౩౪.
దహనముగాకను హరికృపచేతను ధరణిని వెలసినరీతిగ।
విహరించెను యీమాలోపంతును విపులకృశానుని దీప్తిగ॥ ౩౫.
శాంతిని బొందెను యగ్నియంతయును సదమల భక్తుడు వెనకగ।
కాంతిని నందరు జూడగ నచ్చట కనబడుచుండెను బాగగ॥ ౩౬.
పండరీశు నిను రక్షించెను యని బ్రాహ్మణులును జెపిరపుడు।
దండిపవిత్రత నొందితివీవని ధరామరులు గొనియాడు॥ ౩౭.
ఆదిమొదలుగ యా మాలోపంతుడు హరిభజనను దా జేసెగ।
కుదురుగ నూతన కవిత్వరచనల కూర్మిని జేసియు వెలసెగ॥ ౩౮.
మాలకన్యయును సత్సంగముచే మంచిగుణము లొందుచును।
శీలుడు మాలోపంతుని యడిగెను చెపుము తరణోపాయమును॥
భక్తుడు బలికెను యన్నవస్త్రముల బ్రతుకువరకే నిచ్చెదను।
సక్తుడుగాక నీ తండ్రి విడుటచె చక్కనుండు దూరమును॥ ౪౦.
శ్రీహరి స్మరణయె తరణోపాయమై చెలగును నియ్యెడ నీకుగ।
గ్రహను జెప్పుచు వీధికి వెలపల నుంచెచు గృహమున బాగుగ॥
చెప్పిన రీతిని యాపె నడచుచును శ్రీహరి దలచుచు నుండు।
ఒప్పుగ తనుమన వాక్కుల చేతను నుచిత నామ మనుచుండు॥ ౪౨.
అతిప్రేమను దా హరిపై యుంచగ నాతని కరుణయు వడసెగ।
పతితపావనుం డప్పుడప్పుడును భవ్య దర్శన మిడి వెలసెగ॥ ౪౩.
బహుదినంబు లిటు గడవగ నొకయెడ ప్రాణ ముడిగె నామెకును।
విహితుడు మాలోపంతు గాంచుచును వేరు నరులు ప్రేతమును॥
ముట్టరు గదయని యనుతాపముతో ముద్దియ గృహ మేగగను।
దిట్టముగా నది పుష్ప మయంబై తెలియ వచ్చెనటుగాను॥ ౪౫.

విష్ణు భజనలో నుండు మహిమయును విపులత హరి జూపెనను।
కృష్ణుని కైంకర్యములో కాయము క్రియతో మనముంచినను॥ ౪౬.
ఇట్టి పదంబును నందరు బొందుటకిరవై యుండునుగాద।
ఘట్టిగ దలచుచు మాలోపంతుడిటు కంజాక్షుని కృప నొంద॥
శుద్ధభావమున సేవించుచు దా చూఱ గొనియె హరిపదము।
పెద్దల దాసుడై బాలకృష్ణుడును పెనగి జగతి నుండుసుము॥ ౪౭.

---

## ప్రే మా బా యి  చ రి త్ర ము.

హిందుస్థానపు దేశము నందున యెలమి నగర మొకటుండు।
అందున నుండెను ప్రేమబాయి యని యామె విధవగా నెగడు॥ ౧.
విరాగ జ్ఞానము లెవ్వియు లేకను విపుల భక్తి యొకటుండు।
ధరామరులదా విశ్వసించుచును దయభూతము లందుండు॥ ౨.
భాగవతార్థము శ్రవణము జేయును భక్తియు శ్రద్ధయు గూడన్।
త్యాగ బుద్ధితో నతిథుల కన్నము దయతో తగ నిచుచుండన్॥
సాదు జనంబులు తనకడ వచ్చిన స్థలమిడు వారుండుటకు।
షాదుగ శ్రీహరి నామము నుడువుచు పగలును రేయిని ప్రమగ్ను॥
కుదురుగ గంగా స్నానము జేయుచు గోపాలుని మూర్తికిని।
విధి నియంబున పూజల సలుపుచు వెళ్ళును శ్రవణమునకని॥
హరిచరిత్రమును వినుచునుండగను యానందాశ్రులు యొలుకు।
గురుతు మేనుపై యుంచక యామెయు గోవిందునిపై సొక్కు॥ ౬.
ప్రతి దినమందును చరిత్ర వినుచును భక్తి ప్రేమ జూపుటచె।
క్షితిలో యామెయు ప్రేమాబాయి యని చెప్పబడెను భక్తులచె॥
ఒకయెడ సాధులు వచ్చిరి యింటికి యుచిత ప్రేమ వార్లకును।
సకల సేవలను జేయుచు వంటను సరగ జేయ బూనుకొను॥
తనలో ననుకొనె పురాణశ్రవణము తప్పె తనకు నే డనుచు।
అనువుగ సాదుల సేవయె ముఖ్యమౌ హరికి ప్రీతియౌ ననుచు॥

హరిపూజను తా జేయు సమయమున హరి భక్తులు వచ్చినను।
గురుతుగ పూజను విడిచి వారలకు కోరి వందన మిడవగును॥
సాదులు విముఖులై పోయిన యెడలను సర్వేశ్వరు కనుపడగునే।
నీతియు నిట్టుల జెప్పంబడెనని నెనరున దలచుచుతానె॥
పురాణమునకును బోవక యింటను పొసగ వంటజేయుచును।
ధురీణయగుచును చిత్తమునంతయు ద్రొబ్బె పురాణమందును॥
దశవర్షంబుల కుమారుడొక్కడు ధరనుండెను నామెకును।
కుశలంబగు నటు వానింబిలిచియు కోరివెళ్ళి పురాణమును॥ ౧౩.
వినుకొనినాకును కధనుజెప్పుమని వేడగ నాబాలుండు।
అనువుగ నచటికి వెళ్ళియు కధలను నాలకించుచును నుండు॥ ౧౪.
ప్రేమబాయి యిటు భాగవతులకై ప్రియతర సేవనునుండెగా।
నేమముతోడను ధేనువత్సపై నెనరుంచిన యట్లుండెగా॥ ౧౫.
స్నానము జేసియు సాధులు వచ్చిరి సరివంటయు నైయుండు।
మానుగ వారల చరణక్షాళన మానినిజేయుచు నుండు॥ ౧౬.
పాదతీర్థమును ద్రాగుచు శిరమున పవిత్రమని చల్లుకొని।
సాదరముగ తా గంధాక్షతలను చక్కగనర్పించ గని॥ ౧౭.
సాదువులందరు ప్రీతి వహింపుచు సంతృప్తిని కూర్చుండగా।
పాదుగ వారల కన్నంబిడియెను భక్ష్యభోజ్యముల తోడగా॥ ౧౮.
వారలుభక్షణ చేసినవెనకను వచ్చెకొడుకు కధనుండి।
తీరుగతల్లియు కొడుకును భక్షణ దీర్చియు సుఖముగ నుండి॥ ౧౯.
సుతునింబిలుచుచు నీవు వినిన యా సుచరిత మీదినమునను।
కుదురుగ జెప్పుము యనుచునడుగగను కొడుకుచెప్పబూనెమును॥
నందసూనుడై శ్రీకృష్ణుండును నయముగ గోకులమందు।
అందముతోడను బాలలీలలను ననువుగ సలిపెనుముందు॥ ౨౧.
*ఒక్కట యశోద పెరుగు తరుచగను నొనర నరిగి కృష్ణుండు।
మిక్కిలియేడ్చుచు చను బాలిమ్మని మేనుపైన బడుచుండు॥ ౨౨.

---

*ఒక్కట - ఏకాప్వృత్తి.

యశోదయప్పుడు కవ్వమువిడిచియు యా కృష్ణునెత్తి తొడపైన।
సుశీలయగుచును చనుబాలియ్యగ సుఖముగ నొక స్తనమున॥ ౨౩.
చేతిని నిడికొని మరియొక స్తనమున శ్రీహరిపాలును ద్రాగెఁ।
పాతర్లాడుచు కొంత తడవునకు మాత ముఖము గనితూగెఁ॥
యశోదయప్పుడుకొమరుని ముఖమును నతిముదమున దా జూడఁ।
విశాలభాండము నందలిదుగ్ధము వేపొంగెను పోయ్‌జూడఁ॥ ౨౫.
హరి శ్రీకృష్ణుని విడుచుచు క్రిందను నతి శీఘ్రంబుగ వెళ్ళెఁ।
గురితో జాగ్రతలేక పొంగెనని కోర్కెనామె భ్రమసిల్లెఁ॥ ౨౬.
శ్రీహరి తనలో మరియొక స్తనమును చెలగి ద్రాగలేకుండెఁ।
మోహముతో తనతల్లి వెళ్ళెనని ముదములేక గనుచుండెఁ॥ ౨౭.
ప్రేమరసమునటు ద్రాగగ మాయలో ప్రీతినొందె తల్లియని।
కాముని జనకుడు యితరబాలురను కనికరముగ బిలుచుకొని॥ ౨౮.
వెన్న మీగడల పంచిపెట్టి యటు విసిరిగొట్టె భాండమును।
పన్నగనింతలో యశోదదేవియు పరుగిడి వచ్చెను యటను॥ ౨౯.
వెన్న కుండయటు పగులంజూచుచు విపులతాపమును బొందెఁ।
యెన్నడు నేగన నిట్టి బాలునని యెలమిలేక యిరవొందెఁ॥ 30.
ఇంటింటిలో బాలకు లుందురు యిట్టివానిగన నెందు।
జంటగ నితరులు జెపుచుండిన యది సత్యమయ్యె నేడిందు॥ 3౧.
చెప్పుచునిట్టుల బెత్తంబొక్కటి చేతిని దా బట్టగను।
మెప్పుగకృష్ణుడు పరుగిడ దొడగెను మెలగి యశోదయు నటను॥
వెనకనె బోవగ పట్టుబడకమరి విచిత్రముగ కృష్ణుండు।
అనువుగ పట్టునకగు పడునట్లుగ *నలత జూపిచను చుండు॥ 33.
గోపికలందగు కృష్ణుని పైనను కొండెములను జెప్పెదరు।
ప్రాపుగ నేడది తథ్యంబగునటు పరగజూడబడితనరు॥ 3౪.
అట్టితలంపుల నామెతలచగను యశోదకృష్ణుని బట్టెఁ।
దిట్టముతో నట వీధి వీధిగా తిరిగెను కొమరుని వెంటఁ॥ 3౫.

---

*అలత – బడలిక.

ఈమెతో గూడిరి యితర గోపికలు నిందరకును నగుపడకను।
వేమరుపరుగిడు సందు సందునను విచిత్రముగ జేయంగను॥ ౩౬.
యామద్వయమై చెలగెను నాడటుయమితయాష్టమునుకాగాను।
కోమలియగునా యశోద దేవియు కొడుకును బట్టనులేకను॥ ౩౭.
తొందర బొందుచు చెమటగారగను తొంగుచుండె పైకొంగు।
అందముతోగని కృష్ణుడు కరుణచె యటు లోబడె పట్టుటకు॥ ౩౮.
తల్లియునప్పుడు కొడుకును బటుకొని తనగృహమును తారాగను।
ప్రల్లదముగనే గోపకన్యలటు బహుంగా వచ్చిరి వేగను॥ ౩౯.
అనేకదినముల దొంగ నేడునా కగుపడెనని తల్లియును।
సునిశ్చితంబుగ కొమరుని రోలుకు సొరది గట్టెద ననుచును॥ ౪౦.
ఇదియె శిక్షయా యనుచును జెప్పుచు యేపున దెచ్చెనుత్రాడు।
సదమలుడగు హరి విని యీమాటల చనువున నేడ్చుచు నుండు॥
తాడునరోలుకు గట్టదొడంగెను తల్లి కృష్ణ బొజ్జయును।
వేడుకలలరగ బెత్తెడుతక్కువై వెలసెను త్రాడటుగాను॥ ౪౨.
వేరొక త్రాడును ముడి వేయుచు దా వేసరిల్లి కట్టగను।
చేరక నదియును బెత్తెడుతక్కువై చెలగియుండ గనుచును॥ ౪౩.
తన గృహ ముండెడి త్రాళ్ళ నన్నియును తాను దెచ్చి కట్టంగను।
అనువుగ నవియును బెత్తెడుతక్కువై యమరియుండ చూడంగను॥
ఇతరుల యిండ్లలో యుండెటి త్రాళ్ళను యెలమి దెచ్చి కట్టగను।
పదపడి యవియును బెత్తెడు తక్కువై పరికింపంబడె యటను॥ ౪౫.
గోకుల ముండిన త్రాళ్ళనన్ని నే గొనివచ్చితి యెటు బోదు।
ప్రాకటముగ దా కష్టము నొందగ భగవంతుడు కృపజెందు॥ ౪౬.
అటు వెనకను శ్రీ కృష్ణుడు ముడికిని యాకళింపబడియుండె।
పటుతరముగ నటు జూచుచు గోపికల్ పకపక నవ్విరి మెండె॥
కట్టబడగ కృష్ణుడు దీనునివలె కనపడె నటు తల్లికిని।
బెట్టిదముగ నే విడువ నెపుడు యని పెంపుగననె కృష్ణు గని॥ ౪౮.

ఇందుకు కృష్ణుడు నేడ్వగ తల్లియు నెలమి వెళ్ళి గృహమునను।
పంతముతోడను యింటికృత్యముల పరగ జేయుచుండెమును॥ ౪౯॥
ఈ చరిత్రమును ప్రేమా బాయికి నెలమి జెప్ప పుత్రుడును।
గోచర మయ్యెను కండ్లలో నీరను కుంఠితయై తల్లియును॥ ౫౦.
శ్యామల కృష్ణని యెవరు విడిచెదరు సారవిచారణ లేకయును।
కోమలబాలుని గట్టియశోదయు గుఱిగ తల్లిగాదుయను॥ ౫౧.
ఎనబోతగు నని నిట్టూర్పున దా నెలమి కొడుకును గనుచును।
ఘనసంసారము నీకయ్యెనె గావించితి నియ్యెడను॥ ౫౨.
గోకుల మునకును వెళ్ళియిప్పుడును గోవిందుని కట్లను నె।
శోకను విడిపించెదనని జెప్పుచు సొక్కి నుసురు విడిచినె॥ ౫౩.
పరమపదంబును బొందెననుచు తగ భక్తులందరు బొగడిరటు।
గరుడగమను పై చిత్తము నుంచుచు కళేబరమును విడిచెనటు॥
పరిమళతులసియు పుష్పముమేనుపై బొగుగురిసె నటుగాను।
గురుతర వింతను ప్రజలు జయ యనుచు గొనియాడిరి బహుగాను॥
సుతుడు నామెకును సంస్కారంబుల సుఖతరముగ దాజేసె।
పతితపావను నిభక్తుల రజసుగ బాలకృష్ణుడును వెలసె॥ ౫౬.

---

శి ళా బా యి చ రి త్ర.

ఉత్తరమధురా ప్రదేశములలో యుచితనగర మొకటుండు।
అత్తరి యొక నృపుకన్య శిలాబాయనుచు పేరువెలసుండు॥ ౧.
చిన్నవయస్సున తండ్రియు కన్యకు చెప్పించుటకై చదువు।
పన్నుగ నుంచెను పండితు నొక్కని ప్రజానాధు తనతావు॥ ౨.
*పరిపాటిని నతడుండగ నచ్చట ప్రతిదినంబునను నతడు।
వెఱవక సాలగ్రామపు పూజను విధితో జేయుచునుండు॥ ౩.
ఒక యెడ నరపతికన్యయు పూజను నుచితంబుగ జూచుచును।
అకలంకుండగు పంతుల నడిగెను యట్టి దేవుని తనకును॥ ౪.

---

*స్వాధ్యాయక్రమము.

సంపాదించియు తనకిమ్మనుచును చనువున నామెయు వేడుఁ గా।
పెంపారగ నాకన్యగుణంబుల ప్రియమున జూచుచు గురుడుఁ గా॥ ౫.
సున్నన యగునొక గుండురాతిని నూతనముగ దా దెచ్చి।
ఎన్ని కెగానది సాలగ్రామమని యెలమి నిచ్చెదా మెచ్చి॥ ౬.
దండము సలుపుచు రాజకన్యకయు తగుభక్తిని చే కొని యెఁ గా।
నిండుప్రేమతో పూజల నిత్యము నేమంబును గలదయ్యెఁ గా॥ ౭.
పంతులు యెట్టుల పూజజేయునో బాలికయటు లర్చించు।
వింతను మంత్రము లేకయుండినను విశ్వాసము దృఢముంచు॥ ౮.
ఆమెయు ప్రేమతో భక్తిని సలుపుట హరికిష్టంబై యుండెఁ గా।
వేమరకను యాగుండ్రాతిలో నా విష్ణుమూర్తి మెలగుండెఁ గా॥ ౯.
తల్లిదండ్రులిది పిల్లలాటయని తలచిరియటు తెలియకను।
సల్లలితంబుగ దినదినమునకును చక్కబెరిగె కన్యయును॥ ౧౦.
ప్రౌఢపర్వమటు వచ్చుసమయమున ప్రజానాథు కూతురిని।
వేడుకతోనొక రాజుకొడుకునకు వివాహమున నియ్యగని॥ ౧౧.
ఐదుదినంబులు నమిత విభవమున నాపెండ్లియు నటు జరుగు।
పాడుగనైదవ దినమున పుత్రిని పంపె శ్వశుర గృహమునకు॥ ౧౨.
దేవతార్చన పెట్టెను యెవరికి తెలియకుండ యామెయును।
భావశుద్ధితోనుంచియు తనకడ పతియింటికి చనుటయును॥ ౧౩.
ప్రథమ దినంబున దారిని దిగునెడ భక్తిని హారతి నిచ్చెఁ గా।
కుదురుగ దీనిం జూచి పెనిమిటియు కుటిల బుద్ధితో వెలసెఁ గా॥ ౧౪.
శిలాబాయికిని దెలియ నియ్యకను చేకొని పెట్టెను యతను।
విలాస మగునటు యందలి వస్తువుల్ వేరు వేరుగాతాను॥ ౧౫.
నదిలో మడుగున బార వేయుచును నయమున బల్కెను తనలో।
సతికి నుండు పరమార్థ యుపాధిని సరగున మాన్పితి నిలలో॥
మరుదిన మందును రాజ కన్యకయు మానుగ స్నానము జేసెఁ గా।
వెఱవక తానటు దేవ తార్చనను విధిని సలుప నటు జూచెఁ గా॥ ౧౭.

దేవుని పెట్టెను నచ్చట గానక దిగులొందుచు కన్యయును।
భావశుద్ధితో పూజ జేతునే భగవంతుండెటు చనెను॥ ౧౮.
సాలగ్రామము రానియెడలనే చక్క విడుతు ప్రాణములన్।
వీలుగ నిటులం జెప్పుచు నప్పుడు విష్ణుమూర్తి నయ్యెడలన్॥ ౧౯.
దలచుచు తనలో దేవదేవ హరి దయ జూడక నన్నిపుడు।
అలిగి వెళ్ళితివా యపచారంబులు నమిత మయ్యెనని నేడు॥ ౨౦.
నను విడనాడుచు నరిగితి వెచ్చట నరహరి కృష్ణా యనుచు।
అనువుగ కండ్లలొ నీరు దెచ్చుకొని యతి దుఃఖముతో మించు॥
అత్త మామలును నామె పెనిమిటియు ననేకముగ జెప్పినను।
పద్దుగ నామెయు నన్నపానముల భక్షింపక యుండుచును॥ ౨౨.
దేవతార్చనయు దొరకని యెడలను దివినిం జేరెద ననుచు।
భావశుద్ధితో నాలుగు దినములు బలువైరాగ్యము గొనుచు॥ ౨౩.
హరిపై భారము వేసి యుండగను నాతడు గురు రూపముతో।
ఇరవుగ స్వప్నము నందును వచ్చుచు నిచ్చె పెట్టెను గరిమెతో॥
శిలాబాయి యటు నిద్రనులేచియు చేతుల గనె పెట్టెయును।
విలసితముగనట నుదయముకా గనె వే స్నాన మొనర్చుచును॥
హరి యర్చన దా జేయుచు నుండగ నామె పెనిమిటియు జూచెన్।
వెఱగొందుచు యావస్తువు లన్నియు వెలపలకును యెటు వచ్చెన్॥
నదిలో నుండియు తీసిన వాడిటు నారాయణుడని తలచి।
కుదురుగ బొందెను యనుతాపంబును కుటిలంబుల తొలగించి॥ ౨౬.
సతిని గూడుకొని పతియు భక్తిలో చక్కగ నుండెను భువిని।
హితులగు వార్లకు, బాలకృష్ణుడును నిలను దాసు డగునుగని॥

---

## మండలీక రాజు చరిత్రము.

మండలీకు హిందూస్థానంబున మహిపాలుడై యుండు।
పండరి నాథుని భక్తిని వెలసిన భార్యయు నాతనికుండు॥ ౧.

సుశీల యగుచును హరి పూజల నటు సుఖతరముగ దా జేయు।
విశాల ప్రేమతో మత్స్య కచ్ఛప *విభ వరాహ నరహరియు॥ ౨.
వామన భార్గవ దశరథరామ వరకృష్ణావతారముల।
నేమముతో నాజయ న్తి దినముల నెమ్మిసలు పుత్సవముల॥ ౩.
ఏకాదశి వ్రత మింపుగ నుండును నెపుడును వైష్ణవ ప్రలెడను।
ప్రాకుడులేకను భక్తిని సలుపును భగవత్కీర్తన వినును। ౪.
సకలభూతముల కన్నము బెట్టును జపించుహరి నామమును।
ప్రక... నిటు సర్వకాలముల భార్యసలుపు చుండగను॥ ౫.
...మాటియు బహిరంగంబున హరిసర్వాత్ముని పూజకా।
నేమనిష్ఠలును నామజపంబులు నెవ్వియునేయడు రాజకా॥ ౬.
పురజనులందరు భక్తిహీనుడని భూపతి ననుచుండెదరు।
వెలువక భార్యను విష్ణుభక్తిలో వెలసినదని జెప్పెదరు॥ ౭.
జనులీవిధమున రాజుని నిందను సలుపుచు నెప్పుడునున్నకా।
దినము నతడు యీనిందను వినినను తెలుపడెపుడు కోపమునకా॥
ఒకదినమందును భార్యయు బలికెను నొప్పుగ పెనిమిటిగనుచు।
వీకటముగాకను విష్ణుపూజలో విహితుడవైయుం డనుచు॥ ౯.
ఇటులజెప్ప నృపవరుడనె చిత్తము యెపుడు విషయవాంఛగొను।
పటుతరభక్తిని సలుపలేననుచు బలికి మనసు లోపలను॥ ౧౦.
అపరిమితంబగు ప్రేమభక్తిగొని యహర్నిశము తానుండు।
నెపమునతానొక సంసారికుని నెఱెసమత్వమున నెగడు॥ ౧౧.
ప్రేమసరస్సున మునిగినవాడని పెంపున గనుగొన రెవరు।
నేమపూజలను వెలిజూపినయెడ నిష్ఠావంతుండందురు॥ ౧౨.
ఈ పరభక్తిని నతడు సలుపగను సెలమిభార్య యొకయెడను।
ప్రాపుగ వినియెను పెనిమిటి నిద్రలో బలుక రామా యనుచును॥
ఆమెయు వినుకొని ప్రేమానందము నత్యంతము నొందుచును।
క్షేమ మొసగునట నుదయముకాగనె చేసెను యుత్సవమటను॥

---

*విభ - తేజస్సు.

భగవత్కీర్తన విష్ణుపూజయును భాగవతారాధనము।
సొగసుగ సతియును జేయఁగ నృపుడును నూటిగగని యడుగుసుమ॥
ఉత్సవమెందుకు జేసెదవనగను నొప్పగ రాణియు బలుకు।
*ఉత్సేధంబుగ నీదునిద్రలో యో రామాయనెవాక్కు॥ ౧౬.
అతిముదమున నే వినుకొని యింటను హరియుత్సవమును జేతు।
పదపడి వినుకొని నృపుడు జెప్పె నటు పరుడగు రాముడు యిందు॥
దేహమునుండియు వెలపల వచ్చెను తిరముగ నీదేహమును।
మోహములేకను విడిచెదననుచును మొనసి విడిచె ప్రాణమును॥
అంతరనిష్ఠుండనుచును బలికిరి యటు వైష్ణవు లయ్యెడలన్।
సుందరి జూచుచు పతినిష్ఠను దా చొక్కి విడిచె ప్రాణములన్॥
హరిపద మిద్దరు నానందముతో నరమరకను బొందిరటు।
వెఱవక యెప్పుడు బాలకృష్ణుడును విహితదాసు వార్లకిటు॥ ౨౦.

---

## పి లా బా యి చ రి త్ర.

పిలాబాయి యను మంత్రికుమారిక ప్రీతిని హరిపూజించు।
మలాపహంబగు శ్రీహరినామము మానక నెప్పుడు జెపుచు॥ ౧.
పెనిమిటి యామెకు నంత్యమొందగను పితృగేహమును దూరెన్।
అనువుగతండ్రియు చనిపోవుటచే నన్నదమ్ములెడ జేరెన్॥ ౨.
బంధువులిద్దరు నొకచోనుండగ బహుళ కలహములుకాగన్।
సంధిజేయగను రెండుగ్రామముల్ సరివిభాగ మొందంగన్॥ 3.
విభక్తులగుచును నన్నదమ్ములును వేరువేరుగా నుండన్।
సుభగుడు గాకను తమ్ముడు సేనల చొప్పన గొనితాజాడన్॥ ౪.
అన్నయుండునా గ్రామము పైబడి యంతయు కొల్లంగొనియెన్।
పన్నుగ పిలాబాయ్ దేవతార్చనయు పరులహస్తమున బడియెన్॥
హరిపూజను దా నిత్యము సలుపుచు నన్నమతీను నా పిదపన్।
కరమరుదుగ తనదేవ తార్చనయు కనబడకుండగ నోపన్॥ ౬.

---

*ఉత్సేధము - ఔన్నత్యము.



రమాబాయి.    శాహురాజు.    శ్రీరాముడు.    వరహరిదాసు.

౨౦.10

తమ్మునియింటికి దేవతార్చనకై తవిలిమనుజు నంపగను।
సొమ్మసిల్లగను సేవకు వాక్యముల్ సూటిగవిని తమ్ముడును॥ ౭.
వెతికించెను తనయింటిని యంతయు విష్ణుదేవు పెట్టెకునై।
కుదురుగ నదియును ద్వారకనందునను కోరివచ్చినరు నకునై॥ ౮.
జెప్పిపంపెదా హరి విగ్రహమటు చిక్కలేదు తనకనుచు।
ఒప్పుగనామెయె వచ్చిచూచునెడ యుచితంబగునని యనుచు॥ ౯.
మనుజుడు వెళ్ళుచు సంగతిదెలుపగ మానిని చని శోధించెన్।
అనువుగ నెచటను విష్ణువిగ్రహము నగుపడనట్లుగ దెలిసెన్॥ ౧౦.
ఐదు దినంబులు నుపవాసంబుగ నన్న యింట తా నుండన్।
పాదుగ శ్రీహరి బ్రాహ్మణ రూపున భామిని కలలో జూడన్॥ ౧౧.
దేవతార్చనను దెచ్చి యియ్యగను, దెలిసికొనియు తమ్ముడును।
భావశుద్ధితో యను తాపంబును బహుగపొంది తనలోను॥ ౧౨.
అపరాధంబుల జేసితి ననుచును నన్నకు వినతుండయ్యెన్।
నెపమున దేవుని యర్చా మూర్తిని నిలపకనటు చెడుజేయన్॥ ౧౩.
భగవంతునకును తొందర నిచ్చితి బహుయపరాధిని యనుచు।
సుగమంబుగ యాబంధువు లిద్దరు సుఖతర సఖ్యు లునగుచు॥ ౧౪.
పిలాబాయి చే నను గ్రహంబును ప్రియతనొంది రిరువురును।
విలీనులగుచును సేవారతులై విష్ణుభక్తి సలుపగను॥ ౧౫.
హరిప్రత్యక్షంబగుచును ముగ్గుర నాదరించె నయ్యెడను।
పరభక్తులకును దాస దాసుడగు బాలకృష్ణుడియ్యెలను॥ ౧౬.

---

## రమాబాయి చరిత్ర.

సంతరాజుయను భూపతి యొక్కడు సారసాత్త్వు భక్తుండౌ।
పంతము తోడను భాగవతుల యెడ పటుతర భక్తిపరుండౌ॥ ౧.
రమాబాయియను కన్యక యతనికి రమ్యాంబలరగ నుండు।
సమాన వయసున సమన్నృపు సుతుతో సలిపెను పెండ్లినియతడు॥

కన్యకు పెనిమిటి యభక్తుడగుచును కలను హరిని దలచడటు।
అన్యులునగునా వరుని బంధువు లభక్త నిపుణు లయ్యిరటు॥ 3.
విషయాంధత్వము పరిపూర్ణంబై వెలసియుండు జను లెడను।
సుషమ సచివులును రమాబాయికిని చొప్పడకుండి రయ్యెడను॥ ౪.
అభక్త సంగము దొరికెను యనుచును నతి చింతను దా బొందు।
సుభగుడు తండ్రిది నెపము గాదు నా పూరది కర్మయని కుందు॥ ౫.
బహుకాలంబుగ యిటులం జరుగగ భామిని గర్భిణి యయ్యెన్।
ఇహమున పుత్రుడు బుట్టె నామెకును యీప్సిత మందర కయ్యెన్॥
అఖిలైశ్వర్యము నామెకు గలగియు నతి చింతను బొందుచును।
సఖుడగు హరినిం బ్రార్థన జేయును సదమల గోవిందయను॥ ౬.
నీపద పద్మము హృదయము నందును నెనరున ధ్యానము జేతు।
ప్రాపకమీవె శ్రీహరి రంగా పరులు యెవరు లేరిందు॥ ౯.
ప్రత్యయ మొక్కటి యభక్త జనులకు బాగుగ జూపుచు నీవు।
వ్యత్యయ గుణముల మాన్పెద వెపుడో వరద రంగ నీ నెళవు॥
ఇట్టి యిచ్ఛ దా నుంచుచు మదిలో యెలమి దినము జరుపగను।
ఎట్టకేలకును హరివాసరమగు యేకాదశి రాగాను॥ ౧౦.
పశువును చంపియు మాంసభక్షణము బాగుగ చేయందలచి।
కుశలబుద్ధియును లేని యామెపతి కోరియు మేకను దెచ్చి॥ ౧౧.
కోయవలెను యని యత్నింపంగను కూడదనుచు రమబాయి।
నాయక, శ్రీహరి వ్రతదినమగు నిది నరకంబున కిరవయ్యి॥ ౧౨.
గురుతును జెప్పియు దయగొనకాతడు కొట్టిచంపెనటు మేకన్।
సరిపడ కుండను రమాబాయికది నెఱివ్యసనము నొందెతగన్॥
మనుష్యు నొక్కని యామెయు బిలిచియు మానుగ నతనితో జెప్పు।
పునిత సాధువులు పట్టణమందును పొడసూపెదరో గని చెప్పు॥ ౧౪.
ఆతండటులనె పోయి చూడగను హరిదాసుల దా గనియెన్।
పాదుగ తిరిగియు వచ్చియామెతో భక్తులగాంచితి ననియెన్॥ ౧౫.

ఇదివిని యామెయు శిశువునకు విషము యేపుగ నిచ్చెను యపుడు
పదపడి తొట్లను పరుండ బెట్టగ బాలున కుసురు చనుచుండు॥ ౧౬.
ఇంటిజనంబులు నతివ్యాకులత నేడ్చిరి యటు బహుగాను।
కంటిని నీరును తేకుండెను యా కాంతామణి వెలిగాను॥ ౧౭.
శ్రీహరిస్మరణను జేయుచుండగను చెప్పెనృపతి యామెకును।
బాహ్యంబగు కఠినచిత్తమగు బాలునకై యేడ్వవను॥ ౧౮.
పురుషుని గాంచుచు భార్యయు బల్కెను పుటుకనొందు మేనుయిది।
అరయగ నాశనమొందును మాయా యాడంబర మగునుయిది॥
శ్రీహరి తనకృప చూపినయెడలను చెందవువిఘ్నము లెవిని।
మాహాత్ములు హరిదాసులు నిచటికి మానుగవచ్చెద రేని॥ ౨౦.
వారల చరణ క్షాళనతీర్థము వలసియు శిశువున కిడగన్।
ధీరుడై లేచును సంశయమిందుకు తే వలవదు యిటు యనగన్॥ ౨౧.
ఇదివిని నృపుడనె హరిదాసులు మరి యెచటుండెదరని యడుగన్।
పదపడి యామెయు దేవునిగుడిలో భక్తులు దిగిరన వినగన్॥ ౨౨.
అతివిస్మితుడై యాతడుసాధుల నతిభక్తిని దా బిలిచి।
హితుడై సద్భావముచే వారల యేపునపూజల జేసి॥ ౨౩.
చరణామృతమును తానుచేకొనియు చంటిబిడ్డ కిడగాను।
తిరిగియు ప్రాణము వచ్చిశిశువునకు తెలివినుండం గనుచును॥ ౨౪.
అపూర్వమగు యీ చమత్కారమును నవనీ పతియటు జూచి।
అపారమగు దుర్గుణముల విడుచుచు హరిభక్తిని దా వెలసి ॥ ౨౫.
హరిపూజయు హరిదాసుల సేవయు నద్భుతముగ దా జేసెన్।
గురుతుగ వారల కథలను బాలుడు కొనియాడుచు నిటు వెలసెన్॥

---

## రామరాజు చరిత్ర.

రామోపాసకు డగుచు నృపుడొకడు రామరాజు యనియుండెన్।
ప్రేమానందము గాంచుచునెప్పుడు ప్రియుడై జనులకునుండెన్॥

దశరథరాముని నామము నెప్పుడు తలచుచు చెప్పుచునుండు।
విశదంబగు నటు రామప్రతాపము విశేషముగ వినుచుండు॥ ౨.
సీతాహరణపు కథాభాగమును సేమము గాదని వినడు।
వాతాహతమై మనసు వినుటచే వ్యాకూలముగా నుండు॥ 3.
రాజపండితుడు దీనిందెలిసియు రమించదది నృపునకని।
ఓజనునాతడు నాకథ విడుచుచు నొనరజెప్పు నితరమని॥ ౪.
బహుదినములునిటు జరుగగ నొకయెడ పండితు జ్వరమున వెలసెన్।
విహిత కుమారుని పురాణమును నటు విధితో చెప్పం బనిచెన్॥ ౫.
సీతాహరణము మాత్రము నృపునకు చెప్పకుమని తండ్రియనన్।
ఆతీరుగ నే జేసెద ననిసుతు డవనీపతి సన్నిధినన్॥ ౬.
వచ్చుచు గ్రంధము రామాయణమును వరుసను కథనుదొడంగు।
అచ్చముగా తన తండ్రిజెప్పినది యతనికిమరుపై చెలగు॥ ౭.
సీతారాముడు పంచవటీలో చేరియుండగను నచటన్।
పాదపములయెడ కాంచనమృగమై బరతెంచెను దైత్యుడటన్॥ ౮.
మైథిలి యదిగని రాముని జూచుచు మహి సుందర మృగమదియు।
ఆదరముగ నిట దానిందెమ్మని యడుగగ రాముడు వినియు॥ ౯.
బంగరుమృగమును బట్టుటకొఱకై బహుదూరము తా బోవన్।
అంగజ జనకుడు దానింజంపగ హాలక్ష్మణ యనిచావన్॥ ౧౦.
సీత, లక్ష్మణుని రాముని కడకును చేరదోలి యచటుండన్।
నీతిదప్పి రావణు యతిరూపున నిలిచెను నటు సీతకడన్॥ ౧౧.
ఉపచారంబుల జేయగ సీతను నొగిరావణు గొని చనియెన్।
నెపములేక యీకథను రాజు విని నెఱియావేశము గొనియెన్॥
సకలసైన్యముల సిద్ధపరచుకొని శస్త్రాస్త్రంబుల తోడన్।
ప్రకటంబుగ నా రావణు జంపను బైలుదేరె నా జాడన్॥ ౧౩.
సీతను లంకకు రావణాసురుడు చేకొనిపోయెను యనుచు।
ప్రీతిగ నుదధీ తీరము వచ్చెను పెనగి రావణు వధకనుచు॥ ౧౪.

జలములందు నృపు ప్రవేశింపగను శాజఙాపాణి లన సలీతో।
నిలవరముగ తనరూపుజూపి మరి నిలిచిబలికె నా నృపుతో॥ ౧౫.
ఈసీతను యారావణు డప్పుడు యేపునకైకొని చనిరెు।
వేసారకనే వానిజంపి యిటు వెలసితి సీతతో ననిరెు॥ ౧౬.
శ్రీరఘుపతి యీ వాక్యముజెప్పగ చిత్తము నెమ్మది గాను।
సారతరంబగు భక్తిని సలుపుచు సముద్రమును విడుచుచును॥ ౧౭
జానకి జీవను పూజజేసియటు చనియెను తన గృహమునకు।
మానుగ దాసుల దాసదాసుడీ మహిని బాలకృష్ణుడగు॥ ౧౮.

---

నరహరిదాసు చరిత్ర.

ఒడియా శ్రీజగన్నాథము నందున నుండె నరహరి దాసుడు।
ఉడుగని భక్తితో శ్రీహరి స్మరణను నొనరగ జేయుచు నెగడు॥ ౧.
హరి యవతారపు వేషములన్నియు నతీ నిపుణంబుగ వేయు।
గురుతుగ శ్రీహరి సాక్షాత్కారము కూర్మిని యందంజేయు॥ ౨.
వాద్యనృత్య సంగీతంబులు నటు వరుసతోడ నుంచుకొను।
సాధ్యమైన తనవిద్య నిపుణతను జనులకు జూపునుమున్ను॥ 3.
భగవద్భక్తిని కలిగించుటచే ప్రజలు వచ్చి జూతురటు।
సొగసుగ యిటులనె బహుకాలంబును నూటిగ జరుపుచు నుండు॥
శ్రీనరసింహుని జన్మ వేషమును చేకొనె నరహరి యొకచో।
ఈనిక స్తంభము వెడలి వచ్చుచును హిరణ్య వేషుని యచ్చో॥
చుపి వేయుచును పేగుల నన్నియు సరగ మెడను వేసికొనె।
పెంపుగ బుట్టెను హాహాకారము పెద్ద యనర్థ మయ్యటనె॥ ౬.
ఆప్తులు కొందరు ప్రేత పక్షమున నవనీపతి కెరిగించఁ।
ప్రాప్తం బగునది లభించె ననుచును ప్రభువు జెప్పి యటు వరుసఁ॥౭.
ప్రేతంబునకును సంస్కారంబుల ప్రియులు మీరు జేయుచును।
నీతిని నాకడ వచ్చిన యెడలను నేను విచారించెదను॥ ౮.

ఈ పలుకుల వీని వారలు సలిపిరి యెలమిక్రియలు ప్రేతకును।
ప్రాపుగ తిరిగియు నృపుకడ రాగను ప్రభువు జెప్పె వార్తకును॥ ౯.
విశదంబుగ శ్రీ రామ నాటకము వేయింపుచు నందునను।
దశరథు వేషము నరహరికిని యటు తప్పగ వేయించుమను॥ ౧౦
ఆజ్ఞ ప్రకారము రామనాటకము నటవేసిరి యొక దినము।
ప్రాజ్ఞతో నచ్చట గీత వాద్యముల ప్రజలును బెట్టిరి ఘనము॥ ౧౧.
హరిదాసులు నటు కీర్తన జేయుచు నతి మధురపు రామకథన్।
గురుతుగ బాడిరి యయోధ్యకాండను కూడినజనుల్ ముదమొందన్॥
దశరథు వద్దను కైకయి జెప్పెను తనకొసగిన వరములను।
విశదంబుగ నిపుడిమ్మని, రాజ్యము వెలయంగ భరతునకును॥ ౧౩.
వనవాసంబును రామున కనుచును వరముల రెండిమ్మనగన్।
ఘనమగు చింతతో దశరథు డనియెను కలిగిన రాజ్యంబుదగన్॥
భరతున కుండని, రాముడు మాత్రము పురమునుండ జేయుమన।
తిరముగ నామెయు సమ్మతింపనని దెలుపుటయు రాముడు విన॥
భార్యయు తమ్ముడు తాను గూడుకొని భక్తి మ్రొక్కి తండ్రికిని।
ఆర్యులు మెచ్చగ వనవాసంబును నందపు గన వెళ్ళగని॥ ౧౯.
శోకము నొందెను దశరథు వేషుడు నూటిగ ధరపై బడుచు।
ప్రాకటముగ శ్రీరాముడు నాకును ప్రాణ భూతుడగు ననుచు॥౧౭.
రామచంద్రు నా యాత్మ రూపుడగు రాముడం తర్జ్యోతియగు।
రాముడె తల్లియు తండ్రి యగునుమరి రాముడె విశ్రాంతియగు॥
కైకయి మాటచె రాముడు వెళ్ళెను కాననమునకును నేడు।
జోకతో నా తండెప్పుడు మళ్ళునో నూటి దెలియ దనుచుండు॥
ప్రాణాధారుడు వెళ్ళిన వెనకను ప్రాణముంచు టెందుకను।
దీనానాధుని దలచి వేషకుడు దిగవిడిచెను ప్రాణమును॥ ౨౦.
జనులందరు నటు జూచుచు నుండగ శ్వాసము లేక పడుండెన్।
అనువుగ బహుళోపచారముల నుంచియును నతని యుసురు రాకుండెన్॥

శ్రీరఘురాముని దలచుచు ముక్తిని జెందెన నిరి జనులటను।
వారల దాసుడు బాలకృష్ణుడును వందన మిడు నెప్పుడును॥ ౨౨.

---

ఓ గ రా సు చ రి త్ర ము.

వైశ్యకులంబున ఓగరాసుడను వైష్ణవ భక్తియుతుండు।
నైశ్వరమనుచును దేహ సంతతుల నాతడు దలచక యుండు॥ ౧.
హరి భజనను తా నిరతుండయ్యెను నసత్యమును బలుకకను।
గురుతుగ భార్యయు పతికిని హితముగ కోరి గొలుచు సాధులను॥
హరి సర్వాత్మకు డన్ని భూతముల నమరియుండునని దలచు।
నరహరి కృష్ణా యచ్యుత రంగా నారాయణ హరి యనుచు॥ ౩.
అన్నవస్త్రముల కాపద గలిగిన నలసత్వము విడువకను।
పన్నగ నాతడు పదుగురు జనులకు భక్షణ మిడు దినమును॥ ౪.
సదమల వృత్తిని సుకృతపు సంపద చక్కగ గలిగె నిరువురకు।
కుదురుగ శ్రీహరి శోధించుటకై కోరివచ్చె గృహమునకు॥ ౫.
సాదురూపమున నంగణమందును చక్కగ తా నిలుచుండి।
పాదుగ భార్యను జూచి యడిగె దా పతియెటు చనె దెలుపండి॥
ఇదివిని యామెయు నంగడి వీధికి నేగెను పతియని జెప్పి।
అతిథియు కూర్చొ నాసన మియ్యగ నాతం డటులనె యొప్పి॥ ౭.
సతిని జూచి హరి బలికె నప్పుడటు చాలాక్షుధ జెందితిని।
పదుగురు జెప్పిరి నీదు కీర్తి నిటు భక్షణ కన్న మిడుదువని॥ ౮.
వంట జేసి తగ నన్నము బెట్టుము వనితరో తల్లీ యనగన్।
వెంటనె నామెయు కుండల జూడగ వెలయు ధాన్య మటు లేకన్॥
ఏమియు దోచక యప్పుడు తనలో యేర్పడి యాలోచించు।
స్వామి రూపుడౌ నితి డుపవాసము సలుపుట హానిగ తలచు॥౧౦.
వరహా తూనికె ముక్కు పోగునటు వరుసను నంగడి నమ్మి।
వెఱపక నందుకు సామగ్రిని యటు వేగమె దెచ్చెను నమ్మి॥ ౧౧.

సాదుని బిలిచెను పాకము జేసియు సరసాన్నము వడ్డించి।
ఆదరముగ నటు పదార్థములతో నల భక్షణ జేయించి॥ ౧౨.
మిగుల ప్రీతినిం జూపగ నప్పుడు మించిన ముద మొందుచును।
అగణిత గుణుడగు హరియును బల్కెను యతి తృప్తి నొందితినను॥
బహుక్షుధ చేతను పూర్తిగ నన్నము భక్షించితి నేననుచు।
విహితుడై దొంతి యింటి కుండలో వెళ్ళియు తన కరముంచు॥
దీనిలో ద్రవ్యము బహుగా నుండును తీసికొనుము వలసినను।
మానుగ సాధుల ఖర్చు కొరకునై మహోపకారంబగును॥ ౧౪.
ఈవిధ వార్తల శ్రీహరి జెప్పియు నేగె నదృశ్యుండగుచు।
భావశుద్ధియును బొంది గృహిణియును భక్షణకును లేదనుచు॥ ౧౫.
ఒనరగ క్లేశము నొందక యతిథికి యుపచారము జరిగెనని।
ఘనమోదంబున నుండగ నప్పుడో గరాసుడింటి కరుగగని॥ ౧౬.
జరిగిన సంగతి భార్యయు జెప్పుచు చక్కనుండె పనిలోను।
దురుసుగ నీతడు వినియు వింతతో దురాశ తనకెందుకను॥ ౧౭.
ఈశుని భక్తిచే నిరపేక్షుండై యితర సొమ్ము వలదుయను।
పేశలముగ నుండుచు యా బానను పెనగియు ముట్టడు తాను॥
ఒకయెడ యింటికి ననేక సాధుపు లుచితంబుగ రాగాను।
ప్రకటంబయ్యెను ధాన్యము లేదని భక్షణ వారి కెట్లుయను॥ ౨౦.
కుండవద్ద తా వెళ్ళిచూడగను గురితోగనె వరహాలన్।
మెండుగ మోదము నొందుచు సాధుల మేలుపూజ విలసిల్లన్॥
అతడు సతిని గని వింతతో నతిథియు హస్తమిడిన భాండమునన్।
కుదురుగ మొహారీల్ నిండియున్నవటు గోవిందుని కార్యమనన్॥
హరిదాసుండై వచ్చిన యాతడు హరి సర్వేశ్వరు డగును।
గురుతుగ నిదియును చేష్టయతని దని గొనకుంటివి మనసునను॥
నీకేయాతడు ముందు దర్శనము నెనరున యిచ్చెను యనుచు।
సాకారంబగు హరి రూపును నే చక్కజూతు నెపుడనుచు॥ ౨౪.

ప్రియ భావంబున కన్నీరొలుకగ పెంపుగ నుతులను జేయు।
జయజయ రంగా గోకులవాసా జానకి జీవన యనియు॥ ౨౫.
ఒక్కఁడ వయ్యును మూఁడు లోకముల నొనరవ్యాప కుఁడవగుచు।
అక్కర బడగనె భక్తుల కొఱకై యవతారంబుల గొనుచు॥ ౨౬.
భక్తులరక్షణ బహుజేసితీవటు పరమ దయాళో యనియు।
సక్తిగాను నీ సగుణ రూపమును చక్కఁజూపుమన వినియు॥ ౨౭.
ప్రకటం బయ్యెను శ్రీహరి యప్పుడు బాహుచతుష్టయ ములతో।
ముకుట మేఖలము కుండలహారము ముద్దుముఖము చిరునవుతో॥
పీతాంబరమును వైజయంతియును పెంపుశోభయగు చుండన్।
వాతాంబరమున దర్శన మియ్యగ వందన మిడె భక్తుడటన్॥
హరి యంతర్ధానము నొందనొగరు డన్న దానమును జేసెన్।
చిరతర భక్తియు జూపి బాలునకు చింతదీర్చునటు వెలసెన్॥ ౩౦.

## హరియానందు చరిత్రము.

హరి యానందుడు రామానందుని యంచిత శిష్యుండగును।
చిరతరముగ శ్రీహరి భజనను తా చెందియుండు బహుగాను॥ ౧.
చరా చరంబుల నాత్మ రూపముగ చక్కఁగ దలచుచు నుండు।
నిరాశ యుక్తుడై యర్చన పూజల నిర్వహించి తగనుండు॥ ౨.
అనేకజనులను భక్తిమార్గమున నాతడు ద్రిప్పెను యటను।
పునీతు లగుచును శిష్యులునాతని పుణ్యసేవ నుండుచును॥ ౩.
ప్రతిదిన మొక్కఁడు భిక్షాటనకై బాజారునకును వెళ్ళ।
విదితంబుగ నటు సేరు పిండినిఁక వీలుగ దెచ్చును యిల్లు॥ ౪.
శ్రీహరి కృపగొని సేరుపిండిచే చేయించును వంటయును।
బాహుళ్యంబుగ నూరుసంఖ్య గల బాపల కిడు నన్నమును॥ ౫.
బహుదినములు చన రామానందుడు పరమాచార్యుడు ఘనుడు।
విహరించుచు శిష్యులతో నొకచో వేంచేసెను యటనాడు॥ ౬.

హరియానందుని శిష్యుడు భిక్షకై యటు దాతిరుగుచు నుండఁ।
గురుని గురుండగు రామానందుని కూర్మినిగని దండమిడఁ॥ ౭.
రామానందుడు గురుని సేవలో రతినిగొంటివీ వనుచు।
వేమారక యిటు యల్పాయువుచే వెలసితి వీవని జెపుచు॥ ౮.
రేపటికడ మూడవ జామునకును రీతిగమృతి నొందెదవు।
ఏపున నిదివిని చింతనొందుచును నేతెంచెను గురుతెరువు॥ ౯.
పరమాచార్యుడు జెప్పు సంగతిని గురువరునకు నెరిగించు।
చిర తరముగనే గురుసేవను తగచేయగనైతిని హెచ్చు॥ ౧౦.
ఆయువు కొంచమై యమరి నందునను నతిచింతను బొందితిని।
ధీయుతుడగు నీ చరణములే మరి దిక్కగునని జెప్పవిని॥ ౧౧.
గురుడు శిష్యునింగాంచుచు పలికెను గోవిందుని తగు కృపను।
వెఱపున కాలుడు తనదు చేష్టలను విధింప నేరడు తగను॥ ౧౨.
చింతను నీవును బొందుటెందు కని చెప్పుచు మరుదినమునను।
పంతము తోడను స్నానము జేసియు భగవత్పూజ సలుపును॥
శ్రీహరి సన్నిధి కెదురుగ నాతడు శిష్యుని యుండంజేసి।
సాహసముగ తా ధ్యానము నందును సర్వేశ్వరు చింతించి॥ ౧౪.
శ్యామల సుందర సుకుమారుని వలె చతుర్భుజంబుల తోను।
కోమల తులసీ హారనూపుర కుండల యుక్తుని గాను॥ ౧౫.
కరయుగ్మంబుల శంఖ చక్రమును కౌస్తుభమును నిగుడంగ।
గురుతర దీప్తిని తేజరిల్లునటు కోరియు భావించంగ॥ ౧౬.
తనుమన వాక్కులు నేక భావమున తదాకారమై యుండఁ।
అనువుగ శ్రీహరి వెలినింగను పడె నట్టిరూపమున జూడఁ॥ ౧౭.
ఆసమయంబున కాలుని దూతలు నాశిష్యుని గొనరాగఁ।
వేసరిల్లకను హరిచక్రంబటు విసరుచు చుట్టుందిరుగఁ॥ ౧౮.
సమీప మునకును వార లరుగుటకు జాముపరకు గనుచుండి।
ప్రమేయ మెద్దియు దోచక పిదపను పరుగులిడిరి యటనుండి॥ ౧౯,

శిష్యుండప్పుడు గురుని గాంచుచును జెప్పెమృత్యు వెళ్ళనని।
వశ్యం బగుచును శ్రీహరి చక్రము వారించెను కాలుగని॥ ౨౦.
అస్తమయంబగు సమయం బయ్యెను హరి పూజను చేయవలె।
స్వస్థ మనసుతో సావధుండవై సరగున లేచుట మేలే॥ ౨౧.
అనుచు జెప్పగను దేహభావమును నాచార్యుడు బొందగను।
ఘనమగు ప్రీతిని గురుచరణంబుల గట్టిగనిడె శిష్యుడును॥ ౨౨.
మరుదిన మందును బోలెనంచుకొని మధుకర మునకును బోవఁ।
పరమ గురుండగు రామానందుడు పారజూచి యాత్రోవఁ॥ ౨౩.
పరమ భక్తుడగు శిష్య శిష్యునిఁ భావబంధమున బిలిచి।
సరసతో కాలుని గెలిచితి వెటులన, సంగతి దెలిపెను నిలిచి॥
అంకెగ సంగతి రామా నందుడు యట్టె వినుకొని సొక్కి।
బింకము లేకను హరియానందుని ప్రియమగు నాశ్రమ మునకు॥
పాదచారియై రాగనె శిష్యుడు భక్తిని దండము బెట్టెఁ।
సాధుజనులలో శ్రేష్ఠుడ వీవని సద్గురువటు కొనియాడెఁ॥ ౨౬.
యోగధారణా శక్తిని కాలుని యొక సమయము వంచింతు।
బాగుగ నదియును పరుల విషయమై పనిబడదని నేదలతు॥ ౨౭.
హరి యానందుడు గురుని గాంచుచును నాచార్యుని కృపయనుచు।
వెఱవకవందన మొసగగ పదెపదే, విహితు గురుడు వచియించు॥
యోగము కన్నను సగుణభక్తియే యుత్తమ మగునని జెప్పి।
సాగర శయనుని కృపయుదియనియునుచనెను గురుండును యొప్పి॥
హరియానందుం డమితభక్తిచే యవనిని వెలయుచు నుండెఁ।
నిరతము నతనికి బాలకృష్ణుడును నెఱిదాసుండై నిగుడెఁ॥ 3౦.

---

## రామచంద్రభటు చరిత్రము.

అమళాళంబను గ్రామం బుండెను యవని తపతి తీరమున।
విమలుడు విప్రుడు రామచంద్రుడని విఖ్యాతుండయ్యె విన॥ ౧.

వేదశాస్త్రములనై పుణ్యుండును విష్ణుభక్తి ధురీణుడును।
సాదరముగ తా భిక్షాటనచే సలుపు తగు జీవనమును॥ ౩.

దురాశ రహితుం డగ్నిహోత్రమును దూరసుగ జేయుచునుండు।
ఉత్క్రియ శూన్యుడై యవనీపతికిని యుపాధ్యాయుడై యుండు॥
రాజ సదనమున కెప్పుడు బోవడు రమ్యముకాదని తలచు।
పూజితయగు నారాజ కాంతయు పొందుగ తనలో దలచు॥ ౪.

అపేక్ష రహితుడు యుపాధ్యాయునకు నరసి ద్రవ్య మియ్యావలెన్।
కృపా విశేషము జూపి యతని సతిన్ క్రియతో బిలుచుచు మెల్లన్॥
తనపైయుండిన భూషణంబులను తప్పక నామె కిడుటయు।
వినయము తోడను దండము బెట్టెను విహితత చేకొనుమనియు॥

ఉపాధ్యాయుసతి యింటికి వచ్చెను సుచితభూష ములతోడన్।
అపార దుఖఃము నొందెనుభర్తయు యామెను కనులను జూడన్॥
ఎందుకు దెచ్చితి వీయుపాధిని యింటికి నాయెడ యిందు।
అంతరించుగద శ్రీహరి పదమును యవనిని కొరగాకెందు॥ ౮.

పురుషుని వాక్యమువినుకొనియామెయు భూషణములదిగ విడిచెన్।
వెఱవక వాటిని నగ్నికుండమటు వేల్చగ తాబడ వేసెన్॥ ౯.

నిరుపాధికమై యుండంగని పతి నెనరున సంతోషించు।
సరగున దీనినెవ్వరో జెప్పిరి సార్వభౌము నింగనుచు॥ ౧౦.

కులగురు వద్దకురాజు వచ్చుచును కోర్కెలలరదా నడుగు।
విలసితముగ నీకిచ్చిన నగలను వీలుగ నివిశ్రటు నాకు॥ ౧౧.

దీనింగాంచుచు రామచంద్ర భటు ధీ తొందర బొందుచును।
ధ్యానంబున శ్రీయజ్ఞమూర్తినిం దలచుచు ప్రార్థించగను॥ ౧౨.

సకల భూషలును చక్కవచ్చెనటు జాజ్వల్యపు కాంతులతో।
ప్రకటంబుగ నా రాజుక్రింద బడి, పదము ప్రెముక్కె వినయముతో॥
కులగురు జెప్పెను యలంకారముల కొనబొమ్మని తగ ననగన్।
ఇలపతి జెప్పెను మళ్ళియు గైకొన నిచ్చిన ద్రవ్యము వెలిగన్॥ ౧౪.

చమత్కారమును చూడవలయుననిన లిఖితి యుక్తి యనియునిల।
కొమరున జెప్పగ రామచంద్ర భటు కూడబిలిచి యాచకుల॥ ౧౮.
పంచి పెట్టుచును నిరపేక్షను దా భగవద్భక్తిని నిగుడెన్।
అంచితముగ నిటు బాలకృష్ణుడును హరిదాస దాసై యుండెన్॥

---

సుహాగళా చరిత్రము.

అముదాబాదలో సుహాగళాయను హరిభక్తుడు తగనుండెన్।
సమదృష్టిని తా బొందుచు నెచ్చట సర్వేశుని గనుచుండెన్॥ ౧.
జాతిలో నాతడు హీజడా యనబడు స్త్రీరూపియై యుండు।
పాడుగ నెప్పుడు హృదయ సంపుటిని పండరిపతి గనుచుండు॥ ౨.
చతుర్భుజ శ్యామళ సుందర తనువును శంఖచక్ర ధారినిగా।
అతులితమంగళ దివ్య మూర్తియగు హరినిం దనలో గనగా॥ ౩.
ఆతని నామము నోటను జెప్పుచు నందరి యందున నొకడే।
సాదరముగ తా నిండియుండునని చక్కగ జూచుచు నుండే॥ ౪.
స్వజాతీ వారలు పురమున దిరుగగ చన డీతడు వారలతో।
సుశీలు డగుచును యింట నుండుచును సుస్థిరమగు మతితో॥ ౫.
నామస్మరణను యేకాగ్రంబుగ నచ్చిక జేయుచునుండు।
కామ మదాది వికారము లెల్లను ఖండన పరచునుండు॥ ౬.
చేతులతో దా జేసెడి పనులును శ్రీహరి కొఱకై సెగడు।
మేదిని యతనికి రమాకాంతుడును మేలు దర్శన మిచుచుండు॥ ౭.
బహుకాలం బిటు జరుగుచు నుండగ పరమ కఠిన మగు కరువు।
సహజముగా నా దేశము నందును సంభవ మాయెను తెరువు॥ ౮.
అన్నము దొరకక యనేక జీవులు యట్టె యుసురు విడుచుచును।
ఎన్నడగును యా మేఘవృష్టియని యెదురు జూచుచుండగను॥ ౯.
ఆదేశంబున కధిపతి యప్పుడు ననుష్ఠానము చేయించెన్।
పాడుగనచ్చట వాన బడుటకై ప్రభు యుపవాసుడై వెలసెన్॥ ౧౦.

ఏడుదినంబులు నుపవసించగను యెలమిని స్వప్నమునందు।
నీటుగ యొక్కఁడు వచ్చియు జెప్పెను నిజభక్తుడు తగనిందు॥ ౧౧.
హిజడా జాతిలో సుహాగశాయని యెలమినుండు నిటుగాను।
నిజమున నీవును నతని శరణమును నెనరున జొచ్చిన యెడను॥
దేవుండందుకు సంతోషింపుచు దీర్ఘ వర్షము గురియించు।
నీవు నహాంతను నుంచిన యెడలను నిలకడ నొందవు యనుచు॥
ఈవిధ స్వప్నము నాతడు గానగ నెలమి లేచి మరునాడు।
దేవుడు చెప్పిన సంగతి యనుచును దెలిపె మంత్రులకు నాడు॥౧౪.
అతికఠినంబగు దుష్కాలముచే నమిత జనులు శ్రమ జెందఁగ।
హితమును జేయుట యుక్తంబని వారెరిగించిరి యిరవొందఁగ॥
పరివారముతో హిజడా యింటికి బరతెంచెను యధికారి।
విరళముగానీ స్వప్న సంగతిని విశదపరచి యటమీరి॥ ౧౬.
సుహాగశభక్తునకును దండం బిడె నూటిగ నధికారుండు।
బహు అనుతాపము బొందుచు సుహాగశ భగవంతునితో నపుడు॥
ఈయుపాధి నాకెందు కుంచితివి యీశద యాళ్లోయనుచు।
బాయని లక్షణ హీన వృత్తితో బహునీచ జాతి నగచు॥ ౧౮.
ఏసుగుణంబును లేకయుండగను యెటు కృప చేసెద విపుడు।
వాసిగ జెప్పియు నంగణ మరుగుచు వర్షణముకై దివి జూడు॥౧౯.
మేఘము దివియం దుండుట గానక మిగుల దుఃఖ మొందుచును।
ఆఘాత్యము విడి కనుల మూసికొని హరిమూర్తిని తనలోను॥ ౨౦.
భావింపుచు మరి పలికెను తానటు భక్తవత్సలా రంగ।
గోవిందా శ్రీ యనాథనాథా గోపీవస్త్రా భంగ॥ ౨౧.
భహుభంగుల నీ ప్రకారముగ దా భగవద్ధ్యానము జేసినను।
విహాగారూఢుని కరుణ నొందకను విలపించుచు నటుగాను॥ ౨౨.
ఇకపై నే నీమీది ప్రేమ నిట నిఁలో విడిచెద ననుచు।
ప్రకటంబుగ తన ముక్కు నత్తును పై నుండియు దిగవిడుచు॥ ౨౩.

కంకణముల దాపగల గొట్టుపుటకు ఘట్టిగయత్నింపంగఁ।
పొంకము తోడను వర్షముకమ్మెను పూర్తి మేఘములు వెలుగఁ॥
చాలుచాలునను వర్షము గురియగ జయహరి యందురు భక్తిఁ।
వాలుగనిట్టుల నహోరాత్రములు వర్షముగురియ గరక్తిఁ॥ ౨౪.
అధికారుండును తిరిగి దండమిడి యడుగుము యేదైనాను।
పదపడి సుహాగశ ప్రత్యుత్తర ముగ భగవత్కృప నాకిటను॥ ౨౬.
కొఱతలెవ్వియ్యను లేకుండంగను కోరుటేమి తగుమిమును।
ఉఱుస్వప్నంబును నీకుదెల్పి హరి యుపాధి కలిగించె విను॥ ౨౭.
జనుల బాధనే బొందలేనుయిక శరీరమిటువిడిచెదను।
అనువుగ గుంటను త్రవ్వజేయుమని యాజ్ఞాపించెను యటను॥ ౨౮.
అటులనె జేసెను యధికారుండును నందు సుహాగశనిలుచుండి।
పటుతరమగు తన దీక్షచేకొనిన భవభయ హారమగు రండి॥ ౨౯.
అనేక లచ్చటకూడియుండినను నతినింద్యపు వేషమని।
ఒనరగ నెవ్వరుగైకొన కుండగ నొక యనాథుడు దీనిగని॥ ౩౦.
నిరసింపుము నాసంసారంబును నిత్యదుఃఖముండినదౌ।
గురుతుగ వానిం గాంచుచు సుహాగశ గురు మంత్రము చెప్పినదౌ॥
కంకణమప్పుడు సుహాగశవానికి కరముల వేసెను నాడు।
పొంకముతో తనముక్కు నత్తును పొసగ నతనికిడుచుండు॥ ౩౨.
హరిరూపంబును ధ్యానము నిడికొని యలసమాధి బొందెమును।
గురుతుగ భక్తుల దాసుడు బాలుడు కొనియాడును చరితలను॥

---

## పన్నాజీ చరిత్రము.

గుజరాతీయను దేశములో పల గొప్పపురము డోంగరులో।
నిజభక్తుండగు పన్నాజీ హరి నిష్ఠనుంచును తనలో॥ ౧.
రాజువద్ద తాకావలి యుండుచు రక్షణ పరుడైయుండు।
ఓజనుతా నట కుటుంబపోషణ మొనరగ చేయుచునుండు॥ ౨.

ద్వారకనుండిన శ్రీహరిమూర్తిని తానొక యెడ సేవించి।
వారక యెప్పుడు ధ్యానముజేయుచు వదరను నామముమించి॥ ౩.
అబద్ధమాడక యవనీపతికిని నతిస్నేహముతో నుండఁ।
ప్రబలతరంబగు విశ్వాసంబును ప్రభువున కతనిపైనిగుడఁ॥ ౪.
నరక చతుర్దశి దీపావళిలో నరపతి దీపోత్సవము।
గురుతుగ జేయుచు ప్రతివత్సరమును కొమరు మిగులనుండుసుము॥
ఒకవత్సరమున నర్ధరాత్రియట నుత్సవమున తానుండి।
సుకరంబుగ యారాజు నింటికిని సూటినరిగె నటనుండి॥ ౬.
పన్నాజియటు యంగవస్త్రమును బట్టుచునలుపుచునుండఁ।
విన్నాణంబిది యేమని నరపతి విస్మయమొందుచునుండఁ॥ ౭.
భక్తుడు బలికెను ద్వారకనాథుని భవ్యంబగు సన్నిధిని।
సక్తిని విప్రులు వస్త్రభూషణముల్ రక్తిగ హరి కిడగగని॥ ౮.
హారతు లియ్యగ నంగవస్త్రమున కగ్నియు దగులుట చేతఁ।
మీరక నే నది గాంచుచు మలిపితి మిగుల నగ్నిగని మీదఁ॥ ౯.
పచ్చటి వస్త్రము గట్టం బడినది భగవంతునకటు యిపుడు।
అచ్చముగా తగు ననేక భూషముల్ హరిపై నిడబడి యుండు॥౧౦.
ఈవింతను యానరపతి వినుకొని యేమియు దోచక యపుడు।
భావంబునకిది యంద కున్నదని భటులను బిలుచుచు నెగడు॥ ౧౧.
ద్వారక పురికిని ప్రభువగు నాతడీ ధరపతికిని షడ్డకుడౌ।
వారక నతనికి పత్రంబొక్కటి వ్రాసెను యప్పుడు హితుడౌ॥ ౧౨.
సన్నిధి లోపల యీ దినమందున జరిగినవింతే మనియు।
పన్నుగ దెలుపుండనుచు నాతడు పత్రము బంపెను గనియు॥ ౧౩.
భటులటు దెచ్చియు నిచ్చిరి నృపునకు పత్రంబును యా నాడు।
చటుల తరంబుగ చదివి చూచుకొని సరగవ్రాసె నా నృపుడు॥
హెచ్చిన నుత్సవ దినమున హరికిని నిల దీపముల్ వెలిగించి।
పచ్చని బట్టయు బహుయలంకృతుల్ భగవంతునకై వేసి॥ ౧౫.

నీరాజనమును పూజా చార్యులు సేనరున నట నియ్యగను।
వారక నప్పుడు దగిలెను నగ్నియు వస్త్రంబు నకయ్యేడను॥ ౧౬.
ఆసమయంబున పన్నాజి యిటు హరిసన్నిధి నుండుచును।
వాసిగ మలిపెను నగ్నిని యప్పుడు వాంఛను హరిపైగాను॥ ౧౭.
ఈవిధ పత్రము వ్రాసిపంపగను యేపున నృపుడది జూచి।
భావశుద్ధితో పన్నాజీకిని భక్తిని దండము జేసి॥ ౧౮.
శ్రీహరి భక్తుడ వగుచును నాయెడ సేవనుండతగ దనుచు।
సాహసమును గొని రెండు గ్రామముల చక్కనిచ్చి తాగనుచు॥
హరికైంకర్యంబును జేయు మనంగను హరిభక్తిని నతడుండెన్।
ఇరవుగ దాసుల దాసుడు బొలుడు యిప్డు వారల కుండెన్॥ ౨౦.

---

## శ్రీ ధ రు చ రి త్ర ము .

శ్రీధరుడను నొక బ్రాహ్మణు డుండెను చెలగిహిందు స్థానమున।
మేధ గలిగి యును నిష్కపటుండై మెలగియుండె నెయ్యమున॥ ౧.
శ్రీహరి భజనను సర్వకాలముల జేయుచుండు నాతండు।
మోహ మమతలను వదలి గృహస్థుడై యుద్ధియతో దా నుండు॥
వినోద హాస్యము లెవరేమన్నను వినుచు సత్యమని దలచు।
పునీతు డగునటు యాత్రకు నొకయెడ పోవుచుండె సతీ గొనుచు॥
గుఱ్ఱము పైనను భార్యను నాతడు గూర్చుండం జేసెమును।
అరణ్య మొక్కటి దగిలె మార్గమున నమిత ఘోరమా గాను॥ ౪.
దొంగలు కొందరు యా ప్రదేశమున దురుసుగ చేరిరి మొగను।
పొంగుగ మాటల నాడుచు వార్లతో పోవదొడగి రయ్యేడను॥
శ్రీధరు భార్యయు పతినిం గాంచుచు చెప్పె రాత్రి కాలంబో।
పాదుగ నిదియును మహారణ్యమై భయహేతువ నిలయంబో॥ ౬.
తిరిగియు మనమును గ్రామంబునకై తెరలి చనుట యుక్తమను।
దురుసుగ జెప్పిరి శ్రీధరునకు నటు దొంగలు తగ జూచుచును॥ ౭.

మీవెంబడి మేముండగ నిచ్చట మెలగు నెటుల భయముయనన్।
భావంతముతో శ్రీధరు డనియెను ధరను నమ్ము టెట్లుయనన్॥
ఇదివిని దొంగలు యిద్దరి నడుమను యీశుడాత్మ రాముండు।
పదపడి యుండును రక్షకు డతడన ప్రమాణమని గనిమెండు॥ ౯.
సతిపతు లిరువురు విశ్వసించుచును చనుచుండగ యాదారి।
అతికఠినులు యాదొంగలు శ్రీధరు నరయక నణికిరి మీరి॥ ౧౦.
ముద్దియ తోడను సకలవస్తువుల మోదమలర గైకొనగన్।
ఇత్తరిగని యాసుదతి క్షణక్షణము నెలమి వెనక చూడంగన్॥౧౧.
దొంగలనిరి నీభర్తజచ్చె నిటు తొంగిచూచు టెందుకని।
నింగి చూచుచును ముద్దియ బల్కెను నిజరాముని మధ్యగని॥ ౧౨.
విశ్వసించుచును నాదుపతియు నిటు వేధితుడై చంపబడె।
అశ్వారూఢుడై రాముడు వచ్చునో యనుచు జూచుచుండ బడె॥
అంతర సాక్షియై చైతన్యంబై యఖిలభూత వ్యాపకుడై।
సందయ మొందక నుండురాముడే చక్కజూతు నిందుండై॥ ౧౪.
అనేక భక్తుల సంరక్షించిన యారఘుపతి ననుగనడె।
పునీతుడగు నా సీతారమణుడు పొందుగ నాకై రాడె॥ ౧౫.
ఇటులం జెప్పగ రామచంద్రు డటు యెలమిని ప్రకటం బగుచు।
పటుతర ముగతా విల్లంబులతో బట్టిదొంగల జంపుచు॥ ౧౬.
శ్రీధరుడుండెడు చెంతకేగి దా జేసికటాక్ష వీక్షణము।
పాదుగ నాతని బ్రతుకం జేసెను పద్మహస్త ముంచినుము॥ ౧౭.
సుగమ మార్గమటు దొరికే వరకును సూటినరిగి వారలతో।
ప్రగల్భముగ తగు మనుజుల సంగము బాగుగచూపుచు దయతో ॥
అంతర్ధానుం డయ్యెను రఘుపతి హరిభక్తులు దంపతులు।
పంతము తోడను యాత్ర జేసికొని పదపడి జేరిరి యిల్లు॥ ౧౯.
రాముని రూపము ధ్యానము నిడుకొని రంజిల్లిరి యిరువురును।
వేమరు ఖారల దాసుడు బాలుడు వీలుగ దలచును యిటను॥ ౨౦.

# హరిపాళుని చరిత్రము.

---

హరిపాళుండను ధనికుం డొక్కడు హరిదాసుల పూజించు
గురుతుగ నితరుల సామాన్యులు గని గుణిజేయక తానుంచు॥ ౧.
భాగవతులు తన గ్రామము వచ్చిన భక్తిని నెదురుగ బోయి।
సాగిల బడుచును దండము బెట్టుచు చక్కదెచ్చు గృహమయ్యి॥ ౨.
ఉపచారంబగు పూజల జేసియు నుత్తమాన్నమును నుంచు।
కపటము లేకను యథాశక్తిగను కనకము చేలము లిడుచు॥ ౩.
సాధు సేవయిటు జేయగ నతనికి సకల ధనము వ్రయమయ్యెగా।
పాదుగ సాదుపుర్ వచ్చుచు నుందురు భవ్యకీర్తివిని డాయగా॥ ౪.
వచ్చినవారల కన్నమిడను యెడ వచ్చునత్య హానియని।
సచ్చరితుడు యొక దొంగ వేషమును చక్కగ తానటు బూని॥ ౫.
పాంథస్థులదా భయపెట్టుచు మరి పదార్థంబులం గొనుచు।
బాంధవ్యులు శ్రీవిష్ణు భక్తులని భక్షణవారల కిడుచు॥ ౬.
వాసుదేవు భక్తుల చిహ్నముతో వచ్చు నరుల మార్గమున।
లేశమైనతాబోవడు తెరువుకు లీనుడగుచు నెయ్యమున॥ ౭.
దొంగతనంబును జేయుచొ మనుజుల దుష్టహింత సలుపకను।
పొంగుగ సాధులసేవను నబ్బెడు పుణ్యాపుంజ మంతయును॥ ౮.
సొత్తువారిదై చెందియుండునని మాటిగదలచుచు తనలో।
ఇత్తరిసేవల బహుగాజేయుచు నేర్పడియుండెను యిలలో॥ ౯.
ఒక యెడసాధువు లనేకముగ నట నొగివచ్చిరి యింటికిని।
ప్రకటమయ్యె తన యింటను ధాన్యము ప్రచితంబుగ లేదుయని॥ ౧౦.
ధనుబాణముల చేతుల గైకొని తాను వెళ్ళె నటవికిని।
మనోచింత గొని పాంథస్థులకై మహిని జూచె దారిగొని॥ ౧౧.
దారిని నెవ్వరు రాకుండంగను తా ఖేదము నొందుచును।
మీరిన క్షుధతొ సాధువు లింటిలో మెలగియుండు రెటులయను॥

అతివ్యసనంబును బొందుచు నుండగ హరియు లక్ష్మియును గూడన్।
హితులై వచ్చిరి వర్తక వేషము నెలమి బొందుచును జూడన్॥౧౩.
హరిపాళుడు గని నతి మోదముతో నడ్డమగుచు నిరువురకు।
అరమర లేకను ద్రవ్య విత్తముల నయముగ నిమ్మనె బాగు॥ ౧౪.
లేనియెడను మీ యిద్దరి ప్రాణము లెక్కించను నే నెపుడు।
మానక నిమ్మని భయపెట్టంగను మంచిదనుచు వార్లపుడు॥ ౧౫.
తాము ధరించిన భూషణ మంతయు తగ్గులేక నియ్యగను।
నేమ మయ్యెనని హరిపాళుండును శీఘ్రంబుగ గొనుచును॥ ౧౬.
ఇంటికి వచ్చుచు వైష్ణవ జనులకు నిష్టభోజన మిడుచుండెన్।
అండజవాహను డడవి యందు తా నబ్ధికన్యతో నుండెన్॥ ౧౭.
శ్రీహరినిం గని దేవియు బలికెను చేలభూష లన్నియును।
మోహముతో నీ భక్తుడు గైకొనె ముదమెద్దియు గాననను॥ ౧౮.
హరియు బల్కెనటు గొట్టక మనలను నాతండును రక్షించెన్।
కరమరుదగుయీ యుపకారంబును ఘనమని యెంచగవలసెన్॥౧౯.
సాధుల సేవకై పాంథస్థుదా చక్కగనిటు దోచుకొను।
పాదుగనిటులం జెప్పగ లక్ష్మియు బల్కె వాని గనవలెను॥ ౨౦.
ఇటుల నడుగగను హరియును బలికెను యేగుద మిపు డతనెడను।
పటుతరముగనటు సాధుల వేషము పరగవేసి రిరువురును॥ ౨౧.
గోపీచందన తులసీమాలల గురుతుగ వారుంచుకొని।
వీపున జయ సీతారామా యని యేగగ హరిపాళుగని॥ ౨౨.
నమస్కరించెను సాష్టాంగంబుగ నమ్రుడగుచు నిరువురకు।
కొమరొప్పగ తా నాసన పాద్యముల్ కోరికతో నిచ్చెతగు॥ ౨౩.
భక్షణకొఱకై విస్తరముందర బాగుగ కూరొ్చబెట్టి।
లక్షణ యుతమగు నన్నంబిడుచును లలితము జేసెను ఘట్టి। ౨౪.
హరిపాళుండనె సుదినంబిదియని యతిధన్యుడునై తినను।
శారదిని దర్శన మొసగుచు కరుణను జూపితి రిటు నా యెడను॥

ఆరగించియుండగ నతడడిగెను య వేషులెవి యుండినను।
ధీరతరంబుగ జెప్ప వచ్చునని దెల్పగ భగవంతుడును॥ ౨౬.
భూషణ ద్రవ్యము మాయెడ నుండెను, పాసగిదారి రాగాను।
వేసరిల్లకను దొంగలు దోచిరి వేరె యుపాయము లేకను॥ ౨౭.
నీకడ వచ్చితి మనుచు జెప్పగను నెనరున హరి పాళుండు।
జోకను సాధుల దొంగలు దోచుట నూటిగాదు తగ వినుడు॥ ౨౮.
అరణ్య మంతయు వెదకియు దొంగల నట్టేచంపెద ననుచు।
వెఱవక జెప్పగ శ్రీహరి యప్పుడు విలసిత వణిజుండగుచు॥ ౨౯.
నిలుచుండగ నటు లజ్జితు డయ్యెను నెనరున హరి పాళుండు।
తలమల బడుచును కన్నీ రొలుకగ దండంబును తా బెట్టు॥ ౩౦.
హరి సర్వాత్మక యప్రమేయశ్రీ యచ్యుత కృష్ణముకుంద।
పరమ మూఢుడను నినునేగానక బహు యపచారములొంద॥ ౩౧.
జగద్గురుండవై సాహుకారు వలె సరసరూపు జూపితివి।
అగణిత దురితము లేనుజేసితిని నరయ నెన్న లేను భువి॥ ౩౨.
కరుణా కరుడవు దీనబంధుడవు కాపాడుము క్షమజేసి।
తెరవు నాకు యిటు వేరే లేదని దెలుపుచు ప్రేమతో వెలసి॥ ౩౩.
అప హరించినటి యలం కారముల నతడుదెచ్చి ముందుగను।
నెపములేక నీవను గ్రహింపుము నీబాలుడ నగుదునను॥ ౩౪.
దీనిం గనుచును శ్రీహరి యప్పుడు దివ్యంబగు తనరూపు।
మానుగ జూపగ హరిపాళుండును మహినిడు ప్రియదండంబు॥ ౩౫.
శ్రీహరి యప్పుడు నిష్కామంబై చేసినభక్తికి మెచ్చి।
బాహుళ్యంబగు సిద్ధులింటిలో ప్రబలం బగుననె హెచ్చి॥ ౩౬.
ఇటులం జెప్పుచు నంతర్ధానుడై యేగెను శ్రీహరి యటను।
పటుతరముగ నా హరి పాళుండును బహుసంపతి గనుచును॥ ౩౭.
సాధుసేవలను హరి భావంబున సర్వద ప్రీతిగజేసె।
వేదవేద్యులగు వారల దాసుడై విహిత బాలుడును వెలసె॥ ౩౮.

## జె సూ కా పు చ రి త్ర ము.

శ్రీహరి భజనను జెసూకాపు తగ జేయుచుండు ప్రియమునను।
మోహమమతలను మానియు నాతడు ముఖ్యముహరి భజనయను॥౧.
పైరు పంటలను జేయుచు నాతడు పాలించు కుటుంబమును।
నారాయణ భక్తులు వచ్చినయెడ నయముగ భోజన మిడును॥ ౨.
చేను దున్నుటకు రెండు వృషభముల చెలగియుంచె నాతండు।
కాన కుండగను దొంగలు రేయిని గైకొని పోవుచు నెగడు॥ 3.
శ్రీహరి యిదిగని చింత నొందియటు జెసునకు దెలియక తాను।
గేహము నుండిన యెద్దులవలెనె క్రియనిర్మించెను తాను॥ ౪.
కాపువాడు నటనిత్యము వలెనే గట్టుకొనేగెను మడికిఁ।
ఏపున యెడ్లతో దున్నుచు నుండగ ఎలమిని దొంగలు వెలికిఁ॥ ౫.
తామటు దెచ్చిన యెడ్లకు సామ్యత తగిలియు నుండంగనుచు।
నేమము లేకనె తిరిగియు రాతిరి నిగుడి వీని గొనిచనుచు॥ ౬.
వారి యిండ్లలో నుంచి యుండగను వరుసను హరి తిరిగియును।
వేరు యెడ్లనటు మునుపటి వలెనె వే నిర్మాణము జేయగను॥ ౭.
జెసూకాపునకు తెలియ నియ్యకనే జేసెను హరి తంత్రంబు।
నిశాకాలమున తిరిగియు దొంగలు నెఱిగొనిచన, చిత్రంబు॥ ౮.
ఇటులం జేయగ నాలుగు దివసము లేర్పాటుగనటు జూచి।
పటుతర భయమును దొంగలు బొందుచు పండరి నాథుని దలచి॥
ఆతని చర్యలైయుండును యనిమది యనుతాపము తగనొంది।
*నాదార్ భక్తుని యపచారమునకు నరకమనుచు వెఱగొంది॥౧౦.
జెసూకాపునకు శరణు బొందుచును శ్రీహరిని భజించిరటు।
వసుమతి దాసుల దాసులై బాలుడు వర్ధిల్లుచు నుండునిటు॥ ౧౧.

---

* నాదార్ - బీద.

# ధ నా జా టు కా పు చ రి త్ర ము.

---

ధనాజాటు కాపువాడుండెను ధరహిందు స్థానమున।
వినతుఁడై జేసెను బాల్యదశనుదా విష్ణుభక్తి నెయ్యమున॥ ౧.
ఇంటికి వచ్చే వైష్ణవజనములు యీశు పూజ చేయంగా।
కొండొక దినమున ధనాజాటుఁడును గురుతుగ జూచుచు వేగా॥ ౨.
సాగిల బడిదా దండము బెట్టుచు సాధులనటు బ్రార్థించు।
భోగశయను సాలగ్రామం బిడుమన పొందుగ వారలు వినుచు॥ ౩.
నల్లటి గుండ్రపు రాతిని వానికి నయముగ తామియ్యగను।
ఉల్లమలరగను విశ్వాసముతో నొప్పుగ తాగొనుచును॥ ౪.
నేమము దప్పక పూజను సలుపుచు నెనరుంచగ నా హరియు।
ప్రేమభావమును జూపినతనిపై పెంపుగనుంచెను దయను॥ ౫.
పశువుల మేతకు నడవుల నందును భక్తుడు బోవును దినము।
కుశలంబుగ యాసాలగ్రామము కూడనె దెచ్చును సుమ్ము॥ ౬.
స్నానము జేయుచు వనపుష్పంబుల చక్కగ తానటు గోయు।
మానుగ వాటితొ భగవత్పూజను మహిత భక్తితో చేయు॥ ౭.
సద్ది రొట్టెలను హరి నివేదనకు చక్కగ తానర్పించు।
కొద్దియైనను భక్షించుము యని కూర్మిని నటు బ్రార్థించు॥ ౮.
భక్తి భావమును జూచుచు శ్రీహరి భక్షణ చేయుచునుండు।
రక్తిగ మిగిలిన రొట్టెను భక్తుడు రంజిల్లగ దినుచుండు॥ ౯.
బాల్యము మొదలుగ దేవదేవుడును భక్తున కిరవై యుండు।
మాల్యరహితమగు సుగుణంబులతో మానుగ పెరుగుచునుండు॥
వయసు పర్వమున సాధుసేవలో వాంఛాతత్పరుడగుచు।
నయముగ నుండగ నొక యెడ సాధులు నారాయణుని బాడుచు॥
ధనాజాటు గృహద్వారమునందును తలపడి యటు వచ్చుచును।
ఘనమగు కరువున నన్నంబిచ్చిన గలుగు పుణ్యమిరవుగను॥ ౧౨.

అనుచు జెప్పగను ధనాజాటుడును నను తాపము బొందుచును।
తనయెడ ధాన్యం బెద్దియు లేమిని తలపడి వి త్తనములను॥ ౧౩.
పిండిగ విసరియు వైష్ణవ జనులకు బెట్టెను భోజన మపుడు।
నిండిన ప్రేమను వారు దీవెనల నెనరున జేసిరి నాడు॥ ౧౪.
ధనాజాటుడును సంతోషముచే తలపడి యుండగ జనులు।
అనువుగ నిందల జేయుచు నుండిరి యలవి త్తనధాన్యములు॥ ౧౫.
సాదుల కిచ్చెను పంట పైరులను జరుపు టెటుల తెలియదని।
పాదుగ నాతడు శ్రీహరి కృపయని భక్తి చేయుచుండగని॥ ౧౬.
ఇంటి మనుష్యులు పైరుజేయుటకు యేమియు పనిలేదనగన్।
నిండుశాంతితో ధనాజాటుడును నెనరున బలికెను వినగన్॥ ౧౭.
జీవభావమును చెందని భూమిలో చెలగి నిడిన ధాన్యములు।
దేవుని కృపచే యొకటి కనేకమై తేటనిచ్చి విలసిల్లు॥ ౧౮.
సజీవులగు యా శ్రీహరి భక్తుల సత్పాత్రపున న్నంబు।
విశేష ఫలమును నిచ్చుట నరుదే విష్ణుప్రీతియై పెంపు॥ ౧౯.
ఈనిశ్చయమును నుంచియు నాతడు యీశు భజన లోనుండు।
మానుగ శ్రీహరి చేనుపంటతగ మహితంబుగ జేసెనటు॥ ౨౦.
గ్రామవాసులును జూచుచు వింతతో కరుణించెను హరి యనిరి।
నేమంబలరగ సత్కీర్తియునట చెందబడెను వినగోరి॥ ౨౧.
సంకట మందున శ్రీహరి యాతని సంరక్షించెను తగుల।
పొంకముతోడను భక్తుడుగాంచుచు పొందె మోదమును మిగుల॥
సాధుల కొఱకై సద్వినియోగము సలుపుచుండె ధాన్యమును।
శ్రీధరు దాసుల దాసుడు బాలుడు జెప్పును దాసుల చరితలను॥

---

## సు ఖా నం దు ని చ రి త్ర ము.

హిందుస్థానులో సుఖానందుడను యీశుని భక్తుండుండు।
సందియ మొందక విష్ణు భక్తులెడ నులుపును పూజలమెండు॥ ౧.

కపటము లేకను హరి భక్తిని దా కాలము గడుపుచునుండు।
చపలత నొందుచు వేరు సాధనల సలుపడు నావిప్రుండు॥ ౨.
హరికి నివేదన మైన ప్రసాదము నతిమ హిమను నుండునని।
గురితో మిక్కిలి ప్రీతిని నుంచుచు కోరి భక్షణ చేయుగని॥ ౩.
పతివ్రతరాలగు సురసురి భార్యయు పతికిని హితమై యుండు।
సతతము సేవల భాగవతుల్కై సలుపుచు ప్రీతిగనుండు॥ ౪.
పతి, నీరాడక హరి ప్రసాదమును, భక్షించును వెలిగాను।
*ప్రతిశ్రవమిందుకు వేరులేదు హరి ప్రసాదంబునిట్టిదను॥ ౫.
ఈనిశ్చయమును దంపతులిద్దరు యిరవుగ నుంచుకొనంగన్।
మానుగపురజనుల్ సాక్షి జూచుటకు మనసున దలచుచు వేగన్॥ ౬.
అంగడి వెళ్లుచు జిలేబి వడలను ననువుగ నటు దెచ్చుచును।
పొంగుగ వారలు సుఖానందు కడ బోవుచు నిచ్చిరియటను॥ ౭.
శ్రీహరి సన్నిధి ప్రసాదమనుచును జెప్పగ నాతండపుడె।
బాహుళ్యంబగు సంతోషముతో భక్షించెనుదా నట్టె॥ ౮.
వదరుచు వారలు నవ్వాడంగిరి వడ జిలేబు లంగడిని।
విదితంబుగ నిటు దెచితిమి మేమును విప్రవరులు తింటిరని॥ ౯.
అనుచిత మయ్యెను ప్రాయశ్చిత్తము నలయక గైకొన వలయు।
వినకుండిన యెడ భవిష్కారమిటు వేయబడును తగనని యు॥ ౧౦.
సుకానందుడిది వినుకొని నోటను సూటిగ నిజ చేతులను।
వికాస మగునటు వడలు జిలేబులు వెలి వచ్చెను చూడగను॥ ౧౧.
భక్షణ చేసిన గడియ ప్రొద్దునకు పరగ నవియు మొదటివలెన్।
కుక్షిని నుండియు బైటికి వచ్చెను కుటిలులు గని సంతసిలన్॥ ౧౨.
విచిత్రమనుచును దండము బెట్టుచు వెళ్లిరి తమ యిండ్లకును।
ప్రచితంబుగదా శుద్ధభావమును బట్టిన వాడన దగును॥ ౧౩.
సుకానందుడును మధుర యాత్రకై సూటిగచన నెత్నించె।
నికట సతిని గని భక్తులసేవలో నిలుపు మనుచు లెక్కించె॥ ౧౪.

---

* అంగీకారము.

సురసురి యందుకు నా మోదించగ సుఖా నందుదును వెళ్ళెన్।
మరుదిన మందును వేషధారియొకా మనుజుం డొక్కడు మెల్లన్॥ ౧౫.
సాదుని వేషము ధరించి రాగను సతియును తగ దండమిడి।
ఆదరించుచును పూజల సలుపగ నతడు కాముడై నిగుడి॥ ౧౬.
సుందర రూపును జూచి యామెతో నూటిగ బలికెను యతడు।
పొందుగ నీవును యీదినమందును భోగదాన మిమ్మనుడు॥ ౧౭.
సురసురి బలికెను రాత్రికాలమున సునిశ్చితంబుగ నేను।
వెలువక కోరికె దీర్చెద భక్షణ వేగంబుగ చేయుమను॥ ౧౮.
వేష ధారుడును సంతోషింపుచు విహితంబుగ భక్షించెన్।
దూషిత తలపుల నెంచుచు నుండగ *దొనరు రేయి నేతెంచెన్॥
సురసురి శయ్యను నలంకరించుచు నొరది రెండో యామమున।
వెలువక తనపతి పదముల దలచుచు వెలపలరిగి వేగమున॥ ౨౦.
అరలోదీపము వెలుగుచు నుండగ నామెయు నాతని బిలుచు।
సరగున నాతడు కడప ముందుగను చక్కవచ్చి దా నిలుచు॥ ౨౧.
యువతిని నాతడు చూడగ నతిభయ ముత్పన్నంబై మరియు।
వివరంబుగ నొకవికార రూపము విటునకు నటు కనుపడియు॥ ౨౨.
ఘోరతరంబుగ బెదిరించుచు మరి క్రూరదృష్టితో చూడన్।
ధీరత్వంబును వదలియు నాతడు దీనత పలికెను జాడన్॥ ౨౩.
తల్లీ నీయెడ యపచారంబును తలుచుగాను జేసితిని।
సల్లాపము చే తప్పు క్షమింపుము సాష్టాంగము జేసితిని॥ ౨౪.
అనుచు జెప్పుచును వెలిని దూరముగ నాతడుతగ వెళ్ళుచును।
నెనరున రేయిని నిద్రింపంగను నేతెంచెను సూర్యుడును॥ ౨౫.
ఎప్పటివలెనే సురసురి లేచుచు నింటిని యూడ్చుచు నుండు।
ఒప్పుగ నతడు దండమిడి తప్పును నోర్చుకొనుము ననుచుండు॥ ౨౬.
అను తాపముచే విరక్తచిత్తుడై యనఘుని గృహమున నుండు।
వినీతసేవను నరిషడ్వర్గము వెలువక గెలిచియు నుండు॥ ౨౭.

---

*యోగ్యము.

చాతుర్మాసముల్ యాత్రజేసికొని యేతెంచె సుఖానందు।
సాధువేషకుడు తన యపచారము చనువుగ చెప్పెను ముందు॥ ౨౮.
సుకానందుడును సంతోషింపుచు సూటిగ జూపుచు కరుణ।
ప్రకారముగతా నుపదేశంబును పరగచేయగను దాన॥ ౨౯.
శ్రీహరి భక్తియు సాక్షాత్కారము చెందెను తగ నానరుడు।
మోహ మమతలను వదలిన భక్తుల ముఖ్యదాసు బాలుండు॥ ౩౦.

---

## మా ధ వ దా సు చ రి త్ర ము.

మాధవ దాసుండను నొక విప్రుడు మహా పండితుడై యుండు।
వేధలనొందక విషయాసక్తిని విరక్త చిత్తుడై నెగడు॥ ౧.
బహుదినంబులిటు జరుగుచునుండగ భార్యయు కాలంబైయెను।
సహజంబుగ తన బంధమూడెనని సమాధాన మిరవయ్యెను॥ ౨.
ఇంటను నుండిన వస్తు ద్రవ్యముల నితరులకును బంచుచును।
ఒంటరిగా తా యాత్రకు వెళ్లెను యొడియ జగన్నాథమును॥ ౩.
అచ్చటి కరిగియు ననుతాపముచే యబ్ధిని స్నానము జేసి।
హెచ్చిన ప్రీతిని దండము బెట్టెను యీశ్వరునకు నటుమించి॥ ౪.
సగుణమూర్తినిం గన్నులంజూచుచు సర్వేశ్వర గోవిందా।
అగణిత సుగుణా నీదు రూపమున నమరె చిత్తమింపొంద॥ ౫.
తల్లియు తండ్రియు బంధువు సఖులును ధరలో నీవేనాకు।
సల్లలితంబుగ నిన్నువినాగా జగతినెవరు లేరుతగు॥ ౬.
ఇటులంజెప్పుచు ప్రేమోత్కర్షత నీశునిపై యుంచుచును।
పటుతరముగ తా శ్రీహరి భజనను భావముంచె తగనటను॥
వేదశాస్త్రములు చదివియుండినను విద్యాగర్వము లేకుండె।
ప్రీతి సగుణమున పూర్తిగనుంచుచు పెంపుగసన్నిధినుండె॥ ౮.
పూజాచార్యులు సన్నిధినుండుట పొందబడదు యని జెపుచు।
తేజితముగనే యుపద్రవంబులు దేవమూర్తి కగుననుచు॥ ౯.

రిక్తస్థలముల హాకినిదండముక్క రీతిగ బహుయుంచెదవు।
వ్యక్తంబుగనిటు జేయుటెందుకని వెళ్ళంగొట్టిరి తెరవు॥ ౧౦.
మాధవదాసుడు చింతను బొందుచు మనసున హరి దలచుచును।
పాదుగ తానటు గ్లాంతిని చేసెను భక్తిసేవ హీనుడను॥ ౧౧.
ధనమెద్దియు నాచేతుల లేకను ధరను పూజనేజేతు।
అనువుగ మానస పూజయు నాకును నందబడక చెలువొందు॥ ౧౨.
అనన్య శరణుడ దాసుడ నేనిల నబ్బదళాతూ యనుచు।
ఘనముగ నేడ్చుచు నన్నపానముల కాంక్ష లేక తానుంచు॥ ౧౩.
అహోరాత్రములు నామస్మరణను నటించె దినములు మూడు।
మహా కరుణతో జగన్నాధుడును మానిని రుక్మిణిం జూడు॥ ౧౪.
లోక జనని గని సర సాన్నంబును జోకను తానటు దెచ్చి।
వీకను మాధవదాసుడు నిద్రలో వెలయగ లేపెను మించి॥ ౧౫.
భక్షణ చేయుండనుచు జెప్పగను బలికె మాధవ దాసుండు।
లక్షణ మెనగిన మీరలెవరుయన లాలితసతి జెపుచుండు॥ ౧౬.
ఎవరికై నీవు సర్వకాలముల యెలమి ధ్యానముండె దవు।
కువల యమున నే నతనికి భార్యను గురుతును గనుమిటు నీవు॥ ౧౭.
ఇటుపై యాగ్రహముంచక నీవును యిల భక్షణ చేయుమను।
పటుతరముగ నిటు స్వల్పకాలమున ప్రసన్ను డగును హరియునను॥
మన్నింపుచు నాదేవి వాక్యమును మాధవ దాస్ భక్షించెన్।
సన్నుతించబడి రుక్మిణి చనుచును స్వర్ణ పాత్రమట నుంచెన్॥ ౧౯.
పాత్రము కడిగియు మాధవ దాసుడు భద్రపరచె తనయెడను।
ప్రాతంబగునటు దేవాలయమున స్వర్ణపాత్ర గానకను॥
పట్టణ మంతయు వెతుకగ నదియును పట్టుబడె నాదాసునెడన్।
తిట్టుచు నాతని బందీఖానలో జేర్చిరి యందరు చూడన్॥ ౨౧.
జగన్నాధుడును పూజాచార్యుని స్వప్నమందు వెళ్ళుచును।
అగణిత సుగుణుడు మాధవ దాసుడు నవని నాకు భక్తుడను॥ ౨౩.

స్వర్ణ పాత్రలో ప్రసాదమును జగజ్జనని చేత బంపితిని।
నిర్ణయముగ నీవాతని పైనను నేనరుంచుము యనగ విని॥ ౨౩.
పండాలందరు ననుతాపంబును బహుగానటు పొందుచును।
నిండారంగను మాధవదాసుపై నెనరుజూపి, గుడిలోను॥ ౨౪.
ఆతని దెచ్చుచు హరిపదములపై యఱమఱలేకను నిడుచు।
పాడుగ నతనికి ప్రసాదమప్పుడు పంచియిచ్చి రటుమనుచు॥ ౨౫.
కొన్ని దినంబులు నిటులం జరుగగ కుదురుగ నొకరే యందు।
సన్నిధియందున మాధవదాసుడు చక్క నిలిచె చెలువొందు॥ ౨౬.
అర్ధరాత్రి నటు పూజల జరుపుచు నచటి పండాలందరును।
నిర్దయులగుచును నీతని దెచ్చుచు నిగుడి గుడికి వెలపలను॥ ౨౭.
ఉంచగ నతనికి దేహభావనయు నొప్పగనటు లేకుండెన్।
మంచు గురియగును వణకుబుట్టుచును మహినుండం గనుచుండెన్॥
పూజారులు గుడి తాళములిడుకొని బోయిరితమ యిండ్లకును।
ఓజను భక్తుడు మాధవదాసుడు యొద్దిక శ్రమ జెందగను॥ ౨౮.
జగన్నాథుడిది గాంచుచు నప్పుడు శాల్వగప్పె నతనిపయిన్।
నగటుగ వచ్చిరి నరు లుదయంబున స్వామిదర్శనము నకయిన్॥
పడకను నుంచిన శాల్వానుగానక బాగుగనటు వెదకగను।
గుడికి వెలపలను మాధవదాసుపై గుఱిగనుండం గనుచును॥ ౩౦.
శ్రీహరిజేసిన చర్యయె యిదియని జెప్పుచు నుండిరి జనులు।
బాహుళ్యంబగు ప్రేమ యుండుచే భక్తిమహిమ విలసిల్లు॥ ౩౧.
అచ్చటి నృపు మాధవదాసును గని యవనిబడుచు దండమిడెన్।
హెచ్చిన మాన్యత యచట గలుగగను యచ్చోటును విడనాడెన్॥
అచ్చట నుండియు బైలుదేరుచును హరిక్షేత్రమగు మధురన్।
మచ్చికతోడను వచ్చుచునుండగ మార్గములో నొక యూరన్॥
శ్రీహరి భక్తుడై వెలసిన మనుజుని చెంతను దాతగ నేగి।
బాహుళ్యంబగు ప్రేమను నన్నము భక్షణకొఱకై యడిగి॥ ౩౫.

ఇంటికి బైటను నిలుచుండగను ఇంటిల్లా లటు వచ్చి।
వెంటనే దండము నిడి యజమానుడు వేరు యూరు పోవలసి॥ ౩౬.
వెళ్లెను బైటను సామగ్రిని నే విహితంబుగ నిచ్చెదను।
సల్లలితంబుగ వంటజేసికొని సరి భక్షణ చేయుమను॥ ౩౭.
మీరలు విప్రులేము క్షత్రియులము మిగులను నీచులమనగా।
తీరుగ మాధవదాసుడు బలికెను దేవునినామము బాగా॥ ౩౮.
సదా మీరలిటు భజింపుచుండగ సత్కులస్థుల నిదలతు।
విధేయుడగుచును నన్ను మిమ్మనుచు విప్రుడడుగ వినిముందు॥ ౩౯.
అంగడి వెళ్లుచు పాలును మిఠాయి యామె దెచ్చి యియ్యగను।
రంగని నామము జెప్పుచునాతడు రయమున భోంచేయుచును॥
పరితృప్తుండై మథురాపురికిని భక్తితోడదా వెళ్లెగా।
అరుదెవ్వెను యటు దేవుని సేవయు యడ్డగింప జనులెల్లన్॥ ౪౧.
పూజార్లందరు భగవత్సేవకై పోనియ్యక చేయగను।
వేసారక తా మానసికముగ నే దండము బెట్టుచును॥ ౪౨.
యమునతీరమున చీరఘట్టమను యమల స్థలి కరుగుచును।
కోమరు మిగుల నటు స్థిరతర మనసున గోవిందుని దలచగను॥ ౪౩.
కనికరమొందిన మనుజుండొక్కడు కాగల సాహిత్యమును।
అనువుగ నియ్యగ మాధవదాసుం డపుడుజేసె వంటయును॥ ౪౪.
శ్రీహరి కర్పణ జేయగనచ్చట శ్రీగోవిందుడు వచ్చెగా।
మోహమమతతో మాధవదాసుడు ముదమున దండముజేసెగా॥
శ్రీహరి జెప్పెను నీకు నర్చకుడు జేసెను యపచారంబు।
బహుళ్యంబగు ప్రేమను నీయెడ పాటించెదవ సత్యంబు॥ ౪౬.
కోపము తోడను వెళ్ళి తీవనుచు కోరివచ్చితిని నిటకు।
ప్రాపుగ నిరుపుర మారగించెదము బసగొని మనమిటు బాగు॥ ౪౭.
విస్తరలందు వడ్డించి యన్నము నే భక్షణ చేయుచును।
ప్రస్తుతమున మాధవ దాసునకటు బహు మోదం బలరగను॥ ౪౮.

శ్రీకృష్ణుండును తృప్తిగ భక్షణ జేసియు తన గుడికేగె।
ప్రాకృతులగునా పండాలకు దా బల్కెను కలలోనేగె॥ ౪౯.
మీా నివేదనలు నాకిక నెక్కువు మీారిన యపచారమును।
మానుగ మాధవ దాసున కొసగగ మహి భక్షణ చేకొనను॥ ౫౦.
చీర ఘట్టమున నుంచెదు నాతని శీఘ్రము నిటు దెచ్చినను।
దూరక నైవేద్యమునే గొనెదను దుష్టులు మీారనగాను॥ ౫౧.
పండాలందరు నాశ్చర్యముతో భక్తుని గొని వచ్చిరటు।
నిండారగ నటు సకల జనంబులు నెఱిమన్నన జేసిరటు॥ ౫౨.
ఉపాధి కలిగెను నిచ్చటననుచును నుండె నాల్గుమాసములు।
కృపా విశేషము నెంచుచు శ్రీహరి క్రీడించిన క్షేత్రములు॥ ౫౩.
తిరుగుచునుండియు జగన్నాథమును తిరిగి వచ్చెనటు తాను।
హరి దర్శనమును చేసియు పిమ్మట హరి దాసులగనుచును॥ ౫౪.
ఉండెను నచ్చట, విరోచనంబుల యుపాధి గలుగగ నాడు।
దండి తొందరల బొందుచు నాత డుదధితీరము చనియుండు॥ ౫౫.
సగుణ రూపు ధరించియు కృష్ణుడు చక్కవెళ్ళి తానటను।
ప్రగల్భత్వమున శౌచంబునకై పాత్రను నీరిచ్చుచును॥ ౫౬.
మాధవ దాసుని వస్త్రములన్నియు మహిని కృష్ణు డుతుకగను।
పాడుగ భక్తుడు జూచి పలికె నటు బహుళ్యంబగు వ్యధను॥ ౫౭.
నివారించుటకు శక్తత లేదా నీరజ నాభా యనగ౯।
భవోపశాంతుడు బలికెను నప్పుడు ప్రారబ్ధంబుండంగ౯॥ ౫౮.
ఇప్పుడె నీ వ్యధ పోగొట్టనునా కేసంకటమును లేదు।
ఒప్పుగ నీకును మరియొక జన్మలో నొగి యనుభవ మగునిందు॥
అందుకు నీవును మరియొక జన్మము నవనిని నెత్తగవలయు।
సందియ మొందక నాలుగు దినముల చక్కంబడు నిట ననియు॥
జెప్పియు వెళ్లెను శ్రీహరి యప్పుడు చింతదీర నటుగానె।
తప్పక నయ్యెను యారోగ్యంబును తగిలికొన్ని దినములనె॥ ౬౧.

# హ రి వ్యా సు చ రి త్ర ము.

---

మధురాపురమున హరివ్యాసుండను మాధవు భక్తుండుండెఁ।
విధితో నాతడు సగుణమూర్తినిఁ వెలసి భజింపుచునుండెఁ॥ ౧.
అరిషడ్వర్గము గెలిచి జగత్తును హరిమయమని గనుగొనెను।
ఇరవొందగ తనచూపున నరులును నిల తరింప బడగాను॥ ౨.
ఒకయెడనాతడు జగన్నాథమున కుచిత యాత్ర చనుచుండఁ।
సుకరంబగు నొక స్థలమును దారిని జూచెను విలసిలుచుండఁ॥ ౩.
ఉపవనమందును వృక్షఛాయతో నుదకశుద్ధి తానుగని।
నెపములేక తన శిష్యుల గూడియు నెనరున దిగె నచటమని॥ ౪.
స్నానముజేసియు వంటప్రయత్నము సలుపుచునుండగ నటను।
మానుగ చండీ దేవియొక్కతె మహిమ గలది యుండగను॥ ౫.
బలిదానముకై ప్రజలనేకులటు పశువుల తగ చంపుదురు।
బలపడి యా దినమందొక శూద్రుడు పశువును నలుకుచు నడరు॥
హరివ్యాసుడు గని దురితము లెవియో యలయక జేసితినేను।
గురుతులేక నేనిచ్చటజూచితి గొప్పహింసా కర్మమును॥ ౬.
దోషాచారము దృష్టిని జూడగ దురిత విభాగ మబ్బునని।
వేసటెల్లకను స్థలమును వదలుచు వెలిపాకమ శుద్ధమని॥ ౭.
అనుతాపముతో యుపవాసులునై యట్టె బోవుచుండుటకు
ఘనమగు భీతిని దేవియుబొందుచు కంజాక్షుని భక్తులకు॥ ౮.
దారికి నడ్డంబగుచును వచ్చియు థరబడి నతి చేయుచును।
మీరలు దిగుటయు నా యాశ్రమమున మిగుల పావనంబగును॥
ఆరగించకను మీరలు బోయిన హరికోపించును నాపై।
మీరలు సాక్షాద్విష్ణు భక్తులు మిగుల ప్రియులు నాతనిపై॥ ౧౧.
వరుసను నచ్చట భోంచేసియు మరి వాని నేగవలె ననగఁ।
హరివ్యాసుండనె పశువును జంపిన యాచో భక్షింపంగఁ॥ ౧౨.

అఘోర నరకము బొందగ వలయును హరిదాసుల మగుటయును।
విఘాతమగు యీ హింసాకర్మము విడిచినయెడ మేమటను॥ ౧౩.
భక్షణమును తగ జేసెదమనగను భవాని యామోదించి।
పక్షముతోడను చెయిపట్టుకొని బాగుగ పిలుచుకవచ్చి॥ ౧౪.
స్వయంపాకముల సలిపించుచునటు సరి భక్షణ చేయించెన్।
ప్రియంబు శ్రీహరి కగునటు కలలో పృథివిపతికి వేంచేసెన్॥ ౧౫.
దేశమునందును ప్రకటపరచు మీ దేవాలయ ముందుగను।
వాశిగ హింసాకర్మము చేయుట వలదని, హరివ్యాసుకును॥ ౧౬.
శరణు బొందుచును నుపదేశంబును చక్కగ గైకొనవలయు।
కరమరుదుగ యీ యాజ్ఞ మీరినను ఘన చెరుపగు మీకనియు॥
ఇట్టి స్వప్నమును రాజు గనంగను యిష్టులతో గూడుకొని।
రట్టుజేయుచును భయభీతుండై రాజువచ్చె గుడికి యని॥ ౧౮.
హరి వ్యాసునిగని యంజలి హస్తుండై యనుగ్రహింపుం డనగన్
గురువరు డతనికి చెప్పదొడంగెను గొప్ప హింసమాను మికన్॥
నీదు రాజ్యమున హింసాకర్మము నెనరున నిలుపగ వలయున్।
పాదుగ రాజు వినుంగొని యటులనె ప్రకట పఱచి తా వెలయున్॥
అనుగ్రహంబును గైకొని పిమ్మట హరిభక్తుండై వెలసెన్।
పనిబడియచ్చట ప్రజల సమూహము ప్రబల భక్తినిం గలసెన్॥ ౨౧.
హరివ్యాసుడు చని జగన్నాథము నారునెలలు యటనుండి।
తిరిగెను మధురకు దాసుడు బాలుడు దీర్ఘ దండమిడుచుండి॥ ౨౨.

---

## త్రిపురదాసు చరిత్రము.

మధుర రాజునకు ప్రధాను డగుచును మహిని త్రిపుర దాసుండు।
విధితో గురు కృప జెందగ నాతడు విరక్తి నొందుచునుండు॥ ౧.
సకల ధనంబును కొల్లబెట్టి దా చనె బృందావనమునకు।
అకలంకయునగు భార్యయు పతియును హరిసేవను తగమెలగు॥ ౨.

త్రికాల పూజల వర్ణనమునకై దినమరిగెడ రిరుపురుసు।
వికాస మగునటు హరియు తన కృపను వెలయ జూపునయ్యెడను॥
ఒక యెడ నృపవరు డచటికి వచ్చుచు నుచిత దానములజేసి।
సకల జనులయా క్షేత్రమునందును చక్కగ తృప్తింజేసి॥ ౪.
శ్రీహరి పూజను చేయక పిమ్మట చేరెను తన పట్టణము।
సాహసముగ నా త్రిపుర దాసుగని సడలి వ్యసన మొందెసుము॥ ౫.
చెట్టు వేరునకు నీరును బోయక చెట్టు కొమ్మకిడి నట్టు।
ఎట్టకేల కారాజు హీనుడని యెంచుచుండె దానట్టు॥ ౬.
సతిని జూచి పతి బల్కెను నొకయెడ సర్వేశునకు వస్త్రమును।
హితముగ జేసియు నియ్య ఁలయున్నన నెలమి భాగ్య బలికెమును॥
అయాచితంబుగ నేడివచ్చినను యసత్తనుచు విడిచెదవు।
భయాపహంబని యింటి సొత్తు నటు పరుల కిచ్చితివి నీవు॥ ౭.
అవాప్తకాముడై శ్రీహరి యుండగ నలవస్త్రం బెందుకను।
నవీన వస్త్రముల్ స్వర్ణ ఛాయతో నానావిధముండగను॥ ౮.
అట్టి చింతనీ కెందుకు యనుచును నామెయు నతనికి జెప్ప।
పట్టి భద్రు డీసంకల్పంబును బుట్టజేసెనని యొప్ప॥ ౧౦.
త్రిపురదాసు నెడ నొక శిరాబుద్ధి తెరువుగ నుండంగనుచు।
నెపము లేక కానంగడియందును నేర్పున విక్రయపరచు॥ ౧౧.
షోడశ వీసముల్ చేతికి ... నె నూటిగ కంబలిగొనుచు।
పాడుచు హరి నొక కుంచెను గుట్టెను భక్తుడు హరికై మనుచు॥
గుడికి వెళ్లుచును నర్చకునింగని కుంచెను సన్నిధి నిడుచు।
పుడమిని దీనుని కైంకర్యంబని *పాదుగుము శ్రీ హరి కనుచు॥ ౧౩.
పూజారియుగని దేవయోగ్యమై పొందబడదు కుంచెయును।
ఓజను హరికిని శాలు జోడులును నొగి ననేక ముండగను॥ ౧౪.
కొరగాకుండును నీదు వస్త్రమిటు కోరిదెచితి వెందుకని।
పరుసను జెప్పగ త్రిపురదాసుడును వాసుదేవునకు మనవిని॥ ౧౫.

---

* పాదుగుము - కప్పుము.

అనాథుడనగు నా వస్త్రమిదియని యంగికార మొనర్చుమను।
వినీతుడగుచును వస్త్రంబచ్చట వెలసి యుంచి బోవగను॥ ౧౬.
మరు దినమందును ప్రాతఃకాలము హరి కారతి నియ్యంగన్।
తిరు మేనియు నటు చలితో వణకగ దిగులొందిరి చూడంగన్॥ ౧౭.
అనేక వైష్ణవుల్ గూడియు నచ్చట నంబరముల గప్పగను।
ఘనీ భూతమగు చలియును విడువక గజగజ వణకంగాను॥ ౧౮.
కలతల బెట్టిన పూజాచార్యుడు ఘనమగు నిద్రను నుండన్।
సలలిత కలలో త్రిపుర దాసుడును సమర్పింపు నా గుడ్డన్॥ ౧౯.
నాపై గప్పిన వణకు తీరునని నారాయణుడును జెప్పన్।
ఎపున నప్పుడె నాతడు దెచ్చెను ఎలమికుంచెనటు యొప్పన్। ౨౦.
శ్రీహరి మూర్తికి గప్పగ నప్పుడు చేరకుండెనటు చలియు।
బాహుళ్యంబగు కీర్తి దాసులకు ప్రబలంబగునటు జేయు॥ ౨౧.
అనేక వైష్ణవుల్ త్రిపురదాసునిన్ యమితము మన్నించిరటు।
పునీతులగు యా భక్తుల కలథను పాసగ బాలు వ్రాసెనిటు॥ ౨౨.

---

## లా ల న ఖో జి చ రి త్ర ము.

గురునిభక్తి లోతత్పరు లాలన ఖోజియనునొక భక్తుండు।
హరినామంబున సావధానుడై యనుతాపము గొనియుండు॥ ౧.
ఆతని గురుడును నిష్కపటుండై యందరకును దా జెప్పు।
పాడుగ నతనికి నంత్య సమయమున బయల ఘంటారవ మొప్పు॥ ౨.
అప్పుడు మీకును బోధ సిలుచునని నాతడు జెప్పుచునుండు।
మెప్పుగ దీని న్నితరులునమ్మక మెలగి వికల్పత నెగడు॥ 3
ఇట్టులనుండగ నొకయెడ ఖోజి యేగెను గ్రామంబునకు।
బెట్టిదముగ నాగురుని యంత్యదశ బేర్కొని వచ్చెను తనకు॥ ౪.
సచ్ఛిష్యుండును లేకపోయెనని చాలాచింతను బొంది।
కుత్సితమగు యీమల శరీరమును కోరి వీడిచె సుఖమొంది॥ ౫.

అతనికి జేసిరి సంస్కారంబుల నచటి జనులు గూడుకొని।
హితుడగు ఖోజి మూడవ దినమున యెలమివచ్చి తానువిని॥ ౬.
పరంధామమును గురుడు జెందెనని బహు ఖేదము తానొంది।
చిరంతనముండి నాతనియంత్యపు సేవ చేయలేనైతి॥ ౭.
అనుచు జెప్పుచును నాతండుండగ నచ్చట నరులందరును।
ఘనుడగు నీగురు జెప్పుచునుండెను ఘంటానాదము వినబడును॥
అంత్యపు సమయమునందును మేమును నాకాశధ్వని వినలేదు।
వంద్యమానుం డత డెటులగునని వడి నిందల నింపొందు॥ ౮.
ఖోజి వినుచును వార్లకుజెప్పును గురుడు వచ్చి స్వప్నములో।
వాశిగ గంటానాదము నాకై వరుసనుంచె దానిలలో॥ ౧౦.
వైకుంఠమునకు పోయెదననుచును వచ్చిచెప్పి నాతోడన్।
జోకను నాతడు వెళ్ళను పిదపను సుఖపదమును నటుగూడన్॥
ఇటులం జెప్పుచు ఖోజీయుండగ యెవరు నమ్మకుండిరటన్।
పటుతరముగ నొకదినమున ఖోజీ బాగుగ జలములనాడన్॥ ౧౨.
స్నానము జేసియు నాసనమందును చక్కగ తా కూర్చుండి।
మానసమున శ్రీ సద్గురు మూర్తిని మానుగ దలచుచునుండి॥ ౧౩.
కనులుమూసి యేకాగ్రమునుండగ ఘంటానాదము దివిని।
జనులు వినంగను మ్రోయుచు నుండగ సరగ లాలన్ ఖోజిగని॥
ముఖమందున శ్రీ రామరామయని ముక్తిని బొందెను నతడు।
సఖులు గాంచుచునునాశ్చర్యముతో సలిపిరి క్రియలను నపుడు॥౧౪.
ధన్యుండనుచును సద్గురు వచనము తథ్యమగుట జూపెనని।
మన్యమానముగ సార్థక పరచెను మహిని ఖోజి తనపెయిని॥ ౧౬.
రామరామయని వాక్యము జెప్పుచు రమ్యపదవి కేతెంచెన్।
పామరుడగుచును బాలకృష్ణుడు భక్తులదానుడై వెలసెన్॥ ౧౭.

## లాడుభక్తుని చరిత్రము.

జోత్ పూరున లాడూయను భక్తుడు సుజ్ఞానము కలవాడై।
సత్పాత్రంబున నన్నదానమును సలుపుచుండు నియతుండై॥ ౧.
నిరాశ యుక్తుడై భజనజేయుచును నిగుడి నడచె యాత్రకును।
విరాగ యుక్తుడై యొంటరియగుచును విశ్వ రచన జూచుచును॥
నానాతీర్థ క్షేత్ర దేవతల నవనవముగ తాజూచు।
పునీతుడగునటు సాధుజనుల తా పొందగనట సేవించు॥ ౩.
ఇటులం జూచుచు కాపురదేశము నేతెంచెను తగ నతడు।
పటుతరముగ నచ్చోటి జనంబులు బహునిర్దయులు గనెగడు॥ ౪.
వారలు శక్తిని పూజలజేతురు వరుస మద్య మాంసములు।
భూరి నివేదన లిచ్చుచు నుందురు *పార దుర్గను లయ్యెడలు॥ ౫.
పురుష బలిని యాదేవికి వారలు పొందుగ నిచ్చు చుందురటు।
నరుని యొక్కనిఁ వెతుకుచు నుండిరి నాణ్యంబుగ దేవికటు॥ ౬.
అకస్మాత్తుగా లాడుభక్తుడును నా సమయము నరుగగను।
ప్రకటంబుగ నటు నలుగురు వచ్చుచు బలిమిని బట్టుకొనుచును॥ ౭.
అంబ గుడికినటు గైకొని వెళ్ళగ నాతడు చిత్తము హరిపై।
కంబము వలె నిడి దేహభావమును కలియక నుండుచు నిల్పై॥ ౮.
జగజ్జీవనుడు విశ్వాత్మకుడును సర్వము హరియని యెంచి।
విగత మోహుడై యుండగ ముగ్గురు వీలుగ బట్టుచు మించి॥ ౯.
ఒక్కండప్పుడు ఖడ్గము నెత్తెను నొనరచంప దేవికని।
నిక్కంబుగ నిదిదేవియు గాంచుచు నెఱికోపము తానుగొని॥ ౧౦.
వికార రూపము తానటు చేకొని విపుల ధ్వని చేయుచును।
ప్రకారముగనే వారి నలుగురిని బట్టి చంపె నయ్యెడను॥
శ్రీహరి భక్తుని పాదము లందును శీఘ్రము దండము బెట్టి।
ఊహను నీ శుభరూపును గానక యున్మత్తులురై యుట్టి॥ ౧౧.

---

*పత్నితము.

తొందరజేసిరి క్షమింపు మనుచును దురుసుగ ప్రార్థనజేసి।
పంతము తోడను సౌమ్యరూపమున బాహువులెనిమిది వెలసి॥ ౧౩.
ఆడుచు పాడుచు నచ్చట నుండియు హరిభక్తుని తానుగని।
వేడిన వరముల నిచ్చెద ననగను విష్ణుభక్తుడామెగని॥ ౧౪.
నరబలి నీవును కోరుచు నుందువు నయముగ నదివిడువ వలెన్,
వెఱవక నిచ్చటి దేశపు జనులును విష్ణుభక్తి నుండవలెన్॥ ౧౫.
అంబిక బలికెను నటుల గాకయని యారాజు కలనుబోయి।
సంబరముగ నిటు విష్ణుభక్తుడును చనుదెంచెను తానయ్యె॥ ౧౬.
ఇచ్చటి క్షేమము కొఱకై వచ్చెను యెలమినీవు వానియెడన్।
అచ్చముగా నాతని యుపదేశము నరయ గొనుము గొనియాడన్॥
ఇది మొదలుగ నాద్వారము నందును హింసకర్మ వలవదని।
విదిత పరచగను నృపవరు డప్పుడు వే వచ్చుచు గుడికియని॥ ౧౭.
ప్రేతము లెల్లను నాతడు గాంచుచు పెంపున విస్మితుడగుచు।
సాదరముగ యాలాడు భక్తుని సరగున తానటు గనుచు॥ ౧౮.
శరణాగతుడై యుపదేశంబును చనువున గైకొనె నృపుడు।
పుర జనులందురు విష్ణుభక్తితగ బొందిరి విధితో నపుడు॥ ౨౦.
హరికీర్తనమును విష్ణుస్మరణయు హరిదిన యుపవాసంబు।
గురుతుగ దయయును భూతంబులపై గొనియాడిరి సతతంబు॥ ౨౧.
సాధుల సేవచే శ్రీహరి కృపకును సత్పాత్రులునైరి యటన్।
వేద వేద్యులగు భక్తుల దాసుడు విహితుడు బాలుడు జూడన్॥

---

## త్రిలోకుని చరిత్రము.

అగసాలుల లో త్రిలోకుడను నొక హరిభక్తుడు తగ వెలసెన్।
విగత మోహులగు సాధుల సేవలో విపుల ప్రీతుడై మెరసెన్॥
తన కుల వృత్తిని కుటుంబ పోషణ తరచుగాగ దాజేయు।
అనువుగ సత్యము తప్పక నడచును నమిత విరక్తుండయ్యె ॥ ౨.

నగలను జేయగ దొంగతనంబును నొగిజేయక తానుండు।
ప్రగల్భమగు తన కష్టార్జితమే ప్రాపకమని తలచుండు॥ ౩.
వివాహ మొక్కటి రాజునియింటిలో వెలయ, నగలు చేయుటకై।
జవానులంపగ త్రిలోకు కొరకై చనిరివారు పిలుచుటకై॥ ౪.
ఇతని బిలుచుకొని నృపుకడ కేగగ నిలపతి యాతని గనుచు।
హితవుగనొక నగ తనకు జేయుమని యెలమిని స్వర్ణమునిచ్చు॥ ౫.
చాతుర్యముతో పనులజేతువని సత్యవంతు వనివిందు।
పాదుగ నాకును నగను త్వరితమున పరగజేసి యింపొందు॥ ౬.
అగసాలుడు విని స్వర్ణమందుకొని యపుడె వచ్చె తనగృహము।
*తగవునవచ్చిరి భాగవతులు నటు తానుబొందె బహుముదము॥ ౭.
పిండి వంటలను పాకమునాతడు పెంపుగనటు జేయించెను।
దండిప్రీతితో భాగవతులకును తరుచుగాను వడ్డించెను॥ ౮.
భక్షణ వారలు పూర్తిగ జేయుచు బహుగమోద మొందిరటన్।
పక్షివాహనుని బాడుచు నాడుచు బాగుగనిరు దినముండన్॥ ౯.
అగసాలుండును మరచెను రాజుని యాజ్ఞను నా నగ కొఱకు।
పొగరున నరపతి నగ తోరమ్మని పొసగ భటుల నంపెతగు॥ ౧౦.
సేవకులాతని నిడికొని పోవగ చేసెనంజలి రాజునకు।
దేవర మీ నగ రేపటిదినమున దెచ్చియిచ్చెదని బెణకు॥ ౧౧.
యిదివిని నరపతి వాక్కుదత్తమును యెలమిని మరచితి వేని।
కుదురుగ శిక్షకు లోబడుదువు యన కోరివచ్చె నింటికని॥ ౧౨.
అగసాలుండును చింతాతురుడై యా నగ నొకదినమునను।
సొగసుగ చేయం బూనరాదుయని సుగమ మెదియు దోచకను॥ ౧౩.
మరుదినమిచ్చుట నుండిన యెడలను మరణ నిశ్చయ మనుచును।
అరణ్యమునకును పారిపో యెదా హరిదలచుచు రేయినను॥ ౧౪.
ఉదయముకాగనె నాతనిరూపును నొగి కృష్ణుడు ధరియించి।
కుదురు నగను తా జేయుచు నచ్చట కూర్చుండెను తగమించి॥ ౧౫.

---

* ఉచితప్రకారము.

రాజుని దూతలు వచ్చియు నాతని రమ్మనుచును పిలువగను।
ఓజను చేతుల నా నగ నిడికొని యోగి చనెనట నృపుకడను॥ ౧౬.
అవనీపతికిని నగనందియ్యగ నమితముదము నృపుజెందగ।
భువనంబుననే నిట్టినగను నెటు బొడగననని యింపొందెగ॥ ౧౭.
అమిత ధనంబును నృపవరుడిచ్చెను నగసాలునకును నపుడు।
క్రమమున వానిని యింటికి దెచ్చుచు కాంతచేత నిడుచుండు॥౧౮.
సామవు లేతెంతురు యీదినమున సరగవంట జేయుమను।
పాదుగ నుత్సవ మొనరింపందగు బాగుగనీ దినమునను॥ ౧౯.
సతియు వినుంగొని యాజ్ఞప్రకారము సలిపె వంట బాగాను।
ముదమున వచ్చిరి సాధుజనంబులు ముఖ్య వైష్ణవు లగుచును॥ ౨౦.
త్రిలోకు రూపున శ్రీహరివార్లకు తీర్చెను పూజావిధులగ।
సలీనులగుచును వైష్ణవులందరు సరిపజ్తిని నయ్యేడలగ॥ ౨౧.
వారలందరటు తృప్తిగ భక్షణ వాంఛను జేసిన వెనకగ।
నారాయణుడటు భక్షణ జేయుచు నతివెతో జెప్పక వేగగ॥ ౨౨.
ప్రసాదమును తా నరణ్యమునకును బట్టిచనియు త్రిలోకును।
కృశీభూతుడగు సాధువేషమున కృష్ణుండటు గాంచుచును॥ ౨౩.
దారిదప్పినే బహు భ్రమజెందితి దారిజూపు నాకనగగ।
వారక నాతండడిగె నప్పుడును వచ్చితీవెట నుండనగగ॥ ౨౪.
గ్రామమునందును త్రిలోకునింటను గౌరవమున వసియించి।
వేమరు నాతడు మృష్టాన్నంబుల విధితో బెట్టెనుమించి॥ ౨౫
అనేకభక్తుల గూడియు నాతడు నమితోత్సవమును జరిపె।
ఘనీ భూతమగు పక్వాన్నంబుల గరిమెతోడ తగ సలిపె॥ ౨౬.
దేహాయాసము కలుగుచు నిద్రయు తెంపున వచ్చుచు నుండు।
మోహము జెందుచు మార్గముదప్పితి ముదిమి జెంది తనుచుండు॥
ప్రసాదమును నే దెచ్చితి నీవును భక్షింపుము శీఘ్రమున।
విశేషముగ తనకృపను జూపుచు వే భక్షణ సలుపుమన॥ ౨౭.

అగ సాలుండును మహాప్రసాదమని యారగించె తానపుడు।
మిగులాశ్చర్యము నొందుచు నాతడు మించిన ప్రీతిని నతడు॥ ౨౯.
ఉత్సవ మొందుకు జేసె త్రిలోకుడు నొప్పుగ జెప్ప మనంగ౯।
విచ్చలవిడి శ్రీ హరియు బల్కెను విపులత నొకనాణ్య నగ౯॥ ౩౦.
రాజునకును దా జేసియునియ్యగ రమ్యముతో ధనమిచ్చె౯।
ఓజను నందుకై యుత్సవ మప్పుడు యుచితంబుగ నెరవేర్చె౯॥
ఇదివిని భీతిని బొంచుచు సాధుతొ నెలమివచ్చె నింటికిని।
సదయుడు శ్రీహరి యంతర్ధానుడై చక్క వెళ్ళె పొందుగని॥ ౩౨.
సతినిగనుచు పతి యడిగెను సంగతి జరిగిన దేమగును యని।
అతివినయము తో నామెయు దెల్పగ నంతయు క్రమమునను విని॥
శ్రీహరి తానే కంసాలుండై చేసె తృప్తి నృపునకును।
బాహుళ్యంబగు తొందర నిచ్చితి భగవంతుఁ డకని జెపును॥ ౩౪.
అనేక విధముల స్తోత్రము జేయుచు హరిభక్తిని తానుండు।
పునీతుడనుచును మాన్యత జనులచె పొందబడుచు నటనుండు॥ ౩౫.
సతీపతు లిద్దరు మాధవు భక్తిని సలిపిరి యీవిధమునను।
పతితపావనుని దాసుల దాసుడు బాలకృష్ణుఁ డియ్యలను॥ ౩౬.

---

## స జా ణ క సా యి చ రి త్ర ము.

సజాణుడనుచును కటికె కులంబున సద్భక్తుం డొకడుండు।
స్వజాతు లెడదా మాంసము గొనుచును సకలుర కమ్ముచునుండు॥
విరక్తిపరుడై ప్రపంచ కృత్యముల్ విష్ణు ప్రీతిగను సేయు।
వెలుపున హింసాకర్మము తానై విధినిం జేయడుమరియు॥ ౨.
అసత్య వచనము జెప్పక నెప్పుడు హరిభక్తుల పూజించు।
రసయుక్తంబుగ నన్నము బెట్టును రామ ప్రీతియని దలచు॥ ౩.
భూతదయయును పశ్చాత్తాపము బొందియుండ గా నతడు।
సాధుమార్గమున శుచిర్భూతుడై సర్వేశుని తలచుండు॥ ౪.

పరమార్థంబున కనువగు భార్యయు పతివ్రత యగుచునుండు।
గురుతుగనెంతయు సాధులపూజను గొనియాడుచు తానుండు॥ ౫.
మాంసము తూచుట కొఱకై యుంచెను మంచిదైన యొక శిలను।
కాంచనఛాయతో నదియు నుండగను కనుగొనె ద్విజుడొకడటను॥
సాలగ్రామపు శిలయైయుండగ సజ్జాణు గని ద్విజుడనియెన్।
బాలభావమున నీకుం దెలియదు భగవన్మూర్తి యిదియనియెన్॥ ౬.
నీయింటను నిది యుండంగూడదు నేగైకొని వెళ్లెదను।
బాయకనిందుకు వెలనడిగినయెడ బాగుగ నిచ్చెద నేను॥ ౭.
సజ్జాణు డిదివిని ద్విజునకునిచ్చెను సాలగ్రామము నపుడు।
సుశీలుడగు యా బ్రాహ్మణుడింటికి సుఖముగదా దెచ్చియిడు॥ ౮.
వైదిక విప్రుల గూడియు నాతడు వరుసనుత్సవ మొనరించె।
ప్రాదుర్భూతుం డయ్యెను హరియని బహుతర పూజలజేసె॥ ౧౦.
ఆదినమందును రాత్రిని ద్విజునకు హరిస్వప్నంబున వచ్చి।
పాదుగనేనటు సజ్జాణుడింటను బహు సుఖముంటిని మెచ్చి॥ ౧౧.
నరసింహ్మంబగు మూర్తినగుదునే సరినీయెడ నుండనను।
తెరువుగననునీ వాతనికిమ్మిటు తెల్లవారగ ననుచును॥ ౧౨.
నాదుమాటనిటు వినకుండినయెడ నాశ మొందెద వనిజెప్పన్।
భీతుడై విప్రుడు మేలుకొనుచుదా పెద్దరాత్రియై యొప్పన్॥ ౧౩.
కటికెవాడు తగ నాదినమందును ఘనమగు క్లేశమునొంది।
పటుతరముగ తా నన్నపానముల భక్షింపక నెళవొంది॥ ౧౪.
సంకట పడుచును నుండగ విప్రుడు నరగమూర్తి దెచ్చుచును।
బింకము లేకను నీవె మూర్తికిని పెనగి పూజచేయుమను॥ ౧౫.
తానటు గాంచిన స్వప్నము జెప్పుచు దామోదరు కృపనీపై।
మానుగ నున్నది భక్తుడ వీవని మన్నన జేసెను నిలపై॥ ౧౬.
అతిమొదమొందుచు కటికెవాడటను హరిమూర్తిని తాగొనుచు।
సదయుడై నరహరి పూజలజేయుచు చనువుగ మరి భక్షించు॥ ౧౭.

కంజదళాక్షుని కిరవై యుండెను కటికెవాని భక్తియును।
అంచితముగ తా సేవల గొనుచును నమితప్రీతి నుండెమును॥
ఒకయెడ సజాణు జగన్నాథమున కొనరబోవ దలచగను।
ప్రకటిత జనములు యాత్ర బోవుటకు ప్రబలంబుగ రాగాను॥౧౯,
సాలగ్రామము వెంబడి గైకొని చనెను సజాణుండపుడు।
పీలుగ నిత్యము పూజల జేయును విధి నీమంబులనాడు॥ ౨౦.
ఉదరవృత్తికై భిక్షమడుగుచును నుచిత యాత్ర తా జేయు।
కుమరుగ రాత్రిని దూరముండుచును కూడడు యితరులమరియు॥
పట్టణమొకటిని మార్గమునందున ప్రజలందరు చూడగను।
దిట్టముగా నటు దిగెను యాత్రయు తీరుగ నా కటికయును॥ ౨౨.
నగరము లోపల వెళ్ళగ భిక్షకు నాతి యొకతె యచ్చటను।
సొగసగు నీతని సాధురూపమును జూచి పొందె మోహమును॥
భోగేచ్ఛను దానుంచుకొనుచును పొసగనింట స్థలమిచ్చి।
వేగమె బియ్యము పప్పుప్పును దా విధితో వంటకై యిచ్చి॥ ౨౪.
ఆదరమును దా జేయగ నాతడు నంతరభావ మెరుగకను।
ప్రీతియుక్తమగు భక్తిభావమని ప్రేమనునట నుండగను॥ ౨౫.
సగము రాత్రిని యాతని కడకును చక్క వచ్చె నా సతియు।
వెగటుగ జెప్పెను నీతోడను నే వేంచేసెద తగననియు॥ ౨౬.
ఆతడు బలికెను నీదు భర్తయును నరను పరుండి యుండగను।
పాదుగనాతని విడిచి వచ్చుటయు పంతము గాదన గాను॥ ౨౭.
సతియిది వినుకొని యింటను వెళ్ళుచు సరగ నరికె పతిశిరసున్।
విదితంబుగ తల నిడికొని కరముల వెళ్లి సజాణుని గనుచున్॥౨౮,
పతినిం జంపితి నీకై నేనిటు పరగభోగ మిమ్మనును।
హితవుగా దనుచు భక్తుండచ్చట నెలమి నొప్ప కుండగను॥ ౨౯.
సతియును జెప్పను నాయిష్టంబును జరపక యుండిన యెడలన్।
అతి యనర్థమును నీకై జేసెద నరసిచూడు మియ్యెడలన్॥ 30.

ఆతడు లోబడకుండగ సతియును నతిరోదన జేయుచును।
వేధ నొందునటు శంఖధ్వనితో వీధి నడమ నుండగను॥ ౩౧.
జనులు ననేకులు పోగయ్యిరి యటు సతియు జెప్పె వారలకు।
సునిశ్చితంబుగ నితడు నాపతిని సూటిగ చంపియు మెలగు॥ ౩౨.
దొంగవైష్ణవుడు దురిత తలంపున తొంగివచ్చి నాయెడను।
అంగన యగు నాకీ యనర్థమును నతడు జేసె ననగాను॥ ౩౩.
అధికారునికడ కీడ్చిరివారలు నలవిష్ణు భక్తునియపుడు।
విదితపరచె సతి పతిని జంపెనని విష్ణు భక్తు డీతండు॥ ౩౪.
భక్తుని గని యధికారుండడిగెను భద్రమె యిటు సేయుటయు।
సక్తచిత్తుడై యథార్థ సంగతి సజ్జాణుడటు జెప్పుటయు॥ ౩౫.
అధికారుండును నాలోచించుచు నటు దాగూర్చుండగను।
పదుగురు జెప్పిరి వ్యభిచార స్త్రీ పలుకును వినదగదిటను॥ ౩౬.
అసత్య వచనము స్త్రీయు బలికెనని యధికారుండును దలచె।
కుశలంబగునటు సజణుకసాయిని కుదురుగ విడువంజేసె॥ ౩౭.
జారస్త్రీయటు జెప్ప నప్పుడును చంపె నాపతిని నితడు।
నేరముగల యా కరమును నరుకుట నిబంధనం బైయుండు॥ ౩౮.
నాదుమాట వినకుండిన యెడనే నరపతితో జెప్పెదను।
పాదుగ నిదివిని యధికారుండును భక్తునిచెయి నరకగను॥ ౩౯.
సజ్జాణుడప్పుడు దుస్సహ కర్మము సలిపితి నును నేననుచు।
అజాజీవితుడు రోదనజేయుచు యాత్ర వెనకదానడచు॥ ౪౦.
చూచినవారలు చెప్పిరి యప్పుడు చోరతనము జేయుటయు।
నీచ హస్తమటు నరకంబడెనని నిగుడి పలుకుల ననుటయు ౪౧.
సజణకసాయీ శ్రీహరి భజనను సంతోషముతో జేయు।
ప్రజతో మార్గము నడవగ జేరెను పట్టణమునకు దాపయ్యె॥ ౪౨.
జగన్నాథుడును నర్చకులంగని స్వప్నమునందును జెప్పె।
మిగుల భక్తుడగు సజణక సాయికై మీరలెదురు చననొప్పె॥ ౪౩.

మర్యాదలతో శిబికపై నతని మానుగ నెక్కించుకొని।
పర్యాప్తంబగు వాద్యంబులతో పరగగుడిని జేర్చుమని॥ ౪౪.
అతివిస్మితులై పూజాచార్యులు నలవాద్యము శిబికయును।
హితులైచేకొని వచ్చియు యాత్రలో యెవరు సజణుడనగాను॥
ఇతర జనంబులు సజణుకసాయిని యేపుననటు చూపించన్।
కుదురుగ నర్చకులా తనిగాంచుచు, గోవిందుడు తెగువరుసన్॥
శిబిక పైని నిను కూర్చుండంగొని చేర్చుమనెను తనగుడిని।
సొబగున నీవును యెక్కుము శిబికపై సొగయ నరుగుద మనగవిని॥
ఇతర యాత్రాపరు లాశ్చర్యమును నింపుగతగ బొందిరటన్।
అతులితముగ తాదాంగమై యుండియు హరి ప్రీతిని గాంచెనటన్॥
సజణుడు బలికెను శిబికపైననే సైరిం చెక్కను యిటను।
నిజముగ పాపము జేయక యుండగ నెనరుంచక హస్తమును॥ ౪౯.
ఖండన యొందుకు చేయించెనుయటు ఘనుడు జగన్నాథుండు।
మండిత ముక్కును తెగ గోసియుమరి మర్యాదల సలిపినటు॥
గోవిందుండును నాపై యెందుకు కోపము గొనియెను యనియు।
భావంతంబుగ కన్నీరొలుకుచు దండికరుణ మూర్త్యనియు॥ ౫౧.
పురాణమందుల ప్రసిద్ధమయ్యెను పొసగ నదియు నన్నృతంబో।
సరాళముగనే కరణత్రయముల సలుపుసేవ నియతంబో॥ ౫౨.
సజణుండిట్టుల వ్యసనము బొందగ జగన్నాథు డయ్యెడను।
ప్రజలకు దెలియక నతనికిమాత్రము బాగుగ చూడంబడును॥ ౫౩.
హరి చరణంబుల కాతడు దండము నప్పుడె తగ బెట్టుచును।
గురుతుగ నడిగెను కరమునెందుకై కొట్టజేసితి వనగాను॥ ౫౪.
భగవంతుండనె పూర్వజనన్మమున బ్రాహ్మణు డౌదువునీవు।
భగీరథీకడ స్నానముజేసియు భజింపుచుంటివి నెళవు॥ ౫౫
కటికవానిచే విడబడి యురికెను కష్టపడుచు నొక గోవు।
తటుకున వాడును వెంబడె వచ్చుచు తరిమిన పసువెటు బోవు॥

అనుచు నతడు నిన్నడుగగ నీవును హస్తసంజ్ఞ చూపగను।
నెనరున కటికెయు దానిబట్టుకొని నిహతజేసె నటునున్న॥ ౫౭.
ఈజన్మంబున గోవు స్త్రీయగుచు హింసకుడును పతియగుచు।
రాజిల్లిరి బహుతొందర లొందుచు రంజిలబడక నెగడుచు॥ ౫౮.
పూర్వవిరుద్ధము బొందుచు వనితయు పురుషుని చంపెను యివుడు।
దూరుట వీవును నాపెగృహమునకు తొలి వాసనయైయుండు॥
గోవటు బోయెను యనుచు హస్తమున గుఱిచూపిన హేతువచె।
నీవుసు కరమును యీజన్మంబున నేరమునకు విడవలసె॥ ౬౦.
ఈవిధమున నీజన్మాంతరగతి యేర్పడి యుండుట చేతఁ।
కావలసిన పని జరగంబడెనిటు ఘనబుణ మిటు తీగుకతఁ॥ ౬౧.
భజన భావమున నీదు పద్ధతియు బఱగె పూర్వవాసనచె।
సుజను లందరును మెచ్చగ నీవును సుగతి బొందుదువు హెచ్చె॥ ౬౨.
ఇటులం జెప్పుచు నాతని కరమును యెప్పటివలె హరి జేసెఁ।
పటుతరముగ నాజ్ఞనసమూహమటు బహుముద మొందుచు వెలసెఁ॥
జయజయ శబ్దము భక్తులు జేయగ జగన్నాథ క్షేత్రమును।
నియమ యుక్తుడై సజణకసాయీ నెనరున సేవించుచును॥ ౬౪.
అతి హర్షముతో శ్రీహరి రూపును నాతడు తగ దర్శించి।
పతిత పావన యను బిరుదు చక్కనై బఱగెననుచు మోదించి॥
శ్రీహరి రూపును నామము నెప్పుడు చింతించుచుదా వెలసెఁ।
బాహుళ్యం బగు ప్రియభక్తులకును బాలుడు దాసుగ వెలసెఁ॥ ౬౬.

---

## నరవాహను చరిత్రము.

మహానది తీరమునందును నాపికు మహి నరవాహనుడనుచు।
బహుతరముగదా సాధుల సేవయు భగవద్భక్తిని గొనుచు॥ ౧.
రాధా కృష్ణాయ నెడు స్మరణయును రంజిల జేయుచునుండు।
సాధు మార్గమున పడవల దోలుచు సంసృతి గడుపుచునుండు॥ ౨.

హరి భక్తులు నటుగట్టు దాటుటకు నడుగడు తగు ద్రవ్యమును। ౩.
దురుసుగ నాతడు పేదసాదలను తోడ జేర్చు గట్టుకును॥
ధనవంతులు తమ సంతోషముచే ద్రవ్యమెద్ది యిచ్చినను।
మనసున మోదము నొందుచు నాతడు మన్నించును వారలను॥ ౪.
ఒకయెడ కొందరు గూడియు నతనిపై యోర్వలేక చాడీలన్।
ప్రకటంబుగ తమనృపునకు జెప్పిరి బహు భంగుల నయ్యెడలన్॥
క్రోధయుక్తుడై నరపతి బల్కెను కొల్లబెట్టుమనె నిల్లున్।
వేధను భృత్యులు నరవహు నిలు చని విత్తము గానకపీలున్॥ ౬.
వారలు నాతని బట్టి దెచ్చిరటు వరుసను నరపతి యెడను।
దూరుచు బల్కిరి యీతడు ద్రవ్యము తోడగి యెటనో దాచెనను॥
ఇదివిని నరపతి యడిగెను నరవహు నెట నిడితివి ద్రవ్యమును।
విదిత పరచకనునుండే వరకును విధినికారా గృహమునను॥ ౮.
ఉండవలయునని యాజ్ఞ నియ్యగను నొప్పుగ కింకరులపుడు।
దండి కొందరల బెట్టుచు నాతని తరిమికారా గృహమపుడు॥ ౯.
పగలంతయు తానన్న పానముల భక్షింపక యుండగను।
వెగటుగ నాతని దాసియన్నమును వెలయదెచ్చు రేయినను॥ ౧౦.
దాసిని గాంచుచు నరవహు బల్కెను తగులబడితీ గృహమునను।
వాసిగ నాయెడ ద్రవ్యమంతయును వ్రయపడె సాధువులకును॥ ౧౧.
అవనిపతికి నేనేమి జూపెదను హరికృష్ణా యనగాను।
వివరించెను యాదాసి యతనితో విష్ణుమూర్తి నెంచినను॥ ౧౨.
సంకట మంతయు నివారించబడు సలుపుము నాతని భజనన్।
పొంకము తోడను నీవును బహుగా పుణ్యకర్మముల లోనన్॥ ౧౩.
నీదుడబ్బునటు వ్రయము జేసితివి నీరజాక్షు రక్షించు।
పాడుగ శ్రీహరి సంకటమున బహుభక్తుల గాచెను యనుచు॥ ౧౪.
ఆతని నామము జపము చేయుమని యామెయు జెప్పగ నతడు।
రాధా కృష్ణయనుచును జెప్పుచు రంగనిపై చిత్తమిడు॥ ౧౫.

విశ్వవ్యాపక గోవిందాహరి విడువుము భవభ్రమ నుండి।
నశ్వరమగు యీసంసారముచే నష్టమొంది తిటనుండి॥ ౧౬.
అనేకభక్తుల సంకట మందును నవని బ్రోచితివి నీవు।
జనార్ధ నాహ్వాయ నాకు నిపుడుయీ సంకటమును దీర్చుదువు॥
శ్రీహరి యిదివిని మూడవ దినమున ఛేదించుచు బేడీలన్।
మోహ మొందునటు రాజుని కలలో మురరిపు వెళ్ళెను లీలన్॥౧౭.
ఉన్మత్తుడవై రాజగర్వమున నుత్తముడగు నరవహుని।
సన్మానించక కుమతుల మాటల సరియని యిడితివి చెఱను॥ ౧౮.
సాధుసేవలో నిరతుడై యాతడు సద్వ్యయ పరచెను ధనమున్।
సాదరముగ నీవాతని కాళ్ళకు సరగబెట్టు వందనమున్॥ ౨౦.
ఇదిగని నృపవరు డాశ్చర్యముతో నేగెను చెఱసాలకును।
సదయుడై యతనికి దండము బెట్టుచు సరిమన్నన జేసెమును॥ ౨౧.
నరవహు డప్పుడు నింటికి వెళ్లెను నరహరిని భజించుచును।
ఇరవొందెను దా పూజ్య మానుడై ఇల బాలుడు మ్రొక్కగను॥

---

రా య సిం గు అం గ దు చ రి త్ర ము.

రాయ సింగుడని అంగదు డనియును రంజిల్లిరి సోదరులై।
బాయక వారలు రాజరీకమును పదపడి చేసిరి మైలై॥ ౧.
అంగదు తమ్ముండతని భార్యయును హరిభక్తిని తగనొంది।
ఇంగితముగ నొక సత్పురుషుని యెడ నెలమిచూచి హరిభక్తి॥ ౨.
ఉపదేశంబును గైకొని నామము నుచితంబుగ దానుడువు।
నెపమున తానటు నిష్ఠను నుండగ నెనరున నొకయెడ నెళవు ౩.
పట్టణమందును గురుడును రాగను బహుమోదము తానొంది।
దిట్టముతో తన యాచార్యుని తగ దెచ్చె నింటి కిరవొంది॥ ౪.
ఉపచారంబగు పూజల నామెయు నుచితంబుగ జేయగను।
విపరీతంబిది యనుచును భర్తయు విపుల క్రోధమొందుచును॥ ౫

సతికిని దేవుఁడు భర్తయె యగునని చాటించుచు తగ దాను।
హితమగు శ్రీ గురుపూజను నామెను నెలమి చేయ నియ్యకను॥ ౬.
అతినిర్బంధము చేయఁగ నామెయు నన్నపానముల విడిచి।
గతి నీవేయని రామచంద్రునిఁ ఘట్టిగ నటు చింతించి ౭.
వినమిత యగుచును మూఁడు దినంబులు విశ్వసించిదానుండన్।
ఘనుఁడగు శ్రీహరి యంగదుకలలో కటాక్షించితగ జూడన్॥ ౮.
ప్రొద్దు బొడవగను నంగదు లేచియు పోసగ నరిగి సతికడను।
ముద్దు మోముగల శ్రీహరి రూపును ముదమున జూచితి నేను॥ ౯.
నీప్రసాదమున నాకుఘటించెను నీరజ నాభుని సేవ।
ఏప్రకారమున నేను తరింతునో యీశు భజనకే త్రోవ॥ ౧౦.
అనుచు జెప్పుచును ననుతాపముతో నాచార్యునితా బిలిచి।
ఘనసేవల జేసి యనుగ్రహమును గైకొనె తానటు వెలసి॥ ౧౧.
సతిపతులిద్దరు వైష్ణవ భక్తిని సలుపుచు ప్రీతినిబొంది।
హితులై సాధుల పూజలజేసిరి యిలలో ఖ్యాతిని జెంది॥ ౧౨.
ప్రభువగు నన్నయు తమ్ముని యొకయెడ పంపెను దేశాంతరము।
శుభదంబగునటు సేనను గూడియు పొరది సలిపె సంగరము॥ ౧౩.
జయశీలుండై యంగదుడచ్చట సకలము తగ కొల్లగొనన్।
క్రియగలరత్నముల్ నూరుదొరికెనుటు ప్రియతమముగనుండగనన్॥
ఒక్కటి తనయెడ నిడుకొని తక్కిన యుచితమా రత్నములను।
చక్కగ పంచెను వైష్ణవ జనులకు సంతోషంబొ గాను॥ ౧౪.
ఆ రత్నంబును జగన్నాదునకు నర్పణ చేయం దలచెన్।
ధీరుడై యన్నకు బహు ద్రవ్యంబును దెచ్చియు ముందుగ నుంచెన్॥
అమూల్యమగు నా రత్నముమాత్రము నతనికి జూపకయుండె।
కుమార్గ వర్తులు నృపునకు దెలుపగ కోరి యిమ్మని నృపువేడె॥ ౧౫.
అన్నకు తమ్ముడు రత్నమియ్యనని యనువుగ తా జెప్పగను।
పన్నిగ నన్నయు క్రోధము నొందుచు బైటికి చూపక తాను॥ ౧౬.

తమ్ముని యన్నయు భోజనమునకై తన యింటను బిలుచుచును।
సొమ్మసిల్లగను భగినితో జెప్పియు చొక్క విషపు భక్ష్యమును॥ ౧౯.
పాకంబగునటు చేయించగ మరి భగిని దెచ్చి వడ్డించు।
వీకను నాతడు హరియె భోక్త యని విష్ణునకు నివేదించు॥ ౨౦.
ఆసమయంబున నావేశముతో హరియు భగిని ముఖముగను।
వేసిన భక్ష్యము భక్షణ చేయకు విషమిశ్రం బనగాను॥ ౨౧.
అంగదు డనియెను హాకిరి సమర్పణ మనువుగ జేసితి నికను।
రంగని శేషమా ప్రసాద మిప్పుడు రంజిల్లుచు తినవలెను॥ ౨౨.
అనుచును జెప్పుచు సమగ్రముగనే నాతడు తగ భక్షించెన్।
ఘన విషమైనను హరికృప నాతని కలతల జెందక నుంచెన్॥ ౨౩
సతికడ వచ్చియు విషమును బెట్టిన సంగతి తగ దెలుపుచును।
అతికష్టముతో నచ్చటనుండుట యనువుగాదని యనుచును॥ ౨౪.
పతిసతు లిద్దరు జగన్నాథమునకు పదపడి వచ్చిరి యపుడు।
ఇదివిని నృపుడును క్రోధము నొందుచు నెలమి బంపె సైన్యమటు॥
అంగదుని బట్టి రత్నము తెమ్మని యాజ్ఞయిచ్చె మంత్రికిని।
ఇంగితముగనా ప్రధాని వేళ్లుచు యెరిగించెను సంగతిని॥ ౨౬.
అవనీపతి యారత్నము నిమ్మని యడిగెననుచు దా జెప్పెన్।
సవినయముగ యంగదు మణి జూపుచు జగన్నాథునకు యొప్పెన్॥
అనుచును జెప్పుచు సరోవరంబున నాతడు మణిబడ వేసెన్।
వెనకనె వచ్చిన యానృపుసైన్యము వెదకగ గుంటను వరుసన్॥ ౨౮.
అంగదు డనియెను వారల జూచుచు యారత్నము హరిమెడను।
పొంగుగనట్లుగ నుండను నిచ్చట పొందియుండ దనుచును॥ ౨౯.
మీరలు సన్నిధి వెళ్లిచూడుమని మెల్లగ నతడన గాను।
వారక మంత్రియు హరి సన్నిధిలో వచ్చుచునటు చూడగను॥ ౩౦.
హరి కంఠంబున రత్నముండగని యడిగెనెక్కడి రత్నమని।
తిరముగ నదియిటు క్రిందబడుండగ దెలిసి పూజాచారకిని॥ ౩౧.

కలలో శ్రీహరి జెప్పె నతనికిని కంఠామణి చేయుమని।
మెళుకువతోడను జేసెనట్టులనె మేలయ్యెనని జెప్పవిని॥ ౩౨.
విష్ణుభక్తిని రాయ్‌సింగ్ బొందుచు విపుల ప్రీతి నుండెనటఁ।
కృష్ణ దాసులకు దాసుడు బాలుడు కృపాపాత్రుడైయుండఁ॥ ౩౩.

## గు ణ వ తి చ రి త్ర ము.

పృధుయను నరపతి కొమార్తెయగుచును పేరున గుణవతి యనుచు।
పతియు నామెకు మాధోసింగను ప్రజాపాలకుండుంచు॥ ౧.
సతిపతు లిద్దరు సంసారంబును చక్కజేయుచుండగను।
కుమరుగ పుత్రుడు జనియించెను మరి గుణవతికిని నయ్యెడను॥ ౨.
తనయుని సేవకు నృపవరుడప్పుడు దాసి నిడెను సతికడను।
అనువుగ దాసియు పనులు జేయుచో హరి నామంబు నుడువును॥
ఉయ్యాలలోపల బాలుని యుంచుచు నూపుచునుండును నటను।
చయ్యన కృష్ణా హరి రామాయని చనువుగ ననుచుండుమును॥ ౪.
గుణవతి వినుచును యేమిజపింతువు కురుతుగ నది జెప్పుమను।
వినితయై దాసియు నామెకు జెప్పెను విష్ణు పేరు నుడివెదను॥ ౫.
నాశవంతమగు నీదేహంబిటు నశించబడు నిమిషములో।
పాశబంధముల విడిచియు శ్రీశుపై భక్తినుంచవలె నిలలో॥ ౬.
గుణవతి వినుకొని భగవద్భజనను కోరితనకు జెప్పుమను।
చనువున దాసియు నటుల జేతునని స్నానమొనర్చి రమ్మనెను॥ ౭
ఉదకము లాడుచు గుణవతి రాగనె యుచితపూజ చేయించు।
మధు సూదనునకు నర్చనాదులను హితంబుగ గావించు॥ ౮.
వ్రజవాసియునగు కృష్ణనాధుని వర ధ్యానము సేయుమను।
గజిబిజిలేకను రాజస్త్రీయటు గట్టిగ బట్టె బోధమును॥ ౯.
దినదినమునకును శ్రీహరి భక్తియు సిద్ధినొందుచును రాగఁ।
ఘనమగు ప్రేమను కంజాక్షునిపై కన్నీరొలుకును సొక్కఁ॥ ౧౦.

ఇంటిపనులయెడ పతిపుత్రులయెడ నీప్సితలేకనె యుండు।
కొంటె తనంబున నృపవరు డొకయెడ కుదురుగ జూచుచు నాడు॥
ఇట్టి యవస్థ నీకేల గలిగెనని యెలమిని యడిగెను నృపుడు।
పట్టుగ గుణవతి బల్కెను శ్రీహరి పాదంబుల మనసుండు॥ ౧౨.
ఐనను యాతని దర్శనంబు నా కబ్బలేదు యనగాను।
హీనుడు నరపతి క్రూరదృష్టిచే యెగ్గున సతిని గనగను॥ ౧౩.
భయమున నామెయు కనులుమూయగను భగవంతుం డగుపడియెన్।
నయముగ నాలుగు బాహువులుండగ నానాలంకృతివెలయన్॥
అట్టి రూపమును చూడగ కనులకు నతి విశ్రాంతియు గలిగె।
బెట్టెను యామెయు దండము హరికిని ప్రియమోదంబై చెలగె॥
శ్రీహరి తనచెయి సుందరి గుణవతి శిరముపైన తగనుంచు।
బాహుళ్యంబగు భయమును బొందకు భక్తసులభు డేననుచు॥ ౧౪.
అటులం జెప్పగ నామెయు కనులను నప్పుడె నట తెఱవగను।
పటుతరముగ తా క్రోధయుక్తుడై బలికె ధరపతి సతితోను॥ ౧౫.
సాధువులందరు గృహమరుగుటచే సంసారము తెరలయ్యెన్।
ఈదిన మొదలుగ సాధువులిచ్చట నెపుడరుగుట వలదనియెన్॥
దానినిగాంచుచు యిట్టి చేష్టలలో తనసతినుంచకు మనుచు।
దేశావరులను నటురానియ్యక దిట్టపరచె తాగనుచు॥ ౧౬.
నరపతి వెళ్ళిన పిదప గుణవతియు నారాయణునిందలచు।
పరమ సాధువుల పాదతీర్థమును బానిసెచే దెప్పించు॥ ౨౦.
శ్రీహరి నామము స్మరించుచును దా చిత్తమలర జేయంగన్।
ఊహాను మంత్రియు సభక్తపూర్ణుడు నుర్విపతికిది దెలుపంగన్॥
అతిక్షోభను యా నరపతి చేకొనె, యట నా సమయము లోను।
సతియు తనశిరము నాపికునివలన క్షౌరము జేయించె మును॥ ౨౨.
ఆభరణంబుల నన్నియు విడుచుచు నల్ప వసన మిడుకొనును।
ప్రాభవ తులసీ మాలభూషణము భక్తి ప్రీతి వేసికొను॥ ౨౩.

గోపీచందన మూర్ధ్వపుండ్రమును గురుతుగ దా వేసికొని।
వేపారగ శ్రీ వైష్ణవ సాధుల నెలమిని నటు బిలుచుకొని॥ ౨౪.
పూజల సేయుచు నతి వైరాగ్యము పొందియుండె నా సతియు।
వాసిగ నృపునకు మంత్రియు దీనిన్ వరుసతోడ దెలుపుటయు॥
క్రోధముతో నా రాజు పిలిచి తన కుమారునకు జెప్పగను।
నీతిని కొమరుడు తండ్రి మాటకును నెటువిరుద్ధ ముండకను॥ ౨౬.
పాత్రున నుండుచు తల్లిసార్థకము పొందు ననుచు తగ దలచు।
ఇత్తరి నుండగ నిలపతి నలుగుర నెలమి సతికడ కేగనుచు॥
ఉత్తర విచ్చెను నామెను చంపియు నొప్పగ రావలె ననుచు।
సద్దు లేకనటు వారలు వచ్చిరి చంపవలెను సతి ననుచు॥ ౨౮.
ఆసమయము సతి శ్రీహరి మూర్తిని యర్చించుచు గృహముండు।
వాసిగ భృత్యులు వచ్చిన సంగతి వనితయు నెరుగక యుండు॥ ౨౯.
శ్రీహరి యప్పుడు వ్యాఘ్ర రూపమును చేకొనె మందిరమునను।
మోహము నొందక గుణవతి పూజను ముదమున జేసెనుమున్ను॥
ఇట్టి రూపమును యీశుడు బొందుట కేమి హేతువో యనుచు।
దిట్టముగానటు పుష్ప గంధముల దేవుని తగ పూజించు॥ ౩౧.
సాధుల పూజకై బైటికి రాగనె సార్వభౌముని భటులన్।
పాదుగ జూచెను నా సమయంబున బైటికరిగె వ్యాఘ్రమిలన్॥
మహాభయంబును జూపుచు నలుగుర మరణ మొందగను చంపెన్।
సహానంబగు నటుతిరిగి గృహంబులో చక్కనదృశ్యుడై యొప్పెన్॥
జయజయ శబ్దము జెప్పుచు భక్తులు సారసాక్షు గొల్చిరటు।
భయమున నిదివిని రాజు వచ్చుచును భగవద్భక్తు డయ్యెనటు॥
అదిమొదలుగదా సాధు పూజకును నమిత ద్రవ్యమును నిచ్చు।
పదిలెము తోడను హరిభక్తిని దా బట్టియుండె నటు హెచ్చు॥
శ్రీహరి భక్తిని రాజకాంతయును చెందెను సద్గతి యపుడు।
ఊహను భక్తిని సలిపెడి వారల కుచిత దాసు బాలుండు॥ ౩౭.

## కువరాబాయి చరిత్రము.

---

రాజపురోహితు బ్రాహ్మణు డొకనికి రాజిలె నొక కన్యయును।
తేజము రూపును కొంఱత లేకనటు దివ్య గుణంబుల తోను॥ ౧.
కువరాబాయీ యనదగు నామము గురుతుగ నట నుంచబడె।
వివరముగను సతి శ్రీహరి భక్తిని విపులంబుగ గలిగుండె॥ ౨.
పితృమాతృలును చిన్నతనంబున పెండ్లి జేసిరి ముద్దుగొని।
భద్రంబగునటు శ్రీహరి భక్తిలొ బాలిక వృద్ధొందగని॥ ౪.
పిలువవచ్చి రటు యత్త యింటికిని పిల్లను నొక దినమునను।
తలచెను కువరాబాయీ ధరలో తనువు యశాశ్వత మగును॥
విషయ సుఖంబుల భోగించగనె వే వచ్చును దుఃఖములు।
సుషమము గలుగని నరక భోగముల సొరది బడుచు విలసిల్లు॥ ౫.
అంతరించుగద యాత్మ సుఖంబును నటుపై తనకని యెంచు।
సందియ మొందక భర్త సంగమము సంతానము కలిగించు॥ ౬.
మోహ మమతలను భ్రాంతిని జెందుచు మురరిపు పదమందవని।
బాహుళ్యంబగు వివేక పద్ధతి బట్టియు నడు రేయీని॥ ౭.
అలంకారముల దీసియు నొడిలొ ననువున దానుంచుకొని।
విళంబ మొందక బైలు దేరెనటు విడిచి యిల్లు వెలినిగని॥ ౮.
నగర ద్వారము మూయబడుండగ నాతి కృష్ణ నెంచగను।
సుగమంబుగ నా కవాటమప్పుడు సూటిగ తెరువంగనును॥ ౯.
ఊరును విడిచియు బహుదూరంబును నూర్జితముగ తావెళ్లె।
ధీరత్వంబును యనాథ దైన్యత తీర మొందుచు విలసిల్లె॥ ౧౦.
బృందావనమున తీరఘట్టములొ ప్రియముగ స్నానముజేసి।
విందానంబుగ కృష్ణదర్శనము వీలుగ చేకొని వెలసి॥ ౧౧.
భవబంధను నిటు విడుదల జేయుము పరమదయానిధె యనుచు।
సవినయ దండము బెట్టుచు నగలను సకల సాధువుల కిచ్చు॥ ౧౨.

హరిచింతనదా జేయుచునచ్చట నాతని కృప వీక్షించు।
తీరముగనచ్చట నేమియు దినకను త్రిరాత్రంబులు నుంచు॥ ౧౩.
ఏకరీతిగా హరినామంబును యెపుడు జేయుచుండగను।
జోకను శ్రీహరి దర్శన మిచ్చుచు, సుదర్శనముతో నేను॥ ౧౪.
పరిపరి విధముల రక్షణజేసెద పరగ రాధా కుండమున।
వెలువక నీవును నుండు మటంచును వెళ్లెను హరి మోదమున॥ ౧౫.
కువరా బాయియు రాధాకుండము కుదురుగ చనియుండగను।
భువిశ్రీ కృష్ణుడు నన్నమునెంమెకు పోసగబెట్టు చుండటను॥ ౧౬.
ఆమెకు తండ్రియు వెతుకుచు వచ్చెను నచ్చోటికి తగనపుడు।
ప్రేమాస్పదముగ పుత్రిని గనెనటు పెనుముద మొందుచునాడు॥
కొమరిని గాంచుచు తండ్రియుబల్కెను కులజులనింద గొంటివి।
క్రమముగాదు నామనసున లజ్జయు గానంబడు నేడు భువీ॥ ౧౭.
కొమార్తె బల్కెను షష్టివయస్సును కుదురుగ నయ్యెను నీకు।
ప్రమేయమగు యీ సంసారంబునె బట్టియు నుంటివి బాగు॥ ౧౮.
దేహ మస్థిరము మిథ్యారూపము దేవునిగననే క్రియయా।
ఊహను నీవును వైరాగ్యంబును నొప్పగ చేకొన సరియా॥ ౨౦.
ఈపలుకుల విని సంతోషించెను యేపున తండ్రియు నపుడు।
ప్రాపుగ కొమరిని యింటికిరమ్మని పదపడి పిలిచెనునాడు॥ ౨౧.
సంకోచింపక శ్రీహరి భజనను సలుపుచుండు మయ్యెడను।
జంకియు నెప్పుడు నత్తయింటికిని చనుమని జెప్పను నేను॥ ౨౨.
నాదు వచనమును మన్నింపుముయని నానావిధముల జెప్పె।
పాదుగ నామెయు శ్రీహరి యాజ్ఞను బట్టెదనని తగనొప్పె॥
శ్రీహరి యామెకు స్వప్నమూలమున జెప్పెనిల్లు వెళ్లుమని।
సాహసమునదా తండ్రితో వచ్చెను సర్వేశ్వరు దిక్కయని॥ ౨౪.
ఇంటను తానొక దేవగృహంబును ఇష్టమలర జేసికొను।
మెండుపూజలను హరిమూర్తికినటు మిగుల ప్రీతి జేయుచును॥ ౨౫.

సాధు వైష్ణవుల సద్భావముచే సన్మానింపుచు నుండు।
పాడుగ రాత్రిని శ్రీహరికీర్తన బాగుగ సలుపుచునుండు॥ ౨౬.
ఆమె కీర్తనము వినుచు ననేకులు హరిభక్తిని బొందిరటు।
వేమరుకీర్తిని సేఖావతునృపు విని పురోహితు గనియట్లు॥ ౨౭.
నీదు కోమార్తెయు నపూర్వ గానము నెటిజేయును నని విందు।
సాదరముగ నే జూడవలయునని చనుదెంచెను గృహమందు॥ ౨౮.
శ్రీహరి మూర్తికి ముందర గానము జేయుచు కువరాబాయి।
బాహుళ్యంబగు ప్రేమను నృత్యము పరగ సలుపు మేలయ్యె॥ ౨౯.
తాళవీణె మృదంగ ఘోషచే తల్లీనత జనులుండఁగ।
మేలుగ నృపుడా సుందర స్త్రీ గని మిగుల కాముడై యుండఁగ॥
భగవద్గుణముల మనసు నుంచకను భ్రమ గొని నృపు నేత్రములు।
వెగటుగ నిద్రయు క్షణము క్షణమునను వేగవచ్చి నిలసిల్లు॥ 3౦.
అచ్చట స్వప్నం బొక్కటి గనియెను నతి కౌతుకమై యుండఁగ।
హెచ్చు ప్రవాహము కూడియుండునొక యేరునుగాంచెనుతోడఁగ॥
ఆవలిగట్టున కువరాబాయిని నవనీ నాధుడు గనుచు।
భావశుద్ధితో నామెయు జెప్పను పాపిష్టుడ రమ్మనచు॥ 33.
ఇంతను మెలుకువ నొంది నృపవరు డిందుల కర్థంబుగను।
సంతస మొందగ భవాబ్ధి దాటియు చక్క నామె యుండునను॥
పాపిష్టుడ నే భవాబ్ధి నెట్టుల పదపడి దాటుదు ననుచు।
ఏపునయను తాపంబును బొందుచు నిలబడి దండము నిడుచు॥ 3౫.
ఆమె యనుగ్రహ మొందియు పిదపను హరిభక్తిని దా జేసెఁగ।
ప్రేమ మీరగను కువరాబాయియు పెంపుగ కృష్ణు భజించెఁగ॥ 3౬.
అనేక జనులను భక్తిని నిలుపుచు నవని ప్రసిద్ధికి వచ్చెఁగ।
పునీతులగు యా భక్తుల దాసుడై పొందుగ బాలుడు హెచ్చెఁగ॥

---

## గిరిధరలాల చరిత్రము.

గిరిధరలాలుండను నొక భక్తుడు కృష్ణ భజన తత్పరుడై।
*అరసమునుండును బృందావనమున నతి మాన్యత కలవాడై॥ ౧.
సాధుజనంబుల దేవునిసములుగ సద్భావంబున జూచు।
భూతము లందుల దయనుపూర్తిగా పొందియుండు వాడగుచు॥
రాధాకృష్ణుని వేషము వేసియు రమణీయత నృత్యమును।
సాధించును దా గానము తోడను చవిని ప్రేమ జేయుమును॥ ౩.
ఒకదినమందును రాసలీలలను నొప్పగ జేయుట కొఱకై।
సకలురు జూడగ విష్ణు మందిరము చక్కగ వచ్చియు బాగై॥ ౪.
బసగొని యుండగ జనులనేకులటు పరగ జెప్పి రతనికిని।
అసమానంబగు వేషధారణ మరయ జేకో మనగవిని॥ ౫.
గిరిధరు డప్పుడు లేచియువెళ్లెను కృష్ణుని సన్నిధి కడకు।
హరిపదములకును నమస్కరించుచు నంజలిహస్తుడై కణగు॥ ౬.
దేవా వస్త్రముల్ మరచితి నే నిటు దెచ్చుట కీవేషమునకు।
సేవకు డింపున కింటికి వెళ్ళిన చెలగుకాల హరణ మగు॥ ౭.
ఇటులం జెప్పుచు దేవుని ముఖమున నింపుగ తానటు జూడన్।
పటుతరమగు నటు జరీవస్త్రములు పడియుండం గనె యదుటన్॥ ౮.
ప్రజలందరుగని జెప్పిరి యప్పుడు భక్తిమహిమ యిదియనుచు।
సుజన శ్రేష్ఠుడు గిరిధరునకు నటు సూటిగ దండంబిడుచు॥ ౯.
మన్ననజేయగ నాతడు వేసెను మహివేషము నాదినము।
పన్నుగ నదియును నద్భుత మగునటు బఱగియుండె తగసుమ్ము॥ ౧౦.
జనులందరు శ్రీకృష్ణావతార చరిత్ర లీలల నేడు।
ఘనముద మొందగ ప్రత్యక్షంబుగ గాంచితిమని గొనియాడు॥ ౧౧.
దినదినమునకును ప్రతీతియత నిది దిక్కులన్ని తగ జెందెన్।
వినమితుడగుచును సాధుల తీర్థము వే చేకొను యిరవొందన్॥

---

*అరసము - ప్రీతి.

సాధుల సేవకు మించిన సాధన జగతిలోన లేదనుచు।
పాదుగ వారల జాతినెరుగకనే భక్తితోడ సేవించు॥ ౧౩.
ఈ విధముండగ సాదుపురుషుడొక డేగెను హరి పదమునకు।
భావశుద్ధి నాదేహము కడిగియు పవతీర్థము గొనెనుతగు॥ ౧౪.
ద్విజవరు లచ్చట దీనింగాంచుచు తిట్టదొడంగిరి యపుడు।
అసహ్యాకరమగు ప్రేతతీర్థమును నారగించితీ విపుడు॥ ౧౫.
వేద విధికి తగు నాచారంబును విడిచియు భ్రష్టుడ వగుచు।
జాతిహీను శవతీర్థము గొనుటచె సంకరవర్ణమగు ననుచు॥ ౧౬.
గిరిధరు డందుకు ప్రత్యుత్తరముగ క్రియను జెప్పె వారలకు।
గురుతుగ సాధులు విశ్వోద్ధారణ కోరివచ్చిరియ్యిలకు॥ ౧౭.
పుటుకయు చావును బొందకవారలు పుణ్యాతములు గానుండఁ।
అటుయిటు కదలని చైతన్యంబై హరివ్యాపక మందుండఁ॥ ౧౮.
ద్విజులు బల్కిరటు బ్రహ్మజ్ఞానము తేజమలర జెప్పెదవు।
ప్రజలుగానగను ప్రేతమునిప్పుడు బ్రతుకజేయుమిట నీవు॥ ౧౯.
లేనియెడల తగు భవిష్కారమును లెక్కించెద మనిజెప్పఁ।
మూనుగ గిరిధరు సంకట మొందుచు మాధవు పైమన సొప్పఁ॥
కనులు మూసుకొని యేకాగ్రంబుగ కంజాక్షుని దలచగను।
అనువుగ ప్రేతము లేచి కూర్చునె యందరుగన ముదముగను॥ ౨౧.
గిరిధరునకు నావిప్రులందరును క్రియను దండముంచి రటు।
నరహరి కృపచే కృతార్థుడయ్యెను నయముగననె బాలుడిటు॥ ౨౨.

---

## నా రా య ణ స్వా మి చ రి త్ర ము .

నారాయణుడను మహాపురుషుడును నరహరి భజనలో నుంచు।
సారాసార వివేకి యగుచునటు సన్యాసంబును గొనుచు॥ ౧.
ఆరుశత్రులను తాను జయించియు హరిభక్తియు జ్ఞానమును।
తీరుగ బొందుచు పరమ హంసయై తిరుగుచుండె నయ్యెడను॥ ౨.

సకలము నతనికి బ్రహ్మభావమై సాక్షాత్కారము నొందెఁ।
అకలంకంబగు సగుణ నిర్గుణముల్ హరిమయమని యిరనొందెఁ॥ ౩.
అన్ని జాతులను భిక్షనడుగుచును యవనిని తిరుగుచునుండఁ।
పన్నగనాతడు త్రియంబకంబును బఱతెంచెను ధరజూడఁ॥ ౪.
జనులనేకులటు యాత్రాకాంక్షకై చనుదెంచిరి తగనటను।
అనువుగ గిరిపురి భారతి తీర్థులు నచ్చటి కరిగుండగను॥ ౫.
దిగంబరుండగు నవధూతయునటు దెగ్గర వచ్చియు నుండఁ।
సుగమంబుగ నా తీర్థుండతనికి నొగియన్నం బిడుచుండఁ॥ ౬.
అనేక జనులకు జేసిన యన్నము నాతడొకడె భక్షించెఁ।
సునీరమును దాత్రాగక వెళ్ళుచు సుఖమగు నడవినిగాంచెఁ॥ ౭.
చెట్టునీడ తా నిద్రను నుండగ శ్రీపాదుడు తగనపుడు।
బెట్టిదముగ దా కొందరు శిష్యుల పెనగి కావలుంచుండు॥ ౮.
చతుర్థ దినమున లేవగ నతనికి జలమిచ్చిరి శిష్యులును।
పదపడి యాతడు నొల్లక గ్రామము పరుగులిడెను నయ్యెడను॥ ౯.
*హావేలి యొక్కటి పెద్దదియుండగ నచటి మోరినీరునుదా।
నవీనమగునటు నాతడు ద్రాగెను నరులు విస్మితమునొంద॥ ౧౦.
దేవాలయమున రుద్రపూజలను ద్విజులును చేయుచునుండఁ।
భావార్థము తో నచటికి వెళ్ళెను పరమహంసుడా జాడఁ॥ ౧౧.
అభిషేకంబును వారలు జేయగ నతడును శిశ్నము చేతఁ।
నిభమున దానటు మూత్రపుధారను నిలిచి విడిచె హరుమీదఁ॥
పండితు లనిరటు లఘు రుద్రంబును పరిపూర్తియు నగువరకు।
ఖండము లేకను నిండుధారయును కావలెనని రటుబాగు॥ ౧౩.
అభిషేకంబగు పాత్రను బట్టితి నంతే జేసితి ననుచు।
శుభమగునని యా పరమహంసుడును సూటిగ జెప్పుచు నుంచు॥
మంత్రంబంతయు సమాప్తికాగనె మన్నించిరి ద్విజులతని।
తంత్రము శ్రీహరి దనుచు జెప్పుచును ధారవిడువకుండగని॥ ౧౪.

---

* హావేలి-పెద్ద మేడయిల్లు.

ఎవరికి దెలియక రహస్యమగు నొక యింటియరను దాగుండఁగ।
అవకాశం బిదియని యా సతియును భువి కపటము లేకుండఁగ॥ ౬.
స్నేహితురాలను గూడి యామెయును చేరెను గురుసన్నిధిని।
బాహుళ్యంబగు ప్రీతిని నింటికి బిలిచెంచుం డనగ విని॥ ౭.
ఆచార్యుండనె నీదు భర్తయును నరయనింట లేకుండఁగ।
పాశాటవిలో నుండునాతడును పరగ వినిన నిద్దరెడఁగ॥ ౮.
అతికోపంబును గైకొను యనుచును, నారగించు యన్నంబు।
హితముగ నీదయైయుండు వ్యర్థశ్రమ నిటుబొందు టేల నిరతంబు॥
గురుడుజెప్పగను కన్నీరొలుకగ కోరి యనెను నాసతియు।
అరయగస్త్రీలకు పరాధీనమై యబ్బును జీవన మనియు॥ ౧౦.
స్వామిసేవ నాకెట్లు లభించును స్థలపవిత్ర మెటులగును।
వేమరు యిటులంజెప్పుచు గురునకు వేసె దండం బామెయును॥
సతి సద్భావము జూచియు గురుడును చక్క వచ్చె నింటికిని।
అతి ప్రీతిగ సతి పాకము జేయుచు నాచార్యుని పూజకని॥ ౧౨.
ఆసన పాద్యాద్యులం కృతులదా నర్పణ జేయుచుండగను।
వాసిగ భర్తయు సమయము గాంచుచు వచ్చెను శస్త్రముతోను॥
కోపము తోడను సతిని గొట్టుటకు కోరుచు గురునింజూడఁగ।
ఎపున నాతడుస్త్రీరూపంబున పర్వడుండగని జూడఁగ॥ ౧౪.
ఇదిగని యాతడు పశ్చాత్తాపము నేపునదా బొందుచును।
విద్వేషంబును విడిచియు భక్తిని విశదంబుగ జూపగను॥ ౧౫.
మునుపటివలెనే పురుష రూపమును ముదమున గురుడును బొందఁగ।
వినీతుడై యాతడు గురూపదేశము వెలయంగొనె యిరవొందఁగ॥
సతిపతు లిద్దరు సేవల జేసిరి సద్భక్తిని గురువునకు।
విదితంబగునటు దుష్టవృత్తులును విడుదలయ్యెనటు బాగు॥ ౧౭.
భక్తుల మహిమల భగవంతుండును ప్రకటంబగునటుజేయు।
సక్తిగ భక్తుల సేవల బొలుడు సలుపును క్రియ యానని యు॥ ౧౮.

# రా మ చ ం ద్ర భ టు చ రి త్ర ము .

రామ చంద్రుడను నొక విప్రుడు రాజిలె డిల్లిపురమున।
నేమము తోడను శ్రీహరి భజనను నెనరుంచును నెయ్యమున॥ ౧.
వేదమునందును వేదాంతములో విశేషనిపుణుండతడు।
వాదము నెవరితో జేయక యుండును వడి నహంకృతి గొనకుండు॥
అయాచితంబుగ వచ్చు ద్రవ్యమున నతడు కుటుంబము జరుపు।
ప్రయాస యనకను స్నానసంధ్యలను పంచయజ్ఞములగడుపు॥ ౩.
అతిథి పూజయును విష్ణుపూజయు నఖండ నామస్మరణ।
విదితంబుగనటు భాగవతంబును వినుపించును జనులకను॥ ౪.
ఈవిధనిష్ఠచె యీశుని కృపయును నెలమి యుండు నాతనిపై।
భావశుద్ధితో భాగవతులకును భక్తిని సలుపును నిలపై॥ ౫.
*హావేలి యొక్కటి గట్టుట కొఱకై యచటి రాజు నియమించెఁ
నివాసముండిన నచ్చటి నరులకు నెనరున ద్రవ్యమునిచ్చెఁ॥ ౬.
రెండింతలు గలవెలను నిచ్చుచును రీతిగ నేలను గొనుచు।
ఖండింపక బహూనయమున నృపుడును కనికరమున విడుమనుచు॥ ౭.
జనులందరు నటు విడుచుచు నిండ్లను చనుదెంచిరి పరస్థలము।
వెనుక రామచంద్రుని యింటిని తగ వెలిగోడను నటుదునుము॥ ౮.
వేరొక యింటిని యిచ్చెద నీకును విడువు మిల్లునని యనగఁ।
వారక ద్విజుడును వెళ్లెను కాశికి వలదు రూకలనుచు తగఁ॥ ౯.
కాజీరూపమును చేకొని శ్రీహరి కనబడె నృపునికి కలలో।
పూజితుడగు నారామచంద్రుని పొందుగ బిలువుము భువిలో॥
నీపైయాతడు గోపము గొనినను నీక నర్థమగును యను।
ప్రాపైయుండును నీవిపు డాతని భక్తిని నిటు బిలిచినను॥ ౧౧.
ఈవిధ స్వప్నము చూడగ నృపవరు డిష్టమంత్రి నంపుచును।
భావశుద్ధితో తోడం దెమ్మనె బ్రాహ్మణు గృహమునకును॥ ౧౨.

---

* పెద్ద మేడయిల్లు

కాశీ పురికిని మంత్రియు వెళ్లుచు ఘనవిప్రుని వేడుకొను।
వేసరిల్లకను బిలుచు కొనరిగియు విహిత గృహము నుండుమను॥
రామచంద్రుడును పూర్వమువలెనె రంజిలెతన గృహముననుఁ।
సేమము దప్పక నుండె నాతడును నెటి బాలుడు పొగడగను॥౧౪.

## కా మహమ్మదు చరిత్రము.

జాతిని తురకగ కాజిమహమ్మదు సద్వృత్తిని తానుండు।
పాదుగ నాతడు శ్రీహరి స్మరణను భక్తిని సలుపుచు నెగడు॥ ౧.
చేకొన డెప్పుడు రాజ ద్రవ్యమును జెప్పుచుండు సత్యమునె।
ప్రాకటముగ కష్టార్జిత యన్నము భక్షించును నింపుగనె॥ ౨.
చాతుర్యముతో నాతని భార్యయు సరిగె పనుల దా చేయు।
బీదతనంబున వాటియమ్మికమె పెంపుగ జీవన మయ్యె॥ 3.
న్యాయవిచారణ జేయుటకాతని నరపతి యును నియమించు।
బాయని సత్యముతోడను తీర్పును పరుల లోపముల గనుచు॥ ౪.
ఆశా రహితుడై ద్రవ్యంబెద్దియు నభిల షించకను నుండు।
కాసు స్వర్ణమును మన్ను తుల్యముగ కనులం జూచుచు నుండు॥
అప మానమునకు బీజమై యుండును నాశాతృష్ణలు యనుచు।
నెపములేక యివితొలగిన వెడలను నెచటపూజ్యు డగుననుచు॥
సత్యమె తొలగని సంపద యనుచును చక్కగ న్యాయము తీర్పు।
ప్రత్యయముగ నొక పుత్రిక యతనికి పదపడియుండ దనర్చు॥ ౬.
ద్రవ్యవంతుడొక సేనా పతికిని తాపెండ్లిని నియ్యగను।
భవ్యంబుగ నాదంపతు లిరువురు బహుభోగము నుండగను॥ ౭.
పుత్రుండొక్కని గాంచిన పిదపను పొందెమరణ మల్లుండు।
చిత్రంబగునటు యతని గుమాస్తయు శీఘ్రమరిగి నిలుచుండు॥ ౮.
అప్పుపైకమును నిచ్చిన వెనుకను నాప్రేతము పూడ్చబడు।
చొప్పుగ నియ్యని పరకును మీరలు సొరది నుట్టవలదనుడు॥

సతి విని బల్కెను పతి బ్రతికుండగ సద్దులేక యుంటివను।
పతియు నాకును యప్పుసంగతిని బలుకకుండె యెప్పుడును॥ ౧౧.
ఇప్పుడు దెచ్చిన వ్యాజ్యమబద్ధమై యేర్పడినట్ల గుచుండు।
ఒప్పగ రాజునకిది వినిపింపగ నురు విచారణ యగునట్టు॥ ౧౨.
కాజి వద్దికిని పొమ్మని జెప్పగ ఘనవాసన ద్రవ్యముల।
ఓజనునిడి ప్రేతము కాజీకడ నొగిదెచ్చిరి నయ్యెడల॥ ౧౩.
ఆతని కన్యయు నామె కుమారుడు నతిరోదన జేయగను।
వేధించుచు నా గుమాస్త యప్పుడు విడువ ననెను ప్రేతమును॥ ౧౪.
అప్పును దీర్చియు ప్రేతకర్మముల నటు వెనుకను జేయుమను।
తప్పకలంచము నిచ్చుచు జనులకు తనకై పలుక జేయగను॥ ౧౫.
కాజీ గాంచుచు సాక్షుల కూతలు కల్లలగును యనుచు గని।
పూజితమగు తనతీర్పు లోకులకు పొందకుండు బంధువని॥ ౧౬.
పక్షపాతముగ తీర్పు దీర్చెనని పరులును జెప్పెద రనుచు।
తక్షణమందే శ్రీహరి చింతన తలపడి చేసెను హెచ్చు॥ ౧౭.
మాధవ ముకుంద మధుసూదనహరి మనుజుల యపవాదంబు।
పాదుగ నాకును కలుగ జేయకని పరునకిడెను దండంబు॥ ౧౮.
ఇటులం జేయుచు ప్రేతసమీపము నెలమి నరిగి దా జెప్ప।
దటుకున లేచియు గుమాస్త లెక్కల తప్పులేక గననొప్ప॥ ౧౯.
అటువెనుకను తగ మృత్యు సదనమును నసువుగాను బొమ్మనగ।
దటుకున నిద్రనులేచు కరణి యా ధనికుడు కూర్చుండి తగ॥ ౨౦.
మీసము దాడియు సవరించు కొనుచు మిగులకౄర దృష్టిగను।
తీసినఖడ్గము చేతుల నిడుకొని తెమ్మని లెక్కల పూను॥ ౨౧.
ఇదిగని ధూర్తుడు కాజీకాళ్ళను నేపున తా బట్టుకొని।
కుదురుగ ప్రాణము రక్షింపుము నా కొంటెతన మిట్లయ్యెనని॥
తప్పు లెక్కలను వ్రాసి యిచ్చితిని దాచుచు లెక్కలనన్ని।
ఒప్పగ దెలిపెను రొక్కము తనయెడ నున్న సంగతి కాజికిని॥ ౨౩.

అల్లుడు పిదపను మామ యాజ్ఞ గొని యట్టె విడిచె ప్రాణములు।
ఉల్లసిల్లిరి జనులందరు నట నుచితంబని పొగడరిలు॥ ౨౪.
కుమార్తె యప్పుడు కాజి చరణముల కొడుకుతోడ దాబడుచు।
అమానుషమగు నీ మహిమను తిరిగి యల్లుని లేపుము యనుచు॥
వేడుచునుండగ కాజి యామెకును విహితంబగు నటు జెప్పె।
నేడు నీ మగని లేపితే నేనియు నిజలోభము నాకబ్బు ౨౬.
అందున నాకు కళంకము వచ్చును నవని నింద్యు డగుదునని।
పొందుగ నల్లుని ప్రేత శరీరము పూడ్చె వెనుక భూమిగొని॥ ౨౭.
జనసమూహమున కీర్తియు నతనికి చక్కగాను విలసిల్లెగా।
అనువుగ దేవుని భక్తియు నీతిచె యతి ఖ్యాతిగ తేజరిలెగా॥ ౨౮.
కొన్ని మాసములు జరిగిన పిదపను గురుపద మొందెను కాజి।
పన్నుగ శ్రీహరి భక్తుల ప్రీతుడై బాలుండుండును వెలసి॥ ౨౯.

---

బ ల ఖు బు ఖా రు చ రి త్ర ము.

బలఖుబుఖారుండను నొక యవనుడు పాలింపుచు రాజ్యమును।
ఇలజను లందర ధర్మ పద్ధతిని నేలుచుండు కృపతోను॥ ౧.
యాచక వృత్తియు నేర్పడకుండెను నాతని రాజ్యమునందు।
వాశిగ నాతడు భోగ సుఖంబుల వరుసను ననుభవ మొందు॥ ౨.
అష్ట ప్రధానుల నొకయెడ బిలుచుచు నడిగెను వారల నపుడు।
శిష్టాచారుండే సద్గురు నే జెందవలెను శరణిపుడు॥ 3.
ప్రధాని యందుకు బలికె నప్పుడును భక్తవరుండు కబీరు।
నిదానముగ తా నాత్మవిద్య తగ నేర్చిన ఘనుడగు ధీరు॥ ౪.
అతడె నీకును తగిన గురుండౌ యవని బ్రసిద్ధు డనగాను।
పాదుగ నృపుడును కాశికి వెళ్ళుచు భక్తి జేసె కబీరునకును॥ ౫.
కబీరు డప్పుడు రామోపాసన కరుణ నొసగె రాజునకు।
ప్రబల ముదముతో నరపతి వచ్చెను పదపడి నగరంబునకు॥ ౬.

షోడశ శతమగు సతుల గూడుకొని సుఖముండగ నరపతియు।
వేడుక నొకయెడ దాసీ యొక్కతె వేసె పడక నృపునకయ్యు॥ ౭.
రమణియ్యంబగు మంచము పైనను రంజిత మృదు శయ్యయును।
సమముగ వేయుచు రాజు రాకనటు చక్కగ గనుచుండగను॥ ౮.
అమిత నిద్ర యాదాసికి రాగను నాతల్పమున శిరముంచి।
కొమరొప్పగదా నిద్రబోవగను కోరి రాజు సభనుంచి॥ ౯.
పడకింటికి దా వచ్చిచూడగను దాని సె నిద్రింప గని।
తడబడ జేయుచు బెత్తెపు దెబ్బలు తగుల వేసె లెమ్మయని॥ ౧౦.
దాసీ యప్పుడు పకపక నవ్వగ ధరానాథుడును నడుగు।
వాసిగ నవ్వకు కారణమేమన వనితయు జెప్పను బాగు॥ ౧౧.
నీదుమంచముపైని మస్తకమును నెనరున నుంచితి నేను।
బాధయు నాకును యింత గలిగె నిటు పరుండుదు విటు దినమును॥
దండన నీకును యెంత గలుగునో ధాత్రిలోన దెలియదను।
మెండుగ భోగము ననుభవించెదవు మేలుగతియు లేదుయను॥ ౧౩.
ఇదివిని నరపతి రాజ్యభారమును నింపు గాదనియు విడిచెగా।
పదుగురు చూడగ శీతోష్ణంబుల బాధను తా వర్జించెగా॥ ౧౪.
ఆకలిదప్పికి నోర్చియు నయ్యెడ యా శరహితుడై హరినే।
సాకల్యంబుగ ధ్యానము నిడికొని సారెకు నామ మనుచునే॥ ౧౫.
సంచరించగా నాలుగుదినములు సగుణంబుగ రాముడును।
అంచితముగనే ప్రసన్నుడగుచును నభయమిచ్చి వెళ్ళెమును॥ ౧౬.
అటువెనకను దా ఫకీరునొక్కని యతి యుదాసు నచటగని।
చటులతరంబుగ బలఖుభుఖారుడు సరగచేరె జంటయని॥ ౧౭.
అచటి పకీరుడు భిక్షమడుగకను నవనిజనుల గూడకను।
ప్రచురంబుగ నటనుండగ దేవుడు బంపుచుండు రొట్టెలను॥ ౧౮.
వాటిని భక్షణజేసియు తృప్తుడై వరుసను దానటనుంచు।
దీటుగ భాగము బలఖ్ బుఖారునకు తేరువునని యవలెననుచు॥

ఫకీరుడని యెను నాతని గాంచుచు బలు వైరాగ్యము గొనియు।
వికాసమగునటు యెన్నిదినములుగ వేంచేసితివి యనియు॥ ౨౦.
స్థలమిటు నీకును లేదనియాతడు సరగనతనికి దెల్పగను।
ఇలపతి దెల్పెను నేను విరాగినై యెనిమిది దినము లయ్యెనను॥
మటము వెలుపలను నుందును యనగను మంచిదనె పకీరుడును।
ఇటులుండగ నటు రొట్టెయు కూఱయు నిలపతి గనవచ్చెమును॥౨౨.
దానింగాంచుచు నణుమాత్రంబును ధరపతి యాశింపకను।
మౌనంబుగ దానుండగ శ్రీహరి మానుష వేషముతోను॥ ౨౩.
స్వర్ణ పాత్రమున పంచభక్ష్యముల చక్కటి యన్నము తోను।
నిర్ణయ మగునటు దెచ్చిపెట్టెదా నెటిపకీరు జూడగను॥ ౨౪.
వింతను జూచుచు యెనిమిది దినముల విహిత పకీరుం డతడు।
పంతముతోనే జన్మము నుండియు పకీరుడైనె యుందుండు॥ ౨౫.
అతనికి నిట్టుల నుచిత పదార్థము లందుట యెట్లో యనుచు।
హితమగు రొట్టెల తానుదినకనే యిల నుపవాసము నుంచు॥
ఖిన్నుడై యుండగ రాత్రికాలమునక్రియతో స్వప్నము గనియెఁ।
పన్నుగ ఈశుడు ఫకీరురూపున బలుకుచు తగ నిట్లనియెఁ॥ ౨౭.
బలఖుబుఖారుడు సమగ్ర రాజ్యము పట్టులేక దా విడిచి।
ఇలలో నాతడు నిష్కాముండై యినకుల తిలకు భజించి॥ ౨౮.
సంచరించుచును నుండగ నతనికి సౌభాగ్యము నిచ్చెదను।
అంచితముగ నీవిటుపై జన్మలా నవనీపతి యాటకును
ఇచ్ఛను యుంచుట వల్లను రొట్టెల నిచ్చెద నీకును దినము।
అచ్చముగా నీ తలపును నరయక నలనాపైని నిమిత్తము॥ ౩౦.
ఉంచుటేలయని జెప్పుచు వెళ్ళెను నొప్పుగ నట శ్రీహరియు।
మించిన వింతను ఫకీరుడప్పుడు మేలుకొనుచు తగ మరియు॥ ౩౧.
బలఖుబుఖారుని చరణంబులదా బట్టుకొనెను నటు పిదపఁ।
సలలితముగ బహు చనువునుగాంచుచు సలిపిరి స్నేహమునొప్పఁ॥

అటువెనుకను యా బలఖుబుఖారుం డచ్చట నుండియు వెళ్ళిక।
పట్టణ మొక్కటి గాంచుచు నందున ప్రవేశించె దా మెల్లక॥ ౩౩.
మఠ మొక టుండెను యచట ఫకీరులు మహితంబుగ నుండగను।
కఠినులై వారలు బలఖుని యచ్చట కలియకుండ జేయగను॥ ౩౪.
పరమాత్ముండును ఫకీర్ మహాంతుడై ప్రకటించుచు దా నటను।
పరమభక్తుడని బలఖుబుఖారును ప్రజలకు దెలిపెను మున్ను॥ ౩౫.
అనేక విధముల కరుణను బొందుచు హరిపద మొందెను వెనుకక।
పునీతులగు నీ భక్తుల చరితల *పారిబాలుడు జెప్పతగక॥ ౩౬.

---

## షే కు ఫ రీ దు చ రి త్ర ము .

తురక జాతిలో షేఖుఫరీదుడు దుస్సంగము వదలుచును।
గురుతుగ బాలుడై యుండగ నాతడు కోరితల్లి నడిగెనును॥ ౧.
దేవుని దర్శన మెట్టుల నగునో దెలుపు మనగ నామెయును।
ఆవహించబడె వైధవ్యంబుని యనుతాపము బొందుచును॥ ౨.
కొడుకునకును యనె దేవుడు సులభుడె, కోరి యతని ప్రాప్తికిని।
పుడమి జనంబులు ననేక పాటుల పొందు చుండురీభువిని॥ ౩.
అన్నిటి విడిచియు వనవాసులునై యవని కొంద రరిగెదరు।
పన్నుగ కొందరు బ్రహ్మచారులై పరుని వెతుకుచుండుదురు॥ ౪.
కొందరు తమలో తమ్ముజూచుకొని గోవిందుని నెరిగెదరు।
సందియ మొందక కొందరు యిలలో సంసారము విడిచెదరు॥ ౫.
అరణ్య మందున నుపవాసంబున నాదరముగ నుండుదురు।
హరికథ కీర్తన కొందరు జేతురు యాలకించెదరు కొందరు॥ ౬.
ఫలాశ లేకను సత్కర్మంబుల బహుజేతురు కొందరును।
అలేపకుండగు యాత్మసమముగా నందర గందురు తగను ౭.
సాధుసేవలను కొందరు జేయుచు సంసారము దాటుదురు।
పాదుగ కొందరు సత్యము తపసుగ బట్టుకొనుచు నుండుదురు॥ ౮.

---

*పారి - అత్యంతము.

పరోపకారము కొందరు జేతురు భక్తిని హరినామమును।
తీరముగ జెప్పుచు నుందురు కొందరు ధీరత యోగులగుచును॥
శ్రీహరి ప్రాప్తికి యిట్టి యుపాయము జేయుచు నుందురునరులు।
సాహసమగునటు వీటిలో నీకెది సౌఖ్యంబై విలసిల్లు॥ ౧౦.
కుమారుడందుల కన్నము విడిచియు కొండల నుండెద నేను।
ప్రమాణ మిదియని జెప్పుచు నాతడు పరగ రొట్టె లిమ్మనెను॥
తల్లివినుంగొని యన్నము విడిచితే ధరను రొట్టెలెందుకనన్।
ఉల్లమలరగను యాశ్రిత మనసుకై యుచితంబని కొమరుడనన్॥
విహిత రొట్టెలను తల్లియు నియ్యగ వేంచేసెను వనమునకు।
బహుక్షుధ నొందియు రొట్టెల తానటు భక్షణ జేయకతిరుగు॥ ౧౩.
ఆకుల దెంపుచు చెట్లపైనిదా నరయుచు తగ భక్షించు।
వేకువ శ్రీహరి దర్శనమునకై విహితా పేక్షనునుంచు॥ ౧౪.
అనేక దినములు నరణ్యమందును నాతడా తిరుగుచునుండన్।
ఘనీభూతమగు శర్కరగోనెల ఘనవర్తకుడొకడచటన్॥ ౧౫.
ఎద్దుల పైబడా నిడికొని బోవగ నిలషేకు షరీదటను।
పద్దుగ గోనెల నేమియున్నదన, బలు మన్ననె వణిజుడును॥ ౧౬.
ఉచితంబనుచును భక్తుడు జెప్పగ నూరుకేగి వర్తకుడు।
ప్రచితంబుగ నటు గోనెల విప్పగ పలుచని మన్నైయుండు॥ ౧౭.
అసత్య వచనము సత్పురుషునకును నరయక జెప్పినదిపుడు।
పొసగెను ఘాతంబనుచునుమల్లెను పారి గోనెలతో నాడు॥ ౧౮.
వచ్చిన దారిని తిరిగియు బోవగ వరుసనునా భక్తుడును।
దెచ్చిన గోనెలో నేమియుండునో దెలియ బలుకుమన గాను॥
చనువున శర్కర యందు నుండునని చక్క జెప్పె వణిజుడును।
వెనగొని భక్తుడు యుచితంబగునని ప్రియ వాక్యము నియ్యగను॥
వర్తకుడప్పుడు గోనెను విప్పగ వర్ధిలగనె శర్కరను।
కర్త యీశ్వరుడు కరుణ జూపెనని ఘనముదమున నేగెమును॥

ద్వాదశ వర్షముల్ శెఖుఫరీదుడు తపస్సు చేయుచునుండి।
పాదుగ శ్రీహరి రూపును జూడక బయలెంచెను యటనుండి॥ ౨౨.
ఇంటికి వచ్చుచు తల్లికివందన మింపుగదా బెట్టుచును।
వెంటనె దెచ్చుచు రొట్టెలమూటను విధిని తల్లికిచ్చుచును॥ ౨౩.
జెందిన కష్టములెల్లను తల్లికి జెప్పగ సతిపుత్రుగని।
సందియమొందక దేహశుష్కతయు చక్కనుండు జడల గని॥ ౨౪.
జెప్పెను మెల్లన తరువరములకును జేసితీవు హింసయును।
ఒప్పగ శ్రీహరి యాదోషముచే యురుదర్శన మియ్యడను॥ ౨౫.
ఇకపై హింసను జేయననుచు సుతుడిడె జననికి దండమును
సకలురు చూడగ తిరిగి యరణ్యము చక్కవెళ్లి యుండుచును॥ ౨౬.
గళిత పర్ణముల భక్షణజేయుచు కాళ్ళ రెంటి గట్టుకొని।
తలమల బడకను వృక్షపుకొమ్మకు తలక్రిందుగ జేసికొని॥ ౨౭.
ఊగుచునుండియు శ్రీహరినప్పుడు యుచితంబుగదా దలచు।
సాగర శయనా షడ్గుణపూర్ణా సంభాళింపుము యనుచు॥ ౨౮.
కాష్టమువలె తన శరీరముండగ కాకులు పొడవంగనియు।
వేష్టితమగు నా పక్షుల కతడనె విహిత కండ్లు విడి మరియు॥ ౨౯.
అంగమువంతయు తినుడుమీరలును యాశనిడితి హరిజూడక।
పొంగగు నటులను కనుల నందుకై పొసగనుంచు డని వేడక॥ ౩౦.
ఆసమయంబున కనుల నీరుతో హరి కృపాళో యనుచును।
వేసరిల్లకను ప్రేమపూర్తిచే విమలుండై యుండగను॥ ౩౧.
శ్రీహరి యప్పుడు ప్రసన్నుడగుచును శీఘ్రమెవిడె కట్లులను।
బాహుళ్యంబగు ప్రేమను జూపుచు భగవంతుడు పలికెమును॥ ౩౨.
రెండు తపస్సులు జేసితి వీవును రేపును మాపును లేకై।
మెండుగ నీవనుష్టించితివి నా మేలురూపు చూచుటకై॥ ౩౩.
హరికృప దృష్టిచె దివ్యశరీరుడై యాతండచ్చట వెలసెక।
తేటచియు కన్నుల జూడగ శ్రీహరి దివ్యరూపుతో వెలసెక॥ ౩౪.

చతుర్భుజంబులు పీతాంబరమును శంఖ చక్రములతోను
వితతా ప్రాకృత దివ్యమంగళపు విగ్రహమును జూచుచును॥ ౩౫.
హరిపదములకును వందనమాతడు ననేకసారులు బెట్టె।
తిరముగ మనసున దివ్యరూపమును తెలివిని నుంచు కొనుండె।
అంతర్ధానము హరియు బొందగను నతడు వచ్చె తల్లికడ౯।
పంతముతో సతి వృత్తిమల్లైనని బహుముదమున గొనియాడ౯॥
అది మొదలుగ యా షేకుఫరీదు డమిత కీర్తితో నిలిచె౯।
కుదురుగ భక్తుల బాలకృష్ణు డిటుకొనియాడుచు తగ వెలసె౯॥ ౩౭.

---

## నా రా య ణ భ ట్టు చ రి త్ర ము.

తపతీయను నొక నదీతీరమున ధరామరుండొక డుండె౯।
చపలత లేకను శ్రీహరి భక్తిని సలుపుచు నట తానుండె౯॥ ౧.
నారాయణ యను నామము చేతను నలుగురు బిలుతురు యతని।
పారా వార ప్రపంచ మతనికి భ్రాంతియగుచు నిగుడగని॥ ౨.
అన్నవస్త్రములు సంకీర్ణంబై యచ్యుతు భజనను నుండు।
పన్నుగ నీతని పరీక్షించుటకు భగవంతుడు వచుచుండు॥ ౩.
స్నానమునకు నారాయణు డరుగగ చక్కవచ్చె హరి ద్విజుడై।
కానబడియె నారాయణు భార్యకు గరిమననెను వినతుండై॥ ౪.
పండరి యాత్రకై చనవలెనిటు నే పరసవేది నాయెడను।
యుండడతగదు గద ప్రయాణములలో నుచితంబుగ నిచ్చుటను॥ ౫.
నిరపేక్ష, తగొని మీరుండుటచే నెఱి విశ్వాసముంచితిని।
వెఱపు లేకనే నీయెడనుంచెద వినుపించెద గురుతుగని॥ ౬.
పరసవేది యినుమునకును రాసిన బంగారంబగుచుండు।
గురుతుగ మీరలు సువర్ణంబును కొరతలేక చేయండు॥ ౭.
ఇరువత్సరములపైన వచ్చెదను యెలమి యాత్రజేసికొని।
మరుసుగ తనకిమ్మనెనట దానికి తొందరేమి లేదుయని॥ ౮.

నీమ పెనిమిటికి నాదండంబులు నిరూపించి తగజెప్పు।
పాదుగ సంగతి నెవరికి దెలియం బలుకకుండుదువు మెప్పు॥ ౯.
ఇటులం జెప్పుచు శ్రీహరి వెళ్లగ నింతియు మోదము నొందు।
చటులత కొంచెము స్వర్ణము జేయుచు చనెదా బాజారందు॥ ౧౦.
మనసున నామెయు దలచుచు నుండెను మాధవుకృప యిదియనుచు।
అనువుగ యింటికి వలసిన వస్తువు లామెయు వెలకును గొనుచు॥౧౧.
వంటను గృహమున జేయగ నంతలొవచ్చె వల్లభుడు గృహము।
ఇంటను ధాన్యం బెచ్చట దొరికెను యెరుగ జెప్పు మనెనుసుము॥
భర్తకు నప్పుడు దెలియం బలికెను పరసవేది సంగతిని।
వర్తన మిక నీ సంసారమునకు వలదు మీరు జేయుటని॥ ౧౩.
భగవన్నామము జేయుచు నెప్పుడు భజనలొ నుండుము నిటుపై।
వెగటుగ వినుకొని పెనిమిటి యప్పుడు వే గొని పరసను వల్లపై॥
తపతీ నదిలొ నాతడు వేయుచు తలపడి వచ్చెను గృహము।
నెపములేక నొక నభ్యాగతుతొ నెనరున భక్షించెనుము॥ ౧౪.
భార్య గాంచుచును పతితో బల్కెను పరసవేది విప్రుడును।
కార్యంబుగ నే తిరిగి వచ్చినను కాగల పని యెట్లగును॥ ౧౫.
పెనిమిటి బల్కెనా ద్విజుని నాయెడను పేర్మిని బంపుము నేను।
అనువుగ నతనికి యొకటికి నాలుగు నరసి యిత్తునయ్యెడను॥ ౧౬.
సమాధానమిటు జెప్పుచు నాతడు సర్వేశ్వరు హరి భజనన్।
ప్రమాద మెద్దియు లేక నెప్పుడును భక్తి జేయు తనలోనన్॥ ౧౭.
కాయావాచక మానసీకముల కంజాక్షుని సేవించున్।
బాయక నిట్టుల రెండబ్దంబులు భగవత్సేవను మించున్॥ ౧౮.
పరసవేది నిచ్చిన బ్రాహ్మణుడును భామిని వద్దకు వచ్చు।
సరగున దెమ్మనె యిచ్చిన వస్తువ సంతసిల్ల నటుజూచు॥ ౨౦.
సతియును బల్కెను పెనిమిటి వద్దను సరసతోడ నుండుననె।
కుదురుగ నాతడు స్నానము కొఱకై కోరివేళ్ళె నిప్పుడని॥ ౨౧.

విప్రుడు బలికెను పరసను నీయెడ విహితముతో నిచ్చితిని।
అప్రశ_స్తమిది భ_ర్తకు నీవును నందిచ్చుట తగదుయని॥ ౨౨.
భామిని యనె తన పతికి దెలుపనెడ పతివ్రతగా దందురిలన్।
నేమముతోనే దెలిపితి, నతడును నిగుడివచ్చు నియ్యెడలన్॥ ౨౩.
ద్విజవరుడనె స్నాన ఘట్టమునకు తెరువున నరిగియు పరసన్।
గజిబిజి లేకను యడిగియు నిమ్మని గరిమె బిలువ నామెవెసన్॥ ౨౪.
అతిక్లేశముతో తపతీ తీరము నతివ ద్విజుతో వచ్చుచును।
పతిని గనగ నత డేకాంతంబున భజనలోన నుండగను॥ ౨౫.
పరసవేదికై విప్రుడు వచ్చెను పరసవేది నిమ్మనుచు।
వెలుపున కాంతయు జెప్పగ భ_ర్తయు వినియును కండ్లను దెఱచు॥
ముందరనుండే ద్విజుని జూచియనె ముంచితి పరసను నీటన్,
ఎందుకు మాకీ యుపాధియనుచును యెంచియుండి విడనాడన్॥ ౨౭.
ద్విజవరు డనియెను పరసవేదినిటు తెప్పించుము నెటులైనన్।
నిజముగ సతికిని నిచ్చినవస్తువు నీవుయిమ్ము నాకునన్॥ ౨౮.
ఇదివిని భక్తుడు నుదకము లందును యీాశుదలచి తా దిగియు।
సదయుడై నాలుగు సన్నరాళ్ళను స్వహ_స్తముల దా గొనియు॥
వెలపల వచ్చుచు విప్రుని గాంచుచు వెలయగ నీ పరసయును।
తెలుసుకొనుచు గొనుమని దా జెప్పుచు ద్విజునకుచూపింపగను॥
పరస యొక్కటిని బ్రాహ్మణు డిడుకొని పరీక్షించి నటు చూడన్।
గురుతుగ యినుమటు బంగారగుచును కొరతగాక తగనుండన్॥
శ్రీహరి వెనకను నిజరూపముదా చేకొనియటు ప్రకటించెన్।
బ్రాహ్మణ్యంబగు ప్రేమచు నిరువురు బడిరికాళ్ళ పై వరుసన్॥ ౩౨.
చతుర్భుజంబులు పీతాంబరమును శంఖచక్రముల తోను।
కుదురుగ శ్రీహరి మంగళ రూపును గుఱిగొని ప్రీతిని మున్ను॥
సతిపతు లిద్దరు నతిముద మొందుచు సలిపిరి నుతులను బహుగ।
గతి నీవేయని మ్రొక్కగ శ్రీహరి కరుణించియు తగపోగ॥ ౩౪.

పరిసల నీటను బార వేయుచును భజనలోన నిరువురును।
తిరముగ నుండుచు నంత్యము నందును దివ్యపదము బొందుచును॥
ఇలలో శాశ్వత కీర్తిని యుంచిరి యిట్టి నిరాశను బూని।
సలలితముగ నిటు బాలకృష్ణుఁడును సలుపు సేవ వారిగని॥ ౩౬.

---

## రత్నాకరుని చరిత్రము.

వర్తకుడగుచును రత్నాకరుడటు వర్ధిలె బగలాణమున।
అర్థము నతనికి దొరక కుండగను నమితకష్ట మబ్బగన॥ ౧.
ఉపాయముల దా బహుగా జేసియు నొగినష్టమె రాగాను।
అపార దుఃఖము నొందుచు తానటు యప్పుగలవా డగుచును॥ ౨.
అధిక విపత్తిని బొందుచు నింటను ననుష్ఠానమును బూని।
కుదురుగ నాతడు నిరాహారుడై కోరిజపించెను హరిని॥ ౩.
పదియును నాలుగు దినములు వెళ్లగ భగవంతుడు స్వప్నమున।
విదిత పరచెనటు వ్యాపారంబును విడిచి చేయుమనె భజన॥ ౪.
ప్రపంచ కృత్యము సలిపితి వేనియు బహు కష్టము లొందెదవు।
నెపము లేకతా నిట్టి స్వప్నమును నెనరున గని యే తడవు॥ ౫.
జేయక వచ్చుచు సతితో బలికెను శ్రీహరి జెపు వచనముల।
నేయత నిరువుర యెటుజేయుదమని నెఱిదలచిరి నయ్యెడల॥ ౬.
విరాగ వృత్తిని యింటింటను యటు వెలసి భిక్షమడుగగను।
ధురీణులగుచును బంధువు లితరులు దూషింతురు వెలిగాను॥ ౭.
మనసున లజ్జయు నుంచక యెట్టుల మహిలోతగనుండెదము।
అనువుగ చింతన జేయుచు గడిపిరి నల కొన్నాళ్లచటనుము॥ ౮.
కరువు వచ్చెనా దేశంబులలో కఠినమయ్యె జీవనము।
వెఱవక యప్పుడు రత్నాకరుడును వెళ్ళెను వేరొక స్థలము॥ ౯.
నాలుగు యెడ్లపై వస్తువు లిడుకొని నడచి తిరిగి రాగాను।
విలుగ మార్గము యడవి ప్రదేశమై వెలసి యుండం గనుచును॥

ఒంటరియై యటుపోవుచు నుండగ యొకపులి ముందుగ రాగన్।
జంటనుండు వృషభములు నాల్గును చనుచును నడవిని యందుకన్॥
ధాన్యగోనెలటు క్రింద బడుండేను తనదు యెద్దు దొరకకను।
దైన్యము నొందుచు రత్నాకరుడును దారి నడచు టెట్లనుచు॥ ౧౨.
సంసారముకై కష్టపడంగను చాల నష్టమొందితిని।
కంసాంతక హరి కృష్ణ కృపాళో కావుముకృప నన్నుగని॥ ౧౩.
అనాథ దీనుడ నల్ప బుద్ధుడను నరసి బ్రోవుమనగాను।
జనార్ధనుండును మార్గస్థునివలె చనెనటు యెద్దులతోను॥ ౧౪.
గోనెల వాటిపైనుండంజేసియు కోరిత్రోవ నడపించి।
మానుగ శ్రీహరి యంతర్ధానుడై మరవ బడంగను తెలిసి॥ ౧౫.
అనుతాపముతో రత్నాకరుడటు హరికి కష్ట మిడితినని।
తనదుగృహమునకు వచ్చియు పిదపను ధరామరుల బిలుచుకొని॥
ఇంట నుండు తన వస్తువు లన్నియు నిచ్చెను వారల కపుడు।
వెంటనే నతడు యుపాధుల విడిచియు విరాగ యుక్తుడై నెగడు॥ ౧౬.
శుద్ధసత్వగుణ సంపన్నుండై సాక్షి చేయు హరిభజనన్।
పద్దుగ నాతడు నయాచితంబగు ప్రబలవృత్తి తానుగొనన్॥ ౧౭.
ఉదర పోషణ గడుపుచునుండగ నొకరి యుపార్జన గైకొనడు।
సదమలు డగుచును భగవద్గుణముల చక్కగపాడుచు నుండు॥ ౧౮.
శ్రవణము కొఱకై యనేక జనములు చనువున వచ్చెద రటను।
వివరంబగునటు భక్తి మార్గమును విపుల ప్రజలు బొందగను॥
ప్రతిష్ఠ దూరము ప్రబలంబగుచును ప్రసిద్ధ నరులరుగుచును।
హితమగు నాతని యుపదేశంబుల యేపున్నగై కొనిరటను॥ ౨౧.
నిరపేక్షుండగు యాచార్యునిగని నెఱయిత్తురు ధాన్యముల।
అరయగ నిత్యము నన్నదానమును హరి భక్తుడు జేసేనిల॥ ౨౨.
ఖలుడై యున్నను, రత్నాకరు కృప కలిగిన మాత్రంబుననే।
తలపడి శ్రీహరి యనుగ్రహంబున దాల్చిరి సన్మార్గమునే॥ ౨౩.

తీర్థయాత్రకై రత్నాకరుడటు ద్విజవరులను గూడుకొని।
ఆర్తితో నప్పుడు బైలు దేరుచును హరి హర క్షేత్రముల గని॥ ౨౪.
అయోధ్య కాశీ ప్రయాగ తీర్థము హరి ద్వారము గనుచును।
క్రియా విశేషమై యచ్చట నచ్చట కీర్తన సలుపుచు తాను॥ ౨౫.
కురుక్షేత్రమును జూచుచు మరియును గోవర్ధనమునుగాంచి।
గురుతర హస్తిన పురమును జేరెను గోకులాష్టమిని యెంచి। ౨౬.
మహోత్సవంబును నచ్చట జరపగ మహీపతి తురకయు జూచి।
సహాయ పరచెను స్వర్ణముద్రలను శతపంచకముల నేంచి॥ ౨౭.
శ్రీహరి కృపచే యనేకజనములు జెందిరి భగవద్భక్తిన్।
బాహుళ్యంబగు ప్రేమను హరిపై బహుగా బొందిరి రక్తిన్॥ ౨౮.
ద్వారక యాత్రకు బోవుచునుండగ తలపడి మార్గమునందు।
ధీరుడు బడోచి పట్టణమందును దిగెను నొక్కదినమందు॥ ౨౯.
భజన సమూహము వెంబడియుండగ బహు ప్రజలచ్చట గూడన్।
ప్రజాపాలకుడు తురకవాడునై బహు దుర్మదుడై యుండన్॥ ౩౦.
అనేక జనములు పోగైయుండగ హరిదాసుని తెలిసికొని।
అనీతి పరుడై మాంసపుకండల నాతనికిని బంపగని॥ ౩౧.
అతిక్లేశముతో రత్నాకరుడును హరిధ్యానంబును జేయు।
పతితపావనా కృష్ణ ముకుందా పాలింపుము నన్ననియు॥ ౩౨.
నీవాడను యని నిష్కామముతో నెనరుంచితి నీయెడను।
దేవానీవిటు రక్షించుచుమరి దీర్చుకోర్కె లిద్యోడను॥ ౩౩.
గుడ్డతొనచ్చటి పాత్రలో మాంసపు *కొణిగెమూయ బడియుండన్।
అడ్డములేకను రత్నాకరుడటు నాచ్ఛాదన తీయునెడన్॥ ౩౪.
మొగిలి పుష్పములు నుండంగనుచును ముదమున నందరికిచ్చెన్।
పగిదిని కొన్నిటి నరపతి కడకును ప్రసాదముగ పంపించెన్॥ ౩౫.
అనుతాపముతో నరపతిగాంచుచు నపరాధ క్షమకునని।
ఘనద్రవ్యంబును యిచ్చె నతనికిని ఖర్చుని మిత్తముంచుమని॥ ౩౬.

* కొణిగె - కుప్ప.

బడోచ నరపతి మాన్యత యతనికి బహుంగ జేసి తాబంపెన్।
జడులు మూర్ఖులగు జనులనేకులును సద్భక్తులునై యొప్పెన్॥ ౩౭.
హరికృప యిదియని ద్వారకపురమున కరిగెను రత్నాకరుడు।
గురుతుగ నచ్చట పూజాచార్యులు కోరివచ్చి యెదురుండు॥ ౩౮.
వందనాదులను రత్నాకరుడును వాంఛజేసె వినయంబు।
అందరు గూడియు జెప్పిరి యతనికి యటు గోముఖ తీర్థంబు॥
వచ్చటి నీరై పురుగులు బడినవి భవ్యంబుగ జేసినను।
మెచ్చిన భక్తుడ వాడువు నీవును మిగులను హరికియ్యేడను॥ ౪౦.
వినుకొని యాతడు సన్నిధి ముందర విమలంబగు చిత్తముతో।
అనువుగనుండుచు హరికృష్ణా యచ్యుత రంగా దయతో॥ ౪౧.
జనుల యుపాధిని నివర్తించుమిటు సర్వేశ్వర గోవిందా।
కనికరముంచుము దీనునిపైనను కరుణను జూడు ముకుంద॥ ౪౨.
నీచరణమె దిక్కనినమ్మితినని నెనగున తగ వేడగను।
వాచాబలికెను హరి యాతనికిని వచ్చి స్వప్నమందును॥ ౪౩.
సముద్రజలమా తీర్థమునందును చనుదెంచక నటులయ్యెన్।
సమరసభావన గైకొని గోమతి స్నానము నీవును చేయన్॥ ౪౪.
ప్రవాహము చనుదెంచు భయపడకని పరాత్పరుడు జెప్పగను।
వివేకశీలు రత్నాకరు రేయిని వెళ్లెను తీర్థమునకును॥ ౪౫.
గోమతియందున కాళ్లనుంచగను కొట్టె ప్రవాహంబపుడు।
సేమంబగునటు పాతనీరు యటు జెచ్చెర వెళ్లియు నెగడు॥ ౪౬.
పరిశుద్ధంబగు జలములు నుండగ ప్రజలొందిరి మోదంబు।
హరికృప యిదియని రత్నాకరునకు నబ్బెను సంతోషంబు॥ ౪౭.
అనేక ప్రజలటు నమస్కరించిరి యధిక ప్రియుడు హరికనుచు।
పునీతుడగు నా భక్తుడుండెనటు పొందుగ పక్షము రోజు॥ ౪౮.
స్వదేశమునకును తిరిగియు వచ్చెను సర్వేశ్వరు బాడుచును।
కృతార్థులయ్యిరి యనేక జనములు క్రియనునతని జేరుచును॥ ౪౯.

శేషశాయి తన దాసులకెప్పుడు చేయడు న్యూనము గనుము।
వాసిగ దాసుడై బాలకృష్ణుడును వరుసనునుండును నమ్ము॥ ౫౦.

## సూరతుమాధవదాసుచరిత్రము.

సూరతుయందును మాధవదాసుడు సుగుణశాలియై యుండు।
కోరికలెవ్వియు లేక శ్రీహరిని కొనియాడుచు తగనుండు॥ ౧.
పూజల జేయుచు శ్రీహరిమూర్తికి పొందుగనై వేద్యంబు।
ఓజను శర్కరనుంచియు జనులకు యొనరగ పంచు దినంబు॥ ౨.
భక్తుడని పూజవేళ కనేకులు ప్రసాదమునకు వచ్చెదరు।
సక్తిగవార్లకు పిడికెడు పిడికెడు సరగనిచ్చి పంపొనరు॥ ౩.
నేరైనను సరి మణునైనను సరి చెరి పిడికెడు వచ్చునటు।
తీరై యుండుట జనులు గాంచుచును దెలిసివింత నొందిరటు॥ ౪.
అమితప్రేమతో మాధవదాసుడు నందరి సమముగ జూచు।
కోమరొప్పగ దా బహుజనముల హరికొలుపు భజనలొనుంచు॥
కొందరు కుటిలులు నింద జేయుచును కుండలో భస్మమిడుచును।
వింతను జూచెద మనుచునుకుండను వెలయ మూసి చనిరటను॥
మాధవదాసుని ముందుగ నునిచియు మంచిచక్కెర యిదియనుచు।
పాడుగ శ్రీహరి కర్పణ జేసియు పంచుము యందర కనుచు॥ ౭.
అటులనె జేసెద ననియు భక్తుడును హరికి నివేదన జేసెన్।
పటుతరముగ యా శర్కర నచ్చట ప్రజలందరకును బంచెన్॥ ౮.
కుటిలులు గాంచుచు కుంఠిత చిత్తులై గోవిందుని మహిమయని।
నిటలతటాంజలు లగుచును జెప్పుచు నేరక$ మొరయు సంగతిని॥ ౯.
అనుతాపముతో శరణాగతులై యతని కరుణ బొందుచును।
దినదినమునకును హరి భక్త్యధికమై దెలివొందిరి వారలును॥ ౧౦.
ఈ సంగతి యా సూరతు రాజున కెరిగించిరి కొందరటు।
గాసిని యాతడు రెండు సర్పముల కడవలోన నుంచియటు॥

---

$ ఒరయు - పొందు.

మాధవ దాసుని రప్పించెను తన మందిరమునకును నపుడు।
ప్రీతిని బైటికి చూపియు నాతని పెనగి కూర్చొ మనుచుండు॥ ౧౨.
బానకు మూతను గట్టియుంచె నటు పదుగురచట జూడగను।
దీనిలో శర్కర మీ చేతులచే దీసియు నిమ్మనగాను॥ ౧౩.
భక్తుండప్పుడు మూతను దీయగ బానను శర్కర యుండగని।
పక్తుండగుచును శ్రీహరి కర్పణ చక్కజేసి నియ్యగని॥ ౧౪.
ధరణీపతియును దండము బెట్టుచు ధనము శిబికె నిచ్చుచును।
వెఱవక వలసిన వస్తువులను నృపు వేడుమనుచు నడుగగను॥
మాధవు డనియెను సకల పదార్థముల్ మహి నస్థిరమగుచుండన్।
నీతిని నాకును యిచ్చు దేనిపై నిలువదనియు జెపుచుండన్॥ ౧౬.
నరవతి యప్పుడు తలచెను తనలో నై రాశ్యుండత డనుచు।
తెరువుగ భక్తుని యతని గృహమునకు దెచ్చియు తానటు విడుచు॥
ప్రతిష్టవంతుడై మాధవ దాసుడు పదపడి యటనుండగను।
హితమగు ద్వారక యాత్రను బోవగ నితరులు తగ గూడుచును॥
వెళ్ళ దొడంగిరి యొక దినమున నటు విపుల యరణ్యమునందు।
సల్లలితంబుగ వ్యాఘ్ర రూపుడై చనుదెంచెను గోవిందు॥ ౧౯.
భయకంపితులై సకల జనంబులు పరుగులిడిరి పులిని గని।
ప్రియ భక్తుండును సకల భూతముల పెంపున హరి యుండుననిని॥
తలచుచు వ్యాఘ్రము ముందుగ వెళ్ళియు తల్లడ బడకను నుండు।
వీలసిత మగునటు శ్రీహరి తన నిజ విమల రూపుచేనుండు॥ ౨౦.
భాగవతంబున వ్యాస మునీంద్రుడు బలికిన రూపును గొనియు,
సాగర శయనుడు దివ్య మంగళ చతుర్భుజుండై వెలయు॥ ౨౨.
ఆనందముతో మాధవ దాసుడు హరి పదముల బట్టుకొని।
సానందుండై కన్నీ రొలుకగ సర్వేశ్వరు ముఖము గని॥ ౨౩.
తామస యుక్తపు వ్యాఘ్ర రూపును ధరించు టెందు కనగాను।
నేమముతో హరి యేకాంతముకై నేను గో జేసితను॥ ౨౪.

వెంబడి వచ్చిన యాత్ర జనులు తగ వెళ్ళిరి భయమును గనుచు।
సంబరముగ నిను గనుటకు నేనును సరగ వచ్చితిని యనుచు॥ ౨౫.
ద్వారక నుండియు నిచటికి వచ్చితి దర్శన మిచ్చితి నీకు।
మీరక నీవుకు మళ్లును నూరతు మేలిమి నీకును గలుగు॥ ౨౬.
ఇటులం జెప్పుచు నంతర్ధానుడై యీశుడు తగనేగ గను।
అటుగా భయపడి యురికి చనిన యా యాత్రా జనులందరును॥ ౨౭.
పర్వతమందును దాగిలియుండుచు భగవంతుని గన్నారిరి।
నిర్విణ్ణులునై చెప్ప దొడంగిరి నెరియా వ్యాఘ్రము మీరి॥ ౨౮.
మాధవదాసును చంపియుండునని మనుజులంద రనుచుండ౯।
పాదుగనాతడు వారల రమ్మని పలుమరు బిలిచెను జూడ౯॥ ౨౯.
పులియు వెళ్ళెనని జెప్పగవారలు పొందుగవచ్చిరి యటను।
అలయక నతడిది పులిగాదనియును హరిసర్వేశ్వరు డగును॥ 3౦.
వారలు నడిగిరి వృత్తాంతంబును వరుసను జెప్పుండనుచు।
ధీరుడు మాధవదాసుడు బలికెను దేవ మహిమ యిది యనుచు॥
భగవన్మహిమను భక్తులెరుగుదురు పరులెటు జూచెదరనియు।
నిగుడె ననుభవము నాకే నాకై నెనరున శ్రీహరిగనియు॥ 3౨.
ఇతరుల కదియును దెలియుటకరుదౌ యికమల్లెద నూరతుకు।
కుదురుగ మీరలు ద్వారక కరిగియు గోవిందుని గానదగు॥ 33.
నిజ నివాసమును మాధవదాసుడు నెనరొందగ తావచ్చి।
సుజన విధేయుడై బహుతర జనముల నూటిగ భక్తినినుంచి॥
ప్రేమభావమున భగవద్భజనను పెంపుగజేసెను నతడు।
నేమమలరగా బాలకృష్ణుడును చెప్పుచు నుండును వినుడు॥ 35.

---

విఠలపురందరు చరిత్రము.

విటలపురందరు బిదరు ప్రాంతమున విపుల ఖ్యాతితో నుండు।
పటుతరముగ శ్రీపండరినాథుని భజనను జేయుచు నెగడు॥ ౧.

గృహకృత్యంబుల సలుపుచు నుండగ క్రియతో హరిచింతించు
అహ్నికంబులు సత్యము దయయును నాతడు నవలంబించు॥ ౨.
అతిథి కన్న మిడు దుర్బలమై తగు నల సంసారములోను।
హితమగు పండరియాత్రను బోవును ప్రతియుత్సవ మర్యాదను॥ ౩.
నేమంబిట్టుల దృఢముగ సలుపుచు నెఱికాలము జరపగను।
సేమముగాకను నతిజ్వర బాధచే జెందె నశక్తతనటను॥ ౪.
ఆసమయంబున కార్తికమాసం బందవచ్చుటను జూచి।
వేసరిల్లకను యెటుల జూచెదను విఠలునినే నని దలచి॥ ౫.
విపుల క్లేశమున తలమల బడుచును విహిత నిద్రయును లేకన్।
తపియించంబడె యాతని ప్రాణముల్ తవిలి విఘ్నమునుగనగన్॥ ౬.
ఇట్టి సంకటము మూడు దినంబులు నెలమి జెందుచుండినను।
పట్టువిడువకను నుండె జ్వరంబును బలుపుగ చింతించెమును॥ ౭.
శరీరమందున భరవస యుంచిన సర్వేశ్వరు గనలేను।
మరణము యింటిలో నుండిన నైనను మానకనే వచ్చునను॥ ౮.
నిశ్చయ మిడుకొని పండరి యాత్రకై నిగుడి బైలు దేరగను।
కశ్చితు పురుషుడు వెంబడి లేకను కాంత వెంట పోయెనును॥ ౯.
యెద్దు గుఱ్ఱములు నెవ్వియు లేకను నిలదా నడచుచు బోవన్।
హద్దులేక యా జ్వరము దేహమున నమిత బాధతో బొడువన్॥
కాళ్ళు నేలపై నుంచలేక దా కష్టబడుచు నిరువురును।
మెల్లగ రెండొక మజిలీ చేరగ మిగుల తాప మొందగను॥ ౧౧.
పతిని విడువకను సతియును రాత్రిలో బహుశుశ్రూషలు సేయు।
హితములు జేసియు పతికిని తాపము హెచ్చగుటయు దాగనియు॥
మరుదినమందును దేహవిస్మృతియు మహితంబగు నటుజూచి।
వెఱచుచు భార్యయు యేమిసేతునని విపులంబుగ దానేడ్చి॥ ౧౩.
ఉపాయమెద్దియు గానక యామెయు యో హరియని యఱచుచును।
అపారదుఃఖము నొందుచు నేడ్వగ నతడు స్మృతికి వచ్చుచును॥

మంచముపై నను నుంచియు నలుగురు మనుజుల్ మోయగొనిపోమ్ము।
అంచితముగ నే పండరి వెళ్లిన నలసట తీరును సుమ్ము॥ ౧౫.
సతియు వినుంగొని కాసులేనిచే సదు పాయంబెద్దియని।
విదితంబుగ నా దారిఖర్చుకును వెలయగ లేకుండగని॥ ౧౬.
కూలివాండ్ర నే బెట్టే యెడలను కూలికైపైన లేకుండు।
వీలుగ నిటులం జెప్పుచు చింతతో విఠలరంగా యనుచుండు॥ ౧౭.
దేవదేవుడవు పంఢరినాథా దిక్కు నీవే నాకిటను।
భావజ్ఞులకీ వనాథ బంధువు పాండురంగ గ్రోపుమను॥ ౧౮.
చతుర్దివసములు త్రోవ నడవవలె సరి పండరి జేరుటకు।
పతియు జ్వరముచే బాధింపంబడె బ్రతుకు తెరువు యెటు నాకు॥
ఈ మొఱవినుకొని పండరి నాథుడు యెలమి తా నే నలుగురుగా।
క్షేమకరంబుగ *కాపు వారివలె జేరవచ్చి దా నటుగా॥ ౨౦.
తల్లీ యెందుకు కష్ట బడెదవని తరుణిని గని యడుగగను।
మెల్లగ నామెయు తెలియపరచె నటు మెలగిన వృత్తాంతమును॥
హరి విని పండరి యూరునుండెదము నచ్చటికిని పోయెదము।
తెరువున నొప్పితో నుండు నీ పతిని ధరపండరి చేర్చెదము॥ ౨౨.
హరిరూపులునగు నలుగురు మనుజలునపుడె డోలి దెచ్చుచును।
సరగున భక్తుని నందున నుంచుచు చనిరి మోసికొనుచును॥ ౨౩.
ఒకదినమున నే పండరి జేర్చెను నొప్పగ భక్తుని హరియు।
అకళంకంబగు హరిగుణ గానము నచట పురందరు వినియు॥ ౨౪.
సంతోషంబును బొందెను నామము సంజీవన మని వినుచు।
వింతను నచ్చట డోలిని దించెను విఠలరంగడు మనుచు॥ ౨౫.
మంచము మొదలగు వస్తువు లన్నియు మాధవు దెచ్చియు నుంచు।
అంచితముగ తా గుడిలో వెళ్ళుచు హరిపద తీర్థము దెచ్చు॥ ౨౬.
భక్తుని నోటను తీర్థము నుంచగ బరువు తగ్గె దేహమున।
భక్తుని నిడుకొని సతియును నాతడు బజితెంచిరి గుడిలోనః ౨౭.

*కాపువారు - రక్షించువారు.

పురందరు డప్పుడు హరిచరణంబుల పూజించియు దండమిడు।
కరమరుదుగ నే దైవయోగమున గాంచితి నీముఖ మిపుడు॥ ౨౮.
అబ్బినప్రేమను గద్గదకంఠుడై యాలింగన జేయుచును।
గొబ్బున రుక్మిణి సత్యభామలను గురితోడను జూచుచును॥ ౨౯.
తిరిగియు వచ్చిరి వారలు ముగ్గురు దిగుచోటున తగ నపుడు।
మరవకవచ్చెద రేసటి దినమని మాధవు బోవంజూడు॥ ౩౦.
భక్తుండప్పుడు యుపకారంబును బహు జేసితివని యనెను।
సక్తిగనీకును యిచ్చుపదార్థము చక్షులగానను యెటను॥ ౩౧.
నామంబేమని యడుగగ హరియను నమ్రుడై జెప్పదొడంగు।
వేమరు బిల్తురు పాండురంగకొల్లి విశేష బాధుపుల్ నాకు॥ ౩౨.
ఉందురు యిచ్చట నుచితంబుగనని నొగి జెప్పుచు శ్రీహరియు।
పంతముతో నిను మరలగందునని పదపడి దా మరుగయ్యె॥ ౩౩.
విటలపురందరు పండరిపురమున వెలసియుండ నేడహము।
పటుత్వ మతనికి దేహమునందును పాటిల్లెను దినదినము॥ ౩౪.
అరోగ్యము తానొందిన పిదపను హరియనుజ్ఞ బుచ్చుకొని।
పారావార కృతజ్ఞ నుంచుచును పాండురంగ కొల్లిపైని॥ ౩౫.
వారని ప్రీతిని యతని స్మరింపుచు వచ్చెను తన గృహమపుడు।
ధీరంబుగ తా శ్రీహరి స్మరణను దినమును జేయుచునుండు॥ ౩౬.
ఆసన శయ్యా భోజనాదులను హరిచింతన నే గలుగు।
వేసరిల్లకను మరువత్సరమున వెళ్ళె పండర్ పురమునకు॥ ౩౭.
పతియుసతియు పాండురంగ కొల్లికై బహుగా వెతికిరి యటను।
విదితపడక నటనుండగ భక్తుణ వెలయజేయకను మున్ను॥ ౩౮.
ప్రాణమిత్రుడగు పాండురంగ కొల్లి బయటెంచడు యెచటనుచు।
మానుగ వారలు నుపవాసముతో మరులొందుట హరిగనుచు॥
ప్రసన్నుడగుచును పాండురంగకొల్లి బాగుగనేనై యుంటి।
ప్రచురంబుగ నినుదెచ్చితి పండరి ప్రజ్ఞలేక నీవుండి॥ ౪౦.

భక్తుడు జూచుచు బహుమదమున హరి పాదంబుల బట్టుచును।
సక్తిగ నీవీ నశ్వరకాయముగా సరిమోసితి వెందుకను॥ ౪౧.
ఏ యుత్తీర్ణత నీకయ్యెను తగ నింపుగ జెపుమనగాను।
ధీయుతు హరియానె కాయవాక్కులను దెచితివి నను మనసునను॥
కాయము బోయిన యెడల నీవు నను గాంచుట యెట్లగుననుచు।
బాయక నాతని మన్ననచేసియు భక్షణ చేయుండనుచు॥ ౪౩.
అంతర్ధానము కాగనె భక్తులు నతిముదమున నుండిరటు।
సంతతమును హరిదాసులదాసుడై జగతినుండు బాలుండు॥ ౪౪.

---

## నరసింహ సరస్వతి స్వామి చరిత్రము.

పశ్చిమదిక్కున బ్రాహ్మణు డొక్కడు బహువిద్వాంసుండుండు।
నిశ్చయ మనసున భగవదుపాసన నెనరున జేయగ నతడు॥ ౧.
దత్తాత్రేయాంశంబుననతనికి ధరబుట్టెను నొకకొడుకు।
సత్తామాత్రంబైన స్వరూపము సౌందర్యము జూడతగు॥ ౨.
సంతోషంబును బొంది బ్రాహ్మణుడు సరిద్వాదశ దినమునను।
ఎంతో విభవమున నరసింహుండను యిలనునామ ముంచుచును॥
అతిప్రేమను నాబాలుని పెంచగ నైదవ వయసు రాగాను।
హితోపనయనము జేసియప్పుడును నెలమి చదువ జేయగను॥ ౪.
ఒకపర్యాయము నధ్యయ నంబును నొప్పుగ జేయింపగను।
వికాసముగ కంఠాపాఠము జెపు వినగ తల్లిదండ్రులును॥ ౫.
విశాలబుద్ధిని యందరు జూచుచు విస్మయమందు డందురటా।
సుశీలు డగుచును శాస్త్రము లెల్లను సొరది చదివె బాలుడటా॥
సరస్వతీ నిలయమైన ముఖంబని జనులటు జెప్పిరి నిగుడి।
వరుస సరస్వతీ నామంబతనికి వర్ధిల్లెను యటనుండి॥ ౭.
ఎనిమిది యేండ్లలో సకలార్థంబుల నెఱుగుచు నేకాంతమున।
పనిబడి శ్రీహరి భజనను సేయుచు బఱతెంచె నరణ్యమున॥ ౮.

విర క్తిపరుడై వైరాగ్యముచే వెలయగ తలిదండ్రులును।
గురుతుగ నతనికి వివాహ మెట్టుల గూడుననుచు దలచుచును॥ ౯.
సుతుని గాంచుచును యేకాంతంబున నూటిగనని తండ్రియును।
హితపరుడగుచును సంసారంబున నెలమినిడు మనెమనసును॥ ౧౦.
ఆతడు వినుకొని సంసృతి శబ్దమె యబద్ధమగుచును వెలయు।
నీతిని మృగజల సముద్ర మందును నిలుచునె వాడయు మరియు॥
కలలో ధనమును చేకొను నట్లగు ఘనసంసారము ధరను।
తెలివిని నీవును విచారించి మరి దెలియు మాత్మ రూపమును॥
ఇదివిని తండ్రియు దేహాలోభమున ఇహభ్రాంతిని గొనియుండు।
బధిరునకును తగ గాన విద్యయును పట్టుబడని విధముండు॥ ౧౩.
కొమరుం డని యెను వారణాసికిని కోరిచనెద ననగాను।
అమిత వ్యసనము తలి దండ్రిరువురు నార్తిని తగబొందుచును॥ ౧౪.
మరియొక పుత్రుడు మాకు లేదు యిటు మహివృద్ధుల మైతిమిటన్।
వెఱవక నీవును వెళ్ళి పోయినను విహితమెట్లు మాకునిటన్॥ ౧౫.
ఇదివిని కొమరుడా యిద్దరు పుత్రులు యిలను జనింతురు నీకు।
సదయులై వారలు వంశోద్ధారణ చక్క జేతురని బలుకు॥ ౧౬.
సత్యంబిదియని జెప్పుచు పుత్రుడు సలిపె దండమిరు వురకు।
కృత్యము శ్రీహరి దాస్యంబని చనె క్రియను కాశీ పురమునకు॥
సన్న్యసించుచును పరమ హంసుడై సంచరించె దా నటను।
అన్యు లనేకులు ప్రజ్ఞయు నతనిది యమితమగునటు గనుచును॥
దర్శన మాత్రము నందున బద్ధులు తరింప బడిరటు బహుగాన్।
స్పర్శను త్రిశ్శత శిష్యుల జేసెను సద్గుణములు తగగలుగన్॥ ౧౯.
ఒక వత్సరమట నుండి మళ్ళితన యూరుజేరి యయ్యెడను।
ప్రకటంబుగ నటు శిష్య వర్గమును బహుగజేసి తామున్న॥ ౨౦.
గాణగ పురమను క్షేత్ర వాసమును కలియవచ్చి యయ్యెడను।
కానంబడెనటు నమరజ యనునొక ఘనమగునది యుండగను॥ ౨౧.

పరమహంసుడును నచ్చట స్థాయిని బాగుగ దా పొందగను।
గురుతుగ మేలగు ప్రతిష్ఠ యతనికి గొప్పగ కలిగెను మున్ను॥
పండితులగు నాక్షేత్ర వాసులటు పరగవినుచు మహిమలను।
దండినిందలను జేయదొడంగిరి తాపసిపై వారలును॥ ౨౩.
త్యాగము జేసియు బ్రహ్మచర్యమును ధర సన్యాసము నొంది।
యోగదండమును వస్త్రము వదలియు యుక్తభుక్తి చెన్నొంది॥
సకలధర్మముల వదలియు తిరుగుట చక్కనగునె యనుచును।
ప్రకటంబగునటు పరిక్షించుటకు బయలెంచిరి వారలును॥ ౨౪.
ఐదువందలగు విప్రులు దారిలో నతిక్రోధత రాగాను।
పాదుగ దారిని వానను గాలియు బహుజూపె ప్రతాపమును॥
ధూళి యెగరగను కనులుమూయబడి ధోవతులన్నియు నెగిరెన్।
వీలుగాకనటు నగ్నతనుండగ విపుల లజ్జయును దూరెన్॥ ౨౭.
సాధుపురుషునిన్ నిందించుటచే జరిగెను నపమానంబు।
పాదుగ మనమిటు యింటికివెళ్లిన పరిహాసింత్రు నిక్కంబు॥ ౨౮.
పరమహంసునిన్ శరణుజొచ్చినను బాగౌమనకని తలచి।
వెలుపున నందరు పచ్చి యతనికడ వెలయుచు నుతులను జేసి॥ ౨౯.
మదోన్మత్తులము మా యపరాధము మన్నింపుచు మీరలును।
నిదానముగ మము చక్కంజేయుము నెనరుంచుచు బాగుగను॥ ౩౦.
ఇదివిని స్వామికి దయగలుగుచుమరి యిడె వస్త్రముల్ వారలకు।
విదితమయ్యెనది స్వామి మహిమయని వేంచేసిరి గృహములకు॥
ఒకయెడ స్వామియు నమరజ నదిలో నొగిస్నానము చేయంగన్।
సకలురుచూడగ నాలుగు గడియలు చక్కనీట నుండంగన్॥ ౩౧.
అచ్చటబెస్తయు జూచుచుదీనిన్ నప్పుడె మునిగెను నీటన్।
హెచ్చినవింతతో కనులుదెఱచిదా ఏపునగనె గృహమునటన్॥
ఏడుగు రప్సరస్త్రీలు నుండిరటు యిష్టపూజ స్వామికిని।
వేడుకతోడను జేసిరి యచ్చట వే భక్షణ నియ్యగని॥ ౩౪.

విడెములనిచ్చిరి యప్సరస్సులటు వెళ్లిపోడగ స్వామియును।
కడుముదమునదా గృహము వెలపలను కనియుచు తగ రాగాను॥
చెట్టనుగని యతని సంగతియువిని ప్రియుడై బల్కెను తాను।
విస్తరించి యీసంగతి నెవరికి వెలిని జెప్పవలదుయను॥ ౩౬.
బానెడు మొహరీ లతనికి నిచ్చెను బైలుపరచకని జెప్పక।
మానుగనిరువురు నీటికి వెలపల మహీపైని రానోపక॥ ౩౭.
ఇతరజనంబులు చెట్టకుభాగ్యము నిలపైవచ్చుట గనుచు।
విదితమయ్యెనది పరమహంసునికా విమల కృపారస మనుచు॥ ౩౮.
ద్విజవరుడొక్కడు దరిద్రపీడను దీనతస్వామిని జేరు।
సుజనవినుత నాయింటి భిక్షను సుఖముగ గొనవలె మీరు॥
ఇట్టులజెప్పగ స్వామియు బల్కెను నెన్నడైన వత్తునన।
చెట్టి నమస్కృతి బాహ్మణుడింటికై పెంపునరిగె ప్రేమగన॥ ౪౦.
ఒకదిన వైశ్వదేవ సమయమున నొగి స్వామియు రాగాను।
నికటంబున నొక పీటవేయ యతి నెనరున కూర్చుండగను॥ ౪౧.
పాదంబులపై బడుచు ద్విజుండును బహుక్లేశముతో నొందు।
ఈదినము చింతగింజల సంకటి యింటిలోన యుంపొందు॥ ౪౨.
పరమహంసునకు భిక్షణ మదియును పనిబడదనిదా తలచి।
వెలుపున నుండగ స్వామియు బల్కెను వే దుగ్ధము గొనవలని॥
ఇచటికి వచ్చితి బఱ్ఱెపాలునిటు యెలమిని యిమ్మనగాను।
ప్రచురపరచె ద్విజు బఱ్ఱెగొడ్డుదై పాలునియ్య దనగాను॥ ౪౪.
స్వామియు బలికెను యిది మొదలుగ నది సరిగపాలు నిచ్చునుము।
నేమము దప్పదు యనుచుజెప్పగను నెనరున ద్విజుడాదినము॥ ౪౫.
ఎనిమిది సేరుల పాలుపిండుచును యిచ్చెను స్వామికి యపుడు।
అనువుగనాతడు కొంచెము దుగ్ధము నతిప్రేమను గొనుచుండు॥
స్వామియు బలికెను రేపటిదినమున సకల శిష్యులును గూడ।
నేమ మలరగను వచ్చెద భిక్షణ జేసెదనిటు కొనియాడ॥ ౪౭.

ఇరువదైదుగురు ప్రజలకు మాత్రము నింట వంట జేయించు।
గురుతుగ నదియె యనేకజనులకు గోర్కెను విందొనరించు॥ ౪౭.
పురమున నుండెడి బ్రాహ్మణులందర పొందుగ బిలువుము నీవు।
ఇరవుగ నిటులంజెప్పుచు స్వామియు నేతెంచెను తనతావు॥౪౮.
మరుదినమందును నాజ్ఞప్రకారము మహీసురు వంటను చేయగ।
పరమహంసుడును శిష్యులు ద్విజులతో భక్షణ బాగుగసేయగ॥
స్వామిలీలయిది యగాధమనుచును సకలజనులు పొగడిరటు।
ఏమరకను నటమిగులు ప్రసాదము నెల్లజాతి వార్లకిడు॥ ౫౧.
ఈవిధమున యా విప్రుడు ధనికుడై యిల ప్రఖ్యాతికి వచ్చె।
భావశుద్ధితో ప్రజల సమూహము భక్తిగస్వామిని గొలిచె॥ ౫౨.
బీజాపురమున నరపతి యొక్కడు పెను భోగములందుండి।
ఓజను నాతడు స్త్రీలంపటుడై నొగియుండం గనుచుండి॥ ౫౩.
రోగం బొక్కటి యపారమగునటు రూఢియయ్యె దేహమున।
వేగమెనాతడు యౌషధసేవల వెలసిజేసె నెయ్యమున॥ ౫౪.
గుణమెదిగానక తురక ప్రభువటు గుఱుగుచు తొందరనుగొను।
అనువుగ నచటికి పరమహంసుం డట్టివచ్చె తగమున్ను॥ ౫౫.
శ్రీహస్తంబును రోగపీడితుని శిరముపైన యుంచగను।
బాహుళ్యంబగు రోగంబంతయు పరిహరింప బడుటయును॥ ౫౬.
అటువెనకను యారాజును గూర్చియు ననేక నీతుల దెలుపు।
పటుతరముగదా శ్రీహరి భజనలో భక్తిసలుపుమని జెప్పు॥ ౫౭.
ఆచార్యునకును ప్రీతిని సేవల నవనీవతి సేయగను।
వాచికమానసములతో సలిపెటి వాటిని గురుగనుచును॥ ౫౮.
పాదుక లతనికి నిడి శిష్యునివలె భక్తిసలుపుమని జెప్పె।
సాదరముగ శ్రీ హరిభక్తిని నృపు చక్కనిలిచి తగనొప్పె॥ ౫౯.
కురుందవాడా యను నొక స్థలమును కోరివచ్చె స్వామియును।
నిరంతరంబును జనులువచ్చుచును నెనరున గని బోవగను॥ ౬౦.

వారి మనోరథ పూర్తియు నగుచును వర్ధిల్లుచు నటనుండఁగ।
తీరుగనచ్చట గొండ్రాలొక్కతె దీనతతో గొనియాడఁగ॥ ౬౧.
కుమారుఁడొక్కఁడు గలిగిన యెడలను గురుదర్శన మునకును।
ప్రమాణమగునటు వచ్చెద ననుచును ప్రార్థనయును జేసికొను॥
వనితయు గర్భముదాల్చుచు పిమ్మట వరుసను పుత్రుని గనెను।
అనువుగ నామెయు నారుమాసములు నాచార్యుని చూడకను॥
తన నివాసమందుండగ కొమరుడు తటుకున మృతి జెందగను।
ఘన వ్యసనంబున ప్రేతపుత్రునటు గైకొని గురుకడ చనను॥ ౬౨.
సజీవుఁ డగుచును కొమరుండప్పుడు చక్షువులను తగ దెఱచెఁగ।
ప్రజనిత ప్రీతిని గురుయారాధన బహుగా సతి నడపించెఁగ॥ ౬౩.
వణిజుండొక్కఁడు మృత్యు సదనమును వరుసతోడ బొందగను।
మనుకొని భార్యయు సహ గమనమునకు మహినిబోవు చుండగను॥
పరమహంసునిం దారిని గాంచుచు భక్తిని నిడెదండంబు।
తెరువుగ పుత్రవతీ భవయనియును దీవెన జేసియు నంపు॥ ౬౪.
భామిని జెప్పెను పతి మృతినొందెను పారెద సహగమనమునకు।
స్వామియు వినుకొని నీపతి యిప్పుడు సరగ లేచు మేలునగు। ౬౫.
సతివిని వచ్చెను శ్మశాన భూమికి సకల బంధువులు చూడఁగ।
కుదురుగ పెనిమిటి లేచి యప్పుడటు కూర్చుండెను గొనియాడఁగ॥
దీవెన జేసిన రీతిని భూమిలొ తీరముండిరి దంపతులు।
పావను డగుచును పరమ హంసయును ప్రజల మేలెపాటిల్లు॥ ౭౦.
అనేక జనముల నుద్ధరించుటకు హరి భక్తులు బుట్టిరిటు।
పునీతులగు యా భక్తుల దాసుడు పొందుగ బాలకృష్ణుండు॥

---

ముద్గలభట్టు చరిత్రము.

వేదశాస్త్ర పురాణము లందును విద్యానిపుణత గలిగి।
ఆదరముగ ద్విజు ముద్గల భట్టుం డనహంకృతుడై మెలగి॥ ౧.

ఎట్టి పండితుడు తనయెడ వచ్చిన నిలకుంఠితుడై బోవు।
బెట్టిదముగ తా వాదము చేయడు ప్రియ కృప దయలును గలవు॥
ఒకరి యుపార్జన లేక యతనికిని యోర్పును తృప్తియు నెగడు।
అకలంకంబగు రాముని పూజను నరసియు జేయుచు నుండు॥ ౩.
సర్వావస్థల సర్వము రాముడై చక్కనుండ గనుచుండు।
నిర్వాణంబగు సుఖదాయకు డని నెనరు జేసి యతడుండు॥ ౪.
అయాచితంబగు వృత్తిని నాతడు నన్న వస్త్రముల గడుపు।
ప్రయాస లేకను పంచ యజ్ఞముల పటుతరముగ తా సలుపు॥ ౫.
దశాది నోత్సవముల్ రామ జయంతిని తప్పక జేయుచు నుండు।
విశదంబగునటు నన్నశాంతినిఁ విధితో సలుపుచు నుండు॥ ౬.
ప్రతిష్ఠ తోడను నుండుట చేతను పరుల సహాయము గలుగు।
హితుడై యిట్టుల యనేక దినములు యెలమి గడుపుచును మెలగు॥
కుటుంబ సహితుడై మహా యాత్రకును కోరి వెళ్లె యొకయెడను।
పటుతర వృషభము లశ్వమనుష్యుల పరగనుంచి బోవగను॥ ౮.
కాశీపట్టము చేరియచ్చటను ఘనవిశ్వేశ్వరు నకును।
వాశిగ పూజల జేసియు వెళ్ళెను వాంఛతోడ గయకును॥ ౯.
శ్రీరఘు నందను బాడుచు నాడుచు చేసియు గయ వర్జనము।
వారక నాతడు ప్రయాగ గంగకు వచ్చియు వేసె పిండము॥ ౧౦.
జ్యోతిర్లింగము మొదలగు స్థలముల నూటిగ సేవించుకొని।
సాదరముగనే రామ నవమికై సరగమళ్ళె నింటికిని॥ ౧౧.
దారి నడవగను లోకు లనేకులు తగుమన్నన సలిపిరటు।
కోరకమునుపే ద్రవ్య సహాయము గురుతుగ జేసిరి నాడు॥ ౧౨.
రఘుపతి కీర్తన నామస్మరణచె రంజిల జేయుచు జనులఁ।
విఘాత మొందక బహుధనమును గొని వెలసి నడచె నయ్యెడలఁ॥
భక్తుడు దలచెను రామ నవమికిని ప్రబలధనము దొరికెనని।
సక్తుండగుచును మురారి భజనతో చక్కవెళ్ళు చుండగని॥ ౧౪.

దొంగలు నలుగురు వెంబడి దగిలిరి దొంగిలించ నాధనముఁ।
పొంగుగ వారలు సమయోచితమునుపొసగజూచుచునునటముఁ॥
వారలు తస్కరులను భావంబును వరుస నతడు గొనకుండు।
శ్రీరఘు రాముని చరితల బాడుచు చింత లేక చనుచుండు॥ ౧౬.
నలుగురు సేవకుల్ భక్తుని వెంబడి నడచుచు నుండంగనుచు।
పలుమారును యాదొంగలు సమయము బట్టంజాలక నుంచు॥ ౧౭.
ఒకయెడ దొంగలు సేవకులంగని యొనర నడిగి రెవరుయని।
ప్రకటంబుగమే ముద్గలునకు తగు భటులమగుదు మీభువిని॥ ౧౮.
అయోధ్యనుండియు వచ్చియు నితనెడ నబ్బబడుచు నౌకరిలో।
నియామకంబుగ సీతని గృహమున నెనరున జేర్చియు ధరలో॥ ౧౯.
వెళ్ళెదమనుచును జెప్పి దొంగలకు విహితుడు భక్తున కటను।
సల్లలితంబగు రూపుల జూపక సరి నడచిరి తోడుగను॥ ౨౦.
ధనుర్బాణముల జూచుచు దొంగలు తల్లడిల్లి తమలోనఁ।
అనువుగ సమయము దొరకక యుండెను నపహరింప విత్తమునఁ॥
జానకివల్లభ శ్రీగఘునాయక చక్రవర్తి శ్రీకుమార।
దానవ మర్ధన రామ హరేయని దలచుచు దానిలుజేర॥ ౨౨.
సేవకరూపులై వచ్చినవారలు జెందిరం తర్ధానంబు।
భావతి రోహితులైన దొంగలును పరగవచ్చి సదనంబు॥ ౨౩.
నీదు సేవకులు నెటు బోయిరియని నిగుడి భక్తునడుగగను।
సాదు బల్కెనే సెవక జనులను సరసనుంచ లేదనను॥ ౨౪.
దొంగలు బలికిరి వెనకను ముందుగ తోడ కావలుండి రటు।
సంగముతో కాపాడుచు జేర్చిరి చక్కగ నీయింటనిటు॥ ౨౫.
వారలుతమకును బలికిన వచనముల్ వరుసతోడ జెప్పుచును।
నేరముగల తమవృత్తిని యతనికి నెనరున తగ దెల్పగను॥ ౨౬.
పటుతరక్లేశము పత్నిసమేతుడై భక్తుడపుడు బొందుచును।
భటులగువారలు రామలక్ష్మణులు భరతుడు, శత్రుఘ్నుడును॥ ౨౭.

పుణ్యమూర్తులగు మీకును వారలు పొరిదర్శన మిచ్చిరటు।
ధన్యులు గారేయనుచు భక్తుడును దండ మువార్లకు బెట్టు॥. ౨౮.
అనుతాపంబును బొంది తస్కరులు నపకృతముల మానుకొని।
సునిశ్చితంబుగ శ్రీహరి భజనను జొచ్చిరితగ మంచివని॥ ౨౯.
అనేకవిధముల భక్తుడువార్లను నాదరించి దా మరయు।
పునీతమగు తన దేవగృహమునకు బోపుచు వందనమిడియు॥ ౩౦.
జయరఘు నందన, సీతారమణా శ్యామల సుందర రామ।
ప్రియుడవు భవునకు పార్వతిదేవికి ప్రేమభక్త హృదధామ॥ ౩౧.
ధనుర్బాణముల నందిచోరులకు దర్శనమిచ్చితి వీవు।
అనువుగ నేనే పాపముజేసితి యగుపడకుంటివి నీవు॥ ౩౨.
ఈవిధముగ శ్రీరామచంద్రునకు నింపుగ గీర్వాణమున।
భావశుద్ధితో నూరు శ్లోకములు భక్తిని జెప్పెను పైన॥ ౩౩.
మధుర రసంబును ప్రేమభావమున మానుగనుండం జూచి।
సదముల రాముడు లక్ష్మణు భరతుడు శత్రుఘ్నుండును వచ్చి॥ ౩౪.
దర్శనమియ్యగ వారిరూపముల ధరించుకొనె హృదయమున।
హర్షమునొందగ రామజయంతియు నట్లైవచ్చె నెయ్యమున॥ ౩౫.
మహోత్సవంబును జరుపుచునుండిరి మహితజనులు గూడుకొని।
నిహీనమయ్యెను నూనె రాత్రిలో నెఱికీర్తన సలుపగని॥ ౩౬.
వీధిని రేయిని. ప్రజులును దిరుగుట విధికాదని రాజాజ్ఞ।
పాదుగనిట్టుల నుండుటచేతను బహుసంకట మొనరంగ॥ ౩౭.
ముద్గల భట్టుని విద్యార్థునివలె ముదమున రాముడె యటను।
ఉద్గమించుచును నూనె కొఱకు నయ్యార్యులోన చనియటను॥
శ్రీరఘు రాముని ముద్రల రెంటిని చేకొని కోమటి కిచ్చి।
కోరిన నూనెను యిమ్మని యడుగగ కోమటి సమ్మతి యిచ్చి॥ ౩౯.
బానెడు నూనెను నియ్యగ రాముడు బట్టితెచ్చె నెయ్యమున।
మానుగ రేయిని కీర్తనజరిగెను మధుర రసము గూడుకొన॥ ౪౦.

అనేక ప్రజలటు వచ్చియు వినుచుస నత్యుల్లాసము జెంది।
పునీతు లగుచును ప్రాతఃకాలము బోయివారిండ్లందు॥ ౪౧.
ఉదయము కాగనె కోమటి దెచ్చెను నుచిత రామము ద్రలను।
పదుగురు వినగను ముద్దలు ముందర బలికె నతడు, రేయినను॥౪౨.
నీదు మనుష్యుడు ముద్రల నిచ్చుచు నిగుడి దెచ్చె తైలమును।
పాదుగ ముద్రల నీవెయుంచుకొని పైక మిమ్ము నానెకును॥ ౪౩.
వినుకొని భక్తుడు విద్యార్థులదా విచారించి యట నడుగగ।
చనువున వారలు తమకు తెలియదని చక్కగ బల్కిరి వెలిగగ॥
శ్రీరఘు రాముని కృత్యంబిదియని చింతించుచు భక్తుండు।
వారక ముద్రల గైకొని రాముని వరసన్నిధి నిడి నెగడు॥ ౪౫.
వినయ విధేయుడై భక్తి సలుపుచును విఖ్యాతిని తగ బొందెగ।
ఘనులగు భక్తుల దాసుడై బాలుడు కనికరమునచె న్నొందెగ॥

---

## జసువంతు చరిత్రము.

తపతీ తీరము నందును బెరటను ధరనొక గ్రామము గలదు।
నెపములేక జసవంతను భక్తుడు నిలిచియుండు తానందు॥ ౧.
పరమ సుశీలుడు పుణ్యమూర్తి డగు బ్రాహ్మణుడై యుండుచును।
చిరతరముగ దా పూజల జేయును సీతారాముని యటను॥ ౨.
అయాచితంబగు వృత్తిని యుండుచు నతిథికి నన్నంబిడుచు।
ప్రయాస పడుచును కుటుంబ రక్షణ బాగానటు జేయించు॥ ౩.
భూతదయయును పశ్చాత్తాపము పొందుగాను గలిగుండు।
పాదుగనిత్యము హరికీర్తనదా భక్తిని చేయుచునుండు॥ ౪.
పలుకును సత్యము భగవన్నామము పరిపాటించును తాను।
తలచడు యెప్పుడు దుష్టచింతనల తపవలె గను నితరులను॥ ౫.
ప్రతిదినమందును రాత్రివేళలో భగవత్కథ జరిపించు।
అతులితముగనె యనేక జనములు నాలకింతురటు దురుసు॥ ౬.

అనేకదినములు యిటులం జరగగ నమిత వర్షం బొక యెడను।
ఘనీభూతమై యేడుదినంబులు ఖండింపక గురియగను॥ ౭.

అమిత ప్రవాహము తపతీనదిలో నలయునటుల రాగాను।
కొమరొప్పగ నా గ్రామవాసులటు కుంఠితులై గూడుచును॥ ౮.

ఏ యుపాయమును దోచకయున్నది యెటుజేసెద మనగాను।
ధీయుతు బల్కెను యొక్కండచ్చట దేవుడు జెప్వంతునకును॥

ప్రసన్నుడగుటచె యాతనివద్దకు పదపడి వెళ్ళుదమనుచు।
గుసగుస లాడుచు నంద రతనికడ గూడివచ్చి తగగనుచు॥ ౧౦.

దినదినమును హరికీర్తన యందును దెలుపుచు నుందువు మాకు।
ఘనుడగు రాముడు నాతనిభక్తుల గాపాడును యిడుములకు॥ ౧౧.

ఇప్పుడు మాకును సంకటకాలము యేర్పాటయ్యెను మిగుల।
తప్పకనదిలో ప్రవాహ పూర్తిచె దరిగనకుం డియ్యెడల॥ ౧౨.

గ్రామము లో .ల నీరువచ్చునటు గానుపించుచును నుండు।
నేమముతోడను భగవన్మహిమను నేర్పుజూపి గాపాడు॥ ౧౩.

గ్రామమునందును హాహాకారము గలిగెను బహు గొప్పగను।
రామచంద్రు నిటు ప్రార్థించియు మము రక్షింపుము బాగాను॥౧౪.

ఇదివిని భక్తుడు నార్తిని వెళ్ళెను యేపున దేవుని గృహము।
కుదురుగ మూసియు కవాట మప్పుడు కోరి వేడె శ్రీరాము॥ ౧౫.

శ్రీరఘునందన సీతారమణ శ్రితజన పోషక రామ।
కారుణ్యాలయ కంజదళేక్షణ గాపాడుము రణభీమ॥ ౧౬.

దినకర వంశుడవగుచు బుట్టితివి దీనుల బ్రోచుట కొఱకు।
ఘనరావణు నటు సంహరించితివి కడగి సురుల రక్షణకు॥ ౧౭.

తపతీయందును నీరును బెరిగెను తపించిరి గ్రామికులు।
చపలతగొని నాచావుకు జడవను జనుల చింత వాటిల్లు॥ ౧౮.

నీదునామమున పాషాణంబును నిత్యశ్రీని తరించబడె।
పాదుగనిట్టుల కన్నీరొలుకగ భక్తుడు రాముని వేడె॥ ౧౯.

దీనదయాళుని ధ్యానము నుండగ దివి పలుకుల హరిజెప్పు।
మానుగ యానది ప్రవాహ ప్రాశన మారుతిజేయుగ నొప్పు। ౨౦.
నదీపారునకు నెదురుగ నుంచుము నయ మారుతీ మూర్తిగొని।
యభీష్టముగ యానీరు ద్రాగునని యెలమి జెప్పెమున్న గని॥ ౨౧.
అర గజంబునకు సరియై యుండెడు యాంజనేయు విగ్రహముఁ।
వేఱవక భక్తుడు చేతుల నిడికొని వేంచేపించెను నదిముఁ॥ ౨౨.
నీరు నధికమై యుండు చోటనటు నిలవబెట్టె మారుతిని।
వారక ప్రజలును వచ్చి చూచిరటు వసుధ వింత యిదియునని॥ ౨౩.
మారుతి యప్పుడు నట్టహాసమున మహా రూపుచే కొనుచు।
వీరావేశపు ధ్వని తా జేయుచు విపుల నోటినిం దెఱచు॥ ౨౪.
ప్రవాహ మంతయు నోటను ద్రిం గెను పవనాత్మజు తా నపుడు।
నివారించె నా ప్రజల దుఃఖమును నీరును నటు రాకుండు॥ ౨౫.
ప్రజలు గాంచుచును ప్రమోద మొందుచు భక్తుని పదములబడిరి।
నిజముగ నీకును రాముడు సాధ్యుడై నెనరు జేసెనని యనిరి॥ ౨౬.
తక్కువయ్యెనటు ప్రవాహ మప్పుడు తగు నాల్గవ దివసమున।
పెక్కు పలుకులను కొందరు జెప్పిరి ప్రియలుగాక చర్యగన॥ ౨౭.
ధాతుమూర్తి యా నీరును ద్రాగునె ధర సత్యముకాదు యిది।
మేదినిలో యా ప్రవాహ పూర్తియు మెలగి దిగుట సహజ మిది॥
ఇంటింటను బహు ధాతు మూర్తులును యెలమిని తగ నుండినను।
కంటికి నవియును నీరును ద్రాగుట గానుపించ దెయ్యెడను॥ ౨౮.
వికల్ప చిత్తులు యిటులం జెప్పగ విశ్వేశ్వరు తా నపుడు।
ప్రకటపరచె నొక ఛిద్రం బప్పుడు పవనాత్మజు నా ఖనడు॥ ౩౦.
ధారబెరిగె తచ్ఛిద్రము నందును ధర నాలుగు దినములును।
తీరుగ యిదిగని దుర్జను లందరు దీనులై వచ్చిరి యటను॥ ౩౧.
సాగిల బడుచును దండము బెట్టిరి జస్వంతునకును నపుడు।
వేగమె రాముని భక్తులై వారలు వెలసిరి యందరు నాడు॥ ౩౨.

శ్రీరఘురాముని స్వరూప మందును చిక్కఁబడెను జన్వాంతుI
వారని కీర్తియు లోకము నందును వర్ధిల్లుచు నింపొందుII 33.
హనుమద్విగ్రహ మిపటికి నచ్చట నందరు చూడగ వెలయుI
తనుమన వాక్కుల బాలకృషుడును దాసుడు భక్తుల కనియుII 3౪.

---

## నిరంజనుచరిత్రము.

నారదబిందు సమీపము నందును నామల యను యూరుండుI
ధీరగుణాఢ్యుడు నిరంజనుండను ద్విజుడొక్కఁడు యచటుండుII ౧.
ఉదాసవృత్తిని విరక్తచిత్తుడై యొప్పుగతా నట నెగడుI
నిదానమున శ్రీగణపతి పూజను నిత్యము జేయుచునుండుII ౨.
ఇతరదేవతల దృష్టినిజూడక యేక నిష్టను దానుండుI
సతతము నిట్టులజేయగ గణపతి సాక్షాత్కార మగుచుండుII 3.
ఒకయెడ యింటికి విద్వాంసుండగు నొక ద్విజుడే తెంచగనుI
ప్రకటంబగు నా గణపతి పూజను బ్రాహ్మణుడట జూచుచునుII ౪.
అతిథియు జెప్పెను శాస్త్రవిరుద్ధము నరయగ జూచితినిటనుI
హితకర శిలయగు సాలగ్రామము నిచటగాన కుంటినెనుII ౫.
శ్రీహరిగాకను నితరదేవతల చెలిమిని పూజించిననుI
ఊహను తీర్థంబున కధికారము నొప్పదు నాకియ్యెడనుII ౬.
జెప్పుచు నిట్టుల సాలగ్రామము చేతులనుంచెను యతిథిI
దెప్పరదీనిం బూజించియు మరి తీర్థంబును గొనుటవిధిII ౭,
సాలగ్రామము చేతుల నిడుకొని సంకోచించుచు నతడుI
శీలత్వముతో యేకనిష్ఠగా చెల్లించితి నిటగనుడుII ౮,
మానుగ నదియును వ్యభిచరింపబడి మనసున క్లేశముగలిగెI
దీని న్నెట్టుల సహింతు ననుచును దీనత శిలగని బలికెII ౯.
గజవదనుడ నీ నామము నెప్పుడు గరిమె జెప్పుచుందు సుముI
ప్రజలు గనగ నా ప్రాణముపోయిన భక్తినీపై విడువనుముII ౧౦.

నీదుధ్యానమటు సంపూర్ణంబుగ నిలువదు యీ శిలయందు।
ఆది ఋషులు మరి దేవగణంబులు నమిత క్షోభనాయందు॥ ౧౧.
జేసిన యెడలను నాకాశంబును చెదరక నా తలబడినన్।
వాసిమీరనీ భక్తిని వదలను వర గణపతియనుచు నన్॥ ౧౨.
విధిజనకుడు యా నిరంజనదాసు విపులభక్తికిని మెచ్చి।
ప్రధానమగునటు శిలకును యేనుగ ప్రబలతొండంబొనర్చి॥ ౧౩.
ఇతరపండితులు నచ్చటనుండుచు యీవింతను తగగనుచు।
సదమలురగుచును జయజయ శబ్దము సలిపిరి యచ్చట హెచ్చు॥
నమస్కరించుచు నమ్రులై బలికిరి నరహరి నీభక్తికిని।
క్షమరొప్పగనటు తృప్తిని జెందుచు గురుతుజూపె నేడుగని॥ ౧౪.
యెవరిభావనయు నెట్టులనుండునో యీశుడట్లు కృపజూడు।
చవిగొని చెప్పగ భక్తుడు శిలకును సలిపె పూజలనునాడు॥ ౧౫.
ఉపాసన క్రమముందున భక్తుం డుపపత్తిని నుంచినను।
అపారసుగుణము బొంది ప్రసన్నత నందగనును నయ్యెడను॥ ౧౬.
నిరంజనుండటు విపులఖ్యాతిని నెనరొందెను దానపుడు,
కరముల మూడ్చియు బాలుడు దాసుల కైంకర్యంబున నుండు॥౧౭.

---

## జ య రా మ స్వా మి చ రి త్ర ము .

ద్విజవరు డుండెను కృష్ణదాసుడని తెలుగున వడగామునను।
సుజనశీలుడై హరియర్చనమును నూటిజేయుచుండుమును॥ ౧.
గృహస్థధర్మము నవలంబించియు క్రియ కర్మల సేయగను।
సహచరియగు తనభార్యయు మృత్యువు సదనంబును బొందగను॥
కొన్నిదినంబుల వెనక నాతడును కోరె రెండో పెండ్లికిని।
పన్నుగ నయ్యెడ వ్యాపారంబును బట్టెను నృపుసేన కని॥ 3.
సేనయు నప్పుడు వేరొక దేశము చెలగి బోవుచును నుండెన్।
మానుగ నీతడు వ్యవహారములో మరిగి వారలను గూడెన్॥ ౪.

సైన్యంబచ్చట వెళ్ళియు చేకొనె జయము శత్రుపైగాను।
దైన్యము నొందగ పట్నవాసులను తరిమి కొల్ల గొనిరిమును॥ ౫.
గ్రామ వాసులును కొందరప్పుడటు కలతలొంది పరుగులిడన్।
నేమముతోడను కృష్ణ దాసుడును నెనరున వారల జూడన్॥ ౬.
కనికరమున నొక విప్రు నింటిలో కన్యను జూచెను నతడు।
ఘనసౌందర్యము గాంచుచు తనకై కన్యను నడుగుచు నుండు॥ ౭.
ఇంటి వారు సమ్మతించి కన్యను నిచ్చిరి వైవాహికమున।
జంటను దంపతు లిద్దరు వచ్చిరి చక్కగ స్వగ్రామమున॥ ౮.
వయసుకాల మటు కన్యకు రాగను వరుసను ఋతుశాంతియును।
క్రియలతో జేయుచు గృహస్థుడగుచును కృష్ణ దాసు డుండగను॥
కొన్ని దినంబులు గడిచిన పిదపను కుండను తలనుంచుకొని।
పన్నుగ నాతని భార్యయు వెళ్లెను బావిగట్టు నీరుకని॥ ౧౦.
బంధురాలగు స్త్రీని యొకతె నటు భామిని తా తగగనుచు।
పంతముతోడను యిరువురు గూడుచు భాషింపుచు వారుంచు॥
మంగల వృత్తిని యవలంబించిన మానిని బంధువై యుండు।
పొంగుచు ముదమున నామెయు బల్కెను పురిని కొల్ల గొనునాడు॥
నిను విడనాడుచు సంగతి తెలియక నీట్టూర్పుల నుంటినిటు।
అనువుగ నీ విటు యెటుల వచ్చితివి యరసి జెప్పుమని వేడు॥ ౧౩.
విప్రుని సతియను బలికె నప్పుడును వేరు సేనలోన బడి।
అప్రమత్తనై యేమి దెలియకను విప్రునింట దాగుంటి॥ ౧౪.
అచ్చట విప్రుం డొక్కడు వచ్చియు నభిలషించె నను గాంచి।
విచ్చలవిడి యా యింటి బ్రాహ్మణులు విప్రు కన్యయని దలచి॥ ౧౫.
వివాహమందును నతనికి నిచ్చిరి విధి యిట్లైనది నాడి।
నవీన వార్తలు వీటిని వినుచును నలుగురు స్త్రీలం వీధి॥ ౧౬.
గ్రామము నందును బయలు బఱచిరటు కనికర మింతయు లేకన్।
సేమము కోరని జనులును కొందురటు జెప్పిరి దాసుడు వినగన్॥

ముంగలి కన్యను పెండ్లాడితీ వీటు మహా పాప మగునుగ వా।
ఇంగిత మెరుగక వర్ణ సంకరము యేర్పడె నరకము బొందా॥ ౧౮.
దురాచారతను బొందియు నాపికర్ దొంగిలి దెచితివి సేనర్।
నిరాటంకముగ బ్రాహ్మణ జాతిని నీరు జేసితివి గానర్॥ ౧౯.
ఈవిధముగనని బ్రాహ్మణు లందరు యేకభావమున కూడి।
కేవల భ్రష్టుడు కృష్ణ దాసుడని క్రియ శుద్ధియు లేకుండి॥ ౨౦.
ప్రాయశ్చిత్తము దేహాంతమె యని పలికి రాంతు యతనికిని।
డాయక నుండిరి యితర జనంబులు డస్సెదాసు డిట్లుగని॥ ౨౧
అపవాదంబీ తీరుగ రాగను ననుతాపము బొందుచును।
నెపములేక దా కన్నీరొలుకుచు నీరజాక్షు నెంచుచును॥ ౨౨
యెన్నబై నాలుగు లక్షయోనులను యేమరి తిరుగుచు నిపుడు।
అనువుగమనుజ శరీరము దాల్చితి యాత్మహత్య గొన నేడు॥ ౨౩.
పునరపి శ్రీహరి ప్రాప్తి యెట్లగును పొందంబడు నరకమని।
వినతుడై ద్విజులకు నమస్కరించుచు విహితంబుగ జెప్పెగని॥ ౨౪.
మీపాదంబుల సేవారతుడను మీరి భ్రష్టునైతి నిటు।
ఏపారగ హరి పతితపావనుడు యెలమి యిటను నాకుండు॥ ౨౫.
ఇటులంజెప్పుచు శ్రీహరిభక్తియు నెఱమిని నధికంబగుచు।
పటుతరముగ హరినామము నుడువుచు భగవత్కథ నడిపించు॥ ౨౬.
జ్ఞానేశ్వరియను గ్రంథమునొక్కటి గారవమున చదువుచును।
దీనత శాంతియు దయాధర్మముల తిరముగ దాల్చెను సుమ్ము॥ ౨౭.
పరోపకారము బహు విధములుగా పాటుబడుచు తా జేయు।
నిరాశయుక్తుడై శ్రీహరికీర్తన నేమముతోడను జేయు॥ ౨౮.
అనేకభక్తులు కథవినుచుందురు యమితప్రేమతో నటను,
పునీతులగుచును వందనాదులను పొసగ సలుపు చుండగను॥ ౨౯.
ద్విజవరుల్ మాత్రము దురుత్తరంబుల తెంపునజెపు చుండిరటర్।
కుజనులు ముంగలికృష్ణుడు యనుచును గొణుగుచుందురనోటర్॥

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| యొజన | యోజన | 428 | 1 | శర్క్ర | శర్క్కర | 541 | 7 |
| నూచించుచు | సూచించుచు | 429 | 14 | సైమమలర | సేమమలర | 541 | 10 |
| జేయుచు | తోఁచుచు | 449 | 33 | తోఁజిగ | తేజిగ | 549 | 15 |
| పిదవను | పిదపను | 457 | 53 | కృష్ణడు | కృష్ణుడు | 550 | 21 |
| పంచేతోఁడ | పంచెతోఁడ | 466 | 30 | పతిౖవ్రత | పతివ్రత | 552 | 31 |
| సర్ధురు | సద్గురు | 486 | 36 | విష్నపించె | విన్నపించె | 554 | 54 |
| ననూయతో | నసూయతో | 492 | 40 | నతనకి | నతనికి | 554 | 58 |
| విఱవీగి | విఱ్ఱవీగి | 491 | 75 | ఏవుగ | ఏపుగ | 556 | 77 |
| పెశలముగ | పేశలముగ | 500 | 144 | నతడనే | నతడనె | 560 | 25 |
| పండరిపురినికి | పండరిపురికిని | 511 | 155 | అంచిత | అంచిత | 560 | 26 |
| శ్వాశురుని | శ్వశురుని | 513 | 45 | సిమీపమందును | సమీపమందును | 562 | 18 |
| ఖండిచి | ఖండించి | 519 | 32 | తప్పగ | తప్పక | 563 | 26 |
| బాహుళ్య బగు | బాహుళ్యంబగు | 525 | 60 | నిచ్చేదననచును | నిచ్చెదననుచును | 564 | 9 |
| పన్న ను | పన్నును | 528 | 63 | పుణ్యుడు | పుణ్యుడు | 571 | 20 |
| ఘునవర్తకుడు | ఘనవర్తకుడు | 528 | 101 | గైకో | గైకొనె | 571 | 25 |
| ఘునముగ | ఘనముగ | 529 | 115 | వ్యాఘ్రములు | వ్యాఘ్రములు | 526 | 35 |
| జోఁరొ | బోఁరొ | 533 | 163 | త్యధమనుచు | తథ్యమనుచు | 573 | 50 |
| జంంపను | జంపను | 535 | 185 | గొట్టుకొనిరుపురు | గొట్టుకొనిరిరుపురు | 580 | 3 |
| వచిరని | వచ్చిరని | 535 | 187 | వినికొని | వినుకొని | 586 | 4 |
| భక్షజేసియు | భక్షణజేసియు | 534 | 178 | నాకును | నాకును | 587 | 16 |
| యొమియన | యేమియన | 538 | 12 | యభయ నుచు | యభయమనుచు | 597 | 17 |
| కుజనలు | కుజనులు | 540 | 31 | దాతయిచ్చట | దాతలిచ్చట | 605 | 12 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| సాతోతారవు | సాక్షాత్కారవు | 621 | 9 | విరక్తచితుడై | విరక్తచిత్తుడై | 702 | 27 |
| యమితనుగుడై | యమితనుగుణుఁడై | 625 | 2 | ఇటలం | ఇటులం | 703 | 7 |
| బాగనిగృమునకేగె | బాగని గృహమునకేగె | 627 | 25 | యెరిగిచెంచెను | యెరిగించెను | 727 | 26 |
| పచితంబుగ | ప్రచితంబుగ | 628 | 36 | కరుతుగ | గురుతుగ | 728 | 5 |
| ఘనీభూతుడగు | ఘనీభూతుడగు | 665 | 10 | వచెను | వచ్చెను | 742 | 6 |
| సమయయుమున | సమయమున | 669 | 10 | కార్యంబుగనే | కార్యంబుగనిటు | 749 | 16 |
| సాక్ష్రినసురు | సాక్ష్రియసురు | 672 | 53 | హరికృష్ణ | హరిశ్రీకృష్ణ | 754 | 41 |
| నగచు | నగుచు | 690 | 18 | జనులుకొందరటు | జనులు కొందరటు | 775 | 17 |
| యెమని | యేమని | 692 | 7 | పావర | స్థావర | 792 | 36 |
| అశ్వారూఢడై | అశ్వారూఢుడై | 694 | 13 | భకుని | భక్తుని | 800 | 148 |
| ద్రిష్టి | దృష్టి | 702 | 23 | | | | |

కుచేష్టతో నొకవిప్రుడు వచ్చుచు గోరెక్షౌర మొనర్చుమని।
విచారింపకను కత్తి నందుకొని వెలయ జేసెక్షౌరమని॥ 3౧.
కృష్ణదాసుం డనుకొనె తనలో క్రియను పూర్వ జన్మమున।
విష్ణుభక్తి తగ జేయుట చేతను విడె నభి మానము గాన॥ 3౨.
స్నానము సంధ్యయు నాచారంబును చక్కగ జరుపుచు నుండు।
మానుగ శ్రీహరి స్మరణ కీర్తనల మరవక జేయుచు నుండు॥ 3౩.

---

పండరిపురి నొక బ్రాహ్మణ దంపతుల్ భగవంతుని సేవించి।
నిండు ప్రేమయును పాండురంగుపై నిత్యము నుంచుచు మించి॥
హరిపై ప్రీతిచె స్వగ్రామమునకు నరుగ యిచ్ఛలే కుండన్।
తిరముగ పండరి యందునె కాయముల్ తెలివితోడ విడిచిరటన్॥
జయ రాముండను పుత్రుం డొక్కడు సలిపె క్రియల వారలకు।
ప్రియ భావంబున పండరి నాథుని పెంపుగ గొలిచెను బాగు॥ 3౬.
మూడు కాలముల భగవద్దర్శన ముదమొందగ దా జేయు।
వేడుక తోడను హరికీర్తన దా వినుచుండుచు మెలగుటయు॥ 3౭.
పండరి నాథుడె తల్లియు తండ్రియు బంధువర్గమును నతడే।
కొండొక మనుజులు బ్రోచువారలును కువల యమున లేకుండె॥
ఈవిధ ముండుచు పురాణ మొకచో యింపుగ దావినుచుండు।
దేవుని కన్నను గురు వధికంబని దెలియగ జయరాముండు॥ 3౯.
సదా చార్యునిం గలుగ జేయుమని సర్వేశ్వరు పూజించు।
ప్రధాన పూరుష గురునిం జూపుము పాండురంగ హరి యనుచు॥
అనేక దినములు ననుష్ఠానమును నంచితముగ దా జేయన్।
జనార్ధ నుండును జెప్పె నతనికిని స్వప్నము నందును డాయన్॥
వడగామందున కృష్ణదాసుడని వాసము జేయును నొకడు।
ఉడుగక నతనికి శరణరుగుము యత డొప్పగనను గనుచుండు॥

ఇటులం జెప్పుచు ద్విజు రూపున హరియే గెను దా నయ్యెడను।
పటుతర మోదము నొందెను జయరాం భగవత్కృప గలిగెనను॥
ఉదయము కాగను భీమానదిలో యుచిత స్నానము జేసి।
కుదురుగ పితలుని సేవించియు మరి కోరెను హరి కృపమించి॥
ప్రదక్షిణంబుగ వచ్చి పండరికి పాదచారియై నడచెను।
సదయుండగుచును మాటిమాటికిని సలుపుచుదండముల్ వెలసెను॥
ప్రేమ భావమున కన్నీ రొలుకగ ప్రియపండరి విడుచుచును।
నేమము దప్పక సద్గురు నింటికి నెనరుతోడ వచ్చుచును॥ ౮౬.
ఉల్లాసముతో నాచార్యుని గని యుచిత నమస్కృతి సలుపు।
సల్లాపముతో హరియాజ్ఞను దా చక్కగ జెప్పుచు నొప్పు॥ ౮౭.
విస్మితు డగుచును కృష్ణదాసు డును పితలు డుపాధి గల్పించు।
సస్మితుడై దా జెప్పె నతనికిని జాతిభ్రష్టు నైయుంచు॥ ౮౮.
దేహాంతంబగు ప్రాయశ్చిత్తము దెలిపిరి ద్విజుల్ నా కొఱకు।
మోహాత్మక మగు శరీరమందున ముఖ్య మమతనుం చితగు॥ ౮౯.
బైటికి మాత్రము భక్తిలక్షణము బలతరముగ జూపుచును।
ఘాటిగ యాశతో సంచరించెదను తగు విప్రుని నీవిలను॥ ౯౦.
గురువుగ నిచ్చట జేసికొనిన యెడ కులజుల్ సమ్మతించెదరు।
బరువగు నాంక్షచె భవిష్కారమిటు బలముగ నాపై నిపురు॥ ౯౧.
జయరాముడు విని యేడ్చుచు శ్రీగురు చరణంబుల బట్టుకొని।
భయమందక నే త్రికరణ శుద్ధిగ బట్టితి హరి కరుణయని॥ ౯౨.
కృపాదృష్టినిం గని బవిత్రునిగ క్రియతోనను చేయుమను।
అపార గుణముల కృష్ణదాసుడును యరమర లేక గనుచును ౯౩.
అభయ కరంబుల శిష్యుని మస్తక మందున తగ తానుంచి।
శుభదంబగు నట్లుపదేశించియు సుఖమగు భజనను నునిచి॥ ౯౪.
ప్రేమను జూపుచు నుండ గురువునకు ప్రియ భక్తుడు శిష్యుడును।
నేమము దప్పక యనన్యు డగుచును నెఱిసేవల జేయగను॥ ౯౫.

పరస్పరంబుగ గ్రామము నందును బ్రాహ్మణుల్ విని సంగతిని।
గురువు లనేకులు జ్ఞానవంతులై గురుతుగ నుందురు భువిని॥ ౫౬.
వారల విడిచియు భ్రష్టుని శరణము వలగొనె జయరాముండు।
సార తరంబగు బ్రాహ్మణ కొమరుండై క్షౌరకుశిష్యు డయ్యెండు॥
ఆతని తోడను మాట లాడుటయు యయోగ్యమగు ననుచును।
పాడుగ వారలు భవిష్కారమున బడద్రోసిరి జయరామును॥ ౫౭.
*విన్నుగ యెంతో నిందల మోపిన వినకను జయరాముండు।
పన్నుగ గురుడే దేవదేవుడని భావించుచు తానుండు। ౫౮.
ప్రాతస్నాతుండై యుపకరణంబుల పరిశుభ్రంబుగ తోము।
పాదుగ నుదకము దెచ్చియు నుంచును భక్తిని గురువునకుసుము॥
గురునకు స్నానము తా జేయించును కోరి పూజాద్రవ్యముల।
అరమర లేకను నందిచ్చును దా హరిపూజకు నయ్యెడల॥ ౬౧.
యోగిజనులకై శిష్యులు యెట్టుల యొగి సేవల సలుపుదురు।
ప్రాకటముగ దా సేవల జేసెను భక్తిశ్రద్ధ నాతీరు॥ ౬౨.
గురుభక్తిని గొని పరిపూర్ణుండై గొప్పకవితలను జెప్పు।
నిరతము భజనలో హరిగుణ గానము నిండుప్రేమతో నొప్పు॥
కపట రహితు లగు నరులనేకులును ఘన ప్రేమను విందురటు।
నెపము నొందకను చరణ వందనము నిరతంబును జేతురటు॥ ౬౪.
ఒకపరి శంకరాచార్యు డచటికి యొప్పుగ వచ్చెను గనుడు।
సకల బ్రాహ్మణులు కూడియు నతనికి సలిపిరి మన్నన లపుడు॥ ౬౫.
ప్రశంస జేసిరి జయరాముండను బ్రాహ్మణ పుత్రుం డొకడు।
అసంశయంబుగ నాపితు వద్దను ననుగ్రహము గొని యతడు॥
దినరాత్రంబుల సేవల జేసును తిరముగ నాచార్యునకు।
అనువుగ నిదివిని శంకరచార్యుం డతని దెమ్మనె తనకడకు॥ ౬౭.
గురుడును నాతని కూడనె దెమ్మని గురుతుగ జెప్పగ నపుడు।
పరిచారకు లటు జయరాముని తగ బట్టి దెచ్చి రానాడు॥ ౬౮.

---

*విన్నుగ - ఉచితముగ.

శంకరాచారి యుపదేశము నెటు తీరకు నెడ గొంటివను।
చింకము లేకను భ్రష్టుని గురువుగ ప్రీతి జేసితి వెదుకను॥ ౬౯.
జయరాముండును నమస్కరించుచు సద్భావముతో ననెను।
ప్రియుడగు నా గురు కృష్ణమూర్తి యగు ప్రీతిని శరణొందితను॥
మీరలు కృపచే నచటికి వచ్చిన మేలుజూతు రనుచును।
వారక నాగురు నాపికుడై తే వరుస శిక్ష నొందెదను॥ ౭౧.
మహాంతుడిది విని విస్మిత చిత్తుడై మహీసురుల గూడుకొని।
అహాంతతోడను కృష్ణదాసుని నలగృహమును చేరగని॥ ౭౨.
ఆసమయంబున కృష్ణదాసు హరి యర్చనలో నుండెనటన్।
వేసరిల్లకను శంకరచారియు విధితోవచ్చుచు జూడన్॥ ౭౩.
చతుర్భుజంబుల కృష్ణరూపమును చక్కగజూచుచు నపుడు।
సదమలుడగుచును యతియు నమస్కృతి సలిపె దాసునకు నాడు॥
జయరామునిగని శంకరాచారియు చక్కగ జెప్పెను నీవు।
ప్రియుడవు ధన్యత బొందితీవుయని పెంపుజేసె నాతెరువు॥ ౭౫.
పండరినాథుడె కృష్ణదాసుడగు పరీక్షించినే గంటి।
నిండుప్రేమతో త్రికరణ శుద్ధిగ నెఱిసేవలు జేయండి॥ ౭౬.
భవిష్కారము న్నిటపై నతనికి పరిహారింప బడెననుచు।
సువిశేషంబుగ వినుకొని విప్రులు సూటిగ నడచిరి మనుచు॥ ౭౭.
సకల బ్రాహ్మణుల్ మన్ననజేసిరి సాధువులా యిరువురను।
ప్రకటంబుగ నిటు బాలకృష్ణుడును భక్తిసలుపు వార్లకును॥ ౭౮.

---

## యమాజిపంతులు చరిత్రము.

మాణికబోధలు పంతులుభక్తుడు మహిని ప్రసిద్ధిని నొందు।
దానధర్మముల జేయుచునుండును ధామణ గ్రామమునందు॥ ౧.
పండరినాథుని భక్తిసలుపుచును భగవద్భజనను నుండు।
నిండుప్రేమనటు గాంచుచు శ్రీహరి *నెఱి దర్శన మిచుచుండు॥ ౨.

---

* నెఱి = గొప్ప.

సుమతాబాయీ యను నాతని భార్యయు మంచి పతివ్రతగా నుండు।
సుమహితుడగు నొకపుత్రుడు బుట్టెను సూరిజనంబుల సముడు॥
యమాజి యనుచును పేరును బెట్టిరి యటు బంధువు లందరును।
కుమారపర్వము నొందగ తండ్రితో కూడి భజనసేయుమును॥ ౪.
హరిగుణ కీర్తన బాడుచునాడుచు నహర్నిశంబులు గడుపు।
తిరముగ తండ్రికితోడై బాడుచు తెలివిని భక్తినిసలుపు॥ ౫.
కొంతకాలమున పెండ్లినిజేసెను కొడుకునకా బోధలుడు।
సంతస మొందుచు హరిభజనను బహు సలుపుచునుండిరి నాడు॥
బహుకాలంబిటు జరుగుచు నుండగ ఫకీరుడొక్కడు వచ్చి।
గృహమునకు ముందర నిలుచుండగ క్రియను బోధలుడు జూచి॥ ౭.
ఏమికావలెనో యడుగు మిత్తునని యేపునబోధలు డడుగన్।
నేమముదప్పియు కోడలు నిమ్మని నిలిచి ఫకీరుడు బలుకన్॥ ౮.
బోధలుడప్పుడు సంకటపడుచును పుత్రుని తగ బిలుచుచును।
సాదరమొందక యతిథి వెళ్ళునెడ సత్వహాని మనకగును॥ ౯.
నీదు మనస్సున నేమి భావమిటు నిలిచినదో చెప్పుమనన్।
పాదుగనాతడు దండముబెట్టుచు బలికె తండ్రి కింపుగనన్॥ ౧౦.
దాసిదాసులై విక్రయమైతిమి తలిదండ్రుల రగుమీరై।
వేసరిల్లక మీమనో భావమె పెంచియుందు నిటునాకై॥ ౧౧.
కొడుకు పలుకులకు తండ్రియు ముదమున కోడలునిం దగబిలిచి।
పొడగని యడిగెను ఫకీరువెంబడి బోవగ నగునే పలచి॥ ౧౨.
భగీరథీయను నామంబాపెకు బరగియుండె తగనటను।
సొగసగు రూపును మంచి గుణంబులు సూటివెలసె నామెకును॥
మామ పదములకు దండముబెట్టుచు మహి దాసినగుదు నీకు।
వేమరు నన్ను న్నడుగ నేటికిటు విహితంబుగ జేయదగు॥ ౧౪.
ఫకీరుడప్పుడు వారిభావముల బాగుగ తా నెఱుగుచును।
ప్రకారముగనటు మంగళస్నానము భాగిరథికి జేయుమను॥ ౧౫.

పంచామృతముతో భోజనమామెకు బాగుగాను బెట్టుమను।
అంచితముగ బహుదూరంబుగనే నామెను గొని యేగెదను॥
మోహ మమతలను మీరలునొందిన ముదమొందక నేచనెదఁ।
సాహసమగు నీ పలుకుల వినుకొని సహనము బోధలు డొందఁ॥
భాగిరథీకిని స్నానమొనర్చియు బట్ట నవీనము నిచ్చి।
వేగమె భోజన మిడుచును కుంకుమ విడెమును పసుపులనిచ్చి॥
ఫకీరుజేతుల నప్పగించె తగు భక్తిని దండంబిడుచు।
ప్రకారముగనే యాశీర్వచనము బలికె ఫకీరుడు మనుచు॥ ౧౯.
భుజములపై దానిడి కొని యాతడు పోయెను బహుదూరంబు।
ప్రజలునుగని బోధలునకు పిచ్చియు బట్టెననిరి నిరతంబు॥ ౨౦.
ఫకీరుడప్పుడు గ్రామ పొలిమెరకు బట్టుకొనేగె భగీరథిని।
వికాసమగునటు నచ్చట వదలియు విష్ణురూపు తానుగొని॥ ౨౧.
ప్రసన్నుడగుచును పండరినాథుడు బలికెను యామెకు నపుడు।
అసమానంబగు నీదుగర్భమున హరియంశజు పుత్రుండు॥ ౨౨.
బుట్టును యనుచును జెప్పి యదృశ్యుడై పోయెనా ఫకీరుండు।
ఎట్టకేలకును భగీరథీయటు యెవరు లేక నేడ్చుండు॥ ౨౩.
చేతినిబట్టియు తెచ్చిన పురుషుడు జెందె నదృశ్యంబిటను।
పాదుగతిరిగియు నింటికి వెళ్ళిన భర్తయు తగగొట్టునను॥ ౨౪.
పండరినాథా హరిసర్వేశ్వర ప్రపంచ పరమార్థములు।
ఖండితముగ నటు నంతరించినవి కాగలపని యేమిటులు॥ ౨౫.
ప్రలాపించుచును నిట్టులనుండగ ప్రజలు కొందరేగుచును।
విలోకించుచును బోధలువద్దకు వెళ్లిజెప్పి రయ్యెడను॥ ౨౬.
ఫకీరురూపున వచ్చిన పురుషుడు పాండురంగడే యనుచు।
సకలురు గనదా మోసికొనేగెను సరి పుణ్యంబని తలచు॥ ౨౭.
తన కుమారుడగు య మాజితోదా తరలివెళ్లె పొలిమెరకు।
అనుమోదముతో శ్రీహరికీర్తన నతడు బాడుచును సొక్కు॥ ౨౮.

విఠలుని నామము గర్జనచేయగ విపుల జనులు వచ్చిరటు।
పటుతరముగయా భాగీరథియును పదములు మామవిబట్టు॥ ౨౯
బోధలుడప్పుడు నామెను లేపియు పొంకముతోడను జెప్పు
పాదుగ మనలను శోధించెను శ్రీ పాండురంగడై యొప్పు॥ ౩౦
అనుచు జెప్పుచును హరి బాడుచుదా నామెనుదెచ్చెను గృహము।
చనువుజేయుచును నామెను యుంచగ చక్కఁబుట్టె కొడుకుసుము॥
భగవంతుండను నామభిధానము పదుగురిడిరి శిశువునకు।
ప్రకటపరచె నటు యాతడు శ్రీహరి భక్తిమహిమ లోకులకు॥ ౩౨
హరిపదభక్తిని యెట్టివారలును హరిపద మందిరి తుదను।
గురుతుగ వారల దాసదాసుడై కోరియుండు బాలుడును॥ ౩౩

---

## మధ్వనాధుచరిత్రము.

మధ్వనాధుడు నివసించెను తగ మహిజన స్థానమునందు।
సత్యశీలుడై శ్రీహరిభజనలో సదాప్రీతినిం బొందు॥ ౧
ఏకాగ్రంబున పండరినాథుని నెప్పుడు నారాధించు।
సాకారంబగు మూర్తి పూజలను సలుపుచుండు తగుననుచు॥ ౨
హరికృపతోడను కవిత్వ స్ఫూర్తిని యాతడు నొందుచు పిదపఁ।
గురుతరముగ హరికీర్తనమును దా కోరిచేయు తగనొప్పఁ॥ ౩
వరదవాణియై యున్నందున యటు వసుధజనులు వచ్చుచును।
పరమాహ్లాదము నొందుచువిందురు భక్తిని హరికీర్తనను॥ ౪
దేశాటనదా జేయదొడంగెను ధీరతనాము మనుచును।
ఆశామోహము వదలి యనేకుల హరిభక్తిని నుంచుచును॥ ౫
ఇటులదిరిగి నారంగబాదకును యెలమి నరిగె కొందరితో।
కడుసన్మానము జేసి కొందరటు గౌరవించిరి క్రియతో॥ ౬
అచ్చటివారలు ననేకవిధముల నాతని ప్రార్థించంగఁ।
నొచ్చిన ప్రీతిని కుటుంబ సహితుడై యెలమినుండె నటుబాగఁ॥

విశేష ఖ్యాతిని నొప్పుచు నుండును వివిధజనులు బొగడగను।
అశేష స్థలముల కీర్తియు నబ్బెను యచ్యుతుకథ జెప్పగను॥
భాస్కర రాయుండను నొకవిప్రుడు బంబాయిని నుండుచును।
నైష్కపటత్వము లేక నాతడును నారాయణు భజనయును॥
దేశీయంబగు ప్రాకృత భాషలో తెలుపుటయును తగ దనుచు।
దేశావరులగు హరి దాసులదా తీరుగనటు రప్పించు॥ ౧౦.
అనేక విధముల వాదము లాడుచు నందరతాను జయించెగా।
ఘనీభూతమగు తర్క వాదమున కలతలొంద జేయించెగా॥ ౧౧.
అవరంగ్ బాదున మధ్వనాథునకు హరి స్వప్నంబున వచ్చి।
వివరముతో తగ బొంబాయికిని వెళ్ళియు భాస్కరు గెలిచి॥ ౧౨.
తిరిగియు రమ్మని జెప్పగ నాతడు తెలివికి వచ్చియు పిదపగా।
వెఱవక నాథుడు శిష్యుల తోడను వెళ్ళెనుబొంబా యొప్పగా॥
తాళవీణ మృదంగ వాద్యములు తలపడి మ్రోయగ నటను।
మీలుగకీర్తన జేయుట కొఱకై వెదసియుండె తామున్న॥ ౧౪.
ప్రసిద్ధినొందిన పురుషు డగుటచే ప్రజలు బహుగ మన్నించగా।
విశదంబగునటు భాస్కర రాయుడు వినియు వచ్చుచును వరుసగా॥
కీర్తినినొందిన యాతని జయమును క్రియతోడను నే గొనినగా।
పూర్తిగ ప్రాకృత కథలు జెప్పుటయు పొందుగ వీడును పైనగా॥
ఇట్టి యహంతను మనసున నిడికొని యేగెను నాథుని యెడను।
బెట్టిదముగ నట పండితులుండిరి ప్రియకథలను వినుటకును ॥౧౬.
పండితు భాస్కరు ముఖ్యాసనమున బాగుగ కూర్చుండుచును।
దండికోపమున భుసభుస లాడుచు ధరజమ దగ్నివలెను॥ ౧౭.
మధ్వ నాథుడును వాద్య ఘోషమున మధురిపు కథను దొడంగు।
తత్వవేదియగు జ్ఞానదేవునిగా తలచియు పాడ చెలంగు॥ ౧౯.
పండితు డిదివిని క్రోధము నొందుచు బలికెను దా సభలోన।
దండివాడు యనిదలచితి నీవును ధరనుజ్ఞాన దేవునన॥ ౨౦.

యతిపుత్రుండగు నాతని శ్రీహరి యంశంబని జెప్పెదవు।
విదితపరచుమిటు యేశాస్త్రంబున వెలయు చుండు నీతెరవు॥ ౨౧.
నాధుడు జెప్పెను లీలావిగ్రహం నారాయణ మూర్తికిని।
భాధితమై తగు జాతి కులంబులు భక్తజనుల హితముకని॥ ౨౨.
మచ్ఛ కచ్ఛప వరాహ నృసింహ మనుజ రూపముల గొనియెగా।
సచ్చరి తుండగు నతని ప్రతాపము సరస తక్కు వెచటయ్యెగా॥ ౨౩.
యతి పుత్రుండగు జ్ఞానదేవుడును యలవిని మహిషము చేతగా।
విదితంబగునటు ఋగ్వేదంబును విప్రసమూహము ముందగా॥ ౨౪.
చదవం జేసెను పైటను పురమున, మధురిపునకు భక్తునకు।
విదిత జాతియును లేకనుబుట్టిరి విశ్వహితంబగు కొఱకు॥ ౨౫.
స్వకీయ లీలచే యవతారములకు సరియుండుదురు వారలును।
ప్రకాశ మగునటు వ్యాసుడు జెప్పెను, భగవన్నామం బిటను॥ ౨౬.
ముఖ్య సాధనం బగుచుండును యని మొనయుచు గీర్వాణమున।
సఖ్యుడు తుకయును నభంగు వ్రాసెను సలలిత ప్రాకృతమున॥
నామ ప్రతాపము నిర్మలమైనది నరులకు హితమగును యను।
వేమరుదీనికి కాల వేళలును విహితమెవ్వి లేవికను॥ ౨౭.
ఇటులం జెప్పుచు విఠ్ఠలనామము యింపగునటు వదరగను।
పటుతర మగునటు నామఘోషమును ప్రజలెల్లరు జెప్పగను॥ ౨౮.
నాదబ్రహ్మము నిండు కొనెనుయటు నారాయణు కృపను।
పాదుగ నిదిగని పండితుడచ్చట బహులజ్జను బొందెమును॥ ౩౦.
అందరి ముందర నమస్కరించెను హరిదాసునకును నపుడు।
సందియ మొందక యాలింగనమును సరగజేసె నాథుండు॥ ౩౧.
గీర్వాణంబున పురాణ శ్రవణము క్రియతో చేసిన యెడలగా।
పూర్వాపరములు దెలియని మనుజుల బోధకురాదీ యెడలగా॥
అభిప్రాయముల ప్రాకృత మందును నందరు దెలియుట కొఱకు।
విభవము తోడను జెప్పుట మంచిది వినుచుండెదు వారలకు॥ ౩౩.

హరిదాసులు నటు గర్జన జేయుచు హరినామము జెప్పుచును।
వెలివక నాథుని ధన్యుధన్యుడని విపులనుతుల జేయగను॥ ౩౪.
మంగళ హారతి శ్రీహరి కిచ్చిరి మహిత వస్త్రముల నపుడు।
ఇంగితమును గని నాథున కియ్యగ యిష్టము గాకనునతడు॥ ౩౫.
పండితు భాస్కరునకును నిమ్మనె బహు సంతోషము తోను।
పండరి నాథుని బాడుచు వచ్చెను బలు నవరంగ్ బాదకును॥ ౩౬.
అచ్చట లక్ష్మణుడను గృహస్థుడొక డతనికి శిష్యుండయ్యెన్।
హెచ్చిన ప్రేమతో తాళము వేయుచు నెలమిని కీర్తనజేయన్॥
స్వరయుక్తంబగు రాగతాళములు చక్కగ నలుపుచు నుండు।
గురుతుగ కీర్తన మాధుర్యంబును గొప్పగ వెలయుచు నెగడు॥
విశాజిపంతను వణిజుని కడదా వినతుడై కొలువును పలుపు।
నిశాకాలమున దప్ప కొలువులో నిరతమునుండుచు నొప్పు॥ ౩౮.
ఒకయెడ ఈతని లెక్కపత్రముల నుచిత శోధన వీసాజి।
సకలురు జూడం జేయగ నందున సహస్రషట్ శత వెరసి॥ ౪౦.
ద్రవ్యము కొఱతయై యుండినందుచే ధరలక్ష్మణు కావలిని।
దవ్వులేక నధికారికి జెప్పియు తానుండ జేసెధరణి॥ ౪౧.
హాజీ మహమ్మదను కొత్వాలుం డతని ఖైదినుంచనటన్।
తేజరిల్లగను నా దినమందును *తివిరి గురుడు తనయింటన్॥ ౪౨.
మహితోత్సవమై యుండగ నచటికి మనుజులు బహు వచ్చుచును।
విహిత కీర్తనను వినవలయును యని విశేషార్తి నుండగను॥ ౪౩.
శిష్యుడు లేకను గురుడు కీర్తనము చేయనలివిగా కుండన్।
వశ్యుండగునని విసాజియింటికి వచ్చుచు నాథుడు వేడెన్॥ ౪౪.
ద్రవ్యము నిచ్చెద మూడు దినములలో తన శిష్యుని విడుపుమనెన్।
భవ్యముగా తన ద్రవ్యము విసాజి పరగ నపుడె నిమ్మనెన్॥
గురుని చేతిలో నప్పుడు ద్రవ్యము కొద్దియు తగ లేకుండన్।
పరుసను నేమియు దోచక కలతతో వచ్చెను తన గృహమందున్॥

*తివిరి – కోరి.

హరిపై భారము వేసి యప్పుడును హరినారాయణ యనుచు।
కరుణ జూడు మిటు శిష్యుని మీదను కంజదళాక్ష యనుచు॥ ౪౭.
అమిత యార్తితో నీతండుండగ నటకారా గృహమునను।
క్షమను లక్ష్మణుడు శ్రీహరి భజనను చక్కగ తా నుండుచును॥ ౪౮.
కృపాసాగరా పండరి నాథా కృష్ణకృపాళో యనుచు।
అపారమగు నీ సంకట మందును నరసి బ్రోవు మిట ననుచు॥ ౪౯.
గురుకైంకర్యము కొఱకై బోవలె గురుతుగనను విడిపించు।
పరుసను నిట్టుల జెప్పుచు నుండగ వాసుదేవుడును మనుచు॥ ౫౦.
ఫకీరి వేషముతోడను బోవుచు బలుగగొట్టె మహామదును।
వికారచింతను నాతడు లేచెను విహిత నిద్ర నుండియును॥ ౫౧.
కాజిరూపమున మహామదునిఁగని కంజదళాక్షుడు జెప్పె।
వాశిగ కైదియౌ లక్ష్మణు నిప్పుడే వదల జేయ తగ నొప్పె॥ ౫౨.
మాట విననియెడ శిక్షింతును నిను మహా యనర్థమగును యనగ।
నీటుగ నిదిగని కొత్వా లప్పుడు నిగుడి దీవిటి చేత గొనగ॥ ౫౩.
ఇంతలో శ్రీహరి విసాజి యెడకును నేగుచు గొట్టెను యతనిగ।
ఎంతతో నాతడు లేచి బయిటికిని వేంచేయగ హాజిగనెగ॥ ౫౪.
ఇద్దరు గూడుచు దెబ్బల సంగతి ఏపున నట జెప్పుచును।
సద్దులేక నా లక్ష్మణు కైదిని సరగున వీడిపించగను॥ ౫౫.
ఆచార్యుని గృహ మాతడు వచ్చెను యప్పుడె నందరు జూడగ।
ప్రాచుర్యంబుగ హాజి మహమ్మదు ఫకీరుడగుచును నిగుడగ॥ ౫౬.
అతిప్రేమను నా గురువు శిష్యునకు నాలింగనమును నొసగె।
మితిమించిన యానందము నచ్చట మేదిని నరులకు కలిగె॥ ౫౭.
శ్రీహరికథ యటు మధ్వనాథుడును జేయ దొడంగెను నపుడు।
మోహ మమతలనువిడిచియు జనులటు ముదమునవిని రటుమెండు॥
మధ్వనాథు నా క్షేత్ర వాసులును మహిలో ధన్యుండనుచు।
విద్వజ్జనులును పొగడుచునుండిరి విపుల మహిమ నటు గనుచు॥

నాథుని సుగుణముల్ ప్రకటంబయ్యెను నలుదిక్కుల తగ నపుడు।
సాదరముగ నొక విప్ర గృహస్థుడు సరగున వచ్చియు వేడు॥ ౬౦.
సుందరవాడా యను తన గ్రామము సూటిగ రమ్మనగాను।
పొందుగ నాథుడు సమ్మతించుచును పోయె కుటుంబముతోను॥
గ్రామము ముందర గణపతి కోవెల కట్టంబడి తగనుండు।
నేమముతో నటు మహోత్సవంబుల నెనరున జేయుచు నెగడు॥ ౬౨.
ఉదక వసతియటు లేకుండంగను సుచితగంగ ప్రార్థనచే।
విదితంబయ్యెను నీరుధార యటు వే కుండను గట్టించె॥ ౬౩.
భాగీరథి యని స్నానము జేతురు ప్రజ లనేకులందునను।
రాగ రహితులై సాధు మార్గమున రంజిల్లుదు రయ్యెడను॥ ౬౪.
కాలము గడవగ వృద్ధ వయస్సును గలిగె మధ్వనాథునకు।
వీలుగ పండరి యాత్ర నిబంధన వెలసియుండె నటుతనకు॥ ౬౫.
ప్రతి వత్సరమును నేమము దప్పక పండరిపురి జనుచుండు।
ముదిమియు రాగనె యశక్తు డగుచును ముద మొందక తానుండు॥
పండరి నాథుడు భవ్యరూపమును ప్రకటంబిటు జేసినను।
నిండు ప్రేమగొనియుండు నటంచును నిట్టూర్పున నుండగను॥ ౬౭.
కలలో శ్రీహరి వచ్చియు జెప్పెను గ్రామజోసి గృహమునను।
ఇలలో దాగియుండును నచ్చట నెలమిత్రవ్వి జూడుమను॥ ౬౮.
ప్రొద్దు బొడవగనే జోసియింటికిని పొందుగ చనెనాథుండు।
సద్దుజేసియటు జెప్పెను యతనికి స్వప్న సంగతిని నాడు॥ ౬౯.
ఉద్ధవుడను యాజోసియు నప్పుడు నొప్పె భూమి త్రవ్వుటకు।
శుద్ధ మనస్సున నాథుడు చెయితో సూటిగ త్రవ్వెను బాగు॥ ౭౦.
అనేకులచ్చట సహాయ మరిగిరి హరిదర్శన మీక్షించి।
అనుపమ మూర్తుల విఠల రుక్మిణుల యలనాడాతడుగాంచి॥ ౭౧.
జయ శబ్దంబుల జెప్పుచు భక్తులు సలిపిరి గొప్పగ ధ్వనియు।
నయముగ జోసియు మందిర మచ్చట నాణ్యంబుగ తాజేయు॥ ౭౨.



బాంగదేవుడు    యాదవవంశుడు



స్త్రీరూపధరించి
న భగవంతుడు    యాదవవంశపుభార్య



బాంగదేవుడు.    విదురరాజు.

Vk
13/11/1900

ఉభయ మూర్తులను నచ్చట స్థాపన నుచితింబుగ తాజేసె।
ప్రబలంబైతగు యభిషేకంబుల బ్రాహ్మణ భక్షణ మొజసె॥ ౨౩.
శ్రీహరి కీర్తన రేయిని నాథుడు జేయించుచు తగనుండు।
బాహుళ్యంబగు ఖ్యాతిని వెలసిరి భగవంతుడు భక్తుండు॥ ౨౪.
పండరినాథుడు భక్తుని కొఱకై బరతెంచెను తానటను।
అండజ వాహను భక్తులదాసుడై యవని నుండుబాలుడును॥ ౨౫.

---

## చా ం గ దే వు చ రి త్ర ము.

పాకశాసనుడు స్వర్గము నందును పరివారముతో నుండు।
ఏకసమయమున యాజ్ఞోల్లంఘన యిలజేసె మరుద్గణుడు॥ ౧.
అందుకు నింద్రుడు శాపంబిచ్చెను నవని మనుజుడగుదువని।
తొందర బొందెను మరుద్గణుండును ధూర్తవృత్తియునుమాని॥ ౨.
అనుగ్రహంబును వేడగనింద్రుడు హరిసర్వేశ్వరు కృపను।
పునితమనుజుడై యుండియునిలలో పూర్ణజ్ఞానివగుదువను॥ ౩.
విపుల కీర్తితగ నిలిపియు ధరలో వేంచేయుము తిరిగియిటు।
నెపములేని యీవార్తను వినుకొని నిగుడి వచ్చెతానుయిటు॥ ౪.
తపతీ నదిలో స్నానము జేయుచు తపస్సు జేయుచునుండు।
ఎపుడును మాటలు నెవరితొ నాడడు యొలమినంధు వలెనుండు॥ ౫.
సుందర తనువున నుండ ననేకులు చూడను వత్తురు యతని।
పంతము తోడను చాంగదేవుడని ప్రజలును బిలిచిరి యతని॥ ౬.
వరుణ గ్రామము నుండియు వచ్చిరి వరుసను నిద్దరు ద్విజులు।
గురుతర భక్తిని శుశ్రూషలనటు కోరి సలిపి విలసిల్లు॥ ౭.
మాసము వరకును సలిపిన పిమ్మట మానింగని యడిగిరటు।
దాసులమగు మాకుపదేశంబును దయ చేయుండన నాడు॥ ౮.
ఇదివిని చాంగుడు ననుగ్రహమనునది యెట్టిదగునొ దెలి యదను।
క్షితిలో నొంటరి నగుచును నిచ్చట చిక్కంబడితిని నేను॥ ౯.

మాతృపితృలును యెవ్వరులేరిటు మంత్ర తంత్రమెరుగనను।
క్షేత్రవిత్తముల్ భార్యపుత్రులును చెలగియెవరు లేరటను॥ ౧౦.
ఉపదేశముకై సత్పురుషులగని యుచితంబుగ వేడుమనగ।
అపచరించమని శిష్యులు జెప్పుచు నాతని విడువకయున్నగ॥ ౧౧.
ధనకామికులై వారలు నుండెడు తాత్పర్యము తగ దెలిసి।
అనువుగ వారల చాంగుడు బిలిచియు నడిగె నపేక్షను వెలసి॥
వారలు జెప్పిరి నష్టము బహుగా వర్తకమున వచ్చెనన।
నేరము మాయెడ గలుగక యుండియు నిలువకుండు డబ్బయన॥
సద్గురుడపుడనె సంత కూటమున చనుదెంచిన వత్తునని।
గద్గదకంఠులై శిష్యులు మ్రొక్కిరి కరుణజూచి తగ నతని॥ ౧౪.
అంగడివీధికి గురుని బిలుచుకొని యాదినమున వెళ్ళగను।
రంగుగ నచ్చట నాసన మొక్కటి రంజిలునటు వేయగను॥ ౧౫.
గురువరు నచ్చట శిష్యు లిరువురును కూర్చుండంగను జేసి।
అరమర లేకను వర్తక మునుతగ నరయగ నారంభించి॥ ౧౬.
జరుపుచు నుండగ గిరాకివారలు చనుదెంచిరి బహుగాను।
వెఱవక నడిగిన ధరల నిచ్చుచును వెళ్ళుచుండిరి జనులును॥ ౧౭.
తెచ్చిన సరకుల పూర్తిగనమ్మిరి దిట్టంబగు లాభంబు।
వచ్చెద్విగుణమై యాచార్యుని గని వందించిరి చరణంబు॥ ౧౮.
విపులధనంబును వచ్చెను యనుచును విజ్ఞాపించగ గురుడు।
సఫలంబగునటు మీకు నిచ్చెహరి సర్వేశ్వరుడని నాడు॥ ౧౯.
అన్నము వండిరి శిష్యులు నప్పుడు నాచార్యుని కొఱకును।
పన్నుగ చాంగుడు మృత్తిక లింగము బాగుగ జేసియు నటను॥
షోడశ పూజల విధిపూర్వకముగ నారది జేసె చాంగుండు।
గూడిన ప్రేమతో నైవేద్యంబును గురుతుగ నిడు నాతండు॥ ౨౧.
ఇరుశిష్యులదా పఙ్త్తిని నిడికొని యేపున భక్షణ చేయు।
చిరతర సేవల నుండిరి పిమ్మట శిష్యులు యిరువురు మరియు॥ ౨౨.

ఉదయము కాగనె స్వస్థానమునకు నొగిజేర్చిరి గురువును।
సదయులై సేవల జేయుచు నుండిరి చనువున శిష్యులు నటను॥
ప్రతివారంబును గురువును దెత్తురు పరగ సంత కూటమును।
అతులిత సరకుల విక్రయ సరచుచు నతిలాభము గాఁగను॥
ఒకసంవత్సర మిటులం జేయగ నొగిద్రవ్యముచే కూడ।
ప్రకటంబగు నటు దరిద్రమంతయు పారిపోయెనా నాడ॥ ౨౫.
ఆచార్యుని సత్సేవచె వారలు నమిత ధనికులై నిగుడన్।
పాశాబద్ధులై సంసారంబున బలుమోహము గలిగుండన్॥ ౨౬.
అంతరించెనటు దినదినమునకును నాచార్యుని సేవయును।
పంతముతో చాంగ దేవుదీనిఁ పరగ తాను నెరుగుచును॥ ౨౭.
అంధుండగుటచె పూజద్రవ్యమొరు లందజెయ లేకుండన్।
సంతసిల్లకను వనమధ్యంబున సాధుడొక్కడై తగనుండన్॥ ౨౮.
శిష్యుండొక్కడు చాలాప్రొద్దుకు చేరరాగ గురుకడను।
వశ్యుండగుచును సంసారమునకు, వంచింపక గురుడటను॥ ౨౯.
ఏమియు జెప్పక శివపూజకునై యిలమృత్తిక తెమ్మనగన్।
పామరుడగు యాశిష్యుడు కృత్రిమ భావము గొనుచును వేగన్॥
తపతీతీరమున వెళ్ళియచ్చటను ధరనిసుకను జేర్చుచును।
అపహరించి యాచార్యుని చొంబును నట తలక్రిందుంచుచును॥ ౩౧.
ఇంతను రెండోశిష్యుడు రాగనె యిద్దరు నటుచేరుకొని।
సంతసిల్లుచును నిద్దరు వచ్చిరి సద్గురువుని కడకుమని॥ ౩౨.
మృత్తిక యెచ్చట దొరకక లేదనియు మెలగుచున్నది లింగమని।
పద్ధుగ జెప్పుచు గురుని బట్టుకొని పరగ దెచ్చి వెంబడిని॥ ౩౩.
తామటు బెట్టిన చొంబు ముందరను తలపడి కూర్చొ బెట్టన్।
ప్రేమను చాంగుడు శంకరునామము ప్రియమున నుడువుచునాడన్॥
చరాచరంబులు లింగమయంబై చక్కనుండు గదయనుచు।
కరాబ్జముల యాచొంబును ముట్టుచు ఘనతర లింగంబనుచు॥ ౩౫.

పార్థివ సావర లింగంబులలో పాటించదు భేదమని।
ఆర్తిని యర్చన పూజనాదులను నరయుచు నటు జేయగని॥ ౩౬.
పాకము జేసిరి శిష్యు లిరువురును భవుని నివేదన కొఱకు।
జోకను దెచ్చిరి పాత్రలో భవునకు సుప్రసాద మిచ్చుటకు॥ ౩౭.
శంకరుముందర ప్రసాద ముంచుచు చాంగదేవు నిలుచుండి।
పంకజలోచన పార్వతీరమణ భావహీనుడై యుండి॥ ౩౮.
మంత్ర హీనుడను క్రియాహీనుడను మహితభక్తి లేకుండు।
తంత్రము లెవ్వియు నెరుగను నేనని దండమిడెను చాంగుండు॥
ఆతని నిడికొని యేగిరి శిష్యులు యాశ్రమమున కటు వెనుకన్।
పాదుగ నాతని కూర్చోబెట్టిరి భక్షణ కొఱకై బాగన్॥ ౪౦.
చొంబును నిమ్మని శిష్యుల నడుగగ సూటిగ వారరుకుచును।
లెంపున తపతీగట్టున కరుగుచు తీయరాక చొంబటను॥ ౪౧.
శక్తి కొలది పెకలించుట కొఱకై సలిపి రుపాయంబులను।
రిక్తులై వెళ్లుచు చాంగుతో ననిరి రీతిగ తమ చేష్టలను॥ ౪౨.
అపరాధులమని దండము బెట్టగ నాతడు క్షమగొని యపుడు।
సఫలంబగు నటు సాంబ మూర్తికిని సలిపె నుతుల చాంగుండు॥ ౪౩.
పతితుడనగు నాభక్తికి నీవును ప్రకటంబైతివి దేవా।
సతతము దాసుని కరుణ బ్రోచుచును చక్కగ గైకొను సేవ॥ ౪౪.
వట వేశ్వరుడను లింగ నామమును వాంఛతోడ బెట్టుచును।
నిటలతటుండై యుండగ కన్నుల నిక్కంబుగ గనెమున్ను॥ ౪౫.
వెనకను శిష్యుల నింటికి బొమ్మని వేగమె సెలవియ్యగను।
అనువుగ వారలు నమస్కరించుచు నరిగిని తమయిండ్లకును॥ ౪౬.
జను లనేకులటు కీర్తిని వినుకొని చాంగుని కడ వచ్చుటయు।
ఘనమగు ప్రార్థనల్ సఫలంబగునటు గానుపించి దా వెలయు॥ ౪౭.
వర్తకుడొక్కడు బహుళధనంబును వ్రయపరచియు నొకమఠమున్।
కర్త యీశుడని గట్టించెను యటు ఘనసహాయ ముగనటుమున్॥

అన్న శాంతియును నపరిమితంబుగ నచ్చోటను తగజరుగు।
తిన్నగ కీర్తియు నిండుకొనగనటు దిక్కుల నెల్లను వెలుగు॥ ౪౯.
వటవేశ్వరునే చాంగదేవుడును వాంఛను నారాధించు।
పటుతరముగ నాసన శయనాదుల భావములో తగనుంచు॥ ౫౦.
హటయోగమునకు తగిన సాధనల నాతడుచేకొనియపుడు।
*కటికత నష్టాంగయోగముల కడగున జేయునతండు॥ ౫౧.
సిద్ధులగైకొని నాతడు పిదపను చేయు కాలు వంచనను।
పద్ధుగ పదునాల్గు నూరబ్ధములు బ్రతికియుండె నయ్యెడను॥ ౫౨.
విచిత్ర సిద్ధుల జనులకు జూపుచు విహరించుచు దానుండు।
ప్రచిత శిష్యులను వెయినన్నూరులు బట్టియుండె నాతండు॥ ౫౩.
పైటను నుండియు యాత్రజేయుచును బ్రాహ్మణుడొకడ రిగెనటు।
సాటిగ వచ్చుచు చాంగునిగాంచుచుసాష్టాంగము దండమిడు॥
ఇందు శేఖరుని పోలికె నాతని యింపురూపు జూచుచును।
పంతము తోడను నానందంబును బొగుబొందె విప్రుడును॥ ౫౫.
అనేక విధముల నుతులంజేసెను యాచాంగునితా గనుచు।
పునీతు డగునటు తిరిగి నమస్కృతి పొందుగ జేసియు నిలుచు॥
సంతోషముతో చాంగుం డడిగెను చనుదెంచితి వెటనుండి।
వింత విశేషంబేమి యచ్చటను విహితదేశమున నిగుడి॥ ౫౭.
ద్విజుడు వినుంగొని పైటను పురమని దెలిపెను నాతనియూరు।
ప్రజలుగనియు షణ్మాసము క్రిందుగ ప్రబలవింత నొందుదురు॥ ౫౮.
సన్యసించి యొక విప్రుండుండియు సంతతి నలుగురవడసె।
పుణ్యుండొక్కడు జ్ఞానదేవుడను పుట్టిన వారిలొ వెలసె॥ ౫౯.
మహిష ముఖంబున రుగ్వేదంబును మహినాతడు చదివించె।
ఇహమున వింతయు యిటువంటిదినే నెట గననని వినుపించె॥
ఇదివిని చాంగుడు యాతని పుట్టుక నింపుగ వినుకొని పిదప।
కుదురుగ జ్ఞానుడు విష్ణుయంశమని గుఱిగొని తనలో నొప్ప॥

కటిక - కేవలము

ఆతనికడను బోవుచు శిష్యులతో నను గ్రహంబును గొనుచు।
పతితుల పావను పండరి నాథుని భక్తుండయ్యెను మనుచు॥ ౬౨.
గురువునకు దండము నిడి చాంగుడు కోరెను మంత్రార్థమును।
సరగున జ్ఞానుడు శిష్యుని నొక్కని సరగనిడుము బలిగాను॥ ౬౩.
వివరించెద మంత్రార్థము పిదపను వీనులకింపగు నటుల।
సవినయముగనే చాంగుడువినుకొని చనెను తిరిగి నయ్యెడల॥౬౪.
తాదిగి యుండిన తావుకు వచ్చుచు తనదుశిష్యులం బిలిచి।
పాడుగ నడిగెను మీలో యెవ్వరు బలిదానమునకు వెలసి॥ ౬౫.
జ్ఞానదేవునకు పూను కొందురని కనికరమున నడుగగను।
మానుగ శిష్యులు మీయధీనమై మరిగిన వార్ల మనుచును॥ ౬౬.
జెప్పుచు నందరు నేకాంతములో జేరియోచన జేయుచును।
ఒప్పుగ రాత్రియునై యుండుటచె యుచితనిద్ర చాంగుడును॥౬౭.
బొందుచు నుండగ శిష్యసమూహము పూర్తిగ యోచన జేసి।
సందయు మొందక గురుని విడుచుటయు చక్కనగును:యని దలచి॥
పదునాల్గు నూరుల శిష్యులయ్యెడను పరుగులిడిరి యారేయిన్।
ఉదయము కాగనె చాంగుడుశిష్యుల నొగి బిలిచెను తగునయ్యిన్॥
ఒకడును నచ్చట లేకుండంగని యోర్పున తా నీటికడన్।
వికసిలి వెళ్ళుచు ప్రాతః క్రియలను విధ్యుక్తము జరుపు నెడన్॥౭౦.
జ్ఞానదేవుడును నచటికి రాగనె గనిమ్రొక్కె చాంగుడును।
దీనుడనగు నా యభిమానంబును దీర్చియేలితివి నన్ను॥ ౭౧.
ఉపాధి రహితుడనైతిని నేనిటు నొగివెళ్ళిరి శిష్యులును।
అపార కృప నను బలిదానంబుగ నంగీకరించు మిటను॥ ౭౨.
ఇదివిని జ్ఞానుడు చాంగుని తనతో ఇంపుగ దెచ్చెను గృహము।
విదితపరచె దా గృహస్థాశ్రమము విడుట సులభమగును సుమ॥
ఏకాంగుడు తనమతమును విడుచుట యెంతో దుర్లభమగును।
సాకాంక్షతయును లేక నీవిపుడు చక్కవిడుట మేలుయను॥ ౭౪.

గురు మంత్రంబున కర్థము దెలుపుచు గురుతుగ మాసము వరకు।
అరమర లేకను నుంచు కొనుచునటు హరిగుణ కీర్తన బాగు॥ ౭౫.
వినుపించుచు నటు విఠలు నుపాసన విధ్యుక్తత జేయుమను।
అనువుగ శ్రీహరి నామము జిహ్వను నమరునటుల నుంచుమను॥
హరిగుణ కీర్తన బాడి యాడుచును నమితప్రేమ నుండుమను।
గురుతర భక్తిని చాంగుడు వినుకొని కోరిజేసెనటు గాను॥ ౭౭.
పిదప చాంగు వటవేశ్వరంబునకు ప్రీతినరిగె నొంటిగను।
కుదురుగ నచ్చట హరిగుణ కీర్తన కోరిజేయు చుండగను॥ ౭౮.
సమీపమున నారాయణడోహి చక్కని స్థలమొకటుండు।
ఉమారమణునిం బూజించుటకై యుచిత భక్తితో నుండు॥
దంపతు లిరువురు ద్విజకుల తిలకులు తర్లిరి వటవేశ్వరము।
తెంపున జేసిరి తపస్సు నచ్చట తిని త్రాగుట లేకనుము॥ ౮౦.
ముధోపంతు రుక్మాబాయీ నట మునుకొని హరు సేవించగ।
హితాను సారియై గంగాధరుడును యిల చాంగునిగని వరుసగ॥
దంపతు లిద్దరి మనోభిష్టముల దయతో సఫలముగాను।
పెంపుగ నీవును ననుకూలింపుము ప్రియమగునటు వార్లకును॥
ఇదివిని చాంగుడు దంపతు లిద్దర నేపున దగ్గెర బిలిచి।
విదిత పరచుమనె మనోభీష్టముల విశ్వనాథు కృపవెలసి॥ ౮౩.
కోరికలను నేపూర్తి జేతునని కోరి చాంగు జెప్పగను।
వారలు దండము బెట్టుచు వేడిరి వర పుత్రుడు నీవలెను॥ ౮౪.
దయ చేయుండని కోరగ చాంగుడు తటస్థుడగుచును నిలిచి।
నయముగ జెప్పెను ద్వాదశాబ్దముల నడమ బాలునై వెలసి॥ ౮౫.
గోరఖు నాథుని యనుగ్రహంబున గుఱినిచత్తు మీయెడను।
తీరుగ మీరలు గోరఖు రాకను తేరి జూచుచుండుమను॥ ౮౬.
అనుచు జెప్పుచును వారలబొమ్మని యాతడటనె విలసిల్లు।
దినమును శ్రీహరి భజనను జేయుచు తీరుగ దశ వర్షములు॥ ౮౭.

గడిపియు పిదపను గోరఖు నాధుని కడకేగియు మరియు।
పుడమిని శంకరు నాజ్ఞను మహినే పూర్తి సేయగా వలయు॥౯౯.
వరమును నిచ్చిన సంగతి నతనికి వాశిగదా జెప్పుచును।
గురుతుగ బ్రాహ్మణ దంపతు లిరువుర కొరదీర్చుము యనుచును॥
అనేక నుతులను జేసియు గోరఖు నాజ్ఞను గైకొన పిదపన్।
పునీతమగుతన యోగ శక్తిచే పొందె సమాధిని యొప్పన్॥౬౦.
కొన్నిదినంబులు గడిచిన పిదపను గోరఖు నారాయణ డోహి।
పన్నుగవచ్చెను భిక్షుకువలె ముధో పంతుని గృహమునకయ్యి॥౬౧.
అలఖు యనుచును శబ్దము బెట్టగ నతనిభార్య భిక్షమును।
లాలితముగతా దెచ్చి యుంచగను లక్షించె తొలివరమును॥ ౬౨.
భిక్ష మిచ్చుచును దండము బెట్టుచు ప్రీతిని యొక సుతునడుగన్।
అక్షయ మనుచును గోరఖు వేణును యపుడు యూదుచుండంగన్॥
అప్పుడు పుట్టిన బాలుని వలెనె అటనొక శిశు గని పించన్।
తప్పక గోరఖు డదృశ్యుడగుచును తాబోయెనుయటువరుసన్॥౬౪.
దంపతు లిరువురు బాలుని జూడగ తగిలెప్రేమ కొడుకుయని।
పెంపుగ పాలును గారెను స్తనమున ప్రియ రుక్మాబాయికిని॥
శిశువునకు పేరు చాంగదేవుడని జెప్పిరి తలిదండ్రులును।
నిజముగ నాతడె కొడుకయ్యె ననిరి నీలకంఠు నాజ్ఞకును॥ ౬౬.
చౌలో పనయనము జేసిన పిదపను చదువుల జెప్పింపగను।
సలీలయుక్తుడై యన్ని చదువులను సంగ్రహించె బాగుగను॥ ౬౭.
వివాహ మప్పుడు తల్లిదండ్రులును వేడుకతో చేయంగన్।
వివేక యుక్తుడై గృహస్థుడగుచును విఠలు నామము మరువకన్॥
సంపతి గలిగియు సద్ధర్మంబుల సలుపుచునుండును నతడు।
ఇంపుగ శ్రీహరి నామము జెప్పుచు ఈశుభజనలోనుండు॥ ౬౯.
తల్లి దండ్రుల వాక్యముతప్పక తనయుడు నడచుచునుండు।
మెల్లన యిరువది నాల్గవ వయసున మెలగి తల్లిదండ్రులటు॥ ౧౦౦.

ఉచిత పదంబును బొందగ చాంగుడు నుత్తర క్రియలను జేసి।
ప్రచురంబుగనే విప్రుల కిచ్చెను బహుద్రవ్యంబుల వెలసి॥ ౧౦౧.
పినతండ్రికి తన వతను నంతయును ప్రీతితోడ నిచ్చుచును।
ఘనమగు పండరి యాత్రకై వచ్చెసు గారాబము గొని యటను॥
అనేక భక్తుల నటు దాగాంచుచు నమిత ప్రేమ నొందుచును।
వినీతుడగుచును వందన మొసగెను విధిని వారి కయ్యెడను॥
అభిమానముదానెంతయు నుంచక నందరికిని దండ మిడు।
సఫలంబగు నటు విఠల మూర్తికిని సముఖుడై వెళ్లుచునుండు॥
మూర్తిసమీపము బోయి చూచి యటు మ్రొక్కెనుచరణంబులకు।
ఆర్తిని గద్గద కంఠుడగుచుదా హరిని నుతించెను బాగు॥ ౧౦౪.
లవలేశము నీకృపయును నాపై లభింప జేసియు నిటులన్।
భవబంధంబుల బారదోలి నను పవిత్రు జేయు మియ్యెడలన్॥౧౦౫.
భక్తుని హృదయమునందును కూర్చొనిపలుకుచుందువుమాటలను।
రక్తిగ నామోచ్చారణ యతనికి రమ్యమగునటు జేయుచును॥౧౦౬.
నీదు దాస దాసుల శరణొందితి నేనెనరున నీ కృపచె।
పాదాంబుజముల మరవ నియ్యకుము భ్రాంతిని నటువిడిపించె॥
ఈవిధమున దా ననేక భంగుల నీశుని నుతులం జేసి।
సావధ చిత్తుడై శ్రీహరి కీర్తన చక్క జేసి మన్నించి॥ ౧౦౯.
మూడు దినంబులు నన్నోదకముల ముట్టక నదిని నుండుచును।
గాఢవిరాగుడై యనుష్టించెదా కనులను హరి గనుటకును॥ ౧౧౦.
కరుణామూర్తియు విఠ్ఠలరంగడు కరుణించియు తా నపుడు।
నిరుపమ శోభతో దివ్య విగ్రహుడై నిలిచెను ముందర నతడు॥
ఇట్టి రూపమును చాంగుడు గాంచుచు నిలబడి దండమిడుచును।
ఘట్టిగ నాకును నుపదేశించియు కరుణ బ్రోవుమనగాను॥ ౧౧౨.
హరియును నాతని నదిలో ముంచెను నరయ గనగ చాంగుండు।
గురుతయ్యెను నటు భవనం బొక్కటి గోవిందుని గనుచుండు॥

పుండరీకు డటు ముందుగ నుండగ పూర్ణకృపను చాంగుగని।
దండి మంత్రమగు షడాక్షరంబును దయచేసెను యతనికని॥ ౧౧౪.
అనేక విధముల నుతులం జేసెను నచ్చట చాంగుడు హరికి।
పునీతు డగుచును నదికిని వెలపల పొందుగ వచ్చెను తిరిగి॥ ౧౧౫.
కనులు దెరచి తా జూచెను పండరి ఘనతర మోదముతోను।
వినీతుడై వచ్చుచు గుడిలో నుండెడి విఠల మూర్తిని గనుచును॥
అమిత ప్రేమతో నుతులం జేయుచు నాజ్ఞ నడిగి బోవుటకు।
సుమహిత చిత్తుడై పరివారముతో చొచ్చెను స్వగ్రామమునకు॥
విఠలుని నామము జెప్పుచు భజనతో వెళ్ళెను తన యింటికిని।
పటుతరముగ తా ననేక జనముల భక్తినుండ జేయగని॥ ౧౧౬.
అనేక దినములు నచ్చట నుండగ హరివిఠలుం డొకయెడను।
పునీతుడగు నా చాంగుని ముందర పురుషాకృతినుండుచును॥ ౧౧౭.
గోదాతీరమునందును నాతని కోరి వాస ముండుమని।
ప్రాచేశనముగ కేశవ మూర్తిని భక్తిని పూజించుమని॥ ౧౨౦.
సాలగ్రామపు శిల నొకటిచ్చుచు చనియెను శ్రీహరి యపుడు।
వీలుగ చాంగుడు హరి కృప యనుచును విశ్వసించి తా మెండు॥౧౨౧.
నారాయణడోహిని యతడు విడువ నరులనేకుల్ వచ్చుచును।
మీరిన వ్యసనము బొందుచు విడువక మిగులతాప మొందగను॥
హరి యాజ్ఞకు లోబడవలె ననియును నతడు వార్ల కనుచును।
సరగున చాంగుడు కుటుంబ సహితుడై చనెనుగోదా తీరమును॥
అచ్చట నాతడు కేశవమూర్తిని యందంబుగ స్థాపించి।
హెచ్చిన ప్రేమతో బ్రాహ్మణ జనులకు నిలభోజన మొనరించి॥
సలుపుచు నుండును హరికీర్తనమును చాంగదేవు డయ్యెడను।
ఇలజనులందురు కథవినుటకునై యేతెంతురు బహుగాను॥ ౧౨౫.
సకల జనంబులు బిలిచిరి నాతని చాంగా కేశవదాసు।
ప్రకట ప్రార్థనల్ సమకూరగ నటు ప్రజలు వత్తురు వింతనుచు॥౧౨౬.

మనోరథంబులు పూర్తియు కాగనె మరలి బోవుదురు జనులు।
పునీతుడగు నాభక్తుని మహిమలు పొందుగనటు విలసిల్లు॥ ౧౨౭.
దేవగిరీలో రామరాజునకు దెలియవచ్చి సంగతియు।
భావశుద్ధితో దర్శనమునకై బహు జనులతో వచ్చుటయు॥
హరిభక్తునిగని దండము బెట్టెను యవనీపతి తగనపుడు।
గురుతుగ రాజును భోంచేయుము యని కోరెను భక్తుడు యపుడు॥
బహుతర సేనలు కూడయున్నవని భక్తునితో రాజయన।
సహా పజ్తిని యా సేనయు భక్షణ సలుపుమనుచు చాంగుడన॥ ౧౩౦.
సమ్మతించుచును స్నానమొనర్చియు సకలు రరుగ భక్షణకు।
నెమ్మది నందర కూర్చొబెట్టియు నిగుడి చనుచు హరి కడకు॥ ౧౩౧.
వచ్చుచు నచ్చటి తీర్థమందుకొని వంట గృమునకు వెళ్లి।
మచ్చిక తోడను ప్రోక్షణ జేయుచు మాధవు దలచుచు మళ్లీ॥ ౧౩౨.
పదుగురికై యటువండిన యన్నము పదినూర్లకు సరియయ్యె।
ఇదిగని నృపవరు డత్యాశ్చర్యము యేపున బొందుచు డాయ॥
వినయ విధేయుడై నుతులను జేయుచు వెళ్ళెనపుడు తనగృహము।
అనువుగ చాంగుడు ద్వాదశవర్షము లచ్చోటనె యుండెనుము॥
హరికథకీర్తన ప్రతిదినమును నటు యరమర లేకను జరుగు।
గురుతుగ ప్రజలును దూరము నుండియు కోరివత్తురు వినుటకు॥
ఈవిధ ముండగ కలుబురు గాయను యెలమిని పట్టణమందు।
భావశుద్ధితో శంకరు డనునొక బ్రాహ్మణు డుండెను ముందు॥ ౧౩౬.
అధిక ధనంబును నతనికి నుండియు నవని పుత్రుడు లేకుండు।
క్షితిలో నాతడు యవ్వనదశలో జెందెను మృతియును నాడు॥
అతని భార్యయును తల్లిగూడుకొని యమిత వ్యసన మొందుచును।
పదపడి నాతని సంస్కారంబులు బాపలతో జేసెమును॥
దారుణమగు బహుదుఃఖము చేతను తాముండ లేక మరిని।
వారణాశికై వస్తులగైకొని వచ్చిరి గోదావరికిని॥ ౧౩౯.

ఇచ్చట కేశవ చాంగుని కీర్తియు నెలమి వారు వినుకొనుచు।
సచ్చరితుండగు నాతని గాంచుచు జనవలెనని తగితలచు॥
చిన్న వయస్సున వైధవ్యంబును జెందుటచే యువతికిని।
పన్నుగ కేశముల్ తీయకయుండిరి బంధువుల్ కొందరు గూడుకొని॥
అత్తయు కోడలు యిరువురు గూడియు హరి భక్తునికడ జనుచు।
సద్ధులేక యటు ముందుగ కోడలుసలిపెను దండము మనుచు॥
పుత్రవతీభవ యని దీవించెను పొందుగ భక్తుండపుడు।
చిత్రము యిదియని నవ్వుచు నత్తయు జెప్పెను తమ కధనాడు॥
ఇదివిని చాంగుడు యెరుగక జెప్పితి ఈశు దయను పుత్రుడును।
విదితంబగునటు వెధవ కడుపునను విధిని బుట్టు ననుచును॥ ౧౪౪.
అనేక బ్రాహ్మణు లచ్చట నుండగ నందర గని దా జెప్పెన్।
పునీతుడగు నొకవర పుత్రుండును బుట్టును హరికృప నొప్పన్॥౧౪౫.
అందరు గూడియు వీరల నిచ్చట నరమర లేకుంచుమని।
పొందుపరచగసు నత్తయు కోడలు బోవుచు నొక గృహము గని॥
నివాసభూతులై యుండగ నచ్చట నెలలు తొమ్మిది గడవగను।
వివేకశీలుడు పుత్రుం డొక్కడు విధవకు బుట్టెను యటను॥ ౧౪౬.
పదనకొండవ దివసము నందును భక్తుని కడ దెచ్చుచును।
కుదురుగ వేసిరి కొడుకును పదముల గుఱిగ దండ మిడుచును॥౧౪౭.
ఇదిగని చాంగుడు పుత్రుని నామము ఇలను పిలలు డని జెప్పెన్।
సదయుడై విప్రుల బిలుచుచు కర్మల సలుపు డనుచు దా జెప్పెన్॥
ద్విజవరులందరు నొప్పక యుండిరి ధీరుడు చాంగుడు గనుచు।
కుజనులు యనుచును నయిదేండ్లును యిటుకోరియుండితగమనుచు॥
విధవపుత్రుతో పండరి యాత్రకై వెళ్ళెను యాచాంగుడును।
పదుగురు విప్రుల బిలిచియు జెప్పెను బాలున కుపనయనమును॥
పండరి యందున నుండెడి మీరలు బాగుగ సలుపుండనియు।
ఖండితముగ నటు శ్రీహరి వరమున కలిగెను బాలుండనియు॥౧౫౨.

మహాసుకృతమా మీకని జెప్పగ మన్నింపక విప్రులును।
జీర్ణనొందుచు విధవ కొమరునకు జేయ కూడదనియటను॥౧౪౩.
తమతమ యిండ్లకు బోవగ చాంగుడు దామోదరుగుడి కరిగి।
కొమరొప్పగతా శ్రీహరిపదముల కోరిబట్టియుండ తగి॥ ౧౪౪.
వరపుత్రుని యాతల్లియు జేయును వంటనంత నీదినము।
మురహార నీవును యచ్చటి కరిగియు ముదముగ భక్షింపునుము॥
దీనదయాకర పతితపావనా దేవదేవుడవు నీవు।
మానక దయతో యచ్చటికరిగియు మన్నన తగ జేయుదువు॥
సమ్మతించగను శ్రీహరియందుకు చాంగుడేగె దిగుచోటు।
కొమ్మను గాంచుచు శత విప్రులకును గుఱిగవంట చేయుమిటు॥
శ్రీహరి వచ్చును భోజనమునకని చెప్పెను చాంగుండపుడు।
మోహ మమతతో వంటలజేయుచు ముద్దియయును యానాడు॥
పండరి విప్రుల కామంత్రణమును బ్రాహ్మణి యటనియ్యగను।
ఖండితముగ మేమెవరము రామని కలిసియనిరి వారలును॥ ౧౪౯.
అతివ్యసనముతో నామెయు మళ్లుచు నాచార్యుని కడకరుగన్।
మృదుమాటలచే చాంగుడు బలికెను మేలుజేయు హరియుతగన్॥
ఈవిధముండగ హరిమందిరమున యీశునిమూర్తి లేకుండన్।
సేవించెటి యాజనులును గుడిలో శ్రీనాధుని గనకుండన్॥ ౧౫౧.
ద్విజవరులిదిగని దేవుని గానక దిక్కుదిక్కు వెతికిరటు।
సుజనులు కొందరు బల్కిరి చాంగుడు సూటిగగొని చనియుండు॥
ఆతనికడకును బోయి చూతమని యందరునట వచ్చుచును।
నీతిని జెప్పిరి హరియును గుడిలో నిలవక మాయంబగును॥ ౧౫౩.
భక్తుడుబలికెను విధవకు మీరలు భవిష్కార ముంచుటచె।
సక్తిగ శ్రీహరి భోజనమునకై సరగున మాకడ వచ్చె॥ ౧౫౪.
ద్విజవరులటు పైశోధనచేయగ దేవుడు కనపడకుండన్।
సుచరితుడగు యాచాంగునకును హరి సూటిగ కనుపడుచుండన్॥

భక్తిభావనను వదలిన విప్రులు బహుసందేహించుచును।
సక్తిగ శ్రీహరి ఇచటికి వచ్చుట సత్యంబై వెలసినను॥ ౧౬౬.
ఇచ్చట నలిపిన పాకమిం దరకు యెలమినిసరి బుచ్చవలెన్।
సచ్చరితుండగు చాంగుడు బలికెను స్వర్గపు ధేనువు బోలెన్॥
అనేక జనముల కీయన్నంబె యమిత తృప్తి జేయునుము।
పునీత మగునీ ప్రసాదమిచ్చట పొందుగానుచే కొనుము॥ ౧౬౭.
ద్విజవరు లప్పుడు స్నానముజేసియు తెరలివచ్చి కూర్చుండర్।
ప్రజలు చిత్రమని వినుకొని యప్పుడు బరతెంచిర కొనియాడర్॥
విస్తరముందర కూర్చుండంగను విధవస్త్రీ వడ్డించన్।
స్వస్థమున ద్విజుల్ భక్షణజేసిరి చతుసహస్ర మటు మెచ్చన్॥
భక్షణజేసిన పిదపను వెళ్ళిరి పండరిపతి గుడిలోను।
రక్షకుడగు శ్రీవిఠల మూర్తిని రాజిలునటు గనుచును॥ ౧౭౦.
అతిమోదముతో చాంగుని కడకును యవనిసురులు వచ్చుచును।
విధవ పుత్రుని యుపనయనమునకు వే యుంచి ముహూర్తమును॥
శుభదిన మందును సకల బ్రాహ్మణులు సూటిగ నలిపిరి వడుగు।
అపరిమితంబగు ద్రవ్యము విధవయు నరసి యిచ్చె విప్రులకు॥
కార్యము గడిపియు పిదపను చాంగుడు కలుబురుగకు వెళ్ళగను।
ఆర్యులందరును ముందుగ వచ్చుచు నాతని మన్నింపగను॥ ౧౭౮.
శంకరునింటికి వెళ్ళియచ్చటను చక్కనుంచె బాలకును।
పొంకముతో నొక విప్రు గృహస్థుడు పుత్రినిత్తుననె యటను॥
సంతోషమున నంగీకరించెను చాంగదేవు సుదినమున।
ఎంతోవిభవము తోడ వివాహము యెలమిజరిగె నెయ్యమున॥
బాలుని యచ్చట నుంచిచాంగుడును బైలుదేరె ద్వారకకున్।
వీలుగ గూడిరి యనేకజనములు విపుల యాత్రజేయుటకున్॥ ౧౭౭.

---

యాదవ పంతులు దేశపాండ్యయగు నట ధారూ రందునను।
సాధుసమాగమ మనుచును తర్లెను సరగ కుటుంబము తోను॥

ఆతని భార్యయు గర్భిణి యాఁటచె యామెనింట నుండుమనఁ।
పాదుగ వనితయు నింటనుండకను బైలుదేరె నెయ్యమునఁ॥
పురజనుల్ కొందరు నిందజేయగను పూర్ణభక్తు చాంగునితో।
వెఱవక వెళ్ళితె శ్రీహరి రక్షణ వేగమె చేయును దయతో॥ ౧౮౦.
అనుచు జెప్పుచును మెల్లగ నడచుచు నామెయు బోవుచు నుండు।
దినదిన మునకును నడచుట బరువై దెలియబడుచు తగనుండు॥
యాదవ పంతులు గురుని యనుగ్రహ మరమరలేకను బొంది।
సాధు మార్గమున బ్రహ్మనిష్ఠదా సలుపుచుండు యింపొంది॥ ౧౮౨.
కుటుంబ విషయమై మనసు నుంచకను కోరివెళ్లు తనత్రోవ।
విడంబమగు నటు యాతని భార్యయు విడవలేక పతిసేవ॥
సాయంకాలము వరకును మెల్లన సంకట మొందుచు నడచు।
ధ్యేయంబగు శ్రీకృష్ణ నామమును దిట్టంబుగ తా జెపుచు॥ ౧౮౪.
యాత్ర దిగిన యాచోటును జేరును యటుబెట్టెద రన్నమును।
గాత్రము పైతను చెమట గారెమును గర్భమామెకు పెరుగగను॥
తల్లియుచెల్లెలు దగ్గర లేకను తల్లడిల్లుచును నడచు।
సల్లలితంబుగ నవ మాసంబును చనెనటు భామిని కనుచు॥ ౧౮౬.
కడుపు నొప్పిచే తొందర పడుచును కఠిన యరణ్యము నందు।
నడవలేకదా మొ[illegible] యగుచును యడరెను వృక్షము క్రిందు॥
ముందుగ వెళ్లిరి యాత్రజనంబులు ముద్దియ నుంజూడకను।
అందంబగునటు చాంగుని వెనకను యాదవుండు వెళ్లెమును॥ ౧౮౮
అమిత కష్టమటు దోచెను సతికిని యరణ్యమందొంటరియై।
సమరస భావము జెందిన గురువగు చాంగుని దలచుట సరియై॥
పరదేశినియై యరణ్యమందును బాధనొందితిని యనుచు।
నరహరి యచ్యుత హరి గోవిందా నారాయణయని దలచు॥ ౧౯౦.
అనాథ బంధువు యనియును భక్తులు యమితము వర్ణించిరటు।
జనార్దనాంహ్వాయ దగ కాపాడుము సర్వేశ్వర నన్నుయిటు॥

అనేక భక్తుల యాపద లెల్లను యరసి దీర్చితివి నీవు।
పునీత కృపచే నన్ను జూచియిటు పురాణ పూరుష బ్రోవు॥౧౬౫.
హరియు నపుడు స్త్రీరూపంబును తా నంచితముగ ధరియించి।
గురుతుగ రవికెయు చీరె గట్టుకొని కుంకుమ నొసటనునుంచి॥
ప్రకటము కాగనె భామిని గాంచుచు బలికెను యవరీపుయను।
అకలంకుండగు శ్రీహరి జెప్పెను నాచార్యుడు బంపెనను॥
నాదు నామమును కృష్ణబాయియని నలుగు రందురీభువిని।
పాదుగ నీకును ప్రసూతి సమయము బాధకమై వచ్చెనని॥ ౧౬౬.
నీకడ వచ్చితి భయము వలదనుచు నెనరునతా జెప్పగను।
వేగమె నచ్చట గ్రామంబొక్కటి విలసిల్లగ జేయుచును॥ ౧౬౭.
నాతికి నడుమును బట్టుకొనియు మరి నయముగనొక గృహమునను।
వేధనొందకను దెచ్చియుంచుచును విహితసేవ జేయుచును॥౧౬౮.
సంకోచింపక నుండుమనంగను సంతసమున భామినియు।
*అంకిలి లేకను ద్రవ్యము నిచ్చుట కరయతనకు లేదనియు॥
అనేక భంగుల నుతులం జేసియు నామెకు వందనముంచు।
వినీతు డగుచును పండరి నాథుడు వెఱవు వలదనియు జెపుచు॥
నడుమును బట్టుచునుండగ కాన్పులు నాతికి నటగలుగగను।
ఉడుగని ప్రేమతో పరిచర్యల హరి యొప్పుగ తా చేయగను॥
సులక్షణంబగు పుత్ర నిదానము సూటిగ నటు జన్మించెా।
అలసట జెందక హరియు శిశువునకు యలబొడ్డును ఛేదించెా॥
వేనీళ్లను గొని హరియు బాలునకు వే స్నానము చేయించెా।
మానక శ్రీహరి బాలింతకు నటు మహిని పడకదా నునిచెా॥౧౭౦.
ఔషధ పథ్యము లప్పుడప్పుడును ననువుగ జేయించుచును।
శేషశయనుడును దీపము నెప్పుడు చెలిమిని వెలిగించుచును॥
ఏపదార్థమటు కొఱతగ లేకను యెప్పుడు సేవనునుంచు।
ప్రాపుగ స్నానము పదో దివసమున బాలింతకు చేయించు॥ ౧౭౧.

---

*అంకిలి - ప్రతిబంధము.

మాసము పరకీ విధమున జేసెను మాధవుడటు ...లను।
వాసిగ నిదియును యెవరికి దెలియదు వసుధలోన జనులకును॥
ఇంతలో చాంగుడు యాదవుతోడను నేగెను తగ ద్వారకకు।
వింత యగునటుల గుడిలో వోరగను విగ్రహ రూపంబునకు॥ ౨౦౬.
మూర్తి వంతమటు లేపుంశగడా మోదంబొందక తాను।
ఆర్తినొంది తన యోగదృష్టిచే యంతరమున చూడగను॥ ౨౦౭.
శ్రీహరి యడవిలో బాలింతకుడా సేవల జేయంగని ...।
మోహము నొందగ రుక్మిణి వచ్చుచు ముందు ప్రసన్నంబయ్యెన్॥
అడవిని శ్రీహరి బాలింతకుడా నమిత సేవలను జేసెను।
విడిచియు నన్నొక మాసము మొదలుగ వేంచేసెను నటుమరియు॥
అచ్చటికేపును వెళ్లియిప్పుడె హరినింబిలువు మనంగన్।
సచ్చరితుండగు చాంగుండప్పుడె చనె ప్రయాణమై వేగన్॥ ౨౧౦.
అడవితీరమున జేరియు చూడగ నచ్చటగ్రామము గనగన్।
పుడమిని కొందర కృష్ణబాయి యిలు పొసగ నెచట యనియడుగన్॥
కొందరు గృహమును జూపగ నచటికి కోరివెళ్లగను హరియు।
సుందరమగుతన స్త్రీరూపముతో నూటిగచాంగుని గనియు॥ ౨౧౨.
దండముబెట్టుచు నచ్చటనప్పుడె తాను యదృశ్యుండయ్యెన్।
పండితుచాంగుడు హరియని దెలియక భ్రాంతినొందు వాడయ్యెన్॥
ఇంటిలోవెళ్లగ బాలింతయునటు యేమి వచ్చి ముందుగని।
జంటను కొడుకును గురుపదములపై సరగవేసి సంగతిని॥
దెలుపుచు మీరలు కృష్ణాబాయిని తెలుగున బంపుట చేతన్।
అలసటనొందక సౌఖ్యపరచెనను యలయక నే ముదమొందన్॥
ఇటులంజెప్పగ కృష్ణాబాయిని యెటుగందును యని యడుగన్।
పటుతరముగతా బైటనుండునని బాలింతయు నచటతగన్॥ ౨౧౬.
అచ్చటచూడగ కృష్ణాబాయియు నగుపడకుండగమున్నే।
హెచ్చిన ఖేదము నొందుచుచాంగుడు యెల్లజనుల బిలుచుకొను॥

పిరాట్టియాజ్ఞను దలచియునాతడు పెనగిజేరె ద్వారకను।
సరాళముగదా వెళ్లెను శ్రీహరి సన్నిధికిని ముందుగను॥ ౨౧౮.
మూర్తికరంబగు శ్రీహరిరూపును ముదమునననటు గాంచుచును।
ఆర్తిగననె నీవనాథ బంధువు డను నదినిజ మయ్యెనను॥ ౨౧౯.
అడవిని నీవును బాలింతకునై యమితసేవ జేసితివి।
పుడమిని నాకై తొందరబడుచును హరి భక్తుల బ్రోచితివి॥
అనేక భంగుల నిటులుం జెప్పగ నశ్రులునటు ప్రవహించెన్।
పునీతుడగునా యాదవపంతుని బొంమగదా బిలిపించెన్॥ ౨౨౧.
నీదు కుటుంబము పుత్రునితోడను నిర్వహింపచే కొనుము।
సాధుజనులలో శ్రేష్ఠుండగుయీ సత్పుత్రుడు నీకుసుమ॥ ౨౨౨.
సంసారంబును విడిచిపెట్టుటయు చక్కగాదు నీకనుచు।
వంశోద్ధారణ జేయు మనమడును వర్థిలబుట్టును యనుచు॥ ౨౨౩.
యాదవు భార్యను పుత్రునితోడను యాతని వశముంజేసెన్।
మాధవునచ్చట సేవించుచుమరి మాసముల్ నాల్గునువెలసెన్॥
వెనకను చాంగుడు స్వస్థానమునకు వేంచేసెను ప్రజలగొని।
దినములు కొన్నియు జరగగ నచ్చట దెలియబడెను పండరిని॥
బిదరున నుండెడి యవింధ్యనరపతి పెట్టె తొందరచటనని।
విదితంబయ్యెను పండరి విప్రులు వెళ్లిరిండ్లు విడిచియని॥ ౨౨౬.
తురక లనేకులు ధూర్తులు నగుచును తొందరిడిరి యని వినగన్।
నిరవధికంబగు వ్యసనము బొందుచు నెఱిచాంగుం డచటతగన్॥
హరిగోవింద కృష్ణముకుంద అచ్యుత నరహరి నీవు।
గురుతుగ పూర్వము దుర్జనులందర గొట్టుచు చంపితివీవు॥ ౨౨౮.
ప్రతాప మిట్టిదియని వర్ణించను బట్టుపడక తగనుండు;
హితానుసారివై భక్తరక్షణము యెలమిని జేసెద వెపుడు॥ ౨౨౯.
ఇప్పుడు తురకలు తొందరబెట్టగ నేమిచేయ కుండుటయు।
ఒప్పగు నేయని పాండురంగనికి నూర్జితముగ వేడుటయు॥ ౨౩౦.

ధ్యానమునందును చాంగుండుండగ దామోదరు ప్రకటంబై।
మానుగ నీవును బిదరు పురమునకు మళ్ళుమనెను శీఘ్రంబై॥
శిరము వహించియు నాజ్ఞను నప్పుడు పరివారముతో నటను।
వెడలక తానటు బైలుదేరె శ్రీవిఠల రంగాయనుచును॥ ౨౩౨.
దినమును శ్రీహరి కీర్తనజేయును దిగినచోటలో తాను।
జనులు యనేకులు వచ్చుచు నుందురు శ్రవణము చేయుటకును॥
ఖలులైయుండియు భగవత్కీర్తన కథలను వినుచుండుటచె।
నిలవరమగు హరిభక్తిని జెందిరి నీరజ నాభుని కృపచె॥ ౨౩౪.
ఇదియుంగాకను కామిత ప్రార్థన లెలమినచట కొనగూడఁగ।
పదపడివత్తురు యనేక జనములు భక్తునినప్పట జూడఁగ॥ ౨౩౫.
ఇట్టికీర్తితో చాంగుడు దారిని నేగగ నట నొకపురము।
బెట్టిదమగునటు తటస్థమయ్యెను *బిగి జంగము లుండ్రచ్చనుము॥
శబ్బర మంత్రము లనేకంబుగను చక్కనేర్చి గర్వమునుచె।
ప్రబ్బుగ తమ యెడ కుక్కకు చాంగుని భవ్యపేరు బెట్టుటచె॥
జంగమగురుఁడా కుక్కను బెంచియు చక్కనుంచె గోప్యమున।
భంగ పరచునటు చాంగుడు రాగనె బలుక కుంచె నెయ్యమున॥
జంగమ గురువునకు చాంగదేవుడు సలిపె నపుడు దండమును।
వంగక నాతడు నాసన మందును వచ్చియు కూర్చొమనెను॥ ౨౩౯.
కపట కృత్యమున పీట క్రిందుగను ఘనగుంటయు నుంచెనుము।
చపలనరుండటు గూర్చుండగనె సరగక్రింద బడునునుము॥ ౨౪౦.
ఇదిగని చాంగుడు దగ్ధంబగు నటు నెలమిదృష్టి చూడగను।
కుదురుగ పీటయు మండిపోవగను గొప్ప జంగమగురు డటను॥
దండను బెట్టుచు క్షమ జేయుండని ధరణిపైని దాబడెను।
ఖండితముగ యీపీటను మీరలు కాలకుండ జేయుమను॥ ౨౪౨.
దయచేయుండని వేడగ చాంగుడు దానిపైగ విభూతిని।
నయముగ వేయగ నగ్ని శాంతపడె నలుగురచట దీనిగని॥ ౨౪౩.

---

బిగి - గర్వము.

జంగ మగురుడగు మల్లిఖార్జునుడు చాంగుని మర్యాదలచె।
పొంగుగ తనకడ భక్షణచేసియు పొమ్మని యాదర ముంచె॥ ౨౪౪.
సమ్మతించుచును చాంగుడు ద్విజులను సలుపజేసె వంటలను।
నెమ్మతితో జంగములను బిలిచెను నెనరుననొక పఙ్తీగను॥ ౨౪౫.
భక్షణజేతను మీరలు వండిన పదార్థముల తెమ్మనగా।
తక్షణమందె సకల పదార్థముల్ తరుచుగ వడ్డింపంగా॥ ౨౪౬.
అప్పుడు చాంగుడు నైవేద్యంబును హరికర్పణ జేయుచును,
మెప్పుగవడ్డన జేసిరి విప్రులు మేదిని విస్తర లిడుచును॥ ౨౪౭.
జంగమ గురువునకును చాంగుండనె చంద్ర మౌళి నివేదనను।
పొంగుగ మీరలు సలిపి భక్షణను పొసగచేయు డనగాను॥
వారివారి యా లింగ కాయలను వరుసవిప్పి చూడగను।
మారుని రిపుడగు శివుడువాటిలో మహి గనపడ కుండగను॥
జంగమ శిష్యులు గురుని ముఖంబును చనువుతోడ జూచుచును।
భంగపడంగను మల్లిఖార్జునుడు పరమ శివుని గానకను॥ ౨౫౦.
అధిక లజ్జ నాతడు గొనిచెప్పెను నతినమ్రత చాంగునకు।
సదయుడ వీవును సముదాయముతో చక్కగ భక్షించదగు॥ ౨౫౧.
సదాశివుండును కోపగించుకొని చనెనిటు మాయెడనుండి।
నిదానముగతగు భక్షణ మేమును నిలిచి జేతు మనుచుండి॥ ౨౫౨.
ఇదివిని చాంగుడు నుపవాసముచే యే జంగమొ కష్టపడు।
శితికంఠుండును నందుకై వెళ్లెను చేరకుండ మిమ్మిపుడు॥ ౨౫౩.
శ్వానంబొక్కటి ద్వారమునందును సరియుంచిరి మీరలును।
దానికి చాంగుండను నానామము ధరను బెట్టి పెరటిలోను॥ ౨౫౪.
దాగిలియుంచుట కేమికారణమొ ధాత్రియంత లింగంబొ।
బాగుగనదియే మీలింగంబుల భక్షించెను సత్యంబొ ॥ ౨౫౫.
ఇదివిని జంగముడొక్కడు వెళ్లుచు యెలమిదెచ్చె శ్వానమును।
కుదురుగ చాంగుడు దానింగాంచుచు కుక్కయై లింగంబులను॥

అపహరించుటయు మంచిది గాదని హరుభక్తుల లింగములు।
కృపతో నిమ్మటనసుచు జెప్పగనె క్రిందిడి తల నయ్యెడల॥
కుక్కయు నప్పుడు నోటను కర్చెను గుఱిగవారి లింగములు।
పక్కనుండి యాజంగమ గురువును బహువింతను బొందెనిల॥
వారివారి యాలింగము లన్నిటికి వారలు చేకొని రపుడు।
సారెకు శ్రీహరి భక్తుల మహిమల సలలితముగ పొగడిరటు।
నమస్కరించుచు చాంగదేవుని నమ్రులైరి జంగములు।
*ప్రమథాధిపునకు నైవేద్యంబును భక్తిని నియ్యగ వార్లు॥ ౨౬౦.
శ్రీహరి భోక్తాయనుచును చాంగుడు జెప్పుచు నాపోశనము।
ఊహను గైకొన సకలురు నప్పుడు నొగి గొనిరి ప్రసాదమ్ము॥
భక్షణచేసిన వెనకను చాంగుడు పారజూచి జంగములు।
లక్షణ యుక్తపు మహత్వ సంపతి లాలితముగ మీయెడల॥ ౨౬౧.
వచ్చియు నున్నను గర్వమొందకను వరుసనుండ మేలగును।
సిచ్చితనంబున కొంటె చేష్టలును పెంపుజేయ కుండుమను॥ ౨౬౩.
సర్వ భూతముల యేకాత్ముండై సర్వేశ్వరు డుండనుచు।
గర్వరహితమై యెవరికి తొందర గావింపను వలదనుచు॥ ౨౬౪.
ఇటులంజెప్పగ జంగమగురు మీ యిష్టమువలె నుందునను।
పటుతర మగునటు మీకృప నాయెడ బాగుంచుండను చును॥
చరణము బట్టగ నాలింగనమును చాంగు డతనికి జేయుచును।
త్వరిత పడుచుదా బిదరు పురమునకు తర్లెను నెయ్యంబునను॥ ౨౬౬.
త్రోవను నడచుచు పట్నసమీపము తోటలోన దా దిగియు।
భావశుద్ధితో స్నానము జేసియు ఫలహారము దా గొనియు॥
తాళము వీణెయు ధరించి యప్పుడు దామోదరు బాడుచును।
పీలుగ శ్రీహరి కథజెప్పంగను వినుటకు వచ్చి రనేకులును॥ ౨౬౭.
రాజ ద్వారమునుండు జోసియును రంజిల్లుచు వినుచుండెను।
తేజరిల్లనొక జాము వరకునటు దివ్యకథలొ మరిగుండెను॥ ౨౬౯.

* ప్రమథాధిపుడు - శివుడు.

హారతు లిచ్చిన వెనక జోసియును హరిభక్తుని దాగనుచు।
వీరుడైన యీ ధరణీ నాధుడు విష్ణుకోవెల జెరుచు॥ ౨౭౦.
పండరి కోవెల తురకల చేతిలో పట్టుబడిన వగుచుండు।
కొండెము తోడను మసీదునచ్చట గుడిగగట్ట బడుచుండు॥ ౨౭౧.
విఠలరంగనిన్ దాచుకొనిరి యా విప్రులందరటుగూడి।
కఠినకాలమై మెలగెను, ఇప్పుడు కనికరముగ యిటుగూడి॥
మృదంగ వాద్యము రాజువినిన యెడ మిగులబాధ బెట్టునుము।
హితమును నిచ్చట నేమియు గానను యీశుని భక్తుల దరుము॥
వినను యిప్పుడు నృపునకు కష్టము యమితముగను వచ్చెనిటు।
మానుగ నాతని భార్యయు పాముచె మరణమొందె యీనాడు॥
అనేక వైద్యులు వచ్చి చూచినను నామెయు లేవకయుండు।
అనీతిపరుడా నరపతియిప్పుడు నమిత చింతతో నుండు॥ ౨౭౨
ఇదివిని చాంగుడు విఠలుని కృపచే యిటు లేపెద ప్రేతమును।
కుదురుగ రాజుతో చెప్పుమటంచును కోరెనతని గాంచుచును॥
జోసియు నప్పుడె నృపుకడ కరిగియు సూచించెను సంగతిని।
వేసరిల్లకను చాంగదేవునిటు వేగమె రమ్మనుట కని। ౨౭౩.
మనుజుల నృపవరు బంపగ చాంగుడు మహి తన శిష్యులతోను।
ఘనముగ శ్రీహరి నామము బాడుచు కరుణతోడ వెళ్లెమును॥
అమిత వాద్యముల్ మెలగగ నృపుకడ నాతడు తగ రాగాను।
క్రమముగ నరపతి దండము బెట్టక గర్వితుడై యుండగను॥ ౨౭౪.
విభూతి నప్పుడు చాంగుడందుకొని వేసెను తానటుగాను।
ప్రభాయుతంబగు పైగంబరువలె ప్రభువున కగుపడగాను॥ ౨౭౫.
అవనీ పతీయును దండమిడియు తన యువతిని బ్రతికించుమనన్।
సవినయముగ తా విభూతినిచ్చెను సతికి నోసట నుంచుమనన్॥
దానిం గైకొని నరపతి వెళ్ళియు తన సతి నోసటను నుంచన్।
పీనిగైన యాసతియును లేచుచు బెట్టెను కేకలు వరుసన్॥

పిచ్చి ప్రేమను చేయుగ స్వప్నమును పెంపగు క్లేశముతోను।
వచ్చి చాంగునెడ విన్నవించెనటు వనిత జేయు చేష్టలను॥ ౨౮౩.
భక్తుహ పినుకొని భర్తకు జెప్పెను భామిని నడుగుము నీవు।
భక్తిగ నా మెను చాంగు యెద్దియొ వంజిల జెపమని నుడువు॥ ౨౮౪.
అవనీ పతియును వెల్లి భార్యతో నడిగె వాంఛ యేమనుచు।
విస్తరంబగునటు నామెయు జెప్పెను విఠలుని భక్తుండగుచు॥ ౨౮౫.
వచ్చిన చాంగుని వాంఛల దీర్చియు వరుసను బంపుమనంగన్।
హెచ్చిన ప్రీతిని నృపుడు చాంగుగని యేమి వలయునని యడుగన్॥
భక్తుడు బలికెను ద్రవ్యంబెద్దియు బట్టి యుండదిటునాకు।
రక్తిగ పండరి యాలయంబు శ్రీరంగని దగుచును వెలుగు॥
దానికి మీరలు వశముజేసికొని తప్పులు సలుపుట చేతన్।
కానవచ్చె యీ పదలును నీకును గనుకను తగనిటు మీదన్॥
తురకల బాధయు యికనెన్నటికిని దురుసుగ నట లేకుండన్।
తలుచుగాను యిటు వ్రాసియిమ్ము యొక తాకీదును మొహరుండన్॥
ఇదివిని నృపవరు తాకీదును దా నెలమి నట్టు వ్రాయించెన్।
విదిత మొహరుతో సేవక జనులతో విఠలుని భక్తున కిచ్చెన్॥
అనేక విధముల చాంగదేవునకు నాతడు పూజల జేసి।
వీడ్కొలు దగుచును సాగనంపగను విపుల మోదమున వెలసి॥ ౨౯౧.
పండరి పురికిని వచ్చుచు చాంగుడు భటులును తాకీదులతో।
కొండొక దినమున సర్వకార్యముల కొనగూర్చెను నేరుపుతో॥
దేవాలయమున పండరి నాథుని తిరిగియు నుంచిరి పిదపన్।
భావార్థముతో సంప్రోక్షణలటు బహుగా జేసిరి యొప్పన్॥
ఎప్పటి వలె హరి దాసులు తగునటు యీశుని నామమనుచును।
గొప్పధ్వనులతో యచ్యుత కృష్ణా గోవిందా యనుచును॥ ౨౯౩.
కొనియాడిరి యా చాంగదేవునటు గొప్పగ ద్విజు లందరును।
అనిశము వారలు పొగడుచు నుండిరి హరి మహిమను గనుచును॥

ఒక సంవత్సర మచ్చట నుండియు యుపచరించె శ్రీహరిని।
విగత మోహుండై యొక దినమందును విఠలుని చాంగుండుగని॥
ఎచ్చట నాకును సమాధి నిత్తునో యిందిరావరా యనగన్।
అచ్యుతుడనియెను గోదాతీరమె యరసి వెళ్లదగునింకన్॥ ౨౯౮
ఉపదేశించిన షడాక్షరంబును యొప్పుగ నీకొడుకునకు।
చపలత లేకను జెప్పుము నీవును సంప్రదాయ మెచ్చుటకు॥
ఉదివిని చాంగుడు దండము బెట్టుచు నీశుని పదముల కపుడు।
సదయ హృదయుండై బహుతరస్తోత్రముల్ సలిపెను హరికిని నాడు॥
పండరి యందున నుండెడి జనములు బహుమర్యాదల జేయన్।
నిండుభక్తితో వెడలెను చాంగుడు నిజ నివాసమును డాయన్॥
గోదా తీరము వచ్చి యచ్చటను కొడుకు కేశవుని బిలిచి।
వేదరహస్యపు షడాక్షరిని దా వే యుపదేశము నిచ్చి॥ ౩౦౧.
ద్వితియ కొమరుడు విఠలునకు జెపుము దివ్యంబీ మంత్రమును।
హితమును లోకంబునకు చేయుమని యీశునాజ్ఞ దెలుపుచును॥
అనేక జనములు కూడియుండగను నందరకిడి దండమును।
పునీతుడగు నా చాంగుండప్పుడు పొసగనిలిచె సమాధిగను॥
జయ విఠ్ఠలయని సకలురు నప్పుడు చప్పట్లను గొట్టిరటు।
నయముగ శ్రీహరి కీర్తన సలిపిరి నరులనేకులును నాడు॥
ద్వాదశ వర్షముల్ జరిగిన పిదపను ధాత్రి తిరిగి ప్రకటించి।
పాదుగ రెండవ కొడుకునకును దా బాగుగ నుపదేశించి। ౩౦౨.
అన్నదమ్ములకు విరోధ భావము నణచి నదృశ్యుండయ్యెన్।
వన్నెగ రెండవ కొడుకు సంతతిని భక్తియు ప్రబలం బయ్యెన్॥
ఏడు పురుషుల వెనక కోనేరుడు యెలమి చాంగు వంశముచే।
వేడుక బుట్టియు జీర్ణోద్ధారణ విహితు డగుచు చేయించె॥ ౩౦౩.
శ్రీహరి దాసుల మహిమలు నిట్టివి చెప్పవశమె యెవరికిని।
సాహసలీలల బాలకృష్ణుడుచు చక్కజెప్ప చుందువిని॥ ౩౦౪.

---